# రామాయణసారోద్ధారము

## అరణ్యకాండము



ములుకుట్ల నరసింహావధానులు

శ్రీ టి. వి. నారాయణరావు గారికి, నమస్సులతో
శ్రీరామ శ్శరణం మమ
మల్లవరపు రామమూర్తి
209, రాజమహేంద్రవరం
31-12-2016.

# శ్రీ రామాయణ సారోద్ధారము

## ఆరణ్యకాండము

(ఆంధ్రతాత్పర్యసహితము)

ఇయ్యది

శ్రీరామతత్వము నెఱుఁగఁగోరువారి కత్యంతోపకార మగునట్లు
చీరాల గ్రామవాస్తవ్యులును పౌరాణికవిశారద, రామాయణ
సుధాసాగర, అభినవవాల్మీకి, విమర్శకాగ్రేసర
అను బిరుదులుగల

బ్రహ్మశ్రీ - పండిత

**ములుకుట్ల నరసింహావధానులు గారిచే**

నిరువదినాల్గు ఆర్షరామాయణములనుండి
సమకూర్పఁబడి
పండితులచేఁ బరిష్కృతమై గ్రంథకర్తచేఁ బ్రకటితమైనది.

---

శ్రీయువనామసంవత్సర మార్గశిర శు ౧౦ గురువారము.
ది ౫-౧౨-౧౯౩౫.



[వెల రు ౧-౮-౦.



1వ పేజీనుంచి 64 వ పేజీవరకు
బెజవాడ శ్రీరామా ప్రింటింగువర్క్సునందును

---

కాదులుసహా మిగిలినదంతయు
బెజవాడ ఆంధ్రవాణీ ముద్రాక్షరశాలయందును
ముద్రింపఁబడియె.

1935





శ్రీరామచంద్రమూర్తివారును, వారిసేవకులు
చీరాలగ్రామనివాసులును, 'పౌరాణికవిశారద, రామాయణసుధాసాగర,
అభినవ వాల్మీకి, విమర్శకాగ్రేస' రేత్యాది బిరుదాంకితులు నగు
బ్రహ్మశ్రీ పండిత ములుకుట్ల నరసింహావధానులుగారును,
వారి ధర్మపత్ని శ్రీమతి సీతారామాంబగారును.

# స్వవిషయము.

శ్రీరామభక్తాగ్రగణ్యులును, శ్రీరామాయణసారోద్ధార పఠనపాఠకులు నగు మహాశయులకు తెలియజేసికొనవలసిన ముఖ్యాంశము గలదు. అదేదన శ్రీరామచంద్రుని యపారకృపాకటాక్షముచే శ్రీవిశాఖపట్టణవాస్తవ్యుల ద్రవ్యసహాయమున నీయరణ్యకాండము అనాయాసముగ ముద్రింపబడినది. ఈదిగువున నుదహరింప బోయెడి పోషకవర్గము వారివలనను, బురాణశ్రోత లగు మఱికొందరు భక్తులవలనను కాండ ముద్రణమునకు వలయు ద్రవ్యముకంటె నెక్కుడుగనే ధనము చేకూరినది. కాని కొన్నిపుస్తకములు, మ్యాప్‌లు కొనుటకును, విశాఖపట్టణమునకు నే నతిదూరదేశస్థుడ నగుటవలన రాకపోకలు మొదలైనవాటికిని మిగిలినపైకము ఖర్చుపెట్టబడినది. నా యుద్యమమున సర్వవిధముల పాల్గొన్న ప్రౌఢవిద్యాప్రచారకులును, ఉదారులు నగు శ్రీరామాయణసారోద్ధారారణ్యకాండ పోషకవర్గమువారిని అన్నివిధముల సర్వదా శ్రీరామచంద్రుడు రక్షించుగాక!

శ్లో॥ యేషాం సమ్మాననా దియ మయతా మృద్ధిం కృతి ర్మహోదారాం
తేషాం దర్శనపథ మిద మేష్యతి భగవత్కృపాయోగాత్.

ఇట్లు,
శ్రీరామసేవకుడు, గ్రంథకర్త,
ములుకుట్ల నరసింహావధాని.

# పోషకవర్గమువారు చేయవలసిన ధనసాహాయ్య

# వివరము.

| | | | |
|---|---|---|---|
| 1. | రాజపోషకులు | ... | రు 116—0—0 |
| 2. | ప్రధానపోషకులు | ... | 50—0—0 |
| 3. | పోషకులు | ... | 25—0—0 |
| 4. | అభిమానులు | ... | 12—0—0 |
| 5. | సహాయులు | ... | 6—0—0 |

ఇక ప్రతిసంపుటమునకును 20 రూప్యము లిచ్చువారలు శాశ్వత పోషకులుగను, అట్లే 10 రూప్యము లిచ్చువారు శాశ్వతాభిమానులుగను, రు 5 లు మాత్రి మిచ్చువారు శాశ్వత సహాయులుగను, రు 3 లు మాత్రి మిచ్చువారు శాశ్వత చందాదారులుగను ఏర్పడుదురు. వీరి నామములు ప్రతికాండయందును ముద్రింపబడును. పోషకవర్గమువా రేకాండకు ద్రవ్య మిచ్చెదరో ఆకాండాదిని వారి నామములు ప్రకటింపబడును. తత్తదుచిత రీతిని వారివారికి గ్రంథములు చేర్పబడును. ఇట్లీ రామాయణసారోద్ధారము ఉత్తరకాండతో నెనిమిది సంపుటములుగ వెలువడును. యుద్ధకాండము బాహుళ్యమూటచే రెండుగ విభాగింప దలచితిమి. ఈ రామాయణసారోద్ధారమం దేసంపుటమైనను చందాదారులకు రు 2-0-0 లకు మాత్రమే. లభించును. ఇతరులకు రు 2-8-0 లు ఇచ్చినగాని లభింపదు. ప్రాపణ భృతి (పోస్టుచార్జి) కొత్తులోకమే (పుస్తకములు పుచ్చుకొనువారే) భరింపవలయును.

మరియు నీ రామాయణసారోద్ధారము 1867 సంవత్సరం 25 నవంబరు రిజస్ట్రేషను ఆక్టుయొక్క 20 వ సెక్షనుప్రకారం 6వ చట్టము చొప్పున రిజస్టరు చేయించి సర్వాధికారములు గ్రంథకర్త స్వాధీనములో నున్నవి. కావున దీని నితరులు ముద్రింపగూడదు.



## శ్రీ రామాయణసారోద్ధారారణ్యకాండకు

### రా జ పో ష కు లు .

శ్రీయుత బాకురుపండా వేంకటరమణమూర్తిపంతులుగారు,
ఈనాందార్, కంట్రాక్టర్, విశాఖపట్టణము.

### ప్ర ధా న పో ష కు లు .

శ్రీయుత గరుడా లక్ష్మీనరసయ్యగారు, మర్చెంటు, ఎం.సి., విశాఖపట్టణం.
,, దాసరి పైడెయ్యగారు, మర్చెంటు, విశాఖపట్టణము.
,, బాగుమల్ సాహుకారుగారు, బాంకర్సు, విశాఖపట్టణము.
,, ఏ. వి. భానోజీరావుగారు, జమీందార్, చేర్మెన్, యం. సి.,
విశాఖపట్టణము.

### పో ష కు లు .

శ్రీయుత ముప్పిడి వేంకటారావుగారు, కంట్రాక్టర్, విశాఖపట్టణము.
,, గరుడా నీలయ్యగారు, దుబాష్, విశాఖపట్టణము.
,, గోకవరపు రమణయ్యగారు, షాప్‌కీపర్, విశాఖపట్టణము.
,, పెనుగొండ కామరాజుగారు, విశాఖపట్టణము.
,, కోసూరి చిన్నయాచార్యులుగారు, బ్రాస్‌మర్చంటు,
విశాఖపట్టణము.
,, బాదం సర్వాజీగారు, బర్మాఆయిల్‌కంపెనీ, విశాఖపట్టణము.
,, బెండపూడి పేరాజుగారు, డాక్టర్, విశాఖపట్టణము.
,, కంచెర్ల రామబ్రహ్మంగారు, హార్బర్‌కంట్రాక్టర్,
విశాఖపట్టణము.

### అ భి మా ను లు .

శ్రీయుత గ్రంధి పద్మరాజుగారు, రైస్‌మర్చెంటు, విశాఖపట్టణము.
,, నిష్టల బలరామమూర్తిపంతులుగారు, బి.ఏ., బి.ఎల్.,
యేజన్సీ, సబార్డినేట్ జడ్జి, విశాఖపట్టణము.
,, గరుడా రామయ్యగారు, కాపీస్టు, డిస్ట్రిక్టుకోర్టు, విశాఖపట్టణము.
,, గరుడా రమణయ్యగారు, మర్చెంటు, విశాఖపట్టణము.

శ్రీయుత వెచ్చా సత్యారావుగారు, విశాఖపట్టణము.
,, కీ॥ శే॥ తుమ్మలపల్లి మంగయ్యగారు, ,,
,, కులుకూరి సన్యాసయ్యశేష్టిగారు, ,,
,, అంబడిపూడి నరసింహంగారు, బి. యన్. ఆర్. రైల్వే ఉద్యోగస్థులు, వాల్తేరురైల్వేస్టేషన్, విశాఖపట్టణము.
,, దొంతుల చిట్టెమ్మగారు, విశాఖపట్టణం.
,, పోలూరి సుబ్బారావుగారు ,,
,, పాండురంగ నరసింగరావుగారు, బి.యే., బి.యల్., అడ్వకేట్, వైస్‌చేర్మన్, విశాఖపట్టణం.
,, జొన్నలగడ్డ మాణిక్యంగారు, విశాఖపట్టణము
,, వరదా సూరమ్మగారు, విశాఖపట్టణం
,, కీర్తిశేషురాలగు ఉప్పలూరి నరసయ్యమ్మ జ్ఞాపకార్థమై భర్త ఉప్పలూరి బంగారయ్యశ్రేష్టిగారు, బి.ఏ., బి.యల్., అడ్వకేట్, విశాఖపట్టణం.
,, భాగవతుల కృష్ణయ్యపంతులుగారును, భార్య సౌభాగ్యవతి జోగమ్మగారును, విశాఖపట్టణం.
,, ఉమ్మడివరపు పోలిశెట్టిగారు, మర్చెంటు ,,
,, పాలకోటేటి గోపాలకృష్ణమూర్తిగారు, ఇంజనీయర్, మకాం, విశాఖపట్టణము.
,, కిళంబి తాతాచార్యులుగారు, బి.ఏ., బి.యల్., అడ్వకేట్, ,,
,, భూపతిరాజు వేంకటపతిరాజుగారు, బి.యే., బి.యల్. సి.ఏ.ఇ. అడ్వకేట్, విశాఖపట్టణము.
,, సీమలపల్లి సత్యనారాయణ పంతులుగారు, బి.యే., బి.యల్., అడ్వకేట్, ,,
,, వేపా పూర్ణయ్యపంతులుగారు, బి.యే., బి యల్., రిటైర్డు జిల్లాజడ్జీ, ,,
,, సరస్వతుల సుబ్బయ్యశాస్త్రిగారు, రిటైర్డు సబ్‌జడ్జీగారు, ,,
,, మంచుకొండ కోదండరామయ్యగారు, షరాబు, ,,
,, దంతులూరి వేంకట విజయగోపాలరాజుగారు, మొఖాసాదారు, అనకాపలితాలూకా, తుమ్మలపాలగ్రామం, విశాఖపట్నంజిల్లా.



## సహాయులు.

శ్రీయుత మింది సుబ్రహ్మణ్యంగారు, ప్రొప్రైటర్, విశాఖపట్టణము.
,, యాలమర్తి గున్నరాజుగారు, ,,
,, పవితా తమ్మిరెడ్డిగారు, ,,
,, పచ్చిలిశెట్టి రామకృష్ణారావుగారు, ,,
,, కలగర్ల నరసయ్యగారు, ,,
,, గంటి సుబ్బమ్మగారు, ,,
,, మండపల్లి అచ్యుతరామయ్యగారు, వర్తకం, ,,
,, సోమయాజుల సోమన్నపంతులుగారు, ఈనాందార్, ,,
,, దిగుమల్లి వేంకటేశ్వరరావుపంతులుగారు, వకీల్, ,,
,, కొంటపల్లి పద్మనాభస్వామిగారు, ,,
,, సెట్టి లక్ష్మీనరసింహంగారు. ,,
,, కుల్లూరు రాజుగారు, ,,
,, పాలకోటేటి సీతమ్మగారు, కోరుకొల్లు, కైకలూరు తా॥
,, గుడిపాటి వేంకటసుబ్బారావుగారు, వేంకటనారాయణపురం, తోరంపూడిశివార్, బందరు తా॥

## శాశ్వతసహాయులు.

శ్రీయుత కీర్తిశేషులగు వెలగలేటి దశరథరామయ్యగారు, బి.ఏ., బి.ఎల్., జిల్లాకోర్టువకీలు, బెజవాడ.
,, గుండిమెడ శ్రీనివాసరావుగారు, ఫార్వార్డింగు ఏజెంటు, M. S. M. Ry., తిరుమలరావుపేట, బెజవాడ.

## శాశ్వతచందాదారులు.

శ్రీయుత విన్నకోట వేంకటకృష్ణయ్యగారు, ఉపాధ్యాయులు, మునిసిపల్ హైస్కూల్, బెజవాడ.
,, అబ్బూరి సేతురామయ్యగారు, బెజవాడ.

---

శ్రీరామజయం.

బ్రహ్మశ్రీ బాకురుపండా వేంకటరమణమూర్తి పంతులుగారు,
(అవధానులుగారిని విశాఖపట్టణమున కాహ్వానించినవారు)
విశాఖపట్టణము.

# విజ్ఞప్తి.

చీరాలవాస్తవ్యులును పౌరాణికవిశారద, రామాయణసుధాసాగర, అభినవవాల్మీకి, విమర్శకాగ్రేసరేత్యాది బిరుదాంకితులు నగు పండిత బ్రహ్మశ్రీ ములుకుట్ల నరసింహావధానులు గారికి—

విశాఖపట్టణనివాసి యగు బాకురుపండా వెంకటరమణమూర్తి వెలిపరచు స్వకీయామోద మేమనగా మాపురజనులప్రేరణచేత నావలన ఆహ్వానింపబడి విజయవాడనుండి తమరు మాపట్టణమునకు విచ్చేసి తమచే రచింపబడిన శ్రీరామాయణసారోద్ధార మను రామకథాసుధారసమును మాపురజనుల వీనుల నింపి ఆబాలగోపాలమునకు హృదయానందకర మగునటుల జేసి ధన్యుల నొనరించితిరి.

శ్రీరామపట్టాభిషేకానంతరము ఉత్తరకాండముసహితము శ్రవణముజేయుటయందు కుతూహలులై యున్న మాపురజనుల ప్రార్థనమును తప్పక తమరు అంగీకరింప వేడుచున్నాను.

ఇంతియేగాక తమవలన శ్రీమద్భాగవత, శ్రీమన్మహాభారతకాలక్షేపములున్నూ శ్రీరామచంద్రమహాప్రభువారి కరుణచే మాపురజనుల కేర్పడుగాక యని నాఆశయము.



శ్రీరామచంద్రమూర్తివారి కైంకర్యములన్నియు నా సోదరులందరు విభజించుకొనిరి. తుదకు శ్రీరామపట్టాభిషేక మహోత్సవము సహితము నాస్నేహితులలో నొకరగు శ్రీయుత గరుడా లక్ష్మీనరసయ్య శ్రేష్ఠిగారు తాము స్వయముగా నిర్వహించునటుల నన్నిదివరకే కోరియున్నందున అంగీకరించితిని.

నేనును శ్రీరామచంద్రకైంకర్యములయందు పాల్గొనగోరి ప్రస్తుతము తమ దంపతులకు సువర్ణచేలాంచలములు సమర్పించుకొనుచున్నాడను. ఇవి తమ రాశ్రీరామపట్టాభిషేక సమయమందు ధరించి తన్మహాకార్యమును జరిపించగలందులకు వినయపూర్వకముగా ప్రార్థించుచుంటిని.

ఇకమీదట రెండుమాసములకు తమ రీయూరునుండి అనకాపల్లి, బరంపురం మొదలైన గ్రామస్థుల యాహ్వానముపై వెళ్లగలరని విని ఇప్పటినుండియే మామనములు చింతాసాగరమగ్నము లగుచున్నవి. మరల తమ రుండెదరని తెలిసినగాని స్వస్థత జెందవు.

నాయాహ్వానమును గౌరవించి యిచ్చుటకు విచ్చేసి నాకు యశస్సును పుణ్యమును నొనగూర్చి మాపురజనుల మన్ననలకు పాత్రులైన తమకు అనేకవేల నమస్కృతులు మనఃపూర్వకముగా నొనరించుచున్నాడను.

ఇట్లు,
శ్రీరామసేవకుడు,
B. V. R. MURTY.

# పండితాభిప్రాయములు.

ముంగండ అగ్రహార వాస్తవ్యులును, వైయ్యాకరణకేసరీ
ధర్మోపన్యాసకేశరీత్యాది బిరుదాంకితు లగు
బ్రహ్మశ్రీ పుల్య ఉమామహేశ్వరశాస్త్రిలుగారు.

రామాయణ సారోద్ధార ప్రసంసా

## పద్యరత్నపంచకము

శ్లో॥ శ్రీమద్రామకథాసుధారసమహాసారం సముద్ధృత్య య
స్స్వీయగ్రన్థసువర్ణసత్కలశతో దత్తే బుధానాం భువి
ధీమద్ధేన యుతేన నైజసుకలా రజ్జ్వా చతుర్వింశతి
శ్రీరామాయణసాగరంసుగహనంనిర్మథ్యనిమ్నంస్వయమ్.

శ్లో॥ భాస్వచ్ఛ్రీ ములుకుట్లవంశజలధిప్రాలేయభానుః కలా
సాహిత్యప్రతిభావిభాసితమతి శ్శ్రీరామకారుణ్యభాక్
విద్వద్దేశికవర్యలబ్ధవివిధామ్నాయాగమప్రాభవో
విఖ్యాతో నరసింహసూరి రిహ స చ్చీరాలవాసీ కవిః.

శ్లో॥ శ్రీరాయణసత్ప్రబన్ధనికరం సంపాద్య సుక్లేశతో
విద్యావారినిధా వటన్ ప్రతిపురం శ్రీభారతే సర్వతః
దృష్ట్వా తాని మిథో విరుద్ధవిషయా ణ్యేకీకృతీహాయుత
శ్చాతుర్యేణ సుయుక్తిభిః ప్రకలయన్ జగ్రన్థ దివ్యాం కథామ్.

శ్లో॥ తత్తద్గ్రన్థగతైశ్చ పద్యమణిభి స్స్వీయైశ్చ పద్యైః క్వచిత్
హృద్యైస్సర్వతఆర్షపౌరుషమయైర్వ్యాఖ్యాప్రభాభూషితైః



శ్రీవిద్వద్గలధార్యమండనవరై ర్దోషాపనోదక్షమై
ష్షట్సాహస్రమితై రచీకల దహో సద్గ్రన్థహారం మహత్.

శ్లో॥ సంశోధ్య ప్రతిపద్యరత్న మిహగం వీక్ష్య ప్రభాభాసితం
శ్రీమద్రామకథాఖ్యసూత్రకలితం హారం ముదా చార్పితం
ధృత్వాస్వీయగళేపరాం ముదమవా ప్యానన్దపాథోధిజం
పద్యశ్రీమణిపంచకం దిశతి మే వాణీ గృహా ణాదరాత్.

శ్లో॥ ఆత్రేయాన్వయసింధుకౌస్తుభసుధీర్లక్ష్మీనృసింహాత్మజః
కల్యః పుల్య ఉమామహేశ్వరకృతీ వక్త్ర్యర్థవిత్తస్సుధీః
యో వైయాకరణేషు కేసరిపదం విద్వత్సమాజా ద్యయా
ధర్మోపన్యసనేషు చాత్ర మునిఖండావాసి భూమీసురః.

ముంగండ అగ్రహారః,
అంబాజీపేట పోష్టు,
ప్రాచ్యగోదావరీమండలః

ఇతి,
పుల్య ఉమామహేశ్వరశాస్త్రి,
వైయాకరణకేసరీ, ధర్మోపన్యాసకేసరీచ.

శ్రీ భావవర్ష ఫాల్గున శుక్లపూర్ణిమాభౌమవాసరః
తాత్కాలికావాసః- శ్రీ బలిఘట్టమహాక్షేత్రమ్, విశాఖపట్టణంజిల్లా.

---

అభినవాంధ్ర వాల్మీకి, కావ్యస్మృతితీర్థేత్యాది బిరుదాంకితులును, బ్రహ్మబ్రహ్మాండాది పురాణ, ఆంధ్ర శ్రీరామాయణ గ్రంథకర్తలు నగు బ్రహ్మశ్రీ జనమంచి శేషాద్రిశర్మ శాస్త్రిలుగారు—

బ్రహ్మశ్రీయుత ములుకుట్ల నరసింహావధానులుగారి
దివ్యపాదారవిందములకు—

సేవకుండు జనమంచి శేషాద్రిశర్మ నమస్కరించి వ్రాసికొనుమనవి.

మహాత్మా! తమ రనుగ్రహించిన శ్రీరామాయణ సారోద్ధారము నామూలాగ్రము పఠించితిని. తమ సద్భావము లత్యంతపావనములు. పండితజనశిరోధార్యములు. భక్తజన కల్పద్రుమములు. పాషండజనదుర్వాదతూలములు. అమూల్య సేవచేసి కృతకృత్యులరై తిరి. మాబోఁటి యల్పమతులకు మార్గదర్శకులరై తిరి. కృతజ్ఞుఁడను............ఆలస్యముగా వ్రాసినందులకు క్షమింపుఁడు.

చిత్తగింపుఁడు – నమస్కృతములు.

సేవకుఁడు,

జనమంచి శేషాద్రిశర్మ, కడప.

---

బ్రహ్మశ్రీ బాలకవి, విద్యావైశద్యాదిబిరుదాంకితు లగు

యేలేశ్వరపు వేంకటకృష్ణమూర్తిగారు,

మొగల్తుర్రు, పశ్చిమగోదావరిజిల్లా.

బ్రహ్మశ్రీ పౌరాణికవిశారదులగు

ములుకుట్ల నారసింహావధానిగారి దివ్యసముఖమునకు—

మహాశయా! వందనములు.

యుష్మద్విరచిత శ్రీరామాయణసారోద్ధార గ్రంథసంబంధిత బాలకాండఁ జదివి చూచినాను. తమ కిట్టిశక్తి నొసంగిన శ్రీరామచంద్రుని మనసార ధ్యానించుచున్నాఁడ. ఇందలి శ్లోకములే తమ కభినవవాల్మీకిబిరుద మొసంగుచున్నవి. తమ యుద్యమము నిరంతరాయముగ నెరవేరగలందులకు శ్రీసీతారామ స్వామి యనుకూలుఁడగుగాక!



క॥ శ్రీరామాయణసారో
ద్ధారము గ్రంథంబు నిలను ♦ దయగలవారై
ధీరతఁ జదివిన మోక్షము
జేరరె? ములుకుట్ల నారసింహావధానీ!

తే॥ గీ॥ బాగు! మీచేత రచియింపఁ ♦ బడిన దైన
రామయణసార మే మని ♦ ప్రస్తుతింతు!
చక్కనైనట్టి పదములఁ ♦ జాలఁగూర్చి
తహహా! ములుకుట్ల నారసింహావధాని.

3—12—35
మొగల్తుర్రు.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు,

E. V. KRISHNA MURTY

---

బ్రహ్మశ్రీ శతావధాని, కావ్యకళానిధి,

పిశుపాటి చిదంబరశాస్త్రులుగారు,

పిఠాపురం.

బ్రహ్మశ్రీ ములుకుట్ల నరసింహావధానిగారికి—

మహాశయా!

అనేక రామాయణములనుండి మీరు సేకరించి సమకూర్చిన శ్రీరామాయణసారోద్ధారము చూచి మిగుల నానందించినాఁడను. దీనివిషయమై మీరు కావించిన పరిశ్రమము సుధీలోకశ్లాఘనీయ మనుట నిర్వివాదాంశము..........

పిఠాపురము,
26-11-1935.

ఇట్లు
శతావధాని, కావ్యకళానిధి,
పిశుపాటి చిదంబరశాస్త్రి.

---

పౌరాణికవిశారద, రామాయణసుధాసాగర, అభినవవాల్మీకి, విమర్శకాగ్రేసరేత్యాదిబిరుదాంకితు లగు బ్రహ్మశ్రీ ములుకుట్ల నరసింహావధానులు గారి పాదపద్మముల సన్నిధికి- పండితాగ్రణీ!

తమవలన శ్రీ రామాయణసారోద్ధారశ్రవణముచేసి కుతూహలముచే నీక్రింది పద్దెములు పంపుకొంటిని. అవి మీ గ్రంథమున ప్రకటింప ప్రార్థితులు

సీ॥ శివధనుర్భంగంబు సీతావివాహంబు, మేరమీరినవి శృంగారరసము
తాటకాశూర్పణఖాటక్కరితనంబు, హద్దుదాటినవి బో హాస్యరసము
అభిషేకహతదండకారణ్యగమనంబు, జూరగొనె న్కరుణారసంబు
వానరయూథరావణమహారోషంబు, లాక్రమించెను మహారౌద్రరసము
అతికాయకుంభకర్ణాదులరూపంబు, నడిపించె బో భయానకరసంబు
ప్రబలకబంధవిరాధవైకృత్యంబు, పలికించుచుండె భీభత్సరసము
రావణేంద్రజిదాదిరాక్షసనాశంబు, పూరించుచుండె నద్భుతరసంబు
శబరిచెంత, విభీషణుచైదములను వింతగా నొల్కెబో మహాశాంతరసము
కావ్యమిదిగాదు మహిమమహాకావ్యమగును, ఎట్లుగూర్చితివిది ములుకుట్లవంశ
వార్ధిచంద్రమ నవరసభరితచరిత, భక్తిచేగాక పాండిత్యశక్తియందు
నీకు సరియెవ్వరిక నీకునీవెగాక, పుణ్యగుణసాంద్ర! నరసింహభూసురేంద్ర!

గీ॥ ప్రబలయర్థాళి నూతపౌరాణికుండు, మునులకప్పుడు బోధించిగనెయశంబు
మరుగుపడియున్న తత్కథామహిమములను, నెరిపితె విశాఖపట్టణపురజనులకు.

మకాం:
విశాఖపట్టణం,
1-12-35.

ఇట్లు తమవిధేయుఁడు,
శ్రీరామాయణసారోద్ధారశ్రోత,
గాదె పాపరాజు.

ఇత్థం నివేదయతి పండితాభిప్రాయాన్
పిశుపాటి సుబ్రహ్మణ్యశాస్త్రీ,
పౌరాణికశిరోమణిః, ఘంటసాల గ్రామనివాసీ.



శ్రీరామ శ్శరణం మమ.

# ఆరణ్యకాండభూమికా.

అయి భో శ్రీరామభక్తాగ్రగణ్యా అగణ్యా స్సుపుణ్యాః!

జగన్నాటకసూత్రధారిణో భగవత శ్శ్రీరామచంద్రస్య మహిమాతిశయః పశ్యతా మాశ్చర్యకరో భవతి. శ్రీమత స్తస్య మాహాత్మ్య మియ దితి న కేనాఽపి సంపూర్ణం జ్ఞాతుం శక్యతే. ప్రకృతే కలికాలేఽపి నాగరకతాయాం విద్యాయాం వా ప్రదేశాంతరాఽహీనే శ్రీవిశాఖపత్తనేఽపి శ్రీరామచంద్రభక్తిసుధారసనిమగ్నమానసా స్త్రీపురుషా బహవ స్సంతీతి పశ్యతాం జనానాం శరీరం పులకితం భవత్యేవ.

అపిచ ఆత్మారామ శ్శ్రీరామచంద్ర స్తత్త్వత స్సర్వోపాధిశూన్యోఽపి తత్తత్కార్యవశా త్తత్తదుపాధిం నిమిత్తీకృత్య స్వభక్తానుకూలకార్యాణి సాధయత్యేవ. తేష్విద మేకం, యః ఖలు సర్వదేవాత్మకశ్చిన్మయశ్శ్రీరామచంద్రః, స్వీయచారిత్రం నిస్సందేహం సవిమర్శనం చ లోకే సామాన్యజనానా మనవగతానేకవిశేషాంశైః సాంప్రదాయావిరోధేన సంగ్రహేణ ప్రకటనకుతుకః, తాదృశప్రజ్ఞాహీనమపి మాం మధ్యే స్థాపయిత్వా శ్రీరామాయణసారోద్ధారాఖ్య గ్రంథ ప్రకటనద్వారా స్వీయ సంకల్పం పూరయతీతి.

అయంచ విషయో మద్జ్ఞాతౄణాం మమ చ ప్రథమతో వ్యవగతఏవ. ఏవం మయి శ్రీరామచంద్రస్య పరిపూ



శ్రీరామశ్శరణం మమ.

# అరణ్యకాండభూమిక.

శ్రీరామభక్తాగ్రగణ్యులు నగణ్యులు నగు నో పుణ్యాత్ములారా!

జగన్నాటకసూత్రధారియు, భగవంతుఁడు నగు శ్రీరామచంద్రుని మహిమాతిశయము తిలకించువారి కాశ్చర్యము గలిగించుచుండును. శ్రీమంతుఁడగు నాతని మహిమ మింత యని యెవ్వనికిఁ బూర్తిగఁ దెలియఁదరముగాదు. ఈకలికాలమందును, నాగరికతయందును, విద్యయందును మరొక్కతావునకుఁ దీసిపోని విశాఖపట్నమునందును శ్రీరామచంద్రభక్తిసుధారసమున నోలలాడు చిత్తములు గల యుత్తమస్త్రీపురుషు లెందరోకలరని గమనించువారికి శరీరము గగుర్పాటు సెందకమానదు.

అదియుఁగాక, ఆత్మారాముఁ డగు శ్రీరామచంద్రుఁడు యథార్థముగ సర్వోపాధిశూన్యుఁడైనను, ఆయాపనులను బట్టి, ఆ యాయుపాధుల నిమిత్తముగాఁ జేసికొని, తనభక్తజనుల కనుకూలము లగు కార్యముల సాధించుచునే యుండును. వానిలో నిది యొకటి. సర్వదేవతాస్వరూపుఁడును, జిన్మయుఁడు నగు శ్రీరామచంద్రుఁడు, తనచరిత్రమును (రామాయణమనుట) సంశయరహితముగా, సవిమర్శముగా లోకమున సామాన్యజనులకుఁ దెలియరాని యనేకవిశేషాంశములతో, సాంప్రదాయమునకు విరోధము లేకుండ సంగ్రహమునఁ బ్రకటించుటయందు కుతూహలముగలవాఁడై, అంతటి తెలివిలేనివాఁడనైనను నన్ను నడుమ నిల్పి శ్రీరామాయణసారోద్ధారమను నీగ్రంథమును బ్రకటించుట మూలముగాఁ దనసంకల్పమును బూర్తి చేసికొనుచున్నాఁడు అని.

ఈ యంశము మొదటినుండియు నన్నెఱిఁగినవారికిని, నాకును దెలిసియే యున్నది. ఈతీరున నాయందు శ్రీరామచంద్రుని పరిపూర్ణా

ర్ణానుగ్రహః మదీయఅనేకజన్మకృత సుకృత పరిపాకాద్వా నిర్హేతుక జాయమాన కటాక్షవీక్షణస్య శ్రీరామచంద్రస్య దయాయావేత్యహం మదీయాశ్చ సంతుష్టా భవామః. నహి గర్వస్య యత్కించిదపి కారణం దృశ్యతే.

కృతజ్ఞోఽహ మేతాదృశ ప్రౌఢవిద్యాప్రచారస్యానుకూలానాం శ్రీ రామాయణసారోద్ధారారణ్యకాండ ముద్రణాయ దుర్హృదాం పండితంమన్యానాం దురుపదేశా న్యలక్ష్య కృత్య యథాశక్తిద్రవ్యదానాది సాహాయ్యకారిణాం ఉదారాణాం శ్రీరామచంద్రకైంకర్యపరాణా మస్మత్పోషకవర్గీయాణాం తద్దండకారణ్యసంచార దుష్టశిక్షణ శిష్టరక్షణకారీ భగవాన్ శ్రీరామచంద్ర స్తత్తత్సేవానుసారత స్సకలశ్రేయోభివృద్ధిం కరోతు రక్షతుచ తాన్ సర్వదే త్యాశాస్మహే.

ప్రథమత శ్శ్రీవిజయవాడపురీతో మా మేత ద్విశాఖపట్టణం ప్రత్యాహర్తృభ్యో వదాన్యేభ్య స్సరసేభ్యశ్చ బ్రహ్మశ్రీ బాకురుపండా వేంకటరమణమూర్తి మహాశయేభ్యః, ప్రదేశాంతరీయై ర్భక్తిపూరితమానసై రాహూత మపి మాం సహృదయాభినివేశేన అనుగమయ్య భక్తిపాశేన దృఢంబధ్వా ఏతద్విశాఖపట్టణ మానేతృభ్యో బ్రహ్మశ్రీ మండపాక లక్ష్మీనరసింగరాయమహాశయేభ్యః, తదాజ్ఞాం శిరసిధృత్వా సకలకార్యభారనిర్వాహకేభ్యో మహారాజశ్రీ గరుడా లక్ష్మీనరసింహమహాశయేభ్యశ్చ భగవాన్ శ్రీరామచంద్ర స్సకలాయురారోగ్యైశ్వర్యాద్యభివృద్ధిం ప్రదాయ రక్షతు తా నిత్యపి కామయామహే.



నుగ్రహము నా అనేకజన్మసముపార్జితసుకృతపరిపాకమువలననో, నిర్హేతుకముగా జనించు కటాక్షప్రసారము కల శ్రీరామచంద్రుని దయవల్లనో యని నేనును నావారును మిగుల సంతోషించుచున్నాము. గర్వమున కేమాత్రముకారణము గనఁబడుట లేదు.

కృతజ్ఞుఁడ నగు నేను, ఇట్టి ప్రౌఢ మగు విద్యాప్రచారమున కనుకూలురును, శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమును ముద్రింపించుకొఱకు దుర్మనస్కులగు పండితమ్మన్యుల చెడ్డబోధనల లెక్కింపక యథాశక్తిగా ద్రవ్యమిచ్చుట మొదలగు సహాయమొనర్చినయుదారులును శ్రీరామచంద్రసేవకులు నైన శ్రీరామాయణ సారోద్ధారారణ్యకాండ పోషకవర్గము వారికి, దుష్టశిక్షణము, శిష్టరక్షణము సేయు భగవంతుఁడగు శ్రీరామచంద్రుఁడు వారివారి సేవల ననుసరించి సకల శ్రేయోభివృద్ధిని జేయుఁగాక! ఎల్లప్పుడు వారిని రక్షించుఁగాక! యని కోరుచున్నాము.

తొలుత శ్రీవిజయవాడనుండి న న్నీవిశాఖపట్టణమునకుఁ గొనివచ్చిన వదాన్యులును, రసికులు నగు బ్రహ్మశ్రీ బాకురుపండా వేంకటరమణమూర్తి మహాశయులకును, భక్తిపూరితు లగు ప్రదేశాంతరులచేఁ బిలువఁబడిన నన్ను మంచిమనసుతో ననుగమించి భక్తిపాశముతో గట్టిగాఁగట్టి యీవిశాఖపట్టణమునకుఁ దీసికొనివచ్చిన బ్రహ్మశ్రీ మండపాక లక్ష్మీనరసింగరావు మహాశయులకును, వారియాజ్ఞను శిరమునం దాల్చి సకల కార్యభారమును నిర్వహించిన మహారాజశ్రీ గరుడా లక్ష్మీనృసింహమహాశయులకును, భగవానుఁ డగు శ్రీరామచంద్రుఁడు సకలాయురారోగ్యైశ్వర్యాద్యభివృద్ధి నిచ్చి వారల రక్షించుఁగాక యని కోరెదము.

కించ బహవో నమస్కారా శ్రీమదారణ్యకాండే భూగోళవిషయే సహకారిభ్య శ్రీమత్పరవస్తు రంగాచార్యపౌత్రేభ్య శ్రీమల్లక్ష్మీనరసింహస్వామివరేభ్యః.

అపిచ శతశశ్చ నమస్కారా శ్రీరామాయణసారోద్ధారాఖ్యగ్రంథం బహుశ్రమేణ దృష్ట్వా తదుచిత స్వీయాభిప్రాయప్రదాతృభ్య స్సకలపండితప్రకాండేభ్యః.

అన్యచ్చైతద్రామాయణసారోద్ధారే మయా సంగ్రథితశ్లోకాః ద్విత్రిసంఖ్యాకాః కేషుచిన్నాటకేష్వపి దృష్టత్వా న్నాటకాఏవ ఏతద్గ్రంథే సమ్మిళితా ఇతి కేచన శంకయంతి. న తథా. యథా వాల్మీకిరామాయణస్థశ్లోకా బహవః పురాణేషు దృశ్యంతే, యథా శ్రుతయః మహాభారతే వృత్తరూపేణ ప్రత్యక్షీక్రియతే తథాచ, యథా పద్మపురాణ రఘువంశయోః లలితోపాఖ్యాన కుమారసంభవయో ర ప్యన్యోన్య సంబంధః స్పష్టతయా అవగమ్యతే- తథైవ ఆర్షగ్రంథస్థ శ్లోకా ఏవ నాటకేష్వపి తత్ర తత్ర దృశ్యంతే. అపిచ కేచన మహాకవయః ఆర్షశ్లోక భావమే వానుసృత్య కించిన్న్యూనాధికతయా స్వీయగ్రంథేషు కాంశ్చిన్ శ్లోకా నరచయన్ తావన్మాత్రేణ మయా సమ్మిళిత శ్లోకా ఆర్షవిరుద్ధానేతి విజ్ఞాపయామి.

అహంతు తత్తన్మాతృకానుసారేణాపూరయం అయోధ్యాకాండేతు రామాయణచంపూగ్రంథే మహాక వ్యనుగృహీతా ఇతిబుద్ధ్యా శ్లోకద్వయమాత్రమ ప్యనుల్లిఖ్య న సంతుష్టః. తథైవ మురారికృతే బాలకాండేపి తస్య సమాధానమిదం బాల



శ్రీమదారణ్యకాండమున భూగోళము వ్రాయుటలో సహాయము చేసిన శ్రీమత్పరవస్తు రంగాచార్యుల వారి పౌత్రు లగు శ్రీలక్ష్మీనరసింహస్వామివరుల కనేకనమస్కారములు.

మఱియు శ్రీరామాయణసారోద్ధారమును బహుశ్రమతోఁ జూచి, దానికిఁ దగిన తమయభిప్రాయముల నిచ్చిన సకలపండితప్రకాండులకుఁ బెక్కువందల నమస్కారములు.

ఇక నీ రామాయణసారోద్ధారమున నాచే సంగ్రహింపఁబడిన శ్లోకములు రెండు మూఁడు కొన్ని నాటకములయందును గనఁబడుటచే నాటకములే ఇందుఁగూర్పఁబడిన వని కొందఱు శంకించుచున్నారు. అట్లు గాదు. వాల్మీకిరామాయణమునఁ గల శ్లోకము లనేకము లెట్లితరపురాణముల యందుఁ గనఁబడుచున్నవో, శ్రుతులు కొన్ని మహాభారతమున శ్లోకరూపమునఁ బ్రత్యక్షమగుచున్నవో, పద్మపురాణరఘువంశకావ్యములకును-లలితోపాఖ్యాన కుమారసంభవములకును అన్యోన్యసంబంధ మెట్లు స్పష్టముగాఁ దెలియుచున్నదో అట్లే ఆర్షగ్రంథములం దున్న శ్లోకములే నాటకములయం దచ్చటచ్చటఁ గన్పట్టుచున్నవి. అదిగాక కొందఱు కవులు ఆర్షశ్లోకభావమునే యనుసరించి కొంచెము హెచ్చుతగ్గులఁ దమ గ్రంథములయందు శ్లోకములను రచించిరి. అంతమాత్రమున నాచేఁ గూర్పఁబడిన శ్లోకములార్షవిరుద్ధములు గావని విన్నవించుకొనుచున్నాను.

నేను నాయామాతృకానుసారముగాఁ బూరించితిని. అయోధ్యాకాండమున రామాయణచంపూగ్రంథమునందు మహాకవిచే ననుగ్రహింపఁబడిన వను తలంపుతో (అందుండి) రెండు శ్లోకములనేని వ్రాయక సంతుష్టుఁడఁ గానైతిని. అటులనే మురారికృతము లగు రెండు శ్లోకములను బాలకాండమునందును వ్రాసితిని. అందులకు నా సమాధాన మిది. బాలకాండో

కాండోపోద్ఘాతే కథాసంగ్రహార్థం శ్రోతృప్రరోచనార్థంచ మహాకవికృతార్షావిరుద్ధశ్లోకా నపి గ్రహీష్యామీతి ప్రతిజ్ఞాత మేవ. ఏతత్పూర్వాపరసందర్భ మవిచార్య అయుక్త మితి య దుక్తం త దవిచారితరమణీయం.

అన్యచ్చ యదాహం విశాఖపట్టణం విహాయ స్వదేశం గంతుం ప్రస్థిత స్తదానీం మాం పునః ఆహూయ వసంతనవరాత్రిషు హిందూపఠనమందిరే మన్ముఖా దుపన్యాసరూపేణ భక్తానాం రామాయణ మాంతం శ్రావయిత్వా మా మతీవ సన్మానయతాం బ్రహ్మశ్రీ పులిగడ్డ సత్యనారాయణ ప్రాడ్వివాకప్రభృత్యధికారిణాం పఠనమందిరస్య నేతుశ్చ శ్రీరామచంద్రః ఆయురారోగ్యైశ్వర్యాదికం దదాతు.

కిం త ఏత ఇతి విచారణయా మాసదశక మారభ్య శ్రీవిశాఖపట్టణే కాలక్షేపక్రియమాణ శ్రీరామాయణసారోద్ధారస్య యై ర్యై ర్యాదృశీ సేవా కృతా తేషాం తేషాం తదనుసారతః ఫలం శ్రీరామచంద్రః ప్రసీద త్వితి హృదయ మావిష్కుర్మహే.

అన్యచ్చ నిజశేముషీవిశేషావభాసితాశేషవిద్యావిశేషాణాం పండితవరేణ్యానాం నమస్కారపూర్వక మిదం మయా విజ్ఞాప్యతే. మయా తావదేత ద్గ్రంథముద్రణాయ ధనార్జనార్థం సర్వత్ర పరిభ్రమితం, తదా మత్ స్థానే తద్గ్రంథశోధనార్థం ద్విత్రాణాం పండితానా మవస్థానేఽపి గ్రంథో నిర్దోషే నోట్టంకితు మసాధ్యోఽభూత్. స్వయం గ్రంథా నారచ్య స్వయ మేవ



పోద్ఘాతమున కథాసంగ్రహముకొఱకును, వినువారి కాసక్తి జనింపఁజేయుటకును మహాకవులచేఁ గల్పితములయి, ఆర్ష విరుద్ధములయియున్న శ్లోకములను గూడ గ్రహింతునని ప్రతిజ్ఞ చేయఁబడినదియే. ఈ పూర్వాపరసందర్భముల విమర్శింపక ‘ అయుక్తము ’ అనుట యవిచారితరమ్యము.

ఇంకొకటి—నేను విశాఖపట్టణము వీడి స్వదేశమునకు బయలుదేరి నప్పుడు నన్ను మఱల నాహ్వానించి, వసంతనవరాత్రిలలో హిందూపఠన మందిరమునందు నావలన నుపన్యాసరూపముగా రామాయణమునంతను భక్తులెల్లరకు వినిపింపఁజేసి నన్నెక్కుడుగా సన్మానించిన బ్రహ్మశ్రీ పులిగడ్డ సత్యనారాయణ పంతులుగారు మొదలగు నధికారులకును, పఠనమందిరాధిపతికిని శ్రీ రామచంద్రుఁ డాయురారోగ్యైశ్వర్యాదికము ననుగ్రహించుగాక !

ఇఁక వారు వీ రని విచారణ యేల ? పదిమాసములనుండి శ్రీ విశాఖపట్టణమునఁ గాలక్షేప మొనర్పఁబడిన శ్రీరామాయణసారోద్ధారమున కెవరిచే నెంతెంత సేవసేయఁబడినదో వారివారి కాయా సేవానుసారముగా ఫలితమును శ్రీరామచంద్రుఁ డనుగ్రహించుఁగాక యని యంతరంగమును వెలిబుచ్చుచున్నాము.

మఱియు నొక్క యంశమును దమ బుద్ధివిశేషముచేఁ బ్రకాశింపఁ జేయఁబడిన సర్వవిద్యావిశేషములు కల పండితశ్రేష్ఠులకు నమస్కారపూర్వకముగా నిటు విజ్ఞాపనము చేయుచున్నాను. నే నీ గ్రంథముద్రణమునకై ధనసంపాదనముకొఱకంతటను దిరుగాడితిని. అప్పుడు నాస్థానమున నాగ్రంథమును బరిశోధించుట కిద్దరు ముగ్గురుపండితుల నుంచినను నిర్దుష్టముగాఁ జేయుటకు సాధ్యము కాకపోయెను. స్వయముగా గ్రంథములను వ్రాసి స్వయముగానే ధనమును సంపాదించి ప్రకటించువారి కీ శ్రమ తెలియును. ప్రథమ

ద్రవ్యమపి సంపాద్య గ్రంథాన్ ప్రకటయితౄణాం పండితవరేణ్యానా మయం శ్రమో జ్ఞాతో భవతి. ప్రథమప్రయత్నత్వాద్బాలకాండే బహవో దోషా స్సంత్యేవ. తేపి మద్దృష్టిపథంగతా ఏవ. న సంత్యయోధ్యాకాండే తావంతో దోషాః. తేచ దోషా ద్వితీయముద్రణే యథాశక్తి శోధయిష్యంతే. యాదృశప్రజ్ఞావతోఽపి స్వకృతగ్రంథస్థితదోషా స్స్వేనైవ జ్ఞాతుం సామాన్యతః అశక్యాః.

మహాశయాః! అతో మయి సదయహృదయై ర్భవద్భి ర్భవద్దృష్టిపథంగతా దోషా యది బోధితా స్తదా తదనుసారేణ ద్వితీయముద్రణే నిర్దోషో గ్రంథో మయా ముద్రాపయిష్యతే. ఏవమే వావశిష్టకాండానా మప్యతిరయేణ ప్రకటనాయ గుణగ్రహణపారీణాః శ్రీరామచంద్రభక్తిపూరితమానసాః పండితమహాశయా స్స్వీయపవిత్రవాగ్భి రాశీర్భి ర్మా మభినందం త్వితి సవినయం ప్రార్థయతి.

శ్రీరామసేవకో విబుధజనవిధేయః,

ములుకట్లోపాహ్వయో నరసింహావధానీ.

---



ప్రయత్న మగుటచే బాలకాండమునఁ జాల దోషము లున్నవి. అవి నాకుఁ గనఁబడినవే. అన్నిదోషము లయోధ్యాకాండలో లేవు. అవియు రెండవ ముద్రణమున యథాశక్తిగా శోధింపఁబడును. ఎంతప్రజ్ఞగలవానికైనను దన గ్రంథములో నున్న తప్పులు తానే యెఱుంగుట సామాన్యముగా శక్యము గాదు.

మహాశయులారా! కనుక నాయందు దయాహృదయు లగు తాము మీ చూపునఁబడిన దోషములు తెలుపుదురేని యప్పుడు వాని ననుసరించి రెండవ ముద్రణమున నిర్దుష్ట మగు గ్రంథమును నేను ముద్రింపింతును. ఇట్లే మిగిలిన కాండలనుగూడ వేవేగ బ్రకటించుకొనుటకు గుణగ్రహణపారీణులును, శ్రీరామచంద్రభక్తిపూరితమనస్కులు నగు పండితమహాశయులు తమ పవిత్రవాక్కులు గల యాశీర్వాదములచే నన్నభినందింతురు గాక యని వినయముతోఁ బ్రార్థించుచున్నాఁడను.

శ్రీరామసేవకుఁడు, విబుధజనవిధేయుఁడు,

ములుకట్ల నరసింహావధాని.

---

శ్రీరామాయణసారోద్ధారమునందు

# ఆరణ్యకాండ విషయసూచిక.

---

శ్రీరామ శ్శరణం మమ

తత్ర శ్రీరామాయణసారోద్ధారే

# అరణ్యకాండన్యాసప్రకారః

ఓం అస్య శ్రీమదారణ్యకాండమహామంత్రస్య శచీపురందరఋషిః, అనుష్టుప్ ఛందః, ఇంద్రో దేవతా, నమఃశక్తిః, మహేంద్రాయేతి కీలకం, శ్రీమహేంద్రసహితశ్రీరామచంద్రప్రసాదసిద్ధ్యర్థే జపే వినియోగః. సహస్రనయనం అంగుష్ఠాభ్యాం నమః దేవం తర్జసీభ్యాం నమః సర్వదేవనమస్కృతం మధ్యమాభ్యాంనమః దివ్యవజ్రాయుధధరం అనామికాభ్యాంనమః వందేహంతంకనిష్ఠికాభ్యాంనమఃశచీపతింకరతలకరపృష్ఠాభ్యాంనమః సహస్రనయనం హృదయాయనమః దేవం శిరసేస్వాహా సర్వదేవనమస్కృతం శిఖాయైవషట్ దివ్యాయుధధరం కవచాయ హుం వందేహం తం నేత్రత్రయాయవౌషట్ శచీపతిం అస్త్రాయఫట్ భూర్భువస్సువరోమితి దిగ్బంధః.

ధ్యానమ్. శచీపతిం సర్వసురేంద్రవంద్యం, రక్షోనిహంతారమనస్యతేజం, శ్రీరామసేవానిరతం మహాంతం, వందే మహేంద్రం ధృతవజ్రమీఢ్యమ్. లమితి పంచపూజా.

మనుః॥ సహస్రనయనం దేవం సర్వదేవనమస్కృతం
దివ్యవజ్రాయుధధరం వందేహం తం శచీపతిం.

ఇతియథాశక్తిజపిత్వా పునర్న్యాసాదికం కృత్వా సమాపయేత్. ఆద్యంతయోః కోశోపరి సాంగసపరివారశ్రీరామావాహనాది పూజా విధేయా. ధ్యానాదికం కృత్వా కాండపారాయణం కుర్యాత్ ఇతి.

---

# శ్రీరామాయణసారోద్ధారే

## అరణ్యకాండః

శ్రీ గణేశాయ నమః.

శ్రీరామ శ్శరణం మమ.

# శ్రీ రామాయణ సారోద్ధారే

అరణ్యకాండ ప్రారంభః.

## ప్రథమస్సర్గః

1శ్లో॥ సాంద్రానందపయోదసౌభగతనుం చీరాంబరం సుందరం
పాణౌ బాణశరాసనం కటిలసత్తూణీరభారం వరం
రాజీవాయతలోచనం ధృతజటాజూటేన సంశోభితం
సీతాలక్ష్మణసంయుతం పథిగతం రామాభిరామం భజే॥

2* ప్రవిశ్యతు మహారణ్యం దండకారణ్య మాత్మవాన్
దదర్శ రామో దుర్ధర్షం తాపసాశ్రమమండలం॥ ౧
కుశచీరపరిక్షిప్తం బ్రాహ్మ్యాలక్ష్మ్యాసమావృతం।
యథా ప్రదీప్తం దుర్ధర్షం గగనే సూర్యమండలమ్॥ ౨

* ప్రవిశ్యేతి। దండకారణ్యం నామ ఇక్ష్వాకుపుత్రేణ దండనామ్నా రాజ్ఞా పరిపాలితత్వాత్తన్నామ్నైవ ప్రసిద్ధతామగమత్। దండకారణ్యస్యోత్తరసీమా గంగానదీ దక్షిణతటం వింధ్యాద్రిశ్చ। ... పశ్చిమసీమా - ఉత్తరవింధ్యాద్రిః, అత్రేరాశ్రమః దక్షిణవింధ్యాద్రిః, దక్షిణ

1 హనుమద్రామాయణం. 2 వాల్మీకి రా ౧స॥

శ్రీ గణేశాయనమః.

శ్రీరామశ్శరణంమమ.

# శ్రీ రామాయణ సారోద్ధారము.

## అరణ్యకాండము - ప్రథమసర్గము.

శ్లో॥ సీ. మేఘశ్యామల మగు కోమలతనుకాంతి చెన్నుమీర జటావల్కలములను శరచాప తూణీరముల ధరించి, కమలేక్షణుడై సీతాలక్ష్మణులతోడ నడువ దండకారణ్య సంచారియగు జగన్మోహన సుందరాంగుడైన శ్రీరామచంద్రుని భజించుచున్నాడను.

౧ మొదలు ౩౪ వరకు. సరియగు మార్గము లేమిచే నెంతటివారికైనను చొఱ నసాధ్యమగు దండకమను మహారణ్యమును, ధైర్యవంతుడును, సాధింప నలవిగానివాడు నగు శ్రీరామచంద్రుడు. తమ్మునితో సతితో బ్రవేశించి అందమిత తేజముచే వెల్గొందు తాపసాశ్రమములను చూచెను. అచ్చటి యాశ్రమసీమలందు, వైదికక్రియలకై

* వివరణము. దండకారణ్యమన ఇక్ష్వాకుపుత్రకుడగు దండకుడను రాజుచే నొకప్పుడు పరిపాలింపబడి మరల శుక్రాచార్యశాపమున నరణ్యమయ్యెను గాన దానికాపేరు గల్గె, ఈ దండకారణ్యమునకు ఉత్తరపు సరిహద్దు గంగానది, దక్షిణపుటొడ్డు వింధ్యపర్వతమును, పశ్చిమమున ఉత్తర వింధ్యపర్వతము, అత్రిమహర్ష్యాశ్రమము, దక్షిణ వింధ్య, దక్షిణ కోసలము, విదర్భదేశము, దక్షిణాపథము, మలగిరియును, దక్షిణపు పొలిమేర, కావేరినదియు ద్రవిడపాండ్యదేశములు, తూర్పు సరిహద్దు, ఉత్కళ, కళింగ,

బలిహోమార్చితం పుణ్యం బ్రహ్మఘోషనినాదితం

పుష్పైశ్చ నియతాహారై శ్శోభితం పరమర్షిభిః॥ 3.

సూర్యవైశ్వానరాభైశ్చ పురాణై ర్మునిభి ర్వృతం॥ 3½

1 తం దృష్ట్వా ఋషయస్సర్వే పరస్పర మథాబ్రువన్॥ ౪

---

కోసలః, విదర్భదేశః, దక్షిణాపథో మలయగిరిశ్చ।.....
దక్షిణసీమా - ద్రవిడపాండ్యదేశౌ - కావేరీనదీచ॥ ...
ప్రాక్సీమా ఉత్కళ, కళింగ, ఆంధ్ర, చోళదేశాః
మహేంద్రపర్వతపంక్తిశ్చ - ఏతన్మధ్యే విద్యమాన
ప్రదేశస్య దండకారణ్యమితి సంజ్ఞా (N. B.) పరికృతే
(Siraguza) సిరగుజాప్రాంతే శ్రీరామో దండకారణ్యం
ప్రవిష్ట ఇతి జ్ఞేయం తన్మార్గమనుసృత్య శ్రీరామచంద్ర
గమనే ప్రథమతో మహర్షీణా మాశ్రమా అనేక ఆసన్.
ఇతి॥ అత్రోక్తదేశవిశేషవివరణం॥ దక్షిణకోసలో నామ
గంగాయాః దక్షిణతటే- (Nagapur) నాగపుర్యాఖ్య
పత్తనాచ్చోత్తరే. (Gujarat) గుజరాదంతర్గతే -

---

1 హనుమద్రామాయణం.



తెచ్చియుంచిన దర్భ లందముగనుండెను. ఆరవైచి యున్న నార మడి వస్త్రములు బ్రహ్మదేవుని పతాకములవలె నెగురుచుండెను. వైశ్వదేవాంతమున కాకులు మొదలగు జంతు సంతుష్టికై ఉంచ బడు భూతబలులు పచ్చికప్రదేశములందాకాశమున రిక్కలవలె శోభించుచుండెను. అన్నియెడలను వేదఘోషము వీనులకు విందొన గూర్చుచుండెను. అచ్చటి మహర్షులు పరిశుద్ధులు నియతా హారులు. సూర్యచంద్రాగ్నుల మించు తేజోధిక శరీరులు. అట్టి బ్రహ్మర్షులచే నిండియున్న యయ్యాశ్రమశ్రేణి బ్రాహ్మ్యలక్ష్మి కాటపట్టై గగనమునగల సూర్యబింబమువలె చూచుటకెంతయు శ్లాఘ్యమై యుండెను.

౪ అచ్చటంగల మహర్షులందరును శ్రీరామచంద్రునిచూచి పలువిధము లుగ నిర్ణయించసాగిరి.

---

ఆంధ్ర, చోళదేశములు, తూర్పు కనుమలను మహేంద్రపర్వతములు ఈ మధ్యప్రదేశమునకు దండకారణ్యమని పేరు. N. B. ఇప్పటి సిరగుజప్రాంతమున శ్రీరామచంద్రు డత్రియాశ్రమమున నుండి దండకారణ్యము ప్రవేశించెనని తెలియవలెను. ఆమార్గమనుస రించి శ్రీరామచంద్రుడు ప్రయాణముజేయ మొదలన ననేకమహర్షు యాశ్రమములు గన్పట్టెను. ఇందు జెప్పబడిన దేశముల వివరణము జెప్పబడుచున్నది. దక్షిణకోసలము గంగానదికి దక్షిణమున మధ్యపరగణాలలో నాగపూరునకు ఉత్తరమున గుజరాత్ లోని కుశస్థలీ పట్టణప్రదేశమున నుండెను, విదర్భదేశము వింధ్యపర్వత మునకు దక్షిణముననున్న దక్షిణ కోసలాంతర్గతము చతేస్గార్

నాయం భిక్షుర్వరయువతిమాన్నా తెతిక్షుర్ధనుష్మాన్

రాజ్ఞః పుత్రో నహి నహి జటాజూటభారం దధానః

నాయం వ్యాధో నవగుణధరః పశ్య కస్మా దకస్మాత్

పుణ్యేఽరణ్యే నవనవదళశ్యామలః కోఽయమేతి॥ ౩

2 ఇత్యేవం భాషమాణాస్తే సంగతాశ్చ పరస్పరం ౩౪

కశస్థలీ పట్టణప్రదేశేఽస్తి॥ విదర్భదేశోనామ। వింధ్యస్య దక్షిణతః- (Berar) బిరార్ ప్రాంతవర్తీతి బోధ్యం ద్రవిడదేశోనామ - కన్యాకుమార్యగ్రప్రాంతే విద్యమానోదేశః। తత్రైవ పాండ్యదేశ ఇతి జ్ఞేయం। ఉత్కలో నామ- కళింగదేశా దుత్తరతో విద్యమానో దేశః స ఇదానీం (Orissa) ఓరిస్సా ఇతి వ్యవహ్రియతే। కళింగదేశో నామ-(Cuttack) కటకసమీపస్థ- Bettra Rever) బెట్రా నామక వైతరణీనదీదక్షిణప్రదేశం,(Central Provinces) మధ్యప్రాంతా ఇతివ్యవహ్రియమాణప్రదేశం చాక్రమ్య స్థితః। ఆంధ్రదేశోనామ- కృష్ణా.గోదావరీమధ్యే విద్యమానో దేశ ఇతి బోధ్యం॥

2వాల్మీకి చరిత్ర.



౫౪ కొందరు శ్రీరాముని యతియనిరి. మరికొందరు సర్వాంగసుందరి యగు కాంతారత్నముతో నుండుటవలన నట్లుకాదనిరి. అట్లేకొందరు ఇంద్రియములనరికట్టు వాడనిరి ఇతరులు ధనురాది సాధనోపేతుడగుట జూడ నదిసరికాదనిరి. కాన, రాజపుత్రుడగుటకు సందేహింప బనిలేదని నిర్దేశించువారింగని, జటాజూటము, నారవస్త్రములు కృష్ణాజినముల జూచి సందేహించిరి. వెంటనే సామాన్యులగువారు పరస్పర విరుద్ధధర్మావలంబి యగుటచే నీతడు వ్యాధుడన నియతమగు తొమ్మిదిపోగులుగల జన్నిదమాతనిభుజసీమను జూపి అట్లనుట పొరపాటనిరి । తుదకందరును దేవుని స్పష్టముగ నిర్దేశింపలేని శ్రుతులవలె శ్రీరామచంద్రుడిట్టివాడని నిర్ణయింపలేక యాతాయాతముగా పుణ్యమగు నీయరణ్య ప్రదేశమందు, నూతనుడును వికసించిన నల్లగల్వల మేనిచాయ చెన్నుమీరు నీతడెవ్వడో గన్గొన నిచ్ఛగించి, మునులెల్ల పరస్పరాహూతులై శ్రీ సీతారాముల సమీపించిరి.

జిల్లాయనబడు దాశార్ణ దేశమునకు పశ్చిమముగను, గోదావరికి ఉత్తరముగను, సూరత్ అను సురాష్ట్రదేశమునకు తూర్పుగనున్న ప్రదేశము. ఇక ద్రవిడ పాండ్యదేశములు భరతఖండ దక్షిణాగ్రమునగలవు. ఉత్కళమన కళింగదేశమున కుత్తరముననున్న ప్రదేశము ప్రకృతము. ఒరిస్సాయనబడుచున్నది కళింగమనగ కటకసమీపమునగల బెట్రాయను వైతరణీనదికి దక్షిణ ప్రదేశమును మధ్యప్రాంతముల నాక్రమించుకొని యున్నది ఆంధ్రదేశము కృష్ణా గోదావరీ నదుల మధ్యప్రదేశమని తెలియుచున్నది.

ప్రావృణ్ణీలఘనశ్యామం సీతాలక్ష్మణసంయుతం॥
దీర్ఘబాహు ముదారాంగం పద్మపత్రాయతేక్షణం
మునయో మునికాంతాశ్చ దృష్ట్వా మోహం ప్రపేదిరే॥
అబ్రువన్ వచనం రామం తత్సౌందర్యవిమోహితాః ౨౪
మునయః

* రామచంద్రాఖిలాధార సౌందర్యామృతసాగర
పాహి నస్సకలాన్ దేవ మదనేనాతిపీడితాన్
క్రీడనార్థం త్వయా దేవ లక్ష్మీ రప్యాగతా హరే॥
శ్రీరామః

---

* రామచంద్రేతి తదేవవిశదీకరోతి గర్గసంహితాయాం గోలోకఖండే ౪_అధ్యాయే ౪౫ శ్లోకే బ్రహ్మాణం ప్రతి శ్రీకృష్ణవచనం॥

శ్లో॥ పితుర్వాక్యాద్యదా రామో దండకాఖ్యం వనం గతః।
గోపాలోపాసకా స్సర్వే దండకారణ్యవాసినః।
ధ్యాయంత స్సతతం కృష్ణం రాసార్థం ధ్యానతత్పరాః।
తేషాం ధ్యానే గతో రామో జటామకుటమండితః।
అన్యాకృతిం తే తం వీక్ష్య పరం విస్మితమానసాః।
ధ్యానాదుత్థాయ దదృశుః కోటికందర్పసన్నిభం॥
ఊచుస్తే యస్తు గోపాలో వంశే వేత్రేవినా ప్రభుః
ఇత్థం విచార్య మనసా నేముశ్చక్రుస్తుతిం పరాం।
శ్రీరామ ఉవాచ
ఏకపత్నీవ్రతోహంవై మర్యాదా పురుషోత్తమః



*౬-౨-౨౪ క్రొత్తక్రారు మేఘమువలె శ్యామలుడును సీతాలక్ష్మణసమేతుడును గంభీరులును, మోకాలుమీదికి జారిన కేలుదమ్ములును నీరేజపత్రముల హసించు కన్గవయును గల్గి సర్వాంగసౌందర్యముచే శోభిల్లు శ్రీరామచంద్రుని గాంచి యచ్చటి మునులును మునిపత్నులును మోహపరవశముచే నిట్లనిరి.

౨౫ సర్వాధారుండవును సౌందర్యామృత సముద్రుండవు శ్రీరామచంద్రా మాకొకమారు నీకోమలదేహ పరిష్వంగ మొసగి మమ్ము పాలింపుము, నీతో క్రీడించుటకై యాదిలక్ష్మియును నిచ్చటికి వచ్చియున్నదని వేడిరి.

---

* ౨౫వ శ్లోక వివరణము॥ ఎందుల కీమహర్షుల కీకోరిక జనించెనో గర్గసంహితయందుగల ౪౫ శ్లోకము మొదలు వివరింపబడినది. ఎట్లన పూర్వకల్పమున నొకతరి కృష్ణావతార మేర్పడెను. అందు శ్రీకృష్ణుడు గోపికలతో రాసక్రీడ సల్పెను. దాని స్మరించి కొందరు పుణ్యులు మాకీభాగ్య మెట్లొనగూడునని నియతిచే శ్రీకృష్ణుని ప్రార్థించిరి. అంత వారలకు శ్రీకృష్ణుడు ప్రత్యక్షమై మీరు తపమొనరింపుడు తపమునకు సాధ్యముగానిదిగలదా మరొకకాలమున 28 వ ద్వాపరాంతమున శ్రీకృష్ణావతార మేర్పడును అప్పుడు మీకీభాగ్యము లబ్బునని సెను. అంత వారందరును గోపాలోపాసకులై దండకారణ్యముననుండిరి. అంత శ్రీరామచంద్రుడు పిత్రాజ్ఞచే దండకాటవి ప్రవేశించెను. మునులా శ్రీరాముని జూచి తమహృదయములందుండు శ్రీకృష్ణదేవుడీరీతిని పిల్లనగ్రోవియు మునికోలయు విసర్జించి ధనుర్బాణముల బూని జటావల్కలములు ధరించి మనలకు దర్శనమిచ్చుచున్నాడని భ్రమపడి మానసమందుగల తమ కోరికల ననుసరించి యాలింగనము వేడిరి. దానిని శ్రీరామచంద్రుడు తెలిసికొని ఇది కృష్ణావతారము కాదనియు ఏకపత్నీవ్రతోత్తమ

కృష్ణావతారే భవతాం కామః పూర్ణో భవిష్యతి।
యూయంహిగోపికాభూత్వాసర్వా న్కామానవాప్స్యథ౧౦
గావ్యో భవంతు సర్వాస్తా మునిపత్న్యశ్శుచివ్రతాః।
వయః పయఃప్రదానేన యూయమంజ స్తరిష్యథ॥ ౧౧
లక్ష్మీర్మాధా భవే త్తత్ర మత్సే వోత్సుకమానసా॥ ౧౧½

తత స్తే స్వస్థమనసో జ్ఞాత్వారామం రమాయుతం ॥౧౨
1 దివ్యజ్ఞానోపపన్నా స్తే రామం దృష్ట్వా మహర్షయః।
అభ్యగచ్ఛం స్తథా ప్రీతా వైదేహీంచ యశస్వినీమ్॥ ౧౩
మంగళానిప్రయుంజానాఃప్రత్యగృహ్ణన్ దృఢవ్రతాః౧౩½

మూలంపుష్పంఫలం వన్య మాశ్రమం చ మహాత్మనః॥౧౪
నివేదయిత్వా ధర్మజ్ఞా స్తతః ప్రాంజలయోఽబ్రువన్ ౧౪½

తే వయం భవతారక్ష్యాః భవద్విషయవాసినః
నగరస్థో వనస్థో వా త్వం నో రాజా జనేశ్వరః॥ ౧౫½

---

తస్మాత్తు మద్వరేణాపి ద్వాపరాంతే భవిష్యథ।
మనోరథం కరిష్యామి భవతాం వాంఛితం పర మితి॥

---

1 వాల్మీకి రా. ౧ స.



౧౦-౧౧-౧౧½ శ్రీరామచంద్రుడనుచున్నాడు:— శ్రీకృష్ణావతారమున మీకోర్కె తప్పక నీడేరును మునులారా మీరాకాలమున గోపికలు కండు మునిపత్నులు గోవులయ్యెదరుగాక గోపికలు పయస్సును గోవులుపయస్సును సాకర్పించి కృతార్థులయ్యెదరు. రూపముధరించిన నాసేవరయే ఈ యాదిలక్ష్మి ఆకాలమున వృషభానుకలావతులకు రాధాదేవియను పుత్రికయై జనించును అనెను.

౧౨-౧౩-౧౩½ అంత వారు మనస్స్వాస్థ్యతగలవారై దివ్యదృష్టి బలముచే దుష్టులగు రావణాది రాక్షస సంహారమునకును శిష్టులగు మహర్షులననుగ్రహించుటకును అవతరించి పితృాజ్ఞను నిమిత్తముగ చేసికొని బయలుదేరిన భగవంతుడని తెలసికొని వారల ముప్వురనుజూచి సంతసించినవారై తమతమ యాశ్రమములకు తోడ్కొని బోవుటకై ఎదురేగి మంగళాశాసనముల జేయుచు తమవెంట నిడుకొని పర్ణశాలలందుపచారముల నొనరించిరి.

౧౪-౧౪½ అట్లామునులు వనమందుగల కందమూలములు ఫలములు తపోధనధాన్యములతో కూడిన తమ యాశ్రమములు శరీరములు సహితము నివేదించి ప్రాంజలులై ఇట్లు పల్కిరి.

౧౫½ దుఃఖపీడితులమగు మమ్ము నార్తత్రాణ పరాయణుడవగు నీవు తప్ప రక్షించువారెవరు మఱియును నీరాజ్యమందున్న మమ్ము రక్షింపక మీకుతప్పును గాన మేము నీచే రక్షింపబడదగినవారము (నేను రాజ్యమునను‌న్నగదా రక్షించుట యనకుము, నగరమున సింహాసనమందున్నను ఘోరాటవియందున్నను స్వతస్సిద్ధముగు శక్తిగల నీవే మాకు రక్షకుడవు.)

---

మగు శ్రీరామాఖ్యచే చెన్నారు దేహమని జెప్పుటయేగాక 28 వ ద్వాపరమున మీకీఫలమిత్తుననెను.

స్యస్తదండావయం రాజన్ జితక్రోధా జితేంద్రియాః॥
రక్షితవ్యా స్త్వయా శశ్వద్గర్భభూతాస్తపోధనాః॥ ౧౬॥

ఏవముక్త్వా ఫలై ర్మూలైః పుష్పైర్వన్యైశ్చ రాఘవం॥౧౭
* అన్యైశ్చ వివిధాహారై స్సలక్ష్మణ మపూజయన్॥ ౧౭॥

[1] కృతాతిథ్యోఽథ రామస్తు సూర్యస్యోదయనం ప్రతి౧౮
ఆమంత్ర్య స మునీన్ సర్వాన్ వన మేవాన్వగాహత॥౧౮॥
[2] నానామృగగణాకీర్ణం సింహవ్యాఘ్రాదిభీషణం।
రాక్షసై ర్ఘోరరూపైశ్చ సేవితం రోమహర్షణం॥ ౧౯॥
ప్రవిశ్య విపినం ఘోరం రామో లక్ష్మణ మబ్రవీత్।౨౦

---

* అన్యైరితి-అన్యైః సంకల్పసిద్ధైః। వివిధాహారైః= మృష్టాన్నాదిభి రిత్యర్థః॥

---

1 వాల్మీకి రా. ౨ స॥ 2 అధ్యాత్మ రా ౧ స॥



౧౬ ఓ శ్రీరామచంద్రా మేము మీదర్శనభాగ్యమబ్బుటకై ఇంద్రియములను జయించితిమి గాన కోపమెంచుటెట్లో మఱచితిమి. అందుచే హింసకులగు రాక్షసుల శాపముచే దండింపలేకున్నారము తపోధనులు నీవిరాడ్దేహమునకు గర్భప్రాయులుగదా అంగప్రాయులగు రాక్షసుల ఖండించి నీహృదయమును గాపాడుకొనుము.

౧౭ ఇట్లు మునులు శ్రీరామచంద్రుని ప్రార్థించి పుష్పమాల ఫలాదులచే తమ తమ తపోమహిమచే కల్పించిన నానావిధ మృష్టాన్నముల చేత సీతారామ లక్ష్మణులను పూజించి (లక్ష్మణుడు మాత్ర మారగించుటలేదని జ్ఞప్తియుంచుకొనవలయును.)

౧౮-౧౯-౨౦ అంత శ్రీరామచంద్రుడామునులచే నాతిథ్యముగొని యారాత్రి సుఖముగాగడిపి మరునాడు ప్రాతఃకాలమున స్నానాదుల నాచరించి మహర్షులచే ననుజ్ఞపడసి సీతాలక్ష్మణులతో సింగములు పులులు భయంకరాకారులగు రాక్షసులచే సేవింపబడి ఘోరమై గగుర్పాటు గల్గించు మహారణ్యమును ప్రవేశించి లక్ష్మణునిజూచి ఈ విధముగ ననెను.

---

* ౧౭ శ్లోకమునగల అన్యైః అను శబ్దమునకు సంకల్పసిద్ధములైన అనియు వివిధాహారైః అనగా మృష్టాన్నములని అర్థము.

ఇతః పరం ప్రియత్నేన గంతవ్యం సహి తేన మే॥ ౨౦౹

ధనుర్గుణేన సంయోజ్య శరానపి కరే దధత్
అగ్రే యాస్యామ్యహం పశ్చాత్త్వమన్వేహి ధనుర్ధరః॥ ౨౧౹

♦ ఆవయో ర్మధ్యగా సీతా మాయే వాత్మపరాత్మనోః।
చక్షుశ్చారయస్సర్వత్ర దృష్టం రక్షోభయం మహత్ ౨౨౹

1 ఇత్యుక్త్వా సీతయా సార్థం లక్ష్మణేన సమన్వితః।
రాఘవః ప్రయయావగ్రే పాలయన్ భూతభౌతికాన్ ౨౩౹

సీతా చచార రఘునందనపాదయుగ్మవిన్యాసదేశ మ
పహాయ వనస్థలీషు। శ్రీలక్ష్మణ స్తదుభయాంఘ్రి
సరోరుహాంక దేశప్రదక్షిణతయా విచచార పృథ్వీం॥ ౨౪౹

---

♦ అగ్రే యాస్యామీత్యత్ర ప్రణవార్థో నిరూప్యతే।
అకారవాచ్యో రామః ఉకారవాచ్యా సీతా, తయోః పృష్ఠతః
మకారవాచ్యశ్చేతనో జీవో లక్ష్మణ ఇతి॥

తేషాం మధ్య ఉకారో ఽ నన్యార్హం నియమయతి
సంబంధ మనయోరితి॥

---

1 యాజ్ఞవల్క్య రామాయణం.



* ౨౦౹-౨౧౹-౨౨౹ లక్ష్మణా ఇకమీద పూనికతో నేను మీ ఇద్దరుగలసి ప్రయాణము చేయవలెను గాన ధనువును మోపెట్టి బాణములను చేబూని నేను ముందు నడచెదను. నీవు నట్లే చాప బాణధారివై వెనుకరమ్ము. ఆత్మ పరాత్మలకు నడుమనున్న మాయ వలె నీ సీత మన ఇద్దరి మధ్యన రాగలదు. నలువైపులను నీ దృష్టిని ప్రసరింపుము. రాక్షసులవలని భయమీవనమున గలదను టకు గుర్తులగుపడుచున్నవి.

౨౩౹ శ్రీరామచంద్రుడిట్లు లక్ష్మణునితో చెప్పి సీతను తనవెంట నడువ నియోగించి ఆవెంట లక్ష్మణుడు నడువ సర్వభూత భౌతికముల పరిపాలించుచు తాను ముందుగా నడువ సాగెను.

౨౪౹ [శ్రీరాముల గమన విశేషము వర్ణింపబడుచున్నది) శ్రీ రామచంద్రుని పాద విన్యాస ప్రదేశములను తప్పించి తత్పార్శ్వ మందు సీత తనపాదముంచుచు నడచుచుండెను. భక్తాగ్రగణ్యుడగు శ్రీ లక్ష్మణుడును సీతారాముల పాదపద్మములకు వలగొనువాని వలె వాటికి దక్షిణపు ప్రైపున తనయడుగిడుచుండెను అట్లాయరణ్య సీమ నెక్కడజూచినను వరుసగ మూడడుగులు గాన వచ్చుచుండెను.

---

* ౨౧౹ శ్లోకవివరము ॥ శ్రీరాముడు ముందునేనును మధ్య సీత పిమ్మట లక్ష్మణుడనుటలో ప్రణవార్థము నిరూపించి నట్లైనది అకారవాచ్యుడు శ్రీరాముడు ఉకారవాచ్యమైనది సీత వారి వెనుక మకారవాచ్యుడగుటచేతను జీవుడగు లక్ష్మణుడని వీరిద్దరకు ఉకారవాచ్యమైన సీతయు మాయాసంబంధము సూచించుటలో శ్రీరాముడను నాత్మకు స్వాధీనమై మాయయను సీతయుండుననియు జీవుడను లక్ష్మణునకు నియామకురాలై మాయయను సీతయుండుననియు తెలియుచున్నది.

ధన్యాహ మితి మెనే భూ రామాంఘ్రిస్పర్శ తస్స్వయం
తద్దర్శనాదహృష్యంత వనాద్రిమృగపక్షిణః ౨౪

శ్రాంతాం సీతాంవిలోక్యాఽహ రాఘవస్సస్మితం వచః ౨౫

[2]హస్తేన హస్త మవలంబ్య నిజేన మే త్వం నిశ్శంకమే
హి విషమోఽయమరణ్యదేశః। ఏతాసుమాస్ఖల శిలా
సు విలంఘ్య, నిమ్నమాయాహి కంటక మవేక్ష్య పదం
నిధేహి॥ ౨౬

ఇత్యుక్త్వా సస్మితో రామో భూదేవీంపాహిలీలయా॥ ౨౭

[1]అరుణదళ మృణాలస్నిగ్ధ పాదారవిందా।
కఠినతర ధరణ్యాం యాత్యకస్మాత్స్ఖలంతీ।
అవని తవ సుతేయం పాదవిన్యాసదేశే
త్యజ నిజకఠినత్వం జానకీ యాత్యరణ్యాం॥ ౨౮

2 దుర్వాసరామాయణం.

1 హనుమద్రామాయణము.



౨౪ ఆ సమయమున భూదేవి? తనకీ భాగ్యములభించినందున ధన్యురాలననుకొనుచుండెను. ఆ శ్రీరామచంద్రుని దర్శించి వృక్షములు, పక్షులు, మృగములు నానంద పారవశ్యత నెందు చుండెను.

౨౫ వన ప్రచురదేశమున నడువలేక బడలిన జానకిని జూచి శ్రీరామచంద్రుడిట్టులనెను.

౨౬ ఓ సీతా నీ కరకిసలయమున నాబాహుదండ మూతగాగొని ధైర్య మవలంబించి నడువుము. ఇచ్చటి మార్గప్రదేశము మిఱ్ఱుపల్లములు గను. శిలామయముగ నున్నది గావున జాగ్రతగా నడువవలయును, ఈ శిలయందు గ్రహము తూలిపడెదవేమో, ఏత్తైన ఈరాతి నెక్కజాలవు ఆటుతిరిగిరమ్ము. క్రిందజూచుచు ముండ్లులేని ప్రదేశమున నడుగిడుము.

౨౭ ఇట్లు శ్రీరామచంద్రుడు సీతను గారవించుచు మార్గశ్రమాపనోదన మగులాగున విలాసముగ తనమోమున చిరునగవంకురింప భూమిని గూర్చి సీత కర్ధమగులాగున నీ క్రింది విధముగ ననుచున్నాడు.

౨౮ ఓ భూమిదేవి! ఈ జానకి లేదామర తూడుల ననుకరించిన మృదులములగు పద్మములవలె సుకుమారతమమగు తనపాదములచే కఠినతరమగు నీయరణ్య ప్రదేశమున శ్రమచే సోలుచు నడచు చున్నది (మేము నీకు దూరబంధువులమైన కారణమున మాపాదములకు కాఠిన్యమసై తోచినను) నీకు పుత్రికయగు ఈ సీత పాదములుంచు ప్రదేశమందైనను నీదగు కాఠిన్యము త్యజింపుమనెను. (దీనివలన సీత వలదన్నను కాఠిన్యమూని తనవెంట వనమునకు వచ్చెననియు ఈ బుద్ధి సీతకు తల్లివగు నీవలన నేర్పడినదనెడి ధ్వని గలదు) యిదియే అన్యాపదేశము.

సీతాపి రామ మాలోక్యస్మిత్వా వచన మబ్రవీత్॥

పదకమలరజోభిర్ముక్తపాషాణదేహా

మలభత యదహల్యాం గౌతమోధర్మపత్నీం।

త్వయి చరతి విశీర్ణగ్రావ మార్గప్రదేశే

కతికతిభవితార స్తాపసాదారవంతః॥ ౩౦

²శ్రుత్వాసీతాం విలోక్యాహ రాఘవ స్సస్మితం వచః

హలకర్మణి సంప్రాప్తే స్త్రీణా ముద్ధరణం కుతః॥ ౩౧

సీతా॥పాయసప్రాశనాజ్జాత పురుషార్థం తథాభవత్॥ ౩౨

³ఇత్యేవం భాషమాణౌ తౌజగ్మతు స్సార్ధయోజనమ్ ౩౩

2 దేవీరామాయణం. 3 అధ్యాత్మ రా ౧ స॥



౨౯ అదివిని సీత గ్రహించి శ్రీరామునిజూచి ( తాను కాఠిన్యమూనుట లోకోపకారార్థమని ధ్వనించులాగున ) చిరునగవు ముద్దుమోమున చిందులాడ నిట్లనెను.

౩౦ నాథా ( ఈ భూమి తనకాఠిన్యమునువదలిన లోకము సుఖించు టెట్లు ఏలయన ) మున్ను మీ పాదారవిందముల నాశ్రయించిన రజస్పర్శచే తనపాషాణత్వమును వీడి యువతియైన యహల్యను గౌతముడు బొంది సుఖించెను. అట్లే ప్రకృతమీశిలామార్గముచే చెన్నారు నీయరణ్యమందు తాము సంచరింప నెందరెందరు తాపస బ్రహ్మచారులు మీయనుగ్రహముచే గృహస్థులు కానున్నారో గదా యనెను (దీనియందీభూమి తనకాఠిన్యమును వీడినవారలకా భాగ్యము లభింపదేమోయని అట్లున్నదిగాని స్వభావముచే నట్లు గాదని ధ్వని ).

౩౧ సీతయనిన భావమును గ్రహించి శ్రీరామచంద్రమూర్తి చమత్కారముగ నవ్వుచు మఱల నిట్లనెను ( పూర్వమట్లే స్త్రీల నుద్ధరింప వలసి వచ్చెను ప్రకృతమున భూమి మృదువైన బాగు ఏలయన) భూమిని దున్నినంతమాత్రమున నీకాలమున స్త్రీలు దొరుకుచుం డిరి గదాయనెను.

౩౨ దానికి సీత సర్వత్ర భూమిదున్నినంతే మాత్రన దొరుకుచురా స్త్రీలు ఒక చోట నపూర్వముగా సంభవించుటకు హేతువేమన పాయసమును ప్రాశన చేసినంతన నొక మహాపురుషుడు జనించినందు వలననేమో యనెను.

౩౩ ఈ విధముగ శ్రీ సీతారాములు చమత్కారముగా మాటలాడు కొనుచు యోజనమున్నర దూరము అనాయాసముగా నడచిరి.

* తత్రైకా పుష్కరిణ్యాస్తే కల్హారకుముదోత్పలైః
అంబుజైశ్శీతలోదేన శోభమానా వ్యదృశ్యత 33

తత్సమీప మథో గత్వా, పీత్వా తత్సలిలం శుభం
ఊషుస్తే సలిలాభ్యాసే క్షణం ఛాయా ముపాశ్రితాః 34

ఇతి శ్రీరామాయణసారోద్ధారే

ఆరణ్యకాండే ప్రథమస్సర్గః.

---

* తత్రైకేత్యాది వచనపర్యాలోచనయా శ్రీరామో దండకారణ్యాంతర్గతవిరాధవనం ప్రావిశదితి జ్ఞాయతే। తదేవ ప్రతిపాద్యతే ద్వితీయసర్గే విరాధవనం (Central Provinces) సెంట్రల్ ప్రావిన్సెస్ ఇత్యుక్తమధ్యప్రాంతే విద్యమాన (Bilaspur) బిలాసపూర్ మండలస్య ఈశాన్యదిక్పర్యంతం వర్తత ఇతి ద్యోత్యతే। శోణానదీదక్షిణతటాత్ దశోత్తర క్రోశదూరే (Bilospur) బిలాసపూర్ నామకపత్తనస్యోత్తరే పంచాశదర్ధ క్రోశదూరే (Amaracatak Hill) అమరకంటక పర్వతాఖ్యయా ప్రసిద్ధప్రదేశే విరాధనిలయ మితి జ్ఞేయం తత్పరితః విరాధవన మితి వ్యవహారః॥



* 33 అచ్చట వికసించిన కలువలు నల్లకలువలు పద్మములు గలిగి అమృత తుల్యమగు శీతల జలంబులచే నొప్పారు మనోహరమగు నొకకొలను వారల కన్నులకు గన్పట్టెను.

34 అంతట వారాకొలని సమీపమునకేగి చల్లని జలంబుల గ్రోలి సేద దీర్చుకొని తత్తీరమున వృక్షచ్ఛాయ గూర్చుండిరి.

ఇట్లు శ్రీరామాయణ సారోద్ధారమున అరణ్యకాండమందు

ప్రథమసర్గము ముగిసెను.

---

* 33 అచ్చట కొలను గన్పట్టెనను వచనముచే శ్రీరామచంద్రమూర్తి దండకారణ్యాంతర్గతమగు విరాధ వనము ప్రవేశించెనని తెలియుచున్నది రెండవ సర్గలోని కథ ఈ విషయమైనదే యగుట వలన ఈవిరాధ వనము సెంట్రల్ ప్రావిన్సెస్ అనగా మధ్య పరగణాల లోగల బిలాసపూరుజిల్లా ఈశాన్యదిక్పర్యంతము వ్యాపించియున్నట్లు తోచెడిని. శోణానదికి దక్షిణమున 110 మైళ్ళదూరమున విలాసపూరుకు ఉత్తరమున 50 మైళ్ళదూరమునగల అమరకంటక పర్వత ప్రదేశమే విరాధుని నిలయము. (అచ్చటనే రావణాసుల జననము) దానిచుట్టియున్న వన ప్రదేశమునకే విరాధవనమని పేరు.

## ద్వితీయస్సర్గః

[1] తతో దదృశురాయాంతం మహాసత్వం భయానకం
కరాళదంష్ట్రివదనం భీషయంతం స్వగర్జితైః॥ ౧
వామాం సేన్యస్త శూలాగ్రగ్రథితానేకమానుషం
భక్షయంతం గజవ్యాఘ్ర మహిషం వనగోచరం ౨
[2] త్రీన్ సింహాంశ్చతురోవ్యాఘ్రాన్ ద్వౌవృకౌపృషతాన్
దశ॥ సవిషాణం వసాదిగ్ధం గజస్యచ శిరోమహాత్ ౩
అవసజ్యాయసేశూలే నినదంతంమహాస్వనం ౩½
[3] సతు దృష్ట్వా రమానాథం। లక్ష్మణం జానకీం। తథా ౪
అట్టహాసం తతఃకృత్వా భీషయన్నిద మబ్రవీత్ ౪½
కౌ యువాం బాణతూణీర జటావల్కలధారిణౌ। ౫
మునివేషధరౌ బాలౌ। స్త్రీసహాయౌ సుదుర్మతౌ॥
సుందరౌ బత. మే వక్త్రి ప్రవిష్టకబలోపమౌ॥ ౬
కిమర్థమాగతౌ ఘోరం వనం వ్యాలనిషేవితం- ౬½

శ్రుత్వా రక్షో వచో రామస్స్మయమాన ఉవాచ తం॥౭

అహం రామస్త్వయం భ్రాతా. లక్ష్మణో మమ సమ్మతః
ఏషా సీతా మమప్రాణవల్లభా వయమాగతాః ౮
పితృవాక్యం పురస్కృత్య శిక్షణార్థం భవాదృశాం ౮½

1 అధ్యాత్మ రా ౧ స॥ 2 వాల్మీకి రా౨॥ 3 అధ్యాత్మ రా ౧ స॥



## రెండవ సర్గము.

౧-౨-౩-౩½ అంతటవారు తమవద్దకు వచ్చుచున్న భయంకరాకారుడగు నొక రాక్షసునిగాంచిరి మఱియు నాతడు నిడుదకోరలు, వే)లాడు నాల్కయు గలిగి తెరువబడిన ఘోరమగు వదనముతో భయంకర గర్జనంబులు జేయు చుండెను వాని ఎడమ భుజమున నున్న శూలాగ్రమున ననేక మనుష్యుల శరీరములు గ్రుచ్చబడి యుండెను మూడు సింహములను నాల్గుపులులను రెండు తోడేళ్ళను పదిచుక్కలుగల జింకలను గ్రుచ్చి దంతములు కలిగి మాంసముతోనున్న ఏనుగుతల నగ్రమున దగిలించుకొని గొప్ప కంఠధ్వనిచే కేకలు వేయుచుండెను.

౪-౪½ ఆ రక్కసుడు లక్ష్మీనాథుడగు శ్రీరామచంద్రమూర్తిని లక్ష్మణుని జానకిని జూచి వెడనవ్వుచే బెదరించుచు ఇట్లు పలికెను.

౫-౬-౬½ (పరస్పర విరుద్ధములగు) బాణ తూణీరములును జడలును నారచీరెలును ధరించి బాల్యముననే మునివేషములు బూని స్త్రీని వెంటనిడుకొనియున్న మీరలెవ్వరు మీరు మిక్కిలి చక్కని వారలు నానోటికి మృదులమగు కబళము వంటివారు ఇట్టి మీరలీ భయంకరమై క్రూరమృగ సేవ్యమై రాక్షసావాసమగు నీయరణ్యమున కేల వచ్చితిరనెను.

౭ ఆమాటవిని శ్రీ రామచంద్రుడలక్ష్యముతో చిరునవ్వు నవ్వుచు బదులు పల్కెను.

౮-౮½ నేను శ్రీరాముడనువాడను ఇతడు లక్ష్మణుడు నా మూర్మి తమ్ముడు ఈవిడ నా ప్రాణప్రియయగు సీత మేము పితాజ్ఞను నిమిత్తముగా జేసికొని నీ వంటి దుష్టాత్ముల శిక్షించుటకై ఈ యరణ్యము జేరితిమి.

శృత్వా తద్రామవచన మట్టహాసమథాఽకరోత్
వ్యాదాయ వక్త్రం బాహుభ్యాం శూలమాదాయ సత్వరః ౯½

మాం నజానాసి రామ। త్వం విరాధం లోకవిశ్రుతం॥ ౧౦
మద్భయాన్మునయస్సర్వే త్యక్త్వా వనమితో గతాః
యది జీవితుమిచ్ఛాస్తి త్యక్త్వా సీతాం నిరాయుధౌ॥ ౧౧
పలాయతం నచేచ్ఛీఘ్రం భక్షయామియువామహం॥ ౧౧½

1 రక్షసాం బలవాన్రాజా తతోఽపి ప్రథమః ఖరః
తతోఽపి లవణ స్తస్మాదప్యహం కోఽస్తి మే సమః॥ ౧౨½

ఇత్యుక్త్వా రాక్షస స్సీతా మాదాతు మభిదుద్రువే॥ ౧౩
అస్యావియోగా త్ప్రేయస్యా రామోహాస్య తిజీవితం॥
సౌమిత్రి రపిచ భ్రాతుః ఖరస్యేచ్ఛ్టం చ సిధ్యతి॥ ౧౪
ఇతి నిశ్చిత్య మనసి పూర్వపుణ్యవిశేషతః॥ ౧౪½

*2 సకృత్వా భైరవనాందం చాలయన్నివ మేదినీం॥ ౧౫
అంకేఽనాదాయ వైదేహీమపక్రమ్య తతోఽభవీత్ ౧౫½

॥సకృత్వేతి॥ సకృత్వేత్యాది శ్లోకపంచకేన విరాధః రామలక్ష్మణయోస్సకాశాత్ తా వనాదృశ్య సీతా మపాహరదితి యద్యపి ప్రతిపాద్యతే స్థూలదృష్ట్యా తథాపి పరమార్థదృష్ట్యా విచార్య మాణే తదేవ శ్లోకపంచకం ఏత

1 దుర్వాస రామాయణము 2 వాల్మీకి రా ౨ స॥



౯-౯½ అమాటవిని రాక్షసుడట్టహాసముజేసి తన భుజమునన్న శూల మిరుకేలంబూని శ్రీరామచంద్రునితో విపులమైన నోరు తెరచి ఇట్లనెను.

౧౦-౧౧-౧౧½ శ్రీరామచంద్ర లోక ప్రసిద్ధుడను విరాధుడనినను నీ వెరుంగవు కాబోలును నా భయమువలన నివసమునుండు మును లందరును దీని విడచి పోయిరి మీకు బ్రతుకుటయందిచ్ఛగలదేని ఈ సీతను విడచి నిరాయుధులై ఎటకేని బరుగిడుడు లేనియడల మీ ఇద్దరను భక్షింతును.

౧౨½ రాక్షస జాతిలో బలవంతుడు రావణుడు అతనికంటె ఖరు డధికుడు వానిమించినవాడు లవణాసురుడు వారందరిని మించిన బలశాలినై నే నసమానుడనై ఈయరణ్యమందుండెదను.

౧౩-౧౪-౧౪½ అని ఈవిధముగా విరాధుడు పలికి సీతను పట్టుకొ నుటకై పరుగిడెను అతని ఉద్దేశమిది నేనీరాముని సాధించుటకై ఖరునిచే ప్రేరేపింప బడితిని ఈసీతను శ్రీరాముని సన్నిధినుండి తొలంగించిన భార్యా వియోగవేదనచే శ్రీరాముడంత మొందును భాతృదుఃఖముచే లక్ష్మణుడంతరించును. దాన నాయజమాను డగు ఖరుని కోర్కె సిద్ధించును అని పూర్వపుణ్య విశేషమువలన శ్రీరామచంద్రునిచే చచ్చుటకై ఈ బుద్ధి యాతనికి జనించెను.

* ౧౫-౧౫½ అంత నావిరాధుడు కేకలువైచుచు భూమిని గడగడ లాడించుచు సీతసమీపమునకు వచ్చి రామలక్ష్మణుల కడ్డముగ నిల్చి వారలతో నిట్లనెను.

* ౧౫ శ్లోకార్థ వివరణము॥ అంత నావిరాధుడు అనుచోట ది ఐదు శ్లోకములచేత విరాధుడు రామలక్ష్మణుల వద్దనున్న సీతను వారల ననాదరముజేసి. అపహరించెనని స్థూలదృష్టివలన తెలియుచున్నను. పరమార్థము విచారించిజూచిన నాశ్లోకములు తద్వ్యతిరేకార్థమును తెలియ జేయకమానవు అట్లు గూఢముగ శ్రీ వాల్మీకిమహర్షి ప్రతిపాదించుట శ్రీమద్రామాయణ ముత్తమకావ్యమగుటవలన ధ్వని

ఇయం నారీ వరారోహా మమ భార్యా భవిష్యతి॥ ౧౬

యువయోః పాపయోశ్చాహం పాస్యామి రుధిరం మృధే ౧౬½

తస్యైవం బ్రువతో ధృష్టం విరాధస్య దురాత్మనః॥ ౧౭
శ్రుత్వా సగర్వితం వాక్యం సంభ్రాన్తా జనకాత్మజా ౧౭½

ద్విరుద్ధతయా యథార్థమపి నద్యోతయతీతి న విరుద్ధార్థప్రతిపాదకత్వే నాపి వాల్మీకేర్వర్ణనం తత్కృతగ్రంధస్యోత్తమకావ్యరూప శ్లేషానుప్రాసాదిభిః

చమత్కారాభిప్రాయేణైవ ఇతరార్షగ్రంథేషు పరిదృశ్యమానతాత్పర్యావిరోధేన శ్లోకపంచకానాం ఏవమర్థో వర్ణనీయః॥ తథా హి. తతస్స విరాధః అట్టహాసం కృత్వా ॥అంకే॥ సమీపే ఆగత్యేతి శేషః వైదేహీం అనాదాయ అపక్రమ్యాబ్రవీత్ రామలక్ష్మణా వితి శేషః కించ॥ ఇయం నారీ వరారోహా మమ భార్యా భవిష్య తీత్యత్ర భయా కాంత్యాఆర్యాపూజ్యాశ్రేష్టా ఇయం నారీ యువయోః కా భవిష్యతీతి తావబ్రవీదితి పూర్వేణ సంబంధః మమ పాపయో పాపాభ్యాం హస్తాభ్యా మితి శేషః ఋషిమాంసాని భక్షయన్ సాయుధో మృధె రుధిరం పాస్యామీత్యర్థః తథా విరాధె బ్రువతి సీతా ప్రావేపత॥ అత్రసీతాయా ఉద్వేగకారణం విరాధే పరిదృశ్యమానా ఆసురీసంపత్తిరేవఆసురస్వభావస్యదైవసంపద్బహిర్భూతస్య ఇష్టదేవతావైముఖ్యకారణత్వాత్ పునశ్చాత్ర విరాధేన సీతాగ్రహణార్థ మాగమనం



౧౬—౧౬½. కాంతిచేతనే పూజ్యురాలును, ఉత్తమాసనములం దధిష్ఠింపదగిన ఈ స్త్రీ మీకేమికావలయును మఱల చెప్పుడు. యుద్ధమందు పాపులగు మీ ఇర్వురి రక్తమును నా హస్తములచే త్రాగదలచుచున్నాననెను.

౧౭—౧౭½. గర్వముచే నిట్లు ప్రేలుచున్న విరాధుని మాటలు విని జానకి మిగుల భయపడెను.

పరిధానముచే శ్లేషానుప్రాసాది చమత్కారముల గవంబరచుట కని తెలియవలయును తక్కుంగల యార్ష రామాయణాదులు ఇతిహాసాది లక్షణ యుక్తములుగాన ఈ ప్రదేశమందు స్పష్టముగ నిర్ణయించినవి తద్విరోధంబుగాకుండునటుల నా శ్లోకపంచకమున కీవిధముగనర్థము నిర్ణయింపవలయును. అంత విరాధుడట్టహాసముజేయుచు (అంకేనాఽదాయ వైదేహీం) అంకమనగ సమీపమునకువచ్చి యని శేషము వైదేహిమనాదాయ జానకినివదలి. (అపక్రమ్య) అడ్డమువచ్చి రామలక్ష్మణులకని యర్థము ఇట్లనెను. (ఇయం నారీ వరారోహామమ భార్యాభవిష్యతి) అనుచోటగల భార్యాశబ్దమునకు భయా కాంతిచేతనే- ఆర్యా- పూజ్యురాలని యర్థము గాన- ఈపూజ్యురాలు మీకేమి కావలయునని తాత్పర్యము (మమపాపయోః) మమనా- (పాపయోః పాపాభ్యాం) హస్తముల చేతయని యర్థము మీఇర్వురిరక్తమును పానముజేసెదను అట్టి విరాధుని మాటలకు-సీత మిక్కిలి శ్రమజెందెను. ఇచ్చట సీత శ్రమజెందుటకు విరాధునియందు గల అసురసంపదయే కారణము.లోకమున దేవిని రెండు విధములుగ సేవించెదరు. అందు కొందరు దైవీసంపత్స్వభావమున శివశక్త్యాత్మకమీ జగము గాన శక్తియందే పురుషత్వము భావింతురు. ఇతరు లాసురసంపదచే మోహితులై,పురుషు డనావశ్యమనియు, లేక అస్వతంత్రుడనియు భావించి కేవల ప్రకృతిని మాత్రమే పూజింతురు. ఇట్టి ఆ సురసంపత్స్వభావము గల్గి దైవసంపదానర్హులకు ఇష్టదేవతా వైముఖ్య మేర్పడును. విరాధు డట్టివాడు గాన సీతా వైముఖ్య మచ్చట చేర్కొనబడినదని భావము. ఇచ్చట విరాధుడు సీతా

తాం దృష్ట్వారాఘవస్సీతాం విరాధాంకగతాం శుభాం ౧౮
అబ్రవీల్లక్ష్మణం వాక్యం ముఖేన పరిశుష్యతా॥ ౧౯

---

స్వాఘౌఘపరిహారార్థమేవనతుదారబుధ్యా॥ తదుక్తం స్కాందే శ్లో॥ సోఽపితాం జానకీదృష్ట్వా శీఘ్రం సంజాతవిక్రమః॥ ఇయం నారీ పరాశక్తి స్సేయం స్వర్గస్య కారణం అస్యావిభోధే మోక్షేపికారణం బంధనేపిచ తస్మాదిమాం భజిష్యామి దిష్ట్యా ప్రాప్తంహి దర్శనం ఇతిదర్శనమాత్రేణ విముక్తాఘౌఘపంజరః ॥ఇతి॥ తామితి విరాధాంకే విరాధస్య సమీపే ప్రవేశితాంస్థితామిత్యర్థః ఏవంభూతాం సీతాందృష్ట్వా పరిశుష్యతాముఖే నోపలక్షితా సీతాభీత్యేతి శేషః ॥ అబ్రవీత్ లక్ష్మణం ప్రతిశ్రీరామఇత్యర్థః అద్యేతి॥ నను పూర్వంకైకేయీముద్దిశ్య శ్రీరామేణ మమ మాతాయవీయ సీత్యుక్తం కథమిదానీం మధ్యమేత్యుచ్యతే॥ సత్యం కౌసల్యా సుమిత్రాభ్యాం కనీయసీ కైకేయీ అన్యాసాం ధశరథ స్త్రీణాం జ్యాయసీత్వం॥ త్రిశతంపంచాశచ్చ దశరథ పత్న్యస్సంతీతి పూర్వమే ప్రోక్తం। అతస్సర్వ ధశరథ పత్న్యపేక్షయా మధ్యమాత్వ మిత్యుభయాత్మకతావిద్యత ఇత్యు భయ నిర్దేశః॥

పతిపరస్పర్శాత్తు పరస్యసమీపా గమనాదిత్యర్థః స్పర్శ నిర్ణయేయుగం యుగద్వయం చేతిపరాశరేణ ప్రతిపాదితః

విరాధః విగతారాధనః॥ దురారాధ్య ఇత్యన్వర్థ సంజ్ఞః॥



౧౮–౧౯. అట్లు విరాధుని సమీపమున తాత్కాలికము వాడిన ముఖముతోనున్న మంగళకారియగు సీతను జూచి శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో నీవిధముగ ననెను.

---

గ్రహణార్థము వచ్చుట తన పాపపుంజ పరిహారముకొరకుగాని, కామముచేతగాదు. ఈ విషయమై స్కాందమందు స్పష్టముగ జెప్పబడినది. ఎట్లనిన విరాధుడు జానకిని జూచినవెంటనే జ్ఞానోదయము గల్గుటచే ఈమె పరాశక్తియనియు, స్వర్గమోక్షజ్ఞానముల కీమెయే కారణమనియు, బాగుగ దెలసికొని నాయదృష్టమున నాకీమె దర్శనము లభించెను గాన నీమెనుభజించి కృతార్థత జెందుదమనుకొనెను. ఇంతియగాక ఇతడు పూర్వమున తుంబురుడను గంధర్వుడైయుండి కుబేరుని శాపమున రాక్షసుండయ్యె గాన సీతనికి వైరాగ్యమొదవుట సంతతమేయగును. (తాందృష్ట్వా రాఘవస్సీతాం విరాధాంకగతాం) అనగ అట్లు విరాధుని సమీపమందున్న సితను శ్రీరాముడు జూచి యని యర్థము. (ముఖేనపరిశుష్యతా) వాడిన ముఖముతో, అనగా శ్రీరాము డట్టిముఖముగలవాడైయను అర్థముగాదు. వాడినముఖముతోనున్న సీతను శ్రీరాముడు జూచి లక్ష్మణునితో నిట్లు లనెనని యర్థము. (అద్యేదానీంసకామాసాయామాతామ మమధ్యమా యనుచోట) పూర్వము శ్రీరామచంద్రమూర్తి కైకేయిని కడగొట్టు తల్లియని నిర్దేశించి ప్రస్తుతము మధ్యమజననియనుటకు కౌసల్యా సుమిత్రల నుద్దేశించి కడగొట్టు తల్లియనియును, దశరథపత్నులందరి నుద్దేశించి మధ్యమమాతయనియును, శ్రీరామవాక్యమున కర్థమని తెలియవలెను. దశరథునికి మూడునూర్ల ఏబదిమంది భార్యలని పూర్వమే జెప్పబడినది. (పరస్పర్శాత్తు) అనగ పరుడు సీత సమీపమునకు వచ్చుటవలన యని యర్థముగాని, కేవల స్పర్శగాదని గ్రహింపవలయును. స్పర్శవిషయమై పరాశరాది మహర్షులచే నిర్ణయింపబడిన [యుగంయుగద్వయ] మను రీతియని యర్థముజేసుకొనిన సమీపమని తేలును.

* విరాధుడన, విగతారాధనుడు అపూజ్యుడని అన్వర్థనామధేయము

యయాహం సర్వభూతానాం హితః ప్రస్థాపితో వనం॥ ౧౯

అద్యేదానీం సకామా సా యా మాతా మమ మధ్యమా।
పరస్పర్శాత్తు వైదేహ్యా న దుఃఖతర మస్తి మే॥ ౨౦
పితుర్వియోగాత్సౌమిత్రే స్వరాజ్యహరణాత్తథా॥ ౨౦½
అబ్రవీల్లక్ష్మణః క్రుద్ధో రుద్ధో నాగ ఇవ శ్వసన్॥ ౨౧
అనాథ ఇవ భూతానాం నాథ స్త్వం వాసవోపమః॥
మయా ప్రేష్యేణ కాకుత్స్థ కిమర్థం పరితప్యసే॥ ౨౨
శరేణ నిహతస్యాద్య మయా క్రుద్ధేన రక్షసః
విరాధస్య గతాసోర్హి మహీ పాస్యతి శోణితం॥ ౨౩
1 తమువాచ విరాధస్తు రామం సత్యపరాక్రమం॥ ౨౩½
పుత్రః కిల జయస్యాహం మమ మాతా శతహ్రదా॥ ౨౪
విరాధ ఇతి మామాహుః పృథివ్యాం సర్వరాక్షసాః॥
తపసా చాపి మే ప్రాప్తా బ్రహ్మణో హి ప్రసాదజా ౨౫
శస్త్రేణా వధ్యతా లోకేఽచ్ఛేద్యాభేద్యత్వమేవ చ॥ ౨౫½
తం రామః ప్రత్యువాచేదం కోపసంరక్తలోచనః। ౨౬
క్షుద్ర ధిక్త్వాంతు హీనార్థం మృత్యుమన్వేషసే ధ్రువం ౨౬½

తతస్సజ్జం ధనుః కృత్వా రామ స్సునిశితాన్ శరాన్॥ ౨౭
సుశీఘ్రమభిసంధాయ రాక్షసం నిజఘాన హ॥ ౨౭½

1 వాల్మీకి రా ౩ స॥



౧౯. లక్ష్మణా, సర్వభూతములకు హితుడ నగు నన్నరణ్యమునకు పంపిన నా మధ్యమజననియగు కైకేయి యభీష్టము నేడు పరిపూర్తియైనది.

౨౦-౨౦½. సీతను పరపురుషుడు ఆక్రమించినందున నా కిప్పు డొదవిన దుఃఖము తండ్రి మరణసమయమునను రాజ్యభ్రంశ మొదవినప్పుడును గలుగలేదు.

౨౧-౨౨-౨౩. అంత శ్రీరామచంద్రుని జూచి లక్ష్మణుడు అడ్డగింపబడిన త్రాచుపామువలె కోపమున బుసపెట్టుచు, అన్నా, శ్రీరామచంద్రా, సకలలోకములకును నాథుడవై ఇంద్రునివలెనున్న నీవు కింకరుడగు నాతో గూడియుండియు నేల యనాథునివలె పరితపించెదవు. ఇదిగో చూచుచుండుము. నా శరాహతిచే చచ్చిన విరాధుని రక్తము భూమిపానము జేయును అనెను.

౨౩½-౨౪-౨౫-౨౫½. అది విని విరాధుడు సత్యపరాక్రముండగు శ్రీరామునితో ఇట్లనెను. నేను జయుడను వాని పుత్రుడను, శతహ్రద నాతల్లి, విరాధుడని నన్ను లోకము [రక్కసిమూక] వాకొనును. తపోవిశేషమునంజేసి వరప్రభావమువలన నాకు శస్త్రాస్త్రములచే మరణములేదు. నన్ను ఛేదించుటకును భేదించుట కెంతటివారికిని వలనుపడదు. అనెను.

౨౬-౨౬½ అది విని శ్రీరామచంద్రుడు కోపముచేత కన్నవ కెంపుగమర విరాధునితో ఓరీ బాలిశా, హీనకృత్యమున మృత్యువును వెతకుచున్నాడవు నీకిప్పుడు చావు తప్పదు.

౨౭-౨౭½ ఇట్లని శ్రీరామచంద్రుడు ధనువున గుణారోపణముజేసి మంచి పదునుగల బాణసమూహములను శీఘ్రముగ సంధానము జేసి రాక్షసునిమీద వదలెను,

(సవిద్ధోస్యస్య వై దేహిం శూలముద్యమ్య రాక్షసః) ౨౮
అభ్యద్రవతుసంక్రుద్ధస్తదా రామం సలక్ష్మణం॥ ౨౮½
అథ తౌః ప్రాతరా దీప్తం శరవర్షం వవర్షతుః ౨౯
సప్రహస్య మహారాద్రి స్థిసత్వా జృంభత రాక్షసః॥
జృంభమాణాశ్చ తేబాణాః కాయాన్నిష్పేతురాశుగాః ౩౦
♦ స్పర్శాత్తు వరదానేన ప్రాణాన్ సంరోధ్య రాక్షసః॥
స వధ్యమాన స్సుభృశం బాహుభ్యాం పరిరభ్య చ॥ ౩౧
తావారోప్య తతస్స్కంధం రాఘవౌ రజనీచరః॥
విరాధో నినదన్ ఘోరం జగామాభిముఖో వనం॥ ౩౨
తస్యాభిప్రాయమాజ్ఞాయరామోలలక్ష్మణమబ్రవీత్ ౩౨½
యథా చేచ్ఛతి సౌమిత్రే తథా వహతు రాక్షసః॥ ౩౩
అయమేవ హి నః పంథాయే నయాతి నిశాచరః॥ ౩౩½
1 హ్రియమాణౌతు తౌ దృష్ట్వా వైదేహీరామలక్ష్మణౌ ౩౪

ఉచ్చైస్స్వరేణ చుక్రోశ ప్రగృహ్య సుభుజా భుజౌ॥ ౩౪½

మాంహరోత్సృజకాకుత్స్థా నమస్తే రాక్షసోత్తమ॥ ౩౫

---

♦ వరదానేన ఈశ్వర వరదానేన తదుక్తంస్కాందే
శ్లో॥ విరాధోహాటకపురే విధివన్మామపూజయత్। మదను
గ్రహాద్వై శిష్యాదవధ్యస్స సురాసురైరితి॥

---

1 వాల్మీకి రా. ౪ స॥



౨౮-౨౮½ శ్రీరాముని బాణవేదన సహింపలేక విరాధుడు సీతసమీప మునువదలి శూలమును కేలబూని కుపితుడై శ్రీరామలక్ష్మణుల సమీపమునకు బరుగిడి వచ్చుచుండెను,

* ౨౯-౩౦-౩౧-౩౨ అంత నారాక్షసునిమీద శ్రీరామలక్ష్మణులు భయంకర బాణవర్షము కురిపించి శరీరమందు ప్రవేశించులాగున జేసిరి. భయంకరుడగు నావిరాధుడు పెడనవ్వు నవ్వుచు స్థిరుడైనిల్చి ఆవులించి నిక్కి నీల్గినతోడన వానిదేహమందు బ్రవేశించిన బాణములన్నియు వేగమున వెలువడి క్రిందబడెను. ఈశ్వర వరప్రభావమున విరాధుడాబాణవేదన కోర్చి ప్రాణము లొకచో నిల్పుకొని ఎడతెగని బాణవర్షమున కమరుగ తలవంచుకొని బరువిడి శ్రీరామలక్ష్మణులను పట్టుకొని తన భుజములమీద నిడుకొని భయంకరముగ కేకలువైచుచు నరణ్యాభిముఖుడై బోవుచుండెను.

౩౨½-౩౩-౩౩½ ఆరాక్షసు డెచ్చటికి తీసికొనిబోదలచెనో శ్రీరామచంద్రమూర్తి తెలసికొని లక్ష్మణునితో నిట్లనెను, లక్ష్మణా ఇతని నిచ్చవచ్చిన మార్గమును బోనిమ్ము. అదియే మనకును బోవలసిన మార్గము గాన తొందరపడవలదు.

౩౪-౩౪½-౩౫ అట్లా శ్రీరామలక్ష్మణులను మోసికొనిపోవు విరాధుని మంచి చక్కని భుజములుగల సీతచూచి తన చేతులెత్తుకొని గొప్పదైన గొంతుకతో నేడ్చుచు ఓ రాక్షసోత్తమా శ్రీరామలక్ష్మణులను విడచి నన్నైనను హరింపుము.ఇదే నీకు నమస్కారమనెను.(ఇచ్చట తనను హరించిన రామలక్ష్మణులు విరాధునిజంపి తన్ను విడిపించెదరు. వారిని తాను విడిపింపలేనని యభిప్రాయము. నమస్కరించుటకు తాత్పర్యము జీవేశ్వరులను వహించి వాహనమైనందుననని తెలియవలెను.)

---

* శివుడు విరాధునకు వరమిచ్చుట స్కాందమున నీవిధమున గలదు. పూర్వము విరాధుడు హాటకపురమున విధిగ శివుడనగు నన్ను పూజించెను. నాకరప్రభావమున నాతడు సురాసురులకజేయుడై సర్వశస్త్రాస్త్రముల కవధ్యుడయ్యెను.

సర్గ

తస్యా స్తద్వచనం శ్రుత్వా వైదేహ్యా రామలక్ష్మణౌ।
తస్య రౌద్రస్య సౌమిత్రి ర్బాహుం సవ్యం బభంజహ॥

రామస్తు దక్షిణం బాహుం తరసా తస్య రక్షసః॥ 3౬
సంభగ్నబాహుస్సంవిగ్నో నిపపా తాశురాక్షసః॥ 3౭

ముష్టిభిర్జానుభిః పద్భిః సూదయంతౌ తురాక్షసం॥
ఉద్యమ్యోద్యమ్య చాప్యేనం స్థండిలే నిష్పేషతుః॥ 3౮

ఇదం ప్రోవాచ కాకుస్థం విరాధః పురుషర్షభం॥
కౌసల్యా సుప్రజా రామతాతత్వం విదితో మయా॥ 3౯
మయా తు పూర్వం త్వం మోహాన్నజ్ఞాతః పురుషర్షభ॥
వైదేహీ చ మహాభాగా లక్ష్మణశ్చ మహాయశాః॥ ౪౦
అభిశాపాదహం ఘోరాం ప్రవిష్టో రాక్షసీం తనుం॥ ౪౦½
తుంబురు ర్నామగంధర్వ శ్శప్తో వైశ్రవణేన హ॥ ౪౧
ప్రసాద్య మానశ్చ మయాసోఽబ్రవీన్మాం మహాయశాః॥
యధా దాశరథీ రామస్త్వాం వధిష్యతి సంయుగే ౪౨
తదా ప్రకృతి మాపన్నో భవాన్ స్వర్గం గమిష్యసి॥
ఇతి వైశ్రవణో రాజా రంభాసక్తం పురానఘ॥ ౪౩
ఇతో వసతి ధర్మాత్మా శరభంగః ప్రతాపవాన్॥



3౬-3౭ అంత శ్రీరామలక్ష్మణులా దుఃఖపూరితములగు సీతమాటలనువిని సైగజేసి కొనివిరాధుని కుడియెడమ భుజముల నొక్కొక్క క్రుద్ధున ఛేదించి క్రింద పడవైచిరి. అట్లా విరాధుడు తెగిన చేతులుగల వాడై భ్రమించి భూమిపైబడెను.

3౮ అంత నా రామలక్ష్మణులు విరాధుని పిడికిళ్లులు, మోచేతులు, మోకాళులు, పాదముల నెత్తెత్తికొట్టుచు భూమిమీద నలిపివైచిరి.

3౯ మొదలు ౪౩ వరకు. అంత తెలివొంది శ్రీరామచంద్రునితో విరాధుడనుచున్నాడు. లోకజనకుడగు శ్రీరామా! నీవు (బ్రహ్మాదుల ప్రార్థనచే) కౌసల్యయందు జనించినవాడవని ఇప్పటికి తెలిసికొంటిని. పురుషోత్తముడవగు నిన్ను పూర్వ మజ్ఞానవశుడనగు నేను తెలియలేనైతిని. సీతయే మహాలక్ష్మియనియు, లక్ష్మణుడు నీ యంశాత్మకుడగు మహా కీర్తిశాలియగు శేషుడనియు బాగుగ నాకిప్పుడు తెలియుచున్నది. అట్లు నిన్నెరుంగుటచే నన్నును తెలిసికొంటిని. శ్రీరామచంద్రా! నేను క్రూరమగు రాక్షసదేహమును శాపవశమున బడసితిని. నాస్థితిని సుంత వినుము. పూర్వ మేను తుంబురు డను గంధర్వుడను. ఒకప్పుడు రంభాసక్తుడు నగు నన్ను కుబేరు డిట్లు శపించెను. మరల నేనాతని వేడుకొనగా ప్రసన్నుడై తుంబురుడా! కొంతగాలమునకు దశరథ పుత్రులగు శ్రీరామలక్ష్మణులు నిన్ను జంపుదురు. అంత స్వరూపమును బడసి స్వర్గమును చేరుదువని యనుగ్రహించెను.

సర్గ ౧

* అధ్యర్ధయోజనే తాత మహర్షి స్సూర్యసన్నిభః॥ ౪౪
తంక్షిప్రమధిగచ్ఛత్వం స తే శ్రేయో విధాస్యతి॥
అవటే చాపి మాం రామ ప్రక్షిప్య కుశలీ వ్రజ॥ ౪౫
అవటే యేనిధీయంతే తేషాంలోకాస్సనాతనాః॥
రక్షసాంగత సత్వానా మేషధర్మ స్సనాతనః॥ ౪౬

ప్రహృష్ట రూపావివ రామలక్ష్మణౌ విరాధముర్వ్యాః
ప్రదరేని హత్యతౌ। ననందతుర్వ్వీత భయే మహా వనే
శిలాభి రంతర్ద ధతుశ్చరాక్షసం॥ ౪౭

1 తతస్సీతా సమాలింగ్య। ప్రశశంసర ఘూత్తమం॥
తతో దుందుభయోనే దుర్దివిదే వగణేరితాః॥ ౪౮

విరాధకాయాదతిసుందరాకృతిఃవిభ్రాజమానోవిమలాంబరా
వృతః ప్రతప్తచామీకరచారుభూషణోవ్య దృశ్యతాగ్రే
గగనేర విర్యథా॥ ౪౯

* అధీతి - అధ్యర్ధయోజనే - అధికమర్ధం యస్యతద
ధ్యర్ధం తచ్చతద్యోజనంచ - సార్ధయోజన మిత్యర్థః ఇదం
సమీప ప్రదేశ సూచక మేవన తత్వత ఇతి॥

1 అధ్యాత్మ ౧ సర్గః



*౪౪-౪౫-౪౬. తండ్రీ! శ్రీరామచంద్రా! ఇచ్చటికి షుమారు మూడర్ధయోజనముల దూరమున సూర్యసమతేజు డగు శరభంగ మహర్షిగలడు. అత డగ్నిప్రవేశము జేయకమునుపే నీవు శీఘ్రముగ నచ్చటికి బొమ్ము. ఆతడు నీ శ్రేయమున కనుకరించును. రాఘవా! నన్నొక గుంటలోనఁ బూడ్చి ఎటకేని సుఖముగ బొమ్ము. పూడ్చబడిన రాక్షసులకు నిత్యమైన పుణ్యలోకములు గలవని మా శాస్త్రము గాన ప్రాణము విడచిన రాక్షసులను పూడ్చిపెట్టుట పురాతన రాక్షసధర్మము.

౪౭. అంతె పులకించిన శరీరములు గల శ్రీరామలక్ష్మణులా విరాధుని గొప్పదగు నా వనమందు గుంటలో చంపి పూడ్చి రాలచే కప్పి సంతోషించిరి.

౪౮. ఈవిధముగ విరాధుని జంపిన శ్రీరామచంద్రుని జూచి సీత కౌగిలించుకొని విశేషముగ గొనియాడెను. దివమందు దేవతలచే వాయింపబడిన దైదుంభులు (భేరులు) మ్రోగెను.

౪౯. పూడ్చబడిన విరాధుని దేహమందుండి సుందరాకారముగల్గి తేజోవంతుడై, నిర్మల వస్త్రధారియై, ఉత్తమ భూషణ భూషితు డగు నొక దివ్యపురుషుడు ఆకాశమందు సూర్యునివలె బయలువెడలి ముందు నిల్చి ఇట్లని స్తుతించెను.

* ఇచ్చట మూడర్ధయోజనములని సమీపమును బోధించుటకై విరాధుడనెను గాని అంతియ దూరమనుటగాదు. విరాధవనమందు మునులు లేరని ఆతనిచేతనే చెప్పబడియుండుటవలన అని రామాయణ వ్యాఖ్యాతలలో కొందరిమతము.

విరాధ ఉవాచ॥ ఇతః పరంత్వచ్చరణా రవిందయోః
స్మృతి స్సదా మేస్తు భవోపశాంతయే। త్వన్నామసంకీ ౪౯
నమే వవాణీ। కరోతు మేకర్ణ పుటంత్వదీయం॥ ౫౦
కథామృతంపాతుకరద్వయంతే పాదారవిందార్చన
మేవకుర్యాత్ శిరశ్చ తేపాదయుగప్రణామం కరోతు
నిత్యంభవదీయ మేవం॥ ౫౧

శ్రీరామ ఉవాచ.

గచ్ఛవిద్యాధరాఽ శేషమాయాదోషగుణాజితాః।
త్వయామద్దర్శనాత్సద్యో ముక్తోజ్ఞానవతాంవరః॥ ౫౨

రామేణరక్షోనిధనంసుఘోరం శాపాద్విముక్తిర్వరదాన
మేవం విద్యాధరత్వం పునరేవలబ్ధం రామంగృణన్నేతి
నరోఖిలార్థాన్॥ ౫౩

ఇతి శ్రీరామాయణసారోద్ధారే

అరణ్యకాండే ద్వితీయస్సర్గః॥

---



౫౦-౫౧ ఇకమీద సంసార నివృత్తికొరకై నాతలంపు లెల్లప్పుడు నీపాద పద్మములందు నిల్చునట్లు, నావాక్కు నీనామకీర్తన సదా జేయు చుండునట్లు, నాకర్ణములను దినము నీకథాశ్రవణము జేయుచుండు నట్లు, నాచేతులు నీపాదము లెడతెగక పూజించునట్లు, నాశిర స్సెప్పుడును నీ పాదాంబుజంబుల నమస్కరించునట్లు, నా సర్వేం ద్రియము లనవరతము నీ యధీనమందుండునట్లు నన్ననుగ్రహింపుమని భక్తిమీర ప్రార్థించుమన్నా నసెను.

౫౨. అది విని శ్రీరామచంద్రుడు విద్యాధరుడా! నీ యథాస్థానమును జేరుము. నాదర్శనమున నీవు మాయాదోషములైన రజస్తమముల జయించితివి. నీవిక జ్ఞానవంతులలో నుత్తముడవై దేహాంతమున ముక్తినొందగలవని యభయమిచ్చెను,

౫౩. ఇట్లు శ్రీరామచంద్రమూర్తి విరాధుని వధించుట. దాన నాతనికి శాపవిమోచముగల్గుట. అతనికి శ్రీరాము డభయ మొసంగుట. విరాధుడు యథాప్రకారము విద్యాధరత్వమున జెందుట మొదలగు శ్రీరాముని చరితమును కీర్తించిన మనుజుడు సకల పురుషార్థము నొందగలడు.

ఇట్లు శ్రీరామాయణ సారోద్ధారంబున

అరణ్యకాండయందు రెండవసర్గ ముగిసెను.

---

సర్గ

## తృతీయస్సర్గః

1 విరాధేస్వర్గతే రామోలక్ష్మణేనచ సీతయా
* జగామశరభంగస్యవనం సర్వసుఖావహం॥ ౧

2 సహసంభాషమాణేతు శరభంగేనవాసవే అసంస్పృశం
తంవసుధాంద దర్శవిభుధేశ్వరం॥ ౨

హరిభి ర్వాజిభిర్యుక్తమంతరిక్షగతంరథం।
దృష్ట్వాశతక్రతుంతత్రరామోలక్ష్మణమబ్రవీత్॥ 3

ఇమేచ పురుషవ్యాఘ్రాయేతిష్ఠంత్యభితోరథం॥
శతం శతం కుండలినో యువానః ఖడ్గపాణయః॥ ౪
రూపం బిభ్రతి సౌమిత్రే పంచవింశతివార్షికం॥
ఏతద్ధి కిల దేవానాం వయోభవతి నిత్యదా॥ ౫

* జగామేత్యాదినా శ్రీరామోశరభంగాశ్రమమాగతవానిత్యవగమ్యతే॥ స ఆశ్రమశ్చామరకంటకపర్వతాన్నైఋత్యాం అష్టచత్వారింశార్ధక్రోశదూరే వరీవర్తి స ఇదానీం (Macal range) మేయికాల్ పర్వతప్రాంతే (Serangapure) శరంగపూరు నామ్నా వ్యవహ్రియతే। శరభంగో నామ గౌతమకులోత్పన్నబ్రహ్మర్షిః తస్యాశ్రమః శ్రీమహాభారతే వనపర్వణి ౨౭ అధ్యాయే ౪౬ శ్లోకే ప్రతిపాదితరీత్యా గోదావరీపూర్వతటేవర్తత ఇతి జ్ఞాయతే॥

1 అధ్యాత్మ రా ౨ స॥ 2 వాల్మీకి రా ౫ స॥



## మూడవ సర్గము.

* ౧ అట్లా విరాధుడు స్వర్గముచేరిన పిమ్మట శ్రీరామచంద్రమూర్తి సీతాలక్ష్మణులతో నటనుండి సర్వసుఖముల నిచ్చు శరభంగాశ్రమమునకు ప్రయాణముజేసెను.

౨. శ్రీరామచంద్రుడు శరభంగుని యాశ్రమముచేరి శరభంగునితో సంభాషించుచున్న మహాపురుషుని జూచెను. ఆతని పాదములు భూమిని స్పృశింపకున్న కారణమున దేవేంద్రునిగ శ్రీరాముడు గ్రహించి.

3 పచ్చని గుఱ్ఱముల బూన్చి యంతరిక్షమున వెలుగొందుచున్న యింద్రుని రథము లక్ష్మణునకుఁ జూపుచు నిట్లనెను.

౪-౫ లక్ష్మణా రథమున కన్నిదిక్కులను కుండలముల ధరించి నూర్లకొలది ఖడ్గములనుధరించి యిరువది యైదు వత్సరంబు ప్రాయపు సమాన యౌవనులైయున్న వీరినిజూడుము వీరేదేవతలు. వీరలకీవయస్సు నిత్యమై యుండును.

* ఈ శ్లోకమువలన శ్రీరామచంద్రమూర్తి శరభంగాశ్రమ ప్రవేశమగుచున్నాడని తెలిసెడిని. ఈ శరభంగాశ్రమము విరాధుడున్న అమరకంటక పర్వతములకు నైరృతిని-48 మైళ్ళ దూరమునగలదు ప్రస్తుత మీయాశ్రమము-మెయికాల్ పర్వత ప్రాంతమునగల.శరంగపూరని పిలువబడుచున్నది. శరభంగమహర్షి గౌతమ కులోత్పన్నుడగు బ్రహ్మర్షి ఆయన యాశ్రమము. శ్రీమహాభారతమున జెప్పబడిన రీతిగ గోదావరికి తూర్పుప్రదేశమున విరాజిల్లుచుండెనని స్పష్టముగ తెలియుచున్నది.

సర్గః ౧

తమేవముక్త్వా సౌమిత్రి మిహైవ స్థీయతా మితి॥
అభిచక్రామ కాకుత్స్థ శ్శరభంగాశ్రమం ప్రతి॥ ౬

1 శక్రోపి రాఘవం దృష్ట్వా శరభంగ మువాచహ॥

కర్మహ్యనేన కర్తవ్యం మహదన్యైస్సుదుష్కరం॥ ౭

సబంధుం రావణం హత్వా త్వం సర్వం వేత్సి తత్వతః॥
ఇత్యుక్త్వా రథమారుహ్య యయా దివ మరిందమః॥ ౮
3 తతశ్శక్రోప్రయానంతు పర్యపృచ్ఛ త్స రాఘవః॥
శరభంగశ్చ తత్సర్వం రాఘవాయ న్యవేదయత్॥ ౯
ప్రయాతేతు సహస్రాక్షే రాఘవస్సపరిచ్ఛదః
అగ్నిహోత్ర ముపాసీనం శరభంగ ముపాగమత్ ౧౦
1 శరభంగ స్తతో దృష్ట్వా రామం సౌమిత్రిణా సహ
అభిగమ్య సుసంపూజ్య విష్టరేషూపవేశయత్॥ ౧౧
ఆతిథ్యమకరో త్తేషాం కందమూలఫలాదిభిః॥
ప్రీత్యాహ శరభంగోపి రామం భక్తపరాయణం॥ ౧౨
*4 అక్షయా నరశార్దూలమయాలోకాజితాశ్శుభాః
బ్రాహ్మ్యశ్చ నాకపృష్ఠాశ్చ ప్రతిగృహ్ణీష్వ రాఘవ॥ ౧౩

* అక్షయేతి॥ అథాత్ర—సప్తోర్ధ్వలోకవిచారః క్రియతే

1పులస్త్యరామాయణం 2వాల్మీకి౫స॥ 3అధ్యాత్మ రా.౨స॥ 4వాల్మీకి ౫.౫స॥



౬. అనియిట్లు లక్ష్మణునితో చెప్పి సీతాలక్ష్మణుల నచ్చటనుండ నియోగించి శ్రీరామచంద్రుడుం బాత్రమా శరభంగముని సమీపమునకు జొచ్చుచుండెను.

౭-౮ వచ్చుచున్న శ్రీరాముని దేవేంద్రుడు జూచి శరభంగునితో శ్రీరాముండిచ్చటికే వచ్చునా యితరుల కెవ్వరికిని సాధ్యముగాని గొప్ప గార్యము మనకీతడు చేయవలసియున్నది. అదేదన. సపరివారముగ రావణుని జంపుట మొదలైనవి. దానికి శ్రీరామచంద్రుని బ్రేరేపించి యభిముఖునిగా చేయవలయునని మీ రెరుంగుదురుగదా, ఇంక నేపనియొదనని జెప్పి ఇంద్రుడు తన రథము నెక్కి స్వర్గమునకు బోయెను.

౯ అంత శ్రీరామచంద్రుడా శరభంగమునిని జేరి దేవేంద్రుడిచ్చటి కేల వచ్చెనని యడుగ నాతడు తయు శ్రీరామునితో జెప్పెను.

౧౦ అదివిని శ్రీరామచంద్రుడు మఱల సీతాలక్ష్మణులున్న చోటికి వచ్చి వారలం దోడ్కొని అగ్నినుపాసించు శరభంగుని సమీపమున కేగెను.

౧౧-౧౨. అంత నాశరభంగమహర్షి తనను సమీపించిన శ్రీ సీతారామలక్ష్మణులను జూచి యెదురేగి తోడ్కొనివచ్చి కుశాసనముల గూర్చుండజేసి పూజించి కందమూల ఫలాములచే నాతిథ్యమిచ్చి ప్రీతిచే నాభక్తపరాధీనుండగు శ్రీరామునితో నిట్లనెను.

* ౧౩. ఓ పురుషోత్తమా శ్రీరామా నాతపశ్శక్తిచే బ్రహ్మలోకము లోను స్వర్గాది లోకములలోనుండు భోగస్థానముల సంపాదించితిని. అట్టివి నీ కర్పించుచున్నాను పరిగ్రహింపుము. (అనగా నేను జేసిన సుకృతము నీ కర్పించుచున్నానని భావము.)

* ఇచ్చట ఊర్ధ్వలోకముల నేడింటి వివరము కొంత తెలుపబడుచున్నది. విష్ణుపురాణమందు చెప్పబడినరీతిగ భూలోకమునకు పరి

యథా విష్ణుపురాణే॥శ్లో॥ భూర్భువస్స్వర్మహశ్చైవ జనశ్చ తప ఏవ చ సత్యలోకైకసన్తైతే లోకాశ్చ పరికీర్తితాః॥ ఇత్యాద్యుక్తరీత్యా భూలోకః1 భువర్లోకః 2 స్వర్లోకః 3 మహర్లోకః 4 జనలోకః 5 తపోలోకః 6 సత్యలోకశ్చ7 క్రమాత్తిష్ఠతీతి జ్ఞాయతే॥పాద్మేపి స్వర్గఖండే॥శ్లో॥ పాదగమ్యం హి యత్కించిద్వస్త్వస్తి ధరణీతలా త్తద్భూర్లోక ఇతి ఖ్యాతం శాకద్వీపాదికాననం ఇత్యాదినా భూలోకః వర్ణితః

* అథభువర్లోకస్వరూపం వర్ణ్యతే ॥శ్లో॥భూలోకాచ్చ భువర్లోకః సూర్యావధిరుదీరితః ఇత్యాదివాక్యపర్యాలోచనయా భూలోకా దుపరి సూర్యమండలపర్యంతం వర్తమానో లోకో భువర్లోకః॥ అంతరిక్షలోక ఇతి కథ్యతే గ్రంథాంతరే తత్రగ్రహనక్షత్రాదయశ్చసన్తీతివర్ణితం॥అపిచవహ్నిపురాణే భువర్లోకవర్ణనే॥శ్లో॥లోకాంశ్చ విదధే దివ్యా దథావథ పృథక్పృథక్ కస్యచిత్సూర్యసంకాశాన్ కస్యచిద్వహ్నినిర్మలాన్ కస్యచిద్విష్ణువిద్యోతా॥ కస్యచిచ్చంద్రనిర్మలాన్ సతాంసుకృతినాం లోకాన్ పావనాయచ సంస్థితాన్ ఇత్యాద్యుక్తరీత్యా భువర్లోకే అనేకతేజోమయలోకావిద్యంత ఇతి, స్రష్టాతా నృష్టాసుకృతినాం నివాసయోగ్యాం శ్చకారేతి, భూలోకాద్విగుణం॥ భువర్లోకః వర్తతఇతిజ్ఞాయతే॥

అథస్వర్గలోకవర్ణనం పాద్మే॥శ్లో॥ ఆదిత్యాద్ధ్రువం రాజన్ స్వర్లోక ఇతి కథ్యతే ఇత్యుక్త్వా సూర్యధృవమండలయోర్మధ్యే స్వర్గలోకో వర్తత ఇత్యుక్తం భవతి పునశ్చ మహాభారతే సభాపర్వణియుధిష్ఠిరనారదసంవాదే॥ అత్రి



క్రమముగ 2 భువర్లోకము, 3 స్వర్లోకము, 4 మహర్లోకము, 5 జనలోకము, 6 తపోలోకము, 7 సత్యలోకము గలవని తెలియుచున్నది. అదేపురాణమందు పాదములకు సాధ్యమగు భూప్రదేశమంతయు అనగ జంబ్వాదిసప్తమహాద్వీపములను వాటియందుగల నదనదీపర్వతారణ్య ప్రదేశమంతయుకలశి భూలోకమేనని చెప్పబడినది,

ఇక భువర్లోకవిషయమై అదే పురాణమున భూలోకము మొదలుకొని సూర్యునివరకునుండు ప్రదేశమంతయు భువర్లోకమని వక్కాణింపబడెను. మఱియు వహ్ని పురాణ మీవిషయమున విశేషవివరము దెల్పుచున్నది. ఏమన ఈభువర్లోకమున బ్రహ్మదేవుడు పుణ్యపురుషుల భోగార్థము అనేక లోకములను నిర్మించి వారివారికిచ్చెను. వాటిలోన గొన్ని సూర్యునివంటి తేజముగలవి.మరికొన్ని చంద్రాగ్ని నక్షత్రాములవంటివి ఇవిగాక గ్రహరాశి నక్షత్రాను లచ్చుటనే గలవు. భూలోకముకన్న ద్విగుణంబై భువర్లోకము ప్రకాశించునని జెప్పబడెను.

ఇక స్వర్గలోకమును గురించి పద్మపురాణమున సూర్యుడు మొదలు ధృవమండలమువరకును వ్యాపించియున్న విశేష ప్రదేశమంతయు స్వర్గమని తెలియజేయబడినది. మహాభారతమందు సభాపర్వమున యుధిష్ఠిర నారద సంవాదరూపముగ ఆస్వర్గలోకమందు రూపమునన్న అమూర్తదేవతులును ప్రత్యధిదేవతులును అభిమానదేవతలును అనగ భూలోకమున గల హిమాలయాది పర్వతములు గంగాది పుణ్యానదులు, సప్తసాగరములు, దేవతారణ్యములు,పంచభూతములు మొదలైన జడరూపములన్నియు నచ్చట సూక్ష్మదివ్యతేజోమయ రూపముల ధరించి ఇంద్రాదిసభలలో నుండుననియు, ఇవిగాక

స్వర్గలోకే రూపదేవతాః ప్రత్యధిదేవతాః అభిమానదేవతాశ్చ భూలోకస్థాః హిమాలయాది దేవపర్వతాః గంగాది పుణ్యనద్యః సప్తసాగరాః దేవతారణ్యాని పంచభూతాని ఇత్యాదయో జడస్వరూపా అపి సూక్ష్మదివ్యతేజోరూపాణి ధృత్వా తత్రత్యఇంద్రాదిసభాసుతిష్ఠంతీతి జ్ఞాయతే. అపి చాష్టౌ వసవః ఏకాదశరుద్రాః ద్వాదశాదిత్యాః ఇంద్రః ప్రజాపతిశ్చేతిత్రయస్త్రింశద్దేవతా స్తత్ర తిష్ఠంతఇతిసర్వపురాణేషు స్మృతిషుప్రసిద్ధతయా శ్రూయతే తేషాంవిభూతయస్త్రయస్త్రింశత్కోటీతి బాలకాండే ప్రతిపాదితాఏవ॥ జీవోపి పుణ్యవిశేషాత్ భూలోకాద్భువర్లోకంతతస్స్వర్గలోకమపిక్రమేణప్రవిశతి భువర్లోకాద్ద్విగుణం స్వర్లోకం॥ఏతాః భూర్భువస్సువర్లోకాం స్త్రైలోక్యమితి కథయంతి విష్ణుపురాణే. శ్లో॥ చతుర్ముఖదినస్యాంతే జగదేతచ్చరాచరం తదాహి దహ్యతే సర్వం త్రైలోక్యం భూర్భువాదికం త్రైలోక్య మేతత్కృతకం మైత్రేయపరిపఠ్యతే ఇత్యుక్త్వా ఏతత్త్రైలోక్యం కృతకమితి కృతకంనామ ప్రతికల్పం బ్రహ్మణాసృజ్యత ఇతి వ్యజ్యతే అపిచ. శ్లో॥ జనస్తపస్తథా సత్య మితి చాకృతకం త్రయమితి విష్ణుపురాణోక్త్యా జనలోక-తపోలోక సత్యలోకా అకృతకశబ్దే నోచ్యంతే అకృతకం నామ ప్రలయేప్య నశ్వరాలోకాః ఇతి జ్ఞేయం॥

4 అథ మహర్లోకస్థితిరుచ్యతే విష్ణుపురాణే॥ శ్లో॥ కృతాకృతకయోర్మధ్యే మహర్లోక ఇతి స్మృతం శూన్యో భవతి కల్పాంతే యోఽత్యంతం నవినశ్యతి ఇత్యాద్యుక్త



అష్టవసువులు, ఏకాదశరుద్రులు, ద్వాదశాదిత్యులు, ఇంద్రుడు ప్రజాపతియు వెరశి ముప్పదిముగ్గురు దేవతలుందురనియు చెప్పబడినది. ఇది సర్వపురాణసమ్మతము. ఆముప్పదిముగ్గురు దేవతలమహిమారూపములే ముప్పది ముక్కోటి దేవతలని రామాయణ సారోద్ధార బాలకాండమున దెలుపబడినది. జీవుడును పుణ్యవిశేషముచేత నీ భూలోకమునుండి భువర్లోకమును, దాననుండి క్రమేణ స్వర్లోకామును ప్రవేశించును. ఈస్వర్లోకము భువర్లోకముకంటె ద్విగుణంబై వెల్గొందును. ఈభూర్భువస్సువర్లోకంబుల మూడింటిని త్రైలోక్యమని జెప్పుదురు. విష్ణుపురాణమున చతుర్ముఖబ్రహ్మ పగటితుదను (అనగ రాత్రిని) చరాచరాత్మకమగు నీత్రైలోక్యము దహింపబడుననియు, ఈలోకత్రితయమునకు కృతకమని పేరనియు, కృతకమనగ ప్రతికల్పమందు బ్రహ్మవలన సృజింపబడునదియనియు జనలోక తపోలోక సత్యలోకములు మూడింటికిని అకృతకమని పేరనియు అకృతకమన నీలోకత్రయము ప్రలయమందును నశించనివనియు గలదు.

తదనంతరము మహర్లోకము దీనిని విష్ణుపురాణమే విశదీకరించినది. ఎట్లన కృతాకృతక లోకములకు నడుమ నీమహర్లోకము గలదు. ప్రళయమందినది నశింపదుగాని శూన్యముగనుండును. కృతకమను భూర్భువస్సువర్లోక త్రితయము దహింపబడుచుండ నిందుండు పుణ్యులు తాపార్తులై జనలోకమునజేరి మరల సృష్టింపబడిన కాలమున స్వస్థానము బ్రవేశింతురని గలదు. మత్స్యపురాణమందిట్లే గలదు. ఈమహర్లోకము స్వర్గలోకముకంటె మూడుపాళ్లు విశాలము.

తదుపరి జనలోకము, దీనివిషయము స్కాందపురాణమున కాశీఖండమందు సవిస్తరముగ గలదు. మహర్లోకమునకుపైన జనలోకము

రీత్యా ఏతన్మహర్లోకో ప్రలయే జనశూన్యో భవతి నన
శ్యతి స్వరూపేణ మహర్లోకనివాసినః కల్పాంతే దహ్య
మానే త్రైలోక్యే తాపార్తాః జనలోకం గత్వాపునస్సృ
జ్యమానే త్రైలోక్యే స్వస్థానం ప్రాప్నువంతి తదేవ్వో క
మాగ్నేయపురాణే ॥శ్లో॥ చతుర్థేతు మహర్లోకేతిష్ఠంతే
కల్పవాసినఃయదా హి దహ్యతేసర్వం త్రైలోక్యం భూర్భువ
వాదికం జనంప్రయాంతితాపార్తా మహర్లోకనివాసిన ఇతి
స్వర్లోకాత్త్రిగుణో మహార్లోకః।

5 అథజనలోకస్థితిరుపవర్ణ్యతే॥ స్కాందే కాశీఖండే
జనలోకవర్ణనప్రస్తావే॥శ్లో॥ క్షణార్ధేన విమానం తజ్జనలోకం
నినాయతాన్,నివసంత్యమలా యత్ర మానసా బ్రహ్మణస్సు
తాః॥సనందనాద్యా యోగీంద్రాస్సర్వే తేహ్యూర్ధ్వరేతసః
అన్యే తు యోగినో యే వైహ్యాస్ఖల ద్బ్రహ్మచారిణః॥సర్వ
ద్వంద్వవినిర్ముక్తా స్తే వసంత్యత్రనిర్మలాః ఇత్యాదిప్రమాణో
క్త్యా జనలోకో మహర్లోకో పరివర్తతే ఇతి సుష్ఠుజ్ఞాయతే.
మహర్లోకాచ్చతుర్గుణః జనలోకః॥

6అథతపోలోకస్థితిరుచ్యతే॥ యథాపద్మపురాణే॥శ్లో॥
అస్యోపరి తపోలోక స్తేజోమయ ఉదాహృతః।వైరాజా
యత్రతేదేవా వసేయుర్దేవపూజితఃవాసుదేవే ఖనో యేషాం
వాసుదేవేర్పితక్రియాః తపసాతోష్యగోవిందమభిలాష వివ
ర్జితాః। తపోలోకంసమాసాద్యవసంతి విజితేంద్రియాః శిలోం
ఛవృత్తయో యే వై దంతోలూఖలికాశ్చ యే ఇత్యైతైర్నియ
మైర్యే తు క్లిష్టాత్మా నస్తపోధనాః బ్రహ్మయుష స్తపోలోకే



గలను. అచ్చట బ్రహ్మమానస పుత్రులగు సనకసనందన సనత్కు
మార సనత్సుజాతులును, ఊర్ధ్వరేతస్కులును, అస్ఖలద్బ్రహ్మ
చారులగు యోగులును, సర్వద్వంద్వ విముక్తులు నిర్మలులు మొద
లగువారుందురు. మహర్లోకముకంటె నీజనలోకము చతుర్గుణము.

ఆపిమ్మట తపోలోకము, ఈలోకమునుగూర్చి పద్మపురాణమం
దిట్లు గలదు. జనలోకమునకు పరిభాగమున తేజోమయమగు తపో
లోకము గలదు. అచ్చట దేవతలచే పూజింపబడు వైరాజ పురుషు
లుందురు. శ్రీ వాసుదేవునియందు మగ్నమగు మానసముగలవారును
భగవంతునికి సర్వకర్మలు సమర్పించువారును, నిష్కామ్య కర్మా
నుష్ఠానపరులై భగవంతుని సంతోషింపజేయువారును, జితేంద్రియు
లును శిలోంఛవృత్తిచే కాలము గడుపువారును, దంతములనే
ఉలూఖలములు (రోలు మొదలైనవి) గ నుపయోగించుకొనువారును
తదితరములగు శ్రమసాధ్యమగు తపోధనులును, ఈ తపోలోకతిమున
నిర్భీతిగ బ్రహ్మదేవుని పూర్ణాయుర్దాయ పర్యంతము జీవితులై
ఆనందముగ నుందురు. ఈ తపోలోకము జనలోకముకన్న నైను
పాళ్లు ఎక్కువ విస్తీర్ణముచే రాజిల్లును.

ఇక నేడవదియగు సత్యలోకము. ఈలోక పరిస్థితి పద్మపురా
ణమున గలదు. ఈ సత్యలోకము ఏడవలోకము దీనికి బ్రహ్మలోక
మని పేరు. ఇందుండువారు మరల పుట్టరు. ఈలోకము నాశన
రహితమైనది. తపోలోకముకన్న నీబ్రహ్మలోక మారుపాళ్లు విస్త
ర్ణాధికతచే చెన్నారును. సామాన్య జీవులకీలోక మగమ్యము. మహా
భారత సభాపర్వమందును ఈబ్రహ్మలోక వివర మీవిధముగ నిర్ణ
యింపబడినది. ఇది అత్యంత తేజోమయమైనదగుటవలన దేవతలకు

తేవసంత్యకుతోభయాః॥ ఇత్యాదిప్రమాణోక్త్యా జనలోకాదుపరి తేజోమయఃతపోలోకోఽస్తీతిచమ స్తవ్యంజనలోకాత్పంచగుణ స్తపోలోకః।

[7]అథసత్యలోకస్థితిరుపవర్ణ్యతేపాద్మే॥శ్లో॥సత్యస్తుసప్తమోలోకోహ్యపునర్భవవాసినాం। బ్రహ్మలోకస్సమాఖ్యాతోహ్యప్రతీఘాతలక్షణః పాడ్గుణ్యేన తపోలోకాత్సత్యలోకో విరాజత ఇతి పాద్మోక్త్యా తపోలోకా దుపరి సత్యలోకో వర్తతే ఏనమేవ బ్రహ్మలోకమితి వదంతి అపునరావర్తినో భవంత్యత్రత్యా ఏతల్లోకగతాశ్చ సామాన్యజీవిన ఏతల్లోకం నారంహతీతి,భారతేసభాపర్వణి-సుష్టూక్తం అయమత్యంత తేజోమయత్వేన దేవతానామపి ప్రవేష్టుమశక్యః దిక్పాలకసహిత ఇంద్రస్తదాతదా-అత్రత్యహిరణ్యగర్భందర్శితుం గచ్ఛతిసత్యలోకాదుపరి బ్రహ్మాండకటాహః॥ అత ఊర్ధ్వం కక్ష్యాభేదేన మహావైకుంఠో మహాకైలాసశ్చ వర్తతే భూర్భువస్సువర్లోకా స్త్రియః స్థూలత్రిలోకీ జన స్తపస్సత్యలోకాస్త్రయః సూక్ష్మత్రిలోకీఏతయోర్మధ్యేద్వయోనసంగమ్యమహర్లోకోవర్తతే న కేవలమయంసూక్ష్మః నతుస్థూలః కింతు లోకాలోకపర్వతవత్ అహోరాత్రయోస్సంధిరివ స్థితః భూలోకాదధః తలశబ్దమకుటేన 1 అతల 2 వితల 4 సుతల 4 తలాతల 5 రసాతల 6 మహాతల 7 పాతాళనామభిః॥ క్రమశః సప్తపాతాళాదిలోకా స్తిష్ఠంతీ త్యవగమ్యతే "పూర్వోక్తచతుర్దశభువనాని ఏతదనుబంధి సూర్యాదినవగ్రహా అశ్విన్యాదినక్షత్రాణి మేషాదిద్వాదశరాశయ స్సప్తర్షయో ధృవఅవాంతర కామ్యలోకాశ్చైతత్సర్వం మిళిత్వా బ్రహ్మాండమితి కథ్యతే ఏతా



సహితము ప్రవేశించుటకు సాధ్యపడదు. దిక్పాలకులతో దేవేంద్రుడు మాత్రమప్పుడప్పుడందుండుహిరణ్యగర్భునిదర్శించుటకేగుచుండును. ఈసత్యలోకమున కవ్వల బ్రహ్మాండకటాహము దానిపై కక్ష్యాంతర భేదముగ మహావైకుంఠ కైలాసములు గలవు. భూలోక భువర్లోక సువర్లోకములకు స్థూల త్రిలోకములని పేరు. జనలోకము, తపోలోకము, సత్యలోకము గలసి సూక్ష్మత్రిలోకి. ఈస్థూలసూక్ష్మములకు నడుమ మహర్లోకముండును. ఇది కేవలస్థూలమును గాదు. సూక్ష్మమును గాదు. ఇది లోకాలోకాపర్వతమువలె అహోరాత్రిసంధివలె నుండును. ఇక భూలోకమునకు క్రిందుగ (అనగ లోకాలోకాచమున కవ్వలి చీకటిలో) తలమనుమకుటమున 1 అతల, 2 వితల, 3 సుతల, 4 తలాతల, 5 రసాతల, 6 మహాతల, 7 పాతాళమనం బరగుసప్తపాతాళములునొకదానిక్రిందమరొకటి వరుసగనుండును

ఇంతవరకు జెప్పబడిన చతుర్దశభువనములును, వీటిననుసరించిన సూర్యాది నవగ్రహములు, అశ్విన్యాది నక్షత్రములు మేషాది ద్వాదశ రాసులు సప్తర్షి ధృవనక్షత్రములు అవాంతర కామ్యలోకములన్నియును కలసి బ్రహ్మాండమని పేర్కొనబడును. ఈలాటి బ్రహ్మాండము లనేకకోటులు గలవు. వీటికధిపతులు చతుర్ముఖబ్రహ్మ మొదలు సహస్రముఖబ్రహ్మవరకు నుందురని త్రిపాద్విభూతి నారాయణోపనిషత్తునందును, జైమినిభారతమందును గలదు. ఇట్టి యనేక బ్రహ్మాండకోటులు పరమేశ్వరుని మహాశరీరమునకు సంబంధించిన రోమరంధ్రములను గవాక్షములందుండి లోపలికి బోవుచు

దృశానేక బ్రహ్మాండాధిపతయః। చతుర్ముఖబ్రహ్మాదిసహస్రముఖబ్రహ్మపర్యంతం స్థితా ఇతి త్రిపాద్విభూతినారాయణోపనిషది జైమినీభారతే చ స్థితం ఈదృగ్బ్రహ్మాండకోటయః పరమేశ్వరస్య రోమరంధ్రగవాక్షేషు పరిభ్రమమాణాః॥ పరమాణవ ఇవస్థితా ఇతి శ్రీమహాభాగవతే దశమస్కంధే బ్రహ్మస్తవే ప్రతిపాదితం। తథాహి ॥శ్లో॥ క్వాహం తమో మహదహంఖచరాగ్నివార్భూసంవేష్టితాండఘటసప్తవితస్తికాయః॥ క్వేదృగ్విధావిగణితాండపరాణుచర్యా వాతాధ్వరోమవివరస్యచ తే మహిత్వం॥ ఇతి॥ ఏతద్బ్రహ్మాండమేవ పరిదృశ్యమానజంబుద్వీపే పురాణేషు ఉపాసనార్థం. సంభావ్యతే తథైవ యోగినస్తు పిండాండే। శరీరే। సంభావ్య యోగబలేన సకలం పశ్యంతి యథా ఉత్తరగీతాసు ద్వితీయాధ్యాయే ॥శ్లో॥ పాతాళం నాభ్యధోభాగే భోగేంద్రఫణమండలం వేష్టితస్సర్వతోనంత సంబిభ్రజ్జీవసంజ్ఞికః। భూలోకో నాభి దేశస్తు। భువర్లోకస్తు కుక్షితః హృదయం స్వర్గలోకస్తు. సూర్యాదిగ్రహతారకాః వక్షస్థ్సానే మహర్లోకో జన లోకస్తు కంఠతః। తపోలోకో భ్రువోర్మధ్యే మూర్ధ్ని సత్యః ప్రతిష్ఠితః। ఏవం బ్రహ్మాండనిలయస్తస్మిన్దేహే ప్రతిష్ఠితః। శరీరేకలయేద్యోగీ తస్మిన్ సర్వం సుఖం లభేత్ ।ఇత్యాదిప్రమాణమనుసృత్య శరభంగయోగ్యంతర్ముఖోభూత్వా బహిర్లోకాన్ పరమేశ్వరాయ శ్రీరామచంద్రాయ సమర్పితవానితి జ్ఞాయతే॥ శ్లో॥ యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమితి గీతాప్రామాణ్యాత్ ఇతి॥



ములల వచ్చుచు పరిభ్రమించుచుండునని శ్రీ మహాభాగవతమున దశమస్కంధమందు బ్రహ్మస్తవమున ప్రతిపాదింపబడినది. ఈ బ్రహ్మాండమే మనకు కనుపడుచున్న భూలోకస్థ జంబుద్వీపమందు ఉపాసకుల సౌకర్యముకొరకు ఈ ప్రదేశము మొదలీ ప్రదేశమువరకు పాతాళాదులని అట్లే భూలోకాదులని పురాణములలో నచ్చటచ్చట సంభావింపబడినది. అటులనే యోగులీ బ్రహ్మాండమును పిండాండమందు (శరీరమందు) భావించి యోగబలముచే సర్వబ్రహ్మాండమును తెలిసికొందురు. అదెట్లనిన ఉత్తరగీతయందు రెండవ అధ్యాయమున నాభికిక్రింద పాతాళము, భూలోకము నాభి భువర్లోకము జీర్ణకోశము హృదయము స్వర్గలోకము వక్షస్థానమందు మహర్లోకము కంఠమందు జనలోకము భ్రూమధ్యస్థానమందు తపోలోకము మూర్ధయందు సత్యలోకము ఈవిధమున ఈదేహమందే బ్రహ్మాండము గలదని యోగు లితరమును గమనింపక ఈ శరీరమందె సర్వమును సుఖమును పొడగాంతురని గలను.

ఈ మొదలగు ప్రమాణముల ననుసరించి శరభంగయోగి అంతర్ముఖుడు గాన బహిర్లోకముల దపముచే సాధించి పరమేశ్వరుండగు శ్రీరామచంద్రమూర్తికి సమర్పించెనని తెలియుచున్నది. గావుననే భగవద్గీతయందు శ్రీకృష్ణపరమాత్మ ఏదియాచరించినను దేనిదినినను ఏదిహోమము చేసినను దేని నితరుల కిచ్చినను ఏతపమాచరించినను నాకర్పించి సుఖించుమనెను.

శ్రీరామ ఉవాచ॥

అహమేవాహరిష్యామి సర్వాల్లోకాన్మహామునే।
ఆవాసంత్వహమిచ్ఛామి ప్రసిద్ధమిహ కాననే। ౧౩

శరభంగ ఉవాచ॥

ఇహ రామ మహాతేజా। సుతీక్ష్ణో నామధార్మికః।
వసత్యరణ్యే ధర్మాత్మా స తే శ్రేయో విధాస్యతి॥ ౧౪
ఇమాం మందాకినీం రామ ప్రతిస్రోతామనువ్రజ।
ఏషపంథానరవ్యాఘ్రముహూర్తంపశ్య తాతమాం॥ ౧౫
యావజ్జహామి గాత్రాణి జీర్ణాం త్వచమివోరగః॥ ౧౫½
తతోఽగ్నిం సుసమాధాయ హుత్వా చాజ్యేన మంత్ర
విత్॥ ౧౬
1 సమర్ప్య రామస్య మహత్సుపుణ్యఫలం విరక్తశ్శరభంగ
యోగీ చితిం సమారోహయదప్రమేయం రామం ససీ
తం సహసా ప్రణమ్య॥ ౧౭
ధ్యాయంశ్చిరం రామమశేషహృత్స్థం దూర్వాదళశ్యా
మల మంబుజాక్షం చీరాంబరం స్నిగ్ధజటాకలాపం॥
సీతాసహాయం సహలక్ష్మణం తం॥ ౧౮
కోవా దయాళుస్స్మృతకామధేనురన్యో జగత్యాం రఘు
నాయకాదహో స్మృతో మయా నిత్యమనన్య భాజా
జ్ఞాత్వా స్మృతిం మే స్వయమేవ యాతః॥ ౧౯

---

అధ్యాత్మ రా॥ ౨ సర్గ॥



౧౩. ఇట్లాశరభంగమహాముని పల్క శ్రీరామచంద్రుడా మునినిజూచి ఓ హర్షీ నీచే జేర్పఁబడిన సకల పుణ్యలోకములను నేనే తేగలను. గాని భక్తిచే నీచేసమర్పింపబడిన పుణ్యలోకముల స్వీకరించుచున్నాను. ఈయరణ్యమందు మీరు నిర్దేశించిన ప్రదేశమందుండ దలచుచున్నాను, అనెను.

౧౪ ఆమాటవిని శరభంగముని శ్రీరామచంద్రునితో ఓ శ్రీరామచంద్రా! గొప్ప తేజస్సుగలవాడును ధార్మికుడును ధర్మచింతగల సుతీక్ష్ణఋషి ఈ యరణ్యమున గలడు. అతడు నీకు శ్రేయము నొనగూర్చును.

౧౫-౧౫½ ఆచ్చటకి మందాకినీ నదికి పడమటి దిక్కున బోవలయును. నీవు పోవలసిన మార్గమిదియ! జీర్ణమైన కుబుసమును సర్పము విడుచునట్లిశరీరత్రయముల విసర్జించెదను. ఒక ముహూర్తముకన్న నక్కరలేదు, అంతదనుక నన్ను నీకరుణచే చూచుచుండుమనెను.

౧౬. అనంతరము బ్రహ్మమేధమంత్ర విదుడగు శరభంగుడు అగ్నినిదర్భలు మొదలగు వానిచే నలంకరించి అగ్నిముఖమునుజేసి,

౧౭. గొప్పదగు తన పుణ్యమును భగవంతుడగు శ్రీరామునికి సమర్పించి, ఎట్టివారికిని తెలియరాని శ్రీ సీతారామచంద్రునికి నమస్కరించి వెంటనే చితిని బ్రవేశించెను.

౧౮. ముందుముందు చితిలోనుండి శరభంగుడు సర్వప్రాణుల హృదయముల నున్నవాడును, లేతసూర్యులవలె శ్యామలదేహకాంతి గలవాడును, కమలేక్షణుడును, నారచీరలను ధరించినవాడును, మృదులములగు జడలు గలవాడును, శ్రీ సీతాలక్ష్మణ సహితుడగు శ్రీరామచంద్రుని ముహూర్తకాలము ధ్యానించి ఇట్లు పలికెను,

౧౯. ఆహా! లోకమునం దెవ్వడైనను, శ్రీరామచంద్రునివలె దయగలవాడును, తలచినంతన కామధేనువువలె కోర్కెలీడేర్చువాడును, గలడా, నేననన్యభావముతో శ్రీరాముని ధ్యానింప నా యభిప్రాయము దెలసి తన యంతనిచ్చటికి నన్నుకరుణింపవచ్చుటజూడ నాశ్చర్యము.

అయోధ్యాధిపతిర్మేఽస్తు హృదయే రాఘవస్సదా
యద్వామాంకే స్థితా సీతా మేఘస్యేవ తటిల్లతా॥ ౨౦
ఇతి రామం చిరంధ్యాత్వా దృష్ట్వా చ పురతస్స్థితం।
ప్రజ్వాల్య సహసా వహ్నిం దగ్ధ్వా పంచాత్మకంవపుః॥
* దివ్యదేహధరస్సాక్షాద్యయౌ లోకపతేః పదం॥ ౨౧½
1 శరభంగే దివం యాతే మునిసంఘాస్సమాగతాః॥ ౨౨

దంతోలూఖలినశ్చైవ తథైవోన్మజ్జకాః పరే।
గాత్రశయ్యా అశయ్యాశ్చ తథైవాభ్రావకాశకాః॥ ౨౩
ఆకాశనిలయాశ్చైవ తథా స్థండిలశాయినః।
మునయస్సలిలాహారా వాయుభక్షా స్తథా పరే॥ ౨౪
ప్రత్యార్ద్రవాసినో దాంతా స్తథార్ద్రపటవాసినః।
స జపాశ్చ తపోనిత్యా స్తథా పంచ తపోఽన్వితాః॥ ౨౫
* సర్వే బ్రాహ్మ్యాశ్రియాజుష్టా దృఢయోగా స్సమాహితాః
శరభంగాశ్రమే రామ మభిజగ్ము స్సమాహితాః॥ ౨౬

---

* దివ్యదేహధర ఇతి॥ యాజ్ఞవల్క్యరా ॥శ్లో॥ పూజా కోటిసమంస్తోత్రం స్తోత్రకోటి సమంజపః జపకోటి సమంధ్యానం ధ్యానకోటి సమోలయః ॥ఇతి॥

॥సర్వ ఇతి॥ అత్రైత్యమునీనాం పృథగ్ధర్మాచరణం। ప్రారబ్ధ వైచిత్ర్యేణ తథాహః ॥శ్లో॥ కృష్ణో భోగీ శుకస్త్యా

---

1. వాల్మీకి రా ౯ సర్గ.



౨౦. మేఘమధ్యమున మెఱుపుతీగవలె నెవ్వనితొడమీద సీతాదేవి ప్రకాశించుచున్నదో అట్టి శ్రీ అయోధ్యాధిపతియగు శ్రీరాముడు నా హృదయమున నెల్లప్పుడు నివసించుగాక.

౨౧-౨౧½ * ఇట్లుచాలాసేపు శ్రీరామచంద్రుని ధ్యానించుచు. తన యెదుటనున్న రాముని జూచుచు, పంచభూతాత్మకమగు స్థూలదేహమును దహించుకుని । దివ్యమైనదేహము ధరించి. సాక్షాద్బ్రహ్మలోకమునకు శరభంగుడేగెను.

౨౨. శరభంగుడట్లు బ్రహ్మలోకమునకేగ నావార్త దెలసి యచ్చట మునిసంఘములు శ్రీరాముని సన్నిధి కేతెంచెను.

౨౩-౨౪-౨౫-౨౬- వారిలో వివిధనియమములు గలవారుండిరి, దంతములనే రోలు రోకళ్లుగ నుంచుకొనువారు. కంఠములవరకు జలములనే రోలు నుండువారు, దేహములే శయ్యలుగ గలవారు, శయనించుటయే లేనివారు. వానకాలమును చలి ఎండలందు శరీరమును దేనిచేనైన కప్పుకొననివారు. భూమిని ముట్టుకొనక చెట్లమీదనే కాలముగడుపువారు. దర్భలుపఱుపబడిన భూమిని బరుండువారు, జలము గాలి మాత్రమున జీవించువారు, ఎల్లప్పుడే ఏయోనియమము చేరనాహారము స్వీకరించనివారు ఇంద్రియజయము గలవారు. ఎల్లప్పుడును తడి వస్త్రములనే ధరించువారు సదాజపపరాయణులు ఎడతెగక తపస్యయనము చేయువారు పంచాగ్నిమధ్యయం దెల్లప్పుడుండువారు బ్రహ్మతేజముచే వెలుంగువారు. పరిపక్వాష్టాంగయోగయుతులు ఏకాగ్రచిత్తులగు మునులందరా శ్రీరాముని దర్శించిరి.

---

* ఈదివ్యదేహప్రాప్తి సాధనము యాజ్ఞవల్క్య రామాయణామునతర తమన్యాయమున జెప్పబడినది. పూజకంటెకోటి గుణము స్తోత్రము దానికంటే కోటి గుణితముజపము, దానికి కోటిగుణము ధ్యానము దానికి కోటి గుణములయముంగాలయము జెప్పబడెను ఇచ్చటచేరిన మహాత్ములు పలువిధములగు ధర్మముల నాచరించుటేల ఒకే విధముగ నుండకూడదా యనిన ప్రారబ్ధ విచిత్రముచే నట్లొనగూడును. శ్రీకృష్ణుడు భోగి. శుకుడు త్యాగి. జనకుడు రాజ్యకర్త

1 దృష్ట్వా మునిసమూహం తం జానకీరామలక్ష్మణాః।
ప్రణేము స్సహసా భూమౌమాయామానుషరూపిణః॥ ౨౭

ఆశీర్భిరభినంద్యాథ రామం సర్వహృది స్థితం।
ఊచుః ప్రాంజలయ స్సర్వే ధనుర్బాణధరం హరిం॥ ౨౮

భూమేర్భారావతారాయ జాతోఽసి బ్రహ్మణార్థితః।
జానీమస్త్వాం హరిం లక్ష్మీం జానకీం లక్ష్మణం తథా॥ ౨౯
అతశ్చాదాఋషీణాంత్వం దుఃఖం మోక్తుమిహార్హసి॥ ౨౯½

ఆగచ్ఛయామో మునిసేవితాని వనాని సర్వాణి రఘూత్తమక్రమాత్ ద్రష్టుం సుమిత్రాసుతజానకీభ్యాం తదాదయాఽస్మాసు దృఢా భవిష్యతి॥ ౩౦½

ఇతి విజ్ఞాపితో రామః కృతాంజలిపుటై ర్విభుః।
జగామ మునిభి స్సార్థం ద్రష్టుం మునివనాని సః॥ ౩౧½
దదర్శ తత్ర పతితాన్యనేకాని శిరాంసి సః।
అస్థి భూతాని సర్వత్ర రామో వచన మబ్రవీత్॥ ౩౨

---

గీ జనకో రాజ్య కర్మకృత్ । వసిష్ఠః కర్మకర్తాచ కర్కటీపి శితాశనః । వేశ్యారతో వామదేవః సనకాద్యా దిగంబరాః। ఏతేషాం జ్ఞానమేకంతు తత్తత్కర్మపృథక్పృథగితి॥

---

1. అధ్యాత్మ సర్గ ౨.



౨౭. ఆముని సమూహముల జూచి, మాయచే మనుష్యరూపులైన. శ్రీసీతారామలక్ష్మణులు తత్క్షణమే నేలమీదబడి నమస్కరించిరి.

౨౮. ఆ మునులు నెంటనే సర్వప్రాణుల హృదయముల నున్నవాడును. ధనుర్బాణముల ధరించి సర్వపాపహరణుడగు. శ్రీరామచంద్రుని ఆశీర్వచనములచే నభినందించిచే మోడ్పులు గలవారై ఇట్లనివేడికొనిరి॥

౨౯-౨౯½ ఓ శ్రీరామచంద్రా! నీవు బ్రహ్మచే ప్రార్థింపబడి భూభారమును దీర్చుటకై అవతరించినాడవు. నిన్ను సర్వవ్యాపకుడగు హరినిగాను. సీతను లక్ష్మిగాను లక్ష్మణుని శేషునిగా నెరుంగుదుము. కావున ముందుగ నీ మహర్షుల దుఃఖమును విడిపింపదగుదును.

౩౦½. శ్రీరామచంద్రా! మునులు నివసించు యాశ్రమములువరుసగ జూచుటకై పోవుదము, జానకీలక్ష్మణులతో మావెంటరమ్ము అట్లుచూచినచో మాయందు నీకు దృఢమైన దయగల్గును.

౩౧½-౩౨ ఇట్లా మునులవలనచే మోడ్పులచే విన్నవింపబడినవారై శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణుల వెంటనిడుకొని వారితోడ నామహర్షాశ్రమములుజూడబోయి అస్థులైపడియున్న పెక్కుశిరస్సుల జూచెను.

---

వసిష్ఠుడుకార్మికుడు. కర్కటిపిశితాశనుడు. వామదేవుడు వేశ్యారతుడు. సనకాదులు. దిగంబరలు, ఇట్లుండుటకు హేతువు ప్రారబ్ధము గాక మరేమున్నది వీరందరుజ్ఞానులే? గాని ప్రవర్తనలు ప్రత్యేకముగ నుండును.

[illegible] తాని కిమర్థం పతితానివై।
[illegible] స్మినయో రామ ఋషీణాం మస్తకాని హి॥33

[illegible] ర్భక్షితానీ శప్రమత్తానాం సమాధితః।
అంతరాయం మునీనాం తే పశ్యంతో ఽనుచరంతి హి॥3౪

1 పంపాన దీనివాసానా మను మందాకినీ మపి।
చిత్రకూటాలయానాం చ క్రియతే కదనం మహత్॥3౫
ఏవం వయం నమృష్యామో విప్రకారం తపస్వినాం।
* తతస్త్వాం శరణార్థం చ శరణ్యాం సముపస్థితాః॥ 3౬
పరిపాలయ నో రామ వధ్యమానాన్నిశాచరైః॥ 3౭

♦ పరాత్వత్తో గతిర్వీరపృథివ్యాం నోపపద్యతే॥ 3౭౪

* తతఇతి॥ శరణ్యాం సర్వలోకరక్షణ సమర్థం త్వాం। శరణార్థం రక్షణార్థం సముపస్థితాః ప్రాప్తాః నః కదావతీర్య రక్షిష్యసీతి త్వామేవ ప్రతీక్షమాణా నస్మాన్ రక్షేత్యర్థః॥

♦ అపరేతి అనన్యగతికత్వేన సర్వాత్మనా త్వమేవ రక్షణీయావయమితి విజ్ఞాపయంతి। పృథివ్యామితి సర్వలోకోపలక్షణం। త్వత్తః పరా త్వదన్యాగతిః ఐహికాముష్మికసాధనం దేవతాంతరం నాస్తీత్యర్థః ॥శ్రు॥ తమేవం విద్వానమృత ఇహభవతి॥ నాన్యః పంథావిద్యతేఽ యనాయేతి శ్రుతేః॥ నిశాచరైరితి సర్వానిష్టోపలక్షణం॥ ఇతి॥

1 వాల్మీకి ౬ స॥



33 మొదలు 3౬ వరకు అట్లనిమయమగు నాయాశ్రమములజూచి శ్రీరామ చంద్రుడు మునులతో నిట్లనెను. ఈ యస్థులెవరివి ఎందుల కిట్లుపడి యున్నవి. అంతను మునులిట్లనిరి శ్రీరామచంద్రా అవి సమాధి వలన నేమరియున్నతరి రాక్షసులచే భక్షింపబడిన మునుల శిరస్సులు దీనివలన సమాధి నభ్యసించుచుండు మునులను రాక్షసులు బాధింప లేదని తెలియుచున్నది) రాక్షసులు మునులెప్పుడే మరియుందురో అపరిశుద్ధులుగనుందురో అని సమయము చూచుచుందురు. ఆ రాక్షసులు చిత్రకూటమున మందాకినీనది మొదలు పంపాసరోవరము వరకుండు నదీపర్వతారణ్యముల ననుసరించు మునులను బాధపెట్టు చున్నారు (శరీరములను పేక్షించి తపమాచరించు మీకింతభయ మేల యనెదవేమో) మేము మాశరీరనాశములకెంతే మాత్రము భయపడలేము గాని. మహానుభావులగు పెద్దలను క్రూరరాక్షసులు హింసజేయుచుండుట సైచలేము.

3౭. అందువలన నట్టిమహర్షుల రక్షించుటకై రక్షకుడుగనుండు నిన్ను శరణువేడితిమి. ఓ శ్రీరామచంద్ర మహాప్రభూ! రాక్షసులచే చచ్చుచున్న మమ్ము రక్షింపుము.

3౭౪. ఓవీరుడా! నీవు వినా భూమి మొదలు మాకేలోకమందును గతిలేదు.

* సర్వలోక రక్షణ సమర్థుడవగు నిన్ను రక్షణార్థమై శరణువేడితిమి. నీవెప్పు డవతరించి మమ్ము గాపాడెదవో యను నాసచే నింతకాలము నిరీక్షించుచున్న మమ్ము నవశ్యము రక్షింపుము.

నీవు వినాగతిలేదనుటచే సర్వాత్మనా నీవే రక్షింపవలయునని యర్థము. భూలోకమనుట సర్వలోక స్వీకరణార్థలక్షణము. నీకంటె గతిలేదన, ఇహపరములందు నీకంటె సాధనాంతరము లేదని యర్థము. ఈవిధముగ నాతని తెలిసికొని మోక్షమిక్కడనే జెందును. (మోక్షముకొరకింతకన్న వేరుమార్గములేదు.) ఇత్యాద్యర్థములిచ్చు శ్రుతులీవిషయమే బోధించుచున్నవి. రాక్షసులచే చచ్చుచున్నారమనుట సర్వదుఃఖములచే ననుటకు పలక్షణముగాన మమ్ము సర్వదుఃఖములనుండి రక్షించుమని తాత్పర్యము.

[1] శ్రుత్వా వాక్యం మునీనాం స భయదైన్యసమన్వితం।
ప్రతిజ్ఞా మకరోద్రామో వధాయాశేషరక్షసాం॥ ౩౭

[2] ఇదం ప్రోవాచ ధర్మాత్మా సర్వానేవ తపస్వినః।
కించిత్కాలావరోధేన తత్తత్ప్రారబ్ధ సంక్షయాత్॥ ౩౮
హనిష్యే సర్వభూభారం క్రమేణా సురమండలం॥ ౩౮½

[3] * నైవమర్హథ మాం వక్తుమాజ్ఞప్తోఽహం తపస్వినాం॥ ౪౦
పితుస్తు నిర్దేశకరః ప్రవిష్టోఽహ మిదం వనం
భవతా మర్థసిద్ధ్యర్థ మాగతోఽహం యదృచ్ఛయా॥
తస్య మేఽయం వనే వాసో భవిష్యతి మహాఫలః
పశ్యంతు వీర్యమృషయ సభ్రాతుర్మే తపోధనాః। ౪౨
దత్వాభయం చాపి తపోధనానాం ధర్మే ధృతాత్మా।
సహలక్ష్మణేన తపోధనైశ్చాపి సభాజ్యనృత్తస్సు
తీక్ష్ణమే వాభిజగామ వీరః॥ ౪౩

ఇతి శ్రీరామాయణసారోద్ధారే.
అరణ్యాకాండే తృతీయస్సర్గః,

---

* నైవమితి తపస్విసామహమాజ్ఞాప్యః భక్తాధీనత్వాదిత్యాశయః। పితృవచనపరిపాలనాయాగతస్స్వయమితిన శంకనీయం తత్తువ్యాజమాత్రమిత్యాహ॥పితురితి॥ భవతామేవార్థసిద్ధ్యర్థం యదృచ్ఛయా నతుకర్మపారవశ్యేన అతస్తస్య భవత్కార్యార్థ మాగతస్యమే వనవాసః। తపస్వినాం మహాఫలో భవిష్యతీత్యర్థః॥

---

1. అధ్యాత్మ ౨ స॥ 2. విశ్వామిత్రరామాయణం. 3. వాల్మీకి ౬ సర్గ



౩౭. అంత శ్రీరామచంద్రుడా భయదైన్యములతో గూడిన యామహర్షుల వాక్యములవిని సకల రాక్షస సంహారముకొరకు బ్రతిజ్ఞగావించెను.

౩౮-౩౮½ ధర్మాత్ముడగు శ్రీరామచంద్రుడు మహర్షులతో నీవిధముగ ప్రతిజ్ఞగావించెను. కొంచెముమందు వేచక కాలముననుసరించి. వారి వారి ప్రారబ్ధము నశించుకొలదిని క్రమముగ. రాక్షసరూపమైనసమస్తభూభారమును హరించెను.

౪౦-౪౧-౪౨ ఓ మహర్షులారా తపోధనులుగనుండు మీరు నన్ను ప్రార్థించకూడదు. (అజ్ఞాపించుడు నాస్వలాభముకై మీబాధల దొలగించుటకే ఈవనమందు ప్రవేశించితిని పితృవాక్యపరిపాలనము నిమిత్తముగ జేసికొని మీకష్టమెఱిగి మిమ్మురక్షించుటకే నేను స్వేచ్ఛతో నిచటికివచ్చితిని. గాన నాకీ వనవాసము గొప్పదైన ఫలమొసగూర్చుచున్నది. తమ్మునితోగూడిననా పరాక్రమము తపోధనులగు మీరు చూచెదరుగాక యనెను.

౪౩½. అట్లు ధర్మమందు దృఢమైన మనస్సుగల వీరుడగు శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణునితోగూడి తపోధనులగు మహర్షుల కభయప్రదానముజేసి మహర్షులు పూజించుటకు తగిన వేషభాషాచారయుతుడై సుతీక్ష్ణమహర్షి యాశ్రమమార్గమున ప్రయాణముచేసెను.

ఇట్లు శ్రీరామాయణ సారోద్ధారమున
ఆరణ్యాకాండయందలి మూడవసర్గము ముగిసెను.

---

* నన్నాజ్ఞాపించుడన. తాపసులకేను ఆజ్ఞాపింపదగిన వాడనని యర్థము. భక్తాధీనుడగుటవలన నని తాత్పర్యము తండ్రియానతిచే పదునాల్గువర్షములరణ్యమందుండుటకు వచ్చినవానిగ నన్నెంచవలదు. అది నిమిత్తమాత్రమే నేను మీకుక్షేమము మొనగూర్చునిమిత్త మిచ్చటికివచ్చితిని స్వేచ్ఛచేగాదని తాత్పర్యము అందువలన మీకార్యార్థమై వచ్చిననావనవాసము తపస్వులగు మీకు మహాఫలదాయము గాకమానదని భావము,

## ఆరణ్యకాండే చతుర్థస్సర్గః.

1 * స గత్వా దూర మధ్వానం నదీస్తీర్త్వా బహూదకాః।
దదర్శ విపులం శైలం మహామేఘ మి వోన్నతం॥ ౧
దదర్శాశ్రమ మేకాంతే చీరమాలా పరిష్కృతం॥ ౧౫
తత్ర తాపస మాసీనం మల పంక జటాధరం।
రామ స్సుతీక్ష్ణం విధివ త్తపోనిధి మభాషత॥ ౨
రామోఽహ మస్మి భగవన్ భవంతం ద్రష్టు మాగతః। 3
స నిరీక్ష్య తతో వీరం రామం ధర్మభృతాం వరం॥ 3౫
సమాశ్లిష్య చ బాహుభ్యా మిదంవచన మబ్రవీత్॥ ౪
2 మామద్య సర్వజగతా మవిగోచర స్త్వం త్వన్మాయయా సుత కళత్ర గృహాస్థ కూపే మగ్నం నిరీక్ష్యమలపుద్గల పిండ మోహ పాశానుబద్ధ హృదయం స్వయ మాగ తోఽసి

* సగత్వేతి శ్లోకపర్యాలోచనయా శ్రీరామశ్శర భంగాశ్రమాద్దక్షిణతో బహుదూరమధ్వానం (అశీత్యుత్తర శతార్ధక్రోశపరిమితం) గత్వా మహానద్యుపనద్యః ఐంద్రా వత్యుపనదీశ్చతీర్త్వా విపులపర్వతమతిక్రమ్య (Bastur) బస్తర్ సంస్థానే ఐంద్రావతీ దక్షిణతటే విద్యమానంప్రకృతే (Santaspur) శాంతస్ పూర్ ఇతివ్యవ హ్రియమాణ సుతీక్ష్ణాశ్రమమా జగమేతి ద్యోత్యతే॥

1. వాల్మీకి రా ౪ స॥ 2. అధ్యాత్మ రా ౨ స॥



## నాల్గవ సర్గము.

౧-౧౫* శ్రీరామచంద్రమూర్తి సీతాలక్ష్మణులతో శరభంగాశ్రమమునుండి చాలదూరము ప్రయాణము చేసి, యుదక సమృద్ధిగల నదులదాఁటి, పెద్ద మేఘమువలె నల్లగ విశాలముగనున్న యెత్తైన పర్వతమును, అట నేకాంతమున నాఱఁగట్టిన నారబట్టల వరుసతో నలంకరింపఁ బడియున్న (సుతీక్ష్ణుని) యాశ్రమమును జూచెను.

౨-3 అచట నొడలికి నలుగుపెట్టుట మొదలగు సంస్కారములు లేకపోవుటచే మలినములై, నిరంతర వనసంచారముచే బురదగలవైయున్న జడలుదాలిచి కూర్చుండిన సుతీక్ష్ణుం డను తాపసునింగని శ్రీరామ చంద్రమూర్తి తపోనిష్ఠాగరిష్ఠుండగు నాతనితో విధివిధానముననిట్లనెను. మహాత్మా! నేను రాముఁడను తమ్ము దర్శింపవచ్చినాఁడను.

3౫-౪ అంత నాముని కన్నులఁదెఱచి వీరుండును, ధార్మికశ్రేష్ఠుండు నగు శ్రీ సీతారామచంద్రునిం జూచి బాహువులు చాచి కౌగిలించుకొని యిట్లనియె.

౫ ఓ రామచంద్రా! లోకములం దెవరికిని నిన్ను దెలిసికొనఁ దరము గాదు. దారాపుత్రాది సంసారరూపమగు పాడునూతిలోఁబడి నీ మాయచే మలరూపమైన యీశరీరమే నే నను మోహపాశమునఁ దగుల్కొన్న మనసుగల నన్నుఁ గనుగొన స్వయముగా వచ్చితివి.

* శ్రీరాముఁడు శరభంగాశ్రమమునుండి చాలదూరము; అనఁగా దక్షిణముగా నూటయెనుబదిమైళ్లు నడచి మహానద్యుపనదులను, ఐంద్రావతి యుపనదులను దాఁటి, విపులపర్వతము నతిక్రమించి, (Bastur) బస్తర్ సంస్థానమున ఐంద్రావతీనది దక్షిణఁపుటొడ్డున నున్న సుతీక్ష్ణాశ్రమమును జేరెనని తెలియుచున్నది. దీనినే ప్రస్తుతము 'శాంతస్‌పూరు' (Santaspur) అని పిలిచెదరు.

ప్రత్యక్షతో ఽద్య భవత శ్చరణారవిందం
పశ్యామి రామ! తమసః పరతః స్థితస్య
దృగ్గ్రాహిత స్త్వ మసతా మవిగోచరో ఽపి
త్వన్మంత్ర పూత హృదయేషు సదా ప్రసన్నః॥ ౬

ఇత్యేవం స్తువత స్తస్య రామ స్సస్మిత మబ్రవీత్
మునే! జానామి తే చిత్తం నిర్మలం మదుపాసనాత్॥ ౭
అతో ఽహ మాగతో ద్రష్టుం మదృతే నాన్యసాధనమ్॥ ౭½

[1] భవాన్ సర్వత్ర కుశల స్సర్వభూతహితే రతః
ఆఖ్యాత శ్శరభంగేణ గౌతమేన మహాత్మనా॥ ౮½

ఆవాసం త్వహ మిచ్ఛామి ప్రదిష్ట మిహ కాననే॥ ౯

సుతీక్ష్ణ ఉవాచ —

అయమే వాశ్రమో రామ! గుణవా న్రమ్యతా మిహ
* ఇమ మాశ్రమ మాగమ్య మృగసంఘా మహాయశాః॥ ౧౦
అటిత్వా ప్రతిగచ్ఛంతి లోభయిత్వా ఽకుతో భయాః
నా ఽన్యో దోషో భవే దత్ర మృగేభ్యో ఽన్యత్ర విద్ధి వై॥ ౧౧

* ఆశ్రమమ్ తపోవనమ్. లోభయిత్వా సమాధిభంగం జనయిత్వా. విచిత్రవేషై రితి శేషః. ప్రతిగచ్ఛంతి ప్ర

1. వాల్మీకి రా. ౭ స.



౬ శ్రీరామా! తమోగుణాతీతుఁడవగు నీయొక్క పాదపద్మములను నేను బ్రత్యక్షముగా నేఁడు జూడఁగంటిని. దుర్మార్గుల కేవల బహిశ్చక్షువులకు నీవు కనఁబడవు. నీపవిత్ర తారకమంత్రము నిరంతరము జపించుటచే పావనములైన హృదయములయం దెల్లప్పుడును నీవు ప్రసన్నుఁడవై యుందువు.

౭-౭½ ఇట్లు సుతీక్ష్ణముని స్తోత్రముచేయుచుండఁగా శ్రీరాముఁడు చిఱునగవుతో నిట్లనియె. ఓమునీ! నన్నుపాసించుటవలన నిర్మలమై యున్న నీమనసు నే నెఱుఁగుదును. కనుక నేనే మిమ్ము దర్శింప వచ్చితిని. నాకంటె వేరుసాధనము లేదు.

౮½ తాము సర్వ విషయములందును గడు నేర్పరులు. సమస్త భూతముల హితవును గోరువారు, అని గౌతమవంశోద్భవుఁడగు శరభంగమహర్షి నాతో ననెను.

౯ ఈయడవిలోఁ దామెజింగించిన తావున నివసింపఁ గోరుచున్నాఁడను.

అన విని సుతీక్ష్ణుఁ డిట్లనియె.

౧౦-౧౧ రామచంద్రా! ఈయాశ్రమమే మిగుల శుభలక్షణములుకలది. నీవిచట సుఖసుఖముగా విహరింపవచ్చును.
* కాని యీ తపోవనమునకు నెందును భయమనునది లేనిదై యడవి జంతువులు గుంపులు గొనివచ్చి యిట్టట్టు విచ్చలవిడిఁ దిరుగాడుచు మునులసమాధికి భంగము కలుగునట్లు వారిని లోభపెట్టుచుఁ బోవుచున్నవి. మృగములవలనకంటె నింకొకటి దోష మీ యాశ్రమమునఁ గలుగ దని తెలియుము.

* మృగములు విచిత్రమైన రూపములతో నిచటికివచ్చి మునులను లోఁగొని సమాధికి భంగముగలిగించుచున్నవి. మృగములవలనకంటె నిం

రామ ఉవాచ —

తా నహం సుమహాభాగ ! మృగసంఘా న్సమాగతాన్
హన్యాం నిశితధారేణ శరే ణాశనివర్చసా॥ ౧౨

♦ భవాం స్తత్రాఽభిషజ్యేత కింస్యా త్కృచ్ఛ్రతరం తతః
ఏతస్మి న్నాశ్రమే వాసం చిరం తు న సమర్థయే॥ ౧౩
త మేవ ముక్త్వా వరదం రామ స్సంధ్యా ముపాగమత్॥ ౧౩½

తత శ్శుభం తాపసభోజ్య మన్నం
స్వయం సుతీక్ష్ణః పురుషర్షభాభ్యామ్
తాభ్యాం సుసత్కృత్య దదౌ మహాత్మా
సంధ్యానివృత్తౌ రజనీ మవేక్ష్య॥ ౧౪½

---

యాంతి. మృగేభ్య ఇతి హేతుగర్భితమ్. మృగరూపధారిణో రాక్షసా ఏవాఽఽగత్య తపోవిఘ్నం కుర్వంతీ త్యర్థః.

♦ భవా నితి. అహం మృగసంఘాన్ హన్యాంచే త్తత్రాశ్రమసంబాధత్వా ద్భవా నభిషజ్యేత. విషాదం ప్రాప్నుయాత్. ఆక్రోశంవా శపథం కుర్యాత్. మృగహననం నకుర్వితి. యద్వా అభిషజ్యేత అభిభూయేత. 'అభిషఙ్గః పరిభవే సఙ్గాక్రోశనయో రపి.' తాదృశ మృగహననే మయా త్వం కృతాపరాధో భవేః ఆశ్రమసంబంధిత్వా దితి భావః. తతః కృచ్ఛ్రతరం కష్టతరం కిం. న కి మపీత్యర్థః.



నావిని రాముఁ డిట్లనియె.

౧౨ మహాత్మా ! ఆవచ్చెడి యడవిజంతువుల గుంపుల నన్నిఁటిని పిడుఁగులఁబోలు తేజమును, పదునైన యంచులునుకల (ఒక్క) బాణముచేతనే సంహరింతును.

౧౩-౧౩½ ♦(కాని) అట్లు చేయుదునేని తమరు పరితాపపడుదురు. (ఇఁక నెన్నఁడును మృగములఁ జంపవల దని యాక్రోశముగాని, శపథము గాని చేయుదురు.) నా కింతకంటెఁ గష్టతరమగున దేముండును ? కనుక నే నీ తపోవనముననే చిరకాలముండుటను సమర్థింపఁజాలను, అని వరప్రదాతయగు నాసుతీక్ష్ణ మహర్షినిం గని పలికి శ్రీరామచంద్రమూర్తి సంధ్యావందన మాచరింపఁబూనెను.

౧౪½ సంధ్యా సమాప్తి యైన తరువాత, రాత్రిరాఁగాఁ గని సుతీక్ష్ణ మహర్షి పురుషోత్తము లగు శ్రీరామ లక్ష్మణులను స్వయముగ నెంతో సమ్మానించి, వారికి మునులు భుజించు శుభకరమగు కంద మూల ఫలాదిరూప మగు నాహారమును నివేదించెను.

---

కొకదోష మీయాశ్రమమున లేదనుటలో; రాక్షసులే విచిత్రముగ మృగరూపములధరించి మునులతపోవిఘ్నము కలిగించుచున్నా రని యర్థ మిమిడి యున్నది.

♦ నేను మృగములఁ జంపవలసినచోఁ దమ యాశ్రమమునకుఁ దప్పక యొత్తిడికలుగును. అందులకుఁ దాము విషాదపడుదురు. లేక యాశ్రమభూముల జరుగు ప్రాణిహింస కాక్రోశముచెంది మృగవధ మెన్నఁడు చేయకు మని శపథమైనఁ జేయుదురు. లేక పరాభవము పొందుదురు, మీయాశ్రమ సంబంధములగు నీమృగములఁ జంపుట మిమ్ముఁ బరాభవించుటయే కాఁగలదు. ('అభిషఙ్గము' అను పదము ఆక్రోశము శపథము, పరాభవము అను నర్థములందు వర్తించును.) కనుక యిందేది మీయెడల జరిగినను నా కంతకంటెఁ గష్టతరమైన విషయ మింకొకటి యుండదు. అని భావము.

[1] ఉత్థాయ తు యథాకాలం రాఘవ స్సహ సీతయా
కాల్యం విధివ దభ్యర్చ్య తపస్విశరణే వనే॥ ౧౫½
సుతీక్ష్ణ మభిగ మ్యేదం శ్లక్ష్ణం వచన మబ్రవీత్. ౧౬

ఆపృచ్ఛామః ప్రయాస్యామో మునయ స్త్వరయంతి నః
త్వరామ హే వయం ద్రష్టుం కృత్స్న మాశ్రమమండలమ్. ౧౭

సుతీక్ష్ణఉవాచ —

అరిష్టం గచ్ఛ పంథానమ్ రామ! సౌమిత్రిణా సహ
ఆగంతవ్యం త్వయా తాత! పునరే వాశ్రమం మమ॥ ౧౮
ఏవ ముక్త స్తథే త్యుక్త్వా ప్రస్థాతు ముపచక్రమే॥ ౧౮½

[2] సుతీక్ష్ణే నాభ్యనుజ్ఞాతం ప్రస్థితం రఘునందనమ్
హృద్యయా స్నిగ్ధయా వాచా భర్తార మిద మబ్రవీత్॥౧౯½

అయం ధర్మ స్సుసూక్ష్మేణ విధినా ప్రాప్యతే మహాన్
నివృత్తేనతు శక్యోఽయం వ్యసనా త్కామజా దిహ॥ ౨౦½

త్రీణ్యేవ వ్యసనా న్యత్ర మిథ్యా వాక్యం రఘూద్వహ
పరదారాభిగమనం వినా వైరంచ రౌద్రతా॥ ౨౧½

1. వాల్మీకి రా. ౭ స. 2. వాల్మీకి రా. ౮ స.



౧౫½-౧౬ శ్రీరాముఁడు సీతాదేవితో సకాలమునకు మేలుకొని, తపస్వి జనావాసమగు నా వనమునఁ బ్రాతఃకాలకృత్యముల యథావిధిగ నిర్వర్తించి, సుతీక్ష్ణమహర్షిని సమీపించి ప్రియకరమగు నీపలుకు పలికెను.

౧౭ మునీ! సెలవు దయచేయఁ గోరెదము. వెళ్లుచున్నారము. మావెంట వచ్చిన యీ మునులు తొందరపెట్టుచున్నారు. మేమును దండకారణ్యమునందలి ఋష్యాశ్రమముల నన్నిఁటిని జూడ వేగిర పడుచుంటిమి.

అన విని సుతీక్ష్ణమహర్షి యిట్లనియె.

౧౮-౧౮½ శ్రీరామచంద్రా! సుమిత్రాకుమారుఁడగు లక్ష్మణుఁడు తోడు గాఁగా, నెట్టి యుపద్రములును లేని దారిని బోయిరమ్ము. తండ్రీ! తప్పక నాయీ యాశ్రమమునకు మఱల రావలెనుమీ! శ్రీరాముఁడదివిని, యట్లే యగుఁగాక అని పలికి ప్రయాణోన్ముఖుఁడయ్యెను.

౧౯½ సుతీక్ష్ణమహర్షి వలన సెలవు గైకొని, మునులవెంబడిఁ బయనింప వెడలిన శ్రీరామచంద్రునిం గాంచి సీత (ఒంటరిగ లక్ష్మణుఁడు మాత్రమే యున్నపుడు) మనోహరమై, స్నేహభావమును బెంపొందించు నీ మాట పల్కెను.

౨౦½ నాథా! ఇపుడు మీ రాచరించుచున్న యీఋషి ధర్మము ఎంతో సూక్ష్మమార్గమునఁ బొందఁబడునది. ప్రాపంచికేచ్ఛల వలన వ్యసనములు సాధారణముగఁ బుట్టుచుండును. వాని బారినుండి విడివడినట్టివారికిఁ గాని యీ ఋషి ధర్మ మనుష్ఠింప శక్యముగాదు.

౨౧½ రఘునాయకా! లోకమున సాధారణముగ మూఁడే వ్యసనములు. అసత్యమాడుట, పరదారాభిగమనము, వైరములేకయే యితరుల హింసించుట' అనునవి.

మిథ్యావాక్యం న తే భూతం న భవిష్యతి రాఘవ!
కుతోఽభిలాషణం స్త్రీణాం పరేషాం ధర్మనాశనమ్॥ ౨౨

తృతీయం య దిదం రౌద్రం పరప్రాణాభిహింసనమ్
ప్రతిజ్ఞాత స్త్వయా వీర! దండకారణ్యవాసినామ్॥ ౨౩

ఋషీణాం రక్షణార్థాయ వధ స్సంయతి రక్షసామ్
ఏతన్నిమిత్తంచ వనం ప్రస్థిత స్త్వమితి శ్రుతమ్॥ ౨౪

పురా కిల మహాబాహో తపస్వీ సత్యవా క్ఛుచిః
తస్య శస్త్రస్య సంవాసా జ్జగామ నరకం మునిః॥ ౨౫

స్నేహాచ్చ బహుమానాచ్చ స్మారయే నతు శిక్షయే
అపరాధం వినా హంతుం లోకా న్వీర! నకామయే॥ ౨౬



౨౨ ఇదివరలో నీవు అసత్యమాడి యెఱుఁగవు. ముందును నీయెడ నట్టిది కలుగదు. ఇంక తనధర్మమును నాశనము చేయుటమాత్ర ముతో సరిపడక యింకొకరి ధర్మమును (అనఁగాఁ బరస్త్రీల పాతి వ్రత్య నియమమును) గూడ నాశనముచేయు పరదారాభిగమన మం దభిలాషకు నీయెడలఁ బ్రసక్తి యెక్కడ?

౨౩ ఎట్టి వైరములేకయే యితరుల ప్రాణములను హింసించు రౌద్ర మను వ్యసనము మూడవది. వీరాగ్రణీ! నీ విపుడు దండకారణ్యమునందలి మునులను గాపాడుటకు బాసయిచ్చుట యీ వ్యసనమునకు సంబం ధించినదే.

౨౪ ఋషులను రక్షింపవలెనన్న రాక్షసులను యుద్ధమునఁ జంపవలసి యుండును. ఇందులకే తా మడవికి బయలుదేరితి రని (ఒకప్పుడు వారు ఋషులతో ననుచుండఁగా) వింటిని.

౨౫ గొప్ప బాహువులుకలవాఁడా! మున్నొకప్పుడు సత్యవచనుఁడును, తపస్సంపన్నుఁడు నగు నొక ముని యుండెను. అతని తపంబునకు భంగముకలిగింపవలె నని యెంచి యింద్రుఁ డొక యాయుధము నాతనికి దాఁచ నిచ్చెను. అద్దాని నెల్లపుడు దగ్గఱనుంచుకొని, క్రమ క్రమముగా నా మహర్షి యదేపనిగా నా యాయుధము నుపయో గింప నలవాటుపడి, తపస్సుచెడి తుదకు నరకలోకమును బొందెను. (కనుక తపసులకు రౌద్రధర్మ మెన్నటికిని గూడ దని భావము)

౨౬ నాకు నీయందుఁగల చనవుచేతను, గౌరవముచేతను (నీకుఁ దెలిసి యున్న విషయమునే) నే నిపుడు జ్ఞాపకము చేయుచున్నాను. గాని నీకుఁ దెలియని క్రొత్తసంగతుల నీకు శిక్షించుట లేదు. ఓ వీరాగ్రే సరా! నిరపరాధములగు లోకములను సంహరించుట నా కభి మతము గాదు.

[1]శ్రుత్వా ధర్మే స్థితో రామః ప్రత్యువాచాஉథ మైథిలీమ్॥ ౨౭

హిత ముక్తం త్వయా దేవి! స్నిగ్ధయా సదృశం వచః
క్షత్రియై ర్ధార్యతే చాపో నార్త శబ్దో భవేదితి
మాం సీతే! స్వయ మాగత్య శరణ్యా శ్శరణం గతాః॥ ౨౮

అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్
న తు ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః॥ ౨౯
త దవశ్యం మయా కార్య మృషీణాం పరిపాలనమ్॥ ౩౦

[2]ధర్మాగమాః ధర్మపరాః యే న రక్షంతి మానవాః
పార్థివా శ్శక్తియుక్తాశ్చ తేషాం పాపం హరంతి తే॥ ౩౧

1. వాల్మీకి రా.౧౦స. 2. భాగవతే రాజధర్మే.



౨౭ ఇది విని పిమ్మట శ్రీరామచంద్రుఁడు సీతను జూచి ధర్మముం దప్పక యిట్లు బదులు చెప్పెను. దేవీ! నాయం దనురాగము కల నీవు నీయుత్తమవంశసంభవత్వాది సద్గుణములకుఁ దగిన యట్లు నా హితవునే కోరి పలికితివి.

౨౮ ఏమూలనుండియు నార్తధ్వని వినఁబడకుండఁ జేయుటకే క్షత్రియులు ధనుస్సును ధరింతురు. సీతా! తపోబలముచే నెల్లలోకములను సంరక్షింపఁగల సమర్థత గలవారయ్యును, యీ మునులు స్వయముగా దయచేసి నన్ను శరణు పొందిరి.

౨౯-౩౦ జానకీ! 'భార్యను ధనములను విడిచియైనను తన ప్రాణమును గాపాడుకొనవలయును' అను న్యాయము కలదు. దానినిగూడ లెక్క సేయను. ఋషులను గాపాడుటకు నా ప్రాణములనైనను విడుతును. నా బహిఃప్రాణమగు లక్ష్మణునేని వదలుకొందును. నా కర్ధశరీరమగు నిన్నైనను గోల్పోయెదఁగాక! అంతేకాని చేసిన ప్రతిజ్ఞను మాత్రము విడువను. అందులో విశేషముగ బ్రహ్మవిదుల యొద్ద 'తప్పక మిమ్ముఁ గాపాడుదు' నని ప్రతిజ్ఞచేసి, యది నెరవేర్పకుండ విడుతునా? ఈతీరున నన్నే దిక్కుగా నమ్మి బాధల ననుభవించుచున్న వారిని వారు వచ్చి కోరకముందే కాపాడవలసినది. నేను వారికోరికపై ప్రతిజ్ఞచేసిన మీఁదట నికఁ జెప్పవలసిన దేమున్నది? కనుక ఋషులను దప్పక కాపాడియే తీరవలెను.

౩౧ ధర్మశాస్త్రముల నెఱిఁగినట్టియు, ధర్మము నాచరించుటయందు శ్రద్ధగలట్టియు మనుజుల నేరాజులు శక్తిగలిగి యుండియు రక్షింపరో, ఆ రాజులు వారికిఁ దటస్థించు పాపమును దామే పొందుదురు.

* [1] ఇత్యేవ ముక్త్వా వచనం మహాత్మా
సీతాం ప్రియాం మైథిలరాజపుత్రీమ్
రామో ధనుష్మా న్సహ లక్ష్మణేన
జగామ రమ్యాణి తపోవనాని॥ ౩౨

† తౌ పశ్యమానౌ వివిధా న్శైలప్రస్థా న్వనానిచ
నదీశ్చ వివిధా రమ్యా జగ్మతు స్సహ సీతయా॥ ౩౩
పంచాప్సర స్తటాకస్య శృణ్వంతౌ మహిమాం ద్విజైః
ప్రవిశ్య సహ వై దేహ్యా లక్ష్మణేన చ రాఘవః॥ ౩౪
ఉవాస మునిభి స్సార్థం శ్రీమ త్యాశ్రమ మండలే॥ ౩౫

* ఇతీతి. అనేన జాగరూకతయా ధర్మానుష్ఠాతౄ రక్షణ మవశ్యం కర్తవ్య మితి సూచితమ్. రాక్షసవినాశనే. 'నాను పహత్య భూతా న్యుపభోగ స్సంభవ' తీతి శ్రుతిః.

† తావితి. అనేన శ్రీరామచంద్ర స్సుతీక్ష్ణాశ్రమా ద్బహు దూర మభివ్యాప్య స్థితాన్ మహర్ష్యాశ్రమాన్ క్రమేణ ప్రపశ్యన్, పంచాప్సర స్సరోవర మపి గతవా నితి వ్యజ్యతే. తదిదానీం సుతీక్ష్ణాశ్రమా దీషద్వైషమ్యేన పంచాశదుత్తర శతార్థ క్రోశదూరే వాయవ్య దిగ్భాగే (Navegone) 'నావేగోన్' సరోవర ఇతినామ్నా ప్రసిద్ధతయా ప్రకాశతే.

1. వాల్మీకి రా. ౧౦ స.



౩౨ * ఇట్లు మహాత్ముఁ డగు శ్రీరామచంద్రుఁడు ప్రియురా లగు జానకితోఁ బలికి సమాధానపఱచి, ధనువును ధరించి, లక్ష్మణుఁడు వెంటరాఁగా మనోహరములైన తపోవనములకుఁ జనెను.

౩౩-౩౫ † రామలక్ష్మణులు సీతాదేవితోఁ గూడ, వివిధములైన కొండ నెత్తములను, వనములను, అనేకములైన సుందరములగు నదులను దిలకించుచు, నచటనున్న పంచాప్సర మను తటాకము యొక్క మహిమను బ్రాహ్మణులు చెప్పఁగా వినుచు వెళ్లిరి. శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో నచటి శోభాయుక్తములయిన యాశ్రమ మండలములఁ బ్రవేశించి మునులతోఁగూడ నట నివసించుచు వచ్చెను.

* దీనివలన నతిజాగరూకతగ ధర్మసూక్ష్మముల నెఱిఁగి, ధర్మజ్ఞులును, ధర్మానుష్ఠానపరులు నగు వారిని రాజు లవశ్యము రక్షింపవలయునని సూచింపఁబడినది. అట్లయిన రాక్షసులకు హింసకలుగదా? యన, అది సరిగాదు. వారి పాపకృత్యమే వారిని హింసించును. 'ఇతరుల కెట్టి బాధలు లేక ప్రపంచమునం దెట్టి వారికెని సుఖభోగాదు లేర్పడవు' అని శ్రుతియే చెప్పుచున్నది.

† దీనివలన శ్రీరామచంద్రమూర్తి సుతీక్ష్ణాశ్రమము నుండి చాలదూర మువరకు వ్యాపించియున్న మహర్ష్యాశ్రమములఁ జూచుచు, పంచాప్సర మను సరోవరమును గూడ కాంచెనని తెలియుచున్నది. ఆ పంచాప్సర స్సరోవరము ప్రకృతము సుతీక్ష్ణాశ్రమమునకు సుమారు నూటయేబది మైళ్ల దూరమున వాయవ్యదిశయం దున్నది. దానిని యిప్పటివారు (Navegone) 'నావేగోన్' సరోవర మని పిలుచుచున్నారు.

♦ ఉషిత్వాతు సుఖం తత్ర పూజ్యమానో మహర్షిభిః॥ ౩౫
జగామ చాశ్రమాం స్తేషాం పర్యాయేణ తపస్వినామ్
యేషా ముషితవాన్ పూర్వం సకాశే మహద స్త్రవిత్॥౩౬
క్వచిత్పరి దశా న్మాసా నేకం సంవత్సరం క్వచిత్
క్వచిచ్చ చతురో మాసాన్ పంచ షట్చాపరాన్ క్వచిత్॥౩౭
అపరత్రాధికం మాసా దప్యర్థ మధికం క్వచిత్
త్రీన్మాసా నష్టమాసాం శ్చ రాఘవో న్యవస త్సుఖమ్॥౩౮

తథా సంవసత స్తస్య మునీనా మాశ్రమేషు వై
రమత శ్చానుకూల్యేన యయు స్సంవత్సరా దశ. ౩౯

♦ ఉషిత్వేతి. ఏషాం సకాశే పూర్వ ముషితవాన్ శరభంగాశ్రమా దితః తేషా మాశ్రమాన్ ద్వితీయ పర్యాయేణ చ జగామేత్యర్థః. ఏవ మాశ్రమవాసప్రకారః. ఏకవారం సర్వేషా మాశ్రమాన్ గత్వా పున రపి తేషా మాశ్రమాన్ జగామేతి వాక్యార్థః. 'మహదస్త్రవి' దిత్యనేన తత్రత్య రాక్షసోపద్రవ పరిహారాయ పునర్గమన మితి సూచయతి. వక్ష్యతి చ మారీచః శ్రీమద్రామాయణే అరణ్యకాండే శ్లో॥ 'తేన ముక్తా స్త్రయో' ఇ త్యారభ్య 'సముద్భ్రాంత స్తతో ముక్తా' ఇత్యంతేన. ఏతదర్థ మేవ సుతీక్ష్ణే నాత్ర గమన మనుజ్ఞాతం ఋషిభిః కారితంచేతి.



౩౫-౩౮ ♦ ఇట్లు మహర్షులపూజ లందుచు, నాయా యాశ్రమములందు సుఖముగా నివసించి, సర్వాస్త్రకుశలుండగు శ్రీరామచంద్రమూర్తి పూర్వము తా నే యే మహర్షుల యాశ్రమములం దొకమారు నివసించెనో, ఆ యా యాశ్రమములకు మరొక్కమారు వెళ్లి యచట నుండుచు వచ్చెను. ఆ రఘువరుఁడు కొన్నిఁట నించుమించుగ పది మాసలును, కొన్నిఁట నొక్క సంవత్సరమును, కొన్నిఁట నాల్గు మాసములును, కొన్నిఁట నైదారుమాసములును, కొన్నిఁట నొక్కమాసముకంటె నెక్కుడుగను, కొన్నిఁట సగము నెలకంటె నెక్కువగను, కొన్నిఁట మూడుమాసములును, కొన్నిఁట నెన్మిది మాసములును సుఖముగా వసించెను.

౩౯ ఆరీతి శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణ సహితుఁడై యా యా ఋషుల యాశ్రమములను జేరి వారితో ననుకూలముగ ముచ్చటలాడుచు విహరించుచుండ వరుసగాఁ బది సంవత్సరము లతిక్రమించెను.

♦ శ్రీరాముఁడు శరభంగాశ్రమమును దాఁటిన తరువాత నేయే యాశ్రమములం దొకమారు వసించెనో, వానికి మరొక్కమారు వెళ్లుచు వచ్చెనని యర్థము 'సర్వాస్త్రకుశలుఁడు' అనుటచే రాక్షసోపద్రవము కలిగిన ట్లనుమానము తోఁచిన నది వారించుటకే మరల వెళ్లిన యాశ్రమములకే వెళ్లెనని సూచింపఁబడుచున్నది. శ్రీమద్రామాయణారణ్య కాండమున మారీచుఁడును తాను మృగరూపమున సంచరించుటయు, అపుడు శ్రీరాముఁడు సాధారణ మృగములను విడిచి, మాయామృగములనే వెదకి వెదకి చంపువాఁడనియు మొదలగు విషయములను రావణునితోఁ జెప్పెను. ఇందులకే సుతీక్ష్ణమహర్షి రాముని ముందటి యరణ్యసంచారమున కనుమతి నిచ్చుటయు, తక్కిన మునులందులకు సాయపడుటయు జరిగెను.

[1] బహవో నిహతా స్తత్ర రాక్షసా భీమతా తథా. ౩౯½

[2] రాక్షసా యత్ర తిష్ఠంతి తత్ర గత్వా రఘూద్వహః
రాత్రౌ హత్వాచ తాన్సర్వాన్ కబంధాగ్రేహ్యపాతయత్ ౪౦½

[3] పరివృత్యచ ధర్మజ్ఞో రాఘవ స్సహ సీతయా
సుతీక్ష్ణ స్యాశ్రమం శ్రీమాన్ పున రే వాజగామహ. ౪౧½

[4] రామ మాగత మాజ్ఞాయ సుతీక్ష్ణ స్స్వయ మాగతః
అగ స్త్యశిష్యో రామస్య మంత్రోపాసనతత్పరః
విధివ త్పూజయామాస భక్త్యుత్కంఠితలోచనః. ౪౩

సుతీక్ష్ణ ఉవాచ.—

త్వన్మంత్రజా ప్యహ మనంతగుణాప్రమేయ!
సీతాపతే! శివ విరించి సమాశ్రితాంఘ్రి!
సంసారసింధుతర ణామలపోతపాద!
రామాభిరామ! సతతం తవ దాసదాసః. ౪౪

విశ్వస్య సృష్టిలయసంస్థితిహేతు రేక
స్త్వం మాయయా త్రిగుణయా విధి రీశవిష్ణూ
భాసీశ! మోహిత ధియాం వివిధాకృతి స్త్వం
యద్వ ద్రవి స్సలిలపాత్రగతో హ్యనేకః. ౪౫

1. ఆనందరామా. సారకాం. ౭ స. 3. వాల్మీకి రా. ౧౧ స.
2. తత్వసంగ్రహ రా. 4. అధ్యాత్మరామా. ౨ స.



౩౯½-౪౦½ ఇట్లాతఁడు తిరిగితిరిగి రాక్షసుల నందరిని జంపెను. పగలంతయు ఋషులతోఁ గాలక్షేపము సేయుచు రాత్రికాలమున (నిశాచరులగుటచే) నెవ్వరికిని గానరాకుండ నా రక్కసులు వసించుచుండెడు పలు తావుల కేగి, వారి కళేబరములు విగతజీవములై, కబంధుని సమీపమునఁ బడునట్లు బాణములచే విసరుచుండెను.

౪౧½ ఇట్లు ధర్మజ్ఞుఁడగు శ్రీరాముఁ డచ్చట రాక్షససంహారమును ముగించి సీతాలక్ష్మణ సహితుండై మరలి సుతీక్ష్ణుని యాశ్రమముం జేరెను. (అప్పటినుండియు నా యాశ్రమ ప్రాంతముల రాక్షసబాధలు తొలఁగిపోయెను.)

౪౨-౪౩ అంతి శ్రీరామ మంత్రోపాసకుఁ డగు నా సుతీక్ష్ణుఁడు వారి నెదుర్కొని భక్తిచే దర్శనలాలసములై యున్న నేత్రములు కలవాఁడై అర్ఘ్యపాద్యాది విధులచేఁ బూజించి యీ ముందురీతిని స్తుతింపసాగెను.

౪౪ మనోబుద్ధులకుఁ దెలియ శక్యముగాని యనంతకల్యాణ గుణములు కలిగి మనోహరుఁడవై యొప్పు నో సీతాపతీ! సంసార మను సముద్రమును దాఁటుటకు నావలై బ్రహ్మరుద్రాదులచే సేవింపఁబడు పాదములుకల నిన్నే సదా జపించుచు దాసానుదాసుఁడనై యున్నాఁడను.

౪౫ విశ్వముయొక్క సృష్టిస్థితిలయములకుఁ గారణుఁడవై యొక్కరుండవయ్యును; సూర్యుఁ డొకఁడయ్యును ఘటజలములం దనేకసూర్యులుగాఁదోఁచుకైవడి, సత్వరజస్తమోగుణరూప మగు మాయచే నజ్ఞానుల దృష్టియందు బ్రహ్మవిష్ణుశివాదిరూపభేదములచే ననేకుఁడవై తోఁచుచుందువు.

ఇత్యేవం స్తువత స్తస్య రామ స్సస్మిత మబ్రవీత్ ౪౫

త్వం మమోపాసనా దేవ విముక్తో ఽసీహ సర్వతః.
దేహాంతే మమ సాయుజ్యం లప్స్యసే నాత్రసంశయః. ౪౬

[1] ఇత్యుక్త్వా స తు రామోఽపి మునిభిః ప్రతిపూజితః
తత్రాఽపి న్యవస ద్రామః కంచిత్కాల మరిందమః. ౪౭

తతః కదాచి ద్రామ స్తు సుతీక్ష్ణ మిద మబ్రవీత్
[2] గురుం తే ద్రష్టు మిచ్ఛామి హ్యగ స్త్యం మునినాయకమ్. ౪౮
సుతీక్ష్ణోఽపి తథే త్యాహ శ్వో గమిష్యసి రాఘవ!
అహ మ ప్యాగమిష్యామి చిరా ద్దృష్టో మహామునిః. ౪౯

[3]*యోజనా న్యాశ్రమా దస్మా త్తథా చత్వారి వై తతః. ౫౦
దక్షిణేన మహాన్ శ్రీమా నగ స్త్యభ్రాతు రాశ్రమః
తత్రాఽగస్త్యాశ్రమపదం గత్వా యోజన మంతరమ్.
రమణీయే వనోద్దేశే బహుపాదపసంయుతే. ౫౧

* యోజనానీతి. సుతీక్ష్ణాశ్రమా ద్దక్షిణతః యోజన చతుష్ట యదూరే గోదావరీపూర్వతటే అగ స్త్యభ్రాతుః సుదర్శన స్యాశ్రమః ప్రకాశతేతి. తతశ్చ యోజనే అగస్త్యాశ్రమః. తా విదానీం బ స్తరు సంస్థానస్య దక్షిణతః విద్యేతే.

1. దేవీరామాయణం. 2. అధ్యాత్మ రా. ౨ స.
3. వాల్మీకి రా.౧౧స.



౪౫ ఇట్లు స్తుతించు నా మహర్షితో రామచంద్రమూర్తి చిఱునగవుతో నిట్లనియె.

౪౬ నీవు నన్నుపాసించుటవలన నాకంటె వేరగు సర్వమునుండి విముక్తుఁడవై నాఁడవు. దేహావసానమున నా సాయుజ్యమును బొందఁగలవు. సంశయము లేదు.

౪౭ ఇట్లు శత్రుసంహారకుఁ డగు శ్రీరామచంద్రమూర్తి నుడివి యచటి మునులచే మిగులఁ బూజింపఁబడుచు నచటనే కొంతకాలము నివసించెను.

౪౮ అటుతరువాత నొకపుడు శ్రీరాముఁడు సుతీక్ష్ణమహర్షితో; ‘మహర్షీ! మీ గురువును మునులకందరికిని నాయకుఁడు నగు నగ స్త్య మహర్షిని సందర్శింపఁగోరుచున్నాను’ అనెను.

౪౯ సుతీక్ష్ణుఁడు నట్లే చేయవచ్చును. రామచంద్రా! రే పచటి కేగుదువు గాక! నేను నా మహర్షిని దర్శించి చాలకాలమైనది. కనుక నీతో నేనుగూడ రాఁగలను.

౫౦-౫౧ * ఈ నా యాశ్రమమునుండి దక్షిణముగా నాల్గుయోజనముల దూరములో నగ స్త్యభ్రాత యగు సుదర్శనమహర్షి యొక్క శోభాయమానమగు నాశ్రమము కలదు. దాని కొక యామడదూర మున వివిధములగు వృక్షములతోఁగూడి మనోహరమైయున్న వన మధ్యమున నగస్త్యాశ్రమ మున్నది.

* సుతీక్ష్ణుని యాశ్రమమునకు దక్షిణముగా నాల్గుయోజనముల దూర మున గోదావరీనదికిఁ దూర్పునొడ్డున నగ స్త్యమహర్షికి సోదరుఁడగు సుదర్శనమహర్షి యొక్క యాశ్రమము గన్పట్టును. దాని కొక యోజ నముదూరమున నగ స్త్యముని యాశ్రమము గల దని యర్థము. అది ‘బ స్తరు సంస్థానము’ అని నేఁడు పిలువఁబడు ప్రదేశమునకు దక్షిణఁపుదెస నున్న దని తెలియుచున్నది.

రంస్యతే తత్ర వైదేహీ లక్ష్మణశ్చ సహ త్వయా. ౫౨

[1] ఇత్యుక్త్వా తత్ క్షపాం నీత్వా సుతీక్ష్ణ మునిసత్తమః
తతః ప్రభాతే శ్రీరామం ముని రాహ ముదాన్వితః. ౫౩

[2] యది బుద్ధిః కృతా ద్రష్టు మగస్త్యం తం మహామునిం
అద్యైవ గమనే బుద్ధిం రోచయస్వ మహాయశః! ౫౪

[3] అథ రామ స్సుతీక్ష్ణేన జానక్యా లక్ష్మణేనచ
* అగస్త్య స్యానుజస్థానం మధ్యాహ్నే సమపద్యత. ౫౫

ఇదం పరమసంహృష్టో రామో లక్ష్మణ మబ్రవీత్. ౫౫½

అగస్త్య స్యాశ్రమో భ్రాతు ర్నూన మేవభవిష్యతి. ౫౬
యస్య భ్రాత్రా కృతేయం దిక్చరణ్యా పుణ్యకర్మణా. ౫౬½

ఇ హైకదా కిల క్రూరో వాతాపి రపి చేల్వలః
భ్రాతరౌసహితావాస్తాం బ్రాహ్మణఘ్నౌ మహాసురౌ. ౫౭½

* అగస్త్యస్య ఇతి. అగస్త్యభ్రాతృనామధేయం సుదర్శన ఇత్యేవస్పష్టమ్. తథాహి. శ్లో॥ 'యవీయా నేష మే భ్రాతా సుదర్శన ఇతి స్మృతః' ఇతి సనత్కుమారసంహితాయా మగస్త్యే నోక్తత్వా దితి. ఇద మగస్త్యస్య పూర్వజన్మ సంబంధ మితి జ్ఞేయమ్.

1. శివ రా. 2. వాల్మీకి రా. ౧౧స. 3. అధ్యాత్మ రా, ౩స.
4. వాల్మీకి రా. ౧౧స.



౫౨ నీతోఁగూడ సీతాలక్ష్మణు లచటి సుందరప్రదేశములఁ జూచుచు వినోదించెదరు.

౫౩ ఇట్లని మునిశ్రేష్ఠుఁడగు సుతీక్ష్ణమహర్షి యారాత్రి గడపి, పిమ్మట ప్రాతఃకాలమున సంతోషాన్వితుఁ డగు శ్రీరామచంద్రునితో నిట్లనియె.

౫౪ కీర్తిశాలీ! ఆ యగస్త్యమహామునిని దర్శింపవలెనని నీ మనస్సున నున్నయెడల నచటి కిప్పుడే వెళ్లుటకుఁ గోరుము.

౫౫ అటుపిమ్మట శ్రీరామచంద్రుఁడు సుతీక్ష్ణమహర్షితోఁగూడ సీతాలక్ష్మణ సమేతుఁడై *అగస్త్యభ్రాతయగు సుదర్శనుని యాశ్రమము నకు మధ్యాహ్నమగుసరికిఁ జేరుకొనెను.

౫౫½ అటుపై శ్రీరాముఁడు సంతుష్టాంతరంగుఁడై లక్ష్మణునితో నిట్లనియె.

౫౬–౫౬½ లక్ష్మణా! ఈ కనఁబడునది * యగస్త్యమహర్షి సోదరుఁ డగు సుదర్శనుని యాశ్రమము కానోపును. సంశయము లేదు. ఈసుదర్శనుని సోదరుఁడును పుణ్యకర్ముఁడునైన యగస్త్యమహర్షి వలననే కదా యీ దక్షిణదిక్కు మహర్షులు నివసించుటకు దిక్కైనది.

౫౭½ పూర్వ మొక్కప్పు డిచటనే క్రూరులును, మహారాక్షసులు నగు వాతాపి, ఇల్వలుఁడు నను నిద్ద రన్నదమ్ములు బ్రాహ్మణులను జంపుచుఁ గలిసిమెలసి యుండెడివారుగదా!

* అగస్త్యమహర్షి సోదరునకు సుదర్శనుఁ డను పేరున్నట్లు స్పష్టము సనత్కుమార సంహితయందు 'నాతమ్ముఁడు సుదర్శనుఁ డనువాఁడు కలఁడు' అని అగస్త్యమహర్షియే చెప్పెను. అగస్త్యమహర్షి ప్రసిద్ధుఁడగుటచే నీయనపేరు ప్రసిద్ధికి రాక 'అగస్త్యభ్రాత' యని మాత్రమే పిలువబడుచుండెను. అగస్త్యమహర్షికి వసిష్ఠుఁడు భ్రాతయని కలదు. అది యీజన్మమందలి సంబంధము. సుదర్శనుఁడు పూర్వజన్మమునందు సోదరుఁడు. పూర్వజన్మమునందు నగస్త్యుఁ డగస్త్యుఁ డనియే పిలువఁబడె ననియు తెలియునది.

ధారయన్ బ్రాహ్మణం రూపమిల్వలస్సంస్కృతంవదన్. ౫౮
ఆమంత్రయతి విప్రాంస్స శ్రాద్ధ ముద్దిశ్య నిర్ఘృణః
[1] త్రౌ హత్వాతు ముని శ్రీమా నగస్త్యో భయ మాదదా.
రాక్షసానాం పిశాచానాం సర్వేషాం క్రూరకర్మణామ్. ౫౯

[2] ఏవం కథయమానస్య సంధ్యాకాలో ఽభ్యవర్తత. ౬౦
ఉపాస్య పశ్చిమాం సంధ్యాం సహ భ్రాత్రా యథావిధి
ప్రవివే శాశ్రమపదం త మృషిం చాభ్యవాదయత్.
తేన సంపూజిత స్సమ్య గ్భుక్త్వా మూలఫలాదికమ్
పరేద్యుః ప్రాత రుత్థాయ జగా మాగ స్త్యమండలమ్. ౬౧
[4] పృష్ఠతో ఽనుగతం వీక్ష్య రామో లక్ష్మణ మబ్రవీత్ ౬౨

---

1. దేవీ రామాయణమ్. 2. వాల్మీకి రామా. ౧౧ స.
3. అధ్యాత్మ రా. 3 స. 4. వాల్మీకి రా. ౧౧ స.



౫౮-౫౯ అదెట్లన; దయాశూన్యుఁ డగు నిల్వలుఁడు బ్రాహ్మణరూప మును దాల్చి వ్యాకరణ శుద్ధమైన సంస్కృత భాషను మాట్లాడుచు, శ్రాద్ధమున కని బ్రాహ్మణులను నిమంత్రించి వారికి మేషరూప మునను న్న వాతాపిని బాకముచేసి పెట్టుచుండెను. బ్రాహ్మణుల భోజనములయిన తరువాత 'ఓ వాతాపీ! వెలుపలికి రమ్ము' అని పిలుపుపెట్ట నా యిల్వలుని కంఠధ్వని నెఱింగి, యా బ్రాహ్మణుల కడుపులు బ్రద్దలుచేసికొని వాతాపి వెలువడి వచ్చువాఁడు. వారి ద్దరు రక్కసులును గలిసి యా బ్రాహ్మణుల మాంసమును భక్షించు వారు. ఇట్లెంతోకాల మెందరినో తపస్సంపన్నులగు బ్రాహ్మణు లను మ్రింగిన యా రాక్షసులసంగతి నగస్త్యుఁ డెఱింగి శ్రాద్ధభోక్తగాఁ దానే వెళ్లి యా మాయావులను దానే జీర్ణముచేసికొనెను. అది మొదలుగ నా యగస్త్యముని పేరు వినఁబడిననే యక్షరాక్షస పిశాచాది క్రూరకర్ము లెల్లరు పికాపికలై పారిపోవుచుందురు. ఇట్లీ ప్రదేశమున నేక్రూరులవలని బాధలును లేకుండఁజేసి పుణ్యాత్ము లగు మునులకుదిక్కుగ నీదిక్కున నగస్త్యమహర్షి వసించుచున్నాఁడు.

౬౦-౬౧ అని యిట్లు శ్రీరామచంద్రుఁడు చెప్పుచుండఁగనే సూర్యుఁ డస్త గిరిఁ జేరెను. లక్ష్మణునితోఁగూడ యాతఁడు యథావిధిగ సాయం సంధ్య నుపాసించి, యాశ్రమముం బ్రవేశించి యా సుదర్శన మహర్షికి నభివాదనము గావించెను. ఆ మహర్షి మిగులఁ బూజించి యిడిన కందమూల ఫలాదులను భుజించి మరునాఁ డుదయమున లేచి యయ్యగస్త్యాశ్రమభూముల కరిగెను.

౬౨ ఇట్లరుగుచు శ్రీరామచంద్రమూర్తి తనను వెన్నంటివచ్చు లక్ష్మణునిం గని యిట్లనియె.

ఆశ్రమో నాతిదూరస్థో మహర్షే ర్భావితాత్మనః. ౬౩
ఆశ్రమో దృశ్యతే తస్య పరిశ్రాంతశ్రమాపహః
ప్రాజ్యధూమాకులవన శ్చీరమాలాపరిష్కృతః.
ప్రశాంతమృగయూథశ్చ నానాశకుని నాదితః. ౬౪

యదా ప్రభృతి చాక్రాంతా దిగియం పుణ్యకర్మణా. ౬౫
తదా ప్రభృతి నిర్వైరాః ప్రశాంతా రజనీచరాః
ప్రథితా త్రిషు లోకేషు దుర్ధర్షా క్రూరకర్మభిః.
మార్గం నిరోద్ధుం నిరతో భాస్కర స్యాచలోత్తమః
* నిదేశం పాలయన్ యస్య వింధ్య శ్శైలో నవర్ధతే.
అయం దీర్ఘాయుష స్తస్య లోకే విశ్రుతకర్మణః. ౬౬

శేషం చ వనవాసస్య సౌమ్య వత్స్యా మ్యహం ప్రభో! ౬౭

అత్ర దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః
అగస్త్యం నియతాహారం సతతం పర్యుపాసతే. ౬౮

---

* నిదేశ మితి.- స్వేన కర్మణా వింధ్యస్తంభనరూపేణ 'అగస్త్య' ఇతి విఖ్యాతః. అగం వింధ్యపర్వతం స్త్యతి స్తంభయతీ త్యగస్త్యః ఇతి వ్యుత్పత్తేః.



౬౩-౬౪ లక్ష్మణా! బ్రహ్మజ్ఞానసంపన్నుఁడగు నగస్త్యమహర్షి యాశ్రమ మిచటి కెంతో దూరమున లేదు. కడుంగడు దారిమసలుటం బడలికం గొన్న బడుఁగుల శ్రమ నుడుపఁజాలి యల్లదె గన్పట్టుచున్నది. ప్రాతస్సవనాగ్నినుండి వెడలిన పొగకాఁబోలు నాశ్రమమెల్లఁ జుట్టి వైచినది. మడి కారఁగట్టిన తపసులతడినారబట్టలబారులఁ దీరుకొని, యన్యోన్య సహజ శత్రువులయ్యు మిత్రములై యొప్పారు నడవి మృగములతోఁగూడి, పలుతెగల పక్షుల కిలకిలారావములు చెలఁగఁ గలకల లాడుచున్నయది.

౬౫-౬౬ పుణ్యకర్ముఁడగు నా యగస్త్యమహర్షి యెప్పటినుండి యీ దెసను నివసించుచుండెనో, యానాటినుండియు రక్కసులు వైరము దిగమ్రింగి, యలజడిలేక క్రుంగియున్నారు. క్రూరకర్ములగు వారి చేఁతలకుఁ జంకని దిక్కిదియే యని ముల్లోకములఁ బ్రసిద్ధమై యున్నది. సూర్యుని మార్గమునుగూడ యరికట్టవలె నని యుద్యుక్తమైన వింధ్యపర్వతము; సర్వలోకములఁ బ్రసిద్ధికెక్కిన పనులు గలట్టియు, దీర్ఘాయుష్మంతుఁడు నగు నెవ్వనియొక్క * 'స్తంభ'నాది శక్తులకు జడిసి యాతని యానతిం దలఁదాల్చి యెప్పటికంటె పొడ వెదుగక యున్నదో; అట్టి యత్యద్భుతమహిమాసంపన్నుఁ డగు నగస్త్యమహర్షి యొక్క యాశ్రమ మిదియే.

౬౭ సౌమ్యుఁడా! రాకుమారా! నిగ్రహానుగ్రహసమర్థుండగు నయ్యగస్త్య మహర్షి యాజ్ఞఁగొని మిగిలియున్న వనవాసకాలమంతయు నిచటనే నేను నివసింతును.

౬౮ ఇచట దేవతలు, గంధర్వులు, సిద్ధులు, పరమర్షులును నియతాహారుఁ డగు నా యగస్త్యమహర్షి నెల్లప్పుడును గొలుచుచుందురు.

---

* ఇమ్మని వింధ్యపర్వతమును స్తంభింపఁజేయు తన పనిచేతనే 'అగస్త్యుఁడు' అని ప్రసిద్ధి కెక్కెను. 'అగము' అనఁగాఁ బర్వతము. దానిని 'స్త్యతి' స్తభించుచున్నాఁడు, కనుక 'అగస్త్యుఁడు' అని వ్యుత్పత్త్యర్థము.

నాఽత్ర జీవే న్మృషావాదీ క్రూరో వా యది వా శఠః
నృశంసః కామవృత్తో వా ముని రేష స్తథా విధః. ౨౦

యక్షత్వ మమరత్వం చ రాజ్యాని వివిధాని చ.
అత్ర దేవాః ప్రయచ్ఛంతి భూతై రారాధితా శ్శుభమ్. ౨౧

[1] ఇత్యేవం భాషమాణౌ తౌ జగ్మతు శ్చాశ్రమం ప్రతి. ౨౧½

ఇతి శ్రీరామాయణ సారోద్ధారే
అరణ్యకాండే చతుర్థ స్సర్గః.

---

## పంచమస్సర్గః.

స ప్రవి శ్యాశ్రమపదం రాఘవో లక్ష్మణాగ్రజః
అగ స్త్యశిష్య మాసాద్య వాక్య మేత దువాచ హ. ౧

[2] సుతీక్ష్ణ! గచ్ఛ త్వం శీఘ్ర మాగతం మాం నివేదయ
మహాప్రసాద ఇత్యుక్త్వా సుతీక్ష్ణః ప్రయయౌ గురుమ్. ౨

1. అగ స్త్య రామా. 2. అధ్యాత్మ రా. 3 స.



౨౦ ఇచట నసత్యమాడువాఁడును, క్రూరుఁడును, చాటున నపకారము జేయువాఁడును, ఘాతుకుఁడును, యిచ్చవచ్చినట్లెల్ల నడచుకొనువాఁడును యీ యాశ్రమమునం దడుగిడి ప్రాణములతో వెడలఁజాలరు. ఈముని పాపాత్ములకుఁ జేరరాని యంతటి పరమపవిత్రమూర్తి.

౨౧ సత్కర్మనిరతులును, లోకకల్యాణముల నర్థించువారును నయిన ప్రాణులచే నారాధింపఁబడి బ్రహ్మది దేవతలీ యాశ్రమమున నీ యగస్త్యమహర్షి చేయు నుపాసనముల కెల్లపుడు నిచటనే దయచేసి యుండి; యక్షత్వమును, దేవత్వమును, వివిధములగు రాజ్యములను గూడ యనుగ్రహించుచుందురు. ఎవ్వరుచేసిన యుపాసనమైన నిచట శీఘ్రఫలితము నిచ్చుట కీ మునిప్రభావమే కారణ మని తెలియవలెను.

౨౧½ ఇట్లా శ్రీరామలక్ష్మణులు మాట్లాడుకొనుచు నా యగస్త్యమహర్షి యాశ్రమముం జేరిరి.

ఇది శ్రీ రామాయణసారోద్ధారమున నరణ్యకాండమునందు
నాల్గవ సర్గము.

---

## ఐదవ సర్గము.

౧ అట్లు లక్ష్మణాగ్రజుఁడగు శ్రీరామచంద్రుఁ డగస్త్యాశ్రమముం బ్రవేశించి, యగస్త్యశిష్యుండైన సుతీక్ష్ణమహర్షితో నిట్లనియె.

౨ సుతీక్ష్ణా! శీఘ్రముగ నీ వగస్త్యమహర్షి కడ కరిగి సీతాలక్ష్మణసమేతముగ నే నరుదెంచితి నని నివేదింపుము. అన విని సుతీక్ష్ణమహర్షి మహాప్రసాద మని గురుసమీపమున కేగెను.

ఆశ్రమం త్వర యాగత్య ఋషిసంఘసమావృతమ్
ఉపవిష్టం రామభక్తై ర్విశేషేణ సమావృతమ్. ౩
* వ్యాఖ్యాంతం రామమంత్రార్థం శిష్యేభ్య శ్చాతిభక్తితః
దండవ త్ప్రణిప త్యాహ సుతీక్ష్ణో గురు మాదరాత్. ౪
రామో దాశరథి శ్శ్రీమాన్ సీతయా లక్ష్మణేన చ
ఆగతో దర్శనార్థం తే బహి స్తిష్ఠతి సాఽనుజః. ౫

* వ్యాఖ్యాంత మితి. అగస్త్యస్య శ్రీరామభక్తత్వే దృష్టాంత మాహ ఆగ్నేయపురాణే, తు. కా. మా. ౨౪ అధ్యాయే ధౌమ్య యుధిష్ఠిర సంవాదే శ్లో॥ తత శ్శతానంద మువాచ కుంభజో విషణ్ణచేతా విషయేషు నిర్మమః। విభో హ్యభూవం తవ శాసనా ద్గృహీ కథం తరేయం భవ దుస్తరాంబుధిమ్॥ నిశమ్య వాక్యం విధి రస్య విస్మితో విహస్య కించి న్ముఖ మీక్ష్య వైష్ణవమ్। సంబోధిత స్తస్య కృపావలోకనా త్ప్రశస్య తం ప్రాహ మునిం పితామహః. బాల్యే విరక్త స్సుకృతీ భవా న్మునే! సమస్తధర్మాశ్చ కరస్థితా స్తవ। ఇతి బ్రువన్ రామ మనుం దయాన్వితో విముక్తయే స్మై సముపాదిశ ద్విధిః॥ వ్యాచఖ్యౌ చ తదా తస్మై రామభక్తాయ యోగినే। యంత్రమంత్రస్వరూపంచ షడక్షరజపే విధిం। మంత్రం ప్రాప్య మహాయోగీ శుశుభేచ షడక్షరం। బలా మతిబలాం చైవ రఘునాథ ఇవాపర. ఇత్యాదినా. అన్యచ్చ-శ్రీ రామనామమాహాత్మ్యం సర్వం జానాతి శంకరః। తదర్థం గిరిజా వేత్తి అగస్త్యో వేత్తి తత్వతః. వేత్తి



౩-౫ ఋషిసంఘములతోఁ గూడియున్న యయ్యగస్త్యాశ్రమమును సుతీక్ష్ణమహర్షి వడివడిగాఁ బ్రవేశించి, అందు విశేషముగా రామభక్తులగు వారితోఁ గూడుకొని యాసీనుఁడై * శ్రీరామ మంత్రార్థమును శిష్యులకు వ్యాఖ్యానము చేయుచున్న తన గురువగు నగస్త్యమహర్షి కాదగ మొప్ప సాఁగిలపడి మ్రొక్కి 'గురువరా! దశరథకుమారుఁడగు శ్రీరామచంద్రుఁడు సీతాదేవితోడను, లక్ష్మణునితోడను తమ దర్శనమునకై వచ్చి యాశ్రమము వెలుపల వేచియున్నవాఁడు' అని విన్నవించెను.

* అగస్త్యుఁడు శ్రీరామోపాసకుఁ డని యాగ్నేయపురాణమున కా. మా. ౨౪ అధ్యాయమున ధౌమ్యయుధిష్ఠిర సంవాద సందర్భమున నిట్లుకలదు. "బ్రహ్మాదు లగస్త్యుని నిర్బంధపఱచి లోపాముద్ర నాతనికిఁగూర్చి వివాహ మొనరించిరి. అపుడు బ్రహ్మదేవునితో విరక్తుఁడగు కుంభజుఁ డిట్లనును - ప్రభూ! మీయాజ్ఞచే నేను గృహస్థనైతిని. ఇఁక దుస్తర మగు నీసంసారసముద్రమును దాఁటుటకుపాయము సెలవిండు. అన విని బ్రహ్మ చిఱునవ్వు నవ్వి, శ్రీమహావిష్ణుని ముఖమువంకఁ జూచెను. అంత నాదేవుని కృపాదృష్టి బ్రహ్మదేవునిపైఁ బొలిసెను. అందుచే దివ్యమైన ప్రబోధము కలుగఁగా బ్రహ్మ యా యగస్త్యమునిం గని యిట్లనియె. ఓయీ! నీవు చిన్నతనమందే విరక్తుఁడవైనవాఁడవు. ధన్యాత్ముఁడవు. సమస్త ధర్మములు నీ కఱచేత నున్నవి. అని పలుకుచు దయామయుఁడై, యాతనికి సంసారసాగరతారకమగు శ్రీరామతారకమంత్రమును సాంగముగ నుపదేశించెను. శ్రీరామభక్తాగ్రగణ్యుఁడగు నయ్యగస్త్యుని కా మంత్ర స్వరూపమును, యంత్రమును, షడక్షర జపవిధానమును గూడ చక్కఁగా వివరించెను. అయ్యగస్త్యమునియు శ్రీరామషడక్షర మంత్రమును, 'బల' 'అతిబల' అను విద్యలను గ్రహించి, రెండవ శ్రీరామచంద్రమూర్తియో యనునట్లు మిగుల శోభించెను." ఇదిగాక మఱియొకచో; 'శ్రీరామ నామ మాహాత్మ్యమునంతను శ్రీ శంకరుఁడే యెఱుంగును. అద్దానియర్థము నా పార్వతియే

అగస్త్య ఉవాచ.—

శీఘ్ర మానయ భద్రం తే రామం మమ హృది స్థితమ్
తమేవ ధ్యాయమానోఽహం కాంక్షమాణోఽత్రసంస్థితః. ౬
ఇత్యుక్త్వా స్వయ ముత్థాయ మునిభి స్సహితో ద్రుతం
అభ్యయాత్త్వరయా భక్త్యా గత్వా రామ మథాఽబ్రవీత్. ౭

ఆగచ్ఛ రామభద్ర! త్వం దిష్ట్యా తేఽద్య సమాగమః
ప్రియాతిథి ర్మమ ప్రాప్త స్సద్యో మే సఫలం దినం. ౮

బ్రహ్మాచ వాల్మీకి ర్వశిష్ఠః కౌశికో మునిః । మహాయోగి ర్యాజ్ఞవల్క్య శ్చైతరో వేత్తివా నవా-ఇతి.

అగస్త్యాశ్రమోనామ శ్రీమహాభారతే వనపర్వణి ౧౩ అధ్యాయోక్తరీత్యా పంచవటీసమీపస్థపుణ్యక్షేత్ర మితి ద్యోత్యతే. స కదాచి ద్వారాణస్యాం, తదను అగస్తిపురీతి ప్రసిద్ధవింధ్యపర్వతప్రాంతప్రదేశే, తతో పాండ్యదేశే, అంతే దక్షిణసముద్రే చ ప్రకాశతేతి శ్రూయతే. ఇదానీం ఏష ఆశ్రమః (Bastur) బస్తరుసంస్థానస్య దక్షిణసీమ్ని స్థిత ఇతి వేదితవ్యః. అగస్త్యాశ్రమస్య యోజనద్వయదూరే పంచవటీక్షేత్రం వర్తతే. తదిదానీం 'పర్ణశా'లేతి ప్రాగ్గోదావరీ మండలే గోదావర్యా శ్చోత్తరే తీరే వరీవర్తి. పంచవటీ ప్రదేశనిర్ణయ మస్మిన్గ్రంథే తత్రప్రస్తావనాయాం నిరూప్యతే.



అంత నగస్త్యమహర్షి యిట్లనియె.—

౬-౭ 'సుతీక్ష్ణా! నీకు శుభంబగుఁగాక! నా హృదయాంతర్వర్తియై యుల రారు శ్రీరామచంద్రుని వేవేగ నిటకుఁ గొనిరమ్ము. నేనిచట నిరంతరము నారామునే ధ్యానించుచు నాతనిరాకకే యెదురు చూచుచు నున్నాఁడను.' అని పలికి శ్రీరాముఁడు లోనికివచ్చుదనుకఁగూడ నిలువఁజాలక తానే స్వయముగ మునులందరితో లేచి వడివడి నెదురేగి శ్రీరామచంద్రునిం గని మిగుల భక్తితో నిట్లనియె.

౮ శ్రీరామచంద్రా! రమ్ము. నీకు మంగళము చేకూరుగాత! నా భాగ్యవశమున నిటకు నేఁడు మీరాక గలిగెను. మిగుల ప్రియుండగు నతిథి నాకీనాఁడు సంభవించెను. ఈదినమే సఫలమైనది.

యెఱుంగును. అగస్త్యమహర్షియు నద్దాని తత్వము నెఱిఁగినవాఁడు. బ్రహ్మ, వాల్మీకి, వసిష్ఠుఁడు, విశ్వామిత్రుఁడు, మహాయోగి యగు యాజ్ఞవల్క్యుఁడు అను వారును వేర్వేర గ్రహించిరి. ఇఁక నితరులీ శ్రీరామనామమహిమ నెఱుఁగుదురో యెఱుంగరో తెలియదు' అనియుం గలదు.

ఈ యగస్త్యుని యాశ్రమము; అనునది శ్రీమహాభారతమున వనపర్వమున ౧౩ అధ్యాయమునఁ జెప్పబడినరీతిని పంచవటికి సమీపమునందున్న యొక పుణ్యక్షేత్రమని తోఁచుచున్నది. ఈయగస్త్యాశ్రమ మొకప్పుడు కాశీయందును, తరువాత వింధ్యపర్వత ప్రాంతమున 'అగస్తిపురి' అనఁబరగుచోటను, అనంతరము పాండ్యదేశమునను, దుదకు దక్షిణ సముద్ర ప్రాంతమునందును గలదని తెలియుచున్నది. ఇప్పుడీ యాశ్రమము (Bastur) 'బస్తరు' సంస్థానఁపు దక్షిణఁపుటెల్లయందున్నదని తెలియవలెను. ఈయగస్త్యాశ్రమమునకు రెండు యోజనముల దూరమున పంచవటీ క్షేత్రముగలదు. అది నేఁడు 'పర్ణశాల' యని పిలువఁబడుచు తూర్పుగోదావరి జిల్లాలో గోదావరీ నది కుత్తరతీరమున నున్నది. ఈపంచవటీ ప్రదేశనిర్ణయ మీ గ్రంథమునందే దాని ప్రస్తావనము వచ్చినప్పుడు నిరూపింపఁబడును.

రామోఽపి ముని మాయాంతం దృష్ట్వా హర్షసమాకులః
సీతయా లక్ష్మణేనాపి దండవత్పతితో భువి. ౯

ద్రుత ముత్థాప్య మునిరా ద్రామ మాలింగ్య భక్తితః
తద్గాత్రస్పర్శజాహ్లాద స్రవన్నేత్రజలాకులః. ౧౦
గృహీత్వా కర మేకేన కరేణ రఘునందనం
జగామ స్వాశ్రమం హృష్టో మనసా మునిపుంగవః. ౧౧

ప్రవివేశ తతో రామ స్సీతయా సహ లక్ష్మణః
ప్రశాంతహరి ణాకీర్ణ మాశ్రమం హ్యవలోకయన్. ౧౨
[1] * స తత్ర బ్రహ్మణస్థానం అగ్నేస్థానం తథైవచ
విష్ణోస్థానం [2]మహేంద్రస్య స్థానంచైవ వివస్వతః॥ ౧౩
సోమస్థానం భగస్థానం స్థానం కౌబేర మేవచ
ధాతు ర్విధాతుస్థానే చ వాయోస్థానం తథైవచ॥ ౧౪
నాగరాజస్యచ స్థాన మనంతస్య మహాత్మనః
స్థానం తథైవ గాయత్ర్యా వసూనాం స్థాన మేవచ. ౧౫
స్థానంచ పాశహస్తస్య వరుణస్య మహాత్మనః
కార్తికేయస్య చ స్థానం ధర్మస్థానంచ పశ్యతి. ౧౬

* సతత్రేతి.—తత్రాగస్త్యాశ్రమే బ్రహ్మాగ్నివిష్ణుమహేంద్రవివస్వత్సోమభగకుబేరధాతృవిధాతృవాయ్వనంతగాయత్రీవసువరుణకార్తికేయధర్మాఖ్యాస్సప్తదశ దేవాః. శ్రు॥ 'యో

1 వాల్మీకి రా. ౧౨ స. 2. 'మహేశస్య' అని పాఠాంతరము.



౯ ఇట్లనుచు వచ్చుచున్న యగస్త్యమహర్షిని జూచి శ్రీరామచంద్రుఁడు నపరిమితానందపారవశ్యమున సీతాలక్ష్మణులతోఁగూడ పుడమిపై సాఁగిలపడి మ్రొక్కెను.

౧౦-౧౧ అంత మునికులసార్వభౌముండగు నాయగస్త్యముని శ్రీరామచంద్రుని ద్వరితముగ లేవనెత్తి, భక్తితోఁ గౌఁగిలించుకొని యా శ్రీరామచంద్రుని దేహస్పర్శచేఁ నెలువడు నానందబాష్పములతోఁగూడినవాఁడై, శ్రీరాముని సర్వలోకరక్షణప్రశస్తం బగు హస్తంబుఁ దనహస్తంబునఁ గీలించి సంతుష్టాంతరంగుండై తన యాశ్రమములోనికిఁ జనెను.

౧౨-౧౬ శ్రీరామచంద్రుఁ డట్లగస్త్యమహర్షితో ప్రశాంతములగు లేళ్లకదుపులతోఁ గూడిన యాతని యాశ్రమమును సీతాలక్ష్మణసమేతుఁడై ప్రవేశించెను. * అచట నాతఁడు బ్రహ్మ, అగ్ని, విష్ణువు, మహేంద్రుఁడు (మహేశుఁడు), సూర్యుఁడు, చంద్రుఁడు, భగుఁడు (స్థూలమండలాభిమాని), కుబేరుఁడు, ధాత (కార్యప్రజాపతి), విధాత (విశ్వకర్మ), వాయువు, అనంతుఁడు, గాయత్రి, వసువులు, పాశహస్తుఁడగు వరుణుఁడు, కుమారస్వామి, ధర్మదేవతలు అను (పదునేడుగురు) దేవతలనిలయములను జూచెను.

* అగస్త్యాశ్రమమునఁ జతుర్ముఖబ్రహ్మ మొదలుగ ధర్మదేవతవరకుఁ గల 'యోవైసప్తదశ' మ్మను ననువాకమునఁ జెప్పఁబడిన సప్తదశాక్షర దేవతలును యజనశీలుఁడగు నగస్త్యునిచే లోకసంగ్రహార్థము ప్రతిష్ఠింపఁబడి రని తెలియనగును. ఇచ్చటఁ గొందరు మతావేశముచే నగస్త్యాశ్రమమునఁ బూజించుటకై యుంచఁబడిన దేవతలయందు

అభివాద్యతు ధర్మాత్మా తస్థౌ రామః కృతాంజలిః. ౧౬½

ప్రథమం చోపవిశ్యాథ ధర్మజ్ఞో మునిపుంగవః. ౧౭

అగ్నిం హుత్వా ప్రదా యార్ఘ్య మతిథీన్ ప్రతిపూజ్యచ
[1] సుఖోపవిష్టం సంపూజ్య పూజయా బహువిస్తరం. ౧౮
భోజయిత్వా యథా న్యాయం భోజ్యైశ్చ ర్వన్యై రనేకథా.
౧౮½

వై సప్తదశ' మి త్యనువాకోక్తసప్తదశాక్షర దేవతాః యాయజూకేన మునినా లోకసంగ్రహార్థం ప్రతిష్ఠితా ఇతి బోధ్యం॥ అత్ర కేచన మతాభినివేశేన తత్ర పూజ్యదేవతేషు రుద్రస్యానుపాదానా దపూజ్యత్వ ముక్తం రుద్రస్యేతి అధునా జనైః కశ్చిత్ పూజ్యమానతాతు తామస శాస్త్రానురోధేనేతి బోధ్య మితి ప్రతిపాదితమ్. తన్న. శ్లో॥ విష్ణోస్స్థానం మహేంద్రస్యే త్యత్ర విష్ణోస్స్థానం మహేశస్యేతి పాఠాత్, స్థానానుక్త్యసంభవాత్ చైవం. 'శ్లో॥ విష్ణోస్థానం మహేంద్రస్యే'వేతి పాఠ ఇతి నిర్ధాంతంచేత్ అన్యే శివభక్తా ఏవం ప్రతిపాదయంతి—తథాహి అత్ర పూర్వమేకాదశే సర్గే లక్ష్మణంప్రతి శ్రీరామేణోక్తం- శ్లో॥ అత్ర దేవా స్సంగధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః। అగస్త్యం నియతాహారం సతతం పర్యుపాసతే। యక్షత్వ మమరత్వంచ రాజ్యాని వివిధానిచ। అత్ర దేవాః ప్రయచ్ఛంతి

1. అధ్యాత్మ రా. 3 స.



౧౬½ ఇట్లు గనుచు ధర్మాత్ముఁడగు శ్రీరామచంద్రుఁ డగస్త్యునకు నమస్కరించి దోసిలొగ్గికొని యుండెను.

౧౭-౧౮½ అంత ధర్మస్వరూప మెఱిఁగిన మహర్షిపుంగవుఁ డగు నగస్త్యమహర్షి తాను ముందుగఁ గూర్చుండి యగ్నికార్య మొనరించి, యతిథుల కర్ఘ్యమిచ్చి పూజించి, సుఖోపవిష్టుం డగు శ్రీరామచంద్రుని మిగుల విరివిగఁ బూజించి వన్యములగు ననేక భోజ్య పదార్థములను యథావిధిగ భుజింపఁ జేసెను.

రుద్రుఁడు చెప్పఁబడకపోవుటచే రుద్రుఁ డపూజ్యుఁ డని చెప్పఁబడినదనియు, లోకమునఁ గొందరిచే రుద్రుఁడు పూజింపఁబడుచున్నాఁడు గదా! యన్న నది కేవలము తామసశాస్త్రముల యనురోధము వలననే యనియుఁ బలుకుచున్నారు. అది సరికాదు. 'విష్ణోఃస్థానం మహేంద్రస్య' అనుచోట 'విష్ణోస్స్థానం మహేశస్య' అను పాఠాంతరము కలదు గాన శివునకిచట స్థానము చెప్పఁబడెననియే యనవలెను. మఱల వారును అట్లుకాదు - 'మహేంద్రస్య' అను పాఠమే సరియైన దని నిశ్చయింపఁబడెను. అని వాదులాడిన, వారింగూర్చి మఱి కొందరు శివభక్తు లిట్లనుచున్నారు. ఎట్లన శ్రీమద్వాల్మీకి రామాయణమున నింతకుఁబూర్వ మేకాదశ సర్గమున శ్రీరామచంద్రమూర్తి లక్ష్మణునితో నగస్త్యాశ్రమ మహిమను జెప్పు సందర్భములో ఇచ్చట దేవతలు, గంధర్వులు, సిద్ధులు, పరమర్షులును నియతాహారుఁడగు నా యగస్త్యమహర్షిని గొల్చుచుందురు. ప్రాణులచే నారాధింపఁబడి బ్రహ్మాది దేవతలీయాశ్రమమున నీ మహర్షి మహిమచే యక్షత్వము, దేవత్వము, వివిధములగు రాజ్యములను గూడ యనుగ్రహింతురు అని చెప్పెను. అచటఁ గథాసందర్భమును బట్టి పలుకు పాత్రము వేరైనను, అట్లు పలికించు కావ్యకర్త యొక్కఁడే కావున, బ్రహ్మాది దేవతలు యక్షత్వము మొదలగు వాని ననుగ్రహింతురని యచ్చటఁ జెప్పి యిచ్చట నాయా దేవతలను వేర్వేర

సుఖోపవిష్ట మేకాంతే రామం శశినిభాననం. ౧౯
కృతాంజలి రువా చేద మగస్త్యో భగవా నృషిః. ౧౯½

త్వదాగమన మే వాహం ప్రతీక్ష న్నమవస్థితః. ౨౦
యథా క్షీరసముద్రాంతే బ్రహ్మణా ప్రార్థితః పురా
భూమే ర్భారాపనుత్త్యర్థం రావణస్య వధాయచ. ౨౧
తదాదిదర్శ నాకాంక్షీ తవ రామ తప శ్చరన్. ౨౧½

---

భూత్తై రారాధితా శ్శుభై-రిత్యాదివచనా న్నిర్దిశ్య స తత్ర బ్రహ్మణస్థాన మిత్యాదివచనానాం వక్తృభేదేపి కావ్యప్రబంధు రేకత్వాత్, అత్రస్థ బ్రహ్మాదీనా మగస్త్య ముపాసితు మాగతానాం స్థానా న్యుక్తాని. తత్రైవ ప్రాగుపక్రాంతాత్. అపి చోత్తరరామాయణే అగస్త్యప్రస్తావనాయాం - 'శ్లో॥ సహి తారయితుం శక్త స్సౌమ్య స్సురగణాన' పీతి వచనేన అగస్త్యస్య సకలదేవతోపాస్యతాయాః స్ఫుటీకరణాచ్చ అగస్త్యోపాసనార్థం తదాశ్రమే నివసతాం బ్రహ్మాదిదేవానా మివ తత్ర శివస్య స్థానం నోక్తం. తస్మాత్ బ్రహ్మవిష్ణ్వాదయ ఏవ అగస్త్యోపాసకాః నతు శివ ఇతి ద్యోతనేన శివస్య సర్వాతిశాయిమహిమా వ్యంజిత ఇతి. యదుక్తం కేవలతామసపురాణేష్వేవ శివపూజా ప్రతిపాదితా ఇతి - తద ప్యసత్. సాత్త్వికత్వేన పరిగణిత పద్మపురాణేపి భూమిఖండే ఏకోనసప్తతితమాధ్యాయే



౧౯-౧౯½ ఏకాంతమున లక్ష్మణుఁడు లేని సమయమున సుఖాసీనుఁ డైయున్న చంద్రునివంటి ముఖము గల శ్రీరామచంద్రునిం జూచి, భగవానుఁడగు నగస్త్యమహర్షి చేతులు మోడ్చి యిట్లనియె.

౨౦-౨౧½ శ్రీరామచంద్రా! నేను నీ రాకకే యెదురు చూచుచున్నాఁడను. నీ వెప్పుడు క్షీరసముద్రమునందు మున్నుండఁగా బ్రహ్మదేవునిచే భూభారము వాపుటకును, రావణుని వధించుటకును ప్రార్థింపఁబడితివో; అది మొదలు నీ దర్శనమును గోరి యీ వనమునఁ దపంబు చేయుచు (సర్వరాక్షస సంహారము చేయఁగలిగియు నీ ప్రతిజ్ఞను దలఁచి) నున్నాఁడను.

---

విపరించెనని తెలియుచున్నది. అందుచేఁ బ్రాణికోటికి తమ తమ కిష్టులగు దేవతల నచట నారాధించి వారివారివలన నభిమతములను బడయుచున్నా రన్నప్పుడు మహేశ్వరుఁ డచ్చట లేఁడని చెప్పఁట కాధారములేదు. కనుక దానికి వివరణరూపముగా వర్ణింపఁబడిన యీతావునను మహేశ్వరుఁడు కలఁడనియే చెప్పవలెనని సిద్ధాంతము. అంతేకాక, ఉత్తర రామాయణమున నగస్త్య ప్రస్తావనయందుఁ గల 'ఆ యగస్త్యుఁడు దేవతాగణములను సయితము తరింపఁ జేయఁ గల శక్తి కలవాఁడు' అను వచనముచే నగస్త్యుఁడే సర్వ దేవతలచే నుపాసింపఁ బడువాఁ డని స్పష్టపడు చున్నదిగదా! దానిం బట్టి యగస్త్యాశ్రమమం దగస్త్యుని యుపాసించుటకై నివసించియున్న బ్రహ్మాది దేవతలకువలె శివునకు స్థానము చెప్పఁబడలేదు. కాన బ్రహ్మ విష్ణ్వాదులు మాత్రమే యగస్త్యోపాసకులుగాని శివుఁ డట్లు కాదని తెలియుటచే శివునకు సర్వాతిశాయిమహిమ తోఁచుచున్నది.

మఱియు కేవల తామసపురాణములందుమాత్రమే శివపూజను గూర్చి చెప్పఁబడె నను మాట దబ్బర. సాత్త్విక మని పేరొందిన పద్మపురాణమునందును భూమిఖండమున నఱువది తొమ్మిదవ యధ్యాయమున ఏ మానవుఁడైన నొక్కదినమున నైనను భక్తితో శివుని

సృష్టేః ప్రాగేక ఏవాసీ ర్నిర్వికల్పో ఽనుపాధికః. ౨౨
త్వదాశ్రియా త్వద్విషయా మాయా తే శ క్తి రుచ్యతే
త్వామేవ నిర్గుణం శ క్తి రావృణోతి యదా తదా. ౨౩
అవ్యాకృత మితి ప్రాహు ర్వేదాంతపరినిష్ఠితాః
తతో విరాట్ సముత్పన్నః స్థూలా ద్భూతకదంబకాత్.
విరాజః పురుషా త్సర్వ జగత్స్థావరజంగమం
త్వం రజోగుణతో బ్రహ్మ జగత స్సర్వకారణం. ౨౫
సత్వా ద్విష్ణు స్త్వమో వాస్య పాలక స్సద్భి రుచ్యతే.
లయే రుద్ర స్త్వ మే వాస్య త్వన్మాయాగుణభేదతః. ౨౬

'శ్లో॥ అప్యేకదివసం భక్త్యా యః పూజయతి శంకరం, సోపి యాతి శివస్థానం కిం పున ర్బహుశోర్చయ' న్నిత్య ధ్యాయాంతం శివమహిమ్నః ప్రతిపాద్యమానత్వాత్. తథైవ బృహన్నారదీయేపి ౪ అధ్యాయే. 'శ్లో॥ మహాదేవ! విరూపాక్ష! గంగాధర! మృడావ్యయ! ఇత్థం వదంతి యే విప్రా తే కృతార్థా నసంశయ' ఇత్యాదినా స్పష్టీకరణాచ్చేతి. ఏవం కేవలమతాభినివేశేన శివకేశవయో ర్భేద పరిగణనం పరస్పరనిందాకరణంచ నిస్సారం. పరిశుద్ధసాత్వికతమత్వేన పరిగృహీత విష్ణుపురాణే పంచమాంశే 33 అధ్యాయే శ్రీశంకరం ప్రతి శ్రీకృష్ణవచనం- శ్లో॥ భవానహంచ



౨౨-౨౬ ఓ శ్రీరామచంద్రా! సృష్టికిమున్ను నీ వొకఁడవే నిర్వికల్పుఁడవై యుపాధిరహితుఁడవై యుంటివి. ని న్నాశ్రయించి యుండునదియు, నీచేఁ దెలియఁబడునదియు నగు నీ మాయయే 'శక్తి' యని పిలువఁబడును. నిర్గుణుండ వగు ని న్నాశక్తి యెప్పు డావరించునో, అప్పుడు దానిని 'అవ్యాకృత'మని వేదాంతులు పలుకుచున్నారు. అంతటఁ గ్రమముగ స్థూలభూతముల సమూహమునుండి విరాట్టు పుట్టెను. ఆవిరాట్పురుషునివలన స్థావరజంగ మాత్మకమైన జగత్తు జన్మించెను. నీవే రజోగుణమువలన సమస్తజగత్కారణుఁడ వగు బ్రహ్మదేవుఁడవయితివి. నీవే సత్వగుణమువలన నీ జగమును బాలించు విష్ణుఁడవైతివి. నీవే తమోగుణమువలన జగత్ప్రళయముం జేయు రుద్రుఁడవైతి వని సత్పురుషులు చెప్పుచున్నారు. ఇట్లు నీమాయాగుణభేదమువలన నీవు బ్రహ్మవిష్ణురుద్రరూపములఁ బొందుచున్నావు.

బూజించునేని శివస్థానమును జేరుచున్నాఁడు. అనేక పర్యాయములు శివుని బూజించువాని మహిమ చెప్పవలసిన దేమున్నది? అని యీ యధ్యాయాంతము వరకును శివమహిమ ప్రతిపాదింపఁబడుట వలన,

ఇదే విధముగ సాత్విక మని వాసింగన్న బృహన్నారదీయమున నాల్గవ యధ్యాయమున ఓ మహాదేవ! విరూపాక్ష! గంగాధర! మృడ! అవ్యయ! ఇత్యాది శివ నామముల నెవరు పలుకుచున్నారో వారు కృతార్థులు. సంశయ మెంతమాత్రమును లేదు. అని స్పష్టముగ నుండుట వలనను,

ఇట్లు కేవలము మతాభినివేశముచే శివకేశవులకు భేదమును గణించుటయు, నొండొరులు నిందించుకొనుటయు మిగుల నిస్సారము.

తాసాం విలక్షణో రామ స్త్వం సాక్షీ చిన్మయో ఽవ్యయః. ౨౬½

అత స్త్వద్భక్తిసంపన్నా ముక్తా ఏవ నసంశయః. ౨౭
త్వద్భక్త్యమృతహీనానాం మోక్షః స్వప్నే ఽపి నో భవేత్. ౨౭½

అద్య మే సఫలం జన్మ భవత్సందర్శనా దభూత్. ౨౮
సదా మే సీతయా సార్థం హృదయే వస రాఘవ.
గచ్ఛత స్తిష్ఠతో వాపి స్మృతి స్స్యా న్మే సదా త్వయి. ౨౯
ఇతి స్తుత్వా రమానాథ మగస్త్యో మునిస త్తమః.
[1] పూజయిత్వా యథాకామం పున రేవ తతో ఽబ్రవీత్. 30

విశ్వాత్మ న్నేక ఏవ హి కారణం, జగతో ఽస్య జగ త్యర్థే భేదే నాహం వ్యవస్థితౌ. మత్తో ఽవిభిన్న మాత్మానం ద్రష్టుం నార్హసి శంకర, అవిద్యామోహితాత్మానః పురుషా భిన్న దృష్టయః. వదంతి భేదం పశ్యంతి చావయో రంతరం హ రేతి శివకేశవయో రాభిన్నత్వ న్న్యూనాధికరహితత్వప్రతిపాదకవచనసహస్రానుగ్రహాత్. తథైవ శివపురాణేపి పరిదృశ్యమానత్వాత్ ఇతి శివం.

1 వాల్మీకి రా. ౨౨ స.



౨౬½ ఓ రామచంద్రా! యథార్థము విచారించిన నీ త్రిమూర్తులకువిలక్షణుఁడవై, సాక్షివై, చిత్స్వరూపుఁడవై, అవ్యయుఁడవై ప్రకాశించువాఁడవు నీవే.

౨౭-౨౭½ ఇందువలన నీయందు భక్తితోఁగూడినవారు తప్పక ముక్తులే యగుదురు. సంశయములేదు. నీభక్తి యను నమృతము రుచి నెఱుఁగనివారికి స్వప్నమందైన మోక్ష మనునది లేదు.

౨౮-౨౯ ఇపుడు నీదర్శనమువలన నాజన్మ సార్థకమైనది శ్రీరామచంద్రా! సీతాసమేతుఁడవై యెల్లప్పుడును నా హృదయమునందే వసింపుము. నడచునపుడును, నిలిచినపుడును నాతలంపు నీయందే నిరంతరము నిలుచుఁగాక!

30 ఈవిధముగా మునిశ్రేష్ఠుండగు నగస్త్యమహర్షి రమానాథుఁడగు శ్రీరామచంద్రుని స్తుతించి తనకోరిక యీడేరున ట్లతనిం బూజించి యనంతరము మఱల నిట్లనియె.

పరిశుద్ధసాత్త్వికతమం బని యెల్లరు నంగీకరించిన విష్ణుపురాణమునఁ బంచమాంశమునందు శ్రీ శంకరునిం గూర్చి శ్రీకృష్ణుఁ డిట్లనియె- 'ఓ విశ్వాత్ముఁడ వగు మహేశ్వరా! నీవును నేనును జగత్కారణముగఁ బరమార్థము విచారించిన నొక్కటే. జగన్నిర్మాణాదికార్యముల కొఱకు వేఱైనట్లు సంచరించుచున్నారము. నీకంటె నేను వేరుగాను, అట్లే నాకంటె నీవు వేరుగాను జూడరాదు. అయినను అవిద్యామోహితులై కొందరు దృష్టి చెడి తమ భేదబుద్ధిచే మనలను భిన్నులుగఁ జెప్పుదురు. మన యిర్వురకు హెచ్చు తగ్గు లున్నవని యూహింతురు.' అట్లైన్నను శివకేశవుల కేమాత్రము భేదము లేదు. ఇర్వురలో హెచ్చు తక్కువ యను భేదములు లేవని ప్రతిపాదించెడి వచనము లనేక సహస్రము లనుగ్రహము చూపుట వలనను, ఈ విధముగానే శివపురాణములందును గన్పట్టుట వలనను, యిట్టి వివాదము పనికిరా దని తెలియుచున్నది. ఇది శుభంబు.

ఇదం దివ్యం మహచ్చాపం హేమరత్నవిభూషితం.
* వైష్ణవం పురుషవ్యాఘ్ర ! నిర్మితం విశ్వకర్మణా. ౩౧
దత్తౌ మమ మహేంద్రేణ తూణౌ సాక్షయసాయకౌ. ౩౧½

అనేన ధనుషా రామ ! హత్వా సంఖ్యే మహాసురాన్. ౩౨
ఆజహార శ్రియం దీప్తాం పురా విష్ణు ర్దివౌకసాం. ౩౨½

ఏవ ముక్త్వా మహాతేజా సమ స్తంతద్వరాయుధం. ౩౩
దత్త్వా రామాయ భగవా నగస్త్యః పున రబ్రవీత్. ౩౩½

♦ [1] జహి రాఘవ భూభారభూతం రాక్షసమండలం. ౩౪
యదర్థ మవతీర్ణో ఽసి మాయయా మనుజాకృతిః. ౩౪½

ఏవ ముక్తస్య మునినా రాఘవో ప్యాహ తం మునిం. ౩౫
యత్ర మే సుఖవాసాయ భవే స్థానం వదస్వ తత్. ౩౫½

* వైష్ణవమితి. పూర్వం పరశురామా ద్గృహీత్వా వరుణహస్తే దత్తం రామేణ, తదేవ వరుణః మహేంద్రహస్తే దత్తవాన్ ఖరాదివధః ప్రత్యాసన్న ఇతి మత్వా, ఇంద్రేణాగస్త్యే నిహిత మితి వేదితవ్యం, వైష్ణవ శబ్దప్రత్యభిజ్ఞానాత్.

♦ జహీతి- మోదేత సాధు రపి వృశ్చికసర్పహత్యా ఇతి భాగవతోక్తి రత్రానుసంధేయః.

1. అధ్యాత్మరా. 3 స. 2. దేవీరామాయణం.



౩౧-౩౧½ ఓ పురుషోత్తమా ! శ్రీరామా ! బంగారము రత్నములచేతను నలంకరింపఁబడిన యీ దివ్యమైన మహాధనువు *విష్ణు సంబంధమైనది. విశ్వకర్మచే నిర్మింపఁ బడినది. తఱుగులేని బాణములతో నిండియున్న యీ యమ్ములపొదులు నింద్రునిచే నా కొసఁగఁబడినవి.

౩౨-౩౨½ శ్రీరామచంద్రా ! శ్రీ మహావిష్ణువు పూర్వ మీ విల్లుఁ గొనియే యుద్ధమున గొప్పరాక్షసులఁ బరిమార్చి, దేవతలకుఁ బ్రకాశించుచున్న యైశ్వర్యమును సంపాదించెను.

౩౩-౩౩½ ఇట్లుఖండతేజస్సంపన్నుఁ డగు నగస్త్యమహర్షి పలికి యా ధనుస్సును, అమ్ముల పొదులును మొదలగు శ్రేష్ఠమైన యాయుధ సామగ్రి నెల్ల శ్రీరామచంద్రున కొసంగి మఱల నీ విధముగాఁ బలికెను.

౩౪-౩౪½ శ్రీరామచంద్రా! భూమికి భారమగు రాక్షసుల సమూహమును ♦ వధింపుము. నీ వందుకొఱకే కదా మాయామనుష్యాకారుఁడవై యవతరించితివి.

౩౫-౩౫½ ఇట్లా ముని చెప్పిన విని శ్రీరాముఁడు మునివరా ! నేను సుఖముగా నివసించుటకుఁ దగిన తా వేదియో తెలుపుము ? అనెను.

* 'విష్ణుసంబంధమైనది '- అనుటచేఁ బూర్వము శ్రీరామచంద్రుఁడు పరశురాముని వలన నీ ధనువును గ్రహించి వరుణ దేవున కిచ్చెను. దానినే వరుణుఁడు మహేంద్రుని చేతిలోఁ బెట్టెను. ఇంద్రుఁడును ఖరాది రాక్షసుల జంపెడు సమయము సమీపించె నని యెఱింగి శ్రీరాముని కిచ్చుట కగస్త్యుని కిచ్చెననియు 'వైష్ణవము ' అను శబ్దమును బట్టి యెఱుంగవలయును.

♦ 'రాక్షసుల సమూహమును వధింపుము ' అని యగస్త్యుఁడు స్వయముగఁ జెప్పుటచేఁ బ్రాణి హింసను బోధించె ననరాదు. సాధువు సైతము సర్పవృశ్చికాది క్రూర జంతువుల నాశనమునకు సంతసించునని భాగవతమునందుఁ గల మాట నిటఁ గూర్చు కొనునది.

[1] తతో ఽబ్రవీ న్మునిశ్రేష్ఠ శ్శ్రుత్వా రామస్య తద్వచః. ౩౬
ధ్యాత్వా ముహూర్తం ధర్మాత్మా ధీరో ధీరతరం వచః. ౩౬½

ఇతో ద్వియోజనే తాత ! బహుమూలఫలోదకః. ౩౭
దేశో బహుమృగ శ్రీమా న్పంచవ ట్యభివిశ్రుతః. ౩౭½

[2] నేతవ్య స్తత్ర తే కాల శ్శేషో రఘుకులోద్వహ ! ౩౮
తత్రైవ బహుకార్యాణి దేవానాం కురు సత్పతే ! ౩౮½

[3] తీర్ణప్రతిజ్ఞః కాకుత్థ్స సుఖం రాజ్యే నివత్స్యసి. ౩౯

* హృదయస్థశ్చ తే ఛందో విజ్ఞాత స్తపసా మయా. ౩౯½

* య దిహ వాసం ప్రతిజ్ఞాయ—‘ శేషంచ వనవాసస్య సౌమ్య వత్స్యా మ్యహం ప్రభో !’ ఇత్యనేన మమసమీపే ఇహ మమాశ్రమే వాసం ప్రతిజ్ఞాయ పున ర్మాం ప్రతి వ్యాదిశ మే వాస మి త్యేత ద్వదసి తన్మూలం తే హృదయస్థః ఛందః అభిప్రాయః మయా జ్ఞాతః అత్రాస్థానే ప్రతిజ్ఞాత రాక్షసవధనిర్వాహో న భవతి అత్ర రాక్షసాగమ నాభావా ది త్యేవంరూప ఇతి భావః.

1. వాల్మీకి రా. ౧౩. 2. అధ్యాత్మ రా. ౩ స. 3. వాల్మీకి రా. ౧౩ స.



౩౬-౩౬½ శ్రీరాముని యా మాట విని మునిశ్రేష్ఠుండును, ధర్మాత్ముండును, ధీరుండు నగు నగస్త్యమహర్షి ముహూర్తమాత్రము ధ్యానించి మిగుల నిశ్చిత మగు నీ మాట పలికెను.

౩౭-౩౭½ తండ్రీ ! శ్రీరామచంద్రా ! ఇచటికి రెండు యోజనముల దూరమునఁ బంచవటి యని ప్రసిద్ధికెక్కిన శోభాయుతమగు ప్రదేశము కలదు. అది యనేకములగు పండ్లు, మూలములు, జలములు వీనితోడను, వివిధములగు మృగములతోడను గూడి యుండును.

౩౮-౩౮½ రఘుకుల వర్ధనా ! రామచంద్రా ! మిగిలిన వనవాసకాలమును నీ వచట గడుపవచ్చును. సుజనపాలకా ! దేవకార్యములను బెక్కింటిని నీ వచ్చుటనే నెరవేర్ప వచ్చును.

౩౯ పితృవాక్య పరిపాలనము, సాధు సంరక్షణము మొదలుగాఁగల నీ పట్టిన ప్రతినలన్నిఁటిని జెల్లించుకొని, యిటనుండి సుఖముగ నీ రాజ్యమునకుఁ బోయి నివసింపఁగలవు.

౩౯½ * నేను నా తపోబలముచే నీ హృద్గత మగు నభిప్రాయమును దెలిసి కొంటిని.

* ‘ మిగిలిన వనవాసకాలము నిచటనే నివసించెదను ’ అని తొలుత లక్ష్మణునితో నంటివి. అట్లు నా యాశ్రమముననే వసించుటకు నీవు ప్రతినపట్టి ఇపుడు మఱల ‘ నా వసింపఁదగు తావు దెల్పుము ’ అని పల్కుచున్నావు. నీ వెనుకటి ప్రతిజ్ఞ ననుసరించి యిచటనే నీ వున్నచో నాయీ యాశ్రమమునకు రాక్షసులు రారు. కనుక నీ పట్టిన రాక్షస సంహారము గావింతునన్న ప్రతిన నెఱవేరదు ? అది నీ హృదయమునందు దోఁచెడు నభిప్రాయము. అది నాకు తపోబలముచేఁ దెలియవచ్చెను. అని యగస్త్యుని మాట యందలి భావము.

ఏత దాలక్ష్యతే వీర మధూకానాం మహద్వనం. ౪౦
ఉత్తరే ణాస్య గంతవ్యం న్యగ్రోధ మభిగచ్ఛతా
గోదావర్యా స్సమీపేచ మైథిలీ తత్ర రంస్యతే. ౪౧

త్రౌతు తే నాభ్యనుజ్ఞాతౌ కృతపాదాభివందనౌ
తదాశ్రమా త్పంచవటీం జగ్మతు స్సహ సీతయా. ౪౨

[1] మార్గే వ్రజన్ దదర్శాథ శైలశృంగ మివ స్థితం
వృద్ధం జటాయుషం రామః కిమేత దితి విస్మితః. ౪౩
ధను రానయ సౌమిత్రే రాక్షసో ఽయం పురస్థితః
ఇ త్యాహ లక్ష్మణం రామో హనిష్యా మ్యృషిభక్షకం. ౪౪

త చ్ఛ్రుత్వా రామవచనం గృధ్రరా డ్భయపీడితః
వధార్హోహం న తే రామ పితు స్తేహం ప్రియ స్సఖా. ౪౫
జటాయు ర్నామ భద్రం తే గృధ్రో౽హం ప్రియకృత్తవ
పంచవట్యా మహం వత్స్యే తవైవ ప్రియకామ్యయా. ౪౬
మృగయాయాం కదాచిత్తు ప్రయాతే లక్ష్మణే ఽపి చ
సీతా జనకకన్యా మే రక్షితవ్యా ప్రయత్నతః. ౪౭

ఇత్యుక్త్వా రాఘవం నత్వా ప్రార్థయామాస పక్షిరాట్
నిశాకరమునే ర్దత్తవరదానప్రభావతః. ౪౮

1 అధ్యాత్మ రా. ౪ స. 2 గ్రంథాంతరే మహాకవి కృతం.



౪౦-౪౧ వీరాగ్రణీ! అల్లదె విప్పచెట్ల పెద్ద యడవి కన్పట్టుచున్నయది. దీని కుత్తరముగాఁ బోయిన నాదారి యొక మఱ్ఱిచెట్టు కడకుం గొంపోఁగలదు. అది గోదావరీ నదికి దాపుననే కలదు. సీతాదేవి యా తావున హాయిగ వినోదింపఁ గలదు.

౪౨ నావిని శ్రీరామలక్ష్మణు లయ్యగస్త్య పాదములకు మ్రొక్కి యాతని యనుమతిం బడసి, సీతతోఁగూడ నయ్యగస్త్యాశ్రమమునుండి పంచవటి కేగిరి.

౪౩-౪౪ శ్రీరామచంద్రుఁ డట్లు దారి నడచుచు నంతలో నెదుటఁ బర్వతశిఖరమువలె నున్న వృద్ధుం డగు జటాయువుం జూచెను. ఇదే మని యాశ్చర్యపడినవాఁడై, 'లక్ష్మణా! ఆ విల్లిటు తెమ్ము. ఇదే యెదుట రాక్షసుం డున్నాఁడు. ఋషులఁ దినివేయు వీని జంపెద' ననెను.

౪౫-౪౭ శ్రీరామచంద్రుని యా మాట విని, గృధ్రరాజగు జటాయువు భయపీడితుఁడై శ్రీరామచంద్రా! నీవు చంపఁదగినవాఁడను నేను గాను. నీతండ్రికి నేను బ్రియ మిత్రుఁడను. జటాయు వను వాఁడను. నీకు మంగళం బగుఁగాత! నీకుఁ బ్రియ మొనరింపనున్న గృధ్రమను. నేను నీ ప్రియము నే కోరుచు నీ పంచవటియందు నివసించుచున్నాఁడను. ఎప్పుడైన నీవేకాక లక్ష్మణుఁడు గూడ వేట కరుగుచో నట్టి వేళల జనకరాట్పుత్రిక యగు సీతా మహాదేవిని నేను బ్రయత్న పూర్వకముగ సంరక్షించెదను.

౪౮ ఇట్లు జటాయువు శ్రీరామచంద్రమూర్తితోఁ బలికి, నిశాకరుం డను జడదారి యిడిన వరదానమహిమచే నప్పక్షిరాజు శ్రీరాము నిట్లని ప్రార్థింపఁ దొడఁగెను.

—♦ చూర్ణిక ♦—

శ్రీమదగణితగుణమణిగణాలంకృతరుచిరుచిరతర శుభస్వరూపం సకలజనభయావహమహదజ్ఞానజనితకలుషాంధతమిస్రనివారకభవతారకదీపం అనుపమాద్భుతమహత్ప్రతాపం కరధృతవిదితామోఘశరచాపం.

జగదుదయస్థితిసంహారావిర్భావతిరోధానాదిమహామాయావినోదనిదానం అంగీకృతరంగన్మంగళాభంగతుంబురునారదసంగీతవీణామృదుగానం కాలత్రియాబాధ్యమానం అసమానం.

అక్షీణకటాక్షవీక్షణరక్షణ దాక్షాయణీప్రముఖనిఖిలభక్తజనసమూహం నిర్గళితసకలసందేహం దుర్వారోర్వీభరణహరణనిర్వాహణచణలీలామానవదేహం నిరీహం.

శ్రీమత్కరుణావలోకనమాత్రక్షపితఫాలాక్షచతుర్ముఖాదిసర్వసుపర్వాఖర్వఖేదం నిరంతరామనస్కసమాధిపరిపూర్ణపరమయోగీంద్రహృదయ సరసీరుహకర్ణికోపరిస్థితవితతజగ



—♦ చూర్ణిక ♦—

శ్రీరామచంద్రమహాప్రభూ ! శోభాయుతంబులయి యెన్న నలవిగాని మహోన్నతంబులగు సద్గుణసమూహము లను మణి గణంబులచేఁ గై సేయఁబడిన కమనీయ చిన్మయ కల్యాణ స్వరూపుఁడ వగు నిన్ను, సకలజన భయంకరమై సాటిలేని యజ్ఞానమువలనఁ గలిగిన యపార పాపాంధకారమును వారించు భవతారక దీపంబ వగు నిన్ను, అసమానాద్భుత ప్రతాపశీలుఁడ వగు నిన్ను, అనివార్యమై ప్రసిద్ధికెక్కిన శరచాపములఁ గేలఁ బూనిన నిన్ను—

జగములఁ బుట్టించుట, రక్షించుట, మాయించుట, ప్రత్యక్షమగుట, మఱుఁగుపడుట మొదలగు మహామాయా వినోదముల కాటపట్టగు నిన్ను, సర్వసమ్మోహనమై, యెల్లవారి హృదయంబుల ద్రవింపఁజేయు తుంబురు నారదాది వీణా మృదు కల్యాణ గాన లోలుఁడవైన నిన్ను, మూఁడు కాలములయందు బాధితుఁడవుగాని యసమానుఁడవగు నిన్ను—

ఎడతెగని కరుణారసము చిప్పిలు సుందరలోచన ప్రసారములచే దాక్షాయణి మొదలగు నిఖిలభక్త జనసమూహములఁ గటాక్షించి రక్షించు నిన్ను, సర్వసంశయములు వాపెడి, యేరికి వారింప నలవిగాని, భూభారమును వారింప సమర్థమగు లీలామానుష దేహధారి వగు నిన్ను, నిష్కాముఁడవగు నిన్ను—

శ్రీ లొప్పారు కరుణావలోకన మాత్రమునఁ జతుర్ముఖ ఫాలాక్షాది సకలదేవతల శ్రమలనెల్లఁ బోఁద్రోలెడి నిన్ను, నిరంతర మమనస్కయోగ సమాధి నిష్ఠాపరిపూర్ణులగు పరమయోగీంద్రుల హృదయ కమలముల కర్ణికలపై విరాజిలుచు, స్మరించినంతనె సర్వజగముల పావన మొనరించెడి, యద్భుత ప్రభావభాసుర మగు నాకాశ గంగా తరంగిణిం జనింపఁ జేసిన వైభవమున భాసిలు (జలజ శంఖ చక్ర

త్పవిత్రీకృతాద్భుతప్రభావభాసురవిభవాభిశోభితకిసలయమృదుపాదం సమస్తజనానుమోదం నతజనసంతతసకలకల్యాణగుణసంపాదం.

దళత్పుండరీకపత్త్రజైత్రవిపులతరమనోహరవిలోచనం శిలామయమానియోషామర్షణదోషవిమోచనం యాచితవైరోచనం.

కుముదబాంధవకిరీటప్రచండకోదండ ఖండనోద్దండ దోర్దండసముద్దామం దేవతాసార్వభౌమం రవికులపయఃపారావారపరిపూర్ణసోమం గర్వితపూర్వగీర్వాణవాహినీసందోహకఠినకంఠలుంఠనగళచ్ఛోణితారుణిత సహస్రకరసహస్రకోటిప్రభాభాసమానమహాభూతభయంకరసుదర్శనాభిధానచక్రాయుధాభిరామం మారీచసుబాహువిరామం హారహీరనీహారకర్పూరసుధాసారడిండీరశరన్నీరదశారదానారదపూర్ణిమాచంద్రధిక్కారదశదిగ్వ్యాపితధవళయశోధామం శ్రీరామం.

జననమరణాదిఘోరసంసార మహాగహనదావదహనాయమానసకలజగజ్జేగీయమానపావననామధేయంసూరిజనభాగధేయం ఇంద్రనీలమణిప్రతీకాశాతిస్ఫుటసుందరకాయం



హలకులిశాది చిహ్నములచేఁ జెన్నారు) చివురులవలె కోమలములగు పాదములుగల నిన్ను, సర్వజనానందకరుఁడవై, ప్రణతులగు జనులకు నిరంతర కల్యాణగుణ ప్రదాతవగు నిన్ను—

విప్పారు తెల్లతామరరేకులం గేరు విశాలములును, సుందరములు నగు లోచనములు కల నిన్ను, శిలయై పడియున్న గౌతముని సతి యగు నహల్యాదేవి దుర్భరపాపమును బాపిన నిన్ను, (నిత్య రమావాసుఁడవయ్యు) సురలఁ బాలింప బలిని యాచించిన నిన్ను—

చంద్రచూడుని దండి కోదండమును ఖండన మొనరించు నుద్దండ బాహుదండముల నఖండుఁడ వని ప్రఖ్యాతి నడసిన నిన్ను, దేవతాసార్వభౌముఁడ వగుచు, సూర్యవంశ మను పాలసంద్రము నానందింపఁజేయు రాకాసుధాకరబింబంబ వగు నిన్ను, మత్తులగు పూర్వదేవతల కుత్తుకలం దఱుఁగఁ దొఱఁగు నెత్తుటం దోగి, జేగురువన్నెనెనసి సహస్రకోటి భాస్కరప్రభలఁ బ్రకాశించుచు మహాభూతభయంకరమై యొప్పిన సుదర్శన మను పేరొందిన చక్రాయుధముచే నలరారు నిన్ను, మారీచసుబాహులను దోరించిన నిన్ను, మనోహరములగు నాణిముత్తెములను, కర్పూరమును, అమృతసారమును, పాలవెల్లినురుగును, శరత్కాల మేఘమును, భారతిని, నారదుని, శరద్రాకాసుధాకరుని నుపహసించుచు దశదిశలఁ బ్రసరించు ధావళ్యముతో నొప్పు కీర్తిధాముఁడ వగు శ్రీరాముని నిన్ను—

జననము, మరణము మొదలగువానిచే ఘోరమైయున్న సంసారమను నరణ్యమును దవానలమట్లు దహింపఁజాలెడి సకల జగజ్జేగీయమానమగు పావన నామధేయముగల నిన్ను, భక్తవరులగు విద్వాంసుల భాగ్యదేవతవైన నిన్ను, ఇంద్రనీల మాణిక్యమువలె మిగుల స్ఫుటమైన ప్రకాశముకల సుందరతర కాయుఁడ వగు నిన్ను-

రమాకాంతాకుచకుట్మలతటీచర్చితపటీరకుంకుమసంకుమదమిళచ్చందనపంకముద్రితశోభనవిశాలవక్షసం రూక్షేక్షాశిక్షితవిపక్షం ప్రపన్నావనదీక్షం.

పరధనపరదారావిముఖమునిజనసేవ్యం దుష్టజనదుర్విభావ్యం ప్రణవైకసంస్తవ్యం శ్రుతిశిరోవీథికాశ్రావ్యం.

విలూనదంభాభిమాననానాభువనసంస్తూయమానమానవవపుర్నిర్మాణసమానమానససరోవరముహుర్ముహురుద్గతసముత్తుంగాఖండానంద వీచీపరంపరలీలాడోలాందోళిత చిన్మయరాజహంసం రాజకులావతంసం.

మునిమనోజ్ఞానేందుమండలం రత్నప్రభాకరచకితచామీకరచారుకిరీటకుండలం పరిపోషితాఖండలం.

గుణత్రయశక్తిత్రయమూర్తిత్రయానువృత్తం కరుణామయచిత్తం.



లక్ష్మీదేవియొక్క చనుమొగ్గలపరిసరములఁ బూయఁబడిన కస్తూరి కుంకుమ కర్పూరాది సుగంధద్రవ్యములతో మిళితమై ఘుమఘుమలాడు చందనముచే ముద్రితమై శోభించు విశాల వక్షముతో నొప్పెడి నిన్ను, ఎట్టి శత్రువైనఁ గోపముచేఁ గెంపు సొంపు దీపించు చూపుల నేపణంచుచు, శరణాగతుల రక్షింప దీక్షఁబూనిన నిన్ను—

పరధన పరదారలందు విముఖులగు మునిజనములచే సేవింపఁబడుచు, దుష్టుల కెట్లైన నూహింప నలవడని నిన్ను, ప్రణవముచేతనే ముఖ్యముగా స్తుతింపఁదగిన నిన్ను, వేదశిరోవీథులయందు (వేదాంతవీథుల యందు) వినఁబడు నిన్ను—

దంభాభిమానములఁ ద్రుంచుకొన్న భువనస్తుత్యులగు మానవదేహముల నిర్మించుటయం దసమానుఁడై రాణించు బ్రహ్మదేవుని మానస కాసారమున వెంటవెంట నుదయించుచు నుప్పొంగు నుత్తుంగములగు నఖండానందవీచీపరంపర లను లీలాడోలికల నుయ్యాల లూపఁబడు చిన్మయ రాజహంసంబ వగు నిన్ను, రాజన్యకులశిరోమణి వగు నిన్ను—

మునుల మనములను జ్ఞానచంద్రికల వెదఁజల్లు చంద్రబింబంబ వగు నిన్ను, జిలిబిలి మెఱుంగులు తురంగలించు రత్నములఁ జకచకిత ద్యుతిభాసురము లగు ఘనతరస్వర్ణకిరీటకుండలాదిభూషణ భూషితుఁడ వగు నిన్ను, నింద్రునిఁ గాపాడు నుపేంద్రుఁడవగునిన్ను—

సృష్టిస్థితిసంహారములఁ జేయుటకై, సత్త్వాది గుణ త్రయమును, ఇచ్ఛాది శక్తిత్రయమును, బ్రహ్మాది మూర్తిత్రయము ననువర్తించు కరుణాయత్తచిత్తుఁడ వగు నిన్ను—

పనసామ్రకదళీక్రముకఖర్జూర జంబునింబ జంబీర పున్నాగ చంపకమధూకవకుళాశోకతమాలసాలరసాలపల్లవితకోరకిత పుష్పితఫలితలలితమహీరుహరాజీవిరాజితదండకారణ్యసంచరణలోలం సాకేతాంతర్గతసువర్ణప్రాసాదవిహరణశీలం తోషితాశేషభూపాలం,

సురాసురయక్షరక్షోరగగరుడగంధర్వ సిద్ధసాధ్య కిన్నరకింపురుషవిద్యాధరచారణాప్సరోబృందరచితబహువందనం భక్తజనచందనం రఘునందనం త్వాం భజామి త్వాం భజామి మాం రక్ష రక్ష నమ స్తే నమ స్తే నమః.

[1] శ్రుత్వా తద్గృధ్రవచనం రామ స్సస్నేహ మబ్రవీత్
సాధు గృధ్రమహారాజ! తథైవ కురు మే ప్రియం. ౪౯
అత్రైవ మే సమీపస్థో నాతిదూరే వనే వస
ఇ త్యామంత్ర్య త మాలింగ్య యయౌ పంచవటీం ప్రభుః. ౫౦

[2] తతః పంచవటీం గత్వా నానావ్యాళమృగాయుతాం
ఉవాచ భ్రాతరం రామ స్సౌమిత్రిం దీప్తతేజసం. ౫౧

1. అధ్యాత్మ రా. ౭ స. 2. వాల్మీకి రా. ౧౫ స.



పనస, మామిడి, యఱఁటి, పోక, ఖర్జూరము, నేరేడు, వేప, నిమ్మ, పున్నాగ, సంపెఁగ, విప్ప, పొగడ, అశోకము, చీఁకటి, మద్ది, తియ్యమామిడి యనెడి వివిధ నామముల నొప్పి, చిగిర్చి, మొగ్గ దొడిగి, పూచి, కాచి, ఫలించెడి తరులతాజాలమునఁ జాల రాజిలు దండకారణ్యమునఁ దిరుగాడఁగోరు నిన్ను, అయోధ్యానగరాంతర్గత పరిశుద్ధస్వర్ణప్రాసాదాంతరమున విహారనిరతుఁడ వగు నిన్ను, అశేషభూపాలకుల నానంద పఱచెడి నిన్ను—

దేవతలు, అసురులు, యక్షులు, రక్కసులు, పన్నగులు, గరుడులు, గంధర్వులు, సిద్ధులు, సాధ్యులు, కిన్నరులు, కింపురుషులు, విద్యాధరులు, చారణులు, అప్సరోగణములు మొదలగువారిచేఁ బ్రతిదిన మును కైవందనంబు లందు నిన్ను, భక్తులపాలిఁటి నందనంబ వగు నిన్ను, రఘుకులవంశవర్ధనుండవును దశరథనందనుఁడవు నగు నిన్నే భజించెద, నిన్నే భజించెద, నన్ను రక్షింపుము రక్షింపుము. (మనోవాక్కాయములచే) నీ కిదే నమస్కారము, నమస్కారము, నమస్కారము.

౪౯–౫౦ అని యిట్లు కొనియాడిన జటాయువు వచనములను విని, శ్రీరామ చంద్రుఁడు స్నేహపూర్వకముగా నిట్టులనియె. 'ఓ గృధ్రమహారాజా! బాగు! బాగు! ఇట నాదాఁపున నేయనతిదూరమున నుండి నాకుం బ్రియం బొనర్పుము.' అని యాతనిం గౌఁగిలించుకొని యాతనితోఁ జెప్పి సీతాలక్ష్మణులతో శ్రీరామచంద్రప్రభుండు పంచవటికిం బోయెను.

౫౧–౫౨ శ్రీరామచంద్రుఁ డంతఁ దమ్మునితోడను, సతితోడను నానావిధములగు క్రూరసర్పములు, మృగములునుం గల పంచవటిం జేరి, (శ్రీరామ కైంకర్యముఁ జేయుట కుచితమగు విజనప్రదేశము దొరకి

ఆగ తాస్మ యథోద్దిష్ట మముం దేశం మహర్షిణా
ఆశ్రమః కతర స్మి న్నో దేశే భవతి సమ్మతః. ౫౨

లక్ష్మణ ఉవాచ—

పరవా నస్మి కాకుత్స్థ త్వయి వర్షశతం స్థితే
స్వయంతు రుచిరే దేశే క్రియతా మితి మాం వద. ౫౩

స తం రుచిర మాక్రమ్య దేశ మాశ్రమకర్మణి
హస్తే గృహీత్వా హస్తేన రామ స్సౌమిత్రి మబ్రవీత్. ౫౪

ఇహాశ్రమపదం సౌమ్య యథావ త్కర్తు మర్హసి
అదూరే దృశ్యతే రమ్యా పద్మినీ పద్మశోభితా. ౫౫
ఇయం గోదావరీ రమ్యా పుష్పితై స్తరుభి ర్వృతా. ౫౫½

ఏవ ముక్త స్తు రామేణ లక్ష్మణః పరవీరహా.  ౫౬
పర్ణశాలాం సువిపులాం తత్ర సంఘాతమృత్తికాం
సుస్తంభాం మస్కరై ర్దీర్ఘైః కృతవంశాంసుశోభనాం. ౫౭

శమీశాఖాభి రాస్తీర్య దృఢపాశావపాశితాం
కుశకాశశరైః పర్ణై స్సుపరిచ్ఛాదితాం తథా. ౫౮



నందున) మిగులఁ బ్రకాశించు తేజముగల, లక్ష్మణునిఁజూచి యిట్లు
నియె. లక్ష్మణా! అగస్త్యమహాముని మున్ను చెప్పిన చోటికి వచ్చి
తిమి. ఇం దేతావున మనమువ్వురకు నాశ్రమము సమ్మతముగ
నుండునో? (చూడు మనెను.)

నా విని లక్ష్మణుఁ డిట్లనియె—

౫౩ శ్రీరామచంద్రా! నూ ఱేండ్లున్నను నీకడ నేను బరతంత్రుఁడనే
కాని స్వతంత్రుఁడను గాను. నీవే రమ్యముగ నుండు ప్రదేశము
చూచి యిచ్చట నాశ్రమము నిర్మింపు మని నాకాజ్ఞ యిమ్ము.

౫౪ అంత శ్రీరామచంద్రమూర్తి యాశ్రమ నిర్మాణమునకై మనోహర
ముగ నుండు ప్రదేశమున కేగి, తనచేత లక్ష్మణునిచేయిఁ బట్టుకొని
యిట్లనియె.

౫౫–౫౫½ సౌమ్యుఁడా! ఈప్రదేశమునఁ దగురీతిఁ బర్ణశాల నిర్మింపుము.
సువాసనల గుప్పించెడు తామరపూవుల నొప్పారు తామగకొల నిచ్చ
టికి సమీపముననే కన్పట్టుచున్నది. చక్కఁగాఁ బూచిన వృక్ష
ములచేఁ జుట్టువారుకొనియున్న రమ్యమగు గోదావరినది యిదిగో!

౫౬–౫౮ అని శ్రీరామచంద్రుఁడు సెప్పఁగ శత్రునూదనుఁ డగు లక్ష్మ
ణుఁడు, మట్టితో గోడలు పెట్టి, స్తంభములు నాటి, పొడువైన
వెదుళ్లతో వాసముల నమర్చి, యందుపై జమ్మికొమ్మలఁ బఱచి,
నారపట్టలతో నంతట బిగించి, దర్భ రెల్లు మొదలగు వానిచేఁ
బైకప్పు నందముగఁ గన్పట్టునట్లు కప్పి, భూమిని జక్కఁగఁ జదును

సమీకృతతలాం రమ్యాం చకార రఘునందనః
నివాసం రాఘవ స్యార్థే ప్రేక్షణీయ మనుత్తమం. ౫౯
* తతః పుష్పబలిం కృత్వా శాంతించ స యథావిధి
దర్శయామాస రామాయ తదాశ్రమపదం కృతమ్. ౬౦
[1] తత్ర తే న్యవస న్సర్వే గంగాయా ముత్తరే తటే. ౬౧

---

* తత ఇత్యత్ర తథా శ్రీరామః అగస్త్యాశ్రమస్య యోజనద్వయదూరే గోదావర్యుత్తరతీరస్థపంచవటీక్షేత్రే స్థిత ఇతి జ్ఞాయతే. ఏషా పంచవటీ ఇదానీం ప్రాగ్గోదావరీమండలే శ్రీభద్రాచల మితి ప్రసిద్ధపుణ్యక్షేత్రస్య యోజనత్రయదూరే పర్ణశాలేతి లోకే వ్యవహ్రియమాణప్రదేశ ఏవేతి ద్యోత్యతే. పంచవటీప్రదేశనిర్ణయే మహారాష్ట్రియాః కేచన మహారాష్ట్రదేశస్థ (Nasik) నాసికాపత్తనసమీపస్థప్రదేశ ఏవేతి నిర్ణీతవంతోఽపి - తద్దేశీయానాం మధ్యే కేచన విమర్శకధురీణాః గ్వాలియర్ సంస్థాన (Chief Judge) చీఫ్ జడ్జీ పట్టభద్ర చింతామణి వై. వినాయకవైద్యప్రభృతయః మహారాష్ట్రభాషాయా మాంధ్రదేశస్థ పర్ణశాలైవ పంచవటీ త్యనిర్ణయన్. లఘుకల్పనార్థం పూర్వోక్తవాదద్వయ మనుసృత్య శ్రీమద్రామాయణే చిత్రకూటప్రదేశా త్పంచవటీపర్యంతం శ్రీరామచంద్ర స్యారణ్యమార్గే విచార్యమాణే నాసికాపట్టణసమీపే పంచవట్యాం విద్యమానాయాం మధ్యే మార్గం శ్రీరామచం

1. అధ్యాత్మ రా. ౪ స.



చేసి, శీఘ్రకాలములోఁ గనువిందుసేయు నత్యుత్తమమగు పర్ణశాలను శ్రీరామచంద్రునికొఱకు నిర్మించెను.

౬౦-౬౧ * మఱియు లక్ష్మణుఁడు వాస్తుకలోక్తవిధానమున పుష్పబలి నొసర్చి పూజించి శ్రీరామచంద్రమూర్తి కా యాశ్రమస్థానమును జూపెను. అంత వారందరు గోదావరి కుత్తరపు తీరమున నున్న యా యాశ్రమమున సుఖముగ నివసించుచుండిరి.

---

* శ్రీరామచంద్రుఁ డగస్త్యాశ్రమమునకు రెండు యోజనముల దూరమున నున్న గోదావరినది కుత్తరఁపు టొడ్డునఁ గల పంచవటియందుండె నని తెలియుచున్నది. పంచవటి యను నియ్యది ప్రస్తుతము తూర్పు గోదావరి జిల్లాలోని భద్రాచల మను ప్రసిద్ధ పుణ్యక్షేత్రమునకు మూఁడు యోజనముల దూరమున నున్న 'పర్ణశాల' యని నేఁడు పిలువఁబడు ప్రదేశ మనియే తోఁచుచున్నది. ఈపంచవటీ నిర్ణయమున మహారాష్ట్రదేశస్థులు కొందరు మహారాష్ట్రదేశమునందుఁ గల నాసికా పట్టణ సమీపప్రదేశమని నిర్ణయించిరి. గాని, యా దేశస్థులలోనే కొందరు విమర్శకాగ్రేసరులు 'గ్వాలియర్' సంస్థానమునకు 'చీఫ్ జడ్జి' పట్టభద్రులగు చింతామణి వై. వినాయకవైద్య మొదలగువారు మహారాష్ట్ర భాషయందు- ఆంధ్రదేశమందున్న 'పర్ణశాలయే' పంచవటి యని నిర్ణయించిరి. సౌకర్యమునకు మన మీ రెండువాదముల నింకను సులభ మొనరించుటకై కొంతవఱకు విమర్శించిన యెడల శ్రీమద్రామాయణమునందుఁ జిత్రకూటమున నుండి పంచవటీ వఱకుంగల శ్రీరామచంద్రుని యరణ్యమార్గము విచారించిన నాసికాపట్టణ సమీపమందే పంచవటి యున్నచో మార్గమధ్యమున శ్రీరామునకు సర్వపురాణప్రసిద్ధము లగు వింధ్యపర్వతము

కందమూలఫలాదీని లక్ష్మణో ఽనుదినం తయోః. ౬౧
ఆనీయ ప్రదదౌ రామసేవాతత్పరమానసః.

ధనుర్బాణధరో నిత్యం రాత్రౌ జాగర్తి లక్ష్మణః ౬౨
స్నానం కుర్వంత్యనుదినం త్రయ స్తే గౌతమీ జలే. ౬౩

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
పంచమ స్సర్గః.

---

ద్రేణ సర్వపురాణప్రసిద్ధవింధ్యాద్రిః నర్మదాచ అవశ్యం దృష్టిపథం ప్రాప్యే. శ్రీమద్రామాయణే తద్వర్ణనాభావాత్ వక్ష్యమాణజనస్థానప్రనిర్ణయానుగ్రహాత్ ఉక్త ప్రదేశస్మృత్యనుగ్రహాచ్చ, ఆంధ్రదేశస్థపర్ణశాలైవ పంచవటీతి నిర్ణేతవ్యా.

తథాహి సాధారణప్రదేశాం శ్చ తత్రో వర్ణయత శ్రీవాల్మీకేః ప్రసిద్ధభూతయో ర్వింధ్యాద్రినర్మదానద్యో ర్వర్ణనస్య కుతో నావసరః. అపిచ రామాయణే సీతాపహరణానంతరం శ్రీరామస్య పంచవటీ మారభ్య ఆపంపాం సీతాన్వేషణే తన్మార్గమానే విచార్యమాణేఽపి నాసికాయాః పంపాపర్యంతస్థితదూర స్యావిద్యమానత్వాత్, ఇతరార్ష రామాయణానుగ్రహాచ్చ, ఆంధ్రదేశస్థ పర్ణశాలైవ పంచవటీతి నిర్ణీయతే. తత్ర పంచవట్యాం శ్రీరామచంద్రః సీతాలక్ష్మణాభ్యాం సహితో వత్సర ద్వయ మువాస ఇతి చతురశ్రం.



౬౧-౬౩ పంచవటి యందున్న సీతారాములకు శ్రీరామసేవాతత్పరుఁడైన లక్ష్మణుఁ డనుదినమును కందమూల ఫలాదులను దెచ్చి యిచ్చును. రాత్రులం దెల్లపుడు లక్ష్మణుఁడు విల్లునమ్ముల ధరించి మేల్కొని యుండుచుండెను. ప్రతిదినమును గోదావరీజలములందు వారు మువ్వురును స్నాన మొనరించుచుండిరి.

ఇట్లు శ్రీరామాయణ సారోద్ధారమున
నరణ్యకాండమునం దైదవ సర్గము ముగిసెను.

---

నర్మదా నదియు తప్పక కనఁబడితీరవలెను. కాని శ్రీమద్రామాయణ మందు వాని వర్ణనము మందునకైన లేకపోటచేతను, ముందొనర్పఁ బోయెడు జనస్థాన ప్రదేశ నిర్ణయము వలనను, తొలుత రామాయణ మందుఁ జెప్పఁబడిన ప్రదేశములఁ బట్టియు నాంధ్రదేశమునం గల పర్ణశాలయే 'పంచవటి' యని నిశ్చయింప నగును.

అటుల గానిచో సామాన్యప్రదేశము సహితము విశేషముగా వర్ణించు శ్రీ వాల్మీకిమహర్షికి జగత్ప్రసిద్ధములగు వింధ్య నర్మదలను వర్ణించు నవసర మేల లేకపోయెను? మఱియు శ్రీమద్రామాయణ మందు సీతాపహరణానంతరము శ్రీరామచంద్రుఁడు పంచవటి మొదలు పంపానది వరకు వెదకిన యా మార్గప్రమాణము కొలది విమర్శించినను నాసిక వద్దనుండి పంప కున్నంత దూరము లేని కారణము వలనను, ఇత రార్ష రామాయణముల యనుగ్రహము వలనను, ఆంధ్రదేశమునం దున్న పర్ణశాలయే పంచవటి యని స్పష్టముగ నిర్ణయింపవలసి వచ్చును. అట్టి పంచవటియందు శ్రీరామచంద్రమూర్తి సీతా లక్ష్మణులతోఁ గూడ రెండు సంవత్సరము లుండెను. ఇట్లు చెప్పిన సర్వము చక్కఁగఁ గుదురును.

## షష్ఠ స్సర్గః.

ఏకదా లక్ష్మణో రామ మేకాంతే సముపస్థితం
వినయావనతో భూత్వా పప్రచ్ఛ పరమేశ్వరం. ౧

భగవన్! శ్రోతు మిచ్ఛామి మోక్షస్యైకాంతికాం గతిం
త్వత్తః కమలపత్రాక్ష! సంక్షేపా ద్వక్తు మర్హసి. ౨

శ్రీరామ ఉవాచ—

శృణు వత్స! ప్రవక్ష్యామి గుహ్యా ద్గుహ్యతరం పరం
య ద్విజ్ఞాయ నరో జహ్యా త్సద్యో వైకల్పికం భ్రమం. ౩

అనాత్మని శరీరాదా వాత్మబుద్ధిస్తు యా భవేత్
సైవ మాయా తయై వాసౌ సంసారః పరికల్ప్యతే. ౪

విక్షే పావరణే తత్ర ప్రథమం కల్పయే జ్జగత్
అపరం త్వఖిలం జ్ఞానరూప మావృత్య తిష్ఠతి. ౫

ఏతై ర్విలక్షణో జీవః పరమాత్మా నిరామయః
జీవశ్చ పరమాత్మాచ పర్యాయో నాత్ర భేదధీః. ౬



## ఆఱవ సర్గము.

౧. అట్లా సీతారామలక్ష్మణులు పంచవటియం దుండ నొకానొక సమయమున లక్ష్మణుఁ డేకాంతమున నున్నతఱి పరమేశ్వరుఁ డగు శ్రీరామచంద్రుని జేరి వినయవినమితుండై యి ట్లని యడిగెను. (ఈ శ్లోకమువలన గురువునకు శిష్యుఁడు చరింపవలసిన వినయాదులు సూచింపఁ బడినవి)

౨ భగవానుఁడా! ఓ పుండరీకాక్షుఁడా! మోక్షము యొక్క నిజమైన మార్గమును నీవలన వినఁ గోరుచున్నాను. దానిని సంక్షేపముగఁ దెలియఁజేయ నీవే తగుదువు.

౩ అన విని శ్రీరామచంద్రుఁ డిట్లనియె. ఏ విషయమును దెలిసికొన్నంత నే నరుఁడు తత్క్షణమే జగద్భ్రాంతిని వదలి ముక్తుం డగుచున్నాఁడో; అట్టి పరమరహస్య మగు వంశముఁ జెప్పుచున్నాను. వినుము.

౪ ఆత్మకాని శరీరాది ప్రపంచ వస్తుజాలమం దాత్మ యను నూహ యేది కలదో; అదియే మాయ. ఈ మాయచేతనే జన్మ మరణాది రూపమైన యీ సంసారమంతయు కల్పిత మగుచున్నది.

౫ లక్ష్మణా! అనాదియగు మాయకు విక్షేపావరణము లను రెండు రూపములు గలవు. అందు మొదటిదానివలన మహత్తత్త్వము మొదలు చతుర్ముఖ బ్రహ్మవఱకు స్థూల సూక్ష్మాది నానావిధములు గల జగత్తు కల్పితమగుచున్నది. ఇంక రెండవ దగు నావరణ మాత్మజ్ఞాన స్వరూపము నావరించి యున్నది. (ఇదియే మాయా స్వరూపము)

౬ ఈ జడములగు దేహాదులకన్న విలక్షణుఁడు జీవుఁడు. అతఁడే యవ్యయుఁ డగు పరమాత్మ. జీవ పరమాత్మ లనునవి పర్యాయపద

తస్య జీవస్య విజ్ఞానే సాధనా న్యపి మే శృణు. ౬

మనోవాక్కాయసద్భక్త్యా సద్గురోః పరిసేవనం. ౭
బాహ్యాభ్యంతరసంశుద్ధి స్థిరతా సత్క్రియాదిషు
మయి సర్వాత్మకే రామే హ్యనన్యవిషయా మతిః. ౮
బుద్ధిప్రాణమనోదేహా ఽహంకృతిభ్యో విలక్షణః
చిదాత్మా ఽహం నిత్యశుద్ధో బుద్ధ ఏవేతి నిశ్చయం. ౯

కిం త్వేత ద్దుర్లభం మన్యే మద్భక్తివిముఖాత్మనాం
చక్షుష్మతా మపి యథా రాత్రౌ సమ్య జ్న దృశ్యతే. ౧౦
పదం దీపసమేతానాం దృశ్యతే సమ్యగేవ హి
ఏవం మద్భక్తియుక్తానా మాత్మా సమ్య క్ప్రకాశ్యతే. ౧౧

మద్భక్తేః కారణం కించి ద్వక్ష్యామి శృణు తత్వతః
మద్భక్తసంగో మత్సేవా మమ పర్వానుమోదనం. ౧౨
మత్కథా శ్రవణే పాఠే వ్యాఖ్యానే సర్వదా రతిః
మత్పూజా పరినిష్ఠాచ మమ నామానుకీర్తనం. ౧౩
అతో మద్భక్తియుక్తస్య జ్ఞానం విజ్ఞానమేవ చ
వైరాగ్యంచ భవేచ్ఛీఘ్రం తతో ముక్తి మవాప్నుయాత్.
౧౪



ములేకాని యథ్గమం దెంతమాత్రము భేదము లేదు. కావున జీవాత్మ పరమాత్మలను భిన్న లని తలంపఁగూడదు. ఆజీవుని దెలిసికొనుటకు సాధనములను వినుము.

౭-౯ అవి మనోవాక్కాయము లను త్రికరణములచేఁ బరిశుద్ధమైన భక్తిచే సద్గురువును సేవించుట, బాహ్యాభ్యంతరములయందుఁ బరిశుద్ధి కలిగి యుండుట, సత్కర్మల వదలక యాచరించుట, సర్వాత్మకుఁడ నగు నాయందు స్థిరమైన బుద్ధి గలిగియుండుట, నేను దేహమునుగాను, ప్రాణముం గాను, ఇంద్రియములుగాని మనోబుద్ధిచిత్తాహంకార ములలో నేదియుఁగాని కాను – కేవలచైతన్యస్వరూపుఁడను, నిత్య శుద్ధబుద్ధసచ్చిదానందాత్మకుఁడ నను నిశ్చయజ్ఞానము నెల్లప్పుడును కలిగియుండుట; అనునవి.

౧౦-౧౧ అయినను నాయందు భక్తి లేనివారల కిప్రుడు నేఁ జెప్పిన విజ్ఞాన సాధనములు పొంద నలవిగాదు. కన్నులు గలవారికైనను రాత్రి కండ్లు కనఁబడవు. దీప మున్నయెడలనే దారి కనఁబడునుగదా! అట్లే నాయందు భక్తి యున్నవారికే యీ సాధనముల మూలమున నాత్మస్వరూపము లెస్సఁగాఁ బ్రకాశించును.

౧౨-౧౪ నాయం దట్టి భక్తి కలుగుట కించుక కారణములు దెల్పెదను. స్పష్ట ముగా వినుము. అవేవన; నాభక్తులతో నిరంతరము సహవాసము, నన్నే సేవించుట, నాయుత్సవఁపు దినములందు శక్తికొలఁది నా పూజాదులఁ జేసి యానందపడుట, ప్రేమతో నా కథలనే యెల్ల ప్పుడును వినుట, చదువుటయు, యితరులకుఁ బోధపడునట్లు వివ రించుట యను వానియందు కోరిక, నన్ను దృఢచిత్తమునఁ బూజిం చుట, నా నామభజనము సేయుట అనునవి. ఇట్లు నాయందు భక్తి నెలకొనినవానికి శీఘ్రముగ జ్ఞానము, విజ్ఞానముగూడ లభించి వేగముగ వైరాగ్య మేర్పడును. అందుచే మోక్షము నందఁగల్గును.

కథితం సర్వ మేత త్తే తవ ప్రశ్నానుసారతః
అస్మి న్మన స్సమాధాయ య స్తిష్ఠే త్సతు ముక్తిభాక్. ౧౫
శ్రుత్వా రామోదితం సర్వం లక్ష్మణః ప్రముమోదహ. ౧౫½

[1] వసత స్తస్యతు సుఖం రాఘవస్య మహాత్మనః ౧౬
శరద్వ్యపాయే హేమంతఋతు రిష్టః ప్రవర్తతే. ౧౬½

స కదాచి త్ప్రభాతాయాం శర్వర్యాం రఘునందనః. ౧౭
ప్రయయా వభిషేకార్థం రమ్యాం గోదావరీం నదీం
పృష్ఠతో ఽనువ్రజన్ భ్రాతా సౌమిత్రి రిద మబ్రవీత్. ౧౮

ప్రకృత్యా శీతలస్పర్శో హిమదిగ్ధశ్చ సాంప్రతం
ప్రవాతి పశ్చిమో వాయుః కాలే ద్విగుణశీతలః. ౧౯

అవశ్యాయతమోనద్ధా నీహారతమసా వృతాః
ప్రసుప్తా ఇవ లక్ష్యంతే విపుష్పా వనరాజయః. ౨౦

అస్మింస్తు పురుషవ్యాఘ్రః కాలే దుంఖసమన్వితః
తప శ్చరతి ధర్మాత్మా త్వద్భక్త్యా భరతః పురే. ౨౧

త్యక్త్వా రాజ్యంచ మానంచ భోగాంశ్చ వివిధాన్ బహూన్
తపస్వీ నియతాహారః శేతే శీతే మహీతలే. ౨౨

1. వాల్మీకి రా. ౧౬ స.



౧౫-౧౫½ లక్ష్మణా! నీ వడిగిన ప్రశ్నము ననుసరించి యీతత్త్వమంతయు నీకుఁ జెప్పితిని. ఎవ్వఁడు దీనియందు మనసు నిలుపునో; యాతఁడు తప్పక మోక్షము నందును. అని యిట్లు శ్రీరామచంద్రమూర్తి చెప్పఁగా లక్ష్మణుఁడు విని బ్రహ్మానందభరితుం డయ్యెను.

౧౬-౧౬½ అట్లు మహాత్ముఁ డగు శ్రీరామచంద్రుఁడు పంచవటియందు సుఖముగా నివసించుచుండఁగనే శరదృతువు గడచిపోయి (తపస్సును పరీక్షించుకొనఁగోరువారి) యిష్టముఁగూర్చు హేమంతఋతువు ప్రారంభమాయెను.

౧౭-౧౮ ఆ హేమంతమున నొకనాఁడు శ్రీరామచంద్రుఁడు ప్రభాతమున స్నానమాచరింప రమ్యమగు గోదావరీనది కరిగెను. అపుడు వెనుక నడచుచు వచ్చుచున్న లక్ష్మణుఁడు శ్రీరామచంద్రునితో నిట్లనియె.

౧౯-౨౦ శ్రీరామచంద్రా! ఈ పడమటి గాలి స్వభావముచేతనే చల్లని స్పర్శ కలిగియుండును. అది యీ హేమంతఋతువునఁ బ్రొద్దుట మంచుతోఁ గలిసి రెండింతల చలువగలదై వీఁచుచున్నది. మంచు నీరను చీఁకటిం గప్పఁబడి, పొగమంచను తమస్సున నావరింపఁబడినవై, పుష్పములు లేనివై, వనపంక్తులు నిద్రించుచున్నవో యనునట్లున్నవి.

౨౧ ఓ శ్రీరామచంద్రా! ఇట్టి హేమంతంబున ధర్మస్వభావుఁ డగు మన భరతుఁ డీ సమయమున నిన్నెడఁబాసిన దుఃఖముతో నీమీఁది భక్తిచే నయోధ్యాపురమునఁ దపమాచరించుచుండును.

౨౨ మరియుఁ బ్రభుత్వమును, రాజకుమారుఁడనను నభిమానమును, నానావిధ భోగములను గూడఁ బోవిడిచి, ఋషులవలె జడలను, నారచీరలను దాల్చి, కందమూలములఁ దినుచు మిగుల చల్లని దగు పుడమిపైఁ బండుకొనుచుండును.

శ్రీరామ ఉవాచ—

నిశ్చితాపి హి మే బుద్ధి ర్వనవాసే దృఢవ్రతా
భరతస్నేహసంతప్తా బాలిశీ క్రియతే పునః. ౨౩

కదాన్వహం సమేష్యామి భరతేన మహాత్మనా
శత్రుఘ్నేనచ వీరేణ త్వయాచ రఘునందన ! ౨౪

ఇత్యేవం విలపం స్తత్ర ప్రాప్య గోదావరీం నదీం
చక్రే ఽభిషేకం కాకుత్స్థ స్సానుజ స్సహ సీతయా. ౨౫

తర్పయిత్వా ఽథ సలిలై స్తే పితౄన్ దైవతానిచ
* స్తువంతి స్మోదితం సూర్యం దేవతాశ్చ సమాహితాః. ౨౬

* స్తువంతే మిత్యత్ర శ్రీరామేణ స్మార్తవ త్తుస్సార్యాదిసమూహదేవతారాధనం దేవర్షిపితృతర్పణంచ కృత మిత్యవగమ్యతే. తథైవ- శ్లో॥ దేవతానాంచ పూజన మితి గౌతమ సూత్రే ధర్మశాస్త్రనిబంధనగ్రంథేషు పరాశరాదిస్మృతిషు సర్వత్ర పరిదృశ్యతే. అపి చైకస్మి న్నవదానే అనేక దేవతా భాగపరికల్పనం శ్రౌతే స్మార్తేచ పరిదృశ్యతే. తథాహి అగ్నీషోమాభ్యా మిదం అగ్నీంద్రమరుదాదిభ్యో విశ్వేభ్యో దేవేభ్యో ఇద మిత్యాది.



నా విని శ్రీరామచంద్రుం డిట్లనియె :—

౨౩-౨౪ లక్ష్మణా! వనవాసము చేయవలె నను పట్టుదలతో దృఢమైన నాబుద్ధి భరతుని దలంచికొన్నంతనే బాలునిచిత్తమట్లు చలించుచున్నది. అనంగా నాతనియెడలంగల ప్రేమచే వనవాసకాలము కాకుండంగనే యాతని గలిసికొనవలె నని కుతూహలపడుచున్నదని భావము. రఘుకుమారా! మహాత్ముండగు భరతుని, వీరుండగు శత్రుఘ్నుని (సీతతోడను) నీతోడ నెన్నండు కలిసికొనంగలనోకదా! (దీనిచే సీతాలక్ష్మణులకుం గొన్ని యాపదలు రానున్నవనియు, నవి తీరినపిమ్మట మిమ్ముులను భరతాదులను గలిసి యానందించుట జరుగుననియు సూచింపంబడినది.)

౨౫-౨౬ ఈవిధముగం బలుపోకల భాషించుచు సీతాలక్ష్మణులతో శ్రీరామచంద్రుండు గోదావరి కరిగి యందు స్నాన మాచరించెను. *వా రానదిలోని యుదకములచే దేవర్షి పితరులకుం దర్పణములుచేసి, ఉదయించుచున్న సూర్యుని స్తుతించి, స్థిరచిత్తులై సంధ్యాదేవతలం బ్రార్థించిరి.

* ఈ యర్థము విచారించిన, శ్రీరామచంద్రమూర్తి లోకసంగ్రహార్థము స్మార్తులవలెనే దేవర్షి పితృతర్పణములు, సూర్యుండు మొదలగు సమూహ దేవతల నారాధించె నని తెలియుచున్నది. ధర్మశాస్త్రములందు నీ విధముగ సమూహదేవపూజయే తెల్పంబడుచున్నది. 'దేవతానాంచ పూజన' మ్మని గౌతమ ధర్మ సూత్రమునను, పరాశరస్మృతి మొదలగు వానియందును నిట్లే చెప్పంబడినది. దేవతలందరును పరమేశ్వరుని యంగము లగుటచేత నిచ్చట సాంగైకేశ్వరోపాసనమే చెప్పంబడిన దని తాత్పర్యము. మఱియు నొకమారు గ్రహించిన హవిస్సునం దనేక దేవతలకు భాగకల్పనము శ్రౌతస్మార్తములందుం గన్పట్టుచున్నది కాన ప్రత్యేక ప్రత్యేక పూజలను జేయనిచో దోషములేదు. హోమములందు 'ఈయాహుతి అగ్నిసోములకు, అగ్నీంద్రమరుదాదిలి విశ్వేదేవతలకు' అని సమూహముగం గనంబడుచున్నది.

కృత్వాభిషేకస్సరరాజరామ స్సీతాద్వితీయ స్సహలక్ష్మణేన
కృతాభిషేకో గిరిరాజపుత్ర్యారు♦ద్రస్సవిష్ణుర్భగవానివేశః. ౨౭

[1] కృతాభిషేకో రామస్తు సీతా సౌమిత్రి రేవచ
తస్మా ద్గోదావరీతీరా త్తతో జగ్ము స్స్వ మాశ్రమం. ౨౮
ఉవాస సుఖిత స్తత్ర పూజ్యమానో మహర్షిభిః. ౨౮½
ఏకదా ఫలమూలార్థం లక్ష్మణో విపినం గతః. ౨౯
[2] వనే శూర్పణఖాపుత్రం తపంతం సాంబనామకం
బ్రహ్మ దదౌ దివ్యఖడ్గం తం సాంబో న దదర్శ సః. 30
త ద్దృష్ట్వా లక్ష్మణః ఖడ్గం వృక్షా న్వల్లీ ర్బభంజ సః
వృక్షగుల్మో హత స్సాంబ స్తం దృష్ట్వా లక్ష్మణ స్తదా. 3౧
[3] తతో ఽతిభీత స్సౌమిత్రి శ్శీఘ్ర మాగత్య రాఘవం
ఆచచక్షే ఽథ రామోఽపి జ్ఞాత్వా లక్ష్మణ మబ్రవీత్. 3౨

వృక్షరూపాస్థితా స్సర్వే రాక్షసాస్తు మృతిం గతాః.
మాయావీ రాక్షసస్సోఽపి మృతోఽభూ ద్దేవవంచనాత్. 33
ఇ త్యుక్త్వా తం సమాధాయ ఉవాస సుఖిత స్తతః. 33½

♦ 'రుద్ర స్సవిష్ణు' రిత్యత్ర అభూతోపమ ఇతి విష్ణుభక్తాః; ఉపమేయాధికగుణ ముపమానం భవతీతి కవిసమయ ఇతి శైవాః వ్యాఖ్యాతాః.

1. వాల్మీకి రా. ౧౭ స 2. ఆనంద రా. సారకా. ౬ స. 3. దేవీరామా.



౨౭ ♦ ఇట్లు శ్రీరామచంద్రుఁడు సీతాలక్ష్మణులతో స్నానాదు లాచరించి, పార్వతీదేవితోడను, శ్రీ మహావిష్ణువు తోడను గూడి యభిషక్తుండై విరాజిలు సాక్షాద్భగవానుఁ డగు రుద్రునట్లు ప్రకాశించెను.

౨౮-౨౮½ ఇట్లభిషేకాదివిధులను నిర్వర్తించి శ్రీరామచంద్రుఁడును, సీతయు, లక్ష్మణుఁడును నా గోదావరీతీరమునుండి తమ యాశ్రమమునకుం జనిరి. శ్రీరామచంద్రుఁ డా పర్ణకుటియందు మహర్షులచేఁ బూజింపఁబడుచు సుఖముగ నుండెను.

౨౯-3౨ ఒకనాఁడు లక్ష్మణుఁడు మూలఫలాదులఁ దెచ్చుటకై యడవి కేగెను. అపు డచ్చటఁ దపము చేయుచున్న శూర్పణఖ కొడుకగు సాంబునికొఱకై బ్రహ్మదేవుఁ డొక ఖడ్గము నంపెను. కాని యద్దాని నా సాంబుఁడు చూడలేదు. దానిని బంపునపుడే యెవరు దీనిం జూచి యందుకొనెదరో యిది వారిదే యగు నని నియమము చేసి బ్రహ్మ పంపెను. అపుడు లక్ష్మణుఁ డద్దానిని జూచి యందుకొని దాని వాఁడి పరీక్షించుటకై యచ్చటనున్న వృక్షములను, గుబురుగానున్న పొదలను నఱకెను. దాన నందున్న సాంబుఁడు హతుఁడయ్యెను. అది చూచి బ్రహ్మహత్యాపాతకము చుట్టుకొనె నని లక్ష్మణుఁడు భయపడి యాశ్రమమునకు వచ్చి శ్రీరామచంద్రునితోఁ జెప్ప నందలి నిజస్థితిం దెలిసికొని శ్రీరామచంద్రుం డిట్లనియె.

33-33½ 'లక్ష్మణా! రాక్షసులందరు నా వృక్షరూపమున నున్నారు. నీచే నిపుడు వారందరు మృతినొందిరి. వారికందరికి నాయకుండును మాయావియు నగు నీ రక్కసుఁడు దేవతల వంచించువాఁ డగుటచేఁ జచ్చెను. దీనికి వగవం బనిలేదు. భయపడకుము' అని సమాధానపఱచి సుఖంబున నుండెను.

♦ 'రుద్రస్సవిష్ణుః' అనుట యభూతోపమ యని విష్ణుభక్తులును, ఉపమేయముకన్న నుపమాన మధిక మని శైవులును వ్యాఖ్యానములం జేయుదురు.

వసంతే సమనుప్రాప్తే స్నాత్వా గోదావరీ జలే. ౩౪
[1] స రామః పర్ణశాలాయా మాసీన స్సహ సీతయా
విరరాజ మహాబాహు శ్చిత్రయా చంద్రమా ఇవ. ౩౫

[2] తస్మిన్ త్రయోదశాబ్దాని రామస్య సమతిక్రముః
గోదావర్యా స్తటే పుణ్యే పంచవట్యాం మనోరమే. ౩౬

[3] తం దేశం రాక్షసీ కాచి దాజగామ యదృచ్ఛయా
నామ్నా శూర్పణఖా సా ఽపి సోదరీ రావణస్య చ. ౩౭

ఉష్ట్రస్యేవ ముఖం కడారకుటిలాః ప్రదేశమాత్రా కచాః
కుక్షి ర్దుందుభి రేవ కో ఽపి కుచయో ర్భారః కుసూలోపమః
* బాహూవాహసమర్భగా గజపతే రంఘ్రీ యథాంఘ్రీ తథా
తేనాస్యా మణిభూషణాని దధతే దుస్థానశోభ్యాం దశామ్.
౩౮

పుత్రదుఃఖేన సంతప్తా గత్వా గోదావరీతటం
పద్మవజ్రాంకుశాంకాని పదాని జగతీపతేః. ౩౯
పశ్యంతీ సా శనై రాయా ద్రాఘవస్య నివేశనం ౩౯-౧

* వాహస ఇత్యత్ర - అజగర ఇత్యర్థః.

1. వాల్మీకి రా. ౧౭ స. 2. పాద్మే ఉత్తరఖం. ౪౭ అ. 3. హనుమద్రా. 4. విశ్వామిత్రరా.





౩౪-౩౫ అంత వసంతకాల మరుదెంచెను. శ్రీరామచంద్రుఁడు గోదావరీ జలముల స్నాన మాచరించి యొకనాడు సీతాదేవితోఁ బర్ణశాల నాసీనుఁడై, చిత్తానక్షత్రముతోఁ గూడిన చందురు నట్లు ప్రకాశించుచుండెను. (లక్ష్మణుఁడు యథాప్రకారము పుష్పములు, కంద మూల ఫలాదులును దెచ్చుట కడవి కేగెను.)

౩౬ గోదావరీతీరమం దున్న మనోహరమగు పంచవటియం దుండఁగా శ్రీరామచంద్రునికి వనవాసమునకై యేర్పడినకాలమునఁ బదుమూఁడేండ్లు గడచిపోయెను. (అప్పుడు పదునాల్గవవత్సరము జరుగుచుండె నని యర్థము.)

౩౭ అట్లు సీతారాము లయ్యాశ్రమమున నుండఁగా స్వేచ్ఛగా నొక రాక్షసి యా సమీపమునకు వచ్చెను. ఆమె రావణాసురుని చెల్లెలు శూర్పణఖ యను పేరుగలది.

౩౮ ఆమె మొగ మొంటె మొగమువలె నుండెను. బిరుసుగ గోరోచనంపు రంగు గలిగి, పొట్టిగ జుత్తిలి పొడవునను్న వెండ్రుకలు తలపై గుబురు కొనియుండెను. దుందుభివాద్యమువంటి కడుపు, గరిసెల వంటి పాలిండ్లు, పెనుబాములవంటి బాహువులు, ఏనుగుపాదములవంటి కాళ్లు కలిగియుండెను. ఇట్టి వికృతములైన యంగములయం దామె ధరించిన మణిభూషణములను జూడఁగా నట్టిసొమ్ముల కాదుఃస్థానవాసదౌర్భాగ్యదశ పట్టెఁగదా యని చింతఁ గలుగించున ట్లుండెను.

౩౯-౩౯-౧ ఇట్టిరూపముతోడఁ బుత్రశోకమునఁ బొగులుచు శూర్పణఖ గోదావరియొడ్డునకుం జని, కమలము, వజ్రము, అంకుశము మొదలగు శ్రీరామచంద్రప్రభుని యడుఁగుగుఱుతులనుం జూచి, యాబాటం బడి తిన్నఁగ శ్రీరామచంద్రుని నివాసమునకు వచ్చెను.

తత్ర దృష్ట్వా రమానాథం సీతయా సహ సంస్థితం. ౪౦
కందర్పకోటిసంకాశం పూర్ణచంద్రాననం శుభం
నీలాంబురుహపత్రాక్ష మబ్జకంఠ మనూపమం. ౪౧
శ్రీవత్సాంకం మహోరస్క మబ్ధిగంభీర మవ్యయం
స్వర్ణచ్ఛాయజటాభారం త్రిపుండ్రాంకితమస్తకం. ౪౨
భస్మోద్ధూళితసర్వాంగం దృష్ట్వా కామవిమోహితా. ౪౨½

[1] సుకుమారం మహాసత్వం పార్థివవ్యంజనాన్వితం. ౪౩
ఆజానుబాహుం దీప్తాస్య మతీవ ప్రియదర్శనం
రామ మిందీవరశ్యామం కందర్పసదృశప్రభం. ౪౪

* సుముఖం దుర్ముఖీరామం వృత్తమధ్యం మహోదరీ
విశాలాక్షం విరూపాక్షీ సుకేశం తామ్రమూర్ధజా. ౪౫
ప్రీతిరూపం విరూపా సా సుస్వరం భైరవస్వనా
తరుణం దారుణా వృద్ధా దక్షిణం వామభాషిణీ. ౪౬

* దుర్ముఖీత్యాదికం వాస్తవాభిప్రాయేణ వాల్మీకమునినోక్త మితి జ్ఞేయం. శ్రీరామస్య సమీపేతు సౌందర్యాతిశయేన స్థితా హి కామరూపత్వాదితి. తావత్ - కార్శ్యేన - మనోజ్ఞాంగీ నభవసి మాం ప్రతి రాక్షసీతి ప్రతిభాసి.

1. వాల్మీకి రా. ౧౭ స.



౪౦-౪౨ అట సాక్షాల్లక్ష్మీపతి యగు శ్రీరామచంద్రుని, సీతాసమేతుండై పూర్ణిమనాటిచంద్రునివలె యున్నవానిని, కోటిమన్మథతుల్యుని, పూర్ణిమనాటిచంద్రునివలె నానందదాయక మగు ముఖముచే శోభిల్లువానిని, కలువరేకులవలె నున్న కనుదోయి గలవానిని, శంఖమువంటి కంఠముకలవానిని, యుపమానరహితుని, సముద్రమువంటి యగాధమగు హృదయము గలవానిని, నాశరహితుని, బంగరుచాయఁ జెన్నారు జటాభారము గలవానిని, త్రిపుండ్రముద్రతోనొప్పు మోముగలవానిని, భస్మముచేఁ బూయఁబడిన సర్వాంగములు గల శ్రీజగన్మోహనుఁ డగు శ్రీరామ చంద్రుని జూచి శూర్పణఖ కామమోహితురా లయ్యెను.

౪౩-౪౪ సుకుమారుఁడును, మహాబలశాలియు, రాజలక్షణములచే నొప్పువాఁడును, ఆజానుబాహుఁడును, జూపరులకు మిగులఁ బ్రియముం గూర్చు దర్శనము కలవాఁడును, నల్లకలువలవంటి శ్యామలమును, కోమలము నగు శరీరముగలవాఁడును, మన్మథునివంటి యందగాఁడు నగు శ్రీరామచంద్రుని శూర్పణఖ చూచెను.

౪౫-౪౬(ఆరాక్షసి శ్రీరామచంద్రుని సమీపమునకు వచ్చినపుడు వారిద్దరికిఁ గల యంతులేని భేదము స్పష్టపడుట కీక్రిందివిధమున వర్ణింపఁబడెను) శ్రీరాముఁడు రమ్యమైన ముఖముకలవాఁడు, శూర్పణఖ * వికార ముఖము కలది. అతఁడు పిడికిట నిముడు నెన్నడుము కలవాఁడు. అది బానకడుపు కలది. అతఁడు విశాలములగు నేత్రములు కలవాఁడు. అది వికృతములైన మిడిగుడ్లు కలది. అతఁడు నెటివెండ్రుకలుకల

* 'దుర్ముఖి' అనుటాదిగ వాల్మీకిమహర్షి శూర్పణఖయొక్క వాస్తవ మగు రూపమును దెల్పెనని తెలియవలెను. శ్రీరామచంద్రుని సమీపమున మాత్ర మది కామరూపిణి గనుక సుందరరూపముననే తాల్చె నని యెఱుంగునది.

న్యాయవృత్తం సుదుర్వృత్తా ప్రియ మప్రియదర్శనా
శరీరజసమావిష్టా రాక్షసీ వాక్య మబ్రవీత్. ౪౬
[1] సుందరం రూప మాశ్రిత్య కామరూపీ నిశాచరీ. ౪౬½

[2] జటీ తాపసరూపేణ సభార్య శ్శరచాపధృత్. ౪౭
ఆగత స్త్వ మిమం దేశం కథం రాక్షససేవితమ్
కి మాగమనకృత్యం తే తత్త్వ మాఖ్యాతు మర్హసి. ౪౮

శ్రీరామ ఉవాచ—

ఆసీ ద్దశరథో నామ రాజా త్రిదశవిక్రమః
తస్యాహ మగ్రజః పుత్రో రామో నామ జనై శ్శ్రుతః.
భ్రాతాయం లక్ష్మణో నామ యవీయా న్మా మనువ్రతః
ఇయం భార్యా చ వైదేహీ మమ సీతేతి విశ్రుతా. ౫౧

ధర్మార్థం ధర్మకాంక్షీ చ వనం వస్తు మిహాగతః
నియోగాత్తు నరేంద్రస్య పితు ర్మాతుశ్చ యంత్రితః. ౫౨

1 విఖ్యాత్రి రా. 2 వాల్మీకి రా. ౧౮ స.



వాఁడు. అది రాగినెండ్రుకలు కలది. అతఁడు చూపులకు వింపో
నర్చు రూపము కలవాఁడు. అది వికటరూపము గలది. అతఁడు మనో
హర కంఠస్వరము కలవాఁడు. అది భయానక కంఠధ్వని కలది. అతఁ
డెలప్రాయమువాఁడు. అది ముదుసలి. అతఁడు దయాస్వభావుఁడు
(కుటిలముగాని చక్కని మనసుకలవాఁడు, లేక మొగమోటము గల
వాఁడు అనియుఁ జెప్పవచ్చును). అది వంకరమాటలు గలది. అతఁడు
న్యాయవర్తనుఁడు. అది మిగుల చెడుగునడవడి గలది. అతఁడు
మిక్కుల ప్రియముఁ గూర్చువాఁడు. అది యప్రియదర్శనము కలది.
అట్టారక్కసి యాసుందరరూపుఁ గాంచి మన్మథవికారావేశము
గలదై కామరూప కావునఁ దా నప్పటికప్పుడు సుందరమైన రూప
ముం దాల్చి శ్రీరామచంద్రునితో నిట్లనియె.

౪౭-౪౮ జడలఁదాల్చి, తాపసోచిత రూపము కలవాఁడవై (క్షత్రియోచిత
ము లగు) శరచాపములఁ గేలఁబూని భార్యాసమేతుఁడవై, రక్క
సులు సంచరించు నీ ప్రదేశమున కెట్లు వచ్చితివి? నీ విట్లు రావలసిన
పని యేమి కలిగెను? నిజముఁ దాఁపక చెప్పుము.

నా విని శ్రీరామచంద్రుఁ డిట్లనియె—

౫౦-౫౧ దేవతలతో సమాన మగు విక్రమముగల దశరథుం డను పేరుగల
రాజు గలఁడు. నే నాతనికిఁ జెద్దకుమారుఁడను. నన్ను రాముఁ డని
జనులు పిలుతురు. లక్ష్మణుఁ డను పేరుగల నా చిన్నతమ్ముఁడును
నియమముతో నన్ననుసరించి వచ్చినవాఁడు. ఈమె నాభార్య, విదేహ
రా జగు జనకుని కూతురు, 'సీత' యని ప్రసిద్ధిగాంచినది.

౫౨-౫౩ నేను మాజననీజనకులచేఁ బ్రేరేపింపఁబడినవాఁడనై పితృవాక్య
పరిపాలనారూప మగు ధర్మము నాచరింపఁగోరి, తపోరూప మగు
ధర్మముసిద్ధించుకొఱకు చక్రవర్తియు, మాతండ్రియు నగు దశరథుని
పనుపున నీ యడవిలో నివసింప వచ్చినాఁడను. నిన్నుఁగూడ తెలిసి

త్వాంతు వేదితు మిచ్ఛామి కథ్యతాం కాసి కస్యవా
* న హి తావ న్మనోజ్ఞాంగీ రాక్షసీ ప్రతిభాసి మే. ౫౩

సా బ్రవీ ద్వచనం శ్రుత్వా రాక్షసీ మదనార్దితా
శ్రూయతాం రామ! వక్ష్యామి తత్త్వార్థం వచనం మమ.

♦ అహం శూర్పణఖానామ రాక్షసీ కామరూపిణీ. ౫౪
అరణ్యం విచరా మీద మేకా సర్వభయంకరా. ౫౪½ ౫౫
రావణోనామ మే భ్రాతా బలీయా న్రాక్షసేశ్వరః. ౫౫½
వీరో విశ్రవసః పుత్రో యది తే శ్రోత్ర మాగతః. ౫౬
ప్రవృద్ధనిద్రశ్చ సదా కుంభకర్ణో మహాబలః
విభీషణస్తు ధర్మాత్మా నతు రాక్షసచేష్టితః. ౫౭
ప్రఖ్యాతవీర్యౌ చ రణే భ్రాతరౌ ఖరదూషణౌ. ౫౭½

---

* యద్వా రాక్షససేవిత ఇతి త్వద్వచనాత్ రాక్షసీ త్వమిత్యాశంక్య పరిహరతి. మనోజ్ఞాంగిత్వం రాక్షసీతి న ప్రతిభాసీతి రామదర్శనకాలే తథారూపం కృతవతీ కామరూపత్వాత్.

♦ అహ మితి శూర్పణఖా శూర్పం శోణితభాజన మితి. శూర్పేణ శోణితభాజనేన యజ్ఞాదిసత్క్రియాం దూషయతీతి శూర్పణఖా. నఖ విదూషణ ఇతి ధాతుః. యద్వా శూర్పాకారాణి నఖాని యస్యా స్సా శూర్పణఖా ఇతి.



కొనఁ గోరుచున్నాను. నీ వెవ్వతెవు? ఎవరిదానవు? నీ వెంత మాత్రమును సహజముగ *సుందరాంగివి కావు. రాక్షసి వని నాకుఁ దోఁచుచున్నది.

౫౪-౫౪½ శ్రీరామచంద్రు నావాక్యమును విని మన్మథబాధితయైన యా శూర్పణఖ యిట్లనియె-ఓ రామా! నేను ♦ శూర్పణఖ యను పేరుగల రాక్షసిని. ఏరూపము కావలె నన్న నారూపము ధరింపఁగలను.

౫౫-౫౫½ నే నేకాకినై సకలప్రాణులకు భయము గల్గించు దాననై యీ యరణ్యమునఁ దిరుగుచుందును. మహాబలశాలియు, రక్కసుల రేఁడు నగు రావణుఁ డనువాఁడు నాయన్న.

౫౬-౫౭½ అతఁడు మహావీరుఁడు. విశ్రవసునికుమారుఁడు. నీ చెవిఁబడియుండ వచ్చును. ఎల్లపుడు నిద్రించుచుండు మహాబలవంతుఁడగు కుంభకర్ణుఁడు నాకు సోదరుఁడే. ధర్మస్వభావుఁడును రాక్షసచర్య లేమాత్రము లేని ధర్మాత్ముఁడగు విభీషణుఁ డనువాఁడు నాతోఁబుట్టువు. యుద్ధమునఁ బ్రసిద్ధమైన పరాక్రమముగల ఖరదూషణులు నాకుఁదమ్ములు

---

* ఇట 'సుందరాంగివి కావు. రాక్షసివని నాకుఁ దోఁచుచున్నది' అని యర్థముచెప్పుట యొకతీరు. అదిగాక; 'రక్కసులు సంచరించు నీ ప్రదేశమున కెట్లు వచ్చితివి?' అని నీవు ప్రశ్నించితివి. దానిం బట్టి యిచట సంచరించు నీవు రాక్షసివే యగుదువా? అని శంకించి సుందరాంగివి నీవు రాక్షసియట్లుఁ దోఁచుట లేదు. అని యాశంకను బరిహరించుకొనె ననియుఁ జెప్పనగును- శ్రీరామదర్శన సమయమున నది కామరూప గావున సుందరస్వరూపమును బొందుటవలన.

♦ 'శూర్పణఖ' యనుపే రెట్లువచ్చె ననఁ; 'శూర్పము' అనఁగా రక్తము నింపిన కుండ. దానిచే యజ్ఞాదులను జెఱచునది కనుక 'శూర్పణఖ'. (లేక) శూర్ప మనగాఁ జేట. చేటలవంటి నఖములు (గోళ్లు) కలది 'శూర్పణఖ' యనియుఁ జెప్పవచ్చును.

తా నహం సమతిక్రాంతా రామ త్వాపూర్వదర్శనాత్. ౫౮
సముపే తాస్మి భావేన భర్తారం పురుషోత్తమం. ౫౮½

వికృతా చ విరూపా చ న చేయం సదృశీ తవ. ౫౯
అహ మేవానురూపా తే భార్యారూపేణ పశ్య మాం. ౫౯½

[1] రామ స్సీతాం కటాక్షేణ పశ్య న్నస్మిత మబ్రవీత్. ౬౦
భార్యా మమైషా కల్యాణీ విద్యతే హ్యానపాయినీ
త్వంతు సాపత్న్యదుఃఖేన కథం స్థాస్యసి సుందరి! ౬౧

బహి రాస్తే మమ భ్రాతా లక్ష్మణో ఽతీవ సుందరః
* తవానురూపో భవితా పతి స్తే నైవ సంచర. ౬౨

---

* నను అనృతం నోక్తపూర్వం మే నచ వక్ష్యే కదాచనే త్యుక్తేశ్చ శ్రీరామః కి మర్థ మతా్రనృత మితిచే న్న. స్మితపూర్వక మబ్రవీత్ ఇత్యనేన హాస్యార్థ ముక్త మిత్యర్థః. 'గురుణాపి సమం హాస్యం కర్తవ్య మకుటిలం వినే'తి న్యాయేన భ్రాతృవిషయ మపి పరిహాసం ప్రయోజయే ఇతి. తథా క్షత్రియాణాం మర్యాదా లోకే ఽద్యాపి. యద్వా రామో దయాళుతయా స్వస్మి న్కామమోహేనప్రాప్తయాః స్త్రియ స్సహసా ధిక్కారేణ దుఃఖం మాభూదితి పరిహాసకథాం ప్రవర్తయామాసే త్యర్థః. అపిచ

---

1. అధ్యాత్మ రా. ౫ స.



౫౮-౫౮½ రామా! నేను వారందరిని లెక్కసేయక, తొలుత నిన్నుఁ జూచి నది మొదలు పురుషశ్రేష్ఠుండ వగు నిన్ను భర్తనుగాఁ బడయు నాసక్తితో నీకడకు వచ్చినదానను.

౫౯-౫౯½ వికారముగ నుండు నవయవములు గలిగి, విరూపయైయున్న యీ సీత నీకుఁ దగినది కాదు. నేనే నీకుఁ దగినదానను. కాన నన్నే భార్యనుగాఁ గనుము.

౬౦-౬౧ నావుడు శ్రీరామచంద్రుఁడు కడగంటను సీతకు సంజ్ఞసేసి, చిఱునగవుదోఁప శూర్పణఖంజూచి యిట్లనియె. మంగళరూపిణియు, నన్నెన్నఁడు నెడఁబాయని యీమె నాభార్యయై యున్నది. సుందరీ! ఈసవతిపోరును నీవు సహించి యెట్లుండఁగలవు?

౬౨ నాతమ్ముఁడు లక్ష్మణుఁడు నాకంటెను మిగుల చక్కనివాఁడు. ఈయాశ్రమము బయట నున్నాఁడు. ♦ అతఁడు నీ కనురూపుఁ డగు భర్త కావచ్చును. నీవు వానితోడనే చరింపుము.

---

♦ పూర్వ మొకప్పుడు సీతాదేవితో శ్రీరామచంద్రుఁడు "ఇదివర కెన్నఁడు నబద్ధమాడి యెఱుఁగను. ఇఁక మీఁదను నసత్యమాడను" అని పల్కెనుగదా! ప్రస్తుత మిట్లనుట యసత్యము కాదా! యన్న నది సరికాదు. 'చిఱునగవుదోఁపఁ బల్కెను' అని శూర్పణఖతో శ్రీరాముఁడు మాటాడుటను వర్ణించుటంబట్టి, యిపుడీ మాటలు పరిహాసమునకుఁ బల్కెనని యర్థమగుచున్నది. 'గురువుతోనైనను గుటిల స్వభావమును వీడి పరిహాసఁపు వాక్యములాడవచ్చు' నను న్యాయశాస్త్రము ననుసరించి, సోదరుని సంగతినిగూడ పరిహాసముగా ననువుపఱచి యిట్లనెను. క్షత్రియుల కిక్కాలమందు నిట్టి సాంప్రదాయ మున్నది. అదియుంగాక శ్రీరామచంద్రమూర్తి పరమదయాళువుగాన కామవశురాలై వచ్చిన యాడుదాని దటాలునఁ ద్రోసిపుచ్చుటచే నామెకు దుఃఖము కలుగునని యెంచి, పరమార్థము చెడని మాటల దానితాపమును గొంతకొంతఁ దొలఁగఁజేయుట కిట్లు పరిహాసప్రసంగమును

ఇత్యుక్త్వా లక్ష్మణం ప్రాహ పతి ర్మే భవ సుందర !
భ్రాతు రాజ్ఞాం పురస్కృత్య సంగచ్ఛావో ఽద్యమాచిరం.
ఇత్యాహ రాక్షసీఘోరా లక్ష్మణం కామమోహితా. ౬౩½

తా మాహ లక్ష్మణ స్సాధ్వి ! దాసో ఽహం తస్య ధీమతః.
దాసీ భవిష్యసి త్వంతు తతో దుఃఖతరం ను కిం. ౬౪½

1 వాసో వల్కల మాస్పదం విటపినో వన్యా శరీరస్థితిః
శయ్యా దర్భలతా ప్రసాధన మపాంవర్షి జటానాం భరః
బాలే ! కిం బహునా వనే వనమృగన్యాయస్య న త్వం పదం
సారంగాక్షి! తపోభృతః క్వ తపసాం శత్రుః క్వ సంకల్పజః.
2 తమేవ గచ్ఛ భద్రం తే సతు రాజాఖిలేశ్వరః. ౬౬

తుచ్ఛ్రుత్వా పున రప్యాగా ద్రాఘవం దుష్టమానసా.
క్రోధా ద్రామ! కిమర్థం మాం భ్రామయ స్యనవస్థితః ౬౭
ఇదానీ మేవ తాం సీతాం భక్షయామి తవాగ్రతః. ౬౭½

'స్త్రీషు నర్మవివాహేషు వృత్త్యర్థే ప్రాణసంకటే, గవా మర్థే బ్రాహ్మణార్థే నానృతం స్యా జ్జుగుప్సిత' మితి స్మృత్యనుగ్రహా దితి భావ్యః.

1. హనుమద్రామాయణమ్. 2. అధ్యాత్మ ౫ స.



౬౩-౬౩½ శ్రీరాముఁ డట్లన శూర్పణఖ లక్ష్మణుఁ డున్నయెడ కేగి, 'సుందరుఁడా ! నీవు నాకు భర్తవు కమ్ము. నీయన్న యానతి ననుసరించి మన మిద్దఱము కలిసి యుందము. జాగు సేయకుము.' అని ఘోర యగు నా రక్కసి కామమోహితయై పల్కెను.

౬౪-౬౪½ ఆశూర్పణఖ మాటలను విని లక్ష్మణుఁ డామెతో నిట్లనియె సాధ్వీ! ఆ బుద్ధిశాలి యగు శ్రీరామచంద్రమహాప్రభువున కేను దాసుఁడను. (నన్ను భర్తనుగాఁ బడయు దేని) నీవును దాసి వయ్యెదవు. అట్లైన నంతకు మించిన దుఃఖ మేమి గలదు ?

౬౫-౬౬ మేము కట్టుకొను బట్టలు నారపట్టలు. మా యునికిపట్టులు చెట్టు నీడలు. మా జీవనాధారములు వన్యము లగు కందమూలములు. మా శయ్యలు కఱకుదర్భలు, తీగెలును. మా యలంకారములు నీరుగురియు జటాభారము. వేయేల ? ఈ యడవిం బడి యడవి జంతువునట్లు తిరుగు నాబోటివాని కీవు తగవు. లేడికన్నులవంటి కండ్లుకల దానా ! తపసు చేసికొను జడదారు లెక్కడ ? తపస్సులకు విరోధి యగు మన్మథుఁ డెక్కడ ? ఆ శ్రీరామప్రభువు కడకే పొమ్ము. నీకు మే లగును. అతఁ డందువా మహాప్రభువు. సర్వసమర్థుఁడు.

౬౭-౬౭½ అది విని చెడుఁగు మనస్సుకల యారక్కసి తిరిగి రామచంద్రుని కడకే వచ్చి కోపమున రామా ! మనసు నిలుకడలేనివాఁడవై న న్నేల యిట్టట్టు తిరుగులాడఁ జేయుదువు ? ఇప్పుడే నీయెదుటనే యాసీతను తిని వేసెద ననియెను.

గావించె ననియు నర్థమగుచున్నది. మఱియు స్త్రీలయెడలను హాస్యమాడుపట్లను, వివాహములు సంఘటించునప్పుడును, వృత్తికిని ప్రాణమునకును భంగము కలుగు సమయములను, గోబ్రాహ్మణుల రక్షింపవలసినప్పుడును నసత్యమాడిన నందు దోసము లేదని ధర్మశాస్త్ర ప్రమాణము లభించుటవలనఁగూడ శ్రీరామచంద్రుని యీప్రసంగమున ననృతదోషమునుగూర్చి శంకింపఁ బనిలేదు.

1 తదా తాం రాఘవః ప్రాహ మయాయం శర ఉత్తమః. ౧౮
చిహ్నార్థం లక్ష్మణాయ త్వం నీత్వా దర్శయ వేగతః.
ఇత్యుక్త్వా రాఘవో బాణం దదౌ తస్యై క్షురోపమం. ౧౯

2 తతో జగామ సహసా లక్ష్మణం ప్రాహ సా రుషా. ౧౯½

యది త్యజసి మాం మూఢ! కామాత్త్వయ ముపస్థితాం
యువయోశ్చ విపత్తిశ్చ భవిష్యతి న సంశయః. ౨౦½

బ్రహ్మాచ మోహినీం త్యక్త్వా విశ్వే ఽపూజ్యో బభూవసః.
రంభాశాపేన దక్షశ్చ ఛాగముండో బభూవ సః
స్వర్వైద్యశ్చోర్వశీశాపా ద్యజ్ఞభాగవివర్జితః. ౨౧
రూపహీనం కుబేరశ్చ మేనాశాపేన లక్ష్మణ!
కామో ఘృతాచిశాపేన బభూవ భస్మసాచ్ఛివాత్. ౨౩
బలి ర్మదాలసాశాపా ద్భ్రష్టరాజ్యో బభూవ హ
శాపేన మిశ్రకేశ్యాశ్చ హృతభార్యో బృహస్పతిః. ౨౪
మమ శాపా త్తథా రామో హృతభార్యో భవిష్యతి
ఇత్యుక్త్వా రామబాణం సా దర్శయామాస రాక్షసీ. ౨౫

3 స బుధ్వా హృద్గతం బంధో స్తం సంధాయ శరాసనే
ముమోచ బాణం వేగేన రామనామాంకితం శుభం. ౨౬

1. ఆనందరా. సారకాం. ౭ స. 2. బ్రహ్మవైవర్తపు. శ్రీకృష్ణజన్మఖండే ౭౨ అధ్యా. 3. ఆనంద రా. సారకా. ౭ స.



౧౮-౧౯ అంత నాశూర్పణఖను గాంచి శ్రీరామచంద్రుఁడు, ఓరక్కసీ! గుర్తుకొఱకని నే నీబాణము నిచ్చుచున్నాను. వేవేగ దీనిం గొంపోయి లక్ష్మణునకుఁ జూపుము. అని పలికి చుఱకత్తివంటిబాణము నారాక్షసి కిచ్చెను.

౧౯½ అటుపై నతిత్వరితగతి నారాక్షసి లక్ష్మణునికడ కరిగి రోసముతో ని ట్లనియె.

౨౦-౨౦½ నాయంత కోరివచ్చిన నన్ను మూఢుఁడవై విడిచిపెట్టెదవేని మీయన్నదమ్ముల కిఱువురకుఁదప్పక కీఁడుమూడఁగలదు. సంశయములేదు.

౨౧-౨౫ (నావలెనే తనంతకోరివచ్చిన) మోహినీకాంతను నిరాకరించుట వలన నాబ్రహ్మ లోకమున నపూజ్యుఁ డయ్యెను. రంభను ద్రోసిపుచ్చుటచే నామె యిడిన శాపమువలన దక్షుఁడు మేఁకతలగలవాఁ డయ్యెను. ఊర్వశీశాపమువలన నశ్వినీదేవతలకు యజ్ఞములయందు హవిర్భాగములు లేకుండఁ బోయెను. మేనకవలనఁ కుబేరునకు వికారరూప మేర్పడెను. ఘృతాచి యిడిన శాపముచే మన్మథుఁ డీశ్వరునిమూలమున బూడిద యయ్యెను. బలిచక్రవర్తి మదాలస యొసంగిన శాపముకతన రాజ్యముం గోల్పోయి యడఁగిపోయెను. మిశ్రకేశిని నిరాకరించి బృహస్పతి భార్యను బోఁగొట్టుకొనెను. అట్లే నావలనను యిపుడు రాముఁడు భార్య నెడఁబాయవలసి వచ్చును. అని పలికి యిదిగో! మీయన్నయిచ్చిన గుర్తని శ్రీరామ బాణము నాతనికిఁ జూపెను.

౨౬-౨౭ అంతట లక్ష్మణుఁ డాత్మబంధుఁడగు శ్రీరామచంద్రుని హృదయ భావము నెఱింగి, శ్రీరామనామాంకితమును, మంగళకరము నగు

స శరో రాక్షసీం గత్వా ఘ్రాణకర్ణోష్ఠహృద్భవాన్
సంఛిత్త్వా రామతూణీరం వివేశ క్షణమాత్రతః. ౨౨

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
షష్ఠస్సర్గః.

---

## సప్తమస్సర్గః.

1 తతో ఘోరధ్వనిం కృత్వా రుధిరాక్తవపుర్ద్రుతం
క్రందమానా పపాతాగ్రే ఖరస్య పరుషాక్షరం. ౧

కిమేతదితి తామాహ ఖరః ఖరతరాక్షరః
కేనైవం కారితాఽసి త్వం మృత్యోర్వక్త్రానువర్తినా. ౨
వద మే తం వధిష్యామి కాలకల్పమపి క్షణాత్
తమాహ రాక్షసీ రామస్సీతాలక్ష్మణసంయుతః. ౩
దండకం నిర్భయం కుర్వన్నాస్తే గోదావరీతటే
మామేవం కృతవాంస్తస్య భ్రాత్రా తేనైవ చోదితః. ౪

* [2] తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ

* తరుణావిత్యాది నను కేనైవ కారితాసి త్వమితి పృచ్ఛంతం ఖరంప్రతి క్రోధేన ప్రతికూలతయా వక్తవ్యే తరుణా

1. అధ్యాత్మ రా. ౫ స. 2. వాల్మీకి రా. ౧౮ స.



బాణము ధనువునఁ దొడిఁగి, వడిగా విడువ, నాశర మారక్కసి దరి కఱిఁగి, (భయముచే స్వస్వరూపము నొందినదాని) ముక్కుం జెక్కి, చెవుల గొఱికి, పెదవులఁ బెరికి, యెదపుట్టువులఁ దఱిఁగి క్షణమాత్రమున శ్రీరామచంద్రుని తూణీరముం జొచ్చెను.

ఇది శ్రీరామాయణసారోద్ధారమునందు అరణ్యకాండమున
నాఱవసర్గము ముగిసెను.

---

## ఏడవ సర్గము.

౧ అంత నాశూర్పణఖ భయంకరమైన యెలుఁగున నాయరణ్యము మారుసెలంగునట్లు బొబ్బరించుచు, నెత్తుటం దడిసిన యొడలితో, వేవేగఁ బఱువిడిపోయి పరుసముగా మాటాడుచు ఖరునిముందటం బడెను.

౨-౪ ఖరుఁ డది చూచి యిదే మని మిగుల బిఱుసుదనముతోఁచు మాటల నామెతో నిట్లనియె. సోదరీ! శూర్పణఖా! మృత్యుముఖమునఁ బ్రవేశించు నేవానిచే నీ విట్లు కావింపఁబడితివి? వాడు యమునితో సమానుఁడేని యగుఁగాక! చెప్పు మిప్పుడే వాని రూపు మాపెద నన నారక్కసి యాఖరునితో నిట్లనియె. రాముఁ డనువాఁడు సీత యను భార్యతోడను, లక్ష్మణుఁ డను తమ్మునితోడను దండకారణ్యమును నిర్భయమైన దానింగాఁ జేయుచు గోదావరీతీరమునఁ బంచవటియం దున్నవాఁడు. అతని ప్రోద్బలముచే నాతని తమ్ముఁడు న న్నీరీతిం గారించెను.

౫ * వా రిద్దరును ఎలప్రాయమువారు. సుందరాకారసంపన్నులు. సుకుమారులు. మిపులబలవంతులు. తెల్లతామరలవలె విశాలము లగు

* ఎవ్వనిచే నీ విట్లు కారింపఁబడితివి? అని యడుగుచున్న ఖరునితో శూర్పణఖ కోపముచే శ్రీరామలక్ష్మణులంగూర్చి ప్రతికూలముగ మాట్లాడవలసియుండఁగా; 'ఎలప్రాయమువారు' అనునది మొదలుగ శ్రీరామలక్ష్మణులచక్కఁదనము, లక్షణములు నేల చెప్పెను?

పుండరీకవిశాలాక్షౌ చీరకృష్ణాజినాంబరౌ. ౫

ఫలమూలాశనౌ దాంతౌ తాపసౌ ధర్మచారిణౌ
పుత్రౌ దశరథ స్యాస్తాం భ్రాతరౌ రామలక్ష్మణౌ. ౬

విత్యాదినా శ్రీరామలక్ష్మణసౌందర్యాదికం కి మర్థం కథయతీతిచేత్ అస్యా వైరూప్యే జాతే పి వైరాగ్యాజననాత్ కామమోహాతిశయేన భ్రాతృసన్నిధానేఽపి హృద్గతమే వోక్తవతీ. అనుకూలానాం ప్రతికూలానాంచ శ్రీరామం దృష్టవతా మయమేవ స్వభావః. అతఏవ కిష్కింధాకాండే వాలివధానంతరం శ్రీరామం దృష్ట్వా తారాపి - త్వ మప్రమేయశ్చేతి కల్యాణ వైలక్షణ్యమేవానుసృత్య స్తుతవతీ. సుందరకాండేపి యాని రామస్య చిహ్నానీతి పృష్టవతాం సీతాం ప్రతి త్రిస్థిర స్త్రిప్రలంబశ్చేతి వక్తవ్యే రామః కమలపత్రాక్ష స్సర్వసత్వమనోహర ఇత్యేవ మాహ హనుమాన్. 'యద్వా' సుప్తప్రమత్తకుపితానాం భావజ్ఞానం దృష్ట మితి న్యాయేన కర్ణనాసాచ్ఛేదేన ప్రమత్తా కుపితాచ శూర్పణఖా హృద్గత మేవాహ 'తరుణౌ' కామినీనాం ప్రథమాకర్షణం వయ ఏవహి. అత స్త దుచ్యతే పరసర్పరపరిహాసకరణే నోభయత్ర భావబంధావిశేషా ద్ద్వివచనం. వయసా తుల్యత్వేపి రూపేకి మనయో స్తారతమ్య మ స్తి నేత్యాహ రూపసంపన్నౌ రూపసౌందర్యం తేనసంపన్నౌ సమృద్ధౌ ఇతరేషాం కామా



నేత్రములు కలవారు. నారచీరలు,నల్లజింక చర్మములను వస్త్రములుగఁ దాల్చువారు.

౫-౬ పండ్లను దుంపలను నాహారముగఁ గొనువారు. అంతరింద్రియనిగ్రహము కలవారు. తాపసులు. ధర్మానుష్ఠానపరులు. దశరథునిబిడ్డలు. ఇద్దరు నన్నదమ్ములు. రామలక్ష్మణు లనఁబడువారు. వారితో నున్న

అని శంకించుచో, అట్లు తాను విరూపిణిగాఁ గావింపఁబడియు వైరాగ్యమును బొందనందువలన, కామమోహాతిశయముచేత సోదరుని సన్నిధానమందును దనహృదయమందలి యభిప్రాయములనే వెల్లడించెను- అని సమాధానము. అనుకూలురైనను బ్రతికూలురైనను శ్రీరామచంద్రుని జూచినవారి కొడలుమఱచి కొనియాడు స్వభావ మేర్పడును. కావుననే కిష్కింధాకాండయందు వాలివధానంతరము తార శ్రీరాముని జూచి 'నీవు అప్రమేయుఁడవు' అని ప్రారంభించి శ్రీరామచంద్రునియనుపమానకల్యాణగుణగణముల ననుసరించి స్తుతించెను. సుందరకాండమందును శ్రీరామచంద్రునియానవాళ్లను జెప్పు మన శ్రీహనుమంతుఁడు సీతతో "త్రిస్థిరుఁడు - త్రిప్రలంబుఁడు" ఇత్యాదికము చెప్పవలసియుండఁగా "రాముఁడు కమలపత్రములవంటి నేత్రములుకలవాఁడు, సర్వభూతములమనస్సులఁ జూరఁగొనువాఁడు" యీ మొదలైన యవయవసౌందర్యలక్షణములనే మిగులకొనియాడ మొదలిడెను. అదిగాక; నిద్రఁజెందినవారు, ప్రమత్తులు, కోపయుతులు నగువారలకు స్వభావమే బయలుపడు నను న్యాయముచేత కర్ణనాసాదులు తెగుటచే మత్తెక్కినదియు, కోపముగలదియు నగు శూర్పణఖ హృద్గతాభిప్రాయమునే తప్పనిసరిగాఁ జెప్పెను' అని గ్రహింప నగు.

ఇఁక నాచెప్పుటలో 'ఎలప్రాయమువారు' అని తొలుత నేల చెప్పెను? అన్నచో; కాముకురాం డ్రగు స్త్రీలకు చూడఁగానే యాకర్షకమైనది లేఁబ్రాయము కనుక ముందుగా నది పేర్కొనఁబడెను. ఇద్దరి నేల యొకరీతి వర్ణించెను? అన; శ్రీరామలక్ష్మణు లిద్వరు నొకరినుండి యొకరికడకుఁ బరిహాసమునకై యారక్కసి

తాభ్యా ముభాభ్యాం సంభూయ ప్రమదా మధికృత్య వై
ఇమా మస్థాం సీతాహం యథా ఽనాథా ఽసతీ తథా. ౭
ఏష మే ప్రథమః కామః కృత స్తాత! త్వయా ఽ వేత్
తస్యా స్తయోశ్చ రుధిరం పిబేయ మహ మాహవే. ౮

---

దీనాం రూపమాభ్యాం భిక్షిత్వా సంపాదయితవ్య మితి మన్యమానా విత్యర్థః. యద్వా రూపసంపన్నౌ సంపన్న రూపౌ (ఆహితాగ్న్యాదిత్వా త్పరనిపాతః) తేన ఉత్పన్నౌ ద్రవ్యం క్షణ మగుణం తిష్ఠతీతి న్యాయం విహాయ రూప దాక్షిణ్యసంపన్నః ప్రసూత ఇత్యుక్తరీత్యా ధర్మిణాసహై వోత్పన్నరూపా విత్యర్థః. వయోరూపసత్త్వేఽపి కిం కఠిన స్పర్శౌ నే త్యాహ సుకుమారౌ. పరుషతరభవచ్ఛరీరవ న్న భవ త్యనయో శ్శరీరం. కింతు పుష్పహాససుకుమారౌ. ఏవం సౌకుమార్య సత్త్వేఽపి రతివై య్యాత్యే; కిం శ్రాంతౌ స్యాతామ్నేత్యాహమహాబలౌ. రామస్తు సీతయా సార్ధం విజహార బహూవృతూ నిత్యా ద్యుక్తరీత్యా అనేకర్తువిహా రణేఽపి శ్రమలవరహితౌ. ఏవం సముదాయశోభాసంపన్న త్వేఽపి కి మవయవశోభాసు వైకల్యం నేత్యాహ పుండరీక విశాలాక్షౌ. 'సంరక్తనయనాఘోరా' ఇత్యుక్తరీత్యా త్వా దృశనయనవ న్న భవతి తయోర్నయన మిత్యర్థః. పుండరీకం సితాంభోజం - తమోద్రేకేణ నిద్రాకషాయిత్వం రజోగు ణోద్రేకేన సంరక్తత్వం వా నాస్తి. కింతు సర్వదా సర్వ ప్రసన్నయనా విత్యర్థః.న కేవలమేవావయవశోభాతిశయః.



యొకయాడుదానింబట్టి వారిద్దరుం గలిసి చేసిన యిక్కార్యముచే నేను దిక్కులేని దానివలె, నసాధ్వియట్లు నీగతి నందితిని.

౮ ఇది నా మొదటికోరిక తండ్రీ! అది నీవు చెల్లింపవలసినది. అదే మందువా? ఆ యాడుదానియొక్కయు, వారిద్దరియొక్కయు రక్త మును నేను యుద్ధభూమిలోఁ ద్రాగెదను.

---

నిటునటుఁ ద్రిప్పిరిగావున శూర్పణఖ మన స్సాయిద్దరియందు నొకేరీతిభావముచేఁ గట్టువడిన దగుటచే న ట్లిద్దరిని గలిపి (ద్వివచన నొకేవయ ప్రయోగమున) వర్ణించెనని, ఇద్దరు కొద్దియించుమించులో నొకేవయ స్సువారే యగుఁగాక! రూపమున నిద్దరికిఁ దారతమ్యము కలదేమో యన్న లే దనుచున్నది. ఇద్దరును సుందరాకారసంపన్నులే. రూప మనఁగా సౌందర్యము. దానిచే సంపన్ను లనఁగా సమృద్ధు లన్న మాట. మన్మథాదులు సహితము వీరినుండి చక్కఁదనమును బిచ్చ మడిగి సంపాదించుకొనవలసినదే యని యనుకొనఁదగిన యందముగల వా రని భావము. అదియుఁగాక; 'సుందరాకారసంపన్నులు' అనఁగా "ద్రవ్యము పుట్టువునందిన యొకక్షణమువరకును గుణరహితమై యుండు" ననెడి న్యాయముచే వీరు "రూప దాక్షిణ్యములతోడనే పుట్టెను" అని వాల్మీకి నుడువుటచేతను పుట్టువుతోడనే తమతోఁ గూడ పుట్టిన రూపము కలవారు అనియు నర్థ మగుచున్నది. ఇట్లు వయోరూపము లున్నను వారు కఠినదేహులా? కారు, సుకుమారు లు. పరుసుదనముగల మాయొడళ్లవంటివా వారిశరీరములు? కావు. కుసుమకోమల శరీరు లని యర్థము. ఇట్టిసౌకుమార్య మున్నదిగదా యని, రతియం దలసిపోవువా రందువా? కాదు; మిగులబలవంతులు. "శ్రీరామచంద్రుఁడు సీతాదేవితో ననేకము లగు ఋతువులను విహ రించెను" అని చెప్పఁబడినరీతిచే, ననేకర్తువిహారములయందు నించు కయు నలసటఁ జెందని వా రని తాత్పర్యము. సరి; ఇట్టిసముదాయ శోభాభిరాములైనను, అవయవవైకల్య మేమైనఁ గల దనుకొందు వేమో? లేదు. తెల్లతామరలవలె విశాలము లగు నేత్రములు కల వారు. 'మిగుల నెఱ్ఱఁబడిన గ్రుడ్లుకలవారు, ఘోరులు' అన్న ట్లుండు

* ఇతి తస్యాం బ్రువాణాయాం చతుర్దశమహాబలా
న్వ్యాదిదేశ ఖరః క్రుద్ధో రాక్షసా నంతకోపమాన్. ౯

---

చీరకృష్ణాజినాంబరౌ - కిమివ హి మధురాణాం మండనం నాకృతీనా మిత్యుక్తరీత్యా వల్కలాజనధారణేఽప్యతిరమణీయౌ. యద్వా ఖరస్య ప్రోత్సాహనాయ తయో ర్బలాతిశయ ఉచ్యతే తరుణా విత్యాది. తరుణౌ-జయోత్సాహయోగ్యవయస్కౌ- రూపసంపన్నౌ 'సింహోరస్కం మహాబాహు' మిత్యుక్తరీత్యా యుద్ధాభావేఽపి దర్శనమాత్రేణ పరహృదయ కంపజనకశరీరౌ. సుకుమారౌ లీలయేవ సర్వసంహారణక్షమౌ. మహాబలౌ మనోబలబాహుబలోపాయబలసంపన్నౌ. పుండరీకవిశాలాక్షౌ - వైరిషు గౌరవబుద్ధి మూలక కాలుష్యరహితతయా విమలనేత్రౌ- అనేన శత్రుదర్శనకృతక్షోభ రాహిత్య ముచ్యతే. చీరకృష్ణాజినాంబరౌ- సదా బద్ధవసనతయా యుద్ధసన్నద్ధావిత్యర్థః. ఏవ ముత్తరత్రాపి యోజ్యం.

* ఇతీతి ఖరోనామ-శ్లో॥ తస్మా ద్యః క్రూరరూపేణ దేహాస హారతామృతం, విష్ణుర్దాశరథి స్సూత్వా మోక్షయిష్యతి



౯ * ఇట్లు శూర్పణఖ చెప్పుచుండఁగనే ఖరాసురుఁడు కుపితుఁడై యమునితో సమాను లగు మహాబలవంతులైన పదునలుగురు రక్కసుల కిట్లని యాజ్ఞ యిచ్చెను.

---

రక్కసు లగు మా నేత్రములవంటి నేత్రములు గలవారు కాదు. తమోద్రేకముచే నిద్రాకషాయితములును, రజోగుణోద్రేకముచే నెఱ్ఱఁదనముగాని వారి నేత్రములకు లేదు. ఎప్పుడును ప్రసన్నములై యుండు నేత్రములు కలవారే యని భావము.

ఇట్లు కేవల మవయవశోభమాత్రమే కాదు; నారచీరలు నల్లజింక చర్మములను దాల్చువారు. సహజసౌందర్యధురీణు లగు వారి కేవస్త్రమైన నలంకారము కాదు? అన్నియు నలంకారములే యగు నన్నరీతి నారచీరలు, చర్మముల ధరించియు మిక్కుల రమణీయులేయని యర్థము. ఇటుగాక; ఖరునికి యుద్ధోత్సాహ మతిశయించుటకై యీవిశేషణములచే శ్రీరామలక్ష్మణుల బలాతిశయమునే శూర్పణఖ చెప్పెననియుఁ జెప్పవచ్చును. ఆపక్షమున నీశ్లోక మె ట్లర్థ మగు ననఁ; తరుణులు - జయోత్సాహమునకుఁ దగిన యీడుకలవారు. రూపసంపన్నులు—'సింహోరస్కుఁడు మహాబాహుఁడు' నన్నట్లు యుద్ధమైనను గాకున్నను, చూచినంతనే శత్రులహృదయములఁ గంపింపఁ జేయఁజాలు శరీరములు కలవారు. సుకుమారులు—విలాసముగానే సర్వశత్రుసంహారము గావింపఁజాలువారు. మహాబలశాలురు—మనోబల బుద్ధిబల బాహుబ లోపాయబలసంపన్నులు. తెల్లతామరలఁ బోలు కన్నులు కలవారు—అనఁగా శత్రువునెడనైనను గోధభావము లేక గౌరవభావములచే నొప్పువా రగుటచేఁ గలుషరహితము లగు నేత్రములు కలవారు దీనివలన శత్రువు లగుపడినంతనఁ గలతఁజెందువారుగా రనియుఁ జెప్పఁబడుచున్నది. చీరకృష్ణాజినాంబరులు—నిరంతరము నడికట్టు వైచుకొని యుద్ధసన్నద్ధులై యుండువా రని యర్థము. ఇట్లనే ముందును యోజించునది.

* ఖరునిపూర్వవృత్తాంత మిచట వివరింపఁబడుచున్నది. యాజ్ఞవల్క్య మహర్షి కుమారులు ముప్పురు. వారిలోఁ జంద్రకాంతుఁ డనువాఁడు

* తౌ హత్వా తాంచ దుర్వృత్తా మపావర్తితు మర్హథ
ఇయంచ రుధిరం తేషాం భగినీ మమ పాస్యతి. ౧౦
మనోరథోఽయ మిష్టోఽస్యా భగిన్యా మమ రాక్షసాః
ఇతి ప్రతిసమాదిష్టా రాక్షసా స్తే చతుర్దశ. ౧౧

---

సువ్రతే-తి శివశాపా ద్రాక్షసత్వం ప్రాప్తః యాజ్ఞవల్క్యసుతః చంద్రకాంత ఇత్యర్థః. అతఏవ శూర్పణఖాముఖా ద్రామవృత్తాంతశ్రవణానంతరం రామం విష్ణుత్వేన జ్ఞాత్వా సపరివారస్య స్వస్య శ్రీరామహస్తా ద్వధేచ్ఛు స్స్వభగినీ ప్రీతయే శ్రీరామేణ సహ యుద్ధార్థం రాక్షసా న్వ్యాదిదేశేత్యర్థః. అస్మి న్నర్థే శేషధర్మే భీష్మయుధిష్ఠిర సంవాదకథానుసంధేయా. భీష్మ ఉవాచ - శ్లో॥ యాజ్ఞవల్క్యసుతా రాజ న్త్రయో వై లోకవిశ్రుతాః, చంద్రకాంతమహామేధవిజయా బ్రాహ్మణోత్తమాః. ఖరశ్చ దూషణ శ్చేతి త్రిశిరా బ్రహ్మవిత్తమాః, ఆస న్తేషాంచ శిష్యాశ్చ చతుర్దశసహస్రధా ఇతి. అతఏవ బాహ్యదృష్ట్యా పరుషోక్తివ త్ప్రతీయమానాని ఖరస్య వాక్యాని సౌమ్యరూపాణ్యేవ. తథా వ్యాఖ్యాస్యామః.

* తౌ హత్వేతి - ౧౦-౧౧ శ్లోకద్వయ మేకవాక్యం - హే రాక్షసాః! ఇయం భగినీ ప్రమథ్య మమ రుధిరం పాస్యతి



౧౦-౧౧ * ఓరాక్షసులారా! (మీరు పోయి) దుర్వ్యాపారు లగు నా రామలక్ష్మణులఁ జంపి, వారితో నున్న యాస్త్రీ నెడఁబాపి తీసికొని రండు. ఈమాయక్క వారిరక్తమును ద్రావును. ఇట్లు మాయక్కకు మనసైనది. ఇట్లా ఖరునిచే నారాక్షసులు పదునల్గురు నాజ్ఞాపింపఁబడి బయల్వెడలిరి.

---

జ్యేష్ఠుఁడు. వాఁడొకనాఁడు యజ్ఞమందు క్రూరరూపియై శిష్యులతో యజ్ఞశిష్టములను బలవంతముగా హరించెను. అందులకు శివుం డలిగి క్రూరుఁ డగు రాక్షసుండవు కమ్మని శాపమిడి, వాఁడు వేడుకొనఁగా మహావిష్ణువు దాశరథియై మీకు మోక్ష మొసఁగూర్చు ననియు ననుగ్రహించెను. కావున ఖరుఁ డట్లు శివశాపముచే రాక్షసత్వ మొందిన చంద్రకాంతుఁ డని తెలియనగును. అందువలననే శూర్పణఖవలన శ్రీరామచంద్రవృత్తాంతమును విని యంతన యాతని శ్రీమహావిష్ణు వని గుర్తెఱిఁగి సపరివారముగ నాతనివలన హతుఁడగుటకు నిశ్చయించి, సోదరియందు ప్రీతిగలవానివలె శ్రీరామచంద్రునితో యుద్ధార్థము రాక్షసులను బంపె నని తెలియఁదగును. ఈవిషయముననే యింకను శేషధర్మమున భీష్మ యుధిష్ఠిర సంవాదకథను గూర్చుకొనవలయును (ఇట నించుక వివరింతును). భీష్ముఁడు ధర్మజునితో నిట్లనియె. ఓ ధర్మరాజా! యాజ్ఞవల్క్యమహర్షికి లోకవిశ్రుతులైన మువ్వురు పుత్రులు గలరు. వారలు వరుసగఁ జంద్రకాంతుఁడు, మహామేధుఁడు, విజయుఁడు నను నామములుగలవారు. వారే బ్రహ్మవేత్తలైన ఖరదూషణు లను రాక్షసులైరి. వారిశిష్యులు పదునాల్గువేలమంది మునులును వారితోఁబాటుగ శాపవశమున రాక్షసులైరి. కావుననే ఖరునిమాటలు బాహ్యదృష్టికిఁ బరుసములుగాఁ గన్పట్టినను, పరమార్థమున సౌమ్యరూపములే కాని వేరుగాదు. కనుక యట్లే యావాక్యముల వ్యాఖ్యానము చేయుచున్నారము.

* 'తౌ హత్వా' అనెడిశ్లోకమున ఖరునిమాటలకు నిజార్థ మెట్లన: ఓరాక్షసులారా! ఈనాచెల్లెలు నన్నుఁ గూల్చి నారక్తమును ద్రావఁగలదు. అందువలన మీరు వారికడకుం బోయి మీతేజముచే వేగముగా

1 తాన్ దృష్ట్వా రాఘవశ్శ్రీమా నాగతాన్ తాంచ రాక్షసీం
అబ్రవీ ద్భ్రాతరం రామో లక్ష్మణం దీప్తతేజసం. ౧౨

ముహూర్తం తిష్ఠ సౌమిత్రే సీతాయాః ప్రత్యనంతరః
ఇమా నస్యా వధిష్యామి పదవీ మాగతా నిహ. ౧౩
తథేతి లక్ష్మణో వాక్యం రామస్య ప్రత్యపూజయత్. ౧౩½

రాఘవోఽపి మహచ్చాపం చామీకరవిభూషితం. ౧౪
చకార సజ్యం ధర్మాత్మా తాని రక్షాంసి చాబ్రవీత్. ౧౪½

యుష్మాన్ పాపాత్మకాన్ హంతుం విప్రకారాన్ మహాహవే.
ఋషీణాంతు నియోగేన ప్రాప్తోఽహం సశరాయుధః. ౧౫½

తస్య తద్వచనం శ్రుత్వా రాక్షసా స్తే చతుర్దశ. ౧౬
చిక్షిపు స్తాని శూలాని రాఘవం ప్రతి దుర్జయం
తాని శూలాని కాకుత్స్థః చిచ్ఛేద నిశితై శ్శరైః. ౧౭

---

అత స్తేషాం సమీపం గత్వా స్వతేజసా శీఘ్రేణ తౌ రామలక్ష్మణౌ దుర్వృత్తాం దుర్లభవృత్తాం దుర్లభం వృత్త మాచారో యస్యా స్తాం సీతాం చ, హత్వా జ్ఞాత్వా (హన హింసా గత్యో రితి ధాతో ర్గత్యర్థస్య జ్ఞానార్థత్వాత్.) అపావర్తితుం ప్రతినివర్తితుం అర్హాథ. అయం మమ భగిన్యాః ఇష్టో మనోరథః.

---

1. వాల్మీకిరా. ౨౦ స.



౧౨ శ్రీమంతుం డగు శ్రీరామచంద్రమూర్తి తనయాశ్రమమునకు వచ్చుచున్న రాక్షసులను, వారివెంట నిడుకొనివచ్చు నాశూర్పణఖను జూచి, దేదీప్యమాన మగు తేజస్సుగల లక్ష్మణునితో నిట్లనియె.

౧౩-౧౩½ లక్ష్మణా! ఒక్కముహూర్తమాత్రము సీత నేమఱక రక్షించుచుండుము. ఈడారింబడి వచ్చుచున్న యీశూర్పణఖకు బంధువులైన యీరాక్షసుల నిచ్చటనే పరిమార్చెదను. నా విని లక్ష్మణుండటుల చేయుదు నని శ్రీరామాజ్ఞను బూజించెను.

౧౪-౧౪½ ధర్మాత్ముం డగు శ్రీరామచంద్రమూర్తి సువర్ణాలంకృత మగు ధనువున కల్లెత్రాండు దొడిగి యారాక్షసులతో నిట్లనియె.

౧౫-౧౫½ మహాత్ముల కపకారముచేయు దురాత్ములగు మిమ్ము భయంకర యుద్ధమున జంపుటకే నేను శరచాపధారినై మహర్షులయాజ్ఞపై నిటకు వచ్చినవాండను.

౧౬-౧౭ అంత పదునల్గురు రాక్షసులును శ్రీరామునిమాటలను విని యందరు నొక్కపెట్టున దుర్జయుం డగు నాతనిపై శూలముల విసరిరి. ఆశూలములను శ్రీరామచంద్రమూర్తి పదునైన బాణములచే ఛేదించెను.

---

నారామలక్ష్మణులను, దుర్వృత్తయైన యాసీతను (ఇట 'దుర్వృత్త' యనంగా దుర్లభమైన వృత్తము ఆచారము లేక నడవడి కలది యని యర్థము.) హత్వా = తెలిసికొని (హత్వా అనంగాం జంపి యను నర్థమున్నను నిట 'హన హింసా గత్యోః' అనగా హనధాతువు హింసార్థమునను, గత్యర్థమునను గూడ వర్తించును. గత్యర్థకము జ్ఞానార్థకముగూడ కావచ్చును గనుక; 'హత్వా' అను పదమునకుం దెలిసికొని యను నర్థము చేకూరును.) మరలి రండు. ఇదియే నాసోదరి యగు శూర్పణఖ మనోరథ మని భావము.

తతః పశ్చాన్మహాతేజా నారాచాన్సూర్యసన్నిభాన్
ముమోచ రాఘవో బాణాన్ వజ్రానివ శతక్రతుః. ౧౮
తే భిత్త్వా రక్షసాం వేగా ద్వక్షాంసి రుధిరాప్లుతాః
వినిష్పేతు స్తథా భూమౌ న్యమజ్జం తాశనిస్వనాః. ౧౯
తే భిన్నహృదయా భూమౌ ఛిన్నమూలా ఇవ ద్రుమాః
నిపేతు శ్శోణితార్ద్రాంగా వికృతా విగతాసవః. ౨౦

నిపాతితాన్ దృశ్య రణేతు రాక్షసాన్ ప్రధావితా శూర్పణఖా పున స్తతః, వధంచ తేషా మఖిలేన రక్షసాం శశంస సర్వం భగినీ ఖరస్య సా. ౨౧

1 తయా పర్యుషితః పూర్వం పునరేవ ప్రశంసితః
అబ్రవీ ద్దూషణం నామ ఖర స్సేనాపతిం తదా. ౨౨

చతుర్దశసహస్రాణి మమ చిత్తానువర్తినాం
రాక్షసాం భీమవేగానాం సమరే ష్వనివర్తినాం. ౨౩
సర్వోద్యోగ ముదీర్ణానాం రక్షసాం సౌమ్య! కారయ
ఉపస్థాపయ మే క్షిప్రం రథం సౌమ్య! ధనూంషిచ. ౨౪
* అగ్రే నిర్యాతు మిచ్ఛామి పౌలస్త్యానాం మహాత్మనాం
వధార్థం దుర్వినీతస్య రామస్య రణకోవిదః. ౨౫

*అగ్రఇతి-పులస్త్యవంశ్యానా మగ్రే రణకోవిదోఽహం గంతు మిచ్ఛామీ త్యన్వయః. రామస్య రణజ్ఞత్వాత్ పౌలస్త్యానాం వధార్థ మితి దైవీవాక్ భావిసూచనీ ప్రవృత్తా.

1 వాల్మీకి రా. ౨౨ స.



౧౮-౧౯ అటుపిమ్మట మఱల మహాతేజస్వి యగు శ్రీరాముఁడు సూర్యసమానములైన (పదునాల్గు) బాణములను, దేవేంద్రుఁడు వజ్రముల వదలునట్లు వదలెను. అవి మహాజవమున నారక్కసుల యురముల బ్రద్దలుచేసి రక్తముతోఁ దడిసినవై పిడుగులవంటి ధ్వనికలవై భూమిం బడి దించుకొనిపోయెను.

౨౦ అంత నారక్కసులు గుండెలు బ్రద్దలై, రక్తముచేఁ దడిసిపోయిన దేహములతో, నవయవములు తెగిన వికృతస్వరూపములతోఁ బ్రాణములు పోయి మొదలునరికిన చెట్లపలె భూమిపైఁ గూలిరి.

౨౧ అట్లు యుద్ధమునం జచ్చి పడియున్న యారాక్షసులను జూచి వేవేగ పాఱిపోయి ఖరాసురుని సోదరి యగు నాశూర్పణఖ యాయందరి రాక్షసులయొక్క చావువార్తను సవిస్తరముగా ఖరున కెఱిఁగించెను.

౨౨ శూర్పణఖచే మొదట నెత్తిపోడుపుమాటలచే నిష్ఠురపెట్టఁబడి తరువాతఁ బ్రశంసింపఁబడిన ఖరుఁ డపుడు తనసేనాపతియు, సోదరుఁడు నగు దూషణునితో ని ట్లనియె.

౨౩-౨౪ యుద్ధములందు నాతలఁ పెఱింగి మెలఁకువగలిగి వర్తించుచు, వెనుకడుగువేయక యుండు భయంకరవేగము గల్గి గర్వితులై యున్న పదునాలుగువేలరాక్షసులను, నానావిధాయుధ సామగ్రులతో యుద్ధసన్నద్ధు లగు నటు లొనర్పుము. ఓసౌమ్యుఁడా! నాకును ధనుర్బాణరథముల నాయత్తముచేయుము.

౨౫ * అవినయుఁ డగు నారామునివధకొఱకుఁ బులస్త్యవంశీయు లగు మహాత్ములనందఱం గడచి, యుద్ధకోవిదుఁ డగు నేనే ముందు నడువవలె నని కోరుచున్నాఁడను.

* 'పులస్త్యవంశీయు లగువారికి ముందు యుద్ధకోవిదుఁడ నగు నేను యుద్ధమునకుఁ బోయెదను' అని యనుటలో "రాముఁడు యుద్ధవిశారదుఁ డగుట పులస్త్యవంశీయులఁ జంపు నతని యెదుటకు నేను వెడలెదను' అని దైవవాక్కు తలవని తలంపుగా భావిసూచనము నకై వానినోట వెడలెను" అని యెఱుంగునది (సంస్కృతశ్లోక

తత స్తద్రాక్షసం సైన్యం ఘోరవర్మాయుధధ్వజం
♦ నిర్జగామ జనస్థానా న్మహానాదం మహాజవం. ౨౬

తాం త్వభిద్రవతో దృష్ట్వా రాక్షసా స్భీమవిక్రమాః
ఖరస్యాపి రథం కించి జ్జగామ తదనంతరం. ౨౭

[1] తస్మి న్యాతే జనస్థానా దశివం శోణితోదకం
అభ్యవర్ష న్మహామేఘ స్తుములో గర్దభారుణః. ౨౮
బభూవ తిమిరం ఘోర ముద్ధతం రోమహర్షణం
ఉల్కాశ్చాపి సనిర్ఘాతా నిపేతు ర్ఘోరదర్శనాః. ౨౯

తాం సమీక్ష్య మహోత్పాతా నబ్రవీ ద్రాక్షసా న్ఖరః
మహోత్పాతా నిమా న్సర్వా నుత్థితా న్ఘోరదర్శనాన్. 30
నచింతయా మ్యహం వీర్యా ద్బలవాన్ దుర్బలా నివ
తారా అపి శరై స్తీక్ష్ణైః పాతయామి నభః స్థలాత్. 3౧
మృత్యుం మరణధర్మేణ సంక్రుద్ధో యోజయా మ్యహం
రాఘవం తం బలోత్సిక్తం భ్రాతరం చాస్య లక్ష్మణం. 3౨
అహత్వా సాయకై స్తీక్ష్ణై ర్నోపావర్తితు ముత్సహే
నక్వచి త్ప్రాప్తపూర్వో మే సంయుగేషు పరాజయః. 33

---

♦ నిర్జగామేతి వచనపర్యాలోచయా జనస్థానాత్ ఖరదూషణప్రభృతయః శ్రీరామాశ్రమం ప్రతి ప్రస్థితా ఇతి

---

1. వాల్మీకి రా. ౨3 స.



౨౬ ♦ అంతట ఖరునియానతిచేఁ గవచములు, వివిధాయుధములు, టెక్కెములును గలిగి, పెడబొబ్బలిడుచు వడివడిగా రాక్షససైన్యము జనస్థానమునుండి బయలువెడలెను.

౨౭ అట్లు ఘోరపరాక్రమముచే వెల్గొందు రాక్షససైన్యము ముందుఁ బరువెత్తుచుండఁ జూచి, ఆవెంటఁ దిన్నఁగ ఖరునిరథము పోవుచుండెను.

౨౮–౨౯ అంత జనస్థానమునుండి పంచవటియం దున్న శ్రీరామచంద్రుని మీఁదికి యుద్ధార్థమై పోవుచున్న ఖరునికి ముందు గుంపుగూడి గాడిదవలె బూడిదరంగుగల సంకులమైన పెద్దమేఘము లాఖరుని కాపదను సూచించుచు రక్తవర్షము కురిసెను. గగుర్పాటు గలిగించు భయంకరమైన యంధకారము వృద్ధి కాఁజొచ్చెను. ఘోరాపదలను సూచించుచు భయంకరములై పెద్దధ్వనులతో నుల్కాపాతములు పడెను.

30–33 ఆమహోత్పాతములను జూచి రాక్షసులతో ఖరుఁడిట్లనియె. ఓ రాక్షసులారా! భయంకరముగఁ జూపట్టుచుఁ జెలరేగిన యీ మహోత్పాతములను, బలహీనులను బలవంతుఁడు లక్ష్యము సేయనట్లు నాపరాక్రమముచే లక్ష్యపెట్టను. వాఁడిగల నాబాణములచే నాకసమునుండి నక్షత్రములనైన రాల్చివేయుదును. మిగులఁ గోపించు నామృత్యుదేవతకుసైతము మృత్యువును గూర్పఁగలను. బలముచే గర్వించియున్న శ్రీరాముని, యాతని తమ్ముఁ డగు లక్ష్మణుని పదునైన నాబాణములచేఁ గూల్పక మఱలి రాను యుద్ధమునం దింతవర కెన్నఁడును నాకుఁ బరాజయము కలుగ లే దనెను.

---

సమన్వయముచే నీయర్థము బాగుగా విశద మగును. అదియంతయు వివరముగాఁ దెనుఁగున విస్తరభీతిచేఁ జూపలేదు. రావణాదివాక్యము లం దన్నిఁట నిట్లే రెండర్థములు కల వని యెఱుంగునది).

♦ జనస్థానమునుండి ఖరదూషణాదులు శ్రీరామాశ్రమ మగు పంచవటికి బయలు దేరి రని తెలియుచున్నది. ఈజనస్థానము, రాయపూరు (Raipur) మండలమునకును, బస్తర్ సంస్థానమునకును తూర్పువైపు ప్రదేశమును, చెన్నరాజధానియందు విశాఖపట్టణమండలమునందుఁ

[1] ఆశ్రమం ప్రతి యాతేతు ఖరః ఖరపరాక్రమే
తానేవౌత్పాతికాన్ రామ స్సహ భ్రాత్రా దదర్శహ. ౩౮

జ్ఞాయతే. ఏతజ్జనస్థానం (Central Provinces) మధ్యప్రాంతస్థ (Raipur) రాయపూర్ మండలస్య (Basthar) బస్తర్ సంస్థానస్య పూర్వప దేశం, (Sambalpur) సంబలపూర్ మండల స్యాధికప్రదేశం (Madras) చెన్నరాజధాన్యాం (Vizagapatam) విశాఖపట్టణమండలాంతర్గత గోదావర్యా శ్చోత్తరప్రదేశం, తథైవ ప్రాగ్గోదావరీమండల స్యైకదేశం గోదవర్యాదక్షిణతటే (Nizam) నైజాం ఔరంగబాదుప్రభృతివిశేషప్రదేశం చాక్రమ్య స్థిత మితి ద్యోత్యతే. ఇదం జనస్థానం శుక్రపుత్రికయా అరజానామ్నా సంప్రార్థనాత్ దండకారణ్యాంతర్గత మపి శుక్రవర ప్రదానానుసారేణ మృద్వర్షేణ అబాధితం సత్ జనరక్షణం కృతం తస్మా త్తద్దేశస్య తన్నామ ప్రసిద్ధం. ఏతజ్జనస్థానస్య శ్రీరామావతారకాలే రావణావరజః ఖరోనా మాధిపతి ర్బభూవ. తస్య రాజధానీ ఖరాలయః. స ఇదానీం (Raipur) రాయపూర్ మండలాంతర్గత (Khariar) ఖరియార్ ఇతి నామ్నా వ్యవహ్రియతే. సతు పంచవట్యాఖ్య పర్ణశాలాత్ యీశాన్యే ద్విశతార్ధక్రోశదూరే ౽స్తి. శ్రీవాల్మీకిమహర్షిణా వర్ణితం దండకారణ్యాంతర్గతజనస్థానస్థ శంబరపుర మిదానీం (Sambalpur) సంబలపూ రితి వ్యవహ్రియతే.

1. వాల్మీకి రా. ౨౮ స.



౩౮ అట్లు భయంకర మైన పరాక్రమముగల ఖరుఁడు సైన్యముతో శ్రీరామునియాశ్రమమును సమీపింప శ్రీరామచంద్రుఁడును తమ్మునితో రాక్షసనాశకరము లగు నాదుర్నిమిత్తములను జూచెను.

గల గోదావరి కుత్తరప్రదేశమును, తూర్పుగోదావరి మండలములోని కొంతభాగమును, గోదావరికి దక్షిణఁపు టొడ్డునఁ గల నైజాము (Nizam) ఔరంగబాదు మొదలగు ప్రదేశములను నాక్రమించి యున్నదని తెలియుచున్నది. జనస్థాన మను పేరీ ప్రదేశమున కేల కల్గెనన; ఇక్ష్వాకుని పుత్రుఁ డగు దండకుఁ డను వాఁడు దుష్టుఁ డగుటచే గంగానదీ దక్షిణతీరాటవికి వెడలఁ గొట్టఁబడెను. రాజపుత్రుఁ డగుటచేఁ దండ్రి వానికిఁ గొంతధనమును, సైన్యము నిచ్చి పంపెను. అతఁ డచ్చటఁగల రాక్షసులను మొదట జయించి చెలిమిచేసికొని, స్వధర్మమును వీడి వారితోఁ గలిసియుండి కొంతప్రదేశము నేలెను. అతఁ డేలిన గహనప్రదేశమునకు దండకారణ్య మని పేరు గల్గెను. అట్లుండ నొకనాఁడు శుక్రాచార్యపుత్రిక యగు నరజ యచ్చోటఁ దపముఁజేయుచుండఁ జూచి బలాత్కరించెను. దాన నాసాధ్వికోపించి, శుక్రాచార్యుల మనోబలముచే రప్పించి, పరిస్థితిం జెప్పిన నతఁడు కోపించి, యోరీ! నీ వేలుప్రదేశమున మన్ను వర్షించి నశించుఁగాక యని శపించి, మఱియు గూతు రగు నరజ వేఁడఁగా నామె తపముచేయుచోటున కెటుచూచినను పదివేలయోజనముల మేర వర్షము బాధింపకుండునట్లనుగ్రహించెను. అట్లాప్రదేశము మృద్వర్షముచే బాధింపఁబడక యం దుండు జనులను రక్షించుటచే దండకారణ్యమందలి యాప్రదేశమునకు 'జనస్థానము' అను నామ మేర్పడెను. ఆజనస్థానమునకు శ్రీరామచంద్రునికాలమున రావణునితమ్ముఁ డగు ఖరుఁడు రాజై యుండెను. వాఁ డుండు రాజధానికి ఖరాలయ మని పేరు. ప్రస్తుతమున నిది రాయపూర్ మండలమందు 'ఖరియార్' (Khariar) అను పేర వ్యవహరింపఁబడుచున్నది. అది పంచవటి యనఁ బరగు పర్ణశాలకీశాన్యమున రెండువందల మైళ్ల దూరమునఁ గలదు. శ్రీవాల్మీకి

[1] శ్రుత్వా కోలాహలం తేషాం రామ స్సౌమిత్రి మబ్రవీత్
శ్రూయతే విపుల శ్శబ్దో నూన మాయాంతి రాక్షసాః. ౩౫
భవిష్యతి మహా న్యుద్ధం నూన మద్య మయాసహ. ౩౫½

సీతాం నీత్వా గుహాం గత్వా తత్ర తిష్ఠ మహాబల! ౩౬
హంతు మిచ్ఛా మ్యహం సర్వాన్ రాక్షసాన్ ఘోరరూపిణః
అత్ర కించి న్న వక్తవ్యం శాపితో ఽసి మ మోపరి. ౩౭
తథేతి సీతా మాదాయ లక్ష్మణో గహ్వరం యయౌ. ౩౭½

రామః పరికరం బధ్వా ధను రాదాయ నిష్ఠురం. ౩౮
తూణీరా వక్షయశరౌ బధ్వా యత్తో ఽభవ త్ప్రభుః. ౩౮½

[2] తతో దేవా స్సగంధర్వా స్సిద్ధాశ్చ సహ చారణైః. ౩౯
ఋషయశ్చ మహాత్మానో లోకే బ్రహ్మర్షిసత్తమాః
సమేయుశ్చ మహాత్మానో యుద్ధదర్శనకాంక్షిణః. ౪౦
[3] రుద్రతేజోవిలసితం దృష్ట్వా రామకళేబరం
శంఖం చక్రంచ శూలంచ పినాకం ఖేట మేవచ. ౪౧

---

పంచవట్యపి జనస్థానాంతర్గత ఏవ ఏవం సర్వప్రదేశావగమే నిశ్చితే పర్ణశాలైవ పంచవటీతి సుస్పష్టం భవతి.

---

1. అధ్యాత్మ రా. ౫ స. 2. వాల్మీకి రా. ౨౪ స.
3. స్కాందపురాణం.



౩౫-౩౫½ అంత నారక్కసుల కోలాహలమును విని శ్రీరామచంద్రమూర్తి తమ్ముం డగు సౌమిత్రిం గని లక్ష్మణా! గొప్పధ్వని వినవచ్చుచున్నది. రాక్షసులు వచ్చుచున్నారు. సందియము లేదు. వారలకు నాతో గొప్పయుద్ధము జరుగనై యున్నది.

౩౬-౩౭½ ఓ బలశాలీ! నీ వీసీతను దీసికొని గుహలో నునిచి, జాగరూకుఁడవై యట నుండుము. ఘోరరూపు లగు నీరక్కసుల నెల్ల నేనే వధింపఁగోరెదను. ఈవిషయమై నీ వేమియు బదులు చెప్పకు మని నాతోడుగా నొట్టుపెట్టుచున్నాను. అనవుడు లక్ష్మణుఁడు సీతను దోడ్కొని గుహకుం బోయెను.

౩౮-౩౮½ అంతట లోకనాథుం డగు శ్రీరామచంద్రప్రభుండు నడికట్టు గట్టిగఁ గట్టి, యుద్ధసాధనముల నాయత్తము సేసి, దృఢ మగు విల్లును జేఁబూని, యక్షయము లగు బాణములు కల యమ్ముల పొదుల నిరుగడలం దాల్చి యుద్ధసన్నద్ధుఁ డయ్యెను.

౩౯-౪౦ అంత మహాత్ము లగు దేవతలు, గంధర్వులు, సిద్ధులు, చారణులు, మహర్షులు, బ్రహ్మర్షిసత్తములు నాయుద్ధమును జూడఁగోరి గుంపులు గొని యట కరుదెంచిరి.

౪౧-౪౨½ మొదట నాసిద్ధచారణాదులు రుద్రతేజోవిరాజితుఁడై ప్రకాశించెడి శ్రీరామచంద్రమూర్తిని గని క్రమముగ నాతని దివ్యదేహమున శంఖము, చక్రము, శూలము, పినాక మను ధనుస్సు, ఖేట మను భయంకర మగు డాలువారు అను నాయుధమును, మంచపుఁగోడు వలె నుండెడి ఖట్వాయుధమును, ఘంటను, డమరు, బాణము,

---

మహర్షి చే వర్ణింపఁబడిన దండకారణ్యాంతర్గత జనస్థానములో నున్న శంబరపుర మిప్పుడు సంబల్‌పూర్ (Sambulpur) అని పిలువఁబడుచున్నది. పంచవటియును జనస్థానాంతర్గతమే. ఇట్లు రామాయణమందుఁ గల సర్వప్రదేశములను విమర్శించిన పర్ణశాలయే పంచవటి యని స్పష్టమగుచున్నది.

ఖట్వాంగ ఘంటాంచ డమరుం బాణపాశాంకుశం తథా
చాపం వజ్రంచ ఖడ్గంచ పరశుం త్రాసకారణం.
జయశ్రియంచ గంగాంచ దదృశు స్సిద్ధచారణాః. ౪౨
1 రూప మప్రతిమం తస్య రామ స్యాక్లిష్టకర్మణః. ౪౨½
బభూవ రూపం క్రుద్ధస్య రుద్రస్యేవ పినాకినః. ౪౩
* దక్షస్యేవ క్రతుం హంతుం ఉద్యతస్య పినాకినః. ౪౩½
ఆవిష్టం తేజసా రామం సంగ్రామశిరసి స్థితం. ౪౪
దృష్ట్వా సర్వాణి భూతాని భయార్తాని ప్రదుద్రువుః. ౪౪½
తతో గంభీరనిర్హ్రాదం ఘోరవర్మాయుధధ్వజం
అనీకం యాతుధానానాం సమంతా త్పర్యదృశ్యత. ౪౫
రామోపి చారయ౯ చక్షు స్సర్వతో రణపండితః
క్రోధ మాహారయ త్తీవ్రం వధార్థం సర్వరక్షసాం. ౪౬

* దక్షస్యేవేతి - ఇవ శబ్దస్య ఏవకారార్థో స్తీతి ఛాందోగ్యోపనిషద్భాష్యే శ్రీశంకరభగవత్పాదాః ప్రత్యపాదయ౯. అవ్యయానా మానేకార్థత్వా దేవం ప్రతిపాదితః. శ్రీవాల్మీకిరామాయణే త్రయోవింశతి స్సర్గే ౨౧ శ్లో॥ రాఘవం తం బలోత్సిక్త మితి శ్లోకవ్యాఖ్యానేపి శ్రీమహేశ్వరతీర్థపాదః ఏవం- శ్లో॥ రుద్రతేజోవిలసిత మితి స్కాందోక్తం ప్రతిపాదితః. అస్యార్థ మేవ శ్రీవాల్మీకిమహర్షిణా

1. వాల్మీకి రా. ౨౪ స.



పాశము, అంకుశము, మఱియొకచాపము, వజ్రము, ఖడ్గము, భయంకర మగు గండ్రగొడ్డలి, జయలక్ష్మిని, శిరమందలి స్వర్ణచ్ఛాయగలజటాజూటమునం దున్న గంగానదిని గాంచిరి.

౪౩-౪౩½ ఉదారకార్యధురీణుఁ డగు నా శ్రీరామచంద్రునిరూప మప్పుడు పినాక మను ధనువును దాల్చిన కుపితుఁడై యున్న ప్రళయకాల రుద్రునిరూప మట్లే యనుపమానమై ప్రకాశించెను.

౪౪-౪౫ దక్షప్రజాపతి యాగమును నాశనము సేయుట కుద్యుక్తుఁ డగు * రుద్రుని తేజముతోడనే కూడి యుద్ధరంగమున నున్న శ్రీరామచంద్రుని జూచి సకలభూతములును భయభ్రాంతములై నల్దిక్కులకును బారిపోఁదొడఁగెను.

౪౬ అంతలోఁ బెద్దకలకలము చెలరేగ ఘోరము లగు కవచములు, వివిధాయుధములు, జెండాలు గలిగిన రక్కసులసేనలు నలువైపులఁ గ్రమ్ముకొని కనఁబడెను.

౪౭ అంతట రణపండితుఁ డగు శ్రీరామచంద్రుఁడు నలువైపులఁ జూపులు బఱపుచు సర్వరాక్షససంహారమును గావింపఁ దీవ్రక్రోధమును బొందెను.

* 'రుద్రుని తేజమువంటి తేజము' అని 'ఇవ' శబ్దమునకు సాదృశ్యార్థము చెప్పవలసియుండగా; 'రుద్రుని తేజముతోడనే కూడిన' అని ఏవకారార్థము (మఱొక్కటికాదు రుద్రుని తేజమే యది యను నర్థము) ఎట్లు చెప్పఁబడెను? అనఁగా; 'ఇవ' శబ్దమునకు ఏవకారార్థము కలదని ఛాందోగ్యోపనిషద్భాష్యమున శ్రీశంకరభగవత్పాదాచార్యులు ప్రతిపాదించిరి. అవ్యయము లనేకార్థములు కలవగుటచేతనే యిట్లు చెప్పఁబడెను. శ్రీవాల్మీకిరామాయణమున నిరువదిమూఁడవసర్గమున నిరువదియొకటవశ్లోకమున 'రాఘవం తం బలోత్సిక్తమ్' అనుదాని వ్యాఖ్యానమున శ్రీమహేశ్వరతీర్థపాదులును 'రుద్రతేజోవిలసితమ్' రుద్రతేజోవిలసితుఁ డగు శ్రీరాముని........అని శ్రీరామ

[1] తత స్తం భీమధన్వానం క్రుద్ధా స్సర్వే నిశాచరాః
రామం నానావిధై శ్శస్త్రై రభ్యవర్షంత దుర్జయం. ౪౮

[2] చతుర్దశసహస్రాణి స్వీయరూపాణి రాఘవః
కృత్వా తేషాంచ పురత శ్శరై స్తా న్మర్దయత్ క్షణాత్. ౪౯

[3] తే చ్ఛిన్నశిరసః పేతు శ్ఛిన్నవర్మశరాసనాః
సుపర్ణవాతనిక్షిప్తా జగత్యాం పాదపా యథా. ౫౦

అవశిష్టాశ్చ యే తత్ర విషణ్ణాశ్చ నిశాచరాః
ఖరమే వాభ్యధావంత శరణార్థం శరార్దితాః. ౫౧

‘దక్షశ్చేవేతి’ శ్లోకే ప్రతిపాదితః. అన్యచ్చ అగస్త్య సంహితాయాం శ్రీరామపాదుకారహస్యేచ శ్రీరామమాలామంత్రధ్యాన మేవ మేవ. తథాహి శ్లో॥ దోర్భిః ఖడ్గం త్రిశూలం డమరుశరధను శ్చంద్రబాణం కుఠారం, శంఖం చక్రం కృపాణం హలముసలగదాభిండివాలంచ పాశం, విద్యుద్వహ్నించ ముష్టిం అభయవరకరం బిభ్రతం శుభ్రవర్ణం, వందే రామం త్రినేత్రం మదరిపుదహనం మర్దయంతం ప్రతాపై - రితి. అతఏవ అధర్వణి రామరహస్యోపనిషద్ద్వితీయాధ్యాయే హనుమదుక్త శ్రుతిః- ‘రామం త్రినేత్రం సోమార్ధధారిణం శూలినం పరం భస్మోద్ధూళిత సర్వాంగం కపర్దిన ముపాస్మహే’ ఇతి. పునశ్చ శేషధర్మే

1. వాల్మీకి రా. ౨౫ స. 2. ఆనంద రా. సారకాం. ౮ స.
3. వాల్మీకి రా. ౨౫ స.



౪౮ అట్లు క్రుద్ధులై మహాభయంకర మగు ధనువుఁ దాల్చి దుర్జయుఁడై రణాగ్రమున నిల్చిన శ్రీరామునిం గని రక్కసు లంద ఱొక్కపెట్టున నానావిధాయుధముల వర్షించిరి.

౪౯ సర్వభూతాత్మకుం డగు శ్రీరామచంద్రుఁ డాపదునాల్గువేల రక్కసులకు నెదుటఁ బదునాలుగువేలు తనరూపములను గల్పించి, యొక్కక్షణములో వారి నెల్ల మర్దించెను.

౫౦ ఆరాక్షసులందరును దలలు తెగి, కవచములు ధనుస్సులు విరిగి, గరుడుని ఱెక్కలగాలిచే విరిగిపడు వృక్షములవలె భూమిపైఁ గూలిరి.

౫౧ శేషించిన రాక్షసులును రామబాణములచేఁబీడితులై, వాని బారినుండి పాఱిపోయి, దుఃఖించుచు రక్షింపు మని ఖరుని శరణుఁజొచ్చిరి.

చంద్రుని యందుఁగల శివతేజమును వర్ణించు స్కాందపురాణమందలి శ్లోకమును బ్రతిపాదించిరి. దీని యర్థమే వాల్మీకిమహర్షి పర్యాయమును ‘దక్షస్యేవ క్రతుం హంతుమ్’ అను నీశ్లోకమునందు నిరూపించి యున్నాఁడు. ఇదిగాక యగస్త్యసంహితయందును, శ్రీరామపాదుకారహస్యమందును శ్రీరామమాలామంత్రధ్యాన మీవిధము గానే యున్నది. దానితాత్పర్య మేమన. తనచేతులతో ఖడ్గము, త్రిశూలము, డమరువు, బాణము, ధనుస్సు, మఱియొక యర్ధచంద్రబాణము, గండ్రగొడ్డలి, శంఖము, చక్రము, కృపాణము, మఱియొక విధమగు కత్తి, హల మను నాగలివంటి యాయుధము, ముసలము, గద, భిండివాల మను వాఁటుగుదియ, పాశము, మెఱుపువహ్నిగల పిడికిలి, అభయహస్తము వీని ధరించి, తెల్లని మేనికాంతి కలిగి మూఁడుకన్నులచే నొప్పు భయంకరమైన ముఖముతో ప్రతాపముచే మర్దించుచు మదించినశత్రులం దహింపఁజేయు శ్రీరామునికి మ్రొక్కుచున్నాను.-అని అధర్వణవేదమందును; శ్రీరామరహస్యోపనిషత్తునందు రెండవయధ్యాయమున హనుమంతుఁడు సెప్పినమంత్రమున- “మూఁడు నేత్రములు కలిగి, యర్ధచంద్రుని దాల్చి, శూలాయుధము ధరించి, జటాజూటుఁడై, శూలమును దాల్చి, యొడలినిండ

తా న్సర్వా న్పున రాదాయ సమాశ్వాస్యచ దూషణః
అభ్యధావత కాకుత్స్థం క్రుద్ధో రుద్ర మివాంతకః. ౨౨

తద్బభూ వాద్భుతం యుద్ధం తుములం రోమహర్షణం
రామస్యచ మహాఘోరం పున స్తేషాంచ రక్షసామ్. ౨౩
బభూ వావస్థితో రామః ప్రవమన్నివ తా౯ శరా౯
శరాంధకార మాకాశ మావృణో త్సదివాకరం. ౨౪

యుగప త్పతమానైశ్చ యుగపచ్చ హతై ర్భృశం
యుగప త్పతితై శ్చైవ వికీర్ణా వసుధా ౾భవత్. ౨౫

1దూషణస్తు స్వకం సైన్యం హన్యమానం నిరీక్ష్య సః
రాక్షసా న్పంచసహస్రా న్సందిదేశ దురాసదా౯. ౨౬

తే శూలైః పట్టసైః ఖడ్గై ర్వవర్షు స్తం సమంతతః
తతః క్రోధసమావిష్టః ప్రదీప్త ఇవ తేజసా. ౨౭
శరై రవాకిర త్తైన్యం సర్వత స్సహ దూషణం. ౨౮

సుశాంతం ప్రతి శంకరోక్తకథా ఏతద్రామాయణసారోద్ధారే గ్రంథపీఠికాయాం శ్రీరామః శివఇతి ప్రతిపాదన ఘట్టే౾పి సంధిహానైః ప్రత్యక్షీక్రియతాం.

1. వాల్మీకి రా. ౨౬ స.



౨౨ అట్లు వచ్చిన రాక్షసుల నోదార్చి, మఱలఁ గూడఁగట్టుకొని, దూషణుఁడు కుపితుఁడై, రుద్రుని మీఁదికిఁ జను యమునివలె శ్రీరాము నెదుర్కొనఁ బరువెత్తెను.

౨౩-౨౪ అంతట నారామచంద్రునకును, దూషణుఁడు మొదలగు రక్కసులకును భయంకరమై, యద్భుతమై, రోమాంచము గల్గించు సంకులమైన మహాయుద్ధము జరిగెను. శ్రీరామచంద్రుఁడు యుద్ధరంగమున నిలిచి, యెడతెగక తీక్ష్ణము లగు బాణములను గ్రక్కుచుండెనో యనునట్లుండెను. ఆతనిచే విడువఁబడిన బాణములచే దట్టముగా నలముకొన్న చీఁకటి సూర్యునితోఁగూడ యాకసమును గప్పివైచెను.

౨౫ ఒక్కమొత్తముగాఁ గొట్టఁబడినవియు, నొక్కమొత్తముగాఁ బడినవియు, నొక్కమొత్తముగాఁ బడుచున్నట్టియు, రాక్షసావయవములతోడను, సైన్యములతోడను సర్వవిధాయుధములతోడను యుద్ధభూమి చిమ్ముకొని యుండెను.

౨౬ దూషణుఁ డట్లు శ్రీరామచంద్రునిచేఁ గూలిపోవు తనసేనను జూచి యుక్కుమిగిలిన మఱియైదువేలరక్కసులను యుద్ధమునకు నడువ నాజ్ఞాపించెను.

౨౭-౨౮ అటుపై నారాక్షసులు వచ్చి శూలములు, పట్టసములు, ఖడ్గములు మొదలైన యాయుధములను శ్రీరామునిపై నన్నివైపులనుండి వర్షించిరి. అంతఁ గోపాక్రాంతుఁడై, యాహుతులఁ గొన్న యగ్నికరణిఁ దేజరిల్లుచు, శ్రీరామచంద్రుఁ డాదూషణునితోఁ గూడిన రాక్షససైన్యమునం దంతటను శరములఁ గురిసెను.

విభూతిఁ బూసికొనియున్న పరుఁడైన శ్రీరాము నుపాసించుచున్నాను." అని కలదు. మఱియు సంశయించువారు శేషధర్మమునందు సుశాంతుఁ డను మునితో శంకరుఁడు పల్కినవాక్యము లీరామాయణసారోద్ధారగ్రంథముయొక్క పీఠికయందు బాలకాండమున శ్రీరాముఁడు శివుఁ డని ప్రతిపాదించు ఘట్టమునఁ జూడఁదగును.

హత్వా చాశ్వాన్ శరైస్తీక్ష్ణై రర్ధచంద్రేణ సారథేః. ౫౮
శిరో జహార తద్రక్షః త్రిభి ర్వివ్యాధ వక్షసి. ౫౮½
సచ్ఛిన్నధన్వా విరథో హతాశ్వో హతసారథిః. ౫౯
జగ్రాహ గిరిశృంగాభం పరిఘం రోమహర్షణం
దూషణో ఽభ్యద్రవ ద్రామం క్రూరకర్మా నిశాచరః. ౬౦

త స్యాభిపతమానస్య దూషణస్య స రాఘవః
ద్వాభ్యాం శరాభ్యాం చిచ్ఛేద సహస్తాభరణౌ భుజౌ. ౬౧
స కరాభ్యాం వికీర్ణాభ్యాం మమార భువి దూషణః
విషాణాభ్యాం విశీర్ణాభ్యాం మనస్వీవ మహాగజః. ౬౨

తం దృష్ట్వా పతితం భూమౌ దూషణం నిహతం రణే
సాధు సాధ్వితి కాకుత్స్థం సర్వభూతా న్యపూజయన్. ౬౩
దూషణ స్యానుగాన్ పంచసహస్రాన్ కుపితః క్షణాత్
బాణౌఘైః పంచసాహస్రై రనయ ద్యమసాదనం. ౬౪
క్షణేన తు మహాఘోరం వనం నిహతరాక్షసం
బభూవ నిరయప్రఖ్యం మాంసశోణితకర్దమం. ౬౫

తస్య సైన్యస్య సర్వస్య ఖర శ్శేషో మహారథః
రాక్షస స్త్రిశిరాశ్చైవ రామశ్చ రిపుసూదనః. ౬౬
శేషా హతా మహాసత్వా రాక్షసా రణమూర్ధని. ౬౬½

ఇతి శ్రీరామాయణసారోద్ధారే సప్తమ స్సర్గః.



౫౮-౫౮½ మఱియును శ్రీరామచంద్రుఁడు కఱకైన బాణములచే దూషణుని రథాశ్వములను జంపి, అర్ధచంద్రాయుధముచే నాతని సారథి తలఁ ద్రెంచి, మూఁడు బాణములచే దూషణునిరొమ్ముఁ జీల్చెను.

౫౯-౬౦ అంత విరిగిన ధనువును, ఒఱిగిన రథమును, ప్రాణములఁ దొఱఁగిన గుఱ్ఱములును, సారథియుఁ గలవాఁడై, భయముచే గగుర్పాటు నొదవించెడి పర్వతశిఖరమువంటి పరిఘాయుధముం బూని, క్రూరకర్ముఁ డగు దూషణుఁడు శ్రీరామచంద్రుని మీఁదికిఁ బఱవెత్తి వచ్చెను.

౬౧-౬౨ అట్లు తనమీఁదికి వచ్చి పడుచున్న దూషణుని శ్రీరామచంద్రుఁడు చూచి, పరిఘాయుధమును బూని, యాభరణములఁ దాల్చియున్న దూషణుని రెండుభుజముల రెండుబాణములచేఁ ద్రుంచివైచెను. అట్లు ఛేదింపఁబడిన భుజములతో, విడిపోయిన దంతఁపుఁగొమ్ములతో ధీరం బగు పెద్దయేనుఁగుపడినట్లు, పుడమిపైఁ బడి ప్రాణముల విడిచెను.

౬౩ శ్రీరామచంద్రునిచే యుద్ధమున మడిసి పుడమిఁ బడియున్న దూషణుని జూచి, సకలభూతములును బాగుబాగని శ్రీరామచంద్రమహాప్రభునిం బూజించెను.

౬౪ దూషణునితో వచ్చిన యైదువేలరాక్షసులను శ్రీరామచంద్రుఁడు క్రోధమూర్తియై బాణజాలముచే నొక్కక్షణములో రూపుమాపెను.

౬౫ అట్లనివరకు భయంకరు లగు యమకింకరులఁ బోలిన రాక్షసులతో నరకప్రాయమై యున్న జనస్థానము క్షణములోఁ జచ్చిన రక్కసులతో మివుల భయంకరమై మాంసరక్తములచేఁ దడిసి బురదగలదయ్యెను.

౬౬-౬౬½ ఆసైన్యమున కంతకును మహారథికుఁ డగు ఖరుఁడును, త్రిశిరస్కుఁ డను రక్కసుఁడును, ఇట శత్రుసంహారకుఁ డగు శ్రీరామచంద్రుఁడును మాత్రమే మిగిలిరి. గొప్పబలముగల మిగతరాక్షసులందరు నా యుద్ధతలమునఁ గూల్పఁబడిరి.

ఇది శ్రీరామాయణసారోద్ధారముననరణ్యకాండమున నేడవసర్గము ముగిసెను.

## అష్టమస్సర్గః.

1 ఖరంతు రామాభిముఖం ప్రయాంతం వాహినీపతిః
రాక్షస స్త్రిశిరానామ సన్నిపత్యేద మబ్రవీత్. ౧
మాం నియోజయ విక్రాంత! సన్నివర్తస్వ సాహసాత్
పశ్య రామం మహాబాహుం సంయుగే వినిపాతితమ్. ౨
అహం వాస్యరణే మృత్యు రేష వా సమరే మమ
ప్రహృష్టేవా హతే రామే జనస్థానం ప్రయాస్యసి. ౩
మయి వా నిహతే రామం సంయుగా యోపయాస్యసి
ఖర స్త్రిశిరసా తేన మృత్యులోభా త్ప్రసాదితః. ౪
త్రిశిరాశ్చ రథేనైవ వాజియుక్తేన భాస్వతా
అభ్యధావ ద్రణే రామం త్రిశృంగ ఇవ పర్వతః. ౫
శరధారాసమూహాన్ స మహామేఘఇవోత్సృజన్. ౫½
ససంప్రహార స్తుములో రామత్రిశిరసో ర్మహాన్. ౬
బభూవాతీవబలిన స్సింహకుంజరయో రివ. ౬½
తతో రామోఽపి సంక్రుద్ధ స్సర్వతో రణపండితః. ౭
చతుర్భి స్తురగా నస్య శరై స్సన్నతపర్వభిః
న్యపాతయత తేజస్వీ చతుర స్తస్య వాజినః. ౮
అష్టభి స్సాయకై స్సూతం రథోపస్థే న్యపాతయత్

1. వాల్మీకి రా. ౨౭ స.



## ఎనిమిదవసర్గము.

౧ అంత శ్రీరామచంద్రుని నెదుర్కొనఁబోవు ఖరుని సమీపించి త్రిశిరసుఁ డను రాక్షసుఁ డిట్లనియె.

౨ పరాక్రమశాలీ! న న్నీయుద్ధమునకు నియోగింపుము. నీవు సాహసమునుండి మఱలుము. మహాబాహుఁ డగు రాముని యుద్ధమునఁ గూల్పఁబడఁగాఁ గనుము.

౩-౪ ఈరాముని కేనైనను మృత్యువ నగుదును. నా కతఁడైన మృత్యువు కావలెను. గర్వితుం డగు రాముఁడు గూలెనా నీవు జనస్థానమునకు మఱలిపోఁగలవు. మృత్యులోభముచే నిట్లు త్రిశిరసునిచే ఖరుఁడు బ్రతిమాలఁబడెను.

౫-౫½ పిమ్మటఁ ద్రిశిరసుఁడు గుఱ్ఱములఁ బూన్చిన చక్కని రథము నెక్కి మహామేఘమట్లు శరధారావారముల నపారముగఁ గురిపించుచు మూఁడుశిఖరములుగల పర్వతమో యనునట్లు యుద్ధమున శ్రీరామచంద్రుని కెదురుగాఁ బరువెత్తెను.

౬-౬½ అప్పుడు శ్రీరామత్రిశిరసులకు మహాబలవంతము లగు సింహకుంజరములకట్లు ఘోరమగు సంకులయుద్ధము జరిగెను.

౭-౧౦ అంతట తేజోవంతుఁడును, యుద్ధవిశారదుఁడు నగు శ్రీరామచంద్రుఁడు కుపితుఁడై వంపులేని కణుపులుగల నాల్గుబాణములచే నా ఖరుని రథమునకుఁ గట్టిన వేగముగల గుఱ్ఱములను గూల్చెను. ఎనిమిదిబాణములచే సారథిని రథముముందుభాగమునఁ బడవైచెను. ఒకబాణముచే నున్నత మగు వాని టెక్కెమును ఛేదించెను. పిమ్మటఁ గూలిపోవురథమునుండి పైకెగసిపోవు నాఖరాసురుని

రామ శ్చిచ్ఛేద బాణేన ధ్వజం చాస్య సముచ్ఛ్రితం. ౯
తతో హతరథా త్తస్మా దుత్పతంతం నిశాచరం
బిభేద రామ స్తం బాణై ర్హృదయే సోఽభవ జ్జడః. ౧౦

సాయకై శ్చాప్రమేయాత్మా సామర్ష స్తస్య రక్షసః
శిరాం స్యపాతయ ద్రామో వేగవద్భి స్త్రిభి స్శితైః. ౧౧
సభూమౌ రుధిరోద్గారీ రామబాణాభిపీడితః
న్యపత త్పతితైః పూర్వం స్వశిరోభి ర్నిశాచరః. ౧౨

[1] నిహతం దూషణం దృష్ట్వా రణే త్రిశిరసా సహ
ఆససాద ఖరో రామం నముచి ర్వాసవం యథా. ౧౩

పూరయామాస తం దృష్ట్వా రామోఽపి సుమహద్ధనుః
త ద్బభూవ శితై ర్బాణైః ఖరరామవిసర్జితైః. ౧౪
పర్యాకాశ మనాకాశం సర్వత శ్శరసంకులం
అన్యోన్యవధసంరంభా దుభయో స్సంప్రయుధ్యతోః. ౧౫
శరజాలవృత స్సూర్యో నతదా స్మ ప్రకాశతే. ౧౫½

తతోఽస్య సశరం చాపం ముష్టిదేశే మహాత్మనః. ౧౬
ఖర శ్చిచ్ఛేద రామస్య దర్శయన్ పాణిలాఘవం. ౧౬½

సపున స్త్వపరా న్సప్తశరా నాదాయ వర్మణి. ౧౭
నిజఘాన ఖరః క్రుద్ధః శక్రాశనిసమప్రభాన్. ౧౭½

1 వాల్మీకి రా. ౨౭ స.



హృదయమును బాణములచేఁ జీల్చెను. వాఁడు వెంటనే చేష్టలు దక్కి మూర్ఛఁబడిపోయెను.

౧౧-౧౨ అమేయాత్ముఁ డగు శ్రీరామచంద్రుఁడు కోపము పెంపు దీపింప మూఁడు బాణములచే నా రక్కసుని మూఁడుతలలను గూల్చెను, (మరల తేరుకొని వచ్చుచున్న) త్రిశిరస్సును ధైర్యముగల శ్రీరామచంద్రుఁడు కోపమున పదునుగల్గి వేగవంతము లగు మూఁడుబాణముల నాతని మూఁడుతలలను ఖండించి క్రిందపడవైచెను. వెంటనే త్రిశిరస్కుఁడు రామబాణపీడితుఁడై ముందే తెగిపడిన తలలతోఁ బాటు రక్తముఁ గ్రక్కుచు చచ్చి భూమిపైఁబడెను.

౧౩ అట్లు యుద్ధమందు త్రిశిరస్సుతోడ హతుఁడై పడియుండిన దూషణుని జూచి నముచి యను యసురుఁ డింద్రుని దాఁకి నట్లు ఖరుఁడు శ్రీరాముని దాఁకెను.

౧౪-౧౫½ శ్రీరామచంద్రుఁడును ఆఖరుని జూచి గొప్పదగు తనధనువున బాణము సంధించెను. అంత నలునైపుల నుండు బయలంతయు శ్రీరామఖరులు వైచిన బాణజాలముతో నిండిపోయెను. ఒకరి నొకరు చంపుకొనుటలో మిగులఁ బ్రయత్నముతోఁ బోరుచుండు శ్రీరామఖరాసురుల బాణపరంపరలచేఁ గప్పఁబడి సూర్యుఁడెంత మాత్రమప్పుడు ప్రకాశింపకుండెను.

౧౬-౧౬½ పిదప ఖరుఁడు యుద్ధమున తనహస్తలాఘవమును జూపుచు మహాత్ముఁ డగు శ్రీరామచంద్రునిపిడికిటిలోఁగల ధనువును బాణమును ఖండించెను.

౧౭-౧౭½ మఱల వాఁడు కోపమునొంది పిడుగులఁబోలు నేడు బాణములను గొని కొట్టెను.

తత స్తత్ప్రహతం బాణైః ఖరముక్తై స్సుపర్వభిః. ౧౮
పపాత కవచం భూమౌ రామ స్యాదిత్యవర్చసః
తత శ్శరసహస్రేణ రామ మప్రతిమౌజసం. ౧౯
అర్దయిత్వా మహానాదం ననాద సమరే ఖరః. ౧౯½

సశరై రర్దితః క్రుద్ధ స్సర్వగాత్రేషు రాఘవః. ౨౦
రరాజ సమరే రామో విధూమోఽగ్ని రివజ్వలన్. ౨౦½

చకా రాంతాయ సరిపో స్సజ్య మన్య న్మహద్ధనుః. ౨౧
సుమహద్వైష్ణవం య త్త దతిసృష్టం మహర్షిణా. ౨౧½

వరం తద్ధను రుద్యమ్య ఖరం సమభిధావత. ౨౨
బిభేద రామ స్సంక్రుద్ధః ఖరస్య సమరే ధ్వజం. ౨౨½

తతః పశ్చాన్మహాతేజా నారాచా న్భాస్కరోపమాన్. ౨౩
జఘాంసూ రాక్షసం బాణాన్ త్రయోదశ సమాదదే ౨౩½

తతోఽప్యయుగ మేకేన చతుర్భి శ్చతురో హయాన్. ౨౪½
షష్ఠేనతు శిర స్సంఖ్యే ఖరస్య రథసారథేః
త్రిభి స్త్రివేణుం బలవాన్ ద్వాభ్యా మక్షం మహాబలః. ౨౫

ద్వాదశేన తు బాణేన ఖరస్య సశరం ధనుః
త్రయోదశే నేంద్రసమో బిభేద సమరే ఖరం. ౨౬



౧౮-౧౯½ పిమ్మట ఖరుఁడు వదలిన మంచికణుపులుగల బాణములచేఁ గొట్టబడినదై సూర్యునితో సమాన మగు తేజముగల శ్రీరామునికవచము పడెను. మఱియు వాఁడు వేయిబాణములఁ బ్రయోగించి, అనుపమానపరాక్రమసంపన్నుఁడగు శ్రీరామచంద్రు నొప్పించి యా యుద్ధభూమిలోఁ గట్టిగా నార్చెను.

౨౦-౨౦½ ఖరునిబాణములచే సకలావయవములందును నొప్పింపఁబడి, శ్రీరామచంద్రుఁ డయ్యుద్ధమున మిగులకోపముగలవాఁడై పొగలేని యగ్ని యట్లు ప్రకాశించెను.

౨౧-౨౧½ శత్రువు నంత మొందింపవలె నని శ్రీరామచంద్రుఁడు మఱియొక మహాధనువును గ్రహించి నారి నెక్కిడెను. అది యా యగస్త్యమహర్షిచే సృష్టింపఁబడి రామునికిచ్చిన ధనుస్సు.

౨౨-౨౨½ ఆధనువు నెత్తుకొని శ్రీరాముఁడు ఖరు నెదుర్కొనెను. ఆయుద్ధమున ముందు రాముఁ డాఖరుని టెక్కెమును దెగఁగొట్టెను.

౨౩-౨౩½ పిదప మహాతేజస్వి యగు శ్రీరామచంద్రుఁడు సూర్యునివలె వెలుంగు పదుమూఁడుబాణముల నొకే పర్యాయము ఖరు నీమారు తప్పక చంపుదు నని గ్రహించెను.

౨౪-౨౬ అటుపైనం దొకదానిచే ఖరుని రథము కాడిని, నాల్గింట నాలుగు గుఱ్ఱములను, నాఱవదానిచే సారథి తలను, మూఁటిచే కాడిమ్రాకున కాధారముగనున్న మూఁడు బొంగులను, రెండిఁటఁ జక్రములను, ఒకఁట ఖరునిబాణముతోనున్న ధనువును, ఛేదించి యింద్రునితో సమానుఁ డగు శ్రీరామచంద్రుఁడు పదుమూఁడవ బాణముచే ఖరుని గొట్టెను.

పరిభగ్న ధన్వా విరథో హతాశ్వ హతసారథిః.
గదాపాణి రవప్లుత్యతస్థౌ భూమౌ ఖర స్తథా. ౨౭

ఖరంతు విరథం రామో గదాపాణి మవస్థితమ్
1 మృదుపూర్వం మహాతేజాః పరుషం వాక్యమబ్రవీత్. ౨౮

లోభా త్పాపాని కుర్వాణః కామాద్వా యో నబుధ్యతే
* భ్రష్టః పశ్యతి తస్యాంతం బ్రాహ్మణీకరకా దివ. ౨౯

వసతో దండకారణ్యే తాపసా న్ధర్మచారిణః
కిన్ను హత్వా మహాభాగా న్ఫలం ప్రాప్స్యసి రాక్షస ! ౩౦

నచిరా త్ప్రాప్యతే లోకే పాపానాం కర్మణాం ఫలం
సవిషాణా మి వాన్నానాం భుక్తానాం క్షణదాచర !

* భ్రష్ట ఇతి-కామలోభాభ్యాం పాపాని కుర్వాణో యః పాప ఫలం న జానాతి సతు కాల్యాంతరే దేహాద్భ్రష్ట స్సన్ కామలోభాభ్యాం సంచితపాపస్య ఫల మనుభవతి. యథా బ్రాహ్మణీ (రక్తపుచ్ఛికా) స్వశరీరసౌఖ్యార్థం వర్షోపలం నిగీర్య క్షణేన మ్రియతే. రక్తపుచ్ఛికాయాః కరకావిష మితి ప్రసిద్ధిః. తద్వ త్త్వమపి నశ్యసీతి భావః.

1. వాల్మీకి రా. ౨౯ స.



౨౭ ఖరుఁడు ధనువు విఱిగి, రథ మొఱిఁగి, గుఱ్ఱములు సచ్చి, సారథి ద్రెళ్ళి, గదను జేఁబూని పై కెగిరి యుద్ధభూమిలో నిలువఁబడెను.

౨౮ అప్పుడు మహాతేజస్వి యగు శ్రీరామచంద్రుఁడు రథముపోయి గదాపాణియై యెదుటనున్న ఖరునిం గని, ముందు మృదువుగను, (అర్థవిమర్శనమున) పరుషముగనుండువాక్యము నిట్లు పలికెను.

౨౯ * ఉన్నదానిని ద్యాగము చేయలేకపోవుటవలనను, లేనిదాని బొందఁ గోరుటవలనను పాపకార్యములను జేసి, తెలియక యేమో చేసితి నని పశ్చాత్తాపమైనఁ బొందక, యా పాపఫలము ననుభవించి; నలికండ్లపాము వడగలిని గోరి మ్రింగి చచ్చునట్లు నశించును.

౩౦ ఓరాక్షసుఁడా! దండకారణ్యములో నివసించు ధర్మానుష్ఠానపరు లగు మహాతపస్వులను జంపి నీ వేమిఫలమును మూటగట్టుకొన నుంటివో?

౩౧ ఓరక్కసుఁడా లోకమునఁ బాపములు చేసినవాఁడు విషము బెట్టిన యన్నములఁ దిన్నవాఁ డెట్లు నశించునో, అట్లు వెంటనే యా పాపఫలితమును దప్పక పొందును. అనఁగా దప్పక ముప్పు నెందు నని యర్థము.

* కామము లోభము వీనిచేఁ బాపములను జేయువాఁ డప్పటి కాచేసిన పాపముల ఫల మెట్టిదో యెఱుఁగకున్నను కాలాంతర మున భ్రష్టుఁడై, వానిచే సంచితమైన పాపముయొక్క ఫలము ననుభవించును. ఎట్లన; బ్రాహ్మణి అనఁగా - రక్తపుచ్ఛిక - నలి కండ్లపాము అని అందురు. తన శరీరసౌఖ్యమునకై వడగలిని దిని యా క్షణములోనే చచ్చును. ఆ పామునకు వడగలి విష మని ప్రసి ద్ధము. నీవు నట్లే నశింతు వని భావము.

పాప మాచరతాం ఘోరం లోక స్యాప్రియ మిచ్ఛతాం
అహ మాసాదితో రాజ్ఞా ప్రాణా న్హంతుం నిశాచర! ౩౨

అద్య త్వాం పతితం బాణైః పశ్యంతు పరమర్షయః
నిరయస్థం విమానస్థాః యే త్వయా హింసితాః పురా. ౩౩
అద్య తే పాతయిష్యామి శిర స్తాలఫలం యథా. ౩౩½

ఏవ ముక్తస్తు రామేణ క్రుద్ధ స్సంరక్తలోచనః. ౩౪
ప్రత్యువాచ ఖరో రామం ప్రహసన్ క్రోధమూర్ఛితః
కామం బహ్వపి వక్తవ్యం త్వయి వక్ష్యామి న త్వహం. ౩౫
అస్తం గచ్ఛేద్ధి సవితా యుద్ధవిఘ్న స్తతో భవేత్
చతుర్దశసహస్రాణి రాక్షసానాం హతాని తే. ౩౬
తద్వినాశా త్కరో మ్యేష తేషా మశ్రుప్రమార్జనం. ౩౬½

ఇత్యుక్త్వా పరమక్రుద్ధ స్తాం గదాం పరమాంగదః. ౩౭
ఖర శ్చిక్షేప రామాయ ప్రదీప్తా మశనిం యథా. ౩౭½
1 భిత్త్వాతు తాం గదాం బాణై రాఘవో ధర్మవత్సలః. ౩౮
స్మయమానః ఖరం వాక్యం సంరబ్ధ మిద మబ్రవీత్. ౩౮½
ఏత త్తే బలసర్వస్వం దర్శితం రాక్షసాధమ! ౩౯
శక్తిహీనతరో మత్తో వృథా త్వ మవగర్జసి. ౩౯½

స దదర్శ మహాసాల మవిదూరే నిశాచరః. ౪౦
స త ముత్పాటయామాస సందశ్య దశనచ్ఛదం.
రామ ముద్దిశ్య చిక్షేప హత స్తమితి చాబ్రవీత్. ౪౧

1. వాల్మీకి రా. ౩౦ స.



౩౨ ఓనిశాచరా! ఘోరముగాఁ బాపము నాచరించుచు, లోకముల కప్రియమును జేయఁగోరువారి ప్రాణములను దీయుటకే నేను రాజునానతిం గొని యిటకు వచ్చినాఁడను.

౩౩–౩౩½ ఓఖరాసురా! నాబాణముచేఁ గూలి, యిప్పుడే నరకమునం దుండు నిన్ను, మున్ను నీచే హింసింపఁబడి స్వర్గలోకమున కేగిన మహర్షులు విమానములయం దాసీనులై చూచెదరుగాక! ఇదిగో! ఇప్పుడే నీతలను తాటిపండట్లు పడఁగొట్టెద.

౩౪–౩౬½ ఇట్లు శ్రీరామచంద్రుఁడు పలుకఁగా మిగుల కోపమునఁ గండ్లెఱ్ఱపడ, వెడనవ్వు నవ్వి ఖరుఁడు ఓరామా! నీయెడ నే నెంతేని యనవలసి యున్నను నే నిపు డేమియు ననను. సూర్యుఁ డస్తమించును. అట్లయ్యెనా యుద్ధమునకు విఘ్నము కలుగును. నీ వింతకు మున్ను పదునాల్గువేలరక్కసులను జంపితివి. నే నిప్పుడు నిన్ను జంపి వారికండ్లనీరు దుడిచి వైచెదను (రాత్రివేళయుద్ధముచేయు శక్తి తనకున్నను, ఖరుఁడు అశక్తులగు మనుజుల నట్టివేళఁ జంపుట తనకుఁ గీర్తికరముకాదని యిట్లనెను).

౩౭–౩౭½ మంచిబాహుపురులు గల యాఖరుఁ డిట్లు పలికి, మిగులక్రోధమునఁ దనగదను బ్రజ్వలించుపిడుగునట్లు శ్రీరామునిమీఁదికి విసరెను.

౩౮–౩౮½ ధర్మవత్సలుఁ డగు శ్రీరామచంద్రుఁ డాఖరునిగదను ద్రుంచి, వాని జూచి చిఱునవ్వు నవ్వుచు నుద్రేకపూరితముగ నిట్లు పలికెను.

౩౯–౩౯½ ఓరాక్షసాధమా! ఈ నీబల మెంతవరకుఁ గలదో అంతయుఁ జూపితివి. మిగులబలహీనుఁడ వయ్యు మదించి వ్యర్థముగ నట్లేల యఱచెదవు?

౪౦–౪౧ (ఇట్లు శ్రీరాముఁడు పలుకుచుండఁగనే ఖరుఁ డాయుధము సంపాదించుటకు నలువైపులఁ దిరిగి) దాఁపున నొకసాలవృక్షమును జూచెను. పెదవులఁ గఱచుకొనుచు నావృక్షమును బెకలించి రాముని మీఁదికి విసరెను. దీనిచే నీవు చచ్చితి వనియును రామునిం గూర్చి పలికెను.

తమాపతంతం బాణౌఘైశ్ఛిత్వా రామః ప్రతాపవాన్
రోష మాహారయ త్తీవ్రం నిహంతుం సమరే ఖరం. ౪౨

నిర్బిభేద సహస్రేణ బాణానాం సమరే ఖరం
తస్య బాణాంతరా ద్రక్తం బహు సుస్రావ ఫేనిలం. ౪౩

విహ్వల స్సకృతో బాణైః ఖరో రామేణ సంయుగే
మత్తో రుధిరగంధేన తమే వాభ్యద్రవ ద్ద్రుతం. ౪౪

* తమాపతంతం సంరబ్ధం కృతాస్త్రో రుధిరాప్లుతం.
అపాసర్ప త్ప్రతిపదం కించి త్త్వరితవిక్రమః. ౪౫

---

* తమితి – ఆపతంతం బాణక్షేపణానవకాశతయా అతిసన్నికృష్టం ఉపరి అపతంతం ఖరం దృష్ట్వేతి శేషః. కృతాస్త్రః శిక్షితాస్త్రః రామః త్వరితవిక్రమః - శరసంధానావకాశార్థం త్వరితపాదవిక్షేప స్సన్, ప్రతిపదం - ప్రతీపం తిర్యగిత్యర్థః. కించి దపాసర్పత్ అపసృతవాన్. అపసర్పణే హేత్వంతర మాహ - రుధిరాప్లుత మితి - తద్దేహరుధిరస్య స్వస్మిన్ సంశ్లేషజుగుప్సయే త్యర్థః. అపాగచ్ఛత్ శరసంధానసౌకర్యార్థం ద్విత్రీణి పదాని కించి త్పృష్ఠతో గచ్ఛదిత్యర్థః. యద్యపి రణే కించి దపసర్పణం శూరస్యాఽయుక్తం. తథాపి 'సర్వతో బలవతీ హ్యన్యథానుపపత్తి'రితి న్యాయే నాపసర్పణం వినా తత్సంహారహే త్వలాభా దపసర్పణం నదోష ఇతి హృదయం. 'క్వచి దతిసంకటవిషయే



౪౨ ప్రతాపశాలి యగు శ్రీరాముఁడు తనపై వచ్చిపడుచున్న యావృక్షమును బాణజాలముచే నరికి, యాయుద్ధమున ఖరుని జంపుటకుఁ దీవ్రమైన రోషమును బూనెను.

౪౩ శ్రీరాముఁడు వేయిబాణములచే ఖరుని గొట్టెను. అట్లు గ్రుచ్చఁబడిన బాణముల నడుమనుండి నురుగుతోఁ గూడిన రక్తము చాల స్రవించెను.

౪౪ యుద్ధమున రామబాణాభితాడితుఁడైన ఖరుఁడు రక్తగంధముచే మత్తెక్కి వేవేగ రామునిమీఁదికిఁ బరువెట్టెను.

౪౫ కోపముచే నోడ లెఱుంగక రక్తముచేఁ దడిసి, కడువడిఁ *పైఁబడు నాఖరునిజూచి మిగుల పరాక్రమవేగముగలవాఁడును, నస్త్రప్రయోగవిధియందుఁ జక్కఁగ నారితేరినవాఁడు నగు శ్రీరామచంద్రుఁ డప్పు డొక యడుగు వెనుక కడ్డుగా జరిగెను.

---

* ఇట 'పైఁబడుచున్నవాఁడు' అనఁగా బాణములఁ బ్రయోగించుట కవకాశము లేనంత సమీపమునకు వచ్చి పడుచున్నవాఁ డనియు, అట్టి ఖరుని జూచి రాముఁ డించుక జరిగె ననియు నర్థము. కృతాస్త్రుఁడు అనఁగా శిక్షితాస్త్రుఁ డన్నమాట. త్వరితవిక్రముఁడు అనఁగా శరసంధానమున కవకాశము లభించుటకు వేవేగ నడుగు నిడువాఁడు అని యర్థము. ప్రతిపదం అనగా నడ్డుగా నని యర్థము. ఇంచుక జరిగెను. అట్లు జరుగుటకుఁ గారణాంతర మింకొకటి (కవి) చెప్పుచున్నాఁడు—రక్తముచేఁ దడిసినవాఁ డని. వాని దేహమునందలి రక్తము దనకుఁ దాఁకు నను నసహ్యాభావముచే జరిగె నని యర్థము. జరిగెను అనఁగా శరసంధానసౌకర్యమునకై రెండు మూఁడడుగులు కొంచెము వెనుకకుఁ బోయె నని యర్థము. యుద్ధమునఁ గొంచెమైనను వెనుకంజ యిడుట శూరునకుఁ బాడిగాదు. 'అయినను మఱొకదారి లేకపోవుటయే యన్నిధర్మములకంటె బలవత్తర మగు దారి' (అగతికము) యను న్యాయముచొప్పున నప్పుడు వెనుకకుఁ బోయినఁగాని వాని జంపుటకు వీలులేకపోవుటచే నట్లు

తతః పావకసంకాశం వధాయ సమరే శరం
ఖరస్య రామో జగ్రాహ బ్రహ్మదండ మివాపరం. ౪౬
సందధే చాపి ధర్మాత్మా ముమోచ చ ఖరం ప్రతి
సవిముక్తో మహాబాణో నిర్ఘాతసమనిస్వనః. ౪౭
రామేణ ధను రాయమ్య ఖరస్యోపరి చాపతత్
స పపాత ఖరో భూమౌ దహ్యమాన శ్శరాగ్నినా. ౪౮
* రుద్రేణేవ వినిర్దగ్ధో శ్వేతారణ్యే యథాంతకః. ౪౮½

---

సుభటానా మభిమతో య మపసర్ప' ఇత్యుక్తమ్. అత యేవోక్తం కృతాస్త్రః శిక్షితాస్త్ర ఇతి. ఇదమే వాభిప్రేత్య వేదాంతాచార్యై రుక్తం - శ్లో॥ క్వచి దతిసంకట విషయే సుభటానా మభిమతో య మపసర్ప - ఇతి.

* ఇవశబ్దో వాక్యాలంకారే. శ్వేతారణ్యే యథాంతక ఇతి ప్రచురః పాఠః. తత్ర కావేరీతీరవర్తిని శ్వేతారణ్యే మార్కండేయచిరజీవిత్వాయాంతకసంహారో రుద్రేణ కృత ఇతి తన్మాహాత్మ్యే ప్రసిద్ధిః. కౌర్మే తూత్తరఖండే శ్వేతస్య రాజర్షేః పరమశైవస్య కాలంజరపర్వతే తప స్యభిరతస్య మారణాయాగత స్యాంతకస్య శివేన వామపాదప్రహారేణ సంహారకృత ఇతి షట్త్రింశే ఽధ్యాయే ఉక్తమ్. అన్యచ్చ ఖరాదయ స్సర్వేపి శివపూజారతా ఇతి ప్రతిపాద్యతే. స్కాందే ఉమాసంహితాయాం నవమాధ్యాయే పార్వతీం ప్రతి పరమేశ్వరోక్త్యా శ్లో॥ ఖరః ఖరపురే (ఖరియాల్)



౪౬ అంత నగ్నితోఁ దుల్యమై రెండవబ్రహ్మదండమో యన్నట్లున్న బాణమును ఖరుని జంపుటకై శ్రీరామచంద్రుఁడు గ్రహించెను.

౪౭–౪౮½ ధర్మాత్ముఁడగు రాముఁడా బాణమును ధనువునఁ దొడిగి, ఖరుని మీఁదికి వదలెను. శ్రీరామునిచే నట్లు విల్లువంచి విడువఁబడిన మహాబాణము పిడుఁగువలె ధ్వనించుచు ఖరునిపైఁ బడెను. ఆబాణము నుండి వెలువడిన యగ్నిచే దహింపఁబడి యాఖరుఁడు, రుద్రునిచే దగ్ధుండైన యముఁడు * శ్వేతారణ్యమునఁ బడినట్లు భూమిపైఁ గూలెను.

---

వెనుదగ్గుట యొకదోసము కాదు అని హృదయము. "ఒకప్పు డతిసంకటములైన దేశకాలములయందు వీరాగ్రేసరులు వెనుకంజ వేయుట తప్పనిసరి యగుచో నది న్యాయసమ్మతమే" యని చెప్పఁబడెను. ఇందుకొఱకే శ్రీరాముఁడు 'కృతాస్త్రుఁడు' అని చెప్పఁబడినది. ఇదే యభిప్రాయమున వేదాంతాచార్యులును పై వాక్యమునే వ్రాసియున్నారు.

* 'శ్వేతారణ్యే యథాంతకః' అనునది ప్రసిద్ధ మగు పాఠము. కావేరీతీరమం దున్న శ్వేతారణ్యమందు - మార్కండేయుని చిరాయువును గావించుటకు రుద్రుఁడు యముని సంహరించె నని యాశ్వేతారణ్యమాహాత్మ్యమునఁ బ్రసిద్ధము. కూర్మపురాణోత్తరఖండమున- పరమశైవుఁడును, రాజర్షియు నగు శ్వేతుఁ డనువాఁడు కాలంజర పర్వతమునఁ దపోనిష్ఠ నుండఁగా వాని జంపుటకు వచ్చిన యముని రుద్రుఁ డెడమపాదమునఁ దన్ని సంహరించె నని ముప్పదియాఱవ యధ్యాయమునఁ జెప్పఁబడెను. మరియు 'ఖరాదులందరును శివపూజారతులు' అని స్కాందమునం దుమాసంహితయందుఁ దొమ్మిదవ యధ్యాయమునఁ బ్రతిపాదింపఁబడెను. పార్వతింగూర్చి పరమేశ్వరుఁ డన్నమాట—" ఖరుఁడు ఖరపురమునందు (ఖరియాల్) లింగమును క్షీర

తతో రాజర్షయ స్సర్వే సంగతాః పరమర్షయః. ౪౯
ఏతస్మిన్నంతరే దేవా శ్చారణా స్సహ సంగతాః

లింగం క్షీరనద్యాస్తు దక్షిణే, దూషణోపి సమాసాద్య సహ్యాజాయాస్తు దక్షిణే. శ్రీమద్రత్నపురేశాన మగస్త్యేన సుపూజితం, త్రిశిరా దక్షిణే తీరే సహ్యాజాయా మనోహరే. సంపూజ్య బలినో జాతా దురాధర్షా స్సురై రపి, గోకర్ణే తపసారాధ్య దశగ్రీవో మహాబలః. కుంభకర్ణోపి తత్రైవ శివలింగార్చనం వ్యధాత్, విభీషణో మమ క్షేత్రే వారణాస్యామపూజయత్. పుండరీకపురే శంభు మింద్రజి త్సమపూజయత్, తథా బ్రహ్మపురే చాపి సూర్యపుష్కరిణీతటే. అతికాయ శ్శక్తిపురే వల్మీకేశస్య దక్షిణే, పూజయామాస విధివ త్ప్రతిష్ఠాప్య మహేశ్వరం. దుందుభిః పూజయామాస తత్ర వాయవ్యసంస్థితే, సార్ధయోజనమాత్రేతు దుందుభేశాభిదం శివం - ఇతి. పార్వత్యువాచ - శ్లో॥ భవదారాధకా స్సర్వే సాత్వికా జ్ఞానపూరితాః, దురాత్మానః కథం జాతా లోకోపద్రవకారిణః? శివః - మమారాధన మాఖ్యాతం త్రివిధం మునిసత్తమైః, సాత్వికం రాజసంచేతి తామసంచేతి తత్త్రిధా. సాత్వికా జ్ఞానవంతశ్చ రాజసా బలగర్వితాః, తామసా జ్ఞానహీనాశ్చ లోకోపద్రవకారిణః. విరాధోఽపి గతో ముక్తిం కా కథా జ్ఞానపూరితే! భక్త్యా కేచి న్మహాత్మానః కేచిత్ జ్ఞానేన యోగినః. అపరే సతతం ద్వేషా న్ముక్తి మాపు ర్గిరీంద్రజే! ఇతి.



౪౯-౫౧ వెంటనే రాజర్షులును, బ్రహ్మర్షులును గుంపులుగొని యచటికి
వచ్చిరి. సంతుష్టులై, యక్కజంపడుచు వారెల్లరు దుందుభుల మ్రో

నదికి దక్షిణముసను, దూషణుఁడు సహ్యాజానదికి దక్షిణమున నున్న శ్రీ రత్నపురేశ్వరుని యగస్త్యపూజితుని, త్రిశిరుఁడు సహ్యాజా దక్షిణపు మనోహరమగు తీరమునను యీశ్వరుని బూజించి బలవంతులై దేవతలకుఁగూడ భయపెట్టరానివా రయిరి. రావణుఁడు గోకర్ణమున నీశ్వరు నారాధించి మహాబలుఁడయ్యెను. కుంభకర్ణుఁడు నచ్చటనే శివలింగార్చనము గావించెను. విభీషణుఁడు నాక్షేత్రమగు వారణాశియందుఁ బూజించెను. ఇంద్రజిత్తు పుండరీక నగరమున శంభుని బూజించెను. అతికాయుఁడు సూర్యపుష్కరిణీతటమున నున్న బ్రహ్మపురమున-శక్తిపురమున వల్మీకేశునికి దక్షిణమున మహేశ్వరుని యథావిధిగఁ బ్రతిష్ఠ చేసి పూజించెను. దుందుభియు నచ్చట వాయవ్యమున నున్న నొకటిన్నరయోజనములదూరమున దుందుభేశుఁ డను నీశ్వరుని బూజించెను.” పార్వతి యిట్లనియె—మిమ్మారాధించువా రెల్లరు సాత్వికులు జ్ఞానపూరితులు గావలెఁగదా! లోకముల కుపద్రవము చేయు దుర్మార్గు లెట్లయిరి?-నా విని శివుఁ డిట్లనియె—మునిశ్రేష్ఠులు సాత్వికము, రాజసము, తామసము అని నా యారాధనము మూఁడువిధములుగాఁ జెప్పిరి. సాత్వికారాధన చేసినవారు జ్ఞానవంతులు. రాజసులు బలగర్వితులు. తామసులు జ్ఞానహీనులు, లోకోపద్రవకారకులు. జిజ్ఞాససంపన్నురాలా! పార్వతీ! విరాధుఁడుఁగూడ ముక్తిని బొందెనన్న నిఁక వేరే చెప్పునదేమి? కొందఱు మహాత్ములు భక్తిచేతను, కొందఱు యోగులు జ్ఞానముచేతను, మఱికొంద ఱెల్లపుడును పగ సాధించియు ముక్తిని బొందిరి.

దుందుభీం శ్చాభినిఘ్నంతః పుష్పవర్షం సమంతతః. ౫౦
రామ స్యోపరి సంహృష్టా వవర్షు ర్విస్మితా స్తథా
సభాజ్య ముదితా రామ మిదం వచన మబ్రువన్. ౫౧

ఏత దర్థం మహాతేజా మహేంద్రః పాకశాసనః
శరభంగాశ్రమం పుణ్య మాజగామ పురందరః. ౫౨
ఆనీత స్త్వ మిమం దేశ ముపాయేన మహర్షిభిః
త దిదం నః కృతం కార్యం త్వయా దశరథాత్మజ! ౫౩
సుఖం ధర్మం చరిష్యంతి దండకేషు మహర్షయః. ౫౩½

అర్ధాధికముహూర్తేన రామేణనిశితై శ్శరైః. ౫౪
చతుర్దశసహస్రాణి రాక్షసాం భీమకర్మణాం
ఖరదూషణముఖ్యాని నిహతాని మహాహవే. ౫౫
అహోబత మహత్కర్మ రామస్య విదితాత్మనః
అహో వీర్య మహోదాక్ష్యం విష్ణోరివ హి దృశ్యతే. ౫౬
ఇత్యేవ ముక్త్వా స్తే సర్వే యయు దేవా యథాగతం. ౫౬½

[1] జనస్థానం భూసురాణాం దదౌ వస్తుం రఘూద్వహః. ౫౭
[2] అరణ్యం దండహేతోర్హి జాతం తస్మా త్సదా నరాః
అముం దేశం వదిష్యంతి దండకారణ్య మేవహి. ౫౮
రామప్రసాదాత్ క్షేత్రాణి భవిష్యంతి తతో జనాః
రామక్షేత్ర మితి సదా వదిష్యంతి హి దండకం. ౫౯
దండకేన సమో దేశో నభూతో నభవిష్యతి. ౫౯½

1. ఆనంద రా. సారకాం. ౭ స. 2. ఆనంద. రాజ్యకాం. ౬ స.



యించిరి. పుష్పవర్షమును గురియించిరి. శ్రీరామచంద్రు నెంతో కొనియాడి, ముదమందుచు నిట్లు పలికిరి.

౫౨-౫౩½ శ్రీరామచంద్రా! ఈఖరదూషణాదివధకొఱకే మహాతేజస్వి యగు దేవేంద్రుఁడు శరభంగుని పుణ్యాశ్రమమునకు నాఁడరుదెంచెను. మహర్షులెల్లరు ని న్నుపాయముగా నీదేశమునకుఁ బిలిచికొనివచ్చుట యీరక్కసుల నుక్కడంచుటకే. ఓ దశరథకుమారా! శ్రీరామచంద్రా! మాకుఁ గావలసిన యీకార్యము నీచే జరుపఁబడినది. ఇఁక మహర్షులు దండకారణ్యములయందు సుఖముగాఁ దపస్సుమొదలగు ధర్మముల నాచరించెదరు.

౫౪-౫౬½ మూఁడు గడియలకాలములో శ్రీరామచంద్రునిచేఁ బదునైనబాణములచే భయంకరకర్ము లగు ఖరదూషణులు నాయకులై నడిపిన రక్కసులు పదునాల్గువేలమంది యుద్ధమున మడిసిరి. ఆహా! ఆత్మవిదుఁడగు శ్రీరామచంద్రుని యిక్కార్య మెంత చిత్రము! ఔరా! సాక్షాన్మహావిష్ణువుయొక్క వీర్యము సామర్థ్యము దోఁచుచున్నది. అని యీరీతి పలుకుచు నాదేవతలెల్లరును వచ్చినదారిం జనిరి.

౫౭. ౫౯½ శ్రీరామచంద్రుఁ డాజనస్థానమును బ్రాహ్మణులకు నివాసముగా నిచ్చెను. ఈప్రదేశము దండుఁడనువానివలన నేర్పడిన దగుటచే దీనిని దండకారణ్య మని జనులు పిలుతురు. శ్రీరాముని యనుగ్రహమువలన నిచట క్షేత్రము లేర్పడును. అందుచే నీదండకారణ్యమునే రామక్షేత్ర మనియు నెల్లపుడు ప్రజలు పిలుతురు ఈదండకముతో సమ మగు దేశ మిదివరకు లేదు. ముందుఁ గలుగదు.

1 ఏతస్మి న్నంతరే వీరో లక్ష్మణ స్సహ సీతయా. ౬౦
గిరిదుర్గా ద్వినిష్క్రమ్య సంవివే శాశ్రమం ప్రతి
తత్రో రామస్తు విజయీ పూజ్యమానో మహర్షిభిః. ౬౧
ప్రవివే శాశ్రమం వీరో లక్ష్మణే నాభిపూజితః. ౬౧½
* తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావహం.
౬౨

* త మితి- తౌతు యావంత ఏవాజౌ తావాంస్తు దదృశే స వై ఇత్యుక్తరీత్యా తాత్కాలికస్వేచ్ఛాగృహీత చతుర్దశసహస్రదివ్యమంగళవిగ్రహవత్తయా ప్రతిరాక్షసం ప్రత్యేకరామ ఇవ స్థిత్వా దృశ్యమాన మితి తచ్ఛబ్దార్థః. యద్వా—అర్ధాధికముహూర్తేన రామేణ నిశితై శ్శరైః, చతుర్దశసహస్రాణి రక్షసాం భీమకర్మణాం. ఖరదూషణ ముఖ్యానాం నిహతాని మహాహవ- ఇత్యుక్తరీత్యా ఇంద్రాదిభి రపి సంభూయాప్రధృష్యాన్ బలీయస శ్చతుర్దశసహస్రరాక్షసాన్ ఏకఏ వార్ధాధికముహూర్తేన స్వయమక్షతఏవ లీలయా సంహృత్య పురస్థితం. ' రామ! జామాతరం ప్రాప్య స్త్రియం పురుషవిగ్రహ ' మిత్యాత్మనా అజ్ఞానా త్పూర్వం విప్రలబ్ధ మితి వా తచ్ఛబ్దార్థః. యద్వా—తం దృష్ట్వా మహాసమరే అదృశ్యతయా స్థితం

1. వాల్మీకి రా. ౩౦ స.



౬౦-౬౧½ ఇంతలో వీరుఁ డగు లక్ష్మణుఁడు సీతతోఁ బర్వతదుర్గమునుండి వెడలి వచ్చి యాశ్రమమును బ్రవేశించెను. పిమ్మట వీరాగ్రేసరుడును, జయశాలియు నగు శ్రీరామచంద్రుఁడు మహర్షులచేత బూజింపఁబడినవాఁడై యాశ్రమములోఁ బ్రవేశించి లక్ష్మణునిచేఁ బూజింపఁబడెను.

౬౨-౬౨½ * శత్రుసంహారకుఁడును, మహర్షులకు సుఖము కలిగించినవాఁడు

* ఇట సంస్కృతమునఁగల తమ్ (వానిని అనఁగా నట్టిరాముని) అను పదమునకు భావము వివరింపఁబడుచున్నది. "ఎందరు రాక్షసులు ఖరదూషణాదియుద్ధమున నుండిరో, అందరు రాములుగా గోచరించెను." అని చెప్పఁబడినరీతిఁ దాత్కాలికముగ స్వేచ్ఛగా గ్రహించిన పదునాల్గువేల దివ్యమంగళవిగ్రహములు గలవాఁడై రాముఁడు ప్రతిరాక్షసునకుఁ బ్రత్యేకరామునివలె కనఁబడెననియు నట్టివానిని యని - లేక "అర్ధాధికముహూర్తేన" అనుదానిచేఁ జెప్పఁబడినరీతిగా, ఇంద్రాదులందరు గలిసినను జయింపరాని బలవంతు లగు పదునాల్గువేలరాక్షసులను, రాముఁ డొక్కఁడే మూఁడు గడియలలోఁ దాను నొవ్వకుండ విలాసముగా సంహరించి యెదుట నున్న వానిని అని-'రామజామాతరం' అని మున్ను అయోధ్యా కాండమున "శ్రీరామా! నన్ను విడిచి నీ వొక్కఁడవే యడవి కేగినచో నిన్నల్లునిగాఁ బొందిన కర్మప్రధానుం డగు నాతండ్రి బహిరంగంబుగఁ బురుషరూపమున నుండియు నాంతరంగికముగ మాత్రము స్త్రీ వని నిన్ను భావించును గాఁబోలు" అని తెలివి తక్కువతనముచే మున్ను తనచే దెప్పఁబడినవానిని అనియు-లేక యుద్ధసమయమునఁ గనఁబడక యిప్పుడు గన్పట్టుచున్నవానిని-లేక వీరవ్రణములనుండి స్రవించురక్తముతోడను, రోమకూపములనుండి

బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే. ౬౨

---

ఇదానీం దృష్ట్వా. యద్వా—తం దృష్ట్వా వీరవ్రణేన విగళ ద్రుధిరేణ రోమకూపోల్లసద్భిః పి ఘర్మపయఃకణౌఘైః, కోదండదండ మవలంబ్య వినీయ వర్మ కించి త్పరిశ్రమ భృతం ప్రియ మీక్ష్యమాణా-ఇత్యుక్తప్రకారం దృష్ట్వా-తం దృష్ట్వా - లతోద్గ్రథితజటామండలేన దృఢబద్ధకక్ష్యత యా స్కంధావలంబితూణీరేణ రణావసాననిర్వాపితకోపా గ్నితయా ప్రసన్నవదనేన సీతాలక్ష్మణమార్గావలోకనేనచ లక్షితం దృష్ట్వా—తం దృష్ట్వా పూర్వం వీర ఇతి శ్రుతం ఇదానీం నిర్వర్తితవీరకృత్యం దృష్ట్వా. దర్శనప్రకార మాహ - శత్రుహంతారం 'త్రైర్ధనూంషి ధ్వజాగ్రాణి వర్మాణిచ శిరాంసిచ, బాహూన్ సహస్తాభరణా నూరూన్ కరికరోపమాన్. చిచ్ఛేద సమరే రామ' ఇత్యుక్తప్రకారేణ శత్రుహంతారం హననవ్యాపారఏవ దృష్టః. నతు శరసంధానాదివ్యాపార ఇత్యర్థః. శత్రుపదేన దేవ గంధర్వాదిసంఘే సత్యపి శత్రూనేవ హతవా నిత్యుచ్యతే. కించ 'పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృ తాం, ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే' ఇతి స్వప్రతిజ్ఞాం పరిపాలయ న్నవతీర్యాసతో రాక్షసాన్ హత్వా సతా మృష్యాదీనాం జగన్మోహన దివ్యమంగళ స్వమూర్తిసాక్షాత్కారేణ పరమానందం సంపాదితవా నిత్యాహ - మహర్షిణాం సుఖావహ మితి. మహర్షిణాం



నగు నట్టి భర్తను శ్రీరామచంద్రుని జూచి జనకరాజకుమార్తె సంతో షాంతరంగయై గాఢముగాఁ గౌఁగిలించుకొనెను.

---

వెలువడు చెమటతోడను కోదండమును జేఁబూని కవచమును విప్పి, స్వల్పశ్రమను బొందిన శ్రీరాముని జూచినదై యనురీతిగా నున్న వానిని—లేక, తీఁగలచేఁ బైకెత్తికట్టఁబడిన జటామండలము గలిగి, గట్టిగా నడికట్టు కట్టుకొని, బుజములనుండి వ్రేలాడునమ్ములపొదులు గలవాఁడై యుద్ధము ముగిసిన తరువాతఁ జల్లారిన క్రోధాగ్ని గల వాఁ డగుటచే ప్రసన్న మగు ముఖముతో సీతాలక్ష్మణుల మార్గమునంకఁ జూచుచున్న వానిని-లేక, మునుపు వీరుఁ డని వినికిడిఁ బొంది యిప్పుడు వీరకృత్యమును నిర్వహించిన వానిని—జూచి సీత కౌఁగిలించుకొనెను అని చెప్పవచ్చును. చూచిన విధమును జెప్పు చున్నాఁడు (కవి)—'శత్రుసంహారకుని' అనుదానిచే రాక్షసుల ధనుస్సులు, ధ్వజాగ్రములు, కవచములు, తలలు, హస్తాభరణము లతోఁ గూడిన భుజములను, ఏనుఁగుతొండములవంటి తొడలను యుద్ధమున శ్రీరాముఁడు ఛేదించెను అని చెప్పఁబడినరీతిగా శత్రుసంహారకుఁడైనవానిని యని; ఆతని హననవ్యాపారమే కాని, బాణము వింటఁ దొడుగుట మొదలగు వ్యాపారములు కనబడలే దని యర్థము. ఇందలి శత్రుపదముచే నంత కోపమునందును దేవగంధ ర్వాదులను గాపాడుచు శత్రువులనే సంహరించువాఁ డని చెప్పఁ బడుచున్నది. మఱియు "సాధువుల రక్షించుటకును, దుర్మార్గుల నాశనముచేయుటకును, ధర్మమును స్థాపించుటకొఱకును, యుగ యుగమున నవతరించుచుందును" అని గీతలయందుఁ జెప్పఁబడిన రీతిఁ దనప్రతిజ్ఞను బరిపాలించుచు నవతరించి, దురాత్ము లగు రాక్ష సుఁ జంపి, మంచివా రగు ఋష్యాదుల జగన్మోహన మగు దివ్యమంగళవిగ్రహమును సాక్షాత్కరింపఁజేసి పరమానందముఁ జే కూర్చినవాఁ డని చెప్పుటకు 'మహర్షీణాం సుఖావహమ్' అని చెప్పఁబడెను. మహర్షులకుఁ దపోలేశముచే శత్రువులను సంహరించు సామర్థ్య మున్నను రక్షకుఁ డగు శ్రీరామునిస్వరూపమునకుఁ గాని, రక్ష్యభూతు లగు తమస్వరూపములకును హాని రాఁగూడ దని కేవ

ముదా పరమయా యుక్తా దృష్ట్వా రక్షోగణాన్ హతాన్. ౬౩

తపోలేశేన హంతుం సామర్థ్యేఽపి రక్షకస్వరూపస్య రక్ష్యభూతస్వరూపస్యచ హాని ర్మాభూ దితి కేవలం రక్షకవ్యాపారప్రతీక్షాణాం రామప్రతిజ్ఞా మేవావలోకయతాం సుఖావహాం. ఏహి పశ్య శరీరాణీత్యుక్త దుఃఖగంధం నివర్త్య సుఖస్యైవ ప్రాపకం బభూవ. బహుతరశత్రుగణాక్రమణాత్ రామస్యైకాకితయాచ పూర్వం సత్తారహితా సీతా సంప్రతి సత్తాం లేభే. జగత్త్రాణస్య రామస్య సత్తాలాభాత్ స్వయమపి సత్తా మవాప. 'ఆత్మావై పురుషస్య దారా' ఇతి శ్రుత్యుక్తరీత్యా శ్రీరామసత్తాలాభాత్ స్వస్యాపి సత్తా జాతేతి భావః. హృష్టా 'సతి ధర్మిణి ధర్మా' ఇతి న్యాయేన ధర్మిలాభానంతరం ధర్మహర్షోఽభూ దిత్యర్థః. యద్వా ఆంతరప్రీత్యంకురోపమరోమాంచాంచితేత్యర్థః. ఏవం శౌర్యాలోకనప్రీతిత్వే హేతుమాహ- వైదేహీ 'మిథిలాధిపతి ర్వీర' ఇత్యుక్తరీత్యా వీరకులప్రసూతత్వా దిత్యర్థః. 'భర్తారం పరిషస్వజే' తాదృశనిరవధికప్రేమభారభరితయా స్వయ మాలిలింగే. భర్తారం లోకభర్తారం; సర్వలోకమాతృత్వేన సర్వప్రజారక్షణం దృష్ట్వా పరిషస్వజే. ఆయుధక్షతవ్రణేషు సుఖోష్ణభూతస్వశరీరేణ పరిషస్వజే. పర్యాప్తం సస్వజే- పశ్చాత్పురస్తాత్ పార్శ్వతశ్చ పస్పర్శేత్యర్థః. యద్యపి రణే అపలాయమానస్య పృష్ఠే శరపాతప్రసంగఏవ నాస్తి. తథాపి



౬౩-౬౪ మఱియును, చనిపోయినరక్కసులమూఁకను సీతాదేవి జూచి మిగులసంతోషము గలదై తనచేత నున్న శ్రీరామముద్రాంకిత మగు

లము రక్షకునివ్యాపారమునే ప్రతీక్షించుచు, రామప్రతిజ్ఞనే గనిపెట్టువారు మహర్షు లనియు, నట్టివారికి సుఖము కలిగించువాఁడనియుఁ జెప్పఁబడెను. ఓ శ్రీరామచంద్రా! రమ్ము! మాయాశ్రమప్రాంతములఁ బడియున్న - రాక్షసులమూలమునఁ జనిపోయిపడియున్న— మునులయస్థిపంజరములఁ జూడు మని మునులు ప్రార్థించుచున్న సమయమునఁ గల వారలదుఃఖ మించుకైన లేకుండఁజేసి, వారికి సుఖమునే చేకూర్చినవాఁ డనియు దీనిచేఁ జెప్పఁబడెను. చాలమంది శత్రువులు దండెత్తివచ్చుటయు, రాముఁ డొంటరివాఁ డగుటచేతను ముందు స్థైర్యములేని సీత యిప్పుడు స్థైర్యము గల దయ్యెను. జగములకు రక్షకుఁ డగు రామునికి సత్త కలుగుటచే సీతయు సత్త గలిగిన దయ్యెను. "ఆత్మావై పురుషస్య దారాః" (భార్య పురుషున కాత్మస్వరూపురాలు) అను శ్రుతి ననుసరించి శ్రీరాముని సత్తాలాభమువలన సీతయు సత్త గలదయ్యెను అని భావము. "హృష్టా" (సంతోషాంతరంగయై) అనుటచే "సతి ధర్మిణి ధర్మాః" 'ధర్మముగలది యున్నప్పుడు ధర్మములు కలుగు' నను న్యాయముచే ధర్మి యగు శ్రీరామునిరాకచే ధర్మ మగు హర్షము సీతకుఁ గల్గెనని యర్థము. లేక, ఆంతర్యప్రీతియొక్క మొలకకుఁ బోలిక యగు రోమాంచము గలిగిన దని యర్థము. ఇట్లు రాముని శౌర్యమును జూచుటచే సీత సంతోషించుటకుఁ గారణము చెప్పఁబడుచున్నది.— 'వైదేహీ' విదేహరాజుకూఁతురు అని చెప్పఁబడినరీతిచే వీరులవంశమందుఁ బుట్టినది సీత; కనుక రాముని వీరత్వమునకు సంతోషించు నని సమన్వయము. 'భర్తను గాఁగిలించుకొనెను' అనఁగా నట్టి యంతులేని ప్రేమ కలది యగుటచే స్వయముగాఁ గాఁగిలించుకొనెను. 'భర్తను' అనఁగా లోకములకు భర్త రాముఁ డగుటవలన సర్వలోకములకుఁ దల్లి తానాటవలన సమస్తప్రజలను సంరక్షించిన యాతని జూచి కాఁగిలించుకొనెను. ఆయుధములదెబ్బలచేఁ గలిగినపుండ్లయందు సుఖముఁ గలిగించు నుష్ణమైన దనశరీరముచేఁ

1 పారితోషికరూపేణ దత్త్వా రామాంగుళీయకం
తత స్త్రయః పంచవట్యాం పున రాసన్ సుఖం ముదా. ౬౪

త్వరమాణ స్తతో గత్వా జనస్థానా దకంపనః
ప్రవిశ్య లంకాం వేగేన రావణం వాక్య మబ్రవీత్. ౬౫

జనస్థానస్థితా రాజన్ రాక్షసా బహవో హతాః
* ఖరశ్చ నిహత స్సంఖ్యే కథంచి దహ మాగతః. ౬౬

సర్వత స్సమావృత్య ఆయుధప్రక్షేపాత్ పృష్ఠతోఽపి వ్రణ సంభవః. బాణానాం సమ్యక్ క్షిప్తానాం పృష్ఠతో నిర్గమో ఽపి సంభవతి. మహర్షీణాం సుఖావహం పరిషస్వజే-పుత్రవిషయే భర్త్రోపకారకరణే పుత్రవాత్సల్యాత్ భర్తరి సంతుష్టా భార్యేవ ఋషిజనసంరక్షణేన సీతా భర్తారం రామం పరిషస్వజే త్యర్థః. అత్రైవ స్కాందోక్తపార్వతీపరమేశ్వరలీలానుసంధానకథానుసంధేయా ఇతి శివం.

* కథంచి దితి స్త్రీవేషధారణే నేతి భావః. అతఏవ శూర్పణఖా వక్ష్యతి స్త్రీవధం శంకమానేన రాఘవేణ మహాత్మ

1. శివరామాయణం.



నంగుళీయకమును బహుమానముగా శ్రీరామునకు సమర్పించెను. పిమ్మట వారుముగ్వురును మఱలఁ బంచవట్యాశ్రమముఁ బ్రవేశించి సంతోషముతో సుఖ ముండిరి.

౬౫ పిమ్మటఁ దొందరగా జనస్థానమునుండి యకంపనుఁ డను రావణుని చారుఁడు లంకలోఁ బ్రవేశించి, రావణునితో వేగపడుచు నిట్లు పలికెను.

౬౬ ఓరాజా! జనస్థానమున నున్న రాక్షసు లనేకులు చంపఁబడిరి. ఖరుఁడును చంపఁబడెను. నేనుమాత్ర *మెట్లో విడివడి పరుగెత్తి యిచటికి వచ్చితిని.

గాఁగిలించుకొనెను. పరి + సస్వజే = పర్యాప్తం సస్వజే-ముందు వెనుక ప్రక్కలఁ గూడఁ దాఁకునట్లు కౌఁగిలించుకొనెను. యుద్ధమునఁ బారిపోనివానికి వెనుకభాగమున బాణములు పడు నను ప్రసంగమే లేదు. అందుచే నచట గాయము లేర్పడవు గదా! సీతయంతట నేలఁ గౌఁగిలించుకొనవలెను? అన్నచో—శ్రీరాముని జుట్టిముట్టి రాక్షసులు బాణములను వైచుటవలన శరీరమంతయు గాయములు పడెను. అదిగాక తిన్నగాఁ బ్రయోగింపఁబడిన బాణములు వీపునుండి వెడలుటయుఁ గలుగును. కనుక నట్లయ్యె నని గ్రహించునది. 'మహర్షులకు సుఖముఁ గల్గించిన రాముని గౌఁగిలించుకొనెను.' అనుటచేఁ బుత్త్రులవిషయమున భర్త యుపకారము చేసినప్పుడు పుత్త్రులయెడఁ దనకుఁగల వాత్సల్యముచేత భర్తయెడల భార్య సంతుష్టురా లగును. అట్లే పుత్రసదృశు లగు ఋషులను రక్షించుటచేత లోకజనని యగు సీత లోకజనకుఁ డగు శ్రీరాముని స్వయముగాఁ గౌఁగిలించుకొనె నని యర్థము. ఇచ్చట స్కాందపురాణమందుఁ జెప్పఁబడిన పార్వతీపరమేశ్వరులలీలానుసంధానమును సమన్వయించుకొనునది. ఇది శుభము.

* ఎట్లో విడివడి వచ్చితిని అనఁగా స్త్రీవేషము వేసికొని వచ్చితి నని భావము. కావుననే శూర్పణఖ ముందు రావణునితోఁ జెప్పఁబోవు

ఏవ ముక్తో దశగ్రీవః క్రుద్ధ స్సంర క్తలోచనః
అకంపన మువా చేదం నిర్దహ న్నివ చక్షుషా. ౧౭

కేన రమ్యం జనస్థానం హతం మమ పరాసునా
క్రోహి సర్వేషు లోకేషు గతిం చాధిగమిష్యతి. ౧౮
నహి మే విప్రియం కృత్వా శక్యం మఘవతా సుఖం
ప్రాప్తుం వైశ్రవణే నాఽపి న యమేన న విష్ణునా. ౧౯

కాలస్య చా ప్యహం కాలో దహేయ మపి పావకం
మృత్యుం మరణధర్మేణ సంయోజయితు ముత్సహే. ౨౦

తథా క్రుద్ధం దశగ్రీవం కృతాంజలి రకంపనః
భయా త్సందిగ్ధయా వాచా రావణం యాచ తేఽభయం. ౨౧
దశగ్రీవో ఽభయం తస్మై ప్రదదౌ రక్షసాం వరః
సవిస్రబ్ధో ఽబ్రవీ ద్వాక్య మసందిగ్ధ మకంపనః. ౨౨
పుత్రో దశరథ స్యాస్తి సింహసంహననో యువా
రామో నామ వృషస్కంధో వృత్తాయతమహాభుజః. ౨౩

---

నేతి. కథంచిత్ పలాయనాదినా కథంచిత్ కేవలం ప్రేక్షక
తయా స్థితత్వా ద్రామబాణావిషయం కృత ఇత్యాశయః.



౧౭ అకంపనుఁ డిట్లు చెప్పఁగనే రావణుఁడు గోపమున మండిపడుచు గుడ్లెఱ్ఱఁజేసికొని, చూపుచేతనే లోకములను మాడ్చివేయువానివలె నుండి యకంపనునితో ని ట్లనియె.

౧౮-౧౯ చచ్చినవాఁ డెవ్వఁడు రమ్య మగు జనస్థానమును నాశనము చేసినాఁడు. ఇట్టి అకృత్యమును నాయెడఁ జేసి యెవ్వఁడు ముల్లోకములయందు గతిఁ బొందఁగలఁడు? నా కప్రియ మొనర్చి యింద్రుఁడైనను, కుబేరుఁడైనను, యముఁడైనను తుదకు విష్ణువైనను సుఖమును బొందలేఁడు.

౨౦ నేను యమునిపాలిటికి యముఁడను. అన్నిటిని దగులఁబెట్టు యగ్నిని గూడఁ దగులఁబెట్టెదను. మృత్యుదేవతకుసహితము మృత్యువుఁ జేకూర్ప నుత్సహింతును.

౨౧ అట్లు క్రుద్ధుఁడైన రావణునితో నకంపనుఁడు దోసిలొగ్గి భయముచే సందిగ్ధములైన మాటలతో నభయ మి మ్మని వేఁడుకొనెను.

౨౨ అంత రాక్షసశ్రేష్ఠుఁ డగు రావణుఁడు వాని కభయ మిచ్చెను. వాఁడును నమ్మి సంశయము లేకుండ జనస్థానమున జరిఁగినవిషయమును జెప్పఁదొడఁగెను.

౨౩ దశరథునకుఁ గుమారుఁ డొకఁడు గలఁడు. సింహమువంటి శరీరము గలవాఁడు. యువకుఁడు. రాముఁ డనువాఁడు. వృషభమువంటి మూఁపురము గలవాఁడు. గుండ్రములై దీర్ఘములైన భుజములు గలవాఁడు.

---

చున్నది— 'స్త్రీవధను శంకించి మహానుభావుఁ డగు రాముఁడు నన్ను వదలెను. మగవాఁ డనిపించుకొనువానినెల్లఁ జంపెను' అని. 'ఎట్లో' అనఁగాఁ బారిపోవుట, దాఁగుట మొదలగువానిచే నని కాని, కేవలము చూడవచ్చినవానివలె నుండుటవలనఁ గాని రామబాణమునకు గుఱికాలేదు అని యభిప్రాయము చెప్పనగును.

హతం తేన జనస్థానం ఖరశ్చ సహ దూషణః
అకంపనవచ శ్శ్రుత్వా రావణో వాక్య మబ్రవీత్. ౨౮

స సురేంద్రేణ సంయుక్తో రామ స్సర్వామరై స్సహ
ఉపయాతో జనస్థానం బ్రూహి కచ్చి దకంపన! ౨౯

అకంపన ఉవాచ—

నైవ దేవా మహాత్మానో నా౽త్ర కార్యా విచారణా
శరా రామేణ తూత్సృష్టా రుక్మపుంఖాపతత్రిణః. ౩౦
సర్పాః పంచాననా భూత్వా భక్షయంతిస్మ రాక్షసాన్
యేన యేనచ గచ్ఛంతి రాక్షసా భయకర్శితాః. ౩౧
తేన తేన స్మ పశ్యంతి రామమే వాగ్రత స్థ్సితమ్. ౩౨

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
అష్టమ స్సర్గః.



౨౮ వానిచేతనే జనస్థానము నాశనము సేయఁబడినది. దూషణుఁడును, ఖరుఁడును నాశనమైరి. ఇట్లకంపనుఁడు చెప్పిన వాక్యములు విని రావణుఁ డిట్లనియె.

౨౯ అకంపనా! ఆరాముఁడు దేవేంద్రునితోడను దేవతలందరితోడను గూడి జనస్థానమునకు వచ్చెనా యేమి? తెల్పుము.

అకంపనుఁ డిట్లనియె.

౩౦–౩౨ మహాత్ము లగు దేవతలు లేరు. ఈ విషయమున విచారింపవలసిన దేదియు లేదు. బంగారు తొడుగులుగలిగి రెక్కలు గల బాణములను, రాముఁడు ప్రయోగింపఁగా నవి యైదుముఖములుగల సర్పములై మనరాక్షసులను దినివేయుచున్నవి. వానిచే భయపీడితులై రాక్షసు లెచ్చ టెచ్చట నేయేదారులఁ బట్టి పోవుచున్నారో యాయా దారులలో వా రెదురుగా (భయముచే) రామునే చూచుచున్నారు.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమునం దెనిమిదవ సర్గము.

## నవమస్సర్గః.

[1]అకంపనవచ శ్శ్రుత్వా రావణో వాక్య మబ్రవీత్
జనస్థానం గమిష్యామి హంతుం రామం సలక్ష్మణమ్. ౧

అథైవ ముక్తే వచనే ప్రోవా చేద మకంపనః
అసాధ్యః కుపితో రామో విక్రమేణ మహాయశాః. ౨

ఆపగాయా స్సుపూర్ణాయా వేగం పరిహరే చ్ఛరైః
సతారగ్రహనక్షత్రం నభ శ్చా ప్యవసాదయేత్. ౩
అసౌ రామస్తు మజ్జంతీం శ్రీమా నభ్యుద్ధరే న్మహీం. ౩½

సంహృత్యవా పునర్లోకా న్విక్రమేణ మహాయశాః. ౪
శక్త స్స పురుషవ్యాఘ్ర స్స్రష్టుం పునరపి ప్రజాః. ౪½
నహి రామో దశగ్రీవ! శక్యో జేతుం త్వయా యుధి. ౫
రక్షసాం వాపి లోకేన స్వర్గః పాపజనై రివ. ౫½

న తం వధ్య మహం మన్యే సర్వై ర్దేవాసురై రపి. ౬

అయం తస్య వధోపాయ స్తం మ మైకమనా శ్శృణు
భార్యా తస్యోత్తమా లోకే సీతానామ సుమధ్యమా. ౭

1. వాల్మీకి రా. ౩౧ స.



## తొమ్మిదవసర్గము.

౧ అకంపనుఁడు చెప్పినమాటలు విని రావణుఁ డి ట్లనియె. ఓరీ! నేను లక్ష్మణునితోఁగూడియున్న రాముని జంపుట కిదే జనస్థానమునకుఁ బోయెదను.

౨ ఇట్లు రావణుఁ డనఁ బిమ్మట నకంపనుఁ డి ట్లనియె. మహాయశస్వి యగు రాముఁడు కుపితుఁ డయ్యె నేని విక్రమముచే లొంగువాఁడు కాఁడు (ఇందలి 'విక్రమ' అనుపదముచేఁద్రివిక్రమావతారము సూచింపఁబడినది).

౩-౩½ నిండేటివేగమును దనబాణములచే నడ్డగింపఁగలఁడు (ఇందు కృష్ణావతారము ధ్వనించును). చుక్కలు, గ్రహనక్షత్రములు వీనితోఁ గూడిన యాకాశమును రాల్పఁగలఁడు. (దీనిచేతను వామనావతారము సూచిత మగుచున్నది). మఱియు నాశ్రీమంతుఁడు సముద్రమున మునుఁగుభూమి నుద్ధరింపఁగలఁడు (ఇది మత్స్యావతారమును సూచించును). 'శ్రీమంతుఁడు' అనుటచే నేయవతారమునందును లక్ష్మి వెంటనే యుండు నని ధ్వని.

౪-౪½ మహాయశస్వియు, పురుషశ్రేష్ఠుఁడు నగు నారాముఁడు పరాక్రమముచే లోకములను బ్రజలను సంహరించి మఱల సృష్టింపఁగలవాఁడు.

౫-౫½ ఓదశగ్రీవా! నీవు యుద్ధమున శ్రీరాముని జయింపఁజాలవు. పాపాత్ములచే స్వర్గ మెట్లు జయింపఁబడదో, అట్లే రాక్షసులసమూహముచే రాముఁడు జయింపఁబడఁడు.

౬ దేవతలు, అసురులు నొక్కటై యెత్తివచ్చినను ఆరాముఁడు వధ్యుఁడు కాఁ డని నే ననుకొనుచున్నాను.

౭-౮ ఇదే వానిం జంపు నుపాయ మొక్కటి కలదు. దానిని శ్రద్ధతో వినుము. ఆ శ్రీరామునికి భార్య కలదు. ఆమె లోకమున నుత్తమురాలు. సీత యను పేరు గలది. చక్కనినడుము కలది. యౌవన

శ్యామా సమవిభక్తాంగీ స్త్రీరత్నం రత్నభూషితా
తస్యాపహర భార్యాం త్వంప్రమథ్యతు మహావనే. ౮
సీతయా రహితః కామీ రామో హాస్యతి జీవితం
[1] యద్యస్తి వంచనానామ తద్ధి నః కులజీవనం ! ౯

[2] అరోచయత తద్వాక్యం రావణో రాక్షసాధిపః
చింతయిత్వా మహాబాహు రకంపన మువాచహ. ౧౦
బాఢం కాలం గమిష్యామి హ్యేక స్సారథినా సహ
ఆనయిష్యామి వై దేహీ మిమాం హృష్టో మహాపురీం. ౧౧

అథైవ ముక్త్వా ప్రియయా ఖరయుక్తేన రావణః
రథే నాదిత్యవర్ణేన దిశ స్సర్వాః ప్రకాశయన్. ౧౨

స మారీచాశ్రమం ప్రాప్య తాటకేయ ముపాగమత్
మారీచే నార్చితో రాజా రావణో వాక్య మబ్రవీత్ ౧౩

ఆరక్షో మే హత స్తాత ! రామే ణాక్లిష్టకర్మణా
జనస్థాన మవధ్యం త త్సర్వం యుధి నిపాతితం. ౧౪

తస్య మే కురు సాచివ్యం తస్య భార్యాపహారణే
రాక్షసేంద్రవచ శ్శ్రుత్వా మారీచో వాక్య మబ్రవీత్. ౧౫

ఆఖ్యాతా కేన సీతాసా మిత్రరూపేణ శత్రుణా
త్వయా రాక్షసశార్దూల! కో నసందతి నిందితః. ౧౬

1. శివరామాయణం. 2. వాల్మీకి రా. ౩౧ స.



మున నున్నది. సమముగ విభజింపఁబడిన యవయవములు కలది. రత్నాంకితము లగు స్వర్ణభూషణములచే నలంకరింపఁబడిన స్త్రీరత్నము. ఆరామునిభార్యను మహారణ్యమున వంచించి నీవు హరింపుము. అట్లు సీతను నీవు హరించినచో, నామెయందే బద్ధానురాగుఁడగు రాముఁడు విరహబాధ నోర్వలేక ప్రాణముల వదలఁగలఁడు. లోకమున వంచన యనునది గలదేని యదియేకదా మనరాక్షసకులమునకు జీవనము !

౧౦ రాక్షసాధిపుఁ డగు రావణుఁ డామాటల కిష్టపడెను. మహాబాహుఁ డగు వాఁ డాలోచించి యకంపనునితో నిట్లనియె.

౧౧ మంచిది. నే నొక్కఁడనే సారథితోడ రేపుప్రాతఃకాలమున నటకేగెదను. జనకునికూఁతు రగు సీత నీలంకామహానగరమునకు సంతుష్టుఁడనై కొనివత్తును.

౧౨ అని యిట్లకంపనునితోఁ బలికి, పిశాచవదనములు గల కంచరగాడిదలను గట్టి, సూర్యునివలె వెలుంగు రథముచే నెల్లదిక్కుల వెలిగించుచు రావణుఁడు వెడలెను.

౧౩ మారీచు నాశ్రమమునకుం జని, తాటకకొడుకగు మారీచుని జేరి వానిచేఁ బూజింపఁబడి రా జగు రావణుఁ డిట్లు పలికెను.

౧౪ తండ్రీ ! మారీచా ! సమర్థుఁ డగు రామునిచే నా ఖరాది రాష్ట్రాంతపాలకులు చంపఁబడిరి. అవధ్య మగు జనస్థానమెల్ల వానిచే యుద్ధమునఁ గూల్పఁబడినది.

౧౫ ఆరాముని భార్యను హరించుటయందు నీవు నాకు సాహాయ్యము నొనర్పవలయును. (అని పలుక) రాక్షసరాజుమాట విని మారీచుఁ డిట్లని పలికెను.

౧౬ ఓరాజా ! మిత్రునివలెఁ గన్పట్టు శత్రువుఁ డెవ్వఁడు నీ కాసీతవృత్తాంతమును జెప్పెను ? ఓరాక్షసశ్రేష్ఠుఁడా ! ఏనీచుఁడు నీచేఁ దిరస్కరింపఁబడి నీ యైశ్వర్యాదులఁ జూచి గిట్టక యున్నాఁడో ?

సీతా మి హానయ స్వేతి కో బ్రవీతి బ్రవీహి మే
రక్షో లోకస్య సర్వస్య కశ్శృంగం ఛేత్తు మిచ్ఛతి. ౧౭

ప్రోత్సాహయతి కశ్చ త్త్వాం సహిశత్రురసంశయః. ౧౭½

అసౌ రణాంతస్థితిసంధివాలో విదగ్ధరక్షో మృగహా నృసింహః, సుప్త స్త్వయా బోధయితుం నయుక్త శ్శరాంగపూర్ణో నిశితాసిదంష్ట్రః. ౧౮-౧౮½

ప్రసీద లంకేశ్వర! రాక్షసేంద్ర! లంకాం ప్రసన్నో భవ సాధు గచ్ఛ, త్వం స్వేషు దారేషు రమస్వ నిత్యం రామ స్సభార్యో రమతాం వనేషు. ౧౯-౧౯½

ఏవ ముక్తో దశగ్రీవో మారీచేన స రావణః. ౨౦
న్యవ ర్తత పురీం లంకాం వివేశచ గృహోత్తమం. ౨౦½
[1]తత శ్శూర్పనఖీ దృష్ట్వా సహస్రాణి చతుర్దశ. ౨౧
హతా న్యేకేన రామేణ రక్షసాం భీమకర్మణాం
జగామ పరమో ద్విగ్నా లంకాం రావణపాలితాం. ౨౨
సా దదర్శ విమానాగ్రే రావణం దీప్తతేజసం
ఉపోపవిష్టం సచివై ర్మరుద్భిరివ వాసవం. ౨౩

1. వాల్మీకి రా. ౩౨ స.



౧౭ ఆసీత నెటకుఁ గొని రమ్మని నీతోఁ జెప్పినవాఁ డెవ్వఁడో నాకుఁ దెలుపుము. సకలరాక్షసలోకముయొక్క శిఖరమును (రాక్షసుల కెల్లరకుఁ బ్రధానపతి వగు నిన్ననుట) బగులఁగొట్టుటకుఁ గోరువాఁ డెవ్వఁడు?

౧౭½ ఎవ్వఁడో ని న్నీయకార్యమునకుఁ బ్రోత్సహించుచున్నాఁడు. వాఁడు నీపాలిఁటికి శత్రువే. సంశయము లేదు.

౧౮-౧౮½ యుద్ధాంగణమున ధైర్యమున నిలువఁబడుట యను రోమములతో నిండిన తోక గలిగి, పటుత్వముగల రాక్షసు లను మృగములఁ జంపెడిదై, బాణము లనెడి నఖాద్యాయుధములు గలిగి, వాఁడియైన కత్తు లను కోరలుగలదై సుఖముగ నిద్రించుచుండు అనఁగాఁ బరద్రోహవిముఖుఁడై యుండు లేక నీ కపకారముచేయువిషయమై యత్నింప కుండు పురుషశ్రేష్ఠుఁ డగు శ్రీరాముఁ డను సింహమును (నృసింహుని-మగసింగ మని ధ్వని) నీవు లేపఁ దగదు (యుద్ధాదులకుఁ బురికొల్పకు మనుట).

౧౯-౧౯½ ఓలంకాధిపతీ! రాక్షసపతీ! అనుగ్రహింపుము. ప్రసన్నుఁడవు కమ్ము! సుఖముగా లంకకుఁ బొమ్ము! ఎప్పుడు నీభార్యలతో నీవు క్రీడింపుము. శ్రీరాముఁడు తనభార్యతోఁ దా నడవులలోఁ గ్రీడించుఁగాక!

౨౦-౨౦½ అని యిట్లు మారీచుఁడు చెప్ప నారావణుఁడు మఱలి లంకానగరమునకుం బోయి తన ప్రాసాదమునఁ బ్రవేశించెను.

౨౧-౨౨ అటుపిమ్మట శూర్పణఖి భయంకరవ్యాపారు లగు పదునాల్గువేల రక్కసులు నొక్కరామునిచే నొక్కబాణముచేఁ గూల్పఁబడఁగాఁ జూచి, మిగుల వెఱఁగంది రావణపాలిత మగు లంకానగరమునకుఁ బోయెను.

౨౩ అచటఁ బుష్పకవిమానముపై మహాతేజముతో వెలుంగుచు మంత్రులతోఁగూడి-దేవతలతోఁగూడి యుండు నింద్రునివలె నాసీనుఁడై యున్న రావణుని శూర్పణఖి చూచెను.

దేవగంధర్వభూతానా మృషీణాంచ మహాత్మనాం
అజేయం సమరే శూరం వ్యాత్తానన మివాంతకం. ౨౪
దేవాసురవిమర్దేషు వజ్రాశనికృతవ్రణం
ఐరావత విషాణాగ్రై రుద్ఘృష్టకిణవక్షసం. ౨౫
వింశద్భుజం దశగ్రీవం దర్శనీయపరిచ్ఛదం
విశాలవక్షసం వీరం రాజలక్షణశోభితం. ౨౬
విష్ణుచక్ర నిపాతై శ్చ శతశో దేవసంయుగే
అన్యై శ్శస్త్రప్రహారై శ్చ మహాయుద్ధేషు తాడితం. ౨౭
ఉచ్ఛేత్తారంచ ధర్మాణాం పరదారాభిమర్శనం
పురీం భోగవతీం ప్రాప్య పరాజిత్యాచ వాసుకిం. ౨౮
తక్షకస్య ప్రియాం భార్యాం పరాజిత్య జహార యః
దశవర్షసహస్రాణి తప స్తప్త్వా మహావనే. ౨౯
* పురా స్వయంభువే ధీర శ్శిరాం స్యుపజహార యః
రావణం సర్వభూతానాం సర్వలోకభయావహం. ౩౦
రాక్షసీ భ్రాతరం శూరం సాదదర్శ మహాబలం
1 అమాత్యమధ్యే సంక్రుద్ధా పరుషం వాక్య మబ్రవీత్. ౩౧
ప్రమత్తః కామభోగేషు స్వైరవృత్తో నిరంకుశః
సముత్పన్నం భయం ఘోరం బోద్ధవ్యం నావబుధ్యసే. ౩౨

సక్తం గ్రామ్యేషు భోగేషు కామవృత్తం మహీపతిం
లుబ్ధం నబహుమన్యంతే శ్మశానాగ్ని మివ ప్రజాః. ౩౩

* స్వయంభువే రుద్రాయే త్యర్థః.

1. వాల్మీకి రా. 33 స.



౨౪-౩౧ అతఁడు దేవతలకును, గంధర్వులకును, ఇతరభూతములకును, మహాత్ములగు మహర్షులకును యుద్ధమున లొంగని మహాశూరుఁడు. దేవాసురయుద్ధములలో వజ్రాయుధపు దెబ్బలచే గాయములు వడి, ఐరావతము దంతములచే గీరఁబడి కాయలుగాచిన వక్షఃస్థలము గలవాఁడు. ఇరువది భుజములు గలవాఁడు. పది తలలుగలవాఁడు. కనువిందొనర్చు ఛత్రచామరాదులు గలవాఁడు. విశాలవక్షుఁడు. వీరుఁడు. రాజలక్షణశోభితుఁడు. దేవతలతో సంభవించిన పలు యుద్ధములలో విష్ణుచక్రము దెబ్బలను, మఱి పెక్కుయుద్ధముల యందు గొప్పగొప్ప యాయుధముల దెబ్బలను దిన్నవాఁడు. ధర్మములను జెఱచువాఁడు. పరస్త్రీలను జెఱఁబెట్టువాఁడు. భోగవతీ నగరమునకుఁ బోయి వాసుకిని జయించి, తక్షకుని జయించి వాని ప్రియభార్యను హరించినవాఁడు. ఒకప్పుడు మహావనమునఁ బదివేల సంవత్సరములు తపస్సుచేసి, తనపదితలలను నరకి వానిని * స్వయంభువునకుఁ (రుద్రునకు) బూజాద్రవ్యములుగా నర్పించిన ధీరుఁడు. సర్వభూతముల నేడ్పించువాఁడు. (ఇందుచేతనే రావణుఁ డను పేరఁ బ్రఖ్యాతి గన్నవాఁడు). సకలలోక భయంకరుఁడు. ఇట్టి లక్షణములు గల శూరుఁడును దన కన్నయు నగు రావణు నా రాక్షసి చూచెను. వానితో నున్న యా పెద్దబలగమును జూచెను. అది - మంత్రులందఱినడుమ మహాకోపముతోఁ బరుషమైన యీ వాక్యముఁగూడ పల్కెను.

౩౨ ఓరావణా! మంచిది కామభోగముల నిష్టమువచ్చిన ట్లనుభవించుచు, నిరంకుశుఁడవై, నీకుఁ దటస్థించిన ఘోరమైన భయమును నీవు దెలిసికొనవలసినదానిని దెలియకున్నావు.

౩౩ తుచ్ఛసుఖములఁ దగులువడి, స్వేచ్ఛావ్యాపారుఁ డగు త్యాగశూన్యుఁడైన రాజును బ్రజలు శ్మశానమందలి యగ్ని నట్లే యగౌరవపఱతురు.

* 'స్వయంభువు' అనఁగా 'రుద్రుఁడు' అని యిచ్చటి యర్థము.

స్వయం కార్యాణి యః కాలే నానుతిష్ఠతి పార్థివః
సతు వై సహరాజ్యేన తైశ్చ కార్యై ర్వినశ్యతి. ౩౪

ఆత్మనద్భి ర్విగృహ్య త్వం దేవగంధర్వదానవైః
అయుక్తచార శ్చపలః కథం రాజా భవిష్యసి. ౩౫

త్వంతు బాలస్వభావశ్చ బుద్ధిహీనశ్చ రాక్షస!
జ్ఞాతవ్యంతు నజానీషే. కథం రాజా భవిష్యసి. ౩౬

[1] సాంబోపి మే హతః పుత్రి స్తప్యమానో నిరర్థకం.
యద్యస్తి పౌరుషం కించి త్తర్హి సీతాం సమానయ. ౩౭
నోచే త్వధోముఖ స్తిష్ఠ యథా స్త్రీ గతభర్తృకా. ౩౭½

[2] చతుర్దశసహస్రాణి రాక్షసాం క్రూరకర్మణాం. ౩౮
హతా న్యేకేన రామేణ ఖరశ్చ సహదూషణః
ఋషీణా మభయం దత్తం కృతక్షేమాశ్చ దండకాః. ౩౯
త్వంతు లుబ్ధః ప్రమత్తశ్చ పరాధీనశ్చ రాక్షస!
నానుతిష్ఠతి కార్యాణి భయేషు నబిభేతిచ. ౪౦
క్షిప్రం రాజ్యా చ్చ్యుతో దీన స్తృణై స్తుల్యో భవిష్యతి.
౪౦½

[3] తత శ్శూర్పణఖాం క్రుద్ధాం బ్రువంతీం పరుషం వచః. ౪౧

1. ఆనందరా. సారకాం ౭ స. 2. వాల్మీకి రా. ౩౩ స.
3. వాల్మీకి రా. ౩౪ స.



౩౪ ఏరాజు స్వయముగ సమయానుకూలముగఁ జేయవలసినపనులను జేయఁడో; అట్టిరాజు రాజ్యముతో నాకార్యములతోఁ గూడ నశించును.

౩౫ ఓరావణా! సమయము గనిపెట్టి నీ కపకారము చేయఁ బ్రయత్నపడు దేవగంధర్వదానవులతో విరోధము పెట్టుకొని, తగనిచారులను గూడి, విషయసుఖములయందుఁ జపలుఁడవైన నీ వెటుల రాజ వగుదువు?

౩౬ ఓరాక్షసా! నీవు వివేకశూన్యుఁడవు. నీకు బుద్ధి లేదు. నీ వెఱుఁగఁదగిన యంశము నెఱుఁగఁజాల కున్నావు. నీవు రాజ వెట్లగుదువు?

౩౭-౩౭½ నీసేమము కోఱ కనియే తపము చేయుచున్న నాపుత్రుఁడు సాంబుఁ డనువాఁడు వ్యర్థముగ నీయుపేక్షచేఁ జచ్చెను. నీ కేమైన రవ్వంత పౌరుషమున్నచో, నీసోదరిని బరాభవించి, నీమేనల్లుని జంపిన వారికిఁ బ్రతిశిక్ష సేయఁగల్గినచో సీత నిటకుఁ గొనితెమ్ము. లేనిచో భర్తచచ్చిన యాడుదానివలె మొగము వంచుకొని పడియుండుము.

౩౮-౩౯ క్రూరకర్ము లగు పదునాల్గువేలమంది రాక్షసులును, ఖరుఁడును, దూషణుఁడును ఒక్క రామునిచేఁ జచ్చిరి. ఋషులకా యభయ మీయఁబడెను. దండకారణ్యములకు క్షేమము సేకూరెను.

౪౦-౪౦½ ఓరావణా! నీ వన్నో లుబ్ధుఁడవు (చారుల కింత యిచ్చి సంతోషపెట్టువాఁడవు కా వనుట), మత్తెక్కి పరాధీనుఁడవు నై యున్నాఁడవు. సమయ మెఱిఁగి పనులఁ జక్కపెట్టఁడు. భయపడ వలసినపుడు భయపడఁడు. అట్టిరాజు శీఘ్రముగ రాజ్యభ్రష్టుఁడై దీనుఁడై గడ్డిపఱకలతో సమానుఁ డగును.

౪౧-౪౨ పిమ్మట రావణుఁ డిట్లు కుపితయై కఠినవచనములఁ బలుకుచున్న శూర్పణఖను జూచి (శత్రులయెడ) మిగుల కోపించి మంత్రుల నడుమ రాముఁ డెవఁడు? ఎట్టితేజముగలవాఁడు? ఎట్టిరూపము

అమాత్యమధ్యే సంక్రుద్ధః పరిపప్రచ్ఛ రావణః
కశ్చ రామః కథం వీర్యః కిం రూపః కిం పరాక్రమః. ౪౨
శూర్పణ ఖ్యువాచ—
దీర్ఘ బాహు ర్విశాలాక్ష శ్చీరకృష్ణాజినాంబరః
కందర్పసమరూపశ్చ రామో దశరథాత్మజః. ౪౩

నాదదానం శరాన్ ఘోరా నముంచంతం శిలీముఖాన్
నకార్ముకం వికర్షంతం రామం పశ్యామి సంయుగే. ౪౪
హన్యమానంతు తత్సైన్యం పశ్యామి శరవృష్టిభిః. ౪౪½

ఏకా కథంచి న్ముక్తాహం పరిభూయ మహాత్మనా. ౪౫
స్త్రీవధం శంకమానేన రామేణ విదితాత్మనా
కనీయా ననుజ స్తస్య లక్ష్మణోఽపి తథావిధః. ౪౬

రామస్యతు విశాలాక్షీ పూర్ణేందుసదృశాననా
ధర్మపత్నీ ప్రియా భర్తు ర్నిత్యం ప్రియహితే రతా. ౪౭
ఆనేతు మహ ముద్యుక్తా తాం భార్యార్థం తవానఘ. ౪౭½

లక్ష్మణోనామ తద్భ్రాతా చిచ్ఛేద మమ నాశికాం. ౪౮
కర్ణౌచ; చోదిత స్తేన రామేణ స మహాబలః. ౪౮½

తతో ఽహ మతిదుఃఖేన రుదంతీ ఖర మన్వగాం. ౪౯



గలవాఁడు? ఎట్టిపరాక్రమము గలుగువాఁడు? అని యడిగెను.

అంత శూర్పణఖ యిట్లనియె—

౪౩ రాముఁ డాజానుబాహుఁడు. విశాలనేత్రుఁడు. నారచీరలు, కృష్ణాజినములును వస్త్రములుగాఁ దాల్చువాఁడు. మన్మథునితో సమానమగు రూపము కలవాఁడు. దశరథకుమారుఁడు (శూర్పణఖ మోహాతిశయముచే రాముని సౌందర్యమునే ముందుగఁ జెప్పె నని గ్రహించునది).

౪౪-౪౪½ అమ్ములపొదులనుండి ఘోరము లగు బాణముల నెత్తుచుండఁగాఁ గాని, వానిని విడుచుచుండఁగాఁ గాని, ధనువున నారి లాఁగి యెక్కిడుచుండఁగాఁగాని రాముని నేను యుద్ధమునఁ జూడ లేదు. కాని యాతఁడు గురిసిన శరవర్షములచేఁ జచ్చి పడిన రక్కసుల సేననుమాత్రము చూచితిని.

౪౫-౪౬ ఆత్మజ్ఞుఁడును, మహాత్ముఁడు నగు నారామునిచే నే నొక్కతె మాత్రము స్త్రీవధ చేయరా దను శంకించువాఁ డగుటచే నెట్లో విడువఁబడితిని. ఆరాముని చిన్నతమ్ముఁ డగు లక్ష్మణుఁ డన్నివిధముల నన్నకుఁ దీసిపోఁడు.

౪౭-౪౭½ ఆరాముని ధర్మపత్ని విశాలములైన నేత్రములు గలది. పున్నమ చందురునివంటి ముఖము గలది. భర్తకుఁ జాల ప్రియురాలు. ఎల్లప్పుడు నాతని హితమునే కోరునది. ఓ పాపరహితుఁడా! చంద్రు నీకు భార్యనుగా నామెను గొని తేవలె నని యత్నించితిని.

౪౮-౪౮½ మహాబలుఁడును, రామానుజుఁడు నగు లక్ష్మణుఁడు శ్రీరామచంద్రునిచేఁ బ్రేరేపింపఁబడినవాఁడై నాముక్కు సెవులఁ గోసెను.

౪౯ అంత నతిదుఃఖముతో నేడ్చుచు ఖరునికడకుఁ బోయితిని.

సోఽపి రామం సమాసాద్య యుద్ధం రాక్షసయూథపైః
కృత్వా వినష్ట స్సహసా రాక్షసై స్సహ సంయుగే. ౨౦

యది రామో మనః కుర్యా త్త్రైలోక్యం నిమిషార్ధతః
భస్మీకుర్యా న్నసందేహ ఇతి భాతి మమ ప్రభో! ౨౧

సాక్షా ద్రామస్య పురతః స్థాతుం త్వం నక్షమః ప్రభో!
మాయయామోహయిత్వాతుప్రాప్యసేతాంరఘూత్తమాత్
1 భార్యావియోగదుర్బుద్ధి స్తత స్స నభవిష్యతి. ౨౨½

ఐక్ష్వాకేణ పురాపి కౌశికమఘా దారభ్య లంకేశ్వరో
ధత్తే శాశ్వతికం విరోధ మధునా ప్యేతే హతా బాంధవాః
ఉత్సాహప్రభుమంత్రశక్తిభి రలం భూష్ణు శ్ఛలజ్ఞో బలీ
దృప్త శ్శూర్పణఖావికార మపరం దృష్ట్వా కథం మృష్యతే. ౨౩-౨౩½

2 శ్రుత్వా తత్సాన్త్వవాక్యైశ్చ దానమానాదిభి స్తథా ౨౪
ఆశ్వాస్య భగినీం రాజా ప్రవివేశ స్వకం గృహం. ౨౪½

తత్ర చింతాపరో భూత్వా నిద్రాం రాత్రౌ నలబ్ధవాన్. ౨౫

ఏకేన రామేణ కథం మనుష్యమాత్రేణ నష్ట స్సబలః ఖరో
మే, యద్వా న రామో మనుజః పరేశో మాం హం
తుకామ స్సబలం బలౌఘైః. ౨౬

1. హనుమద్రామాయణం. 2. అధ్యాత్మ రా. ౫ స.



౨౦ ఆఖరుఁడు రాక్షససేనానాయకులతో రాము నెదుర్కొని యుద్ధము చేసి, యారక్కసు లందరితోఁ గూడ వెంటనే యుద్ధమునఁ జచ్చెను.

౨౧ ఓరాక్షసప్రభూ! శ్రీరాముఁడు తలఁచెనా యర్ధనిమిషములో ముల్లోకములను భస్మము చేయఁగలఁడు. సంశయము లేదు. ఇట్లు నాకుఁ దోఁచుచున్నది.

౨౨-౨౨½ నీవు రాముని యెట్టయెదుట నిలువఁజాలవు. మాయచే మోహింపఁజేసి యామెను రఘూత్తమునినుండి తేఁగలవు. భార్యావియోగముచే మతిచెడి పిమ్మట నారాముఁ డుండఁడు.

౨౩-౨౩½ రావణుఁడు మున్నే విశ్వామిత్రునియాగము మొదలుకొని యిక్ష్వాకువంశజుఁ డగు శ్రీరామునితో శాశ్వతవైరము పెట్టుకొనియున్నాఁడు. ఇప్పుడో యీబంధువులు రామునిచేఁ జంపఁబడిరి. అది యట్లుండె, ఇప్పుడు శూర్పణఖయొక్క వికారము నింకొకటి చూచియు, ఉత్సాహప్రభుమంత్రశక్తులచేఁ గూడి బలవంతుఁడై మదించి యుండి యెట్లు సహింపఁగలఁడు?

౨౪-౨౪½ అట్లు శూర్పణఖ చెప్పినదెల్లను విని, బహుమానము లిచ్చి, గౌరవించి, మంచిమాటాడి చెల్లెలి నోదార్చి రావణరాజు తన గృహమునకుఁ బోయెను.

౨౫ అచ్చటఁ జింతాపరుఁడై రాత్రి నిదురింపలేదు.

౨౬ ఆహా! మనుష్యమాత్రుఁ డగు నొక్కరామునిచే సేనాసహితముగ మాఖరుఁ డెట్లు నాశన మొందెను? శ్రీరాముఁడు మనుజుఁడు కాఁ డేమో? బలగముతోఁ గూడియున్న నన్ను బలసమూహముచే సంహరింపఁగోరి వచ్చిన పరాత్పరుఁడే కావచ్చును.

సంప్రార్థితో ఽయం ద్రుహిణేన పూర్వం మనుష్యరూపో
ఽద్య రఘోః కులే ఽభూత్, వధ్యో యది స్యాం పరమా
త్మనాహం వైకుంఠరాజ్యం పరిపాల యేఽహం. ౫౭
నోచే దిదం రాక్షసరాజ్య మేవ భోక్ష్యే చిరం రామ మ
తో వ్రజామి, విరోధబుద్ధ్యైవ హరిం ప్రయామి ద్రుతం
నభక్త్యా భగవాన్ ప్రసీదేత్. ౫౮

[1] తత్కార్య మనుగమ్యాథ యథావ దుపలభ్యచ
దోషాణాంచ గుణాంచ సంప్రధార్య బలాబలం. ౫౯
ఇతి కర్తవ్య మిత్యేవ కృత్వా నిశ్చయ మాత్మనః
యానశాలాం తతో గత్వా ప్రచ్ఛన్నో రాక్షసాధిపః. ౬౦
కాంచనం రథ మాస్థాయ కామగం రత్నభూషితం
పిశాచవదనై ర్యుక్తం ఖరైః కాంచనభూషణైః. ౬౧
రాక్షసాధిపతి శ్శ్రీమాన్ యయౌ నదనదీపతిం. ౬౧½

తంతు గత్వా పరం పారం సముద్రస్య నదీపతేః. ౬౨
దదర్శ నియతాహారం మారీచం నామ రాక్షసం. ౬౨½

మారీచే నార్చితో రాజా సర్వకామై రమానుషైః. ౬౩

తం స్వయం పూజయిత్వాతు భోజనే నోదకేనచ.
అర్థోపహితయా వాచా మారీచో వాక్య మబ్రవీత్. ౬౪

1. వాల్మీకి రా. ౩౫ స.



౫౭-౫౮ నన్నుఁ జంపుటకై మును బ్రహ్మచేఁ బ్రార్థింపఁబడి మనుష్య రూపమున నిప్పుడీ రఘువంశమున నాపరమాత్మ పుట్టినాఁడు. ఒక వేళ నే నాపరమాత్మచేత నే చావవలసినవాఁడ నగుచో వైకుంఠ రాజ్యము నే పాలించెదను (అట నున్న భోగముల నెల్ల విశృంఖలముగా ననుభవించెద ననుట). లేదా చిరకాల మీ రాక్షసరాజ్యము నే యనుభవింతును. కనుక నే నిప్పుడు రామునియొద్దికి వెడలెదను. విరోధబుద్ధిచేత నే హరిని బొందెదను. భక్తిచే భగవంతుఁడు వేగముగ ననుగ్రహముఁ జూపఁడు.

౫౯-౬౧½ అని యిట్లు రావణుఁడు తాఁ జేయవలసిన పనినిగురించి పర్యాలోచించి, 'యిది యిట్లు చేయవలెను' అని యొకదారి కనిపెట్టి, దానిలోఁ గల గుణదోషములను, ప్రాబల్యదౌర్బల్యములను జర్చించుకొని 'యిది యీవిధముగా నే జరుగవలసినది' యని తుదకుఁ దనలో నిశ్చయము చేసికొని, పిమ్మట మారువేసముతో నారక్కసుల ఱేఁడు వానశాల కతేఁగి ; కాంచనమయమై, కోరిన కెల్ల నడచునదై, రత్నాలంకృతమై స్వర్ణభూషణములచే నలంకరింపఁబడినదై పిశాచముఖములు గల కంచరగాడిదలఁ బూన్చిన రథ మెక్కి శ్రీమంతుఁ డగు నారాక్షసరాజు సముద్రముకడకుఁ బోయెను.

౬౨-౬౨½ ఆసముద్రము నవ్వలియొడ్డునకుఁ బోయి (గోకర్ణతీరమందలి యాశ్రమమున నున్న) ఆహారనియమము కల మారీచుఁ డను రాక్షసుని గాంచెను.

౬౩ అట నామారీచునిచే నమానుషము లగు సర్వవిధభోగ్యపదార్థముల చేతను రా జగు రావణుఁడు పూజింపఁబడెను.

౬౪ మారీచుఁ డారాజును స్వయముగా నన్నపానములచేఁ బూజించి, అర్థవంత మగు నీవాక్యము పలికెను.

కచ్చి త్సుకుశలం రాజన్ ! లంకాయాం రాక్షసేశ్వర !
కే నార్థేన పున స్త్వం వై తూర్ణమేవ మి హాగతః. ౬౫

రావణ ఉవాచ—

1 మారీచ ! శ్రూయతాం తాత ! వచనం మమ భాషతః
ఆర్తో ఽస్మి మమ చార్తస్య భవాన్ హి పరమా గతిః. ౬౬

యేన వైరం వినారణ్యే సత్వ మాశ్రిత్య కేవలం
కర్ణనాసాపహరణా ద్భగినీ మే విరూపితా. ౬౭
తస్య భార్యాం జనస్థానా త్సీతాం సురసుతోపమాం
ఆనయిష్యామి విక్రమ్య సహాయ స్తత్ర మే భవ. ౬౮

వీర్యే యుద్ధేచ దర్పేచ న హ్యస్తి సదృశ స్తవ
ఉపాయజ్ఞో మహాశూర స్సర్వమాయావిశారదః. ౬౯

శృణు తత్కర్మసాహాయ్యే య త్కార్యం వచనా న్మమ
సౌవర్ణ స్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిందుభిః. ౭౦
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర. ౭౦½

2 త్వాంతు మాయామృగం దృష్ట్వా కాంచనీం జాతవిస్మయా
ఆనయైన మితి క్షిప్రం రామం వక్ష్యతి మైథిలీ. ౭౧-౭౧½

అపక్రాంతేతు కాకుత్స్థే దూరం యాత్వా ప్యుదాహర.
హాసీతే! లక్ష్మణే! త్యేవం రామవాక్యానురూపకం. ౭౨-౭౨½

1. వాల్మీకి రా. ౩౬ స. 2. వాల్మీకి రా. ౪౦ స.



౬౫ ఓరాజా ! రాక్షసప్రభూ ! లంకయందం దఱికిఁ గుశలమే కదా ! ఏప్రయోజనముపై నీ వింతలోనే తిరిగి యిచటికి వచ్చితివి ?

రావణుఁ డి ట్లనియె.—

౬౬ తండ్రీ ! మారీచా ! నేను సెప్పఁబోవుమాటను వినుము. నే నిప్పుడు దీనుఁడ నైతిని. ఈదీనుఁడ నగు నాకు నీవే ముఖ్యమైన దిక్కు.

౬౭-౬౮ ఏరాముఁ డరణ్యమున నెట్టివైరకారణము లేకుండఁగనే కేవలము బలమునే యూఁతగొని కారడవిలో, ముక్కు చెవులు గోసి నా చెలియలిని విరూపఁ జేసెనో ఆరాముని పెండ్లామును, సీత యను దానిని, దేవకన్యలతో సమానురా లగుదానిని బరాక్రమించి జన స్థానమునుండి గొనిపత్తును. అందు నీవు నాకు సహాయుఁడవు కమ్ము !

౬౯ పరాక్రమమున, దర్పమున, యుద్ధమున నీకు సమానుఁ డింకొకఁడు లేఁడు. ఉపాయశాలివి, మహాశూరుఁడవు, సర్వమాయలయం దారితేరినవాఁడవు.

౭౦-౭౦½ నాకు సాహాయ్యమున నీవు చేయవలసిన పని యేదియో వినుము ! తెల్లని వెండిచుక్కలతోఁ గూడి చిత్రవర్ణము గల బంగరులేడివై నీ వారాముని యాశ్రమప్రాంతముల సీత యెదుటఁ దిరుగాడుము.

౭౧-౭౧½ అప్పుడు స్వర్ణ మయ మగు మాయామృగమవైన నిన్ను జూచి జనకరాజకుమార్తె యాశ్చర్యపడి వెంటనే దీనింబట్టి తెమ్మని రాము నితో ననును.

౭౨-౭౨½ (వెంటనే రాముఁడు వెనువెంట నన్ను దఱుముకొని వచ్చును.) నీ వాతనిం గడుదూరముగఁ దీసికొనిపోయి, రామునిమాటపోలికను హాసీతా ! లక్ష్మణా ! యని యార్పు వెట్టుము.

ప్రలోభయిత్వా వై దేహం యథేష్టం గంతు మర్హసి. ౨౩

తచ్ఛ్రుత్వా రామపదవీం సీతయాచ ప్రబోధితః
అనుగచ్ఛతి సభ్రాంత సౌమిత్రిరపి సౌహృదాత్. ౨౪

[1] తత స్తయో రపాయేతు శూన్యే సీతాం యథాసుఖం
నిరాబాధో హరిష్యామి రాహు శ్చంద్రప్రభా మివ. ౨౫

[2] తా మాదా యాపనేష్యామి తత స్స న భష్యతి
భార్యావియోగదుర్బుద్ధి; రేత త్సాహ్యాం కురుష్వ మే. ౨౬

[3] తస్య రామకథాం శ్రుత్వా మారీచస్య మహాత్మనః
శుష్కం సమభవ ద్వక్త్రం పరిత్రస్తో బభూవహ. ౨౭

ఓష్ఠౌ పరిలిహన్ శుష్కౌ నేత్రై రనిమిషై రివ
మృతభూత ఇవా ర్త స్తు రావణం సముదైక్షత. ౨౮

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
నవమ స్సర్గః.



1. వాల్మీకి రా. ౩౬ స. 2. భారతే ఆరణ్యపర్వణి ౧౭౭ అధ్యాయే.
3. వాల్మీకి రా. ౩౬ స.



౨౩ అట్లు సీతను మోసపుచ్చి నీయిష్టము వచ్చినట్లు పోవచ్చును.

౨౪ ఆధ్వని విని సుమిత్రాపుత్రుఁ డగు లక్ష్మణుఁ డన్నమీఁది ప్రేమచేతను, సీతచేఁ బ్రేరితుఁ డయ్యును తోట్రుపడి రాము జాడఁబడి వడివడిపోవును.

౨౫ పిమ్మట వారిద్దరును సీతను విడిచిపోఁగా నామెను శూన్యముగ నుండు ప్రదేశమున నున్న దగుటచే నేబాధయు లేకుండ సుఖముగ రాహువు చంద్రునికాంతి నపహరించునట్లు హరించెదను.

౨౬ అట్లామెను హరించి, వారినుండి యెడఁబాపెదను. పిమ్మట భార్యావియోగముచే మతిచెడి రాముఁ డుండఁడు. ఈ సాహాయ్యము నీవు నాకుఁ జేయుము.

౨౭ ఇట్లు రావణుఁడు చెప్పఁగా శ్రీరామునికథను వినినంత మహాత్ముఁ డగు మారీచుని మొగ మెండిపోయెను. వాఁడు మిక్కిలి భయపడెను.

౨౮ ఎండిపోయిన పెదవులను నాలుకం దడుపుకొనుచు ఱెప్పవాల్పక మారీచుఁడు చచ్చినవానివలె నై ఆర్తుఁడై రావణునివంకఁ జూచెను.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమున
దొమ్మిదవ సర్గము.



## దశమ స్సర్గః.

1 తచ్ఛ్రుత్వా రాక్షసేంద్రస్య వాక్యం వాక్యవిశారదః
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో మారీచో రాక్షసేశ్వరం. ౧
సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్యతు పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః. ౨

శరార్చిష మనాధృష్యం చాపఖడ్గేంధనం రణే
రామాగ్నిం సహసా దీప్తం నప్రవేష్టుం త్వ మర్హసి. ౩
దీప్తస్యేవ హుతాశస్య శిఖా సీతా సుమధ్యమా
న సాధర్షయితుం శక్యా మైథి ల్యోజస్వినః ప్రియా. ౪
2 విశ్వామిత్రాశ్రమే పూర్వ మనుభూయ మహద్భయం
దండకే మృగరూపేణ చరంతం సోఽపి వీక్ష్య మాం. ౫
జ్ఞాత్వా సర్వమృగా న్హిత్వా ముక్తవా న్మయి సాయకం
3 శరేణ ముక్తో రామస్య కథంచి త్ప్రాప్య జీవితం. ౬
ఇహ ప్రవ్రాజితో యుక్త స్తాపసోఽహం సమాహితః. ౬½

వృక్షేవృక్షేచ పశ్యామి చీరకృష్ణాజినాంబరం. ౭
గృహీతధనుషం రామం పాశహస్త మివాంతకం. ౭½

1. వాల్మీకి రా. ౩౭ స. 2. శివరామాయణం. 3. వాల్మీకి రా. ౩౯ స.



## పదియవసర్గము.

౧ ఆరాక్షసప్రభు వగు రావణుని యీమాట విని, వక్తయు మహాప్రాజ్ఞుఁడు నగు మారీచుఁ డిట్లు ప్రత్యుత్తరము పల్కెను.

౨ ఓరాజా ! ఎల్లప్పుడును నిజము గప్పిపుచ్చి మెుగ మిచ్చకఁపు మాటలు పలుకువా రనేకులు సులభముగానే లభింతురు. కాని తాత్కాలికముగ వెగటుగఁ దోఁచినను, పరిణామకాలమునఁ బ్రయోజనము గూర్చు (పథ్యమగు) మాటను జెప్పువాఁడును, ఆచెప్పిన మాటను శ్రద్ధతో నాలించువాఁడును మిగుల దుర్లభులు.

౩-౪ బాణములనుజ్వాలలు గల్గి, విండ్లు - కత్తులు నను సమిధలచేఁ జేరరాక, యుద్ధభూమిలోఁ బ్రజ్వలించు శ్రీరాముఁ డను నగ్నిలోఁ దొందరపడి జొరఁబారుట నీకుఁదగదు. ఆప్రజ్వలించు నగ్నియొక్క జ్వాలయే సీత ; ఆమిథిలాధిపుకూఁతు రోజస్వి యగు రాముని ప్రియురాలు. ఆమె నీవు గూర్చు భయమునకు లొంగునది కాదు.

౫-౬½ మునుపు విశ్వామిత్రాశ్రమమున నేను (శ్రీరామునివలనఁ దటస్థించిన) మహాభయము ననుభవించి, యీ దండకారణ్యమున మృగరూపముచేఁ దిరుగాడుచుండ శ్రీరామచంద్రుఁడు సామాన్యజంతువులను విడిచిపెట్టి మాయామృగరూపధారి నగు నన్నుఁ దెలిసికొని నాపైననే బాణము వదలెను; ఆబాణముచే నెట్లో (పారిపోవువారిపై రామబాణము ప్రవర్తింపదు గనుక) విడువఁబడి, పోయిన ప్రాణములను మరలఁ బొంది, యిచ్చోట సన్యాసినై, తగిననడవడి గలిగి (లేక యోగాభ్యాసరతుఁడనై యనియుఁ జెప్పవచ్చును) తపోనిష్ఠచే మనసు కుదుటఁబెట్టుకొని, యిట్లు కాలముఁ బుచ్చుచున్నాను.

౭-౭½ (యిపుడుగూడ) నారచీరలు కృష్ణాజినముఁ దాల్చి చాపము చేఁబూని, పాశములఁదాల్చిన యంతకునివలె నున్న యారామునే యీయెదుటఁ జెట్టుచెట్టునను జూచుచున్నాను.

అపి రామసహస్రాణి భీతః పశ్యామి రావణ! ౮
రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే
రామమేవహి పశ్యామి రహితే రక్షసాధిప! ౯
దృష్ట్వా స్వప్నగతం రామ ముద్భ్రమామి విచేతనః. ౯½

రకారాదీని నామాని రామత్రస్తస్య రావణ! ౧౦
రత్నానిచ రథాశ్చైవ త్రాసం సంజనయంతి మే. ౧౦½

అహం తస్య ప్రభావజ్ఞో న యుద్ధం తేన తే క్షమం. ౧౧
బలిం వా నముచిం వాపి హన్యాద్ధి రఘునందనః. ౧౧½
రణే రామేణ యుధ్యస్వ క్షమాం వా కురు రాక్షస! ౧౨
న తే రామకథా కార్యా యది మాం ద్రష్టు మిచ్ఛసి. ౧౨½

యది శూర్పణఖాహేతో ర్జనస్థానే హతః ఖరః. ౧౩
అపి రాక్షసలోకస్య న భవే దంతకోఽపి సః. ౧౩½

1 తవ హితం వదతో మమ భాషితం పరిగృహాణ పరాత్మని రాఘవే, త్యజ విరోధమతిం భజ భక్తితః పరమకారుణికో రఘునందనః. ౧౪-౧౪½

1. అధ్యాత్మ రా. ౬ స.



౮-౯½ రావణా! ఒక్కఁడా? యిద్దరా? కాదు. భయభ్రాంతుఁడనై వేలకొలఁది రాములను జూచుచున్నాను.
ఈయడవియంతయు రాముఁడే యయ్యె నని నాకుఁ దోఁచుచున్నది. ఓ! రక్కసుల ఱేఁడా! వట్టి బట్టబయలునఁ గూడ నేను రామునే చూచుచున్నాను. కన్నుమూసినంతఁ గలలోఁగూడ యారామునే జూచి చేతనము దప్పి కలవలపాటు నొందుచున్నాను.

౧౦-౧౦½ రావణా! రకారము మొదటఁగల పదములు అనఁగా రత్నము - రథములు అనునవియు నాకు వెఱపు పుట్టించుచున్నవి. అట్టిచో రాముఁడని పూర్తిగా వినఁబడినచో నాగతి వేఱె చెప్పవలసిన దేమున్నది? రత్నాదిపదములలో రకారోచ్చారణమువలన మొదటఁ గలిగిన భీతి రెండవయక్షర ముచ్చరించినతర్వాత మెల్లగాఁ బోవుచున్న దనియు నభిప్రాయము.

౧౧ నే నారాముని ప్రభావము నెఱిఁగిన యనుభవశాలిని. వానితో నీకుఁ బోరాటము మంచిది కాదు.

౧౧½ రఘునందనుఁడు బలినైనను, నముచినైనను గీటడంచఁగలఁడు.

౧౨ ఓరాక్షసా! యుద్ధమున రామునితోఁ బోరుము లేక మాట్లాడక (ఖరాదివధను) సహించి యూరకుండుము.

౧౨½ (నేను బ్రతికియుండఁగా) నన్ను జూడవలె నని నీ కున్నచో నిఁక రామునిమాట నాకడఁ దేవలదు.

౧౩-౧౩½ ఒక్కశూర్పణఖకొఱకై ఖరుఁ డాతనిచేఁ గూల్పఁబడెనా? పోనిమ్ము. ఇక ఆరాముఁడు రాక్షసులందరిపాలిటికి నంతకుఁడు గాకుండుఁగాక!

౧౪-౧౪½ నీహితవునే కోరి పలుకుచున్న నామాటను గ్రహింపుము. పరమాత్మ యగు నారామునియెడ విరోధబుద్ధిని విడువుము. పరమకారుణికమూర్తి యగు రఘుకుమారు భక్తిమై భజింపుము.

అతోనమానుషోరామస్సాక్షాన్నా రాయణోఽవ్యయః. ౧౫
మాయామానుషవేషేణ వనం యాతో ఽతినిర్భయః
భూభారహరణార్థాయ గచ్ఛ తాత! గృహం సుఖం. ౧౬
శ్రుత్వా మారీచవచనం రావణః ప్రత్యభాషత. ౧౬.౫

పరమాత్మా యదా రామః ప్రార్థితో బ్రహ్మణా కిల. ౧౭
మాంహంతుంమానుషోభూత్వాయత్నా దిహాసమాగతః
కరిష్య త్యచిరా దేవ సత్యసంకల్ప ఈశ్వరః. ౧౮
అతోఽహం యత్నత స్సీతామానేష్యా మ్యేవ రాఘవాత్.
వధే ప్రాప్తే రణే వీర! ప్రాప్స్యామి పరమం పదం. ౧౯
యద్వారామంరణేహత్వాసీతాంప్రాప్స్యామినిర్భయః.౧౯.౫

[1] యత్కిలైత దయుక్తార్థం మారీచ మయి కథ్యతే. ౨౦
త్వద్వాక్యై ర్నతు మాం శక్యం భేత్తుం రామస్య సంయుగే
పాపశీలస్య మూర్ఖస్య మానుషస్య విశేషతః. ౨౧

గుణదోషా నపృచ్ఛామి క్షేమం చాత్మని రాక్షస!
అభ్యాగతం మాం దౌరాత్మ్యా త్పరుషం వక్తు మిచ్ఛసి. ౨౨

రాజ్య స్యార్థం ప్రయచ్ఛామి మారీచ! తవ సువ్రత!
గచ్ఛ సౌమ్య! శివం మార్గం కార్య స్యాస్యవివృద్ధయే. ౨౩

1. వాల్మీకి రా. ౪౦ స.



౧౫-౧౬ రాముఁడు మానవమాత్రుఁడు కాఁడు; సాక్షాన్నారాయణుఁడు, అవ్యయుఁడు; మాయామానుషవేషముచే (దుష్టుల శిక్షించి శిష్టుల రక్షించి) భూభారము వాప నేవెఱపును లేక యడవికి వచ్చిన వాఁడు. తండ్రీ! సుఖముగా నింటికిఁ జనుము.

౧౬.౫ మారీచు నామాటలు విని రావణుఁ డిట్లు బదులు పలికెను.

౧౭-౧౮.౫ పరమాత్మ యగు రాముఁడు బ్రహ్మచేఁ బ్రార్థింపఁబడి, మనుష్యుఁడై నన్ను సంహరింప యత్నపడి యిఁటకు వచ్చినవాఁడేని; నయ్యీశ్వరుఁడు సత్యసంకల్పుఁడు గావున నప్పనిని దప్పక చేసియే తీరును. కనుక నేనును యత్నించి యారాఘవునినుండి సీతను దీసికొనియే వత్తును.

౧౯-౧౯.౫ ఓవీరుఁడా! నాకు యుద్ధమున (శ్రీరాముని చేఁతులలో) చావే నిశ్చయముగా సిద్ధమైనచోఁ బరమపదము (మోక్షము)ను పొందెదను. కాదందువా? నేనే రాముని యుద్ధమున దోరించి సీతను నిర్భయముగాఁ బొందెదను.

౨౦-౨౧ పాపస్వభావుఁడును, మూర్ఖుఁడును, మీఁదుమిక్కిలి మనుష్యమాత్రుఁడు నగు రామునితోడి యుద్ధము విషయములో నీమాటలచే నన్ను భేదించుటకు అనఁగా సీతను దొంగతనముచే నపహరించు నుపాయమునుండి మరల్చి యుద్ధమునకే నన్నుఁ బ్రవర్తింపఁజేయుట నీకు శక్యము గాదు.

౨౨ మారీచా! ఈపనిలోని మంచిచెడుగుల వివరింపు మని కాని, నాసేమ మేదియో యెఱిఁగింపు మని కాని నిన్నడుగుట లేదు. నీకడకుఁ బనిగొని వచ్చితిఁ గదా యని దుర్ణయముచే నిట్లుఁ బరుషముగాఁ బలుకఁ గోరితివే? (తగదు.)

౨౩-౨౪ మంచినియమములు గల యోమారీచా! నారాజ్యమున సగముపాలు నీ కిత్తును. సౌమ్యుఁడా! నడువుము. ఇక్కార్యము కొనసాగుటకు నీమార్గమున మంగళ మగుఁగాక! నేనును దండకారణ్యమునకు రథము నధిష్ఠించి నీతో రాఁగలను. మారీచా! నాయాజ్ఞ

అహం త్వా ఉనుగమిష్యామి సరథో దండకావనం
నచే త్కరోషి మారీచ! హన్మి త్వా మహ మద్యవై. ౨౪
ఏతత్కార్య మవశ్యం మే బలాదపి కరిష్యసి
రాజ్ఞోహి ప్రతికూలస్థో నజాతు సుఖ మేధతే. ౨౫

1 త చ్ఛ్రుత్వా మనసా ప్యేవ మమన్యత నిశాచరః
రాఘవాదపి మర్తవ్యం మర్తవ్యం రావణాదపి. ౨౬
ఉభాభ్యామపి మర్తవ్యే వరం రామా న్న రావణాత్
ఇతి నిశ్చిత్య మరణం రామా దుత్థాయ వేగతః. ౨౭
2 అబ్రవీత్ పరుషం వాక్యం మారీచో రాక్షసాధిపం. ౨౭½

తదిదం కాకతాళీయం ఘోర మాసాదితం మయా. ౨౮
అత్రైవ శోచనీయ స్త్వం ససైన్యో వినశిష్యసి. ౨౮½

దర్శనా దేవ రామస్య హతం మా ముపధారయ. ౨౯
ఆత్మానంచ హతం విద్ధి హృత్వా సీతాం సబాంధవం. ౨౯½

3 ఏవ ముక్త్వాతు వచనం మారీచో రావణం తతః. 30
గచ్ఛావే త్యబ్రవీ ద్దీనో భయా ద్రాత్రించరప్రభోః. 30½

1. నారసింహపురాణం. 2. వాల్మీకి రా. ౪౧స. 3 వాల్మీకి రా. ౪౧ స.



చెప్పిన నిట్లు నీవు చేయక పోదువా యిప్పుడే నేను నిన్నుఁ జంపెదను సుమా! నాబలవంతముననైన నీ వీకార్యముఁ దప్పక చేసియే తీరఁగలవు. రాజునకుఁ బ్రతికూలముగా నడచువాఁ డెన్నటికిని శుభ మొందఁజాలఁడు.

౨౬-౨౭½ అది విని మారీచుఁడు తనలో నిట్లనుకొనెను. ఇపుడు రామునివలనైనఁ జావవలెను. రావణుని చేనైనఁ జావవలెను. ఇరువురచే నిరుకునం బడి చావవలసివచ్చునపుడు రావణునిచేఁ జచ్చుటకంటె రామునిచేఁ జచ్చుట మంచిది. అని రామునివలని తనచావు నిశ్చయించి మారీచుఁడు వెనువెంట లేచి రక్కసులఱేనిం జూచి యిట్లు పరుషముగా భాషించెను.

౨౮-౨౮½ * కాకతాళీయముగా నా కీఘోర మగు గతి దాపురించినది. (అది యటుండ) పాపము నీవు బలఁగముతోఁగూడ నశింతువు. ఇందే నిన్నుఁగూర్చి విచారము కలుగుచున్నది.

౨౯-౨౯½ రాముని జూచుతోడనే నేను మరణించితి ననియే నిశ్చయించుకొనుము. సీత నపహరించి నీవును నీబందుగులతోఁగూడ నశించువాఁడ వనియుఁ దెలిసికొనుము.

30-30½ ఇట్లు మారీచుఁడు రావణునితోఁ బలికి మీఁదట రాక్షసప్రభుని భయమువలన బిక్కమొగము వైచుకొని వెడలుదమా! యని పలికెను.

* కాకతాళీయన్యాయ మనఁగాఁ దాటిపండుపైఁ గాకి వ్రాలుటయు నది (పక్వమైనదిగావున) పడుటయు నొకమారే తటస్థించినట్లు. రాముఁ డిదివఱకే నన్నుఁ జంపఁ జూచుచుండఁగా నీవు నందులకే నన్నటకుఁ బురిగొల్పుచున్నావు; వైద్యుఁడు పాలే కోరెను, రోగియుఁ బాలే కోరె నన్నట్లు. కనుక నాచావు నిక్కమే యనుట.

[1] అథ రామోఽపి తత్సర్వం జ్ఞాత్వా రావణచేష్టితం. ౩౧
ఉవాచ సీతా మేకాంతే శృణు జానకి! మే వచః
రావణో భిక్షురూపేణ ఆగమిష్యతి తేఽంతికం. ౩౨
త్వంతు ఛాయాం త్వదాకారాంస్థాపయి త్వోటజే విశ. ౩౨½

[2] సీతే! త్వం త్రివిధా భూత్వా రజోరూపా వసానలే. ౩౩
వామాంగే మే సత్వరూపా వసచ్ఛాయా తమోమయీ
పంచవట్యాం దశాస్యస్య మోహనార్థం వసాద్య వై. ౩౪
అగ్నా వదృశ్యరూపేణ వర్షం తిష్ఠ మమాజ్ఞయా
రావణస్య వధాంతే మాం పూర్వవ త్ప్రాప్స్యసే శుభే! ౩౫

[3] రాఘవస్య వచ శ్శ్రుత్వా సా ప్యువాచ తథేతిచ. ౩౫½

ఏతస్మి న్నంతరే రామం ద్రష్టుం కమలలోచనం. ౩౬
వహ్ని స్తత్ర సమాయాతః ద్విజరూపీ కృపానిధిః. ౩౬½

[4] వహ్ని రువాచ—

భగవన్! శ్రూయతాం వాక్యం కాలేన య దుపస్థితం. ౩౭
సీతాహరణకాలో ఽయం తవైవ సముపస్థితః. ౩౭½

మత్ప్రసూంమయిసన్యస్యఛాయాంరక్షాంతి కేఽధునా. ౩౮
దాస్యామి సీతాం తుభ్యంచ పరీక్షాసమయే పునః. ౩౮½

దేవైః ప్రస్థాపితో ఽహంచ నచ విప్రో హుతాశనః. ౩౯

1. అధ్యాత్మ రా. ౭ స. 2. ఆనంద రా. సారకాం. ౭ స.
3. దుర్వాస రా. 4. బ్రహ్మవైవర్తే ప్రకృతి ఖండే ౧౪ అధ్యా.



౩౧-౩౨½ ఇది యిట్లుండ; నట రాముఁడు రావణునిపని నంతయు నెఱిఁగి సీతాదేవితో నేకాంతమున నిట్లనిరె. జానకీ! నామాట వినుము. రావణుఁడు బిచ్చగానిరూపమున నీసన్నిధికి రా నున్నాఁడు. నీ వీపర్ణశాలయందు నీరూపమున నీనీడను మాత్రము నిలిపియుండుము.

౩౩-౩౫ సీతా! నీవు మూఁడువిధములుగా నై, అందు రజోగుణరూపమున నగ్నిదేవునియందును, సత్త్వగుణరూపమున నాశరీరము నెడమనై పున నుండుము. మఱి తమోగుణరూపమున నీడ ధరించి యీపంచవటియం దిప్పుడు రావణునికండ్లు గప్పుటకై నిలువుము. అగ్నియం దొకసంవత్సరమును నాయానచొప్పున వసింపుము. కల్యాణీ! రావణవధానంతరము న న్నెప్పటియట్లు పొందఁగలవు.

౩౫½ రామునిపలుకు విని యాపెయు నట్లే యనెను.

౩౬-౩౬½ ఇంతలో బ్రాహ్మణవేషధారియై కరుణానిధి యగు నగ్నిదేవుఁడు కమలలోచనుఁ డగు రామచంద్రుని దర్శించుట కటకు వచ్చెను.

అగ్ని యి ట్లనియె.—

౩౭-౩౭½ భగవానుఁడా! శ్రీరామా! సమయమునకు సందర్భపడిన నా మాటను వినుము. ఇపుడు సీతాపహరణము జరుగుసమయము తట స్థించినది.

౩౮-౩౮½ నాబిడ్డను నిజసీతను నాయం దుంచి ఛాయారూపిణి నిపుడు నీదగ్గర నిడుకొని కాపాడుము. శోధనసమయమున తిరిగి సీతను నీ కొసంగెదను.

౩౯ నేను సామాన్యబ్రాహ్మణుఁడను గాను. దేవతలు పంపఁగా వచ్చిన యగ్నిదేవుఁడను.

రామ స్తద్వచనం శ్రుత్వా సప్రికాశ్యచ లక్ష్మణం
స్వీచకారచ స్వచ్ఛందం హృదయేన విధూయతా. ౪౦

* వహ్ని ర్యోగేన సీతాయా మాయా సీతాం చకారహ
లక్ష్మణో నైవ బుబుధే గోప్య మన్యేన కాకథా. ౪౧

---

* వహ్నిరితి. కూర్మపురాణే— ఉ. భాగే ౩౪ అధ్యాయే శ్లో॥ అథావసధ్యో భగవా న్హవ్యవాహో మహేశ్వరః। ఆవిరాసీ త్సదీప్తాత్మా తేజసా ప్రిదహన్నివ। సృష్ట్వా మాయామయీం సీతాం రావణస్య వధేప్సయా। సీతా మాదాయ ధర్మిష్ఠాం పావకో ఽంతరధీయత। తాం దృష్ట్వా తాదృశీం సీతాం రావణో రాక్షసేశ్వరః। సమాదాయ యయౌ లంకాం శుభాం సాగరసంస్థితా మితి. బ్రహ్మవైవర్తే శ్రీకృష్ణజన్మఖండే ౧౧౬ అధ్యాయేపి. 'శ్లో॥ సీతాయా సదృశీ ఛాయా తస్థా రామస్య సన్నిధౌ। సాచ ఛాయా హృతా పూర్వం రావణే నావలీలయేతి.' వాల్మీకిరామాయణే ౪౯ సర్గే ౨౦౫ శ్లో॥ సా గృహీతా విచుక్రోశ రావణేన యశస్వినీ— ఇతి శ్లోకవ్యాఖ్యానావసరే తిలకవ్యాఖ్యా - విచుక్రోశేత్యాది తచ్ఛాయాయా అపి మనుష్యభావనార్థం చుక్రోశే త్యర్థః. ఇతి ప్రితిపాదన మస్తి. పునః ౫౪ సర్గే ౧౩ శ్లో॥ నిదధే రావణ స్సీతాం మయో మాయా మివ స్త్రియం. ఇతి శ్లోకవ్యాఖ్యానే తిలకవ్యాఖ్యా. మాయా మివే త్యనేన మాయారూపైషా సీతా యా లంకామాగతేతి ధ్వనితం. ముఖ్యసీతా త్వగ్నిం



౪౦ అది విని శ్రీరామచంద్రుఁ డీవిషయమును లక్ష్మణునికడ వెలువరింపక కలవలపడు తనహృదయమునందే యిడుకొనెను.

౪౧ * అగ్నిహోత్రుఁడు యోగబలముచే సీతకు మారుగ మాయాసీతను గల్పించెను. లక్ష్మణుఁ డీరహస్యమును దెలుసుకొననే లేదు. మిగిలిన వారిమాట చెప్ప నేల?

---

* ఇటఁ గూర్మపురాణమున నుత్తరభాగమున ౩౪ అధ్యాయమున— అపుడు అవసథమునుండి భగవానుఁడును ప్రకాశస్వరూపుఁడు నగు నగ్నిహోత్రుఁడు దన తేజముచే దహించువాఁడునుంబోలె, రావణుం బరిమార్చుట కని మాయామయి యగు సీతను సృష్టించి, ధర్మాత్మురా లగు సీతాదేవినిజస్వరూపమును వెంట నిడికొని యంతర్ధానమయ్యెను. ఆమాయాసీతను జూచి రాక్షసాధిపుఁ డగు రావణాసురుఁడు సముద్రిమధ్యమున నున్న శుభ మగు లంకకుఁ గొంపోయెను. ఇవ్విషయమే బ్రహ్మవైవర్తపురాణమునఁ గృష్ణ జన్మోత్తర ఖండమున పదునాఱవయధ్యాయమున "సీతాస్వరూప మగు ఛాయ రామునిసన్నిధి నుండెను. ఆఛాయయే తొల్లి రావణునిచే హరింపఁబడినది." అని కలదు. వాల్మీకిరామాయణమున ౪౯ సర్గమున ౨౦౫ శ్లోకమున "కీర్తిమంతురా లగు నామె (సీత) రావణునిచేఁ బట్టుకొనఁబడినదై మిగుల వాపోయెను" అను శ్లోకము నొద్ద తిలకవ్యాఖ్యానము— "విచుక్రోశ" ఏడ్చెను. అనున దాదిగా నాసీతయొక్క ఛాయయే మనుష్యభావము తోపించుకొఱకే డ్చెను అని నిర్ణయము గలదు. మఱియు ౫౪ సర్గమున ౧౩ శ్లోకమున "మయుఁడు మాయామయి యగు నాడుదానింబోలె (రావణుఁడు సీతను) లంకలో నిల్పెను అను శ్లోకప్రుతిలకవ్యాఖ్యానమున—" మాయామయి యగు నాడుదానింబోలె యనుటచే లంకానగరమునకు వచ్చిన యీసీత మాయారూపయే యని ధ్వనింపఁబడినది. ముఖ్యురాలగు సీత యగ్నిలోఁ బ్రివేశించె నని యింతకుఁ బూర్వమే ధ్వనితమయ్యెను. అందుచేతనే రావణుఁ డెత్తికొంపోవుటకు వీ లయ్యెను. యీరూపిమాణి యగుట రావణుఁ డెఱుఁగలేకపోవుటయును. ఇం

సీతాయా సదృశీ ఛాయా తస్థౌ రామస్య సన్నిధౌ. ౪౧½

1 తతో రావణమారీచౌ విమాన మివ తం రథం. ౪౨

ఆరుహ్యాయయతుశ్శీఘ్రంతస్మాదాశ్రమమండలాత్. ౪౨½

ప్రవిష్టేతి పూర్వమేవ ధ్వనితం—అతఏవ రావణస్య వహ్నీ మైషా జాతా మాయాత్వా దేవ రావణస్య తదజ్ఞాన మితి ప్రదృశ్యతే. హ్యాతఏవ వాల్మీకిరామాయణే అరణ్యే ౩౬ సర్గే ౨౦ శ్లోకే. తత స్తయో రపాయేతు శూన్యే సీతాం యథా సుఖం నిరాబాధో హరిష్యామి రాహు శ్చంద్రప్రభా మివ ఇతి. పునశ్చ ౪౯ సర్గే శ్లో॥ జగ్రాహ రావణ స్సీతాం బుధః ఖే రోహిణీ మివేతి. అపిచ ఛాయా గ్రాహిత్వ మేవో క్తం స్కాందే శ్లో॥ ఛాయాగ్రాహిత్వ మప్యస్తి సర్వవిద్యావిశారదేత్యాదినా.

అస్మిన్నర్థే స్కాందే ఉమాసంహితాయాం నవమాధ్యాయే పార్వతీంప్రతి పరమేశ్వరో క్తిః— శ్లో॥ పురా విహారసమయే లక్ష్మీః కౌస్తుభమధ్యతః । స్వచ్ఛాయాం వీక్ష్య సాప త్న్య శంకయాకులితా భవత్.

లక్ష్మ్యువాచ. అన్యాం వహసి దారాత్వ్యాన్మా మతిక్రమ్య వక్షసి । తాం హరి స్సాంత్వయామాస కుపితా మిందిరాం భృశం । సత్యం త్వత్సదృశీ చాన్యా లోకానుగ్రహకా మ్యయా । సా నిత్యం శాత్రవహృతా భవే జ్జన్మనిజన్మని । తత్సర్వం లోకరక్షాయై నిత్యం భవతు సుందరి ! ఇతి.

1. వాల్మీకి రా. ౪౨ స.



౪½ సీతకు సమాన మగు ఛాయ (నీడ) రామసన్నిధి నుండెను.

౪౨-౪౨½ పిమ్మట నయ్యాశ్రమమండలమునుండి రావణమారీచులిద్దరును విమానమువలె నున్న యారావణుని రథము నెక్కి వేగముగా నరిగిరి.

దుకే వాల్మీకిరామాయణమున నరణ్యకాండమున ౩౬ సర్గమున ౨౦ శ్లోకమున నిట్లు కన్పట్టుచున్నది. "పిమ్మట వారిద్దరును (రామ లక్ష్మణులు) సీతను విడిచి పోఁగా నామెను శూన్య మగు ప్రదేశ మున నున్న దగుటచే నేబాధయు లేకుండ సుఖముగ, రాహువు చంద్రునికాంతి నపహరించు నటుల హరించెద" అని, మఱియు ౪౯ సర్గమున "బుధుఁ డాకసమున రోహిణీనక్షత్రమును బట్టు కొన్నట్లు రావణుఁడు సీతను బట్టుకొనెను" అనియు, స్కాంద పురాణమునను ఛాయనే గ్రహించినట్లును—"ఓనిపుణురాలా ! ఛాయను గ్రహించుట యనునదియుఁ గలదు." అనున దాదిగను ప్రమాణములు గలవు. ఈవిషయములో స్కాందమున ఉమాసంహి తయందు నవమాధ్యాయమునఁ బార్వతితోఁ బరమేశ్వరుఁడు పలికిన మాట- "మున్ను లక్ష్మి హరితో విహరించుచు నాతనికౌస్తుభమణి యందుఁ దననీడను జూచి సవతి యని శంకించి కోపించి యిట్లనియె—"నాథా! దుర్ణయముచే నన్నతిక్రమించి నీవక్షమున నింకొకతెను ధరించున్నా వనెను" అనఁ గుపితయైన లక్ష్మిని శ్రీహరి యిట్లని ప్రతిమాలెను- "దేవీ! నిజమే నీతో సమాను రాలు మఱొక్కతె కలదు. ఆమె ఎల్లప్పుడు లోకముల ననుగ్ర హింపఁ గోరి ప్రతిజన్మమందును శత్రువులచే హరింపఁబడును. సుందరీ! అదంతయు లోకసంగ్రహమునకే యెల్లప్పుడు నగుచుం డును" అని కలదు.

* తథైవ తత్ర పశ్యంతౌ పత్తనాని వనానిచ. ౪౩
గిరీంశ్చ సరిత స్సర్వా రాష్ట్రాణి నగరాణిచ
సమేత్య దండకారణ్యం రాఘవ స్యాశ్రమం తతః. ౪౪
[1] మాయయా వివిశు స్తత్ర వంచయిత్వా జటాయుషం. ౪౪½
అవతీర్య రథా త్తస్మా ద్గోపయిత్వాచ తద్రథం. ౪౫
హ స్తేగృహీత్వా మారీచం రావణో వాక్య మబ్రవీత్. ౪౫½

* తథైవే త్యత్ర రావణమారీచా వనేకనగరపట్టణాదీన్ ప్ర పశ్యంతౌ శ్రీరామాశ్రమం జగ్మతు రి త్యవగమ్యతే. నగర పట్టణాదిలక్షణ ముక్తం వాస్తుశాస్త్రే. తథాహి. శ్లో॥ గ్రామశ్చ నగరంచైవ పట్టణం ఖర్వటం పురం। ఖేటకం కుసుమంచైవ శిబిరం రాజవాసికం। సేనాముఖ మితి త్యేవం దశధా కీర్తితం బుధైః। విప్రాణాంచ సభృత్యానాం వాసో గ్రామ ఇతీర్యతే। సఏవ విప్రై రాకీర్ణ స్త్వగ్రహార ఇతి స్మృతః। కుటుంబభేదై రేకోనత్రింశద్భిశ్చ సమన్వితః। అనేకనారీసంబంధం నానాశిల్పిజనై ర్వృతం। క్రయవిక్రయకైః కీర్ణం సర్వదేవై స్సమన్వితం। నగరం త్వితి విఖ్యాతం పట్టణం శృణు సాంప్రతం। ద్వీపాంతరాగతద్రవ్యక్రయ విక్రయకై ర్యుతం। పట్టణం త్వబ్ధితీరే స్యా త్తయోర్మిశ్రంతు ఖర్వటం। క్రయవిక్రయకై ర్యుక్తం నానాజాతిసమన్వితం। తంతువాయసమాయుక్తం త త్పురం త్వితి కథ్యతే। ఏతై రధిష్ఠితం య త్తత్ ఖేటకం పరికీర్తితం। ఏషా మేకాంతదేశేవ వాసః కుసుమ ముచ్యతే - ఇత్యాదినా.

1. అగస్త్యరామాయణం.



౪౩-౪౪½ * అట్లు వారు దారిలోఁ బట్టణములను, అరణ్యములను, బర్వతములను, సమస్తరాజధానులను, నగరములను జూచుచు దండకారణ్యమునకు వచ్చి యంతట నా రామచంద్రు నాశ్రమప్రాంతమును జేరిరి. జటాయువును మోసగించి, మాయచే నందుఁ బ్రవేశించిరి.

౪౫-౪౫½ రథమ్ము డిగ్గి రావణుఁడు, ఆ తేరు నొక్కెడఁ బదిలపఱిచి, మారీచు చేతఁబట్టుకొని యిట్లనియె.

* అట్లు వారు అనుచో ననేకనగరములు పట్టణములు మొదలగు వానిని జూచుచు శ్రీరాము నాశ్రమమున కరిగిరి యని తెలియుచున్నది. వాస్తుశాస్త్రమున నగరము, పట్టణము మొదలగువానిలక్షణము చెప్పఁబడినది. గ్రామము, నగరము, పట్టణము, ఖర్వటము, పురము, ఖేటకము, కుసుమము, శిబిరము, రాజవాసికము, సేనాముఖము అని పండితులచే జనావాసములు పదివిధములుగాఁ జెప్పఁబడినవి. అందు - బ్రాహ్మణులు వారియితరజాతు లగు సేవకులతోఁగూడి యుండునది గ్రామము. కేవలము బ్రాహ్మణులచే నిండియుండునది అగ్రహారము. ఇరువదితొమ్మిది విధము లగు కుటుంబములతోఁగూడి, యనేకు లగు స్త్రీలతోఁ గలిసి, వివిధశిల్పిజనములతోఁగూడి, క్రయవిక్రయవ్యాపారములతో నిండి, సర్వదేవతలతోఁగూడినది నగరము. సముద్రాంతరమం దున్న ద్వీపములనుండి దిగుమతియైన వస్తువుల క్రయవిక్రయవ్యవహారస్థులతోఁగూడి, సముద్రతీరమున నుండునది (ఓడరేవు కలది యనుట) పట్టణము. నగరపట్టణముల లక్షణములు రెండును గలిసిన యది ఖర్వటము. క్రయవిక్రయవ్యాపారులతోఁ గూడి వివిధజాతులవారు నివసించుతావై, బట్టల నేఁతగాండ్రతోఁ గూడినది పురము. వీరందరిపైనను గల యధికారులు నివసించునది ఖేటకము. వీరందరు వేరువేరుగా నివసించు తావు కుసుమము.

శిబిరాదులు మూఁడుస్థానములును యుద్ధసంబంధము లగు వాసస్థానము లని యెఱుంగ నగును.

1 ఏత ద్రామాశ్రమపదం దృశ్యతే కదళీవృతం. ౪౬
రామం ప శ్యాత్రి మారీచ ! సాక్షా న్మదనవిగ్రహం. ౪౬½

నవకువలయ రేఖాశ్యామ మ స్యేద మంగం ఘటయితు
మల మక్ష్ణో ఉత్సవం విద్విషో ఽపి, ప్రకృతి రియ ముదారా
సాధుభి శ్లాఘనీయా కథయతిచ మహత్వం దుర్లభం య
త్పరేణ. ౪౭-౪౭½

2 క్రియతాం తత్సఖే శీఘ్రం యదర్థం వయ మాగతాః. ౪౮

స రావణవచ శ్శ్రుత్వా మారీచో రాక్షస స్తదా. ౪౮½
3 మయశంబరముఖ్యాంశ్చధ్యాత్వామాయాగురూన్బహూ౯
ఆద్యాం బీజమయీం మాయా ముపాస్యమనసా ఽసురః.
4 శుద్ధజంబూనదప్రఖ్యో మృగో ఽభూ ద్రౌప్యబిందుకః. ౫౦
రత్నశృంగో మణిఖురో నీలరత్నవిలోచనః
విద్యుత్ప్రభో విముగ్ధాస్యో విచచార వనాంతరే. ౫౧

రామాశ్రమపదస్యాంతే సీతా దృష్టిపథే చర౯
5 పరిభ్రమతి చిత్రాణి మండలాని వినిష్పత౯. ౫౨

సముద్వీక్ష్యచ తం సర్వే మృగా హ్యన్యే వనే చరాః
ఉపాగమ్య సమాఘ్రాయ విద్రవంతి దిశో దశ. ౫౩

1. శివరామాయణం. 2. వాల్మీకి రా. ౪౨ స. 3. శివ రామా.
4. అధ్యాత్మ రా. ౬ స. 5. వాల్మీకి రా. ౪౨ స.



౪౬-౪౬½ మారీచా ! అరటిచెట్లచే నావరింపఁబడియున్న దదిగో రాముని యాశ్రమభూమి కనఁబడుచున్నది. ప్రత్యక్షమన్మథవిగ్రహుఁ డగు రాము నిందుఁ గనుము.

౪౭-౪౭½ క్రొత్తనల్లకలువ రేకువలె నల్లని యీతనిశరీరము శత్రువునకైనను గన్నులపండు వొనరింపఁగలదు. ఈయుదార మగు స్వభావము (ప్రకృతి) సాధువులచేఁ గొనియాడఁదగి, మఱియొక్కనికిఁ బొంద నలవిగాని మహత్త్వమును జెప్పుచున్నది.

౪౮ మిత్రమా ! మారీచా ! మన మిచటి కెందుకొరకు వచ్చినారమో యాపని కానిమ్ము.

౪౮½-౫౧ మారీచుఁ డారావణునిమాట విని: మాయాగురువు లగు మయుఁడు శంబరుఁడు మొదలగు ననేకమందిని ధ్యానించి, బీజమయి యగు నాదిమాయాశక్తి నారక్కసుఁడు మనసార నుపాసించి, స్వచ్ఛమైన స్వర్ణమయశరీరమును, తెల్లని వెండిచుక్కలును, రత్నవికారము లగు కొమ్ములును, మణివికారము లగు డెక్కలును, ఇంద్రనీలముల వంటి నేత్రములును, మెఱుపువంటి శరీరప్రభలును, మిగులసుందర మైన మొగమును గల లేడిరూపమును ధరించినవాఁడై యావనాంతర మునఁ దిరుగాడెను.

౫౨ వాఁడు రామచంద్రు నాశ్రమప్రాంతమున, సీతాదేవిచూపుల యెదుట చిత్రవిచిత్రముగ గంతు లిడుచు యెగిరిపడుచు, గిరగిరఁ దిరుగుచు చరించుచుండెను.

౫౩ ఇతరము లగు నడవిజంతువులు వానిం జూచి, దగ్గరగా వచ్చి మూర్కొని (రాక్షసవాసన పొడగట్టుటచే) పదిదెసలకుం బారి పోవుచుండెను.

*1 మాయాసీతా తదా పశ్య న్మృగం మాయావినిర్మితం
హసంతీ రామ మభ్యేత్య ప్రోవాచ వినయాన్వితా. ౫౪

2 ఆర్యపుత్రాభిరామో ఽసౌ మృగో హరతి మే మనః
ఆన యైనం మహాబాహో క్రీడార్థం నో భవిష్యతి. ౫౫
యది గ్రహణ మభ్యేతి జీవన్నేవ మృగ స్తవ
సమాప్తవనవాసానాం రాజ్యస్థానాంచ నః పునః. ౫౬
ఆశ్చర్యభూతం భవతి విస్మయం జనయిష్యతి
అంతఃపురవిభూషార్థో మృగ ఏష భవిష్యతి. ౫౭

భరత స్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమచ ప్రభో!
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి. ౫౮

జీవ న్న యది తే ఽభ్యేతి గ్రహణం మృగసత్తమః
అజినం నరశార్దూల! రుచిరం మే భవిష్యతి. ౫౯

కామవృత్త మిదం రౌద్రం స్త్రీణా మసదృశం మతం
వపుషా తస్య సత్వస్య విస్మయో జనితో మమ. ౬౦

ఏవం సీతావచ శ్శ్రుత్వా తం దృష్ట్వా మృగ మద్భుతం
ఉవాచ రాఘవో హృష్టో భ్రాతరం లక్ష్మణం వచః. ౬౧

* ఆనంద రా - సారకాం. ౭ సర్గేప్యేవం - ఛాయా తామసీ దృష్ట్వా మృగం రాఘవ మబ్రవీత్. ఇతి.

1. అధ్యాత్మ రా. ౭ స. 2. వాల్మీకి రా. ౪౩ స.



౫౪ * మాయాసీత యప్పు డామాయావినిర్మిత మగు లేడిం జూచెను. వినయముతోఁగూడి రాముసన్నిధికి వచ్చి నవ్వుచు ని ట్లనియె.

౫౫-౫౭ ఆర్యపుత్రా! అందమైన యీలేడి నామనసును హరించుచున్నది. మహాబాహూ! దీనిం గొనితెమ్ము! మనమాడుకొనుట కుపకరింపఁగలదు. ప్రాణములతోనే యీలేడి నీకుఁ బట్టువడెనా! యరణ్యవాసము ముగిసి, మనరాజ్యమునకుఁ బోయిన మనకు మాటిమాటికి నీలేడి వింతది యగును. అచటివారికిని వింత చేకూర్పఁగలుగును. మనయంతఃపురమున కిది యొకయలంకారమే యగును.

౫౮ ప్రభూ! ఆర్యపుత్రుఁడగు భరతునకును, మాయత్తగార్లకును నీలేడిరూపము నిజముగా నచ్చెరుపాటు గలిగింపఁగలదు.

౫౯ ఓనరోత్తమా! ఈమృగోత్తమము ప్రాణములతోఁ బట్టువడదేని దీనిచర్మమైనను నాకుఁ బ్రియ మొనఁగూర్పఁగలదు.

౬౦ ఇట్లు నిన్నుఁ బ్రేరేపించు ఘోర మగు స్వేచ్ఛావ్యవహార మాడువాండ్ర కనుచితమైనదియే యైన నాజంతువుశరీరము నా కచ్చెరుపాటు గలిగించినది. అందుచేతనే యింతగా నిన్నుఁ బ్రేరించుచున్నదాన ననుట.

౬౧ ఇట్లు సీతమాట విని, వింతగ నున్న యాలేడిని జూచి, శ్రీరామచంద్రుఁడు లక్ష్మణుం గని హర్షసహితుఁడై యి ట్లనియె.

* తమోగుణస్వరూపిణి యగు నాసీత లేడిని జూచి రామునితోఁ బలికెను - అని ప్రమాణము.

పశ్య లక్ష్మణ! వైదేహీం మృగత్వచిగతస్పృహాం
త్వచాప్రధానయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి. ౬౨
పశ్యాస్య జృంభమాణస్య దీప్తా మగ్నిశిఖోపమాం
జిహ్వాముఖా న్నిర్గతతీం మేఘాదివ శతహ్రదాం. ౬౩

* నకాదళీ నప్రియకీ నప్రవేణీ న చావికీ
భవే దేతస్య సదృశా స్పర్శనే నేతి మే మతిః. ౬౪

---

* కదల్యేవ కాదలీ - మృగవిశేషః. వైజయంత్యాం కదలీతు బిలే శేతే మృదుసూక్ష్మోక్షకర్బురైః, నీలాగ్రై ర్లోమభి ర్యుక్తా సా వింశత్యఙ్గులాయతా. కాదలీ మృగవిశేషత్వక్ — కదలీ వృక్షస్యత్వగితివా.

ప్రియకీ - ప్రియకీ లోమభి ర్యుక్తా మృదుశ్చ మస్సృణై ర్ఘనైః. ఇతి మృగవిశేషః. ప్రియకస్యమృగస్య త్వక్, ప్రియకస్య వృక్షస్య త్వగితివా.

ప్రవేణీ - మృగవిశేషః (అజవిశేషసంబంధీ) - ఆస్తరణవిశేషోవా.

ఆవిరేవ ఆవికః- తస్యేయ మా వికీ - చర్మ, తల్లోమనిర్మితా శాటీ వే త్యర్థః.



౬౨ లక్ష్మణా! ఈలేడిచర్మముపై నాసపడుచున్న యీజనకరాజకుమార్తెను జూడుము. చర్మప్రధాన మగు నీమృగ మిప్పుడు జీవింపదు.

౬౩ చూడుము! మేఘమునుండి వెలువడు మెఱపువోలె, నావులించునపుడు ప్రజ్వలించు నగ్నిజ్వాలనుబోలె దీనినోటనుండి వెలికివచ్చు నాలుకను గనుఁగొనుము.

౬౪ ♦ ఇది కాదళి కాదు. ప్రియకి కాదు. ప్రవేణి కాదు. ఆవికియుఁ గాదు. దేనిని దాఁకినను దీనిం దాఁకినట్లు కాదు.

---

♦ ఈపదముల కర్థములు పలువిధములఁ గన్పట్టుచున్నవి. వివరణమున మూలపదములనే వాడి, యర్థము నిటఁ బొందుపఱచుచున్నాము.

కదలియే కాదలి యని చెప్పఁబడును. నల్లచాఱల యిఱ్ఱి యందురు. వైజయంతియందు దీనిలక్షణము కదలి బిలములలోఁ బరుండును. మృదువులై, సూక్ష్మములై, పొడవైనవై, కర్బురవర్ణము గలవై, నల్లనికొనలు గల రోమములు గలిగి, యిరువదియంగుళములు పొడవు గలది కదలి అని కలదు. ఆకదలియొక్క చర్మము కాదలి యని యొకతీరు. కదలి (అరటిచెట్టు) యొక్క పట్ట కాదలి యని మరొక్కతీరు.

ప్రియకి చిత్రవర్ణముగల జింక (బొట్లయిఱ్ఱి యనియు నందురు). మృదువై, నునుపై, గట్టివైన రోమములు కలది. ప్రియక మను నీ జింకయొక్క చర్మము ప్రియకి యఁట! లేక ప్రియకమను వృక్షముయొక్క పట్ట ప్రియకి యని యొకవిధము.

ప్రవేణి (మృగవిశేషము) మేకలలో నొకరకపు మృగమనియు ఆమృగముయొక్క రోమములచే నిర్మింపఁబడిన యాస్తరణవిశేషమనియు నర్థము.

ఆవికి-'అవి' యే 'ఆవికము' అని చెప్పఁబడును. మృగవిశేషము. దీనికి సంబంధించిన చర్మము 'ఆవికి' గావచ్చును. లేక ఆజంతువు రోమములచేఁ నిర్మింపఁబడిన కంబల మనియో, శాటి యనియో చెప్పవచ్చును. మొత్త మివన్నియు మృదుస్పర్శగలవస్తువు లనుట ప్రధానము.

32

హత్వైత చ్చర్మ మాదాయ శీఘ్రి మేష్యామి లక్ష్మణ !
ఇహ త్వం భవ సన్నద్ధో యంత్రితో రక్ష మైథిలీం. ౬౫

* అస్యా మాయత్త మస్మాకం యత్కృత్యం రఘునందన!
౬౫½

శంకమానస్తు తం దృష్ట్వా లక్ష్మణో రామ మబ్రవీత్. ౬౬

తమేవై న మహం మన్యే మారీచం రాక్షసం మృగం
మృగో హ్యేవం ఽవిధో రత్నవిచిత్రో నాస్తి రాఘవ! ౬౭
జగత్యాం జగతీనాథ ! మాయైషాహి నసంశయః. ౬౭½

శ్రీరామ ఉవాచ—

యది వాయం తథా య న్మాం భవే ద్వదసి లక్ష్మణ ! ౬౮
మాయైషా రాక్షస స్యేతి కర్తవ్యో ఽస్య వధో మయా
ఏతేన హి నృశంసేన మారీచే నాకృతాత్మనా. ౬౯
వనే విచరతా పూర్వం హింసితా మునిపుంగవాః. ౬౯½

భవే ద్ధతో ఽయం వాతాపి రగస్త్యే నేవ మాం గతః. ౭౦

---

* అస్యా మితి- అస్మాకం యత్కృత్య మావశ్యకం తత్సర్వ మస్యా మాయత్తం. ఏతన్మూలతయా రావణవధాదికం కర్తవ్య మితి ధ్వనిః.



౬౫ దీనిం జంపి దీనిచర్మమును గొని వేగమే వత్తును. నీ విచట ధనుః ఖడ్గాదిసాధనములతో నేమరుపాటు లేక జనకరాజసుతను గాపాడుము.

౬౫½ రఘుకుమారా ! * మన కావశ్యకమైన కృత్యమంతయు నీమె (సీత) యధీనమై యున్నది. అందుచే నీమె రక్షణమే ప్రధాన మనుట.

౬౬ లక్ష్మణుఁ డాలేడివిషయమై సంశయముకలవాఁడై రామునితో నిట్లు పలికెను.

౬౭-౬౭½ శ్రీరామచంద్రా ! ఆమారీచుఁ డను రాక్షసుఁడే యీ మృగ మని నేనును దలఁచుచున్నాను. రత్నములచేఁ జిత్రమైన యిట్టిలేడి యీ జగమున నెందును లేదు. జగత్ప్రభూ ! శ్రీరామచంద్రా ! ఇది మాయ. సందియము లేదు.

నా విని శ్రీరామచంద్రుఁ డి ట్లనియె—

౬౮-౬౯½ లక్ష్మణా ! నాతో నీ వన్న ట్లిది రాక్షసునిమాయయే యగుచో దీని దప్పక చంపవలసినదే. దురాత్ముఁడును, నీచుఁడును, ఈయడవిలోఁ దిరుగాడువాఁడు నగు నీమారీచునిచేఁ దొల్లి యెందరో మునిపుంగవులు హింసింపఁబడిరి.

౭౦ వాతాపి యగస్త్యునిచేఁ జిక్కి చచ్చినట్లు వీఁడును నన్నుఁ జేరి చచ్చునుగాక !

---

* మన కావశ్యకమైన కార్యమంతయు నీమెయధీనమయి యున్నది. అనఁగా నీమెమూలముననే, రావణసంహారాదికార్యము జరుగవలసి యున్నదని ధ్వని.

ప్రిదక్షిణే నాతిబలేన పక్షిణా జటాయుషా బుద్ధిమతాచ లక్ష్మణ!, భనాపరిమత్తః పరిగృహ్య మైథిలీం ప్రతిక్షణం సర్వత ఏవ శంకితః. ౨౧

[1] ఇత్యుక్త్వా ప్రియయారామోమాయామృగ మనుద్రుతః
మాయా య దాశరియా లోకే మోహినీ జగదాకృతిః. ౨౨

[2] ఆఖేలయ న్విశిఖ మేకకరేణ మందం కోదండకాండ మప
రేణ దధార సజ్యం, సన్నహ్య పుష్పలతయా పటలం
జటానాం రామో మృగం మృగయతే వనవీధికాసు. ౨౩

ఇతి శ్రీమద్రామాయణసారోద్ధారే అరణ్యకాండే
దశమ స్సర్గః.

---

## ఏకాదశస్సర్గః.

[3] స త మున్మాదయామాస మృగరూపో నిశాచరః
మృగైః పరివృతో వన్యై రదూరా త్ప్రత్యదృశ్యత. ౧
గృహీతు కామం దృష్ట్వైనం పునరేవాభ్యధావత
తత్క్షణాదేవ సంత్రాసా పునరంతర్హితా ఽభవత్. ౨
పునరేవ తతో దూరా ద్వృక్షషండా ద్వినిస్సృతః. ౩

1. అధ్యాత్మ రా. ౭ స. 2. బోధాయనరామాయణం.
3. వాల్మీకి రా. ౪౪ స.



౨౧ లక్ష్మణా! మిక్కిలిసమర్థుఁడును, బలవంతుఁడును, బుద్ధిమంతుఁడు నగు జటాయువుతోఁగూడి సీతను గనిపెట్టుకొని, క్షణక్షణమునను, నన్నియెడలనుండియుఁ బ్రమాదమును శంకించుచునే యేమఱకుండుము.

౨౨ లోకమున నెల్లర మోహింపఁజేయు జగదాకారమైన మాయ యెవ్వని దిక్కుగాఁ గలిగియున్నదో; అట్టి శ్రీరామచంద్రుఁ డిట్లు తమ్మునితోఁ బలికి యామాయామృగమును వెంబడించెను.

౨౩ ఒకచేతితో బాణముఁను మెల్లన నూగించుచు, నారి నెక్కిడిన కోదండము రెండవచేత ధరించి, పూలతోఁగూడిన తీఁగచే జటాపటలమును ముడివెట్టి, శ్రీరాముఁ డరణ్యవీథులయందు లేడిని వెదకుచుండెను.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమునందుఁ
బదియవ సర్గము.

---

## పదునొకండవ సర్గము.

౧-౩ లేడిరూపమున నున్న యామారీచుఁ డను రక్కసుఁడు శ్రీరామచంద్రునిమనస్సును మిగుల భ్రమింపఁజేసెను. వన్యమృగములతోఁ గూడి దాఁపుననే పొడఁగట్టెను. తనను బట్టుకొనఁజూచు నారామునిం జూచి మఱలఁ బరువులు వాఱుచుండెను. క్షణములోనే భయపడి మఱల కనుమఱఁగి పోవుచుండెను. అంతలోనే తిరిగి దూరముగాఁ జెట్లగుబురునుండి వెలువడుచుండెను.

[1] హస్తాభ్యాసముపైతి లేఢిచ తృణం సంస్పృశ్యతాం గాహతే। గుల్మాన్ ప్రాప్య నివర్తతే కిసలయా న్నాఘ్రాయ చాఘ్రాయచ, భూయః పశ్యతి గచ్ఛతి ప్రతిదిశం కండూయతే స్వాం తనుం। దూరం ధావతి తిష్ఠతి ప్రచలతి ప్రాంతేషు మాయామృగః. 3-3౹

[2] దర్శనాదర్శనా దేవం సో ఽపాకర్షత రాఘవం. ౪
సుదూర మాశ్రమ స్యాస్య మారీచో మృగతాం గతః. ౪౹

దృష్ట్వా రామో మహాతేజా స్తం హంతుం కృతనిశ్చయః. ౫
తమేవ మృగ ముద్దిశ్య శ్వసంత మివ పన్నగం
ముమోచ జ్వలితం దీప్త మస్త్రం బ్రహ్మవినిర్మితం. ౬

శరీరం మృగరూపస్య వినిర్భిద్య శరోత్తమః
మారీచ స్యైవ హృదయం బిభే దాశనిసన్నిభః. ౭

తాలమాత్ర మథోత్ప్లుత్య న్యపత త్సశరాతురః. ౭౹

మ్రియమాణస్తు మారీచ స్స్మృత్వా రావణభాషితం. ౮
సంప్రాప్తకాల మాజ్ఞాయ చకార చ తత స్స్వరం
సదృశం రాఘవస్యైవ హాసీతే! లక్ష్మణేతిచ. ౯
[3] ఇత్యుక్త్వా రామవ ద్వాచా పపాత రుధిరాశనః. ౯౹

1. బోధాయనరామా. 2. వాల్మీకిరా. ౪౪ స. 3. అధ్యాత్మరా. ౭ స.



3-3౹ చేతికి దొరకిన ట్లుండును. గడ్డి కొఱుకుచున్న ట్లుండును. తాఁకుటకు వీలుగనే యున్నట్లౌను. పొదల దాటి వెలువడుచుండును. చివురులను మూర్కొని మూర్కొని, సారెసారెకుం జూపుల సారించును. ఎల్లదెసలకుం బారును. తనమేను గోకికొనును. దూరదూరముగఁ బఱువులు వారుచు నంతలో నట నిలువఁబడుచు, దాఁపులఁ జేరి బెదరుచు నిట్లు మాయామృగము పలుపోకల వర్తించుచుండెను.

౪-౪౹ ఈవిధముగఁ గనఁబడి కనబడకుండ మారీచుఁడు లేడిరూపము నొంది శ్రీరామచంద్రు నాశ్రమమునుండి మిపుల దూరముగ నాకర్షించుకొనిపోయెను.

౫-౬ మహాతేజస్వి యగు శ్రీరామచంద్రుఁ డిఁక మాయామృగాకారుఁడగు మారీచుని జంప నిశ్చయించి, వానికి గురివెట్టి ఫూత్కారమొనరించు పన్నగమువలె నుండినట్టియు, ప్రజ్వలించునదియు, బ్రహ్మచే నిర్మింపఁబడినదియు నగు నస్త్రమును వదలెను.

౭ ఆశ్రేష్ఠమైన బాణము మృగరూపుఁ డగు వానియొక్క శరీరమును బ్రద్దలుచేసి, పిడుగువంటిదై మారీచునిగుండెలను బగులఁ గొట్టెను.

౭౹ ఆరక్కసుఁ డపుడు బాణపీడితుఁడై తాడిచెట్టంత యెత్తున కెగసి పడి పుడిమిపైఁ గూలెను.

౮-౯౹ ప్రాణములు వదలుచు వాఁడు రావణునిమాటఁ దలఁచి కాలము వచ్చిన దని యెఱింగి, యప్పుడు హాసీతా! లక్ష్మణా! యని శ్రీరామునిస్వరముపోలిక నార్పువెట్టెను. ఇట్లు రామునివలెఁ బలికి యారక్కసుఁడు నేలఁగూలెను.

యన్నామాజ్ఞో౽పిమరణేస్మృత్వాతిత్సామ్యమాప్నుయాత్
కిము తాగ్రే హరిం పశ్యం స్తేనైవ నిహతో ౽సురః. ౧౦½

తద్దేహా దుత్థితం తేజ స్సర్వలోకస్య పశ్యతః. ౧౧
రామమే వావిశ ద్దేవా విస్మయం పరమం యయుః. ౧౧½

కిం కర్మ కృత్వా కిం ప్రాప్తః పాతకీ మునిహింసకః. ౧౨
అథవా రాఘవ స్యాయం మహిమా నాత్ర సంశయః. ౧౨½

భయా త్సర్వం పరిత్యజ్య గృహవిత్తాదికం చ యత్. ౧౩
హృది రామం సదా ధ్యాత్వా నిర్ధూ తా శేషకల్మషః
అంతే రామేణ నిహతః పశ్య న్రామ మవాప సః. ౧౪

ద్విజోవా రాక్షసోవాపి పాపీవా ధార్మికో ౽పివా
త్యజ న్కళేబరం రామం స్మృత్వా యాతి పరంపదం. ౧౫

ఇతి తే ౽న్యోన్య మాభాష్య తతో దేవా దివం యయుః.
౧౫½

సీతా తద్భాషితం శ్రుత్వా మారీచస్య దురాత్మనః. ౧౬
భీతాతిదుఃఖసంవిగ్నా లక్ష్మణం త్విద మబ్రవీత్. ౧౬½
గచ్ఛ లక్ష్మణ ! వేగేన భ్రాతా తే ౽సురపీడితః. ౧౭
హా లక్ష్మణేతి వచనం భ్రాతు స్తే న శృణోషి కిం. ౧౭½



౧౦-౧౦½ ఏరామచంద్రునినామము నవసానసమయమున మూఢుఁడు గూడ స్మరించినంత నే యారామసాయుజ్యము నందఁగలుగునో; అట్టి సాక్షా న్మహావిష్ణుస్వరూపుఁ డగు శ్రీరామచంద్రునే యెదుటఁ జూచుచు నాతనిచేతిలోఁ జచ్చిన రక్కసునిమాట వేరే చెప్పవలయునా ?

౧౧-౧౧½ అప్పుడే (చనిపోయి నిజరూపము నొందిన) యామారీచునిదేహము నుండి వెడలిన దివ్యతేజ మఖిలలోకములును జూచుచుండఁగనే రామునందే ప్రవేశించెను. దేవతలు చాల యాశ్చర్యపడిరి.

౧౨-౧౨½ మునుల హింసించిన యీమహాపాపి యే మ్మేమి పని చేసి, యెట్టి గతి పొందెను? ఔరా! ఇది శ్రీరామచంద్రునిమహిమకాని వేఱు గాదు. ఇందు సంశయము లేదు.

౧౩-౧౪ రామునివలని భయముచే నిల్లు, ధనము, భార్య మొదలగువాని నెల్ల విడిచి యెల్లప్పుడు రాముని నే హృదయమున (భయముచే) ధ్యా నించుచు సమస్తపాపములను బోఁగొట్టుకొన్నవాఁడై, తుదకు రాముని చేత నే చచ్చి, రాము నే చూచుచు రామసాయుజ్యము నే పొందెను.

౧౫ బ్రాహ్మణుఁడు - రాక్షసుఁడు, దురాత్ముఁడు - ధర్మాత్ముఁడు నను భేదములేక ఎవ్వఁడేని సమానముగా నే శరీరావసానసమయమున శ్రీరాముని స్మరించి పరమపదమును బొందఁగలఁడు.

౧౫½ ఇట్లు దేవత లొకరితో నొక రనుకొనుచు నటుపై స్వర్గలోకమున కేగిరి.

౧౬-౧౬½ ఇఁక నిచట సీత దురాత్ముఁ డగు మారీచుని యామాట చెవిని బడి, భయపడి, దుఃఖముచే బేలవడి లక్ష్మణునితో ని ట్లనియె.

౧౭-౧౭½ లక్ష్మణా ! వేగముగాఁ బొమ్ము ! మీయన్న రాక్షసునిచేఁ బీడింపఁబడెడిని. " హాలక్ష్మణా ! " యను నీసోదరునిమాటను నీవు వినలేదా !

తా మాహ లక్ష్మణో దేవి! రామవాక్యం న తద్భవేత్. ౧౮
యః కశ్చి ద్రాక్షసో దేవి! మ్రియమాణో ఽబ్రవీ ద్వచః
రామ స్త్రైలోక్య మపి యః క్రుద్ధో నాశయతి క్షణాత్.
స కథం దీనవచనం భాషతే ఽమరపూజితః. ౧౯½

క్రుద్ధా లక్ష్మణ మాలోక్య సీతా బాష్పవిలోచనా. ౨౦
ప్రాహ లక్ష్మణ ! దుర్బుద్ధే ! భ్రాతు ర్వ్యసన మిచ్ఛసి.
ప్రేషితో భరతే నైవ రామనాశాభికాంక్షిణా. ౨౧
1 నైత చ్చిత్రం సపత్నేషు పాపం లక్ష్మణ ! య ద్భవేత్
త్వద్విధేషు నృశంసేషు నిత్యం ప్రచ్ఛన్నచారిషు ౨౨

2 మాం నేతు మాగతో ఽసి త్వం రామనాశ ఉపస్థితే
నప్రాప్స్యసేత్వం మా మద్యపశ్య ప్రాణాం స్త్యజామ్యహం. ౨౩

న జానా తీదృశం రామ స్త్వాం భార్యాహరణోద్యమం. ౨౩½

3 కథ మిందీవరశ్యామం పద్మపత్రనిభేక్షణం. ౨౪
ఉపసంశ్రిత్య భర్తారం కామయేయం పృథగ్జనం. ౨౪½

రామంవినా క్షణమపి నహి జీవామి భూతలే. ౨౫
ఆబంధిష్యే ఽథవా త్యక్ష్యే విషమే దేహ మాత్మనః
పిబా మ్యహం విషం తీక్ష్ణం ప్రవేక్ష్యామి హుతాశనం. ౨౬
న త్వహం రాఘవా దన్యం పదాపి పురుషం స్పృశే. ౨౬½

1. వాల్మీకి రా. ౪౫ స. 2. అధ్యాత్మ. ౭ స. 3. వాల్మీకి రా. ౪౭. స.



౧౮-౧౯½ అంత లక్ష్మణుం డామెతో; దేవీ ! అది రామవాక్యము కాదు. ఎవ్వఁడో రక్కసుఁ డొక్కఁ డాతనిచేఁ జచ్చుచు నిట్లు పలికెను. అలిగెనా ? యొక్కక్షణములో ముల్లోకముల నశింపఁజేయఁగల వాఁడు రాముఁడు. అట్టిరాముఁడు దేవవంద్యుఁ డగు మహానుభావుఁడు దీనమైనమాట నెట్లు పలుకును ?

౨౦-౨౨ అన విని సీత కుపితురాలై లక్ష్మణుం గని, బాష్పపూరితలోచనయై యి ట్లనియె—లక్ష్మణా! దుర్బుద్ధీ ! నీవు నీయన్నకు విపత్తు రావలె నని కోరుచున్నావు. రాముని నాశనమును గోరు భరతునిచేత నే నీవు పంపఁబడినాఁడవు. లక్ష్మణా ! ఎల్లపుడును గుట్టు దెలిసికొనవలె నని రహస్యముగా వర్తించు నీవంటికౄరు లగు దాయాదులయందిట్టి పాపము గల్గె నన్న నిది వింత గాదు.

౨౩ రామనాశనము కాఁగా; నన్నుఁ గొంపోవలయు నని నీ విటకు వచ్చితివి. కాని నీవు నన్నుఁ గొంపోఁజాలవు. చూడు మిప్పుడే ప్రాణముల విడుచుచున్నాను.

౨౩½ తనభార్యను హరింప నుద్యమించినవానినిగా నిన్ను రాముఁ డెఱుంగఁడు.

౨౪-౨౪½ నల్లగలువవంటి దేహచ్ఛాయ గలవాఁడును, తామరరేకులవంటి కన్నులు గలవాఁడును నగు శ్రీరామచంద్రుని ప్రాణేశ్వరునిగాఁ బొంది యాశ్రయించిన నేను మఱొక్కని నెట్లు కామింతును ?

౨౫-౨౬½ ఉరిపోసికొందును లేక విషమప్రదేశమునఁ బడి యొడలు విడుతును. విసమైనఁ ద్రావెదను. మండెడు నగ్నిలోనైనఁ జొచ్చెదను. అంతియేకాని రామునికంటె నన్యపురుషుని గాలితోనైన దాఁకను.

గోదావరీం ప్రవేక్ష్యామి వినా రామేణ లక్ష్మణ ! ౨౭

* ఇతి లక్ష్మణ మాక్రుశ్య సీతా దుఃఖసమన్వితా
పాణిభ్యాం రుదతీ దుఃఖా దుదరం ప్రజఘానహ. ౨౮

1 తచ్ఛ్రుత్వా లక్ష్మణః కర్ణౌ పిధాయాతీవ దుఃఖితః
2 అబ్రవీ ల్లక్ష్మణ స్సీతాం ప్రాంజలి ర్విజితేంద్రియః. ౨౯

ఉత్తరం నోత్సహే వక్తుం దైవతం భవతీ మమ
వాక్య మప్రతిరూపంతు నచిత్రం స్త్రీషు మైథిలీ. ౩౦
న్యాసభూతాసి వైదేహి న్యస్తా మయి మహాత్మనా
రామేణ త్వం వరారోహే! న త్వాంత్యక్తుమిహోత్సహే. ౩౧

---

* ఇతీతి-అత్ర 'గచ్ఛ లక్ష్మణ' ఇత్యారభ్య 'దుఃఖా దుదరం ప్రజఘానహ' ఇత్యంతేన సీతాసంభాషణేన మాయాసీతా హృదయం సుస్పష్టం. అతిత్యవిషయ ఏవ ప్రస్తావవశేన సుభద్రాంప్రతి శ్రీకృష్ణే నేత్థం ప్రతిపాదితః. తథాహి ఆగ్నేయపు. ౨౨ అధ్యాయే శ్లో॥ పురా సీతాపి సౌమిత్రిం బహూక్త్వా దుర్వచ స్సతీ, సంపాద్య దుఃఖం భర్తుశ్చ స్వయం ప్రాపచ సంకటం. నిదర్శయంతీ నారీణాం దుశ్శీలం పాపమానసం, లోకమాతా కరో దేవం లోకరక్షార్థ మాగతా. తస్మా త్సర్వాత్మనా భద్రే మా కృథా భర్తు రప్రియ మితి.

---

1. అధ్యాత్మ రా. ౭ స. 2. వాల్మీకి రా. ౪౫ స.



౨౭ లక్ష్మణా! రాముఁడే లేనిచో గోదావరీనదిలో దిగెదను.

౨౮ *ఇట్లు లక్ష్మణునికడ నాక్రోశించి, దుఃఖమువలన చేతులచే నుదరము బాదుకొనుచు నేడ్చెను.

౨౯ అది విని లక్ష్మణుఁడు రెండుచెవులు మూసికొని, మిగుల దుఃఖించి, జితేంద్రియుఁ డగు నాతఁడు దోసిలొగ్గి సీతను గాంచి యిట్లనియె.

30-3౧ నాపాలిఁటి దేవతవై పూజ్యురాల వగు నీకుం బదులుమాట పలుకుట కుత్సహింపను. జనకరాజపుత్రీ! అనుచితముగ మాటలాడుట స్త్రీలలో వింత గాదు. మహాత్ముఁ డగు శ్రీరామచంద్రునిచే నాకడఁ దాచఁబడినదానవు. కావున నిన్నిచట నొంటరిగా విడుచుట కిచ్చగింపను. విదేహరా జగు జనకునివంటివానికిఁ బుత్రిక

---

* ఇట 'లక్ష్మణా వెళ్లుము' అని మొదలుకొని 'దుఃఖమువలనఁ గడుపు బాదుకొనెను' అనువరకు సీతాసంభాషణముచే, మాయాసీత యొక్క హృదయము స్పష్టమగుచున్నది. ఇటనున్న యంశమే ప్రస్తావనావశమున సుభద్రనుగూర్చి శ్రీకృష్ణునిచే నిట్లు తెలుపఁబడెను. ఆగ్నేయపురాణమున ౨౨ అధ్యాయమున 'మున్ను సీతయు లక్ష్మణునిగూర్చి దుఃఖవచనములు చాల పలికి, భర్తకును దుఃఖమును గలిగించి, తాను సంకటస్థితిని బొందెను. స్త్రీల చెడ్డమనస్సును, చెడు నడువడిని జూపుటకై లోకమాత లోకరక్షణకొఱకు వచ్చి యిట్లు చూపెను. కనుక నోకల్యాణీ! అన్ని విధములచేతను భర్త కెన్నఁడు నప్రియ మగు కార్యముం జేయకుము.'

న సహే హీదృశం వాక్యం వై దేహి! జనకాత్మజే!
శ్రోత్రయో రుభయో ర్మేఽద్య తప్తనారాచసన్నిభం. ౩౨

ఉపశృణ్వంతు మే సర్వే సాక్షిభూతా వనేచరాః
గమిష్యే యత్ర కాకుత్స్థ స్స్వస్తి తేఽస్తు వరాననే! ౩౩

రక్షంతు త్వాం విశాలాక్షి! సమగ్రా వనదేవతాః
1 మా త్వా ముల్లంఘయ స్వేమాం ప్రాణైః కంఠగతై రపి. ౩౪
ఇత్యుక్త్వా ధనుషః కోట్యా కృత్వా రేఖాం సమంతతః
బాహ్యదేశే పంచవట్యాం సౌమిత్రిః పరిఘోపమాం. ౩౫
నత్వాసీతాంతతస్తూష్ణీంయయౌరామంత్వరాన్వితః. ౩౫½

2 త దాసాద్య దశగ్రీవః క్షిప్ర మంతర మాస్థితః ౩౬
* అభిచక్రామ వై దేహిం పరివ్రాజకరూపధృత్
శ్లక్ష్ణకాషాయసంవీతః శిఖీ ఛత్రీ ఉపానహీ. ౩౭
వామే చాంసేఽవసజ్యాథ శుభే యష్టికమండలూ
పరివ్రాజకరూపేణ వై దేహిం సముపాగమత్. ౩౮

* అభిచక్రామేతి - అభిచక్రామ - అభిముఖ్యే నాజగామ. పరివ్రాజకో భిక్షుః తస్యరూపం లింగం ధారయతీతి పరివ్రాజకరూపధృత్ రావణధారితపరివ్రాజకలింగా న్యాహ శ్లక్ష్ణేతి-అత్ర ధర్మప్రధానజనకకులనందిన్యా ధర్మస్వరూప శ్రీరామస్య పత్న్యాస్సీతాయాః విశ్వాసాయ 'తీర్థాటపర్య

1. ఆనంద రా. సా. కాం. ౭ స. 2. వాల్మీకి రా. ౪౬ స.



నైన నీ విట్టు పలుకువాక్యము నేను సహింపఁజాలను. ఇది నారెండు చెవులలోఁ గాల్చినయినుపబాణమును గ్రుచ్చినట్లైనది.

౩౩ ఈవనమునందుఁ జరించువారందరు సాక్షిభూతులై నావాక్యము విందురుగాక! శ్రీరామచంద్రుఁ డెచట నున్నాఁడో; అచటకే నేను బోవుచున్నాను. సీతా! సుముఖి వగు నీకు మంగళ మగును గాక!

౩౪-౩౫½ ఓవిశాలనేత్రములు గల జానకీ! ని న్నిట నుండు వనదేవత లందరును గాపాడుదురుగాక! తల్లీ! ప్రాణములు కంఠగతములైన నగుఁగాక! నీవు నేను గీఁచిన యీగీఁతను దాటకుము! అని పల్కి పంచవటికి వెలుపలిప్రదేశమున ధనుష్కోటిచేఁ బరిఘాకారమున నొకరేఖ గీఁచి సీతకు నమస్కరించి మారుమాటాడక వేవేగ శ్రీరాముని సన్నిధి కేగెను.

౩౬-౩౮ * రావణుఁడు వేచికొని యుండి యీయవకాశమును గనిపెట్టి యపుడు పరివ్రాజకవేషమును ధరించి జానకి కెదురుగా నేగెను. నునుపైన కాషాయవస్త్రములను గప్పుకొని, శిఖను ధరించి, గొడుగు పట్టుకొని, పాముకోళ్లు దొడిగికొని, శుభములైన దండమును, కమండులువు నెడమభుజమునకు వ్రేలాడఁ దగిలించుకొని వాఁడు (పరివ్రాజకవేషముతో) సీతాదేవిని సమీపించెను.

* 'అభిచక్రామ' అనుదాని వ్యాఖ్య. అభిచక్రామ = ఎదురుగాఁ జనెను. పరివ్రాజకుఁడు అనఁగా భిక్షువు. వానిరూపమును అనఁగా వానిచిహ్నమును ధరించినవాఁడు కనుక పరివ్రాజకరూపము ధరించినాఁ డని చెప్పఁబడెను. రావణుఁడు దాల్చిన యాసన్యాసిచిహ్నములే "నునుపైన కాషాయము ధరించి" అనునదాదిగా వర్ణింపఁబడినవి. ఇఁట ధర్మప్రధాను లగు జనకరాజులవంశమునఁ గుమార్తెయై, ధర్మస్వరూపుఁ డగు శ్రీరామునికి ధర్మపత్ని యగు సీతకు నమ్మకము గల్గించుకొఱకు "తీర్థములం దిరుగుట, భిక్ష మడుగు

తా మాససా దాతిబ్యో భ్రాతృభ్యాం రహితాం వనే
రహితాంచంద్రసూర్యాభ్యాంసంధ్యామినమహత్తమః. ౩౯

త ముగ్రతేజః కర్మాణం జనస్థానరుహాద్రుమాః
సమీక్ష్య నప్రకంపంతే నప్రవాతిచ మారుతః. ౪౦

---

టంతో భైక్షం కుర్వంత ఇత్యాది లక్షణోపేత శిఖి ఛత్రీ ఉపానహీత్యాదినా బహూదకత్రిదండసన్యాసిరూపే ణాజగామేతి ద్యోత్యతే. అత్ర కేచన అద్వైతయతినిందాం మనసి నిధాయ శ్లో॥ బ్రహ్మసూత్రం త్రిదండంచ వస్త్రం జంతు నివారణం। శిక్యం పాత్రం బృసీం చైవ కౌపీనం కటి వేషణం। యస్యైత ద్విద్యతే లింగం స యతి ర్నేతరో యతి రితి-బహూదకపరివ్రాజైకవేషలక్షణనిరూప కాంగి రోవచన ముదాహృత్య తూష్ణీం స్థితాః. పరివ్రాజకస్వరూపం తత్వతోగ్రహణార్థ మత్ర కాణ్వాయనస్మృతే రర్థో ఉచ్యతే. పరివ్రాజకా శ్చతుర్విధాః - కుటీచకా బహూదకా హంసాః పరమహంసా శ్చేతి. తత్ర కుటీచకాః స్వపుత్ర గృహే భిక్షాం చరంత స్త్రిదండినః. బహూదకాస్తు త్రి దండినః శిక్యజలపాత్రపాదుకాసనశిఖాయజ్ఞోపవీతకౌపీన కాషాయవేషధరా స్తీర్థాటన పర్యటంతో భైక్షం చరంత ఆత్మానం ప్రార్థయంతే. హంసా - ఏకదండినః శిఖావర్జం యజ్ఞోపవీతధరాః. పరమహంసాస్తు ఏక దండధరాః ముండినః త్యక్తయజ్ఞోపవీతినః సన్యస్తసర్వకర్మాణ ఆత్మ నిష్ఠా ఇతి.



౩౯ మహాబలవంతుఁ డగు వాఁడు, అన్నదమ్ము లిరువురును అయ్యాశ్రమ మున లేక యొంటిపాటున నట్టడవి నున్న యాసీతను జంద్ర సూర్యులు లేని సంధ్యను పెంజీఁకటి గ్రమ్మినట్లు జేరెను.

౪౦-౪౦½ భయంకరతేజమును భయంకరచర్యలును గల యారావణునిం గని జనస్థానమందు చెట్లాకైనను గదల్పక నిలుచంబడెను. వాయువు

---

కొనుట మొద లగు లక్షణములతోఁ గూడి శిఖగలవాఁడై ఛత్ర మును ధరించినవాఁడై" అని యీవిధముగా వర్ణింపఁబడినటులు రావణుఁడు త్రిదండులలో నొకతెగకుఁ జేరిన బహూదకసన్యాసి రూపమున వచ్చె నని సూచింపఁబడుచున్నది. ఇటఁ గొందరు అద్వైతమతనిందను మనసున నుంచుకొని "బ్రహ్మసూత్రము, త్రిదండము, జంతునివారకమైన వస్త్రము, శిక్యము (ఉట్టి), పాత్రము, బృసి (ఆసనవిశేషము), కౌపీనము, కటికి జుట్టు మొల వస్త్రము అను నీచిహ్నము లెవ్వని కుండునో వాఁడే యతి; యితరుఁడు కాఁడు" అని బహూదకపరివ్రాజకులలో నొకతెగ వారిలక్షణములను దెలుపు నాంగిరసునివచనము నుదాహరించి యూరకొందురు. పరివ్రాజకుల స్వరూపము స్పష్టముగా గ్రహిం చుటకై నిట కాణ్వాయనస్మృత్యర్థము వ్రాయఁబడుచున్నది. పరి వ్రాజకులు నాల్గువిధములుగ నుందురు. కుటీచకులు, బహూదకులు, హంసలు, పరమహంసలు అని. అందుఁ గుటీచకులు తమకుమారుల గృహములందే బిచ్చమడిగికొను త్రిదండులు. బహూదకులు శిక్యముఁ (ఉట్టి), జలపాత్రము (కమండలువు), పాదుకలు, కూర్చొనుట కాసనము, సిగ, జందెము, గోచి, కాషాయము వీనిని ధరించి తీర్థా టనము చేయుచు బిచ్చ మడిగి చరించుచు నాత్మానుసంధానము సేయువారు. హంసలు ఒకదండముగలవారు. జుట్టుండదు. జందె ములఁ దాల్తురు. పరమహంసలు ఒక్కటే దండము, తలలు బోడులు, యజ్ఞోపవీత ముండదు, సర్వకర్మపరిత్యాగము సేసి కేవల మాత్మనిష్ఠఁ గలిగియుందురు.

హతం తేన జనస్థానం ఖరశ్చ సహ దూషణః
అకంపనవచ శ్శ్రుత్వా రావణో వాక్య మబ్రవీత్. ౨౪

స సురేంద్రేణ సంయుక్తో రామ స్సర్వామరై స్సహ
ఉపయాతో జనస్థానం బ్రూహి కచ్చి దకంపన! ౨౫

అకంపన ఉవాచ—

నైవ దేవా మహాత్మానో నా౽త్ర కార్యా విచారణా
శరా రామేణ తూత్సృష్టా రుక్మపుంఖాపతత్రిణః. ౨౬
సర్పాః పంచాననా భూత్వా భక్షయంతిస్మ రాక్షసాన్
యేన యేనచ గచ్ఛంతి రాక్షసా భయకర్శితాః. ౨౭
తేన తేన స్మ పశ్యంతి రామమే వాగ్రత స్థితమ్. ౨౮

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
అష్టమ స్సర్గః.



౨౪ వానిచేతనే జనస్థానము నాశనము సేయఁబడినది. దూషణుఁడును, ఖరుఁడును నాశనమైరి. ఇట్లకంపనుఁడు చెప్పిన వాక్యములు విని రావణుఁ డి ట్లనియె.

౨౫ అకంపనా! ఆరాముఁడు దేవేంద్రునితోడను దేవతలందరితోడను గూడి జనస్థానమునకు వచ్చెనా యేమి? తెల్పుము.

అకంపనుఁ డి ట్లనియె.

౨౬–౨౮ మహాత్ము లగు దేవతలు లేరు. ఈ విషయమున విచారింపవలసిన దేదియు లేదు. బంగారు తొడుగులుగలిగి ఱెక్కలు గల బాణములను, రాముఁడు ప్రయోగింపఁగా నవి యైదుముఖములుగల సర్పములై మనరాక్షసులను దినివేయుచున్నవి. వానిచే భయపీడితులై రాక్షసు లెచ్చ టెచ్చట నేయేదారులఁ బట్టి పోవుచున్నారో యాయా దారులలో వా రెదురుగా (భయముచే) రామునే చూచుచున్నారు.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యాకాండమునం దెనిమిదవ సర్గము.

## న వ మ స్స ర్గః.

[1]అకంపనవచ శ్శ్రుత్వా రావణో వాక్య మబ్రవీత్
జనస్థానం గమిష్యామి హంతుం రామం సలక్ష్మణమ్. ౧

అథైవ ముక్తే వచనే ప్రోవా చేద మకంపనః
అసాధ్యః కుపితో రామో విక్రమేణ మహాయశాః. ౨

ఆపగాయా స్సుపూర్ణాయా వేగం పరిహరే చ్ఛరైః
సతారగ్రహనక్షత్రం నభ శ్చా ప్యవసాదయేత్. ౩
అసౌ రామస్తు మజ్జంతీం శ్రీమా నభ్యుద్ధరే న్మహీం. ౩½

సంహృత్యవా పునర్లోకా న్విక్రమేణ మహాయశాః. ౪
శక్త స్స పురుషవ్యాఘ్ర స్స్రష్టుం పునరపి ప్రజాః. ౪½
నహి రామో దశగ్రీవ! శక్యో జేతుం త్వయా యుధి. ౫
రక్షసాం వాపి లోకేన స్వర్గః పాపజనై రివ. ౫½

న తం వధ్య మహం మన్యే సర్వై ర్దేవాసురై రపి. ౬

అయం తస్య వధోపాయ స్తం మ మైకమనా శ్శృణు
భార్యా తస్యోత్తమా లోకే సీతానామ సుమధ్యమా. ౭

1. వాల్మీకి రా. ౩౧ స.



## తొమ్మిదవసర్గము.

౧ అకంపనుఁడు చెప్పినమాటలు విని రావణుఁ డి ట్లనియె. ఓరీ! నేను లక్ష్మణునితోఁగూడియున్న రాముని జంపుట కిదే జనస్థానమునకుఁ బోయెదను.

౨ ఇట్లు రావణుఁ డనఁ బిమ్మట నకంపనుఁ డి ట్లనియె. మహాయశస్వి యగు రాముఁడు కుపితుఁ డయ్యె నేని విక్రమముచే లొంగువాఁడు కాఁడు (ఇందలి 'విక్రము' అనుపదముచేఁ ద్రివిక్రమావతారము సూచింపఁబడినది).

౩-౩½ నిండేటి వేగమును దన బాణములచే నడ్డగింపఁగలఁడు (ఇందు కృష్ణా వతారము ధ్వనించును). చుక్కలు, గ్రహనక్షత్రములు వీనితోఁ గూడిన యాకాశమును రాల్పఁగలఁడు. (దీనిచేతను వామనావ తారము సూచిత మగుచున్నది). మఱియు నాశ్రీమంతుఁడు సముద్ర మున మునుఁగుభూమి నుద్ధరింపఁగలఁడు (ఇది మత్స్యావతారమును సూచించును). 'శ్రీమంతుఁడు' అనుటచే నేయవతారమునందును లక్ష్మి వెంట నే యుండు నని ధ్వని.

౪-౪½ మహాయశస్వియు, పురుషశ్రేష్ఠుఁడు నగు నారాముఁడు పరాక్రమ ముచే లోకములను బ్రజలను సంహరించి మఱల సృష్టింపఁగలవాఁడు.

౫-౫½ ఓదశగ్రీవా! నీవు యుద్ధమున శ్రీరాముని జయింపఁజాలవు. పాపా త్ములచే స్వర్గ మెట్లు జయింపఁబడదో, అట్లే రాక్షసులసమూహ ముచే రాముఁడు జయింపఁబడఁడు.

౬ దేవతలు, అసురులు నొక్కటై యెత్తివచ్చినను ఆరాముఁడు వధ్యుఁడు కాఁ డని నే ననుకొనుచున్నాను.

౭-౮ ఇదే వానిం జంపు నుపాయ మొక్కటి కలదు. దానిని శ్రద్ధతో వినుము. ఆ శ్రీరామునికి భార్య కలదు. ఆమె లోకమున నుత్తము రాలు. సీత యను పేరు గలది. చక్కనినడుము కలది. యౌవన

శ్యామా సమవిభక్తాంగీ స్త్రీరత్నం రత్నభూషితా
తస్యాపహర భార్యాం త్వంప్రమథ్యతు మహావనే. ౮
సీతయా రహితః కామీ రామో హాస్యతి జీవితం
[1] యద్యస్తి వంచనానామ తద్ధి నః కులజీవనం ! ౯

[2] అరోచయత తద్వాక్యం రావణో రాక్షసాధిపః
చింతయిత్వా మహాబాహు రకంపన మువాచహ. ౧౦
బాఢం కాలం గమిష్యామి హ్యేక స్సారథినా సహ
ఆనయిష్యామి వై దేహీ మిమాం హృష్టో మహాపురీం. ౧౧

అథైవ ముక్త్వా ప్రియయా ఖరయుక్తేన రావణః
రథే నాదిత్యవర్ణేన దిశ స్సర్వాః ప్రకాశయన్. ౧౨

స మారీచాశ్రమం ప్రాప్య తాటకేయ ముపాగమత్
మారీచే నార్చితో రాజా రావణో వాక్య మబ్రవీత్ ౧౩

అరక్షో మే హత స్తాత ! రామే ణాక్లిష్టకర్మణా
జనస్థాన మవధ్యం త త్సర్వం యుధి నిపాతితం. ౧౪

తస్య మే కురు సాచివ్యం తస్య భార్యాపహారణే
రాక్షసేంద్రవచ శ్శ్రుత్వా మారీచో వాక్య మబ్రవీత్. ౧౫

ఆఖ్యాతా కేన సీతాసా మిత్రరూపేణ శత్రుణా
త్వయా రాక్షసశార్దూల! కో నసందతి నిందితః. ౧౬

1. శివరామాయణం. 2. వాల్మీకి రా. ౩౧ స.



మున నున్నది. సమముగ విభజింపఁబడిన యవయవములు కలది. రత్నాంకితము లగు స్వర్ణభూషణములచే నలంకరింపఁబడిన స్త్రీరత్నము. ఆరామునిభార్యను మహారణ్యమున వంచించి నీవు హరింపుము. అట్లు సీతను నీవు హరించినచో, నామెయందే బద్ధానురాగుఁడగు రాముఁడు విరహబాధ నోర్వలేక ప్రాణముల వదలఁగలఁడు. లోకమున వంచన యనునది గలదేని యదియేకదా మనరాక్షసకులమునకు జీవనము !

౧౦ రాక్షసాధిపుఁ డగు రావణుఁ డామాటల కిష్టపడెను. మహాబాహుఁడగు వాఁ డాలోచించి యకంపనునితో ని ట్లనియె.

౧౧ మంచిది. నే నొక్కఁడనే సారథితోడ రేపుప్రాతఃకాలమున నటకేగెదను. జనకునికూఁతు రగు సీత నీలంకామహానగరమునకు సంతుష్టుఁడనై కొనివత్తును.

౧౨ అని యి ట్లకంపనునితోఁ బలికి, పిశాచవదనములు గల కంచరగాడిదలను గట్టి, సూర్యునివలె వెలుంగు రథముచే నెల్లదిక్కుల వెలిగించుచు రావణుఁడు వెడలెను.

౧౩ మారీచు నాశ్రమమునకుం జని, తాటకకొడు కగు మారీచుని జేరి వానిచేఁ బూజింపఁబడి రా జగు రావణుఁ డిట్లు పలికెను.

౧౪ తండ్రీ ! మారీచా ! సమర్థుఁ డగు రామునిచే నా ఖరాది రాష్ట్రాంతపాలకులు చంపఁబడిరి. అవధ్య మగు జనస్థానమెల్ల వానిచే యుద్ధమునఁ గూల్పఁబడినది.

౧౫ ఆరాముని భార్యను హరించుటయందు నీవు నాకు సాహాయ్యము నొనర్పవలయును. (అని పలుక) రాక్షసరాజుమాట విని మారీచుఁడి ట్లని పలికెను.

౧౬ ఓరాజా ! మిత్రునివలెఁ గన్పట్టు శత్రువుఁ డెవ్వఁడు నీ కాసీతవృత్తాంతమును జెప్పెను ? ఓరాక్షసశ్రేష్ఠుఁడా ! ఏనీచుఁడు నీచేఁ దిరస్కరింపఁబడి నీ యైశ్వర్యాదులఁ జూచి గిట్టక యున్నాఁడో ?

సీతా మి హానయ స్వేతి కో బ్రవీతి బ్రవీహి మే
రక్షో లోకస్య సర్వస్య క శ్శృంగం ఛేత్తు మిచ్ఛతి. ౧౭

ప్రోత్సాహయతి కశ్చ త్త్వాం సహిశత్రురసంశయః. ౧౭½

అసా రణాంతస్థితిసంధివాలో విదగ్ధరక్షో మృగహా నృసిం
హః, సుప్త స్త్వయా బోధయితుం నయుక్త శ్శరాంగ
పూర్ణో నిశితాసిదంష్ట్రః. ౧౮-౧౮½

ప్రసీద లంకేశ్వర ! రాక్షసేంద్ర ! లంకాం ప్రసన్నో భవ
సాధు గచ్ఛ, త్వం స్వేషు దారేషు రమస్వ నిత్యం రామ
స్సభార్యో రమతాం వనేషు. ౧౯-౧౯½

ఏవ ముక్తో దశగ్రీవో మారీచేన స రావణః. ౨౦
న్యవర్తత పురీం లంకాం వివేశచ గృహోత్తమం. ౨౦½
[1]తత శ్శూర్పణఖీ దృష్ట్వా సహస్రాణి చతుర్దశ. ౨౧
హతా న్యేకేన రామేణ రక్షసాం భీమకర్మణాం
జగామ పరమో ద్విగ్నా లంకాం రావణపాలితాం. ౨౨
సా దదర్శ విమానాగ్రే రావణం దీప్తతేజసం
ఉపోపవిష్టం సచివై ర్మరుద్భిరివ వాసవం. ౨౩

1. వాల్మీకి రా. ౩౨ స.



౧౭ ఆసీత నిటకుఁ గొని రమ్మని నీతోఁ జెప్పినవాఁ డెవ్వఁడో నాకుఁ దెలుపుము. సకలరాక్షసలోకముయొక్క శిఖరమును (రాక్షసుల కెల్లరకుఁ బ్రధానపతి వగు ని న్ననుట) బగులఁగొట్టుటకుఁ గోరువాఁ డెవ్వఁడు ?

౧౭½ ఎవ్వఁడో ని న్నీయకార్యమునకుఁ బ్రోత్సహించుచున్నాఁడు. వాఁడు నీపాలిఁటికి శత్రువే. సంశయము లేదు.

౧౮-౧౮½ యుద్ధాంగణమున ధైర్యమున నిలువఁబడుట యను రోమములతో నిండిన తోక గలిగి, పటుత్వముగల రాక్షసు లను మృగములఁ జంపెడిదై, బాణము లనెడి నఖాద్యాయుధములు గలిగి, వాఁడియైన కత్తు లను కోరలుగలదై సుఖముగ నిద్రించుచుండు అనఁగాఁ బర ద్రోహవిముఖుఁడై యుండు లేక నీ కపకారముచేయువిషయమై యత్నింపకుండు పురుషశ్రేష్ఠుఁ డగు శ్రీరాముఁ డను సింహమును (నృసింహుని-మగసింగ మని ధ్వని) నీవు లేపఁ దగదు (యుద్ధాదులకుఁ బురికొల్పకు మనుట).

౧౯-౧౯½ ఓలంకాధిపతీ! రాక్షసపతీ! అనుగ్రహింపుము. ప్రసన్నుఁడవు కమ్ము! సుఖముగా లంకకుఁ బొమ్ము! ఎప్పుడు నీభార్యలతో నీవు క్రీడింపుము. శ్రీరాముఁడు తనభార్యతోఁ దా నడవులలోఁ గ్రీడించుఁగాక!

౨౦-౨౦½ అని యిట్లు మారీచుఁడు చెప్ప నారావణుఁడు మఱలి లంకానగరమునకుం బోయి తన ప్రాసాదమునఁ బ్రవేశించెను.

౨౧-౨౨ అటుపిమ్మట శూర్పణఖి భయంకరవ్యాపారు లగు పదునాల్గువేల రక్కసులు నొక్కరామునిచే నొక్కబాణముచేఁ గూల్పఁబడఁగా జూచి, మిగుల వెఱఁగంది రావణపాలిత మగు లంకానగరమునకుఁ బోయెను.

౨౩ అచటఁ బుష్పకవిమానముపై మహాతేజముతో వెలుంగుచు మంత్రులతోఁగూడి-దేవతలతోఁగూడి యుండు నింద్రునివలె నాసీనుఁడై యున్న రావణుని శూర్పణఖి చూచెను.

దేవగంధర్వభూతానా మృషీణాంచ మహాత్మనాం
అజేయం సమరే శూరం వ్యాత్తానన మివాంతకం. ౨౪
దేవాసురవిమర్దేషు వజ్రాశనికృతవ్రిణం
ఐరావత విషాణాగ్రై రుద్ధృష్టకిణవక్షసం. ౨౫
వింశద్భుజం దశగ్రీవం దర్శనీయపరిచ్ఛదం
విశాలవక్షసం వీరం రాజలక్షణశోభితం. ౨౬
విష్ణుచక్ర నిపాతై శ్చ శతశో దేవసంయుగే
అన్యై శ్శస్త్రప్రహారై శ్చ మహాయుద్ధేషు తాడితం. ౨౭
ఉచ్ఛేత్తారంచ ధర్మాణాం పరదారాభిమర్శనం
పురీం భోగవతీం ప్రాప్య పరాజిత్యాచ వాసుకిం. ౨౮
తక్షకస్య ప్రియాం భార్యాం పరాజిత్య జహార యః
దశవర్షసహస్రాణి తప స్తప్త్వా మహావనే. ౨౯
* పురా స్వయంభువే ధీర శ్శిరాం స్యుపజహార యః
రావణం సర్వభూతానాం సర్వలోకభయావహం. 30
రాక్షసీ భ్రాతరం శూరం సాదదర్శ మహాబలం
1 అమాత్యమధ్యే సంక్రుద్ధా పరుషం వాక్య మబ్రవీత్. 3౧
ప్రమత్తః కామభోగేషు స్వైరవృత్తో నిరంకుశః
సముత్పన్నం భయం ఘోరం బోద్ధవ్యం నావబుధ్యసే. 3౨

సక్తం గ్రామ్యేషు భోగేషు కామవృత్తం మహీపతిం
లుబ్ధం నబహుమన్యంతే స్మశానాగ్ని మివ ప్రజాః. 33

* స్వయంభువే రుద్రాయే త్యర్థః.

1. వాల్మీకి రా. 33 స.



౨౪-3౧ అతఁడు దేవతలకును, గంధర్వులకును, ఇతరభూతములకును, మహాత్ము లగు మహర్షులకును యుద్ధమున లొంగని మహాశూరుఁడు. దేవాసురయుద్ధములలో వజ్రాయుధంపు దెబ్బలచే గాయములు వడి, ఐరావతము దంతములచే గీరఁబడి కాయలుగాచిన వక్షస్స్థలము గలవాఁడు. ఇరువది భుజములు గలవాఁడు. పది తలలుగలవాఁడు. కనువిందొనర్చు ఛత్రచామరాదులు గలవాఁడు. విశాలవక్షుఁడు. వీరుఁడు. రాజలక్షణశోభితుఁడు. దేవతలతో సంభవించిన పలు యుద్ధములలో విష్ణుచక్రము దెబ్బలను, మఱి పెక్కుయుద్ధముల యందు గొప్పగొప్ప యాయుధముల దెబ్బలను దిన్నవాఁడు. ధర్మములను జెఱచువాఁడు. పరస్త్రీలను జెఱఁబెట్టువాఁడు. భోగవతీ నగరమునకుఁ బోయి వాసుకిని జయించి, తక్షకుని జయించి వాని ప్రియభార్యను హరించినవాఁడు. ఒకప్పుడు మహావనమునఁ బది వేల సంవత్సరములు తపస్సు చేసి, తనపదితలలను నరకి వానిని * స్వయంభువునకుఁ (రుద్రునకు) బూజాద్రవ్యములుగా నర్పించిన ధీరుఁడు. సర్వభూతముల నేడ్పించువాఁడు. (ఇందుచేతనే రావణుఁ డను పేరఁ బ్రఖ్యాతి గన్నవాఁడు). సకలలోక భయంకరుఁడు. ఇట్టి లక్షణములు గల శూరుఁడును దన కన్నయు నగు రావణు నా రాక్షసి చూచెను. వానితో నున్న యా పెద్దబలగమును జూచెను. అది - మంత్రులందఱినడుమ మహాకోపముతోఁ బరుషమైన యీ వాక్యముఁగూడ పల్కెను.

3౨ ఓరావణా! మంచిది కామభోగముల నిష్టమువచ్చిన ట్లనుభవించుచు, నిరంకుశుఁడవై, నీకుఁ దటస్థించిన ఘోరమైన భయమును నీవు దెలిసికొనవలసినదానిని దెలియకున్నావు.

33 తుచ్ఛసుఖములఁ దగులువడి, స్వేచ్ఛావ్యాపారుఁ డగు త్యాగశూన్యుఁడైన రాజును బ్రజలు స్మశానమందలి యగ్ని నట్లే యగౌరవపఱతురు.

* 'స్వయంభువు' అనఁగా 'రుద్రుఁడు' అని యిచ్చటి యర్థము.

స్వయం కార్యాణి యః కాలే నానుతిష్ఠతి పార్థివః
సతువై సహరాజ్యేన తైశ్చ కార్యై ర్వినశ్యతి. ౩౪

ఆత్మవద్భి ర్విగృహ్య త్వం దేవగంధర్వదానవైః
అయుక్తచార శ్చపలః కథం రాజా భవిష్యసి. ౩౫

త్వంతు బాలస్వభావశ్చ బుద్ధిహీనశ్చ రాక్షస!
జ్ఞాతవ్యంతు నజానీషే. కథం రాజా భవిష్యసి. ౩౬

[1] సాంబోపి మే హతః పుత్ర స్తప్యమానో నిరర్థకం.
యద్యస్తి పౌరుషం కించి త్త్వర్హి సీతాం సమానయ. ౩౭
నోచే త్త్వథోముఖ స్తిష్ఠ యథా స్త్రీ గతభర్తృకా. ౩౭½

[2] చతుర్దశసహస్రాణి రాక్షసాం క్రూరకర్మణాం. ౩౮
హతా న్యేకేన రామేణ ఖరశ్చ సహదూషణః
ఋషీణా మభయం దత్తం కృతక్షేమాశ్చ దండకాః. ౩౯
త్వంతు లుబ్ధః ప్రమత్తశ్చ పరాధీనశ్చ రాక్షస!
నానుతిష్ఠతి కార్యాణి భయేషు నబిభేతిచ. ౪౦
క్షిప్రం రాజ్యా చ్చ్యుతో దీన స్తృణై స్తుల్యో భవిష్యతి. ౪౦½

[3] తత శ్శూర్పణఖాం క్రుద్ధాం బ్రువంతీం పరుషం వచః. ౪౧

1. ఆనందరా. సారకాం ౭ స. 2. వాల్మీకి రా. ౩౩ స.
3. వాల్మీకి రా. ౩౪ స.



౩౪ ఏరాజు స్వయముగ సమయానుకూలముగఁ జేయవలసినపనులను జేయఁడో; అట్టిరాజు రాజ్యముతో నాకార్యములతోఁ గూడ నశించును.

౩౫ ఓరావణా! సమయము గనిపెట్టి నీ కపకారము చేయఁ బ్రయత్నపడు దేవగంధర్వదానవులతో విరోధము పెట్టుకొని, తగనిచారులను గూడి, విషయసుఖములయందుఁ జపలుఁడవైన నీ వెటుల రాజ వగుదువు?

౩౬ ఓరాక్షసా! నీవు వివేకశూన్యుఁడవు. నీకు బుద్ధి లేదు. నీ వెఱుఁగఁదగిన యంశము నెఱుఁగఁజాల కున్నావు. నీవు రాజ వెట్లగుదువు?

౩౬½-౩౭½ నీసేవము కోఱకనియే తపముచేయుచున్న నాపుత్రుఁడు సాంబుఁడనువాఁడు వ్యర్థముగ నీయుపేక్షచేఁ జచ్చెను. నీ కేమైన రవ్వంత పౌరుషమున్నచో, నీసోదరిని బరాభవించి, నీమేనల్లుని జంపిన వారికిఁ బ్రతిశిక్షసేయఁగల్గినచో సీత నిటకుఁ గొని తెమ్ము. లేనిచో భర్తచచ్చిన యాడుదానివలె మొగము వంచుకొని పడియుండుము.

౩౮-౩౯ క్రూరకర్ము లగు పదునాల్గువేలమంది రాక్షసులును, ఖరుఁడును, దూషణుఁడును ఒక్క రామునిచేఁ జచ్చిరి. ఋషులకా యభయ మీయఁబడెను. దండకారణ్యములకు క్షేమము సేకూరెను.

౪౦-౪౦½ ఓరావణా! నీ వన్నో లుబ్ధుఁడవు (చారుల కింత యిచ్చి సంతోషపెట్టువాఁడవు కా వనుట), మత్తెక్కి పరాధీనుఁడవు నై యున్నాఁడవు. సమయ మెఱిఁగి పనులఁ జక్కపెట్టఁడు. భయపడవలసినపుడు భయపడఁడు. అట్టిరాజు శీఘ్రముగ రాజ్యభ్రష్టుఁడై దీనుఁడై గడ్డిపఱకలతో సమానుఁ డగును.

౪౧-౪౨ పిమ్మట రావణుఁ డిట్లు కుపితయై కఠినవచనములఁ బలుకుచున్న శూర్పణఖను జూచి (శత్రులయెడ) మిగుల కోపించి మంత్రుల నడుమ రాముఁ డెవఁడు? ఎట్టితేజముగలవాఁడు? ఎట్టిరూపము

అమాత్యమధ్యే సంక్రుద్ధః పరిపప్రచ్ఛ రావణః
కశ్చ రామః కథం వీర్యః కిం రూపః కిం పరాక్రమః. ౪౨
శూర్పణ ఖ్యువాచ—
దీర్ఘ బాహు ర్విశాలాక్ష శ్చీరకృష్ణాజినాంబరః
కందర్పసమరూపశ్చ రామో దశరథాత్మజః. ౪౩

నాదదానం శరా౯ ఘోరా నముంచంతం శిలీముఖా౯
నకార్ముకం వికర్షంతం రామం పశ్యామి సంయుగే. ౪౪
హన్యమానంతు తత్సైన్యం పశ్యామి శరవృష్టిభిః. ౪౪½

ఏకా కథంచి న్ముక్తాహం పరిభూయ మహాత్మనా. ౪౫
స్త్రీవధం శంకమానేన రామేణ విదితాత్మనా
కనీయా ననుజ స్తస్య లక్ష్మణోఽపి తథావిధః. ౪౬

రామస్యతు విశాలాక్షీ పూర్ణేందుసదృశాననా
ధర్మపత్నీ ప్రియా భర్తు ర్నిత్యం ప్రియహితే రతా. ౪౭
ఆనేతు మహ ముద్యుక్తా తాం భార్యార్థం తవానఘ. ౪౭½

లక్ష్మణోనామ తద్భ్రాతా చిచ్ఛేద మమ నాశికాం. ౪౮
కర్ణౌచ; చోదిత స్తేన రామేణ స మహాబలః. ౪౮½

తతో ఽహ మతిదుఃఖేన రుదంతీ ఖర మన్వగాం. ౪౯



గలవాఁడు ? ఎట్టిపరాక్రమము గలుగువాఁడు ? అని యడిగెను.

అంత శూర్పణఖ యిట్లనియె—

౪౩ రాముఁ డాజానుబాహుఁడు. విశాలనేత్రుఁడు. నారచీరలు, కృష్ణాజినములును వస్త్రములుగాఁ దాల్చువాఁడు. మన్మథునితో సమానమగు రూపము కలవాఁడు. దశరథకుమారుఁడు (శూర్పణఖ మోహాతిశయముచే రాముని సౌందర్యమునే ముందుగఁ జెప్పె నని గ్రహించునది).

౪౪-౪౪½ అమ్ములపొదులనుండి ఘోరము లగు బాణముల నెత్తుచుండఁగాఁగాని, వానిని విడుచుచుండఁగాఁ గాని, ధనువున నారి లాఁగి యెక్కిడుచుండఁగాఁగాని రాముని నేను యుద్ధమునఁ జూడ లేదు. కాని యాతఁడు గురిసిన శరవర్షములచేఁ జచ్చి పడిన రక్కసుల సేనను మాత్రము చూచితిని.

౪౫-౪౬ ఆత్మజ్ఞుఁడును, మహాత్ముఁడు నగు నారామునిచే నే నొక్కతె మాత్రము స్త్రీవధ చేయరా దను శంకించువాఁ డగుటచే నెట్లో విడువఁబడితిని. ఆరాముని చిన్న తమ్ముఁ డగు లక్ష్మణుఁ డన్నివిధముల నన్నకుఁ దీసిపోఁడు.

౪౭-౪౭½ ఆరాముని ధర్మపత్ని విశాలములైన నేత్రములు గలది. పున్నమ చందురునివంటి ముఖము గలది. భర్తకుఁ జాల ప్రియురాలు. ఎల్లప్పుడు నాతని హితమునే కోరునది. ఓ పాపరహితుఁడా ! చంద్రు నీకు భార్యనుగా నామెను గొని తేవలె నని యత్నించితిని.

౪౮-౪౮½ మహాబలుఁడును, రామానుజుఁడు నగు లక్ష్మణుఁడు శ్రీరామ చంద్రునిచేఁ బ్రేరేపింపఁబడినవాఁడై నాముక్కు సెవులఁ గోసెను.

౪౯ అంత నతిదుఃఖముతో నేడ్చుచు ఖరునికడకుఁ బోయితిని.

సోఽపి రామం సమాసాద్య యుద్ధం రాక్షసయూథపైః
కృత్వా వినష్ట స్సహసా రాక్షసై స్సహ సంయుగే. ౫౦

యది రామో మనః కుర్యా త్త్రైలోక్యం నిమిషార్ధతః
భస్మీకుర్యా న్నసందేహ ఇతి భాతి మమ ప్రభో! ౫౧

సాక్షా ద్రామస్య పురతః స్థాతుం త్వం నక్షమః ప్రభో!
మాయయామోహయిత్వాతుప్రాప్య సీతాం రఘూత్తమాత్
1 భార్యావియోగదుర్బుద్ధి స్తత స్స నభవిష్యతి. ౫౨½

ఐక్ష్వాకేణ పురాపి కౌశికమఖా దారభ్య లంకేశ్వరో
ధత్తే శాశ్వతికం విరోధ మధునా ప్యేతే హతా బాంధవాః
ఉత్సాహప్రభుమంత్రశక్తిభి రలం భూష్ణు శ్ఛలజ్ఞో బలీ
దృష్ట శ్శూర్పణఖావికార మపరం దృష్ట్వా కథం మృష్యతే.
౫౩-౫౩½

2 శ్రుత్వా తత్సూక్తవాక్యైశ్చ దానమానాదిభి స్తథా ౫౪
ఆశ్వాస్య భగినీం రాజా ప్రవివేశ స్వకం గృహం. ౫౪½

తత్ర చింతాపరో భూత్వా నిద్రాం రాత్రౌ నలబ్ధవాన్. ౫౫

ఏకేన రామేణ కథం మనుష్యమాత్రేణ నష్ట స్సబలః ఖరో
మే, యద్వా న రామో మనుజః పరేశో మాం హం
తుకామ స్సబలం బలౌఘైః. ౫౬

1. హనుమద్రామాయణం. 2. అధ్యాత్మ రా. ౫ స.



౫౦ ఆఖరుఁడు రాక్షససేనానాయకులతో రాము నెదుర్కొని యుద్ధము చేసి, యారక్కసు లందరితోఁ గూడ వెంటనే యుద్ధమునఁ జచ్చెను.

౫౧ ఓరాక్షసప్రభూ! శ్రీరాముఁడు తలఁచెనా యర్ధనిమిషములో ముల్లోకములను భస్మము చేయఁగలఁడు. సంశయము లేదు. ఇట్లు నాకుఁ దోఁచుచున్నది.

౫౨-౫౨½ నీవు రాముని యెట్టయెదుట నిలువఁజాలవు. మాయచే మోహింపఁజేసి యామెను రఘూత్తమునినుండి తేఁగలవు. భార్యావియోగముచే మతిచెడి పిమ్మట నారాముఁ డుండఁడు.

౫౩-౫౩½ రావణుఁడు మున్నే విశ్వామిత్రునియాగము మొదలుకొని యిక్ష్వాకువంశజుఁ డగు శ్రీరామునితో శాశ్వతవైరము పెట్టుకొనియున్నాఁడు. ఇప్పుడో యీబంధువులు రామునిచేఁ జంపఁబడిరి. అది యట్లుండె, ఇప్పుడు శూర్పణఖయొక్క వికారము నింకొకటి చూచియు, ఉత్సాహప్రభుమంత్రశక్తులచేఁ గూడి బలవంతుఁడై మదించి యుండి యెట్లు సహింపఁగలఁడు ?

౫౪-౫౪½ అట్లు శూర్పణఖ చెప్పినదెల్లను విని, బహుమానము లిచ్చి, గౌరవించి, మంచిమాటాడి చెల్లెలి నోదార్చి రావణరాజు తన గృహమునకుఁ బోయెను.

౫౫ అచ్చటఁ జింతాపరుఁడై రాత్రి నిదురింపలేదు.

౫౬ ఆహా! మనుష్యమాత్రుఁ డగు నొక్కరామునిచే సేనాసహితముగ మాఖరుఁ డెట్లు నాశన మొందెను? శ్రీరాముఁడు మనుజుఁడు కాఁ డేమో? బలగముతోఁ గూడియున్న నన్ను బలసమూహముచే సంహరింపఁగోరి వచ్చిన పరాత్పరుఁడే కావచ్చును.

సంప్రార్థితో ఽయం ద్రుహిణేన పూర్వం మనుష్యరూపో
ఽద్య రఘోః కులే ఽభూత్, వధ్యో యది స్యాం పరమా
త్మ నాహం వైకుంఠరాజ్యం పరిపాల యేఽహం. ౫౬
నో చే దిదం రాక్షసరాజ్య మేవ భోక్ష్యే చిరం రామ మ
తో వ్రజామి, విరోధబుద్ధ్యైవ హరిం ప్రయామి ద్రుతం
నభక్త్యా భగవాన్ ప్రసీదేత్. ౫౭

[1] తత్కార్య మనుగమ్యాథ యథావ దుపలభ్యచ
దోషాణాంచ గుణాంచ సంప్రధార్య బలాబలం. ౫౮
ఇతి కర్తవ్య మిత్యేవ కృత్వా నిశ్చయ మాత్మనః
యానశాలాం తతో గత్వా ప్రచ్ఛన్నో రాక్షసాధిపః. ౬౦
కాంచనం రథ మాస్థాయ కామగం రత్నభూషితం
పిశాచవదనై ర్యుక్తం ఖరైః కాంచనభూషణైః. ౬౧
రాక్షసాధిపతి శ్శ్రీమాన్ యయౌ నదనదీపతిం. ౬౧½

తంతు గత్వా పరం పారం సముద్రస్య నదీపతేః. ౬౨
దదర్శ నియతాహారం మారీచం నామ రాక్షసం. ౬౨½

మారీచే నార్చితో రాజా సర్వకామై రమానుషైః. ౬౩

తం స్వయం పూజయిత్వాతు భోజనే నోదకేనచ.
అర్థోపహితయా వాచా మారీచో వాక్య మబ్రవీత్. ౬౪

1. వాల్మీకి రా. ౩౫ స.



౫౬-౫౭ నన్నుఁ జంపుటకై మును బ్రహ్మచేఁ బ్రార్థింపఁబడి మనుష్య రూపమున నిప్పుడీ రఘువంశమున నాపరమాత్మ పుట్టినాఁడు. ఒక వేళ నే నాపరమాత్మచేత నే చావవలసినవాఁడ నగుచో వైకుంఠ రాజ్యము నే పాలించెదను (అట నున్న భోగముల నెల్ల విశృంఖలముగా ననుభవించెద ననుట). లేదా చిరకాల మీ రాక్షసరాజ్యము నే యనుభవింతును. కనుక నే నిప్పుడు రాముని మీఁదికి వెడలెదను. విరోధబుద్ధిచేత నే హరిని బొందెదను. భక్తిచే భగవంతుఁడు వేగముగ ననుగ్రహముఁ జూపఁడు.

౫౮-౬౧½ అని యిట్లు రావణుఁడు తాఁ జేయవలసిన పనినిగురించి పర్యాలోచించి, 'యిది యిట్లు చేయవలెను' అని యొకదారి కనిపెట్టి, దానిలోఁ గల గుణదోషములను, ప్రాబల్యదౌర్బల్యములను జర్చించుకొని 'యిది యీవిధముగా నే జరుగవలసినది' యని తుదకుఁ దనలో నిశ్చయము చేసికొని, పిమ్మట మారువేసముతో నారక్కసుల ఱేఁడు పానశాల కరిగి; కాంచనమయమై, కోరిన చోట్లెల్ల నడచునదై, రత్నాలంకృతమై స్వర్ణభూషణములచే నలంకరింపఁబడినదై పిశాచముఖములు గల కంచరగాడిదలఁ బూన్చిన రథ మెక్కి శ్రీమంతుఁ డగు నారాక్షసరాజు సముద్రముకడకుఁ బోయెను.

౬౨-౬౨½ ఆసముద్రము నవ్వలియొడ్డునకుఁ బోయి (గోకర్ణతీరమందలి యాశ్రమమున నున్న) ఆహారనియమము కల మారీచుఁ డను రాక్షసుని గాంచెను.

౬౩ అట నామారీచునిచే నమానుషము లగు సర్వవిధభోగ్యపదార్థముల చేతను రా జగు రావణుఁడు పూజింపఁబడెను.

౬౪ మారీచుఁ డారాజును స్వయముగా నన్నపానములచేఁ బూజించి, అర్థవంత మగు నీవాక్యము పలికెను.

కచ్చి త్కుశలం రాజన్ ! లంకాయాం రాక్షసేశ్వర !
కే నార్థేన పున స్త్వం వై తూర్ణమేవ మి హాగతః. ౬౫

రావణ ఉవాచ—

1 మారీచ ! శ్రూయతాం తాత ! వచనం మమ భాషతః
ఆర్తో ఽస్మి మమ చా ర్తస్య భవాన్ హి పరమా గతిః. ౬౬

యేన వైరం వినారణ్యే సత్వ మాశ్రిత్య కేవలం
కర్ణనాసాపహరణా ద్భగినీ మే విరూపితా. ౬౭
తస్య భార్యాం జనస్థానా త్సీతాం సురసుతోపమాం
ఆనయిష్యామి విక్రమ్య సహాయ స్తత్ర మే భవ. ౬౮

వీర్యే యుద్ధేచ దర్పేచ న హ్యస్తి సదృశ స్తవ
ఉపాయజ్ఞో మహాశూర స్సర్వమాయావిశారదః. ౬౯

శృణు తత్కర్మసాహాయ్యే య త్కార్యం వచనా న్మమ
సౌవర్ణ స్త్వం మృగో భూత్వా చిత్రో రజతబిందుభిః. ౭౦
ఆశ్రమే తస్య రామస్య సీతాయాః ప్రముఖే చర. ౭౦½

2 త్వాంతు మాయామృగం దృష్ట్వా కాంచనీం జాతవిస్మయా
ఆనయైన మితి క్షిప్రం రామం వక్ష్యతి మైథిలీ. ౭౧-౭౧½

అపక్రాంతేతు కాకుత్స్థే దూరం యాత్వా ప్యుదాహర.
హాసీతే! లక్ష్మణే! త్యేవం రామవాక్యానురూపకం. ౭౨-౭౨½

1. వాల్మీకి రా. ౩౬ స. 2. వాల్మీకి రా. ౪౦ స.



౬౫ ఓరాజా ! రాక్షసప్రభూ ! లంకయం దందరికిఁ గుశలమేకదా ! ఏప్రయోజనముపై నీ వింతలోనే తిరిగి యిచటికి వచ్చితివి ?

రావణుఁ డి ట్లనియె.—

౬౬ తండ్రీ ! మారీచా ! నేను సెప్పఁబోవుమాటను వినుము. నే నిప్పుడు దీనుఁడనైతిని. ఈదీనుఁడ నగు నాకు నీవే ముఖ్యమైన దిక్కు.

౬౭-౬౮ ఏరాముఁ డరణ్యమున నెట్టివైరకారణము లేకుండఁగనే కేవలము బలమునే యూఁతగొని కారడవిలో, ముక్కు చెవులు గోసి నా చెలియలిని విరూపఁ జేసెనో ఆరాముని పెండ్లామును, సీత యను దానిని, దేవకన్యలతో సమానురా లగుదానిని బరాక్రమించి జన స్థానమునుండి గొనిపత్తును. అందు నీవు నాకు సహాయుఁడవు కమ్ము !

౬౯ పరాక్రమమున, దర్పమున, యుద్ధమున నీకు సమానుఁ డింకొ కఁడు లేఁడు. ఉపాయశాలివి, మహాశూరుఁడవు, సర్వమాయలయం దారితేరినవాఁడవు.

౭౦-౭౦½ నాకు సాహాయ్యమున నీవు చేయవలసిన పని యేదియో వినుము ! తెల్లని వెండిచుక్కలతోఁగూడి చిత్రవర్ణము గల బంగరులేడివై నీ వారాముని యాశ్రమప్రాంతముల సీత యెదుటఁ దిరుగాడుము.

౭౧-౭౧½ అప్పుడు స్వర్ణ మయ మగు మాయామృగమవైన నిన్ను జూచి జనకరాజకుమార్తె యాశ్చర్యపడి వెంటనే దీనింబట్టి తెమ్మని రాము నితోననును.

౭౨-౭౨½ (వెంటనే రాముఁడు వెనువెంట నన్ను దరుముకొని వచ్చును.) నీ వాతనిం గడుదూరముగఁ దీసికొనిపోయి, రామునిమాటపోలికను హాసీతా ! లక్ష్మణా ! యని యార్పు వెట్టుము.

ప్రలోభయిత్వా వై దేహీం యథేష్టం గంతు మర్హసి. ౨౩

తచ్ఛ్రుత్వా రామపదవీం సీతయాచ ప్రబోధితః
అనుగచ్ఛతి సభ్రాంత స్సౌమిత్రిరపి సౌహృదాత్. ౨౪

1 తత స్తయో రపాయేతు శూన్యే సీతాం యథాసుఖం
నిరాబాధో హరిష్యామి రాహు శ్చంద్రప్రభా మివ. ౨౫

2 తా మాదా యాపనేష్యామి తత స్స న భవిష్యతి
భార్యావియోగదుర్బుద్ధి; రేత త్సాహ్యం కురుష్వ మే. ౨౬

3 తస్య రామకథాం శ్రుత్వా మారీచస్య మహాత్మనః
శుష్కం సమభవ ద్వక్త్రం పరిత్రస్తో బభూవహ. ౨౭

ఓష్ఠౌ పరిలిహ& శుష్కౌ నేత్రై రనిమిషై రివ
మృతభూత ఇవార్త స్తు రావణం సముదైక్షత. ౨౮

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
నవమ స్సర్గః.



1. వాల్మీకి రా. ౩౬ స. 2. భారతే ఆరణ్యపర్వణి ౧౭ అధ్యాయే.
3. వాల్మీకి రా. ౩౬ స.



౨౩ అట్లు సీతను మోసపుచ్చి నీయిష్టము వచ్చినట్లు పోవచ్చును.

౨౪ ఆధ్వని విని సుమిత్రాపుత్త్రుఁ డగు లక్ష్మణుఁ డన్నమీఁది ప్రేమచేతను, సీతచేఁ బ్రేరితుఁ డయ్యును తోట్రుపడి రాము జాడఁబడి వడివడిపోవును.

౨౫ పిమ్మట వారిద్దరును సీతను విడిచిపోఁగా నామెను శూన్యముగ నుండు ప్రదేశమున నున్న దగుటచే నేబాధయు లేకుండ సుఖముగ రాహువు చంద్రునికాంతి నపహరించునట్లు హరించెదను.

౨౬ అట్లామెను హరించి, వారినుండి యెడఁబాపెదను. పిమ్మట భార్యావియోగముచే మతిచెడి రాముఁ డుండఁడు. ఈ సాహాయ్యము నీవు నాకుఁ జేయుము.

౨౭ ఇట్లు రావణుఁడు చెప్పఁగా శ్రీరామునికథను వినినంత మహాత్ముఁ డగు మారీచుని మొగ మెండిపోయెను. వాఁడు మిక్కిలి భయపడెను.

౨౮ ఎండిపోయిన పెదవులను నాలుకం దడుపుకొనుచు ఱెప్పవాల్పక మారీచుఁడు చచ్చినవానివలె నై ఆర్తుఁడై రావణునివంకఁ జూచెను.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమున
దొమ్మిదవ సర్గము.



## దశమ స్సర్గః.

1 తచ్ఛ్రుత్వా రాక్షసేంద్రస్య వాక్యం వాక్యవిశారదః
ప్రత్యువాచ మహాప్రాజ్ఞో మారీచో రాక్షసేశ్వరం. ౧
సులభాః పురుషా రాజన్ సతతం ప్రియవాదినః
అప్రియస్యతు పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః. ౨

శరార్చిష మనాధృష్యం చాపఖడ్గేంధనం రణే
రామాగ్నిం సహసా దీప్తం నప్రవేష్టుం త్వ మర్హసి. ౩
దీప్తస్యేవ హుతాశస్య శిఖా సీతా సుమధ్యమా
న సాధర్షయితుం శక్యా మైథిలోఽజస్వినః ప్రియా. ౪
2 విశ్వామిత్రాశ్రమే పూర్వ మనుభూయ మహద్భయం
దండకే మృగరూపేణ చరంతం సోఽపి వీక్ష్య మాం. ౫
జ్ఞాత్వా సర్వమృగా న్హిత్వా ముక్తవా న్మయి సాయకం
3 శరేణ ముక్తో రామస్య కథంచి త్ప్రాప్య జీవితం. ౬
ఇహ ప్రవ్రాజితో యుక్త స్తాపసోఽహం సమాహితః. ౬½

వృక్షేవృక్షేచ పశ్యామి చీరకృష్ణాజినాంబరం. ౭
గృహీతధనుషం రామం పాశహస్త మివాంతకం. ౭½

1. వాల్మీకి రా. ౩౭ స. 2. శివరామాయణం. 3. వాల్మీకి రా. ౩౮ స.



## పదియవసర్గము.

౧ ఆరాక్షసప్రభు వగు రావణుని యామాట విని, వక్తయు మహాప్రాజ్ఞుఁడు నగు మారీచుఁ డిట్లు ప్రత్యుత్తరము పల్కెను.

౨ ఓరాజా! ఎల్లప్పుడును నిజము గప్పిపుచ్చి మొగ మిచ్చకఁపు మాటలు పలుకువా రనేకులు సులభముగానే లభింతురు. కాని తాత్కాలికముగ వెగటుగఁ దోఁచినను, పరిణామకాలమునఁ బ్రయోజనము గూర్చు (పథ్యమగు) మాటను జెప్పువాఁడును, ఆచెప్పిన మాటను శ్రద్ధతో నాలించువాఁడును మిగుల దుర్లభులు.

౩-౪ బాణములనుజ్వాలలు గల్గి, విండ్లు - కత్తులు నను సమిధలచేఁ జేర రాక, యుద్ధభూమిలోఁ బ్రజ్వలించు శ్రీరాముఁ డను నగ్నిలోఁ దొందరపడి జొరఁబారుట నీకుఁదగదు. ఆప్రజ్వలించు నగ్నియొక్క జ్వాలయే సీత; ఆమిథిలాధిపుకూఁతు రోజస్వి యగు రాముని ప్రియురాలు. ఆమె నీవు గూర్చు భయమునకు లొంగునది కాదు.

౫-౬½ మునుపు విశ్వామిత్రాశ్రమమున నేను (శ్రీరామునివలనఁ దటస్థించిన) మహాభయము ననుభవించి, యీ దండకారణ్యమున మృగరూపముచేఁ దిరుగాడుచుండ శ్రీరామచంద్రుఁడు సామాన్యజంతువులను విడిచిపెట్టి మాయామృగరూపధారి నగు నన్నుఁ దెలిసికొని నాపైననే బాణము వదలెను; ఆబాణముచే నెట్లో (పారిపోవువారిపై రామబాణము ప్రవర్తింపదు గనుక) విడువఁబడి, పోయిన ప్రాణములను మరలఁ బొంది, యిచ్చోట సన్యాసినై, తగిననడవడి గలిగి (లేక యోగాభ్యాసరతుఁడనై యనియుఁ జెప్పవచ్చును) తపోనిష్ఠచే మనసు కుదుటఁబెట్టుకొని, యిట్లు కాలముఁ బుచ్చుచున్నాను.

౭-౭½ (యిపుడుగూడ) నారచీరలు కృష్ణాజినముఁ దాల్చి చాపము చేఁబూని, పాశములఁదాల్చిన యంతకునివలె నున్న యారామునే యీయెదుటఁ జెట్టుచెట్టునను జూచుచున్నాను.

అపి రామసహస్రాణి భీతః పశ్యామి రావణ! ౮
రామభూత మిదం సర్వ మరణ్యం ప్రతిభాతి మే
రామమేవహి పశ్యామి రహితే రక్షసాధిప! ౯
దృష్ట్వా స్వప్నగతం రామ ముద్భ్రమామి విచేతనః. ౯½

రకారాదీని నామాని రామత్త్రస్తస్య రావణ! ౧౦
రత్నానిచ రథాశ్చైవ త్రాసం సంజనయంతి మే. ౧౦½

అహం తస్య ప్రభావజ్ఞో న యుద్ధం తేన తే క్షమం. ౧౧
బలిం వా నముచింవాపి హన్యాద్ధి రఘునందనః. ౧౧½
రణే రామేణ యుధ్యస్వ క్షమాం వా కురు రాక్షస! ౧౨
న తే రామకథా కార్యా యది మాం ద్రష్టు మిచ్ఛసి. ౧౨½

యది శూర్పణఖాహేతో ర్జనస్థానే హతః ఖరః. ౧౩
అపి రాక్షసలోకస్య న భవే దంతకోఽపి సః. ౧౩½

[1] తవ హితం వదతో మమ భాషితం పరిగృహాణ పరాత్మని
రాఘవే, త్యజ విరోధమతిం భజ భక్తితః పరమకారుణికో
రఘునందనః. ౧౪-౧౪½

1. అధ్యాత్మ రా. ౬ స.



౮-౯½ రావణా! ఒక్కఁడా? యిద్దరా? కాదు. భయభ్రాంతుఁడనై వేలకొలఁది రాములను జూచుచున్నాను.
ఈయడవియంతయు రాముఁడే యయ్యె నని నాకుఁ దోఁచుచున్నది. ఓ! రక్కసుల ఱేఁడా! పట్టి బట్టబయలునఁ గూడ నేను రామునే చూచుచున్నాను. కన్నుమూసినంతఁ గలలోఁగూడ యారామునే జూచి చేతనము దప్పి కలవలపాటు నొందుచున్నాను.

౧౦-౧౦½ రావణా! రకారము మొదటఁగల పదములు అనఁగా రత్నము - రథములు అనునవియు నాకు వెఱపు పుట్టించుచున్నవి. అట్టిచో రాముఁ డని పూర్తిగా వినఁ బడినచో నాగతి వేఱఁ జెప్పవలసిన దేమున్నది? రత్నాదిపదములలో రకారోచ్చారణమువలన మొదటఁ గలిగిన భీతి రెండవయక్షర ముచ్చరించినతర్వాత మెల్లగాఁ బోవుచున్న దనియు నభిప్రాయము.

౧౧ నే నారామునిప్రభావము నెఱిఁగిన యనుభవశాలిఁని. వానితో నీకుఁ బోరాటము మంచిది కాదు.

౧౧½ రఘునందనుఁడు బలినైనను, నముచినైనను గీటడంచఁగలఁడు.

౧౨ ఓరాక్షసా! యుద్ధమున రామునితోఁ బోరుము లేక మాట్లాడక (ఖరాదివధను) సహించి యూరకుండుము.

౧౨½ (నేను బ్రతికియుండఁగా) నన్ను జూడవలె నని నీ కున్నచో నిఁక రామునిమాట నాకడఁ దేవలదు.

౧౩-౧౩½ ఒక్కశూర్పణఖకొఱకై ఖరుఁ డాతనిచేఁ గూల్పఁబడెనా? పోనిమ్ము. ఇక ఆరాముఁడు రాక్షసులందరిపాలిటికి నంతకుఁడు గాకుండుఁగాక!

౧౪-౧౪½ నీహితవునే కోరి పలుకుచున్న నామాటను గ్రహింపుము. పరమాత్మ యగు నారామునియెడ విరోధబుద్ధిని విడువుము. పరమకారుణికమూర్తి యగు రఘుకుమారు భక్తిమై భజింపుము.

అతో౽నమానుషోరామస్సాక్షాన్నారాయణో౽వ్యయః. ౧౫
మాయామానుషవేషేణ వనం యాతో౽తినిర్భయః
భూభారహరణార్థాయ గచ్ఛ తాత! గృహం సుఖం. ౧౬
శ్రుత్వా మారీచవచనం రావణః ప్రత్యభాషత. ౧౬.౫

పరమాత్మా యదా రామః ప్రార్థితో బ్రహ్మణా కిల. ౧౭
మాంహంతుంమానుషోభూత్వాయత్నా దిహాసమాగతః
కరిష్య త్యచిరా దేవ సత్యసంకల్ప ఈశ్వరః. ౧౮
అతో౽హం యత్నత స్సీతామానేష్యామ్యేవ రాఘవాత్.
వధే ప్రాప్తే రణే వీర! ప్రాప్స్యామి పరమం పదం. ౧౯
యద్వారామంరణేహత్వాసీతాంప్రాప్స్యామినిర్భయః. ౧౯.౫

1 యత్కిలైత దయుక్తార్థం మారీచ మయి కథ్యతే. ౨౦
త్వద్వాక్యై ర్నతు మాం శక్యం భేత్తుం రామస్య సంయుగే
పాపశీలస్య మూర్ఖస్య మానుషస్య విశేషతః. ౨౧

గుణదోషా నపృచ్ఛామి క్షేమం చాత్మని రాక్షస!
అభ్యాగతం మాం దౌరాత్మ్యా త్పరుషం వక్తు మిచ్ఛసి. ౨౨

రాజ్య స్యార్థం ప్రయచ్ఛామి మారీచ! తవ సువ్రత!
గచ్ఛ సౌమ్య! శివం మార్గం కార్య స్యాస్యవివృద్ధయే. ౨౩

1. వాల్మీకి రా. ౪౦ స.



౧౫-౧౬ రాముఁడు మానవమాత్రుఁడు కాఁడు; సాక్షాన్నారాయణుఁడు, అవ్యయుఁడు; మాయామానుషవేషముచే (దుష్టుల శిక్షించి శిష్టుల రక్షించి) భూభారము వాప నేవెఱపును లేక యడవికి వచ్చిన వాఁడు. తండ్రీ! సుఖముగా నింటికిఁ జనుము.

౧౬.౫ మారీచు నామాటలు విని రావణుఁ డిట్లు బదులు పలికెను.

౧౭-౧౮.౫ పరమాత్మ యగు రాముఁడు బ్రహ్మచేఁ బ్రార్థింపఁబడి, మనుష్యుఁడై నన్ను సంహరింప యత్నపడి యిఁటకు వచ్చినవాఁడేని; నయ్యీశ్వరుఁడు సత్యసంకల్పుఁడు గావున నప్పనిని దప్పక చేసియే తీరును. కనుక నేనును యత్నించి యారాఘవునినుండి సీతను దీసికొనియే వత్తును.

౧౯-౧౯.౫ ఓవీరుఁడా! నాకు యుద్ధమున (శ్రీరాముని చేఁతులలో) చావే నిశ్చయముగా సిద్ధమైనచోఁ బరమపదము (మోక్షము)ను పొందెదను. కా దందువా? నేనే రాముని యుద్ధమున దోరించి సీతను నిర్భయముగాఁ బొందెదను.

౨౦-౨౧ పాపస్వభావుఁడును, మూర్ఖుఁడును, మీఁదుమిక్కిలి మనుష్యమాత్రుఁడు నగు రామునితోడి యుద్ధము విషయములో నీమాటలచే నన్ను భేదించుటకు అనఁగా సీతను దొంగతనముచే నపహరించు నుపాయమునుండి మరల్చి యుద్ధమునకే నన్నుఁ బ్రవర్తింపఁజేయుట నీకు శక్యము గాదు.

౨౨ మారీచా! ఈపనిలోని మంచిచెడుగుల వివరింపు మని కాని, నాసేమమేదియో యెఱిఁగింపు మని కాని నిన్నడుగుట లేదు. నీకడకుఁ బనిగొని వచ్చితిఁ గదా యని దుర్ణయముచే నిట్లుఁ బరుషముగాఁ బలుకఁ గోరితివే? (తగదు.)

౨౩-౨౪ మంచినియమములు గల యోమారీచా! నారాజ్యమున సగముపాలు నీ కిత్తును. సౌమ్యుఁడా! నడువుము. ఇక్కార్యము కొనసాగుటకు నీమార్గమున మంగళ మగుఁగాక! నేనును దండకారణ్యమునకు రథము నధిష్ఠించి నీతో రాఁగలను. మారీచా! నాయాజ్ఞ

అహం త్వాఽనుగమిష్యామి సరథో దండకాననమ్
నచేత్కరోషి మారీచ! హన్మి త్వామహ మద్యవై. ౨౪
ఏతత్కార్య మవశ్యం మే బలాదపి కరిష్యసి
రాజ్ఞోహి ప్రతికూలస్థో నజాతు సుఖ మేధతే. ౨౫

1 తచ్ఛ్రుత్వా మనసా ప్యేవ మమన్యత నిశాచరః
రాఘవాదపి మర్తవ్యం మర్తవ్యం రావణాదపి. ౨౬
ఉభాభ్యామపి మర్తవ్యే వరం రామా న్న రావణాత్
ఇతి నిశ్చిత్య మరణం రామా దుత్థాయ వేగతః. ౨౭
2 అబ్రవీత్ పరుషం వాక్యం మారీచో రాక్షసాధిపం. ౨౭½

తదిదం కాకతాలీయం ఘోర మాసాదితం మయా. ౨౮
అత్రైవ శోచనీయ స్త్వం ససైన్యో వినశిష్యసి. ౨౮½

దర్శనా దేవ రామస్య హతం మా ముపధారయ. ౨౯
ఆత్మానంచ హతం విద్ధి హృత్వా సీతాం సబాంధవం. ౨౯½

3 ఏవ ముక్త్వాతు వచనం మారీచో రావణం తతః. 30
గచ్ఛావేత్యబ్రవీ ద్దీనో భయా ద్రాత్రించరప్రభోః. 30½

1. నారసింహపురాణం. 2. వాల్మీకి రా. ౪౧స. 3 వాల్మీకి రా. ౪౧ స.



చెప్పిన నిట్లు నీవు చేయక పోదువా యిప్పుడే నేను నిన్నుఁ జంపెదను సుమా! నాబలవంతమునకైన నీ విక్కార్యముఁ దప్పక చేసియే తీరఁగలవు. రాజునకుఁ బ్రతికూలముగా నడచువాఁ డెన్నటికిని శుభ మొందఁజాలఁడు.

౨౬-౨౭½ అది విని మారీచుఁడు తనలో నిట్లనుకొనెను. ఇపుడు రాముని వలనైనఁ జావవలెను. రావణుని చేనైనఁ జావవలెను. ఇరువురచే నిరుకునం బడి చావవలసివచ్చునపుడు రావణునిచేఁ జచ్చుటకంటె రామునిచేఁ జచ్చుట మంచిది. అని రామునివలని తనచావు నిశ్చయించి మారీచుఁడు వెనువెంట లేచి రక్కసుల ఱేనిం జూచి యిట్లు పరుషముగా భాషించెను.

౨౮-౨౮½ * కాకతాలీయముగా నాకీఘోర మగు గతి దాపురించినది. (అది యటుండ) పాపము నీవు బలఁగముతోఁగూడ నశింతువు. ఇందే నిన్నుఁగూర్చి విచారము కలుగుచున్నది.

౨౯-౨౯½ రాముని జూచుతోడనే నేను మరణించితి ననియే నిశ్చయించుకొనుము. సీత నపహరించి నీవును నీబందుగులతోఁగూడ నశించువాఁడ వనియుఁ దెలిసికొనుము.

30-30½ ఇట్లు మారీచుఁడు రావణునితోఁ బలికి మీఁదట రాక్షసప్రభుని భయమువలన బిక్కమొగము వైచుకొని వెడలుదమా! యని పలికెను.

* కాకతాలీయన్యాయ మనఁగాఁ దాటిపండుపైఁ గాకి వ్రాలుటయు నది (పక్వమైనదిగావున) పడుటయు నొకమారే తటస్థించినట్లు. రాముఁడిదివఱకే నన్నుఁ జంపఁ జూచుచుండఁగా నీవు నందులకే నన్నటకుఁ బురిగొల్పుచున్నావు; వైద్యుఁడు పాలే కోరెను, రోగియుఁ బాలే కోరె నన్నట్లు. కనుక నాచావు నిక్కమే యనుట.

1 అథ రామోఽపి తత్సర్వం జ్ఞాత్వా రావణచేష్టితం. ౩౧
ఉవాచ సీతా మేకాంతే శృణు జానకి! మే వచః
రావణో భిక్షురూపేణ ఆగమిష్యతి తే ఽంతికం. ౩౨
త్వంతు ఛాయాం త్వదాకారాంస్థాపయి త్వోటజే విశ. ౩౨½

2 సీతే! త్వం త్రివిధా భూత్వా రజోరూపా వసానలే. ౩౩
వామాంగే మే సత్వరూపా వసచ్ఛాయా తమోమయీ
పంచవట్యాం దశాస్యస్య మోహనార్థం వసాద్య వై. ౩౪
అగ్నా వదృశ్యరూపేణ వర్షం తిష్ఠ మమాజ్ఞయా
రావణస్య వధాంతే మాం పూర్వవ త్ప్రాప్స్యసే శుభే! ౩౫

3 రాఘవస్య వచ శ్శ్రుత్వా సా ప్యువాచ తథేతిచ. ౩౫½

ఏతస్మి న్నంతరే రామం ద్రష్టుం కమలలోచనం. ౩౬
వహ్ని స్తత్ర సమాయాతః ద్విజరూపీ కృపానిధిః. ౩౬½

4 వహ్ని రువాచ—

భగవన్! శ్రూయతాం వాక్యం కాలేన య దుపస్థితం. ౩౭
సీతాహరణకాలో ఽయం తవైవ సముపస్థితః. ౩౭½

మత్ప్రసూంమయిసన్యస్య ఛాయాంరక్షాంతికేఽధునా. ౩౮
దాస్యామి సీతాం తుభ్యంచ పరీక్షాసమయే పునః. ౩౮½

దేవైః ప్రస్థాపితో ఽహంచ నచ విప్రో హుతాశనః. ౩౯

1. అధ్యాత్మ రా. ౭ స. 2. ఆనంద రా. సారకాం. ౭ స.
3. దుర్వాస రా. 4. బ్రహ్మవైవర్తే ప్రకృతి ఖండే ౧౪ అధ్యా.



౩౧-౩౨½ ఇది యిట్లుండ; నట రాముఁడు రావణునిపని నంతయు నెఱిఁగి సీతాదేవితో నేకాంతమున నిట్లనియె. జానకీ! నామాట వినుము. రావణుఁడు బిచ్చగానిరూపమున నీసన్నిధికి రా నున్నాఁడు. నీ వీపర్ణశాలయందు నీరూపమున నీనీడను మాత్రము నిలిపియుండుము.

౩౩-౩౫ సీతా! నీవు మూఁడువిధములుగా నై, అందు రజోగుణరూపమున నగ్ని దేవునియందును, సత్త్వగుణరూపమున నాశరీరము నెడమవైపున నుండుము. మఱి తమోగుణరూపమున నీడ ధరించి యీపంచవటియం దిప్పుడు రావణునికండ్లు గప్పుటకై నిలువుము. అగ్నియం దొకసంవత్సరమును నాయానచొప్పున వసింపుము. కల్యాణీ! రావణవధానంతరము న న్నెప్పటియట్లు పొందఁగలవు.

౩౫½ రామునిపలుకు విని యాపెయు నట్లే యనెను.

౩౬-౩౬½ ఇంతలో బ్రాహ్మణవేషధారియై కరుణానిధి యగు నగ్ని దేవుఁడు కమలలోచనుఁ డగు రామచంద్రుని దర్శించుట కటకు వచ్చెను.

అగ్ని యి ట్లనియె.—

౩౭-౩౭½ భగవానుఁడా! శ్రీరామా! సమయమునకు సందర్భపడిన నా మాటను వినుము. ఇపుడు సీతాపహరణము జరుగుసమయము తటస్థించినది.

౩౮-౩౮½ నాబిడ్డను నిజసీతను నాయం దుంచి ఛాయారూపిణి నిపుడు నీదగ్గర నిడుకొని కాపాడుము. శోధనసమయమున తిరిగి సీతను నీ కొసంగెదను.

౩౯ నేను సామాన్యబ్రాహ్మణుఁడను గాను. దేవతలు పంపఁగా వచ్చిన యగ్ని దేవుఁడను.

రామ స్తద్వచనం శ్రుత్వా నపరికాశ్యచ లక్ష్మణం
స్వీచకారచ స్వచ్ఛందం హృదయేన విధూయతా. ౪౦

* వహ్ని ర్యోగేన సీతాయా మాయా సీతాం చకారహ
లక్ష్మణో నైవ బుబుధే గోప్య మన్యైన కాకథా. ౪౧

* వహ్నిరితి. కూర్మపురాణే— ఉ. భాగే ౩౪ అధ్యాయే శ్లో॥ అథావసథ్యా ద్భగవా న్హవ్యవాహో మహేశ్వరః। ఆవిరాసీ త్సుదీప్తాత్మా తేజసా ప్రదహన్నివ। సృష్ట్వా మాయామయీం సీతాం రావణస్య వధేప్సయా। సీతా మాదాయ ధర్మిష్ఠాం పావకో ఽంతరధీయత। తాం దృష్ట్వా తాదృశీం సీతాం రావణో రాక్షసేశ్వరః। సమాదాయ యయౌ లంకాం శుభాం సాగరసంస్థితా మితి. బ్రహ్మవైవర్తే శ్రీకృష్ణజన్మఖండే ౧౧౬ అధ్యాయేపి. 'శ్లో॥ సీతాయా సదృశీ ఛాయా తస్థౌ రామస్య సన్నిధౌ। సాచ ఛాయా హృతా పూర్వం రావణే నావలీలయేతి.'
వాల్మీకిరామాయణే ౪౯ సర్గే ౨౦౫ శ్లో॥ సా గృహీతా విచుక్రోశ రావణేన యశస్వినీ— ఇతి శ్లోకవ్యాఖ్యానావసరే తిలకవ్యాఖ్యా - విచుక్రోశేత్యాది తచ్ఛాయాయా అపి మనుష్యభావనార్థం చుక్రోశే త్యర్థః. ఇతి ప్రతిపాదన మస్తి. పునః ౫౪ సర్గే ౧౩ శ్లో॥ నిదధే రావణ స్సీతాం మయో మాయా మివ స్త్రియం. ఇతి శ్లోకవ్యాఖ్యానే తిలకవ్యాఖ్యా. మాయా మివే త్యనేన మాయారూపై షా సీతా యా లంకామాగతేతి ధ్వనితం. ముఖ్యసీతా త్వగ్నిం



౪౦ అది విని శ్రీరామచంద్రుఁ డీవిషయమును లక్ష్మణునికడ వెలువరింపక కలవలపడు తనహృదయమునందే యిడుకొనెను.

౪౧ * అగ్నిహోత్రుఁడు యోగబలముచే సీతకు మారుగ మాయాసీతను గల్పించెను. లక్ష్మణుఁ డీరహస్యమును దెలుసుకొననే లేదు. మిగిలిన వారిమాట చెప్ప నేల?

* ఇటఁ గూర్మపురాణమున నుత్తరభాగమున ౩౪ అధ్యాయమున— అపుడు అవసథమునుండి భగవానుఁడును ప్రకాశస్వరూపుఁడు నగు నగ్నిహోత్రుఁడు దన తేజముచే దహించువాఁడునుంబోలె, రావణుం బరిమార్చుట కని మాయామయి యగు సీతను సృష్టించి, ధర్మాత్మురా లగు సీతాదేవినిజస్వరూపమును వెంట నిడికొని యంతర్ధానమయ్యెను. ఆమాయాసీతను జూచి రాక్షసాధిపుఁ డగు రావణాసురుఁడు సముద్రమధ్యమున నున్న శుభ మగు లంకకుఁ గొంపోయెను. ఇవ్విషయమే బ్రహ్మవైవర్తపురాణమునఁ గృష్ణ జన్మోత్తరఖండమున పదునాఱవయధ్యాయమున "సీతాస్వరూప మగు ఛాయ రామునిసన్నిధి నుండెను. ఆఛాయయే తొల్లి రావణునిచే హరింపఁబడినది." అని కలదు. వాల్మీకిరామాయణమున ౪౯ సర్గమున ౨౦౫ శ్లోకమున "కీర్తిమంతురా లగు నామె (సీత) రావణునిచేఁ బట్టుకొనఁబడినదై మిగుల వాపోయెను" అను శ్లోకము నొద్ద తిలకవ్యాఖ్యానము— "విచుక్రోశ" ఏడ్చెను. అనున దాదిగా నాసీతయొక్క ఛాయయే మనుష్యభావము తోపించుకొఱకే డ్చెను అని నిర్ణయము గలదు. మఱియు ౫౪ సర్గమున ౧౩ శ్లోకమున "మయుఁడు మాయామయి యగు నాడుదానింబోలె (రావణుఁడు సీతను) లంకలో నిల్పెను అను శ్లోకపుతిలకవ్యాఖ్యానమున—" మాయామయి యగు నాడుదానింబోలె యనుటచే లంకానగరమునకు వచ్చిన యీసీత మాయారూపయే యని ధ్వనింపఁబడినది. ముఖ్యురా లగు సీత యగ్నిలోఁ బ్రవేశించె నని యింతకుఁ బూర్వమే ధ్వనితమయ్యెను. అందుచేతనే రావణుఁ డెత్తి కొంపోవుటకు వీ లయ్యెను. యారూపిమాణి యగుట రావణుఁ డెఱుఁగలేకపోవుటయును. ఇం

సీతాయా సదృశీ ఛాయా తస్థౌ రామస్య సన్నిధౌ. ౪౧½

1 తతో రావణమారీచౌ విమాన మివ తం రథం. ౪౨
ఆరుహ్యాయయతుశ్శీఘ్రంతస్మాదాశ్రమమండలాత్. ౪౨½

ప్రవిష్టేతి పూర్వమేవ ధ్వనితం—అతఏవ రావణస్య నహ్యస్యైషా జాతా మాయాత్వా దేవ రావణస్య తదజ్ఞానమితి ప్రదృశ్యతే. హ్యాతఏవ వాల్మీకిరామాయణే అరణ్యే ౩౬ సర్గే ౨౦ శ్లోకే. తత స్తయో రపాయేతు శూన్యే సీతాం యథా సుఖం నిరాబాధో హరిష్యామి రాహుశ్చంద్రప్రభా మివ ఇతి. పునశ్చ ౪౯ సర్గే శ్లో॥ జగ్రాహ రావణ స్సీతాం బుధః ఖే రోహిణీ మివేతి. అపిచ ఛాయా గ్రాహిత్వ మేవోక్తం స్కాందే శ్లో॥ ఛాయాగ్రాహిత్వ మప్యస్తి సర్వవిద్యావిశారదేత్యాదినా.
అస్మిన్నర్థే స్కాందే ఉమాసంహితాయాం నవమాధ్యాయే పార్వతీంప్రతి పరమేశ్వరోక్తిః— శ్లో॥ పురా విహారసమయే లక్ష్మీః కౌస్తుభమధ్యతః। స్వచ్ఛాయాం వీక్ష్య సాపత్న్య శంకయాకులితా భవత్.
లక్ష్మ్యువాచ. అన్యాం వహసి దారాత్వ్యన్మా మతిక్రమ్య వక్షసి। తాం హరి స్సాంత్వయామాస కుపితా మిందిరాం భృశం। సత్యం త్వత్సదృశీ చాన్యా లోకానుగ్రహకామ్యయా। సా నిత్యం శాత్రవహృతా భవే జ్జన్మనిజన్మని। తత్సర్వం లోకరక్షాయై నిత్యం భవతు సుందరి! ఇతి.

1. వాల్మీకి రా. ౪౨ స.



౪౧½ సీతకు సమాన మగు ఛాయ (నీడ) రాముసన్నిధి నుండెను.

౪౨-౪౨½ పిమ్మట నయ్యాశ్రమమండలమునుండి రావణమారీచులిద్దరును విమానమువలె నున్న యారావణుని రథము నెక్కి వేగముగా నరిగిరి.

దుకే వాల్మీకిరామాయణమున నరణ్యకాండమున ౩౬ సర్గమున ౨౦ శ్లోకమున నిట్లు కన్పట్టుచున్నది. "పిమ్మట వారిద్దరును (రామలక్ష్మణులు) సీతను విడిచి పోఁగా నామెను శూన్య మగు ప్రదేశమున నున్న దగుటచే నేబాధయు లేకుండ సుఖముగ, రాహువు చంద్రునికాంతి నపహరించు నటుల హరించెద" అని, మఱియు ౪౯ సర్గమున "బుధుఁ డాకసమున రోహిణీనక్షత్రమును బట్టుకొన్నట్లు రావణుఁడు సీతను బట్టుకొనెను" అనియు, స్కాందపురాణమునను ఛాయనే గ్రహించినట్లును—"ఓనిపుణురాలా! ఛాయను గ్రహించుట యనునదియుఁ గలదు." అనున దాదిగను ప్రమాణములు గలవు. ఈవిషయములో స్కాందమున ఉమాసంహితయందు నవమాధ్యాయమునఁ బార్వతితోఁ బరమేశ్వరుఁడు పలికిన మాట- "మున్ను లక్ష్మి హరితో విహరించుచు నాతనికౌస్తుభమణియందుఁ దననీడను జూచి సవతి యని శంకించి కోపించి యిట్లనియె—"నాథా! దుర్ణయముచే నన్నతిక్రమించి నీవక్షమున నింకొకతెను ధరించున్నా వనెను" అనఁ గుపితయైన లక్ష్మిని శ్రీహరి యిట్లని బ్రతిమాలెను- "దేవీ! నిజమే నీతో సమానురాలు మరొక్కతె కలదు. ఆమె యెల్లప్పుడు లోకముల ననుగ్రహింపఁ గోరి ప్రతిజన్మమందును శత్రువులచే హరింపఁబడును. సుందరీ! అదంతయు లోకసంగ్రహమునకే యెల్లప్పుడు నగుచుండును" అని కలదు.

* తథైవ తత్ర పశ్యంతౌ పత్తనాని వనానిచ. ౪౩
గిరీంశ్చ సరిత స్సర్వా రాష్ట్రాణి నగరాణిచ
సమేత్య దండకారణ్యం రాఘవ స్యాశ్రమం తతః. ౪౪
[1] మాయయా వివిశు స్తత్ర వంచయిత్వా జటాయుషం. ౪౪½
అవతీర్య రథా త్తస్మా ద్గోపయిత్వాచ తద్రథం. ౪౫
హ స్తేగృహీత్వా మారీచం రావణో వాక్య మబ్రవీత్. ౪౫½

* తథైవే త్యత్ర రావణమారీచా వనేకనగరపట్టణాదీ న్ప్ర పశ్యంతౌ శ్రీరామాశ్రమం జగ్మతు రి త్యవగమ్యతే. నగర పట్టణాదిలక్షణ ముక్తం వాస్తుశాస్త్రే. తథాహి. శ్లో॥ గ్రా మశ్చ నగరంచైవ పట్టణం ఖర్వటం పురం। ఖేటకం కుసు మంచైవ శిబిరం రాజవాసికం। సేనాముఖ మితి త్యేవం దశధా కీర్తితం బుధైః। విప్రాణాంచ సభృత్యానాం వాసో గ్రామ ఇతీర్యతే। సఏవ విప్రై రాకీర్ణ స్త్వగ్రహార ఇతి స్మృతః। కుటుంబభేదై రేకోనత్రింశద్భిశ్చ సమన్వితః। అనేకనారీసంబంధం నానాశిల్పిజనై ర్వృతం। క్రయవిక్ర యకైః కీర్ణం సర్వదేవై స్సమన్వితం। నగరం త్వితి విఖ్యాతం పట్టణం శృణు సాంప్రతం। ద్వీపాంతరాగతద్రవ్యక్రయ విక్రయకై ర్యుతం। పట్టణం త్వబ్ధితీరే స్యా త్తయోర్మిశ్రంతు ఖర్వటం। క్రయవిక్రయకై ర్యుక్తం నానాజాతిసమన్వితం। తంతువాయసమాయుక్తం త త్పురం త్వితి కథ్యతే। ఏతై రధిష్ఠితం యత్తత్ ఖేటకం పరికీర్తితం। ఏషా మేకాంతరే ష్వేవ వాసః కుసుమ ముచ్యతే - ఇత్యాదినా.

1. అగస్త్యరామాయణం.



౪౩-౪౪½ * అట్లు వారు దారిలోఁ బట్టణములను, అరణ్యములను, బర్వతములను, సమస్తరాజధానులను, నగరములను జూచుచు దండకారణ్యమునకు వచ్చి యంతట నారామచంద్రు నాశ్రమప్రాంతమును జేరిరి. జటాయువును మోసగించి, మాయచే నందుఁ బ్రవేశించిరి.

౪౫-౪౫½ రథమ్మును డిగ్గి రావణుఁడు, ఆతేరు నొక్కెడఁ బదిలపఱచి, మారీచు చేతఁబట్టుకొని యిట్లనియె.

* అట్లు వారు అనుచో ననేకనగరములు పట్టణములు మొదలగు వానిని జూచుచు శ్రీరాము నాశ్రమమున కరిగిరి యని తెలియుచున్నది. వాస్తుశాస్త్రమున నగరము, పట్టణము మొదలగువానిలక్షణము చెప్పఁబడినది. గ్రామము, నగరము, పట్టణము, ఖర్వటము, పురము, ఖేటకము, కుసుమము, శిబిరము, రాజవాసికము, సేనాముఖము అని పండితులచే జనావాసములు పదివిధములుగాఁ జెప్పఁబడినవి. అందు - బ్రాహ్మణులు వారియితరజాతు లగు సేవకులతోఁగూడి యుండునది గ్రామము. కేవలము బ్రాహ్మణులచే నిండియుండునది అగ్రహారము. ఇరువదితొమ్మిది విధము లగు కుటుంబములతోఁగూడి, యనేకు లగు స్త్రీలతోఁ గలిసి, వివిధశిల్పిజనములతోఁగూడి, క్రయ విక్రయవ్యాపారములతో నిండి, సర్వదేవతలతోఁగూడినది నగరము. సముద్రాంతరమం దున్న ద్వీపములనుండి దిగుమతియైన వస్తువుల క్రయవిక్రయవ్యవహారస్థులతోఁగూడి, సముద్రతీరమున నుండునది (ఓడరేవు కలది యనుట) పట్టణము. నగరపట్టణముల లక్షణములు రెండును గలిసిన యది ఖర్వటము. క్రయవిక్రయవ్యాపారులతోఁ గూడి వివిధజాతులవారు నివసించుతావై, బట్టల నేఁతగాండ్రతోఁ గూడినది పురము. వీరందరిపైనను గల యధికారులు నివసించునది ఖేటకము. వీరందరు వేరువేరుగా నివసించు తావు కుసుమము.

శిబిరాదులు మూఁడుస్థానములును యుద్ధసంబంధము లగు వాసస్థానము లని యెఱుంగ నగును.

1 ఏత దాశ్రమపదం దృశ్యతే కదళీవృతం. ౪౬
రామం పశ్యాత్ర మారీచ! సాక్షా న్మదనవిగ్రహం. ౪౬½

నవకువలయరేఖాశ్యామ మస్యేద మంగం ఘటయిత్తు
మల మక్ష్ణో రుత్సవం విద్విషో౽పి, ప్రకృతి రియ ముదారా
సాధుభి శ్శ్లాఘనీయా కథయతిచ మహత్త్వం దుర్లభం య
త్పరేణ. ౪౭-౪౭½

2 క్రియతాం తత్సఖే శీఘ్రం యదర్థం వయ మాగతాః. ౪౮

స రావణవచ శ్శ్రుత్వా మారీచో రాక్షస స్తదా. ౪౮½
3 మయశంబరముఖ్యాంశ్చధ్యాత్వామాయాగురూన్బహూన్
ఆద్యాం బీజమయీం మాయా ముపాస్యమనసా౽సురః.
4 శుద్ధజంబూనదప్రఖ్యో మృగో౽భూ ద్రౌప్యబిందుకః. ౫౦
రత్నశృంగో మణిఖురో నీలరత్నవిలోచనః
విద్యుత్ప్రభో విముగ్ధాస్యో విచచార వనాంతరే. ౫౧

రామాశ్రమపదస్యాంతే సీతా దృష్టిపథే చరన్
5 పరిభ్రమతి చిత్రాణి మండలాని వినిష్పతన్. ౫౨

సముద్వీక్ష్యచ తం సర్వే మృగా హ్యన్యే వనే చరాః
ఉపాగమ్య సమాఘ్రాయ విద్రవంతి దిశో దశ. ౫౩

1. శివరామాయణం. 2. వాల్మీకి రా. ౪౨ స. 3. శివ రామా.
4. అధ్యాత్మ రా. ౬ స. 5. వాల్మీకి రా. ౪౨ స.



౪౬-౪౬½ మారీచా! అరటిచెట్లచే నావరింపఁబడియున్న దదిగో రాముని యాశ్రమభూమి కనఁబడుచున్నది. ప్రత్యక్షమన్మథవిగ్రహుఁ డగు రాము నిందుఁ గనుము.

౪౭-౪౭½ క్రొత్తనల్లకలువరేకువలె నల్లని యీతనిశరీరము శత్రువునకైనను గన్నులపండు వొనరింపఁగలదు. ఈయుదార మగు స్వభావము (ప్రకృతి) సాధువులచేఁ గొనియాడఁదగి, మఱొక్కనికిఁ బొంద నలవిగాని మహత్త్వమును జెప్పుచున్నది.

౪౮ మిత్రమా! మారీచా! మన మిచటి కెందుకొరకు వచ్చినారమో యాపని కానిమ్ము.

౪౮½-౫౧ మారీచుఁ డారావణునిమాట విని; మాయాగురువు లగు మయుఁడు శంబరుఁడు మొదలగు ననేకమందిని ధ్యానించి, బీజమయి యగు నాదిమాయాశక్తి నారక్కసుఁడు మనసార నుపాసించి, స్వచ్ఛమైన స్వర్ణమయశరీరమును, తెల్లనివెండిచుక్కలును, రత్నవికారము లగు కొమ్ములును, మణివికారము లగు డెక్కలును, ఇంద్రనీలముల వంటి నేత్రములును, మెఱుపువంటి శరీరప్రభలును, మిగులసుందర మైన మొగమును గల లేడిరూపమును ధరించినవాఁడై యావనాంతర మునఁ దిరుగాడెను.

౫౨ వాఁడు రామచంద్రు నాశ్రమప్రాంతమున, సీతాదేవిచూపుల యెదుట చిత్రవిచిత్రముగ గంతు లిడుచు యెగిరిపడుచు, గిరగిరఁ దిరుగుచు చరించుచుండెను.

౫౩ ఇతరము లగు నడవిజంతువులు వానిం జూచి, దగ్గరగా వచ్చి మూర్కొని (రాక్షసవాసన పొడగట్టుటచే) పదిదెసలకుం బారి పోవుచుండెను.

* 1 మాయాసీతా తదా పశ్య న్మృగం మాయావినిర్మితం
హసంతీ రామ మభ్యేత్య ప్రోవాచ వినయాన్వితా. ౫౪

2 ఆర్యపు త్రాభిరామో ఽసౌ మృగో హరతి మే మనః
ఆన యైనం మహాబాహో క్రీడార్థం నో భవిష్యతి. ౫౫
యది గృహాణ మభ్యేతి జీవన్నేవ మృగ స్తవ
సమా ప్తవనవాసానాం రాజ్యస్థానాంచ నః పునః. ౫౬
ఆశ్చర్యభూతం భవతి విస్మయం జనయిష్యతి
అంతఃపురవిభూషార్థో మృగ ఏష భవిష్యతి. ౫౭

భరత స్యార్యపుత్రస్య శ్వశ్రూణాం మమచ ప్రభో!
మృగరూప మిదం వ్యక్తం విస్మయం జనయిష్యతి. ౫౮

జీవ న్న యది తే ఽభ్యేతి గ్రహణం మృగస త్తమః
అజినం నరశార్దూల! రుచిరం మే భవిష్యతి. ౫౯

కామవృత్త మిదం రౌద్రం స్త్రీణా మసదృశం మతం
వపుషా తస్య సత్వస్య విస్మయో జనితో మమ. ౬౦

ఏవం సీతావచ శ్శ్రుత్వా తం దృష్ట్వా మృగ మద్భుతం
ఉవాచ రాఘవో హృష్టో భ్రాతరం లక్ష్మణం వచః. ౬౧

* ఆనంద రా - సారకాం. ౭ సర్గేప్యేవం - ఛాయా తామసీ దృష్ట్వా మృగం రాఘవ మబ్రవీత్. ఇతి.

1\. అధ్యాత్మ రా. ౭ స. 2. వాల్మీకి రా. ౪౩ స.



౫౪ * మాయాసీత యప్పు డామాయావినిర్మిత మగు లేడిం జూచెను. వినయముతోఁగూడి రామసన్నిధికి వచ్చి నవ్వుచు ని ట్లనియె.

౫౫-౫౭ ఆర్యపుత్రా! అందమైన యీలేడి నామనసును హరించు చున్నది. మహాబాహూ! దీనిం గొని తెమ్ము! మనమాడుకొనుట కుపకరింపఁగలదు. ప్రాణములతోనే యీలేడి నీకుఁ బట్టువడెనా! యరణ్యవాసము ముగిసి, మనరాజ్యమునకుఁ బోయిన మనకు మాటి మాటికి నీలేడి వింతది యగును. అచటివారికిని వింత చేకూర్పఁగల గును. మనయంతఃపురమున కిది యొకయలంకారమే యగును.

౫౮ ప్రభూ! ఆర్యపుత్రుఁ డగు భరతునకును, మాయత్తగార్లకును నీలేడి రూపము నిజముగా నచ్చెరుపాటు గలిగింపఁగలదు.

౫౯ ఓనరోత్తమా! ఈమృగోత్తమము ప్రాణములతోఁ బట్టువడదేని దీనిచర్మమైనను నాకుఁ బ్రియ మొనఁగూర్పఁగలదు.

౬౦ ఇట్లు నిన్నుఁ బ్రేరేపించు ఘోర మగు స్వేచ్ఛావ్యవహార మాడు వాండ్రి కనుచితమైనదియే యైన నాజంతువుశరీరము నా కచ్చెరు పాటు గలిగించినది. అందుచేతనే యింతగా నిన్నుఁ బ్రేరించు చున్నదాన ననుట.

౬౧ ఇట్లు సీతమాట విని, వింతగ నున్న యాలేడిని జూచి, శ్రీరామ చంద్రుఁడు లక్ష్మణుం గని హర్షసహితుఁడై యి ట్లనియె.

* తమోగుణస్వరూపిణి యగు నాసీత లేడిని జూచి రామునితోఁ బలి కెను - అని ప్రమాణము.

పశ్య లక్ష్మణ! వైదేహీం మృగత్వచిగతస్పృహాం
త్వచాపరిధానయా హ్యేష మృగోఽద్య న భవిష్యతి. ౬౨
పశ్యాస్య జృంభమాణస్య దీప్తా మగ్నిశిఖోపమాం
జిహ్వాముఖా న్నిర్గతతీం మేఘాదివ శతహ్రదాం. ౬౩

* నకాదళీ నప్రియకీ నప్రవేణీ న చావికీ
భవే దేతస్య సదృశా స్పర్శనే నేతి మే మతిః. ౬౪

* కదల్యేవ కాదలీ - మృగవిశేషః. వైజయంత్యాం కదలీతు బిలే శేతే మృదుసూక్ష్మోక్ష్ణకర్బురైః, నీలాగ్రై ర్లోమభి ర్యుక్తా సా వింశత్యఙ్గులాయతా. కాదలీ మృగవిశేషత్వక్ — కదలీ వృక్షస్యత్వాగితివా.

ప్రియకీ - ప్రియకీ లోమభి ర్యుక్తా మృదుశ్చ మసృణై ర్ఘనైః. ఇతి మృగవిశేషః. ప్రియకస్యమృగస్య త్వక్, ప్రియకస్య వృక్షస్య త్వగితివా.

ప్రవేణీ - మృగవిశేషః (అజవిశేషసంబంధీ) - ఆస్తరణవిశేషోవా.

ఆవిరేవ ఆవికః- తస్యేయ మా వికీ - చర్మ, తల్లోమ నిర్మితా శాటీ వే త్యర్థః.



౬౨ లక్ష్మణా! ఈలేడిచర్మముపై నాసపడుచున్న యీజనకరాజకుమార్తెను జూడుము. చర్మపరిధాన మగు నీమృగ మిప్పుడు జీవింపదు.

౬౩ చూడుము! మేఘమునుండి వెలువడు మెఱపువోలె, నావులించునపుడు ప్రజ్వలించు నగ్నిజ్వాలనుబోలె దీనినోటనుండి వెలికివచ్చు నాలుకను గనుఁగొనుము.

౬౪ ♦ ఇది కాదళి కాదు. ప్రియకి కాదు. ప్రవేణి కాదు. ఆవికియుఁ గాదు. దేనిని దాఁకినను దీనిం దాఁకినట్లు కాదు.

♦ ఈపదముల కర్థములు పలువిధములఁ గన్పట్టుచున్నవి. వివరణమున మూలపదములనే వాడి, యర్థము నిటఁ బొందుపఱచుచున్నాము.
కదలియే కాదలి యని చెప్పఁబడును. నల్లచాఱల యిఱ్ఱి యందురు. వైజయంతియందు దీనిలక్షణము కదలి బిలములలోఁ బరుండును. మృదువులై, సూక్ష్మములై, పొడవైనవై, కర్బురవర్ణము గలవై, నల్లనికొనలు గల రోమములు గలిగి, యిరువదియంగుళములు పొడవు గలది కదలి అని కలదు. ఆకదలియొక్క చర్మము కాదలి యని యొకతీరు. కదలి (అరటిచెట్టు) యొక్క పట్ట కాదలి యని మరొక్కతీరు.
ప్రియకి చిత్రవర్ణముగల జింక (బొట్లయిఱ్ఱి యనియు నందురు). మృదువై, నునుపై, గట్టివైన రోమములు కలది. ప్రియక మను నీ జింకయొక్క చర్మము ప్రియకి యఁట! లేక ప్రియకమను వృక్షముయొక్క పట్ట ప్రియకి యని యొకవిధము.
ప్రవేణి (మృగవిశేషము) మేకలలో నొకరకపు మృగమనియు ఆమృగముయొక్క రోమములచే నిర్మింపఁబడిన యాస్తరణవిశేష మనియు నర్థము.
ఆవికి–'అవి' యే 'ఆవికము' అని చెప్పఁబడును. మృగవిశేషము. దీనికి సంబంధించిన చర్మము 'ఆవికి' గావచ్చును. లేక ఆజంతువు రోమములచేఁ నిర్మింపఁబడిన కంబల మనియో, శాటి యనియో చెప్పవచ్చును. మొత్త మివన్నియు మృదుస్పర్శగలవస్తువు లనుట ప్రధానము.

హత్వైత చ్చర్మ మాదాయ శీఘ్ర మేష్యామి లక్ష్మణ!
ఇహ త్వం భవ సన్నద్ధో యంత్రితో రక్ష మైథిలీం. ౬౫

* అస్యా మాయత్త మస్మాకం యత్కృత్యం రఘునందన! ౬౫½

శంకమానస్తు తం దృష్ట్వా లక్ష్మణో రామ మబ్రవీత్. ౬౬

తమేవైన మహం మన్యే మారీచం రాక్షసం మృగం.
మృగో హ్యేవం ౽విధో రత్నవిచిత్రో నాస్తి రాఘవ! ౬౭
జగత్యాం జగతీనాథ! మాయైషాహి నసంశయః. ౬౭½

శ్రీరామ ఉవాచ—

యది వాయం తథా యన్మాం భవే ద్వదసి లక్ష్మణ! ౬౮
మాయైషా రాక్షస స్యేతి కర్తవ్యో ౽స్య వధో మయా
ఏతేన హి నృశంసేన మారీచే నాకృతాత్మనా. ౬౯
వనే విచరతా పూర్వం హింసితా మునిపుంగవాః. ౬౯½
భవే ద్ధతో ౽యం వాతాపి రగస్త్యే నేవ మాం గతః. ౭౦

* అస్యా మితి- అస్మాకం యత్కృత్య మావశ్యకం తత్సర్వ మస్యా మాయత్తం. ఏతన్మూలతయా రావణవధాదికం కర్తవ్య మితి ధ్వనిః.



౬౫ దీనిం జంపి దీనిచర్మమును గొని వేగమే వత్తును. నీ విచట ధనుఃఖడ్గాదిసాధనములతో నేమరుపాటు లేక జనకరాజసుతను గాపాడుము.

౬౫½ రఘుకుమారా! * మన కావశ్యకమైన కృత్యమంతయు నీమె (సీత) యధీనమై యున్నది. అందుచే నీమె రక్షణమే ప్రధాన మనుట.

౬౬ లక్ష్మణుఁ డాలేడివిషయమై సంశయముకలవాఁడై రామునితో నిట్లు పలికెను.

౬౭-౬౭½ శ్రీరామచంద్రా! ఆమారీచుఁ డను రాక్షసుఁడే యీ మృగ మని నేనును దలఁచుచున్నాను. రత్నములచేఁ జిత్రమైన యిట్టిలేడి యీ జగమున నెందును లేదు. జగత్ప్రభూ! శ్రీరామచంద్రా! ఇది మాయ. సందియము లేదు.

నా విని శ్రీరామచంద్రుఁ డి ట్లనియె—

౬౮-౬౯½ లక్ష్మణా! నాతో నీ వన్న ట్లిది రాక్షసునిమాయయే యగుచో దీని దప్పక చంపవలసినదే. దురాత్ముఁడును, నీచుఁడును, ఈయడవిలోఁ దిరుగాడువాఁడు నగు నీమారీచునిచేఁ దొల్లి యెందరో మునిపుంగవులు హింసింపఁబడిరి.

౭౦ వాతాపి యగస్త్యునిచేఁ జిక్కి చచ్చినట్లు వీఁడును నన్నుఁ జేరి చచ్చునుగాక!

* మన కావశ్యకమైన కార్యమంతయు నీమెయధీనమయి యున్నది. అనఁగా నీమెమూలముననే, రావణసంహారాదికార్యము జరుగవలసి యున్న దని ధ్వని.

ప్రదక్షిణే నాతిబలేన పక్షిణా జటాయుషా బుద్ధిమతా చ
లక్ష్మణ!, భ నాప్రమత్తః పరిగృహ్య మైథిలీం ప్రతిక్షణం
సర్వత ఏవ శంకితః. ౨౧

1 ఇత్యుక్త్వా ప్రియయారామోమాయామృగ మనుద్రుతః
మాయా య దాశ్రియా లోకే మోహినీ జగదాకృతిః. ౨౨

2 ఆఖేలయ న్విశిఖ మేకకరేణ మందం కోదండకాండ మప
రేణ దధార సజ్యం, సన్నహ్య పుష్పలతయా పటలం
జటానాం రామో మృగం మృగయతే వనవీథికాసు. ౨౩

ఇతి శ్రీమద్రామాయణసారోద్ధారే అరణ్యకాండే
దశమ స్సర్గః.

---

## ఏకాదశ స్సర్గః.

3 స త మున్మాదయామాస మృగరూపో నిశాచరః
మృగైః పరివృతో వన్యై రదూరా త్ప్రత్యదృశ్యత. ౧
గృహీతు కామం దృష్ట్వైనం పునరేవాభ్యధావత
తక్షణాదేవ సంత్రాసా పునరంతర్హితా ఽభవత్. ౨
పునరేవ తతో దూరా ద్వృక్షషండా ద్వినిస్సృతః. ౩

---

1. అధ్యాత్మ రా. ౭ స. 2. బోధాయనరామాయణం.
3. వాల్మీకి రా. ౪౪ స.



౨౧ లక్ష్మణా! మిక్కిలిసమర్థుఁడును, బలవంతుఁడును, బుద్ధిమంతుఁడు నగు జటాయువుతోఁగూడి సీతను గనిపెట్టుకొని, క్షణక్షణమునను, నన్నియెడలనుండియుఁ బ్రమాదమును శంకించుచునే యేమఱకుందుము.

౨౨ లోకమున నెల్లర మోహింపఁజేయు జగదాకారమైన మాయ యెవ్వని దిక్కుగాఁ గలిగియున్నదో; అట్టి శ్రీరామచంద్రుఁ డిట్లు తమ్మునితోఁ బలికి యామాయామృగమును వెంబడించెను.

౨౩ ఒకచేతితో బాణమును మెల్లన నూగించుచు, నారి నెక్కిడిన కోదండము రెండవచేత ధరించి, పూలతోఁగూడిన తీఁగచే జటాపటలమును ముడివెట్టి, శ్రీరాముఁ డరణ్యవీథులయందు లేడిని వెదకుచుండెను.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమునందుఁ
బదియవ సర్గము.

---

## పదునొకండవ సర్గము.

౧-౩ లేడిరూపమున నున్న యామారీచుఁ డను రక్కసుఁడు శ్రీరామచంద్రునిమనస్సును మిగుల భ్రమింపఁజేసెను. వన్యమృగములతోఁ గూడి దాఁపుననే పొడఁగట్టెను. తనను బట్టుకొనఁజూచు నారామునిం జూచి మఱలఁ బరువులు వారుచుండెను. క్షణములోనే భయపడి మఱల కనుమఱఁగి పోవుచుండెను. అంతలోనే తిరిగి దూరముగాఁ జెట్లగుబురునుండి వెలువడుచుండెను.

[1] హస్తాభ్యాసముపైతి లేఢిచ తృణం సంస్పృశ్య తాం
గాహతే। గుల్మాన్ ప్రాప్య నివర్తతే కిసలయా న్యాఘ్రాయ
చాఘ్రాయచ, భూయః పశ్యతి గచ్ఛతి ప్రతిదిశం కండూ
యతే స్వాం తనుం। దూరం ధావతి తిష్ఠతి ప్రచలతి
ప్రాంతేషు మాయామృగః. ౩-౩½

[2] దర్శనాదర్శనా దేవం సో ఽపాకర్షత రాఘవం. ౪
సుదూర మాశ్రమ స్యాస్య మారీచో మృగతాం గతః. ౪½

దృష్ట్వా రామో మహాతేజా స్తం హంతుం కృతనిశ్చయః. ౫
తమేవ మృగ ముద్దిశ్య శ్వసంత మివ పన్నగం
ముమోచ జ్వలితం దీప్త మస్త్రం బ్రహ్మవినిర్మితం. ౬

శరీరం మృగరూపస్య వినిర్భిద్య శరోత్తమః
మారీచ స్యైవ హృదయం బిభే దాశనిసన్నిభః. ౭

తాలమాత్ర మథోత్ప్లుత్య న్యపత త్సశరాతురః. ౭½

మ్రియమాణస్తు మారీచ స్స్మృత్వా రావణభాషితం. ౮
సంప్రాప్తకాల మాజ్ఞాయ చకార చ తత స్స్వరం
సదృశం రాఘవస్యైవ హాసీతే! లక్ష్మణేతిచ. ౯
[3] ఇత్యుక్త్వా రామవ ద్వాచా పపాత రుధిరాశనః. ౯½

1. బోధాయనరామా. 2. వాల్మీకిరా. ౪౪ స. 3. అధ్యాత్మరా. ౭ స.



౩-౩½ చేతికి దొరకిన ట్లుండును. గడ్డి కొఱుకుచున్న ట్లుండును. తాఁకుటకు
వీలుగనే యున్నట్లౌను. పొదల దూఱి వెలువడుచుండును. చివురు
లను మూర్కొని మూర్కొని, సారెసారెకుం జూపుల సారించును.
ఎల్లదెసలకుం బారును. తనమేను గోకికొనును. దూరదూరముగఁ
బఱువులు వారుచు నంతలో నట నిలువఁబడుచు, దాఁపులఁ జేరి
బెదరుచు నిట్లు మాయామృగము పలుపోకల వర్తించుచుండెను.

౪-౪½ ఈవిధముగఁ గనఁబడి కనబడకుండ మారీచుఁడు లేడిరూపము
నొంది శ్రీరామచంద్రు నాశ్రమమునుండి మిగుల దూరముగ నాక
ర్షించుకొనిపోయెను.

౫-౬ మహాతేజస్వి యగు శ్రీరామచంద్రుఁ డిఁక మాయామృగాకారుఁ
డగు మారీచుని జంప నిశ్చయించి, వానికి గురివెట్టి ఫూత్కార
మొనరించు పన్నగమువలె నుండినట్టియు, ప్రజ్వలించునదియు,
బ్రహ్మచే నిర్మింపఁబడినదియు నగు నస్త్రమును వదలెను.

౭ ఆ శ్రేష్ఠమైన బాణము మృగరూపుఁ డగు వానియొక్క శరీరమును
బ్రద్దలుచేసి, పిడుగువంటిదై మారీచునిగుండెలను బగులఁ గొట్టెను.

౭½ ఆరక్కసుఁ డపుడు బాణపీడితుఁడై తాడిచెట్టంత యెత్తున కెగసి
పడి పుడిమిపైఁ గూలెను.

౮-౯½ ప్రాణములు వదలుచు వాఁడు రావణునిమాటఁ దలఁచి కాలము
వచ్చిన దని యెఱింగి, యప్పుడు హా సీతా! లక్ష్మణా! యని
శ్రీరామునిస్వరముపోలిక నార్పు వెట్టెను. ఇట్లు రామునివలెఁ బలికి
యారక్కసుఁడు నేలఁగూలెను.

యన్నామాజ్ఞోఽపిమరణేస్మృత్వాతిత్సామ్యమాప్నుయాత్
కిము తాగ్రే హరిం పశ్యం స్తేనైవ నిహతో ఽసురః. ౧౦½

తద్దేహా దుత్థితం తేజ స్సర్వలోకస్య పశ్యతః. ౧౧
రామమే వావిశ ద్దేవా విస్మయం పరమం యయుః. ౧౧½

కిం కర్మ కృత్వా కిం ప్రాప్తః పాతకీ మునిహింసకః. ౧౨
అథవా రాఘవ స్యాయం మహిమా నాత్ర సంశయః. ౧౨½

భయా త్సర్వం పరిత్యజ్య గృహవిత్తాదికం చ యత్. ౧౩
హృది రామం సదా ధ్యాత్వా నిర్ధూ తా శేషకల్మషః
అంతే రామేణ నిహతః పశ్య న్రామ మవాప సః. ౧౪

ద్విజోవా రాక్షసోవాపి పాపీవా ధార్మికో ఽపివా
త్యజ న్కళేబరం రామం స్మృత్వా యాతి పరంపదం. ౧౫

ఇతి తే ఽన్యోన్య మాభాష్య తతో దేవా దివం యయుః.
౧౫½

సీతా తద్భాషితం శ్రుత్వా మారీచస్య దురాత్మనః. ౧౬
భీతాతిదుఃఖసంవిగ్నా లక్ష్మణం త్విద మబ్రవీత్. ౧౬½
గచ్ఛ లక్ష్మణ ! వేగేన భ్రాతా తే ఽసురపీడితః. ౧౭
హా లక్ష్మణేతి వచనం భ్రాతు స్తే న శృణోషి కిం. ౧౭½



౧౦-౧౦½ ఏరామచంద్రునినామము నవసానసమయమున మూఢుఁడు గూడ స్మరించినంత నే యారామసాయుజ్యము నందఁగలుగునో; అట్టి సాక్షా న్మహావిష్ణుస్వరూపుఁ డగు శ్రీరామచంద్రునే యెదుటఁ జూచుచు నాతనిచేతిలోఁ జచ్చిన రక్కసునిమాట వేరే చెప్పవలయునా ?

౧౧-౧౧½ అప్పుడే (చనిపోయి నిజరూపము నొందిన) యామారీచునిదేహము నుండి వెడలిన దివ్యతేజ మఖిలలోకములును జూచుచుండఁగనే రామునందే ప్రవేశించెను. దేవతలు చాల యాశ్చర్యపడిరి.

౧౨-౧౨½ మునుల హింసించిన యీమహాపాపి యే మ్మంచి పని చేసి, యెట్టి గతి పొందెను? ఔరా! ఇది శ్రీరామచంద్రునిమహిమకాని వేఱు గాదు. ఇందు సంశయము లేదు.

౧౩-౧౪ రామునివలని భయముచే నిల్లు, ధనము, భార్య మొదలగువాని నెల్ల విడిచి యెల్లప్పుడు రామునే హృదయమున (భయముచే) ధ్యా నించుచు సమస్తపాపములను బోఁగొట్టుకొన్న వాఁడై, తుదకు రాముని చేతనే చచ్చి, రామునే చూచుచు రామసాయుజ్యమునే పొందెను.

౧౫ బ్రాహ్మణుఁడు - రాక్షసుఁడు, దురాత్ముఁడు - ధర్మాత్ముఁడు నను భేదములేక ఎవ్వఁడేని సమానముగానే శరీరావసానసమయమున శ్రీరాముని స్మరించి పరమపదమును బొందఁగలఁడు.

౧౫½ ఇట్లు దేవత లొకరితో నొక రనుకొనుచు నటుపై స్వర్గలోకమున కేగిరి.

౧౬-౧౬½ ఇఁక నిచట సీత దురాత్ముఁ డగు మారీచుని యామాట చెవిని బడి, భయపడి, దుఃఖముచే బేలవడి లక్ష్మణునితో ని ట్లనియె.

౧౭-౧౭½ లక్ష్మణా ! వేగముగాఁ బొమ్ము ! మీయన్న రాక్షసునిచేఁ బీడింపఁబడెడిని. " హాలక్ష్మణా ! " యను నీసోదరునిమాటను నీవు వినలేదా !

తా మాహ లక్ష్మణో దేవి! రామవాక్యం న తద్భవేత్. ౧౮
యః కశ్చి ద్రాక్షసో దేవి! మ్రియమాణో ఽబ్రవీ ద్వచః
రామ స్త్రైలోక్య మపి యః క్రుద్ధో నాశయతి క్షణాత్.
స కథం దీనవచనం భాషతే ఽమరపూజితః. ౧౯½

క్రుద్ధా లక్ష్మణ మాలోక్య సీతా బాష్పవిలోచనా. ౨౦
ప్రాహ లక్ష్మణ! దుర్బుద్ధే! భ్రాతు ర్వ్యసన మిచ్ఛసి.
ప్రేషితో భరతే నైవ రామనాశాభికాంక్షిణా. ౨౧
1 నైత చ్చిత్రం సపత్నేషు పాపం లక్ష్మణ! య ద్భవేత్
త్వద్విధేషు నృశంసేషు నిత్యం ప్రచ్ఛన్నచారిషు ౨౨
2 మాం నేతు మాగతో ఽసి త్వం రామనాశ ఉపస్థితే
నప్రాప్స్యసేత్వం మా మద్యపశ్య(ప్రాణాం స్త్యజామ్యహం. ౨౩

న జానా తీదృశం రామ స్త్వాం భార్యాహరణోద్యమం. ౨౩½

3 కథ మిందీవరశ్యామం పద్మపత్రనిభేక్షణం. ౨౪
ఉపసంశ్రిత్య భర్తారం కామయేయం పృథగ్జనం. ౨౪½

రామంవినా క్షణమపి నహి జీవామి భూతలే. ౨౫
ఆబంధిష్యే ఽథవా త్యక్ష్యే విషమే దేహ మాత్మనః
పిబా మ్యహం విషం తీక్ష్ణం ప్రవేక్ష్యామి హుతాశనం. ౨౬
న త్వహం రాఘవా దన్యం పదాపి పురుషం స్పృశే. ౨౬½

1. వాల్మీకి రా. ౪౫ స. 2. అధ్యాత్మ. ౭ స. 3. వాల్మీకి రా. ౪౬. స.



౧౮-౧౯½ అంత లక్ష్మణుఁ డామెతో; దేవీ! అది రామవాక్యము కాదు. ఎవ్వఁడో రక్కసుఁ డొక్కఁ డాతనిచేఁ జచ్చుచు నిట్లు పలికెను. అలిగెనా? యొక్కక్షణములో ముల్లోకముల నశింపఁజేయఁగల వాఁడు రాముఁడు. అట్టిరాముఁడు దేవవంద్యుఁ డగు మహానుభావుఁడు దీనమైనమాట నెట్లు పలుకును?

౨౦-౨౨ అన విని సీత కుపితురాలై లక్ష్మణుం గని, బాష్పపూరితలోచనయై యి ట్లనియె—లక్ష్మణా! దుర్బుద్ధీ! నీవు నీయన్నకు విపత్తు రావలె నని కోరుచున్నావు. రాముని నాశనమును గోరు భరతునిచేత నే నీవు పంపఁబడినాఁడవు. లక్ష్మణా! ఎల్లపుడును గుట్టు దెలిసికొనవలె నని రహస్యముగా వర్తించు నీవంటిక్రూరు లగు దాయాదులయం దిట్టి పాపము గల్గె నన్న నిది వింత గాదు.

౨౩ రామనాశనము కాఁగా; నన్నుఁ గొంపోవలయు నని నీ విటకు వచ్చితివి. కాని నీవు నన్నుఁ గొంపోఁజాలవు. చూడు మిప్పుడే ప్రాణముల విడుచుచున్నాను.

౨౩½ తనభార్యను హరింప నుద్యమించినవానినిగా నిన్ను రాముఁ డెఱుంగఁడు.

౨౪-౨౪½ నల్లగలువవంటి దేహచ్ఛాయ గలవాఁడును, తామరరేకులవంటి కన్నులు గలవాఁడును నగు శ్రీరామచంద్రుని ప్రాణేశ్వరునిగాఁ బొంది యాశ్రయించిన నేను మఱొక్కని నెట్లు కామింతును?

౨౫-౨౬½ ఉరిపోసికొందును లేక విషమప్రదేశమునఁ బడి యొడలు విడుతును. విసమైనఁ ద్రావెదను. మండెడు నగ్నిలోనైనఁ జొరెదను. అంతియేకాని రామునికంటె నన్యపురుషుని గాలితోనైన దాఁకను.

గోదావరీం ప్రవేక్ష్యామి వినా రామేణ లక్ష్మణ ! ౨౭

* ఇతి లక్ష్మణ మాక్రుశ్య సీతా దుఃఖసమన్వితా
పాణిభ్యాం రుదతీ దుఃఖా దుదరం ప్రజఘానహ. ౨౮

1 తచ్ఛ్రుత్వా లక్ష్మణః కర్ణౌ పిధాయాతీవ దుఃఖితః
2 అబ్రవీ ల్లక్ష్మణ స్సీతాం ప్రాంజలి ర్విజితేంద్రియః. ౨౯

ఉత్తరం నోత్సహే వక్తుం దైవతం భవతీ మమ
వాక్య మప్రతిరూపంతు నచిత్రం స్త్రీషు మైథిలీ. 30
న్యాసభూతాసి వైదేహి న్యస్తా మయి మహాత్మనా
రామేణ త్వం వరారోహే! న త్వాంత్యక్తుమిహోత్సహే. ౩౧

* ఇతీతి-అత్ర ‘గచ్ఛ లక్ష్మణ’ ఇత్యారభ్య ‘దుఃఖా దుదరం ప్రజఘానహ’ ఇత్యంతేన సీతాసంభాషణేన మాయాసీతా హృదయం సుస్పష్టం. అత్రత్యవిషయ ఏవ ప్రస్తావవశేన సుభద్రాంప్రతి శ్రీకృష్ణే నేత్థం ప్రతిపాదితః. తథాహి ఆగ్నేయపు. ౨౨ అధ్యాయే శ్లో॥ పురా సీతాపి సౌమిత్రిం బహూక్త్వా దుర్వచ స్సతీ, సంపాద్య దుఃఖం భర్తుశ్చ స్వయం ప్రాపచ సంకటం. నిదర్శయంతీ నారీణాం దుశ్శీలం పాపమానసం, లోకమాతా కరో దేవం లోకరక్షార్థ మాగతా. తస్మా త్సర్వాత్మనా భద్రే మా కృథా భర్తు రప్రియ మితి.

1. అధ్యాత్మ రా. ౭ స. 2. వాల్మీకి రా. ౪౫ స.



౨౭ లక్ష్మణా! రాముఁడే లేనిచో గోదావరీనదిలో దిగెదను.

౨౮ *ఇట్లు లక్ష్మణునికడ నాక్రోశించి, దుఃఖమువలన చేతులచే నుదరము బాదుకొనుచు నేడ్చెను.

౨౯ అది విని లక్ష్మణుఁడు రెండుచెవులు మూసికొని, మిగుల దుఃఖించి, జితేంద్రియుఁ డగు నాతఁడు దోసిలొగ్గి సీతను గాంచి యిట్లనియె.

30-3౧ నాపాలిఁటి దేవతవై పూజ్యురాల వగు నీకుం బదులుమాట పలుకుట కుత్సహింపను. జనకరాజపుత్రీ! అనుచితముగ మాటలాడుట స్త్రీలలో వింత గాదు. మహాత్ముఁ డగు శ్రీరామచంద్రునిచే నాకడఁ దాఁచఁబడినదానవు. కావున నిన్నిచట నొంటరిగా విడుచుట కిచ్చగింపను. విదేహరాజగు జనకునివంటివానికిఁ బుత్రిక

* ఇట ‘లక్ష్మణా వెళ్లుము’ అని మొదలుకొని ‘దుఃఖమువలనఁ గడుపు బాదుకొనెను’ అనువరకు సీతాసంభాషణముచే, మాయాసీత యొక్క హృదయము స్పష్టమగుచున్నది. ఇటనున్న యంశమే ప్రస్తావనావశమున సుభద్రనుగూర్చి శ్రీకృష్ణునిచే నిట్లు తెలుపఁబడెను. ఆగ్నేయపురాణమున ౨౨ అధ్యాయమున ‘మున్ను సీతయు లక్ష్మణునిగూర్చి దుఃఖవచనములు చాల పలికి, భర్తకును దుఃఖమును గలిగించి, తాను సంకటస్థితిని బొందెను. స్త్రీల చెడ్డమనస్సును, చెడు నడువడిని జూపుటకై లోకమాత లోకరక్షణకొఱకు వచ్చి యిట్లు చూపెను. కనుక లోకల్యాణీ! అన్నివిధములచేతను భర్తకెన్నఁడు నప్రియ మగు కార్యముం జేయకుము.’

న సహే హీదృశం వాక్యం వైదేహి! జనకాత్మజే!
శ్రోత్రయో రుభయో ర్మేఽద్య తప్తనారాచసన్నిభం. ౩౨

ఉపశృణ్వంతు మే సర్వే సాక్షిభూతా వనేచరాః
గమిష్యే యత్ర కాకుత్స్థ స్స్వస్తి తే ఽస్తు వరాననే! ౩౩

రక్షంతు త్వాం విశాలాక్షి! సమగ్రా వనదేవతాః
[1] మా త్వ ముల్లంఘయ స్వేమాం ప్రాణైః కంఠగతై రపి. ౩౪
ఇత్యుక్త్వా ధనుషః కోట్యా కృత్వా రేఖాం సమంతతః
బాహ్యదేశే పంచవట్యాం సౌమిత్రిః పరిఘోపమాం. ౩౫
నత్వా సీతాం తతస్తూష్ణీం యయౌ రామం త్వరాన్వితః. ౩౫½

[2] త దాసాద్య దశగ్రీవః క్షిప్ర మంతర మాస్థితః ౩౬
* అభిచక్రామ వైదేహీం పరివ్రాజకరూపధృత్
శ్లక్ష్ణకాషాయసంవీతః శిఖీ ఛత్రీ ఉపానహీ. ౩౭
వామే చాంసే ఽవసజ్యాథ శుభే యష్టికమండలూ
పరివ్రాజకరూపేణ వైదేహీం సముపాగమత్. ౩౮

* అభిచక్రామేతి - అభిచక్రామ - అభిముఖ్యే నాజగామ. పరివ్రాజకో భిక్షుః తస్యరూపం లింగం ధారయతీతి పరివ్రాజకరూపధృత్ రావణధారితపరివ్రాజకలింగా న్యాహ శ్లక్ష్ణేతి-అత్ర ధర్మప్రధానజనకకులనందిన్యా ధర్మస్వరూప శ్రీరామస్య పత్న్యా స్సీతాయాః విశ్వాసాయ 'తీర్థాటపర్య

1. ఆనంద రా. సా. కాం. ౭ స. 2. వాల్మీకి రా. ౪౬ స.



నైన నీ విట్టి పలుకువాక్యము నేను సహింపఁజాలను. ఇది నా రెండు చెవులలోఁ గాల్చినయినుపబాణమును గ్రుచ్చినట్లైనది.

౩౩ ఈవనమునందుఁ జరించువారందరు సాక్షిభూతులై నావాక్యమును విందురుగాక! శ్రీరామచంద్రుఁ డెచట నున్నాఁడో; అచటకే నేను బోవుచున్నాను. సీతా! సుముఖి వగు నీకు మంగళ మగును గాక!

౩౪-౩౫½ ఓవిశాలనేత్రములు గల జానకీ! ని న్నిట నుండు వనదేవత లందరును గాపాడుదురుగాక! తల్లీ! ప్రాణములు కంఠగతములైన నగుఁగాక! నీవు నేను గీఁచిన యీగీఁతను దాటకుము! అని పల్కి పంచవటికి వెలుపలిప్రదేశమున ధనుష్కోటిచేఁ బరిఘాకారమున నొకరేఖ గీఁచి సీతకు నమస్కరించి మారుమాటాడక వేవేగ శ్రీరాముని సన్నిధి కేగెను.

౩౬-౩౮ * రావణుఁడు వేచికొని యుండి యాయవకాశమును గనిపెట్టి యపుడు పరివ్రాజకవేషమును ధరించి జానకి కెదురుగా నేగెను. నును పైన కాషాయవస్త్రములను గప్పుకొని, శిఖను ధరించి, గొడుగు పట్టుకొని, పాముకోళ్లు దొడిగికొని, శుభములైన దండమును, కమండులువు నెడమభుజమునకు వ్రేలాడఁ దగిలించుకొని వాఁడు (పరివ్రాజక వేషముతో) సీతాదేవిని సమీపించెను.

* 'అభిచక్రామ' అనుదాని వ్యాఖ్య. అభిచక్రామ = ఎదురుగాఁ జనెను. పరివ్రాజకుఁడు అనఁగా భిక్షువు. వానిరూపమును అనఁగా వానిచిహ్నమును ధరించినవాఁడు కనుక పరివ్రాజకరూపము ధరించినాఁ డని చెప్పఁబడెను. రావణుఁడు దాల్చిన యాసన్యాసిచిహ్నములే "నును పైన కాషాయము ధరించి" అనునదాదిగా వర్ణింపఁబడినవి. ఇఁట ధర్మప్రధాను లగు జనకరాజులవంశమునఁ గుమార్తెయై, ధర్మస్వరూపుఁ డగు శ్రీరామునికి ధర్మపత్ని యగు సీతకు నమ్మకము గల్గించుకొఱకు "తీర్థములం దిరుగుట, భిక్ష మడుగు

తా మాససా దాతిబ్యాం భ్రాతృభ్యాం రహితాం వనే
రహితాంచంద్రసూర్యాభ్యాంసంధ్యామివమహత్తమః. ౩౯

త ముగ్రతేజః కర్మాణం జనస్థానరుహా ద్రుమాః
సమీక్ష్య నప్రకంపంతే నప్రవాతిచ మారుతః. ౪౦

టంతో భైక్షం కుర్వంత ఇత్యాది లక్షణోపేత శిఖీ ఛత్రీ ఉపానహీత్యాదినా బహూదకత్రిదండసన్యాసిరూపే ణాజగామేతి ద్యోత్యతే. అత్ర కేచన అద్వైతయతినిందాం మనసి నిధాయ శ్లో॥ బ్రహ్మసూత్రం త్రిదండంచ వస్త్రం జంతునివారణం। శిక్యం పాత్రం బృసీం చైవ కౌపీనం కటివేషణం। యస్యైత ద్విద్యతే లింగం స యతి ర్నేతరో యతి రితి-బహూదకపరివ్రాజకవేషలక్షణనిరూపక కాంగిరోవచన ముదాహృత్య తూష్ణీం స్థితాః. పరివ్రాజకస్వరూపం తత్వతోగ్రహణార్థ మత్ర కాణ్వాయనస్మృతే రర్థో ఉచ్యతే. పరివ్రాజకా శ్చతుర్విధాః - కుటీచకా బహూదకా హంసాః పరమహంసా శ్చేతి. తత్ర కుటీచకాః స్వపుత్రగృహే భిక్షాం చరంత స్త్రిదండినః. బహూదకాస్తు త్రిదండినః శిక్యజలపాత్రపాదుకాసనశిఖాయజ్ఞోపవీతకౌపీనకాషాయవేషధరా స్తీర్థే పర్యటంతో భైక్షం చరంత ఆత్మానం ప్రార్థయంతే. హంసా - ఏకదండినః శిఖావర్జం యజ్ఞోపవీతధరాః. పరమహంసాస్తు ఏక దండధరాః ముండినః త్యక్తయజ్ఞోపవీతినః సన్న్యస్తసర్వకర్మాణ ఆత్మనిష్ఠా ఇతి.



౩౯ మహాబలవంతుఁ డగు వాఁడు, అన్నదమ్ము లిద్దరును అయ్యాశ్రమమున లేక యొంటిపాటున నట్టడవి నున్న యాసీతను జంద్రసూర్యులు లేని సంధ్యను పెంజీఁకటి గ్రమ్మినట్లు జేరెను.

౪౦-౪౦½ భయంకరతేజమును భయంకరచర్యలును గల యారావణునిం గని జనస్థానమందు చెట్లాకైనను గదల్పక నిలుచంబడెను. వాయువు

కొనుట మొదలగు లక్షణములతోఁ గూడి శిఖగలవాఁడై ఛత్రమును ధరించినవాఁడై” అని యీవిధముగా వర్ణింపఁబడినటులు రావణుఁడు త్రిదండులలో నొకతెగకుఁ జేరిన బహూదకసన్యాసి రూపమున వచ్చె నని సూచింపఁబడుచున్నది. ఇటఁ గొందరు అద్వైతమతనిందను మనసున నుంచుకొని “బ్రహ్మసూత్రము, త్రిదండము, జంతునివారకమైన వస్త్రము, శిక్యము (ఉట్టి), పాత్రము, బృసి (ఆసనవిశేషము), కౌపీనము, కటికి జుట్టు మొల వస్త్రము అను నీచిహ్నము లెవ్వని కుండునో వాఁడే యతి; యితరుఁడు కాఁడు” అని బహూదకపరివ్రాజకులలో నొకతెగ వారిలక్షణములను దెలుపు నాంగిరసునివచనము నుదాహరించి యూరకొందురు. పరివ్రాజకుల స్వరూపము స్పష్టముగా గ్రహించుటకై నిట కాణ్వాయనస్మృత్యర్థము వాకొనఁబడుచున్నవి. పరివ్రాజకులు నాల్గువిధములుగ నుందురు. కుటీచకులు, బహూదకులు, హంసలు, పరమహంసలు అని. అందుఁ గుటీచకులు తమకుమారుల గృహములందే బిచ్చమడిగికొను త్రిదండులు. బహూదకులు శిక్యముఁ (ఉట్టి), జలపాత్రము (కమండలువు), పాదుకలు, కూర్చొనుటకాసనము, సిగ, జందెము, గోచి, కాషాయము వీనిని ధరించి తీర్థాటనము చేయుచు బిచ్చ మడిగి చరించుచు నాత్మానుసంధానము సేయువారు. హంసలు ఒకదండముగలవారు. జుట్టుండదు. జందెములఁ దాల్తురు. పరమహంసలు ఒక్కటే దండము, తలలు బోడులు, యజ్ఞోపవీత ముండదు, సర్వకర్మపరిత్యాగము సేసి కేవల మాత్మనిష్ఠఁ గలిగియుందురు.

స్తిమితం గంతు మారేభే భయా ద్గోదావరీ నదీ. ౪౦½
స తాం పద్మపలాశాక్షీం పీతకౌశేయవాసినీమ్. ౪౧
అబ్రవీ త్ప్రశ్రితం వాక్యం రహితే రాక్షసాధిపః. ౪౧½

కా త్వం కాంచనవర్ణాభే! పీతకౌశేయవాసిని! ౪౨
కమలానాం శుభాం మాలాం పద్మినీవ హి బిభ్రతీ
హ్రీః కీర్తి శ్శ్రీ శ్శుభా లక్ష్మీ రప్సరా వా శుభాననే! ౪౩
భూతిర్వా త్వం వరారోహే! రతిర్వా స్వైరచారిణీ. ౪౩½

కా త్వం భవసి రుద్రాణాం మరుతాం వా వరాననే! ౪౪
వసూనాం వా వరారోహే! దేవతా ప్రతిభాసి మే. ౪౪½

కాసి కస్య కుతశ్చ త్వం కి న్నిమిత్తంచ దండకాన్. ౪౫
ఏకా చరసి కల్యాణి! ఘోరాన్ రాక్షససేవితాన్. ౪౫½

ఇతి ప్రశస్తా వైదేహీ రావణేన దురాత్మనా. ౪౬
* ద్విజాతివేషేణ హి తం దృష్ట్వా రావణ మాగతం
సర్వై రతిథిసత్కారైః పూజయామాస మైథిలీ. ౪౭

* ద్విజాతిరితి - ద్విజాతిసన్యాసివేషే ణాగతం రావణం సీతా జ్ఞాత్వా - శ్రీరామవాక్యం స్మృత్వా సర్వై రతిథియోగ్య సత్కారైః పూజయామా సే త్యర్థః. శ్లో॥ యతీనాం పూజనం కార్యం స్త్రియావా పురుషేణ వేత్యుక్తత్వాత్.



వీవ వెఱచెను. గోదావరీనదియు భయముచే మెల్లఁగ నడువ దొడఁ కొనెను.

౪౧-౪౧½ రక్కసుల ఱేఁ డగు నారావణుఁడు తామరరేకులవంటి నేత్రములు గలదియుఁ, బచ్చనిపట్టువస్త్రముఁ దాల్చినదియు నగు సీతతో నావిజనప్రదేశమున మెల్లఁగ నీవాక్యముం బల్కెను.

౪౨-౪౩½ బంగారపుమేనిచాయం బ్రకాశించుచుఁ బచ్చనిపట్టు చీర ధరించి శుభములైన తామరపూవుమాలికల ధరించి తామరపూలతీవలె నున్నదానవు. నీ వెవ్వతెవు? నీవు హ్రీ వగుదువో? (విష్ణుపత్ని యగు భూమి హ్రీయనియు, గౌరి యనియుఁ గొందరు) శ్రీవో? (శ్రీ శోభనసంపత్తి. ఐశ్వర్యప్రధాన మగు భగవచ్ఛక్తి యని కొందరు) శుభ మొసఁగూర్చు సాక్షా ల్లక్ష్మివో? (లక్ష్మి - కాంత్యధిష్ఠాన దేవత) అప్సరస్త్రీవో? భూతివో? (అణిమాదిసిద్ధిస్వరూపిణి) సుందరవదనా! స్వతంత్రసంచారిణి వగు రతీదేవివో?

౪౪-౪౪½ నీవు దేవతాస్త్రీ వట్లఁ దోఁచుచున్నావు. అందు రుద్రులలో దానవా? మరుత్తులకు సంబంధించినదానవా? లేక వసువులకు సంబంధించినదానవా?

౪౫-౪౫½ నీ వెవ్వతెవు? (నీ పే రే మనుట) ఎవరిదానవు? ఎట నుండి వచ్చితివి? ఓకల్యాణీ! రాక్షసులు సంచరించు నీదండకారణ్యమునం బడి యిట్లొంటరిగా నెందులకు సంచరించుచున్నదానవు?

౪౬-౪౭ ఈవిధముగా దురాత్ముఁ డగు రావణునిచేఁ గొనియాడఁబడిన యాసీత *బ్రాహ్మణవేషముతోఁ గూడి వచ్చిన యారావణుని జూచి సర్వవిధము లగు నతిథిమర్యాదలచేఁ బూజించెను.

* బ్రాహ్మణసన్యాసివేషముతో వచ్చిన రావణుని సీత యెఱింగి, తొలుత రావణునిరాకను గూర్చి శ్రీరాముఁడు సెప్పిన మాటలు స్మరించి, అతిథులకుఁ దగిన సకలవిధసత్కారములచేఁ బూజించె నని భావము. స్త్రీయైనను బురుషుఁడైనను యతుల పూజను జేయ వలె నని చెప్పఁబడినది.

1 రావణేనతు వైదేహీ తథా పృష్టా జిహీర్షతా
పరివ్రాజకలింగేన శశంసాత్మాన మంగనా. ౪౮
2 మాయాసీతా తదారామవాక్యంస్మృత్వాఽబ్రవీదిదం. ౪౮½
3 దుహితా జనక స్యాహం మైథిలస్య మహాత్మనః. ౪౯
సీతా నామాస్మి భద్రం తే రామభార్యా ద్విజోత్తమ! ౪౯½

ఉషిత్వా ద్వాదశసమా ఇక్ష్వాకూణాం నివేశనే. ౫౦
భుంజానా మానుషాన్ భోగాన్ సర్వకామసమృద్ధినీ. ౫౦½
తత స్త్రియోదశే వర్షే రాఽజా మంత్రియత ప్రభుః. ౫౧
అభిషేచయితుం రామం సమేతో రాజమంత్రిభిః. ౫౧½

తస్మిన్ సంభ్రియమాణేతు రాఘవ స్యాభిషేచనే. ౫౨
కైకేయీనామ భర్తార మార్యా సా యాచతే వరం
మమ ప్రవ్రాజనం భర్తు ర్భరత స్యాభిషేచనం. ౫౩
ఇతి బ్రువాణాం కైకేయీం శ్వశురో మే సమానదః
అయాచ తార్థై రన్వర్థై ర్నచ యాచ్ఞాం చకార సా. ౫౪

* మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః
అష్టాదశహి వర్షాణి మమ జన్మని గణ్యతే. ౫౫

* మమభర్తేతి-పంచోత్తరా వింశతిః పంచవింశతిః పంచవింశతి వర్ష ఇత్యర్థః. వయః పరిమాణం వననిర్గమనకాలికం!

1. వాల్మీకి రా. ౪౭ స. 2. అగస్త్య రా. 3. వాల్మీకి రా. ౪౭ స.



౪౮-౪౮½ తనను హరింపఁ గోరి పరివ్రాజకచిహ్నమును ధరించివచ్చిన రావణునిచే నిట్లు ప్రశ్నింపఁబడినదై సీత తనవృత్తాంతముఁ జెప్పెను. రామవాక్యమును స్మరించి యప్పుడామె యిట్లనియె.

౪౯-౪౯½ నేను మిథిలాధిపుండును మహాత్ముండు నగు జనకుని కూఁతురను; సీత యనుదానను. బ్రాహ్మణోత్తమా! నీకు మంగళ మగుఁగాక! నేను రాముభార్యను

౫౦-౫౦½ పండ్రెండేండ్లిక్ష్వాకురాజుల యింట నుండి సర్వవిధము లగు కోరికలును దీరునట్లు మానుషభోగములనెల్ల ననుభవించితిని.

౫౧-౫౧½ అట పదుమూఁడవయేట సర్వసమర్థుం డగు దశరథరాజు సామంతమంత్రిజనసమేతుండుగా శ్రీరామచంద్రునికి యువరాజ్య పట్టాభిషేకముం గావింప నెంచెను.

౫౨-౫౪ శ్రీరామచంద్రుని యభిషేకప్రయత్నము ప్రారంభింపఁబడఁగానే పూజ్యురాలగు కైకేయి తనభర్తను దశరథుని వరముం గోరెను. నాభర్త యగు రామున కరణ్యవాసమును భరతునకు రాజ్యాభిషేచనమును జేయు మన కైకేయిని మామామగారనేక ప్రయోజనములచే సువర్ణరత్నాదిపదార్థముల వరములకు మారుగాఁ గొను మని యిచ్చి యాచించెను. కాని యామె యాయన యాచన నంగీకరింప లేదు.

౫౫ * మహాతేజస్వి యగు నాభర్త వయసున నిరువదియైదు వత్సరములవాఁడు. నాకును బుట్టువుం దొట్టి పదునెనిమిదేండ్లవయస్సని లెక్కింపఁబడుచున్నది.

* నాభర్త యిరువదియైదువత్సరములవాఁ డనుటలో నీ వయఃపరిమాణ నిర్ణయము వనవాసమునకు బయలుదేర నప్పటిది. నాకు ౧౮ వత్సరముల వయస్సు లెక్కింపఁబడుచున్న దనుటలో - శ్రీరాముని పండ్రెండవయేట విశ్వామిత్రుఁడు వచ్చుట. ఆవెంటనే సీతావివా

రామోఽపి ప్రథితో లోకే గుణవాన్ సత్యవాన్ శుచిః
చకార తద్వచ స్తస్యాః మమ భర్తా దృఢవ్రతః. ౫౬

మమ జన్మని సతి వర్షా ణ్యష్టాదశేతి గణ్యతే. తథాహ-
శ్రీరామస్య ద్వాదశే వర్షే విశ్వామిత్రాగమనం. తదనం
తరమేవ సీతావివాహః. తదనంతరం వైదేహ్యాసహ అ
యోధ్యానగరే ద్వాదశవర్షాణి వాసం కృతవాన్. తతః
పరం త్రయోదశే వర్షే యౌవరాజ్యాభిషేకప్రయత్నా
రంభః. తతశ్చ వనప్రవేశసమయే శ్రీరామః పంచవిం
శతివర్షార్హః. తతో మునీనా మాశ్రమేషు దశవత్సరాః.
చిత్రకూటే వత్సరమాత్రం నివాసః. పంచవట్యాం వత్స
రద్వయం. ఆహత్య త్రయోవింశద్వర్షాణి. వనవాసస్య
చతుర్దశే వర్షే సీతాహరణ మితి. సీతాయాశ్చ భూ
గర్భా దావిర్భావానంతరం మిథిలాయాం షట్ సంవత్సరాః.
తతో వివాహానంతర మయోధ్యాయాం ద్వాదశ ఇత్యేవ
మష్టాదశవర్షాగతవనవా సారంభ ఇత్యుక్తం విస్తరేణాయ
మర్థః అయోధ్యాకాండే పంచమసర్గే 'దశస ప్తచ వర్షాణీ'
త్యత్ర ప్రతిపాదిత ఇతి శం
అతఏవ స్కాందే ఉమాసంహితాయాం నవమాధ్యాయే
శివః- శ్లో॥ దశగ్రీవం ప్రతి తదా ప్రాహ సీతా యశస్వినీ,
మమ భర్తా మహాతేజా వయసా పంచవింశకః. దశవర్ష
సహస్రాణి స్థిత్వా గాం ప్రావిశ్య భూతలాత్, ఉత్థితాయా
మమాత్రాపి వయసా ఽష్టాదశ స్మృతాః- ఇతి.



౫౬ నాభర్త రాముఁ డను పేరఁ బ్రసిద్ధి కెక్కినవాఁడు. అతఁడు గుణ
వంతుఁడు. సౌశీల్యముగలవాఁడు. సత్యవంతుఁడు. శుచిత్వము గల
వాఁడు. దృఢమైన నియమమునుగలవాఁడు. (అందుచే) నాభర్త
కైకేయియొక్క యామాటను జెల్లించెను.

హము, అటుపిమ్మట ౧౨ వత్సరములు సీతాదేవితోఁగూడి యయో
ధ్యానగరమున వసించుట, అటుపై పదుమూఁడవ యేట యౌవరాజ్య
పట్టాభిషేకప్రయత్నము. అందుచే శ్రీరామచంద్రుఁడు వనప్రవేశ
కాలమున నిరువదియైదువత్సరములవాఁ డనుట తగును. పిమ్మట
మునుల యాశ్రమములఁ బదియేండ్లు, చిత్రకూటమున నొక్కవత్స
రము; పంచవటియందు రెండేండ్లు మొత్తము పదమూఁడేండ్లు. వన
వాసకాలములో ౧౪ సంవత్సరమున రావణుఁడు సీతను హరించుట
జరిగెను. సీత భూగర్భమునుండి జనించిన తర్వాత మిథిలయం
దారుసంవత్సరములు. పిమ్మట వివాహమై యయోధ్యయందు ౧౨
సంవత్సరములు. ఇట్లు వనవాసారంభకాలమునాటికి సీతకు ౧౮
యేండ్లు వయ స్సని యర్థము. ఇవ్విషయ మింకను విస్తారముగ
నయోధ్యాకాండమున నైదవసర్గమున "దశస ప్తచ వర్షాణి" యను
శ్లోకముకడఁ బ్రస్తావింపఁబడెను. కనుకనే స్కాందమున ఉమా
సంహితయందుఁ దొమ్మిదవయధ్యాయమున శివుఁడు "రావణునితో
మున్ను సీత నాభర్తయిరువదియైదువత్సరములవాఁడు, నేను పదివేల
సంవత్సరములు భూమియం దుండి యటనుండి లేచి వచ్చితిని. అది
మొదలు నావయస్సు ౧౮ సంవత్సరములు అన్నట్లు" పలికెను.

దద్యా న్న ప్రతిగృహ్ణీయా త్సత్యం బ్రూయా న్న చానృతం
ఏత ద్బ్రాహ్మణ! రామస్య ధ్రువం వ్రత మనుత్తమం. ౫౭

సభ్రాతా లక్ష్మణో నామ ధర్మచారీ దృఢవ్రతః
అన్వగచ్ఛ ద్ధనుష్పాణిః ప్రవ్రజంతం మయాసహ. ౫౮

జటీ తాపసరూపేణ మయాసహ సహానుజః
ప్రవిష్టో దండకారణ్యం ధర్మనిత్యో జితేంద్రియః. ౫౯

సమాశ్వస ముహూర్తంతు శక్యం వస్తు మిహ త్వయా
ఆగమిష్యతి మే భర్తా వన్య మదాయ పుష్కలం. ౬౦

[1] నిమంత్ర్యమాణః ప్రతి పూర్ణభాషిణీం నరేంద్రపత్నీం ప్రసమీక్ష్య మైథిలీం, ప్రసహ్య తస్యా హరణే ధృతం మన స్సమర్పయ త్స్వాత్మవధాయ రావణః. ౬౧

[2] ఇతీవ బ్రువతీం సీతాం మానుషీ మితి నిశ్చితః
పునశ్చ శంకితో భూత్వా రావణో వాక్య మబ్రవీత్. ౬౨

[3] భిక్షాం ప్రయచ్ఛ నను సూర్యకులావతంసే! కన్యే! విదేహనృపతేః ప్రథితాఽసి సాధ్వి!, ఏత ద్గృహాణ హరిపాదరజోవిమిశ్రం నిర్మాల్యదామ సకలేప్సితసిద్ధిహేతుః. ౬౩

1. వాల్మీకి రా. ౪౬ స. 2. శివరామాయణం. 3. బోధాయన రామాయణం.



౫౭ ఒకరి కిచ్చునుగాని యొరులనుండి గ్రహింపఁడు. నిజమాడునుగాని యనిజం బాడి యెరుంగఁడు. ఓ బ్రాహ్మణా! ఇదియే రాముని యచంచలము, నుత్తమము నైన మతము.

౫౮ ఆతనితమ్ముఁడు లక్ష్మణుఁ డనువాఁడు ధర్మవర్తనుఁడు. దృఢవ్రతుఁడు. నాతోఁబాటఁ డరణ్యవాసమునకు బయల్వెడలిన శ్రీరాముని ధనుష్పాణియై వెంబడించెను.

౫౯ శ్రీరామచంద్రుఁడు తాపసరూపమున జటలఁ దాల్చి యింద్రియముల జయించి ధర్మప్రధానుఁడై తమ్మునితోడను, నాతోడను దండకారణ్యముం బ్రవేశించెను.

౬౦ ముహూర్తకాల మిటఁ దెప్పిరిల్లుము. ఇట నీ వుండుటకు వీలున్నది. నానాథుఁడు సమృద్ధిగా నడవి యాహారములఁ గొని రాఁగలఁడు.

౬౧ ఇట్లాహ్వానింపఁబడినవాఁడై రావణుఁడు నిండుగా మాటలాడుచున్న శ్రీరామసార్వభౌముని భార్యయు, మిథిలరాజు కూఁతురును నగు సీతను బలాత్కారముగ హరింపవలె నని తన చావుకొఱకు సంకల్పించెను.

౬౨ ఇట్లు పలుకుచున్న సీత మనుష్యస్త్రీ యని నిశ్చయించి రావణుఁడు అవునో, కాదో యని మఱల శంకించి యి ట్లనియె.

౬౩ ఓ సూర్యవంశమునకు శిరోభూషణమువంటిదానా! మిథిలరాజకన్యకా! సాధ్వీమణీ! నీవు చాల ప్రసిద్ధి కెక్కినదానవు. భిక్షపెట్టుము. ఇదిగో శ్రీహరిపాదధూళితోఁగూడినదియు, సర్వవాంఛితములను సిద్ధింపఁజేయునదియు నగు నీ భగవన్నిర్మాల్యము లగు నీ పూలమాలికలఁ బుచ్చుకొనుము.

1 సాపి శ్రుత్వాచ జ్ఞాత్వాచ రావణం జానకీ తదా
రేఖాబహి స్సవ్యపాదం దత్వా దీర్ఘలసత్కరా. ౬౪
గృహీ ష్వేమాం వరాం భిక్షా మితి తం ప్రాహ జానకీ.
తర్హి రేఖాం సముల్లంఘ్య మాం భిక్షాం దాతు మర్హసి.
ఇత్యాహ రావణ స్స్మృత్వా రేఖాం లక్ష్మణనిర్మితాం. ౬౫½

సా శ్రుత్వా లక్ష్మణా ద్దత్తరేఖా ముల్లంఘ్య జానకీ. ౬౬
ఆగత్య చాబ్రవీ ద్భిక్షాం దత్వా కుశల మీదృశం. ౬౬½
2 * సత్వం నామచ గోత్రంచ కులం చాచక్ష్వ తత్వతః. ౬౭
ఏకశ్చ దండకారణ్యే కిమర్థం చరసి ద్విజ ! ౬౭½

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
ఏకాదశస్సర్గః.

---

* సత్వ మితి - నను సన్యాసినం ప్రతి కులగోత్రప్రశ్నో ఽనుపపన్నః. ఏకాకితయారణ్యే సంచారశ్చ యతే ర్ధర్మ ఏవ. అతో ఽసంగత ఇతి ప్రతిభాతీతి చేత్ ఉచ్యతే. పూర్వాశ్రమనామగోత్రప్రశ్నో ఽయం, అథవా వేషధారణా త్పూర్వనామగోత్రప్రశ్నో వా. అత ఏవాహ తత్వతః ఆచక్ష్వేతి. 'భిక్షార్థం గ్రామం ప్రవిశేత్' ఇతి శ్రుత్యా భిక్షో ర్గ్రామసమీపారణ్యే వస్తవ్యం. నతు గ్రామప్రసంగరహితే ఽరణ్య ఇతి. కథం భవాన్ భిక్షాప్రదజనరహితప్రదేశే చరత ఇతి ప్రశ్న ఉపపద్యతే.

---

1. ఆనందరా. సారకాం. ౭ సర్గే, శివరా. చ. 2. వాల్మీకిరా. ౪౭ స.



౬౪-౬౪½ ఆజానకియు నది విని వాఁడు రావణుఁ డని యెఱింగి లక్ష్మణుఁడు మున్నుగీఁచినగీటునకు వెలుపల నెడమపాదము నుంచి పొడవైన తనచేయిని జాచి యీయుత్తమభిక్షను గ్రహింపు మనెను.

౬౫-౬౫½ "అట్లైనచో నాగీటు దాటి నాకు భిక్షము వెట్టఁదగుదువు" అని లక్ష్మణుఁడు గీఁచిన బఱిని జ్ఞాపకమునం దెచ్చుకొని రావణుఁడు పలికెను.

౬౬-౬౬½ సీత విని యాగీటుఁదాఁటి వచ్చి భిక్షము వెట్టి క్షేమంకరమైన యీమాటఁ బల్కెను.

౬౭-౬౭½ * ఓ బ్రాహ్మణా ! నీ పేరు, గోత్రము, కులము దాఁచక చెప్పుము. ఒంటరిగ నీదండకారణ్యమున నెందులకుఁ జరించుచున్నావు.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమునఁ
బదునొకండవసర్గము.

---

* సన్యాసులను కులగోత్రముల నడుగుట తగదు. ఒంటరిగా నరణ్యమున సంచరించుట యతికి ధర్మమే. అందుచే నీప్రశ్న యసందర్భముగాఁ దోఁచుచున్నది-యన్నచో నందులకుఁ జెప్పఁబడుచున్నది. ఇది పూర్వాశ్రమమునందలి కులగోత్రముల నడుగుట; లేక వేషధారణమునకుఁ బూర్వమునఁ గల నామగోత్రముల ప్రశ్నమైనఁ గావచ్చును. అందుచేతనే దాఁచక చెప్పు మనుటయు, "భిక్షముకొఱకు గ్రామమునఁ బ్రవేశింపవలెను" అను శ్రుతియుండుటచే భిక్షువు గ్రామమునకు దగ్గరగా నుండు నడవిలోనే యుండవలెను గాని గ్రామ మనుమాటయే వినరాని యరణ్యమున నుండరాదు. అట్టిచో నీ వేల భిక్షము పెట్టు జనులు లేని ప్రదేశమున జరించుచుంటి వని ప్రశ్నించుటయుఁ దగియే యున్నది.

## ద్వాదశస్సర్గః.

[1] ఏవం బ్రువంత్యాం సీతాయాం రామపత్న్యాం మహాబలః
ప్రత్యువాచోత్తరం తీవ్రం రావణో రాక్షసాధిపః. ౧

అహంతు రావణోనామ సీతే! రక్షోగణేశ్వరః
లంకానామ సముద్రస్య మధ్యే మమ మహాపురీ. ౨

* త్వాంతు కాంచనవర్ణాభాం దృష్ట్వా కౌశేయవాసినీం
రతిం స్వకేషు దారేషు నాధిగచ్ఛా మ్యనిందితే! ౩

---

* త్వాంతు కాంచనవర్ణాంగీ మిత్యాది శ్లోకానాం ప్రాతీతికార్థ స్స్పష్టః. వస్తుతస్తు త్వాం - మ మేష్టదేవతా మిత్యర్థః. దృష్ట్వా, స్వకేషు దారేషు = పుత్రమిత్రాదిషు దారేషుచ, రతి=మిచ్ఛాం, నాధిగచ్ఛామి. మమేష్టదేవతాయా స్తవ దర్శనే నానందపూర్ణో ఽహం సర్వతో నివృత్తో స్మీతి భావః. బహ్వీనా మితి - ఇత స్తత ఆహృతానా ముత్తమస్త్రీణాం సర్వాసాం మమ మే యా అగ్రమహిషీ తస్యా శ్చ మమచ భవ ఈశ్వరీతి శేషః. పంచేతి - పంచసహస్రాణి దాస్యో మే మయాసార్థం పరిచరిష్యంతి యది తవేతి శేషః. తదా భార్యా—భయా=కాంత్యా, ఆర్యా= పూజ్యా భవసీతి సంబంధః. యద్వా భార్యా — భా చిద్రూపిణీ, ఆర్యా శ్రేష్ఠా భవసీతి సంబంధః. అంగుళ్యేతి - శ్రీరామం వినా లంకాం ప్రత్యాగంతు మనిచ్ఛంతీం ప్రత్యాహ అంగుళ్యా సమో న. యుద్ధే యస్యాం

1. వాల్మీకి రా. ౪౭ స.



## పండ్రెండవసర్గము.

౧ ఇట్లు శ్రీరామభార్య యగు సీతాదేవి పలుకఁగా మహాబలవంతుఁడును రాక్షసుల కెల్లరకుఁ బ్రభువు నగు రావణుఁడు తీవ్రముగా నిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

౨ సీతా! నేను రావణుఁ డనువాఁడను. రక్కసులందరికిఁ బ్రభువను. నాపట్టణము లంక యనునది సముద్రమధ్యమున నున్నది.

౩ * ఓ అనిందుతురాలా! బంగరుమేనిచాయ గలిగి, పట్టుచీరను ధరించి యున్న నిన్నుఁ జూచి, నేను నాభార్యలయం దిచ్ఛను బొంద కున్నాను.

---

* ఈశ్లోకముల కిదే యర్థము గాదు. పరమార్థ మింకొకటి కలదు. రావణునిమాట లన్నిఁటిలో నది యున్న దనియే యెఱుంగవలెను. కొంతవఱ కిట వివరింతును.

౩ త్వాం = నాయిష్టదేవత వగు నిన్ను, దృష్ట్వా = చూచి, స్వకేషు దారేషు = పుత్రమిత్రాది నాజనమందును భార్యలయందును, రతిమ్ = ఇచ్ఛను (వ్యామోహము ననుట), నాధిగచ్ఛామి=పొందకున్నాను. నా కిష్టదేవత వగు నిన్నుఁ జూచుటతోడనే యానందపూర్ణుఁడనై సర్వవిషయములయెడఁ గలుగు వాంఛలనుండి మరలుచున్నాను అని భావము.

౪-౫ ఇచ్చటచ్చటనుండి తీసికొని రాఁబడిన యుత్తమస్త్రీలందరికిని, మమ = నాకు (యా) అగ్రమహిషి = పెద్దభార్య గలదో (తస్యాశ్చ = ఆమెకును), భవ = ఈశ్వరివి కమ్ము! పంచసహస్రాణి దాస్యో మే = నాయైదువేలదాసీలును, నాతోఁ బాటు, పరిచర్య నీకుఁ జేయుదురేని, తదా = అప్పుడు, నీవు, భా + ఆర్యా భా = కాంతిచే, ఆర్యా = పూజ్యురాలవు, భవసి = అగుదువు. (అటుగాక) భా = చిద్రూపిణియు, ఆర్యా = శ్రేష్ఠురాలవును, అగుదువు అనియు నర్థము.

౬ శ్రీరామచంద్రుఁడు తోడురానిదే లంకకు రా నిచ్చగింపని సీతం జూచి యిట్లనియె — యుద్ధే = యుద్ధమున, యస్య = ఎవ్వని,

బహ్వీనా ముత్తమస్త్రీణా మాహృతానా మిత స్తతః
సర్వాసామేవ భద్రం తే మమాగ్రమహిషీ భవ. ౮

---

గుళ్యా సమః కోఽపి నాస్తి కుతః యస్స రామః శ్రీమన్నారాయణ ఏవ. మానుషః = మనుష్యరూపేణావతీర్ణః. తం మమ భాగ్యేన తత్రైవ సంప్రాప్తం తవపతి మితి శేషః. భజస్వేతి సంబంధః. యద్వా మాం భజస్వ. శ్రు॥ త్వం మా భజస్వ పద్మాక్షి! యేన సౌఖ్యం లభా మ్యహం - ఇత్యుక్తత్వాత్, స్మృ. యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజా మ్యహ మిత్యుక్తత్వాచ్చ భజశబ్దస్య అనుగ్రహ అర్థః. త్రిష్వితి. భర్తారం = శుశ్రూషాదినా స్వామినం బిభర్తీతి భర్తా భృత్య ఇత్యర్థః, పతిః రక్షసా మితి శేషః. యద్యహం రక్షసాం పతిః తథాపి తవ సదృశః = అనురూపః కిం. భృత్య ఇతి శేషః. అనురూపో భృత్యో నభవామి. తథాపి భృత్య మిచ్ఛసి యది త్రిషు లోకేషు విఖ్యాతం యథాతథా మా మాశ్రయ. భృత్యత్వే నాంగీకుర్వి త్యర్థః. రావణేనేతి - రావణేన = రుదితపుత్రసదృశేనేతి శేషః. ఏవ మంతరార్థేన ప్రార్థనారూపేణోక్తాపి అతితామసభక్తో రావణః శివశక్త్యాత్మికాం స్వాం విస్మృత్య శ్రీరామవియోగం సంపాదయతి. కేవలావిద్యోపాసనం అనర్థహేతు రితి బోధయంతీవ కుపితా జనకాత్మజా ప్రత్యువాచేతి సంబంధః. ఆసురసంపన్నస్య దైవసంపద్బహిర్భూతస్య ఇష్టదేవతా వైముఖ్యకారణాత్.



౮ నాచే నిచ్చటచ్చటనుండి తీసికొని రాఁబడిన యనేకు లగు నుత్తమ స్త్రీలందరికిని నీ వగ్రమహిషివి కమ్మ! నీకు క్షేమ మగుఁగాక!

---

అంగుళ్యా = వ్రేలితో, సమః = సమానుఁడు, కో ఽపి = ఎవ్వఁడు? లేఁడో. ఎందుచే నన, ఆ శ్రీరాముఁడు శ్రీమన్నారాయణుఁడే, మానుషః = మనుష్యరూపమున నవతరించినవాఁడు తం = ఆతనిని, మహాభాగ్యముచే నటకే (లంకకే యనుట) వచ్చినవానిని (నీపతి నను) బొందుము. లేక నన్ను, భజింపుము = అనుగ్రహింపుము. అనియుఁ జెప్పవచ్చును. "పద్మాక్షీ! ఎట్లు నేను సౌఖ్యముం బొందఁగల్గుదునో ఆవిధముగా నన్ను నీవు భజింపుము అనఁగా అనుగ్రహింపుము" అని శ్రుతి చెప్పఁబడుటచే "ఎవ్వ రెట్లు నన్నుఁ బొందుదురో వారివారి నట్లే నేను భజింతును (అనుగ్రహింతును)" అని గీతలయందు శ్రీకృష్ణభగవానులు చెప్పుటచేతను-'భజ' అను ధాతువున కనుగ్రహ మర్థము.

౬ భర్తారం = శుశ్రూషాదులు చేసి స్వామిని భజించువాఁడు భర్త అనఁగా నౌకరు. పతిః = రాజు (రాక్షసుల కని యర్థము). నేను రక్కసులకు రాజునైనను, తవ = నీకు, సదృశః = అనురూపుఁడ నగు, భర్తా = నౌకరు నగుదునా? (కా నను) అయినను నౌకరు గావలె నని కోరుదువేని, ముల్లోకములఁ బ్రసిద్ధి గలుగునట్లు, మా మాశ్రయ = నన్ను నౌకరుగా నంగీకరింపుము.

౭ రావణేన = ఏడ్పునెట్టుపుత్రునితో సమానుఁ డగువానిచే, ఏవమ్ = ఇట్లు-అంతరార్థముచేఁ బ్రార్థనారూపముగఁ బలుకఁబడినదయ్యు; కుపితా = కోపించినదై, అతితామసభక్తుఁ డగు రావణుఁడు, శివశక్తిస్వరూపిణి యగు తనను మఱచి, శ్రీరామవియోగమును జేకూర్పఁ జూచుచున్నాఁడు; 'కేవలము నవిద్య నుపాసించుట యనర్థహేతువు' అను విషయమును బోధించు నదియుంబోలె, జనకాత్మజా = జనకరాజపుత్రిక యగు సీత కోపించినదై; పల్కె నని సంబంధము. ఆసురసంపన్నుఁడై, దేవీసంపత్తికి దూరుఁడైనవానికి నిష్టదేవతలు విముఖు లగుదు రను కారణముచేతను గుపితురాలయ్యె నను టపాసఁగును.

పంచదాస్య స్సహస్రాణి సర్వాభరణభూషితాః
సీతే! పరిచరిష్యంతి భార్యా భవసి మే యది. ౫

1 అంగుళ్యా న సమో రామో మమ యుద్ధేన మానుషః
తవ భాగ్యేన సంప్రాప్తం భజస్వ వరవర్ణిని! ౬

2 త్రిషు లోకేషు విఖ్యాతం యది భర్తార మిచ్ఛసి
మా మాశ్రయ వరారోహే! త వాయం సదృశః పతిః. ౭

3 రావణ్నైవ ముక్తాతు కుపితా జనకాత్మజా
ప్రత్యువా చానవద్యాంగీ త మనాదృత్య రాక్షసం. ౮

మహాగిరి మి వాకంప్యం మహేంద్రసదృశం పతిం
మహోదధి మివాక్షోభ్య మహం రామ మనువ్రతా. ౯

సర్వలక్షణ సంపన్నం న్యగ్రోధపరిమండలం
మహాబాహుం మహోరస్కం సింహవిక్రాంతగామినం. ౧౦

పూర్ణచంద్రాననం రామం రాజవత్సం జితేంద్రియం
పృథుకీర్తిం మహాత్మాన మహం రామ మనువ్రతా. ౧౧

1 వాల్మీకి రా. ౪౮ స. 2 వాల్మీకి రా. ౪౯ స.
3 వాల్మీకి రా. ౪౭ స.



౫ సీతా! నీవు నాకు భార్య వగుదువేని సర్వాభరణభూషిత లగు నైదువేలమంది దాసీలు నీకుఁ బరిచర్య చేయఁగలరు.

౬ స్వచ్ఛమైన శరీరకాంతిగలదానా! మనుష్యమాత్రుఁ డగు రాముఁడు యుద్ధమున నా వ్రేలితోనైనఁ బోలఁడు. నీయదృష్టముచే నిట్లు వచ్చిన నన్నుఁ బొందుము.

౭ మూఁడులోకములయందును విఖ్యాతిని గన్న భర్త కావలె నని కోరదవేని న న్నాశ్రయింపుము. నీ కీతఁడే (నేనే యనుటకు గర్వోక్తి) సరిపడిన భర్త.

౮ రావణునిచే నిట్లు పలుకఁబడి కుపితురాలై సుందరగాత్రి యగు జనకరాజపుత్రి యారాక్షసుని లక్ష్యపెట్టక యిట్లు బదులు పల్కెను.

౯ మహాపర్వత మట్లు కంపింప శక్యముగానివాఁడును, మహేంద్ర పర్వతసమానధీరుఁడును, మహాసముద్రమట్లు కలఁత పెట్టరాని వాఁడు నగు నాభర్తను శ్రీరామచంద్రు నే ననువర్తించుదానను.

౧౦ సర్వవిధశుభలక్షణసంపన్నుఁడును, మఱ్ఱివృక్షమువలె విశాలపరిణాహము కలవాఁడును (మఱ్ఱిచెట్టువలె వివిధశాఖలుగా విస్తరించిన బంధుస్తోమము కలవాఁడు ననియు ననవచ్చును), సత్యసంధుఁడును మహానుభావుఁడు నగు రాము నే ననువర్తించుదానను.

౧౧ మహాబాహుని, విశాలవక్షుని, సింహమువలె గంభీరముగా నడచువాని, పూర్ణచంద్రునివంటి ముఖముగలవాని, జితేంద్రియుని, విశాలకీర్తివంతుని, మహారాజకుమారుని శ్రీరాము ననుసరించుదానను నేను.

త్వం పున ర్జంబుకః సింహీం మా మిచ్ఛసి సుదుర్లభాం
నాహం శక్యా త్వయా స్ప్రష్టు మాదిత్యస్య ప్రభా యథా. ౧౨

అక్షీ సూచ్యా ప్రమృజసి జిహ్వయా లేక్షి చ క్షురం
అవసజ్య శిలాం కంఠే సముద్రం తర్తు మిచ్ఛసి. ౧౩
అగ్నిం ప్రజ్వలితం దృష్ట్వా వస్త్రే ణాహర్తు మిచ్ఛసి
కల్యాణవృత్తాం రామస్య యో భార్యాం హర్తు మిచ్ఛసి. ౧౪

యదంతరం సింహసృగాలయో ర్వనే యదంతరం స్యంది
నికా సముద్రయోః, యదంతరం కాంచనసీసలోహయో
ర్యదంతరం చందనవారిపంకయోః. ౧౫
యదంతరం వాయసవైనతేయయో ర్యదంతరం మద్గుమ
యూరయోరపి, యదంతరం హస్తిబిడాలయో ర్వనే తదంత
రం దాశరథే స్తవైవ చ. ౧౬

1 * సీతాయావచనం శ్రుత్వా దశగ్రీవః ప్రతాపవాన్
హస్తే హస్తం సమాహత్య చకార సుమహ ద్వపుః. ౧౭

* సీతేతి — మహాపుణ్యస్య పరమభాగవతాగ్రగణ్యస్య శ్రీ
హనుమతోఽపి రూపాంతరస్వీకరణసమయే ఆగ్రహపూర్వ
కత్వస్య శ్రూయమాణత్వేన ఆగ్రహం వినా క్రూరరూప

1. వాల్మీకి రా. ౪౯ స.



౧౨ నీ వైతే మిగుల దుర్లభనైన నన్ను, నక్క యాఁడుసింగముం గోరు నట్లు కోరుచున్నాఁడవు. కాని సూర్యప్రభ యెట్లు తాఁక శక్యము కాదో, అట్లే నేను నీకుఁ దాఁకుటకైన శక్యము గాను.

౧౩-౧౪ మిక్కిలి శుభవర్తనముగల శ్రీరామచంద్రునిభార్య నగు నన్ను హరింపఁ గోరుచుంటివి. దీన నీకంటిని నీవు సూదిచేఁ గ్రుచ్చుకొను చున్నావు. చుఱకత్తెను నాలికచే నాకుచున్నావు. కుత్తుకకు రాతి బండఁ గట్టుకొని సముద్రమును దాఁటఁ గోరుచున్నావు. ప్రజ్వలించు నగ్నిం జూచి బట్టను మూటఁగట్టి తేఁ గోరుచున్నాఁడవు.

౧౫-౧౬ అడవిఁ గల సింగమునకు నక్కకు నెంత తేడా కలదో; పిల్లకా లువకును సముద్రమునకు నెంత వాసియున్నదో; బంగారమునకును సీసమునకు నెంత భేద మున్నదో; చందనమునకును, నీటిబురదకు నెంత యంతర మున్నదో; కాకికిని వైనతేయునకు నెంత దూర మున్నదో; మద్గువు (కారండ మను పక్షివిశేషము) నకును నెమ లికి నెంతవాసి యున్నదో; ఏనుఁగునకును బిల్లికి నెంత యంతర మున్నదో; అంత తేడా శ్రీరామునకును నీకును నడుమఁ గలదు. (ఇట నుపమానోపమేయములకుఁ గ్రమము వివక్షింపఁ బడఁలేదు. ఉత్తమజాత్యుపమానముల నెల్లఁ బ్రథమగణ్యుఁ డగు రామునకును, అథమోపమానముల నెల్ల రావణునకు నన్వయించుకొనఁ దగును.)

౧౭ సీతమాట విని ప్రతాపశాలి యగు రావణుఁడు కేలం గేలు గది యించి, మిగుల * పెద్దగ శరీరమును బెంచెను.

* మహాపుణ్యాత్ముఁడును, భాగవతాగ్రగణ్యుఁడును నగు శ్రీహనుమం తునకును ఉగ్రరూపమును స్వీకరింపవలసివచ్చినప్పు డాగ్రహము కలిగినట్లు వినఁబడియుండుటచేతను, ఆగ్రహము లేనిదే క్రూరస్వ రూపమును స్వీకరింప వలనుపడనందునను, రావణుఁడు దేవీసాన్ని ధ్యమునఁ గపటము కూడదని యెఱిఁగి దేవికిఁ దనరూపమును జూపఁ

సద్య స్సౌమ్యం పరిత్యజ్య భిక్షురూపం స రావణః
క్రోధేన మహతావిష్టో నీలజీమూతసన్నిభః.
సంరక్తనయన శ్శ్రీమాం స్తప్తకాంచనకుండలః ౧౮
దశాస్యః కార్ముకీ బాణీ బభూవ క్షణదాచరః. ౧౯

స మైథిలీం పున ర్వాక్యం బభాషే చ తతో భృశం. ౧౯½

నోన్మత్తయా శ్రుతౌ మన్యే మమ వీర్యపరాక్రమౌ. ౨౦

ఉద్వహేయం భుజాభ్యాంతు మేదినీ మంబరే స్థితః
అపిబేయం సముద్రంచ హన్యాం మృత్యుం రణే స్థితః. ౨౧

[1] యస్య దేవా స్సగంధర్వాః పిశాచపతగోరగాః
విద్రవంతి భయా ద్భీతా మృత్యోరివ సదా ప్రజాః. ౨౨
యస్య త త్పుష్పకంనామ విమానం కామగం శుభం
రావణోనామ భద్రం తే దశగ్రీవః ప్రతాపవాన్. ౨౩

యత్ర తిష్ఠా మ్యహం తత్ర మారుతో వాతి శంకితః
తీవ్రాంశు శ్శిశిరాంశుశ్చ భయా త్సంపద్యతే రవిః. ౨౪

---

స్వీకారారామోగా ద్రావణోపి దేవీనికటే కపట మనుచిత మితి మత్వా దేవ్యై స్వరూపం దర్శయితుం స్వసామర్థ్య ప్రశంసాపూర్వకం నిజరూపం స్వీకరోతి.

---

1. వాల్మీకి రా. ౪౮ స.



౧౮-౧౯ మఱియు నారక్కసుఁడు వెంటనే సౌమ్య మగు భిక్షురూపమును విడిచి, పెద్దకోపముచే నొడ లెఱుంగక, కాఱుమబ్బునుబోలి, ఎఱ్ఱగ్రుడ్లుకలవాఁడై, విచిత్రమాయాసంపదతోఁగూడినవాఁడై, పుటము బెట్టిన బంగారముచేఁ దయారైన కుండలముల ధరించి యప్పుడే ధనుర్బాణధరుఁడై యెదుటఁ జూపట్టెను.

౧౯½ మఱియు నారాత్రించరుఁడు తొలుతటికంటె నెక్కుడుగా నిట్లు పలికెను.

౨౦ నీమతిభ్రమించి పోయి, నాచెప్పిన నావీర్యపరాక్రమవిషయములు నీకు వినఁబడ లే దనుకొందును.

౨౧ ఆకసమున నిల్చి నాబాహులచేఁ బుడమిని బైకెత్తివేయఁగలను. సముద్రమును డ్రాగివేయఁగలను. యుద్ధమున నిలువఁబడితినా? మృత్యువునేని చంపఁగలుగుదును.

౨౨-౨౩ మృత్యుదేవతం జూచి భీతులగు ప్రజలట్లు, ఎవ్వనివలనిభయమున దేవతలు, గంధర్వులు, పిశాచులు, పతగులు, ఉరగులు పారిపోవుచుందురో; ఎవ్వనికిఁ దలఁచినట్లెల్ల నడచు పుష్పక మను విమానము కలదో; అట్టిరావణుఁడను నేను. నీకు క్షేమ మగుఁగాక! పది మోములుగల మహాప్రతాపశాలిని.

౨౪ నే నెచట నుందునో అచట వాయువు శంకించుచు నే వీచుచుండును. తీక్ష్ణకిరణములు గల సూర్యుఁడుగూడ నాభయముచేఁ జల్లనికిరణముల నే పొంది వర్తించును.

---

గోరి క్రోధము పొంది, తనసామర్థ్యమును బ్రశంసించుకొనుచు నిజరూపమును స్వీకరించెను అని యెఱుంగునది.

ఇత్యుక్త్వా మైథిలీం వాక్యం ప్రియార్హాం ప్రియవాదినీం
[1]సమీప మాగత స్సోఽపి మూర్ఛాం ప్రా ప్యాపత ద్భువి. ౨౫

అభిగమ్య సుదుష్టాత్మా రాక్షసః కామమోహితః
తతో విదార్య ధరణీం నఖై రుద్ధృత్య బాహుభిః. ౨౬
2 * జగ్రాహ రావణ స్సీతాం బుధః ఖే రోహిణీమివ. ౨౬½

* జగ్రాహేతి—రావణః అన్యత్ర సుదుష్టాత్మా కామమోహితశ్చ యద్యపి అత్ర నతథా. అతఏవ బుధః ఖే రోహిణీ మివేతి. బుధః స్వమాతరం యథా పూజార్థం గృహ్ణాతి తథా రావణోఽపి సీతాం జగ్రాహ, స్వగృహే సంస్థాప్య స్వేష్టదేవతాబుద్ధ్యా పూజయితు మేవేత్యర్థః. నను అత్ర నలకూబరవేదవతీబ్రహ్మరంభోమానందీశ్వరాదిశాపాద్బలా త్కథం పరదారస్పర్శ ఇతిచేత్ సత్యం. రావణ స్సీతాం సాక్షా న్నజగ్రాహ, న స్పృష్టవాన్. పరంతు జానుకేశాదిచ్ఛాయామేవ జగ్రాహ; రాక్షసానాం ఛాయాగ్రాహిత్వాత్. తదుక్తం స్కాందే శ్లో॥ ఛాయాగ్రాహిత్వ మప్యస్తి సర్వవిద్యావిశారదే!, కేశచ్ఛాయాం పరామృశ్య జానుచ్ఛాయాం తథైవచ. గృహీత్వా జానకీం హృష్టో లంకాం ప్రాయా త్స రావణః, సీతాపహరణంచైవ యే శృణ్వంతి నరోత్తమాః. న తేషా మశుభం దేవి! భవిష్యతి కదాచ నేతి— అతఏవ ఛాయాగ్రహణార్థం నఖైః ధరణీం

1. శివ రా. ఆనంద రా. అధ్యాత్మ రా. ౭ స. 2. వాల్మీకి రా. ౪౯ స



౨౫ ఇట్లు రావణుఁడు ప్రియమాడఁదగినదియుఁ, బ్రియముగా మాట్లాడునదియు నగు నాసీతతోఁ బలికి, తోడనే యామెను సమీపింపఁబోయెను. ఆమె మూర్ఛనొంది పుడమిపైఁ బడిపోయెను.

౨౬-౨౬½ మిగులదురాత్ముఁ డగు నారక్కసుఁడు, కామమోహితుఁడై దరికి వచ్చి, భూమిని గోళ్ళచేఁ జీల్చి, బాహువులచేఁ బెల్లగించి, * సీతను; ఆకసమున బుధుఁడు రోహిణినక్షత్రమును గ్రహించినట్లు గ్రహించెను.

* రావణుఁడు మఱొకచో మిగుల దురాత్ముఁడును, కామమోహితుఁడునైనను; ఇచట మాత్ర మట్లు గాదు. అందుచేతనే 'బుధుఁడు మింటను రోహిణీనక్షత్రమును గ్రహించినట్లు' అనఁగా బుధుఁడు తనతల్లి యగు రోహిణిని బూజించుటకొఱ కెట్లు గ్రహించునో అట్లు; రావణుఁడును సీతను గ్రహించెను. తనయింటనుంచి తన యిష్టదేవత యను బుద్ధిచేఁ బూజించుటకే గ్రహించె నని యర్థము స్పష్టపడుచున్నది.

ఇచట నలకూబరుఁడు, వేదవతి, బ్రహ్మ రంభ, ఉమ, నంది, ఈశ్వరుఁడు మొదలగువారి శాపములఁ బట్టి (యాలోచింపఁగా) "రావణుఁడు బలాత్కారముగఁ బరదారాస్పర్శము నెట్లు గావించెను?" అన్నచో; నిజమే (కాని) రావణుఁడు సాక్షాత్తుగా సీతను గ్రహింపలేదు. తాఁకలేదు. ఇఁక జానువులయుఁ గేశములయు నీడనే గ్రహించెను. 'రక్కసులు ఛాయను గూడ గ్రహించువా రగుటవలన' స్కాందమున నదియే చెప్పఁబడెను. "దేవీ! సర్వవిద్యావిశారదురాలా! నీడను గ్రహించుటయుఁ గలదు. కేశములయు జానువులయు నీడను గ్రహించి, జానకిని సంతోషముతో రావణుఁడు లంకకుఁ గొంపోయెను. సీతాపహరణవృత్తాంత మెవరు విందురో వారల కశుభ మెన్నటికిని గలుగదు." ఇందుచేతనే, ఛాయను గ్రహించుటకొఱకే గోళ్ళచే భూమిని జీల్చె నాఁ డని యధ్యాత్మరామాయణమునను బ్రతిపాదింపఁబడెను.

వామేన సీతాం పద్మాక్షీం మూర్ధజేషు కరేణ సః.
ఊర్వోస్తు దక్షిణేనైవ పరిజగ్రాహ పాణినా. ౨౭
౨౭౪

విదార్య గృహీతవా నితి అధ్యాత్మరామాయణే ప్రతిపాదితం. కస్మింశ్చిత్సమయే రావణః నలకూబరంప్రతి గచ్ఛంతీం రంభాంవిలోక్య మదనపరాధీన స్సన్ తాం బలాత్కారేణ ధర్షితవా నభూత్. తతః పరం నలకూబరో రంభయా నివేదిత స్సన్ రావణ ముద్దిశ్య శాప ముత్ససర్జ. వాల్మీ. ఉ. కాం. ౨౬ సర్గే. శ్లో॥ యద్య ప్యకామాం దుష్టాత్మా ధర్షయిష్యతి యోషితం। మూర్ధా నహస్రధా తస్య శకలీ ఫలితా తదా ఇతి. పున శ్చైకస్మింశ్చ సమయే పితామహసదనం గచ్ఛంతీం పుంజికస్థలాం వివస్త్రవపుషాం కృత్వా రావణః ప్రేషయామాస. తత్సర్వం పితామహోఽపి శ్రుత్వా శాప మేవంవిధం దత్తవాన్- ఉ. కా. ౧౩ స. శ్లో॥ అద్యప్రభృతి యాం మన్యాం బలాత్కారం కరిష్యసి, తదా తే శతధా మూర్ధా ఫలిష్యతి నసంశయ ఇతి. అత్ర నలకూబరశాపస్యైవ ప్రాథమికత్వ మంగీకర్తుం న్యాయ్యం. తత్ర నలకూబరశాపస్య అకామస్త్రీధర్షణవిషయధర్షణమాత్రపరత్వాం. బ్రహ్మశాపస్య అన్యస్త్రీ ధర్షణవిషయపరత్వా త్తదానంతర్యం. ఉమాశాపస్తు కైలాసచలనవేళాయాం రావణ! తే స్త్రీనిమిత్తం వధ ఇతి జ్ఞేయ మిత్యుక్తః. తథైవ నందీశాపః. రంభావరుణశాపావపి స్త్రీస్పర్శననిమిత్తవధరూపౌ. వేదవత్యేవ సీతా.



౨౭-౨౭౪ పద్మపత్రములవలె విశాలము లగు నేత్రములు గల జానకి శిరోజముల నెడమచేతను, తొడలను కుడిచేతను గ్రహించెను.

ఒకానొకసమయమున రావణుఁడు నలకూబరునికడ కేగుచున్న రంభను జూచి, మదనవశుఁడై యామెను బలాత్కరించి భయపెట్టెను. అటుపై నలకూబరుఁ డావృత్తాంతమును రంభవలన విని రావణు నుద్దేశించి, వాల్మీ. రా. ఉ. కాం. ౨౬ సర్గమున "తన యం దిష్టపడని కాంతను దురాత్ముఁ డగు నెవ్వఁడు భయపెట్టునో వానితల వేయిచెక్క లగుఁగాక!" అని శాప మిచ్చెను.

మఱొకసమయమున, బ్రహ్మలోకమున కరుగుచున్న పుంజికస్థలను రావణుఁడు మైవలువఁ దొలఁగంజేసి పంపెను. అది బ్రహ్మగారు విని ఉత్తర కాండము ౧౩ సర్గమున "ఇది మొదలు పరస్త్రీని బలాత్కారము చేయఁదలఁతువేని యప్పుడే నీతల నూరువ్రక్క లగును. సంశయములేదు." అని శాపం బిచ్చె నని కలదు.

ఇందు నలకూబరుశాపము మొదటి దని యంగీకరించుట న్యాయ్యము. అందు నలకూబరుశాపము కోరికలేని స్త్రీని ధర్షించు విషయములో భయపెట్టుటమాత్రమే ప్రధానమైనది. బ్రహ్మశాపమునఁ బరస్త్రీయైనఁ జాలు (నామె యిష్టపడునదియైనని, యిష్టపడనిదేని యగుం గాక యావిచక్షణ మవసరము లేకయే) భయపెట్టినంతనే యీ ఫలితమును బొందెద వనుటవలన (ఈ శాపము దానికి సవరణరూపముగా నున్నదగుటచే నలకూబరునిశాపమే మొదటిది, యిది రెండవది యని భావము).

ఉమాశాప మన్ననో; కైలాసము నూఁచువేళ "రావణా! నీకు స్త్రీనిమిత్తముగాఁ జావు కలుగు నని యెఱుంగు" మనునది. నందీశ్వరుశాపముకూడ యిట్టిదే. రంభావరుణులశాపములు స్త్రీస్పర్శచే జావు కలుగునని చెప్పఁబడినవి. ఇఁక వేదవతీదేవి సీతయే.

తం దృష్ట్వా మృత్యుసంకాశం తీక్ష్ణదంష్ట్రం మహాభుజమ్. ౨౮
ప్రాద్రవన్ గిరిసంకాశం భయార్తా వనదేవతాః. ౨౮½
సచ మాయామయో దివ్యః ఖరయుక్తః ఖరస్వనః. ౨౯
ప్రత్యదృశ్యత హేమాంగో రావణస్య మహారథః. ౨౯½
[1] తోలయిత్వా రథేక్షిప్త్వా సీతాం క్షిప్రం విహాయసా. ౩౦
[2] చైత్రమాసే కృష్ణపక్షే త్వష్టమ్యాం రాక్షసేశ్వరః
* భిక్షురూపేణ చాగత్య గృహీత్వా జానకీం యయౌ. ౩౧

---

* భిక్షురూపేణేతి - నను కామరూపీ ఖలు రావణః అనేకరూపేషు సత్సు కిమర్థం భిక్షురూపేణ సీతాహరణం కృతవానితిచేదుచ్యతే. తథామహావిష్ణోరపి బృందాదేవ్యా శప్తత్వాత్. రావణస్య తదేవారోచత, బుద్ధిః కర్మానుసారిణీ త్యుక్తత్వాత్. బృందాశాపస్త్వేవం పాద్మే ఉత్తరఖండే షోడశాధ్యాయే ప్రతిపాదితః. బృందోవాచ-శ్లో॥ ఈశ్వరోఽపి కృతం భుంక్తే కర్మేత్యాహుర్మనీషిణః, అహం మోహం యథా నీతా త్వయా మాయా తపస్వినా, తథా తవ వధూం మాయా తపస్వీ కోఽపి నేష్యతీతి. తథైవ స్కాందే వైష్ణవఖండే కార్తీకమాత్మ్యే ౨౧ అధ్యాయే, ఆనందరామాయణే సారకాం. ౮ సర్గేఽపి, పునశ్చ శివపురాణపర్యాలోచనయా ఏవమేవ నిశ్చీయతే. తద్వివరణ

---

1 అధ్యాత్మ రా. ౭ సర్గ. 2 వాసిష్ఠరామాయణే.



౨౮-౨౮½ తీక్ష్ణములైన కోరలు, పెద్దభుజములును గలిగి పెద్దపర్వతమువలె, మృత్యుదేవతయో యన్నట్లున్న యారావణునిం గాంచి వనాధిష్ఠానదేవతలు భయపీడితులై పారిపోయిరి.

౨౯-౨౯½ అంతలోఁ గంచరగాడిదలు బూన్చినదియుఁ, గర్ణకఠోరధ్వని గలదియు, స్వర్ణాలంకృతమును, దివ్యమును, మాయామయము నగు నారావణునిరథము గన్పట్టెను.

౩౦-౩౧ * భిక్షురూపధారియై వచ్చిన రాక్షసరాజు రావణుఁడు సీతాదేవిని (పడియున్న భూమిని బెల్లగించి) రథముపై నుంచి, వేవేగ నాకసము వెంట, చైత్రమాసమునఁ గృష్ణపక్షమున నష్టమితిథియందు లంకకుం గొంపోయెను.

---

* రావణుఁడు కామరూపికదా! ఎన్నో రూపము లుండఁగా భిక్షురూపముచేతనే సీతాపహరణము నేల కావించెను? అనుచోఁ జెప్పఁబడుచున్నది. మహావిష్ణువు తొల్లి బృందాదేవిచే నట్లు (అనఁగా 'విష్ణూ! నీభార్య భిక్షురూపధారిచే హరింపఁబడుఁగాక' అని) శపింపఁబడుటవలన రావణున కారూపమే స్వీకరింప నిచ్ఛ పొడమెను. "బుద్ధి కర్మల ననుసరించునది" యనుట యిందులకు హేతువు. బృంద యిచ్చిన శాప వృత్తాంతము పాద్మమున నుత్తరఖండమునఁ బదునాఱవయధ్యాయమున నిట్లు ప్రతిపాదింపఁబడెను. బృంద యిట్లనియె—"ఈశ్వరుఁడైనను జేసికొన్న కర్మము ననుభవించి తీరు నని బుద్ధిమంతులు పల్కుదురు. నే నీమాయాతపస్వివగు నీచే నెట్లు మోసఁగింపఁబడితినో; అట్లే నీభార్యను మాయాభిక్షు వొకఁడు గొంపోఁగలఁడు." అట్లే స్కాందపురాణమునందు వైష్ణవఖండమునఁ గార్తికమాహాత్మ్యమున ౨౧ అధ్యాయమునను, ఆనందరామాయణమున సారకాండమున ౮ సర్గమునను గలదు. మఱియు శివపురాణమును బర్యాలోచించుటచే నిట్లే నిశ్చయింపఁబడుచున్నది. ఒకానొకప్పుడు జలంధరుఁ డనువాఁడు కామాంధుఁడై

ఏతస్మిన్నంతరే సీతా ప్రతిబుధ్య విలోక్య చ
తత స్సా రాక్షసేంద్రేణ హ్రియమాణా విహాయసా. ౩౨

మ తోఽద్రిదాహ్రియతే - కదాచి చ్ఛివరూపేణ జలంధరః
కామాంధః పార్వతీనికట మాగతవాన్. తం జ్ఞాత్వా పా
ర్వతీ తంచ శప్త్వా బృందాయాః పాతివ్రత్యప్రభావేన దు
స్సాధ్యం జలంధరం సాధయితుం బృందాపాతివ్రత్యభంగ
కరణార్థం విష్ణు మయాచత ఇతి. తతో విష్ణుః భిక్షురూపం
స్వీకృత్య జయవిజయౌ రక్షోరూపధారిణౌ, తథా, కీశరూప
ధారిణౌ ఇంద్రసూర్యౌచ స్వానుచరౌ కృత్వా, జలంధ
రోపవన మయాసీత్. బృందాచ జలంధరమహిషీ పుష్పా
పచయార్థం త త్రాజగామ. తాం తదా రక్షోరూపౌ
జయవిజయౌ భీషయాం చక్రతుః భీతా సాభిక్షుం శరణ
మియాయ. తత్రైవ తాం జలంధరపత్నీ మనవగతవా నివా
భినయన్ విష్ణుః హుంకారేణ తౌ రాక్షసౌ నిరస్య కైలా
సే యుద్ధ్యంతం జలంధర మవేదయత్. సందిహానాయాంచ
తస్యాం కీశాభ్యాం మాయికం జలంధరశవ మానయా
మాస. తతో ఽతిమాత్రం ఖిన్నా బృందా పతి ముజ్జీ
వయే త్యయాచత. తథే త్యంగీకృత్య ప్రభు రయం నేత్రే
నిమీలయేతి తా మావిశ్య స్వానుచరాన్ సంజ్ఞయా ప్ర
ద్రావ్య మృతశరీరే స్వయమేవ ప్రవివేశ. తుష్టయా త
యా సప్రేమ గృహం నీతో మిథ్యాజలంధర స్తత్రైవ
సుఖ మువాస. ఏతద్ద్వారేణ పాతివ్రత్యభంగేన శివస్య



౩౨ ఈలోఁగా సీత మూర్ఛదేరి, రాక్షసరా జగు రావణునిచే నాకస
ముపెంటఁ దాను హరింపఁబడుటను గనుఁగొనెను.

పార్వతీసామీప్యమునకు వచ్చెను. వాని నెఱింగి పార్వతి జలంధరుని
భార్య యగు బృందాదేవియొక్క పాతివ్రత్యమహిమచే నసాధ్యుఁడై
యున్న జలంధరునికి శాప మిచ్చి సాధింప నెంచెను. అందులకు
బృందాదేవి పాతివ్రత్యమునకు భంగము గలిగింపు మని శ్రీమహా
విష్ణువును బార్వతి యాచించెను. అటుపై విష్ణువు భిక్షురూపముం
దాల్చిన యింద్రసూర్యులను దనసేవకులుగాఁ జేసికొని, జలంధరు
నుపవనమునకు వచ్చెను. జలంధరుని భార్య బృంద కుసుమాపచయ
మొనరింప నటకు వచ్చెను. అపు డామెను రాక్షసరూపములం
దాల్చిన జయవిజయులు భయపెట్టిరి. ఆమె భయపడి యచటఁ
గన్పట్టు భిక్షువును శరణొందెను. అపు డేమియు నెఱుఁగనివాని
వలె నభినయించుచు విష్ణుఁడు హుంకార మొనరించి యారాక్షసు
లను జెదరఁగొట్టి, యాజలంధరుఁడు కైలాసమున యుద్ధముచేయు
చున్నాఁ డని జలంధరభార్య యగు నాబృంద కెఱింగించెను. ఆమె
యు నగునా కాదా యని సందేహపడుచుండఁగనే కోతిచే జలంధ
రునిమాయాదేహముం దెప్పించెను. అపుడు మిగులదుఃఖితురాలై
బృంద, నాభర్తను బ్రతికింపు మని భిక్షువును వేడుకొనెను. సరియే
యని యంగీకరించి, సర్వ (శక్తి) సమృద్ధుం డగు విష్ణువు బృందా!
కండ్లు మూసికొనుము! అని యానతిచ్చి, తనసేవకులను సైఁగచేసి
దూరముగాఁ బారిపోఁజేసి, యామృతశరీరమునఁ దానే ప్రవేశిం
చెను. అపుడు సంతుష్టయై బృందాదేవి ప్రేమతో నింటికిఁ గొం
పోఁగా నీమిథ్యాజలంధరుఁ డచటనే సుఖముగ నుండెను. ఈవిధ
ముగా బృందాదేవి పాతివ్రత్యమునకు భంగము కలుగుటచే నీశ్వరుఁ
డు సులభముగా జలంధరుం బరిమార్పఁ గలిగెను. ఈనడుమ నిజము
గాఁ జచ్చిపోయిన జలంధరునిశిరముగూడ వారియెదుటఁ బడెను.
ఇట్లిద్దరు జలంధరులు గన్పట్టుటచే మనమున క్షోభించి బృంద

* భృశం చుక్రోశ మత్తేవ భ్రాంతచిత్తా యథాతురా

సువధ్యో ఽభూ జ్జలంధరః. ఏతస్మి న్నంతరే యథార్థతో మృతస్య జలంధరస్య శిరో ఽపి తయో స్సమక్ష మేవాత్ర పపాత. జలంధరద్వయదర్శనేన క్షుభితహృదయా బృందా యదా గాఢం జ్ఞాతవతీ తదా సర్వమపి విష్ణో ర్మాయేతి నిశ్చికాయ తత ఏవం పూర్వోక్తం స్పష్టం. విశేషేణ హేవిష్ణో! జయవిజయౌ రాక్షసౌ భవేతాం ఇంద్రసూర్యౌచ వానరౌ. తాభ్యాం తవ శాత్రవం మైత్రీ భవిష్య తీత్యాదినా. అన్యచ్చ శంఖచూడనామకరాక్షసభార్యా తులసీ. సాపి బృందావత్ విష్ణునా ధర్షితా. సాచ పాషాణో భవేతి విష్ణుమశపత్. శివ స్తత్రాగత్య 'తులసి! త్వం గండకీ భవ మహావిష్ణు రత్ర సాలగ్రామో భవతీతి నిర్ణీతవా నితి కేవలశివపురాణే ప్రదృశ్యతే.

*భృశమితి-సీతయా సద్యోమరణపర్యవసాయి శాపాదానంతు సమూలనాశనస్య వేదవత్యంశేన ప్రతిజ్ఞాతస్య ఋషీణాం దేవతానా మగ్రే రామప్రతిజ్ఞాతస్య చ నిర్వాహాయేతి జ్ఞాతవ్యం. సీతయా దైన్యవ త్ప్రతీయమానాని వాక్యాని సర్వాణి సీతయా లౌకికరీతి మనుసృ త్యోక్తానీతి ద్రష్టవ్యాని. తచ్ఛాయాయా అపి రావణస్య మనుష్యభావనార్థం తదుక్తం మత్తేవ భ్రాంతచిత్తా యథాతురా ఇత్యాదినా మత్తేవ భ్రాంతచిత్తా యథా ఉన్మత్తచిత్తేవ. ఆతురా అప్రకృతిస్థా భృశ మత్యంతం చుక్రోశ. అత్రైవ యథాభ్యాం సర్వచేష్టానాం నాట్యత్వం సూచిత మితి.



33-334 *ఆమెయు భ్రమించిపోయిన చిత్తముకల దానివలె, మత్తుగొన్న

యొప్పు డది యెల్ల గాఢముగా విమర్శింపఁ గలిగెనో, అప్పుడే యదియెల్ల విష్ణుమాయ యని గ్రహించినపిమ్మటఁ దొలుతఁ జెప్పిన శాపమును విష్ణున కిచ్చెను (ఇదివరకు శాపము స్పష్టమే). మఱి యొకవిశేష మేమన "ఓవిష్ణుఁడా! జయవిజయులు రక్కసు లయ్యెదరు. ఇంద్రసూర్యులు వానరు లయ్యెదరు. అందీ మొదటి వారితో నీకు వైరము, రెండవవారితో మైత్రియు గలుగు" ననుటాదిగ; (విశేష మనుట). మఱియొకటి— శంఖచూడుఁ డను రాక్షసునిభార్య తులసి. ఆమెయు బృందవలెనే విష్ణువుచే భయపెట్టఁబడినది. ఆమెయుఁ బాషాణమవు కమ్మని విష్ణుని శపించెను శివుఁడట కరుదెంచి 'తులసీ! నీవు గండకీనదివి కమ్ము, మహావిష్ణు విందు 'సాలగ్రామ' మగు నని నిర్ణయించెను' అని కేవలశివపురాణము నందే కన్పట్టుచున్నది.

* సీత రావణు నప్పుడే మరణింపు మని శపింపకపోవుట యేల? అన మున్ను సమూలముగా రావణుఁడు నశించుటకు వేదవతీరూపమునఁ జేసిన ప్రతిజ్ఞను ఋషులయు దేవతలయు నెదుట రాముఁడు చేసిన ప్రతిజ్ఞను గొనసాగించుటకే యని యెఱుఁగునది. సీత దైన్యము దోఁచున ట్లాడినమాటలెల్ల లోకరీతి ననుసరించి పల్కఁబడినవియే యగును. ఆఛాయను రావణుఁడును మనుష్యమాత్రమునుగా భావించుటకై యం దిట్లు చెప్పఁబడెను. 'మత్తేవ' అనునది మొదలుగ మత్తురాలట్లు, భ్రమించిన చిత్తముకలదానివలె (పిచ్చిదానివలె ననుట), ఆతురయట్లు (ప్రకృతియందు లేనిదానివలె) మిగుల నేడ్చెను. ఇట వలె, పోలె ఇత్యాదిసాదృశ్యవాచకములమూలమున నీమె చేష్టలు కేవలము నటనప్రాయము లని సూచింపఁబడుచున్నది.

హా లక్ష్మణ! మహాబాహో! గురుచిత్తప్రసాదక! ౩౩
హ్రియమాణాం న జానీషే రక్షసా మా మమర్షణా. ౩౩½

జీవితం సుఖ మర్థాంశ్చ ధర్మహేతోః పరిత్యజన్ ౩౪
హ్రియమాణా మధర్మేణ మాం రాఘవ న పశ్యసి! ౩౪½

ఆమన్త్రయే జనస్థానే కర్ణికారాన్ సుపుష్పితాన్. ౩౫
క్షిప్రం రామాయ శంసధ్వం సీతాం హరతి రావణః. ౩౫½

* మాల్యవంతం శిఖరిణం వందే ప్రస్రవణం గిరిం. ౩౬
హంసకారండవాకీర్ణాం వందే గోదావరీం నదీం. ౩౬½

యాని కానిచిద ప్యత్ర సత్వాని నివసం త్యుత. ౩౭
దైవతానిచ యా న్యస్మిన్ వనే వివిధపాదపే
నమస్కరో మ్యహం తేభ్యో భర్తు శ్శంసత మాం హృతాం.
౩౮

* మాల్యవంతం పుష్పవంతం, శిఖరిణం శృంగవంతం ప్రస్రవణాఖ్యం గిరిం. ద్వౌ మాల్యవంతప్రసవణౌ. ఏకో దండకారణ్యే, అన్య త్కిష్కింధాసమీపే. వక్ష్యతి వర్షావర్ణనే అపరో మేరుపార్శ్వేఽస్తి అన్యో మాల్యవా న్నామక పర్వతః; ఆహత్య త్రిస్ర ఇతి పర్యవస్యతి.



దానివలె మిగుల నేడ్చెను. హా లక్ష్మణా! మహాబాహూ! పెద్దల చిత్తముఁ బ్రసన్నము చేయువాఁడా! దుస్సహుఁడైన రక్కసునిచేఁ గొంపోఁబడెడుదానను గా న న్నెఱుంగవు.

౩౪-౩౪½ జీవితమును, సుఖమును, అర్థమును ధర్మముకొఱకై త్యజించువాఁడవు నీవు, అధర్మముచేఁ గొంపోఁబడుచుండు నన్నుఁ జూడకున్నావు.

౩౫-౩౫½ చక్కఁగాఁ బుష్పించి జనస్థానమం దున్న ఓకొండగోఁగువృక్షములారా! మీకడ సెలవుగొనుచున్నాను. వేగమే రామునికెఱింగింపుఁడు, "సీతను రావణుఁడు హరించెను" అని—

౩౬-౩౬½ *పువ్వులతో రాజిలుచు, శిఖరములతో నలరారు ప్రస్రవణపర్వతమునకు మ్రొక్కుచున్నాను. హంసలు బెగ్గురులు మొదలగు జలపక్షివిశేషములతో నిండిన గోదావరీనదికిదే నమస్కరించుచున్నదానను.

౩౭-౩౮ ఇచ్చటెంకను నేయేజంతువులు నివసించుచున్నవో, నానావిధవృక్షసంతానము గల యీయడవిలో నేదైవతము లున్నవో వానిక న్నిఁటికిని నమస్కరించుచున్నాను. రావణునిచే హరింపఁబడిన నావార్తను నాభర్త కెఱింగించునుగాక!

మాల్యవంతమనఁగాఁ బుష్పములుకలది. శిఖరములుగలది శృంగవంతము, ప్రస్రవణము. ఇందు మాల్యవంతము దండకారణ్యముననుఁ, రెండవది (ప్రస్రవణము) కిష్కింధాసమీపముననుఁ గలవు. వర్షకాలవర్ణనమున మేరుపర్వతముప్రక్క మాల్యవంత మను పేరుగలది యున్నదని ముందుఁ జెప్పఁబడును. మొత్తము మూఁడు పర్వతములు.

1 శ్రుత్వా తత్క్రందితం దీనం సీతాయాః పక్షిసత్తమః
జటాయు రుత్థిత శ్శీఘ్రం నగాగ్రా త్తీక్ష్ణతుండకః. ౩౯

తిష్ఠ తిష్ఠేతి తం ప్రాహ క్వ గచ్ఛతి మ మాగ్రతః
ముషిత్వా లోకనాథస్య భార్యాం శూన్యా ద్వనాలయాత్
శునకో మంత్రపూతం త్వం పురోడాశమి వాఽధ్వరే. ౪౦½

2 సర్ప మాశీవిషం బధ్వా వస్త్రాంతే నావబుధ్యసే. ౪౧

షష్టి ర్వర్ష సహస్రాణి మమ జాతస్య రావణ!
వృద్ధో ఽహం త్వం యువా ధన్వీ సశరః కవచీ రథీ. ౪౨
తథా ప్యాదాయ వైదేహీం కుశలీ న గమిష్యసి. ౪౨½

3 బద్ధ స్త్వం కాలపాశేన క్వగత స్తస్య మోక్ష్యసే.  ౪౩
వధాయ బడిశం గృహ్య సామిషం జలజో యథా. ౪౩½

యుధ్యస్వ యది శూరో ఽసి ముహూర్తం తిష్ఠ రావణ!
శయిష్యసే హతో భూమౌ యథా భ్రాతా ఖర స్తథా. ౪౪½

4 ఇత్యుక్త్వా తీక్ష్ణతుండేన చూర్ణయామాస తద్రథం. ౪౫
వాహా న్బిభేద పాదాభ్యాం చూర్ణయామాస తద్ధనుః. ౪౫½

5 తతః క్రోధా ద్దశగ్రీవ స్సీతా ముత్సృజ్య రావణః. ౪౬
తలే నాభిజఘా నాశు జటాయుం క్రోధమూర్ఛితః. ౪౬½

---

1. అధ్యాత్మ రా. ౭ స. 2. వాల్మీకి రా. ౫౦ స. 3. వాల్మీకి రా. ౨౧ స. 4. అధ్యాత్మ రా. ౭ స. 5. వాల్మీకి రా. ౫౧ స.



౩౯ సీతయొక్క యాదీన మగు నాక్రందనము విని, పక్షిశ్రేష్ఠుఁడును, బదునైన ముక్కుకలవాఁడు నగు జటాయువు వేగముగా నా పర్వతశిఖరమునుండి యెగిరెను.

౪౦-౪౦½ (అతఁడు) ఆగు మాగుము! నాయెదుటనే లోకనాథుఁ డగు శ్రీరామచంద్రునిభార్యను, యజ్ఞమునందలి పురోడాశమును కుక్క హరించునట్లు; విజన మగు నీజనస్థానమునుండి దొంగిలించుకొని పోవుచున్నాఁడ వెవ్వఁడవురా, నీవు?

౪౧ ఆశీవిషసర్పమును గొంగున ముడివెట్టికొనుచు గుర్తెఱుంగ కున్నావు.

౪౨-౪౨½ రావణా! నాకుఁ బుట్టువుండొట్టి నేటి కరువదివేలేండ్లవయసు చెల్లినది. వృద్ధుఁడను. నీవు యువకుఁడవు. అదిగాక ధనుర్ధరుఁడవు. బాణములఁ జేకొంటివి. కవచ మున్నది. రథ మెక్కితివి. అయినను సీతను గొని క్షేమముగాఁ బోఁజాలవు.

౪౩-౪౩½ కాలపాశముచేఁ గట్టఁబడియున్నావు. మాంసము గట్టిన గాలమును జావుకొఱకుఁ గఱచుకొన్న చేపవలె నెక్కడకుఁ బోయి దానినుండి నీవు విడివడఁగలవు?

౪౪-౪౪½ నీవు శూరుఁడవే యగుదువేని యుద్ధము చేయుము. ఒక్క ముహూర్తకాల మాగుము. నీతమ్ముఁ డగు ఖరునట్ల చచ్చి భూమిం గూలెదవు.

౪౫-౪౫½ అని పలికి జటాయువు తీక్ష్ణ మగు తుండముచే వానిరథమును గుండపిండి చేసెను. రథవాహములఁ దెగఁగొట్టెను. వానివింటిని బొడి చేసెను.

౪౬-౪౬½ అటుపై రావణుఁడు కోపముచే నొడలెఱుంగక సీత నట వదలి వచ్చి, జటాయువును హస్తతలముచేఁ గొట్టెను.

జటాయు స్త మభిక్రమ్య తుండే నాస్య ఖగాధిపః.
వామబాహూ ర్దశ తదా వ్యపాహర దరిందమః ౪౭
కేశాం శ్చోత్పాటయామాస నఖపక్షముఖాయుధః. ౪౮

సంచ్ఛిన్నబాహో స్స ద్యైవ బాహవ స్సహసా ఽభవ౯
విషజ్వాలావళీయుక్తాః వల్మీకాదివ పన్నగాః. ౪౯
తతో ముహూర్తం సంగ్రామో బభూ వాతులవీర్యయోః.
౪౯½

తస్య వ్యాయచ్ఛమానస్య రామ స్యార్థే స రావణః. ౫౦
పక్షౌ పార్శ్వౌచ పాదౌచ ఖడ్గ ముద్ధృత్య సో ఽచ్ఛినత్
1 తత్ఖడ్గం చంద్రహాసాఖ్యం రుద్రదత్తనరాయుధం. ౫౧
సచ్ఛిన్నపక్ష స్సహసా రక్షసా రౌద్రకర్మణా
పపాత కించి చ్ఛేషేణ ప్రాణేన భువి పక్షిరాట్. ౫౨
* తేన నిర్వీర్యతాం యాతః రావణ శ్శత్రురావణః. ౫౨½

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
ద్వాదశస్సర్గః.



* తేనేతి-అత్ర వాల్మీకి. ఉ. కాం ౧౬ సర్గే శ్లో॥ దదౌ ఖడ్గం మహాదీప్తం చంద్రహాస మితి శ్రుతం, దత్వో ఽవాచ తదా శంభు ర్నావజ్ఞేయ మిదం త్వయా – అవ జ్ఞాతం హి యది తే మామే వేష్య త్యసంశయ ఇత్యాది. శివ

1. యాజ్ఞ రా.



౪౭-౪౮ శత్రులమద మణఁచు పక్షిరా జగు నాజటాయువు వాని యెడమబాహువులు పదింటిని ఛేదించెను. గోళ్ళు, రెక్కలు నాయుధములుగాఁ గల యాతఁడు వానిజుట్టును బెరికివేసెను.

౪౯ ఆరావణుని తెగిపోయినబాహువులు విషజ్వాలలతోఁగూడి పుట్ట నున్న సర్పములట్లు వెంటనే పొడచూపెను.

౪౯½ అటుపైన సమానపరాక్రమవంతు లగు వా రిద్దరకును ముహూర్త కాలము పోరు జరిగెను.

౫౦-౫౧ రామునికొఱకు హోరాహోరిగఁ బరిశ్రమించు నాజటాయువు రెక్కలను, ప్రక్కలను, పాదములను గూడ రావణుఁడు ఖడ్గము నెత్తి నఱికెను. ఆకత్తి రుద్రుఁ డొసఁగినచంద్రహాస మను గొప్ప యాయుధము.

౫౨ పక్షిరా జగు జటాయువు, రౌద్రకర్ముఁ డగు నారక్కసునిచే రెక్కలు తెగి, కొనయూపిరితోఁ బుడమిం బడిపోయెను.

౫౨½ *శత్రువుల నెల్లర నేడిపించువాఁ డగు రావణుఁ డాజటాయుపై నాచంద్రహాసము ప్రయోగించుటచే వాఁడే బలహీనుఁడై పోయెను.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమునఁ
బండ్రెండవ సర్గము.



* ఈవిషయములో వాల్మీకి రామాయణమున నుత్తరకాండమున ౧౬ సర్గమున ప్రజ్వలించు చంద్రహాసము నిచ్చి శంభుఁడు 'రావణా'! దీని నెన్నఁడును నవమానపఱపకుము. నీ వట్లొనర్తువేని యిది తిరిగి నన్నే చేరును.' అని పల్కెను. అని కలదు. శివరామాయణమునందును, 'దేవతలయందు, దానవులయందుఁ దప్ప మఱెవ్వరియెడల దీనిని

## త్రయోదశసర్గః.

తం దృష్ట్వా పతితం భూమౌ క్షతజార్ద్రం జటాయుషం
[1] విలలాప సుదుఃఖార్తా సీతా శశినిభాననా. ౧

అయంహి పాపచారేణ మాం త్రాతు మభిసంగతః
శేతే వినిహతో భూమౌ మమ భాగ్యా ద్విహంగమః. ౨

త్రాహి మా మద్య కాకుత్స్థ! లక్ష్మణేతి వరాంగనా
సుసంత్రస్తా సమాక్రంద చ్ఛృణ్వతాం తు యథాంతికే. ౩

తాం క్లిష్టమాల్యాభరణాం విలపంతీ మనాథవత్
అభ్యధావత వైదేహీం రావణో రాక్షసాధిపః. ౪

---

రామాయణేఽపి 'శ్లో॥ దేవదానవభిన్నేషు త్యక్త్వాశ్చ ద్విషశిష్యసి, తతోఽభివాద్య దేవేశం యయౌ యానేన రావణః. జటాయుషంతు తేనైవ హతవాన్ రణవిక్రమః, తస్మా న్నిర్వీర్య మభవ ద్రావణస్య వరాయుధం. ఆయుర్హ్రాసశ్చ తేనైవ హ్యాగమ ద్దైవచోదనా'దితి తదేవ ద్రఢయ న్నాహ స్కాందే ఉమాసంహితాయాం నవమసర్గే శ్రీరామం ప్రతి జటాయుః శ్లో॥ హేరామ! భవతా ఽజ్ఞప్తా రక్షితా జనకాత్మజా । హృత్వా పక్షౌ మామకౌ చ చంద్రహాసేన వీర్యవాన్ । కేశచ్ఛాయాం పరామృశ్య జానుచ్ఛాయాం తథైవచ । దక్షిణం దిశ మాక్రమ్య లంకాం చ గతవాన్ ప్రభో! ఇతి.

---

1 వాల్మీకి రా. ౫౨ స.



## పదమూడవ సర్గము.

౧ రక్తముచే దడిసి పుడమిపైఁబడిన యాజటాయువుం గాంచి, మిగుల దుఃఖముచే బీడింపఁబడినదై యాచంద్రునివంటిమోము గల సీత యేడ్చెను.

౨ నన్ను రక్షింపసమకట్టి, యీపక్షి నాదౌర్భాగ్యముచే నీదుర్మార్గుఁడగు రక్కసునిచేఁ గొట్టఁబడి భూమిపై కొరగినాఁడు.

౩ హేరామచంద్రా! హేలక్ష్మణా! న న్నిపుడు రక్షింపుఁడు. అని యానారీమణి మిగుల భయపడినదై వా రెదుట నున్నట్లుగానే యాక్రందించెను.

౪ నలిగిపోయినపూలమాలిక యాభరణములు గలిగినదియు, దిక్కులేని దానివలె విలపించునదియు నగు జనకరాజకుమారిక యున్నయెడకు రాక్షసరాజగు రావణుఁడు పరుగెత్తెను.

---

విడిచినను నీవే నశింతువు. అని చెప్పఁగా నీశ్వరునికి మ్రొక్కి రావణుఁడు రథముపై నెక్కిపోయెను. యుద్ధమందు విక్రమించు జటాయువును దానిచేతనే కొట్టెను. అందుచేతనే రావణుని యాయుధశ్రేష్ఠము బలహీన మయ్యెను. దైవవశమున రావణుని యాయుర్దాయము, పరాక్రమమును దానిచేతనే క్షయించెను.' అను నీ విషయమును సమర్థించుచుఁ జెప్పఁబడినది.

స్కాందపురాణమున – ఉమాసంహితయందు తొమ్మిదవసర్గమున – శ్రీరామునిగూర్చి జటాయువు—'ఓరామా! నీయాజ్ఞఁగొని జానకిని రక్షించితిని. ప్రభూ! వీర్యవంతుఁ డగు రావణుఁడు 'చంద్రహాసముచే నా ఱెక్కలఁగొట్టి, సీతయొక్క శిరోజములు, తొడలు వీనినీడను జేత గ్రహించి దక్షిణదిశగా లంకానగరమునకుఁ బోయెను' అని కలదు.

౫౩]

నీయెడ నేర మొనరించిన నన్నుఁ గాపాడుము. మఱదీ! బాణముల వంటి నామాటలచేఁ గొట్టఁబడినవాఁడ వగు నీవు నన్ను క్షమింపుము" అని యీవిధముగా దుఃఖించు నాసీతను రాముఁడు పచ్చునేమో యను శంక చేఁ దొందరగాఁ గొని వాయువేగమునఁ బోయెను.

---

త్కారముగా రథముపై కెత్తఁగల్గెను? అనుచోఁ జెప్పఁబడుచున్నది. వేదవతీరూప మగు బూర్వజన్మమం దామె యట్లే సంకల్పించినది. ఉత్తరకాండమునను 'ఏకారణముచే నేను పాపి వగు నీచే నడవి భయపెట్టఁబడితినో యాకారణమున నిన్ను సంహరించుటకై భూతలమునుండి పుట్టెదను' అని చెప్పఁబడెను. ఇందువల్లనే దేవకార్యమును గొనసాగింపఁజేయుటకు తానే రాము నానతి నిమిత్తముగా నుంచుకొని తనను రావణుఁడు భయపెట్టుట నోర్చెను. ఆ విషయమునే సమర్థించుచు సీత రావణుంగూర్చి సుందరకాండమున 'నేను దొంగిలించుటకు శక్యమైనదానను గాను. ఆబుద్ధిమంతుఁ డగు శ్రీరామచంద్రునుండి నన్ను హరించుట నీనాశనముకొఱకే దైవముచే నేర్పరుపఁబడెను. ఇందు సంశయములే' దని చెప్పఁబడెను. అట్లయిన సీత యెందుల కింతగా వాపోయె నన్నచోఁ 'భర్తృవియోగము నొందిన పతివ్రత యిట్లుండవలె' నని లోకహితవును బ్రవర్తింపఁజేయుటకు రావణునికిఁ గేవలము మనుష్యభావము కలిగించుట కట్లు చేసిన దనియు నెఱుంగునది. ఇందువల్లనే వాల్మీకిరామాయణమున నరణ్యకాండమున ౪౯ సర్గమున 'ఆసీత రాక్షసరాజుచే నాకసమువెంటఁ గొంపోఁబడి మత్తురాలట్లు, భ్రాంతచిత్తకైవడి, ఆతురురా

రక్షసా నీయమానాం స్వాం భార్యాం మోచయ రాఘవ!
హాలక్ష్మణ! మహాభాగ! త్రాహి మా మపరాధినీం. ౧౨
వాక్ఛరేణ హత స్త్వం మే క్షంతు మర్హసి దేవర!
ఇత్యేవం క్రోశమానాం తాం రామాగమనశంకయా. ౧౩
జగామ వాయువేగేన సీతా మాదాయ సత్వరః. ౧౪

యుద్ధకాండే వక్ష్యమాణప్రకారేణ సమరసీమని జనితమూర్ఛాలక్షణం లక్ష్మణ ముద్ధర్తు మశక్తో రావణః కథం బలా దుద్ధర్తుం శక్త ఇతిచే దుచ్యతే. వేదవతీరూపపూర్వజన్మని తథా సంకల్పితవతీ. ఉక్తం హ్యుత్తరకాండే శ్లో॥ యస్మాత్తు ధర్షితా చాహం త్వయా పాపాత్మనా వనే, తస్మా త్తవ వధార్థం వై ఉత్పత్స్యే హం మహీతల ఇత్యాదినా. అతః దేవకార్యనిర్వాహాయచ స్వయమేవ శ్రీరామాజ్ఞాం నిమిత్తీకృత్య స్వధర్షణ మంగీచకార. తదేవ ద్రఢయన్నాహ సీతా రావణంప్రతి సుందరకాండే శ్లో॥ నాపహర్తు మహం శక్యా తస్య రామస్య ధీమతః, విధి స్తవ నధార్థాయ విహితో నాత్ర సంశయ ఇత్యాదినా. తర్హి సీతా ప్రలాపాదికం కి మర్థం కృతవతీతిచే చ్ఛృణు. పతివిరహే పతివ్రతయైవం వర్తితవ్య మితి లోకహితప్రవర్తనాయ రావణస్య కేవలమనుష్యత్వబుద్ధిసంపాదనాయచ ప్రలాపాదిక మకరోదితి. అతఏవోక్తం వాల్మీకిరామాయణే అరణ్యకాండే ౪౯ సర్గే శ్లో॥ తత స్సా రాక్షసేంద్రేణ హ్రియమాణా విహాయసా, భృశం చుక్రోశ మత్తేవ



నీయెడ నేర మొనరించిన నన్నుఁ గాపాడుము. మఱదీ! బాణముల వంటి నామాటలచేఁ గొట్టఁబడినవాఁడ వగు నీవు నన్ను క్షమింపుము" అని యీవిధముగా దుఃఖించు నాసీతను రాముఁడు వచ్చునేమో యను శంక చేఁ దొందరగాఁ గొని వాయువేగమునఁ బోయెను.

త్కారముగా రథముపై కెత్తఁగల్గెను? అనుచోఁ జెప్పఁబడుచున్నది. వేదవతీరూప మగు బూర్వజన్మమం దామె యట్లే సంకల్పించినది. ఉత్తరకాండమునను 'ఏకారణముచే నేను పాపి వగు నీచే నడవి భయపెట్టఁబడితినో యాకారణమున నిన్ను సంహరించుటకై భూతలమునుండి పుట్టెదను' అని చెప్పఁబడెను. ఇందువల్లనే దేవకార్యమును గొనసాగింపఁజేయుటకు తానే రాము నానతి నిమిత్తముగా నుంచుకొని తనను రావణుఁడు భయపెట్టుట నోర్చెను. ఆ విషయమునే సమర్థించుచు సీత రావణుంగూర్చి సుందరకాండమున 'నేను దొంగిలించుటకు శక్యమైనదానను గాను. ఆబుద్ధిమంతుఁ డగు శ్రీరామచంద్రునుండి నన్ను హరించుట నీనాశనముకొఱకే దైవముచే నేర్పరుపఁబడెను. ఇందు సంశయములే' దని చెప్పఁబడెను. అట్లయిన సీత యెందుల కింతగా వాపోయె నన్నచో 'భర్తృవియోగము నొందిన పతివ్రత యిట్లుండవలె' నని లోకహితమును బ్రవర్తింపఁజేయుటకు రావణునికిఁ గేవలము మనుష్యభావము కలిగించుటకట్లు చేసిన దనియు నెఱుంగునది. ఇందువల్లనే వాల్మీకిరామాయణమున నరణ్యకాండమున ౪౯ సర్గమున 'ఆసీత రాక్షసరాజుచే నాకసమువెంటఁ గొంపోఁబడి మత్తురాలట్లు, భ్రాంతచిత్తకైవడి, ఆతురురా

[1]ఉత్తమాంగాచ్చ్యుతా తస్యాః పుష్పవృష్టి స్సమంతతః. ౧౪
సీతాయా హ్రియమాణాయాః పపాత ధరణీతలే. ౧౪½

నాస్తి ధర్మః కుత స్సత్యం నార్జవం నానృశంసతా. ౧౫
యత్ర రామస్య వైదేహీం భార్యాం హరతి రావణః
ఇతి సర్వాణి భూతాని గణశః పర్యదేవయన్. ౧౬

విత్రస్తకా దీనముఖా రురుదు ర్మృగపోతకాః. ౧౬½

[2] అంతరిక్షగతావాచ స్ససృజు శ్చారణా స్తదా. ౧౭
ఏతదంతో దశగ్రీవ ఇతి సిద్ధా స్తథా బ్రువన్. ౧౭½
హ్రియమాణాతు వైదేహీ కంచన్నాథ మపశ్యతీ. ౧౮
దదర్శ గిరిశృంగస్థాన్ పంచవానరపుంగవాన్. ౧౮½

తేషాం మధ్యే విశాలాక్షీ కౌశేయం కనకప్రభం. ౧౯
ఉత్తరీయం వరారోహా శుభా న్యాభరణానిచ
ముమోచ యది రామాయ శంసేయు రితి మైథిలీ. ౨౦
సంభ్రమాత్తు దశగ్రీవ స్తత్కర్మ న స బుద్ధవాన్. ౨౦½

భ్రాంతచిత్తా యథాతురేత్యత్రతత్య ఇవశబ్దస్వారస్యేన దుఃఖ నటనమేవ సూచితః. తదేవ ధ్వన్యతే సుందరకాండే హనుమన్ ప్రతి సీతావచనే—శ్లో॥ యది రామో దశగ్రీవ మి హ హత్వా సబాంధవం, మా మితో గృహ్య గచ్ఛేత త త్తస్య సదృశం భవేదితి.

1. వాల్మీకి రా. ౫౨ స. 2. వాల్మీకి రా. ౫౪ స.



౧౪–౧౪½ అట్లు రావణునిచేఁ గొంపోఁబడు నామెశిరమునుండి జారి పుష్పవృష్టి భూతలమున నిట్టట్టు చెదరిపడెను.

౧౫–౧౬ శ్రీరామచంద్రునివంటి మహాత్మునిభార్యను, జనకరాజకుమారి కను దురాత్ముఁ డగు రావణుఁడు హరించుచో నిఁక ధర్మ మెక్కడ? సత్య మెక్కడ? ఆర్జవము సున్న; సౌమ్యత యెందును లేదు; అని సమస్తభూతములును గుంపులుగూడి యేడ్చినవి.

౧౬½ లేఁడిపిల్లలుగూడ భయభ్రాంతములై, దీనత్వమున మోములు వాల్చి యేడ్చినవి.

౧౭–౧౭½ ఆకసమునుండి చారణులు యింతతో రావణుఁడు సరి యని పల్కిరి. సిద్ధులు నట్లే యనిరి.

౧౮–౧౮½ జానకి యట్లు కొంపోఁబడుచు నెందునుగాని రక్షకుం గనలేక యొక పర్వతశిఖరమునఁ గూర్చొనియున్న యైదుగురువానరశ్రేష్ఠులఁ జూచెను.

౧౯–౨౦ విశాలనేత్రములుగల యామె బంగారుచాయగల తనపట్టుచీర చెఱంగున శుభములైన యాభరణములను మూటగట్టి, రాముని కెఱింగింతురేమో యను తలఁపుతో వారినడుమ పడవేసెను.

౨౦½ ప్రయాణపుం దొందరలో రావణుఁ డకార్యమును గుర్తింపలేక పోయెను,

లట్లు ఆక్రోశించెను’ అనుచో నుపమావాచకప్రయోగస్వారస్యముచే దుఃఖనటనమే సూచింపఁబడెను. ఆవిషయమే సుందరకాండమున హనుమంతుం గూర్చి సీత యనుటలో “రాముఁడు రావణునిట బాంధవులతోఁగూడ సంహరించి యిటనుండి నన్నుఁ గొంపోవునేని యది యాతనికి సరిపడినకార్య మగును” అని చెప్పఁబడెను.

పింగాక్షా స్తాం విశాలాక్షీం నేత్రై రనిమిషై రివ. ౨౧
విక్రోశంతీం తథా సీతాం దదృశు ర్వానరర్షభాః. ౨౧½

సచ పంపా మతిక్రమ్య లంకా మభిముఖః పురీం. ౨౨
[1] జగామ రుదతీం గృహ్య వైదేహీం రాక్షసేశ్వరః. ౨౨½

స్వాంతఃపురే రహస్యే తా మశోకవిపినే క్షిపత్. ౨౩

[2] ఉత్సంగేనైవ భుజగీం తీక్ష్ణదంష్ట్రాం మహావిషాం
*నిదధే రావణ స్సీతాం మయో మాయా మివ స్త్రియం. ౨౪

[3] రాక్షసీభిః పరివృతాం ♦మాతృబు ద్ధ్యానుపాలయత్. ౨౪½

---

* నిదధేతి - నిదధే స్థాపితవాన్ మయః త్రిపురాధిపతిః మాయాం మాయామయీం స్త్రియం స్వయంప్రభాం బిలే యథా నిదధే తథేత్యర్థః. మాయారూపైవైషా సీతా యా లంకా మాగతేతి ధ్వనితం. అతఏవ రావణస్య వహనీయైషా జాతా మాయాత్వాదేవ. రావణస్య తదజ్ఞానం. ముఖ్యసీతా త్వగ్నిం ప్రవిష్టేతి పూర్వమేవ ధ్వనితం.

♦ మాతృబుద్ధ్యానుపాలయ దితి — తదేవ ద్రఢయ న్నాహ వాల్మీకి రామాయణే ఉ. కాం. ౫ సర్గే శ్లో॥ సీతా లక్ష్మీర్మహాభాగా సంభూతా వసుధాతలాత్, లంకా మానీయ యత్నేన మాతేవ పరిరక్షితా ఇతి.

---

1. వాల్మీకి రా. ౫౪ స. 2. వాల్మీకి రా. ౫౪ స.



౨౧-౨౧½ ఆవానరశ్రేష్ఠు లట్లాక్రోశించుచున్న విశాలనేత్రములు గల యాసీతను ఱెప్పపాటులేని చూపులఁ గనుఁగొనిరి.

౨౨-౨౨½ ఆరావణుఁడు పంపాసరస్సును దాటి లంకానగరమున కభిముఖుఁడై యాయేడ్చుచున్న సీతను గొనిపోయెను.

౨౩ ఆసీతను దనయంతిపురమున నున్న యశోకవనమున నుంచెను.

౨౪ * తీక్ష్ణము లగు కోరలు, మహావిషమును గల యాఁడు సర్పమునట్లామెను తొడమీఁద నిల్పుకొని పోయి మాయామయి యగు స్త్రీని మయుఁ (త్రిపురాధిపుఁడు) డట్లు నిల్పెను.

౨౪½ రాక్షసాంగనలచేఁ జుట్టువారుకొనఁబడిన యామెను ♦ మాతృబుద్ధితోఁ బాలించెను.

---

* నిదధే = స్థాపించెను. మయుఁడు త్రిపురాధిపతి, మాయాం = మాయామయియైన స్త్రీని స్వయంప్రభను, బిలమున నెట్లు నిల్పె నట్లని యర్థము. ఈసీతయు మాయాస్వరూపయై లంకకు వచ్చిన దని దీన ధ్వనించుచున్నది. మాయాశక్తి యాట చేతనే రావణుఁ డెత్తుకొనుటకు వీలైనది. రావణున కది తెలియదు. ముఖ్యమయిన సీత యగ్నిం బ్రవేశించె నని యిదివరకే ధ్వనింపఁబడియున్నది.

♦ మాతృబుద్ధితోఁ బాలించెను అనువిషయమునే సమర్థించుచు వాల్మీకి రా. ఉత్తరకాం. ౫ సర్గమున "లక్ష్మియే మహాభాగ యగు సీతయై పుడమిం బుట్టెను. రావణునిచేఁ బ్రియత్నపూర్వకముగా లంకకుఁ గొనిరాఁబడి తల్లివలెఁ బాలింపఁబడె" ననుట.

కృశా ఉతిదీనా పరికర్మవర్జితా దుఃఖేన శుష్య ద్వదనాతి
విహ్వలా, హారామ రామేతి విలప్యమానా సీతా స్థితా
రాక్షసబృందమధ్యే. ౨౫-౨౫½

1 అబ్రవీచ్చ దశగ్రీవః పిశాచీ ర్ఘోరదర్శనాః.
యథా నేమాం పుమాన్ స్త్రీ ర్వా సీతాం పశ్య త్యసమ్మతః ౨౬
ముక్తామణిసువర్ణాని వస్త్రా ణ్యాభరణానిచ. ౨౭
యద్య దిచ్ఛే త్తదే వాస్యా దేయం మచ్ఛందతో యథా. ౨౭½
యాచ వక్ష్యతి వై దేహిం వచనం కించి దప్రియం. ౨౮
అజ్ఞానా ద్యదివా జ్ఞానా న్న తస్యా జీవితం ప్రియం. ౨౮½

తథోక్త్వా రాక్షసీ స్తా స్తు రాక్షసేంద్రః ప్రతాపవాన్. ౨౯
నిష్క్రమ్యాంతఃపురా త్తస్మా త్కింకృత్య మితి చింతయన్
దదర్శాష్టౌ మహావీర్యాన్ రాక్షసా న్పిశితాశినాన్. ౩౦
స తాన్ దృష్ట్వా మహావీర్యో వరదానేన మోహితాన్
ఉవా చైతా నిదం వాక్యం ప్రశస్య బలవీర్యతః. ౩౧
నానాప్రహరణాః క్షిప్ర మితో గచ్ఛత సత్వరాః
తతో ప్రష్య తాం జనస్థానే శూన్యే నిహతరాక్షసే. ౩౨
పౌరుషం బల మాశ్రిత్య త్రాస ముత్సృజ్య దూరతః
జనస్థానే వసద్భిస్తు భవద్భి రామ మాశ్రితా. ౩౩

1. వాల్మీకి రా. ౫౪.



౨౫-౨౫½ కృశించి, దీనురాలై, అభ్యంజనాదిసత్కారములు లేక, దుఃఖముచే నెండిపోయిన ముఖము గలదై మిగుల విహ్వలయై, హారామ హారామ! యని విలపించుచు సీత యారాక్షసులగుంపునడుమ నుండెను.

౨౬-౨౭½ పిశాచస్త్రీలను జూచి రావణుఁడు, యీమెను పురుషుఁడుగాని స్త్రీగాని నాసమ్మతి లేనిదే చూడఁగూడదు. ముత్తెములు, మణులు, బంగారములు, వస్త్రములు, నగలు మొదలగున వేవి యామె కోరునో యవెల్ల నామెకు నాయిచ్ఛానుసారము తెచ్చి యిచ్చుచుండుఁడు.

౨౮-౨౮½ విదేహరాజకుమారి యగు నీమె కప్రియమైనమాట నెవ్వతె యేని యెఱిఁగికాని యెఱుఁగకకాని పలుకుచో దానికి దానిప్రాణములయందుఁ బ్రీతి లేదన్నమాటయే (అనఁగా నది ప్రాణములపై నాస వదలుకొనవలసినదే).

౨౯-౩౧ ఇట్లారాక్షసస్త్రీలతోఁ బలికి, రక్కసులఱేఁడును బ్రతాపశాలియు నగు రావణుఁ డాయంతఃపురమునుండి బయలు వెడలి, యిఁక చేయవలసినపని యేమని చింతించుచు, మాంసాశనులు మహాపరాక్రమవంతులు నగు నెనమండుగురు రాక్షసులఁ జూచి, వారి బలపరాక్రమములను గొనియాడి వారితో ని ట్లనియె.

౩౨-౩౩½ ఓ రాక్షసులారా! నానావిధాయుధములఁ దాల్చి, వేగముగా నిటనుండి పోయి రక్కసులందరు చనిపోయిన యాశూన్యమైన జనస్థానమున నుండుఁడు. బలపౌరుషముల నమ్మి, వెఱపు దూరము గాఁ బెట్టి, జనస్థానమున నున్న మీరు రాముఁ డెప్పు డేమి చేయుచుండునో స్పష్టముగా నెఱిఁగి యావార్త నిటకుఁ గొనితెండు. అతిజాగరూకతతో మీ రచటికిఁ బొండు. రాముని బరిమార్ప

ప్రవృత్తి రుపనేతవ్యా కింకరోతీతి తత్వతః
అప్రమాదాచ్చ గంతవ్యం సర్వైరపి నిశాచరైః. ౩౪
కర్తవ్యశ్చ సదా యత్నో రాఘవస్య వధం ప్రతి
యుష్మాకంచ బలజ్ఞోఽహం బహుశో రణమూర్ధని. ౩౫
అత శ్చాస్మిన్ జనస్థానే మయా యూయం నియోజితాః.

తతః ప్రియం వాక్య ముపేత్య రాక్షసా మహార్థ
మష్టా వభివాద్య రావణం, విహాయ లంకాం సహితాః
ప్రతస్థిరే యత్ర జనస్థాన ♦ మలక్ష్యదర్శనాః. ౩౬-౩౬½

[1] సందిశ్య రాక్షసాన్ ఘోరాన్ రావణోఽష్టౌ మహాబలాన్.
ఆత్మానం బుద్ధివైక్లబ్యా త్కృతకృత్య మమన్యత. ౩౭½

అశ్రుపూర్ణముఖీం దీనాం సీతాం శోకపరాయణాం. ౩౮
మృగయూథపరిభ్రష్టాం మృగీం శ్వభి రివావృతాం
అధోముఖముఖీం సీతా మభ్యేత్య చ నిశాచరః. ౩౯
స బలా ద్దర్శయామాస గృహం దేవగృహోపమం
హర్మ్యప్రాసాదసంబాధం స్త్రీసహస్రనిషేవితం. ౪౦
నానాపక్షిగణై ర్జుష్టం నానారత్నసమన్వితం. ౪౦½

♦ అలక్ష్యదర్శనాః అంతర్ధానవిద్యయా దుష్ప్రేక్షస్వరూపా ఇత్యర్థః.

1. వాల్మీకి రా. ౫౫ స.



సర్వవిధములఁ బ్రయత్నము చేయునది. యుద్ధరంగముల మీబలముఁ జాలవర కే నెఱుంగుదును. కాఁబట్టియే జనస్థానమున నుండ నాచే మీ రాజ్ఞాపింపఁబడినారు.

౩౬-౩౬½ ప్రీతికరమైన యీవాక్యమును విని రాక్షసులు రావణునకు నమస్కరించి, యందరుంగూడి లంకను వీడి ♦ యదృశ్యాకారులై జనస్థానమునకు బయలు దేరిరి.

౩౭-౩౭½ ఇట్లు మహాబలవంతులు ఘోరులు నగు నాయెనమండుగురు రక్కసుల కాజ్ఞ యిచ్చి, బుద్ధివైకల్యముచేఁ దాను కృతార్థుఁడైనట్లే రావణుఁ డూహించెను.

౩౮-౪౦½ బాష్పములతో నిండిన మోముతో దీనురాలై శోకముదప్ప వేరెఱుంగక లేళ్ళగుంపులనుండి చెదరి కుక్కలగుంపులచే నావరింపఁబడిన యాడలేడి యట్లు, మొగము వాంచికొని యున్న సీతకడ కారక్కసుఁడు వచ్చి యనేకవేల స్త్రీలతో సేవింపఁబడుచు మేడలు (సామాన్యధనికుల సౌధములు), ప్రాసాదములు (దేవతలయు రాజులయు మేడలు) మొదలగువానితో దట్టమై, నానావిధపక్షులతోఁ గూడి నానావిధరత్నరాసులతో దీపించుచు దేవతాగృహమట్లున్న తనగృహమును బలాత్కారముగ సీతకుఁ జూపెను.

♦ 'అదృశ్యాకారులు' అనఁగా నంతర్ధానవిద్యచేఁ గనరానిస్వరూపము కలవార లని యర్థము.

సుధామణివిచిత్రాణి భూమిభాగాని సర్వశః.
దశగ్రీవ స్స్వభవనే ప్రాదర్శయత మైథిలీం. ౪౧
౪౧½

ఉవాచ వాక్యం పాపాత్మా సీతాం లోభితు మిచ్ఛయా.
౪౨

దశరాక్షసకోట్యశ్చ ద్వావింశతిరథాపరాః
తేషాం ప్రభు రహం సీతే! సర్వేషాం భీమకర్మణాం. ౪౩
వర్జయిత్వా జరావృద్ధాన్ బాలాంశ్చ రజనీచరాన్
సహస్ర మేక మేకస్య మమ కార్యపురస్సరం. ౪౪
* భజస్వ మాభిత ప్తస్య ప్రసాదం కర్తు మర్హసి. ౪౪½

[1] సా తథోక్తా తు వైదేహీ నిర్భయా శోకకర్శితా. ౪౫
తృణ మంతరతః కృత్వా రావణం ప్రత్యభాషత. ౪౫½

అసురై ర్వా సురై ర్వా త్వం య ద్యవధ్యో௨సి రావణ! ౪౬
ఉత్పాద్య సుమహద్వైరం జీవం స్తస్య న మోక్ష్యసే. ౪౬½

స తే జీవితశేషస్య రాఘవో௨ంతకరో బలీ. ౪౭
లంకా వైధవ్యసంయుక్తా త్వత్కృతేన భవిష్యతి
న తే పాప మిదం కర్మ శుభోదర్కం భవిష్యతి. ౪౮

* కామాభిత ప్తస్య కామేన త్వద్భృత్యో భవిష్యా మీత్యే వం రూపేణ మనోరథేన అభిత ప్తస్యే త్యర్థః.

1. వాల్మీకి రా ౫౬ స.



౪౧-౪౧½ అంతట సున్నపుపూతచేతను, మణులచేతను విచిత్రములై యున్న భూభాగములను గూడ రావణుఁడు మిథిలరాజు కుమారిక యగు సీతకుఁ జూపెను.

౪౨ సీతను లోభపెట్టఁ గోరి యాపాపి యిట్లు పలికెను.

౪౩-౪౪ సీతా! ముప్పదిరెండుకోట్లమంది భయంకరకర్ములగు రక్కసులకు నే నొక్కఁడనే ప్రభుఁడను. బాలురు వృద్ధులు గాక కేవలము నాయొక్కనికార్యములనే పరిచర్య చేయువా రొకవేయిమంది గలరు.

౪౪½ * అందుచే నన్నుఁ బొందుము కామబాధచేఁ దపించు నాయెడ ననుగ్రహముఁ జూపఁదగుదువు.

౪౫-౪౫½ అట్లు రావణునిచేఁ బలుకఁబడి జానకి యించుకయు భయము లేక, శోకాకులితయై, గడ్డిపోచను మధ్య నిడికొని రావణున కిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

౪౬-౪౬½ రాక్షసులచేఁగాని, దేవతలచేఁగాని నీకుఁ జావులేకున్నను, ఓరావణా! ఆశ్రీరామచంద్రునెడ గొప్పవైరము దెచ్చుకొని నీవు విడివడిపోఁజాలవు

౪౭-౪౮ రావణా! ఆశ్రీరాముఁడు నీజీవితశేషమును నాశనముఁజేయ సమర్థుఁడు. నీమూలముగా లంకానగరము నాథుఁడులేని దగును. నీయీపాపకర్మము శుభోదర్కము కానేరదు.

* మా=నన్ను; భజస్వ = భృత్యునిగా నంగీకరింపుము. కామముచే ననఁగా (నీకు సేవకుఁడ నయ్యెదను అను నిట్టి) మనోరథముచేఁ దపించు నాయెడ ననుగ్రహముఁ జూపు మని యర్థము.

నశక్యా యజ్ఞమధ్యస్థా వేదిః స్రుగ్భాండమండితా
ద్విజాతిమంత్రపూతాచ చండాలే నావమర్దితుం. ౪౯
తథాహం ధర్మనిత్యస్య ధర్మపత్నీ పతివ్రతా
త్వయా స్ప్రష్టుం నశక్యాస్మి రాక్షసాధమ పాపినా. ౫౦
నతు శక్ష్యామ్యుపక్రోశం పృథివ్యాం దాతు మాత్మనః. ౫౦½

సీతాయా వచనం శ్రుత్వా పరుషం రోమహర్షణం. ౫౧
ప్రత్యువాచ తత స్సీతాం భయసందర్శనం వచః. ౫౧½

శృణు మైథిలి! మద్వాక్యం మాసా న్ద్వాదశ భామిని! ౫౨
కాలే నానేన నాభ్యేషి యది మాం చారుహాసిని!
* తత స్త్వాం ప్రాతరాశార్థం సూదా శ్ఛేత్స్యంతి లేశశః. ౫౩

* వస్తుతస్తు హే వైదేహి! మే వాక్యం శృణు. తత్కిమ్? ద్వాదశమాసాన్ ద్వాదశమాసపర్యంతం ప్రతీక్ష్య ఇతి శేషః. అనేన కాలేన నాభ్యేషి ద్వాదశమాసపర్యంతం భృత్యానుగ్రహార్థ మత్ర స్థాతుం నాంగీకరోషి య దీశ్యర్థః. తత స్త్వా ముద్దిశ్య ప్రాతరాశార్థం ప్రాతః ప్రాతరేవ ఆశార్థం ఆశాసు స్థితగృధ్రాద్యర్థం సూదాః మాం ఛేత్స్యన్తి. మదాజ్ఞయైవేతి శేషః. దేవి! మాం భృత్యత్వేన నాంగీకరోషియది అహ మితఃపరం జీవితుం నేచ్ఛామి. మాం శస్త్రైః ఛిత్వా కాకగృధ్రాద్యర్థం ప్రయచ్ఛతేతి మమాజ్ఞయైవ సూదా స్తథా కరిష్యంతీతి భావః.



౪౯-౫౦½ ఎట్లు స్రుక్స్రువాదియజ్ఞసాధనములచే నలంకరింపఁబడినదియు, బ్రాహ్మణులమంత్రములచేఁ (ఉద్ధానాదిమంత్రములచే) బవిత్రమైనదియు నగు యజ్ఞమధ్యమున నున్న (యజ్ఞపురుషుని మధ్య నున్న గార్హపత్యాహవనీయములమధ్య నున్న దనుట) వేది (ఇష్టకలచే నిర్మింపఁబడినది) చండాలునిచేఁ దన్నుటకు శక్యముకాదో; అట్లే ధర్మనిరతుఁ డగు వానికి ధర్మపత్నినై, పతివ్రతనై యున్న నే నో రాక్షసాధమా! నీకుఁ డాఁకుటకు శక్యమైనదానను గాను. పుడమిపై నాత్మాపవాదము గలిగించుటకు సహింపను.

౫౧-౫౧½ సీతమాటలు విని, రావణుఁడు కఠినమై గగుర్పాటొదవించుచు, వెఱపుపుట్టించుచు నీమాట పలికెను.

౫౨-౫౩ * ఓకాంతా! మైథిలీ! నామాట వినుము. పండ్రెండుమాసములు (ప్రతీక్షించెదను). చక్కని నవ్వుగలదానా! ఈగడువులో నీవు నన్నుఁ బొందవేని నావంటవాండ్రు ప్రాతర్భక్షణముకొఱకు నీశరీరమును తునుకలు తునుకలుగా నఱికెదరు.

* ఇందు నిజార్థ మేమన? ఓమైథిలీ! నామాట వినుము. అదేమన? పండ్రెండు మాసములు ప్రతీక్షింతును. ఈకాలములో నాభ్యేషి = పండ్రెండుమాసములవఱకిచట నీసేవకు ననుగ్రహించుకొఱకుండుట కంగీకరింపవేని, అటుపై నిన్నుద్దేశించి, ప్రాతః + ఆశార్థమ్- ప్రాతః = ప్రాతఃకాలమున ఆశార్థం = దిక్కులం దుండు గ్రద్దలకొఱకు; వంటవాండ్రు (నాయాజ్ఞచేతనే) నన్ను నఱకుదురు. దేవీ! నన్ను దాసునిగా నంగీకరింపవేని నే నిటుపై జీవింపఁగోరను. నన్ను శస్త్రములనఱికి కాకులు, గ్రద్దలు మొదలగువాని కెఱవేయుఁడని నేనిచ్చిన యాజ్ఞపైననే నావంటవాండ్రట్లొనరింతు రని భావము. పద్మపురాణమున-సీతా! పదిమాసములలోఁగా నన్ను భజింపవేని అప్పుడు నిన్ను హింసింతును. అని చెప్పఁబడెనుగదా! యిటఁ బండ్రెండు మాసము లనుట యెటులఁ బొసఁగు నన్నచో, ఆమాట

1 ఇత్యుక్త్వా పరుషం వాక్యం రావణ స్స్వగృహం గతః
* త దేంద్రో బ్రహ్మవాక్యేన పాయసం వర్ష తుష్టిదం. ౫౪
దదౌ రహసి సీతాయై తేన తుష్టా బభూవ సా. ౫౪½

సమ్మంత్ర్య రావణేనాఽపి రాక్షసాశ్చైవ షోడశ. ౫౫
ప్రేషితా రామఘాతార్థం తే కబంధేన భక్షితాః
తస్మా ద్రామకథాం వక్తుం కోఽపి నాయాతి రాక్షసః. ౫౬
తతో ఽన్యాన్ ప్రేష్య చారా న్స తూష్ణీమాసస్మ రావణః.
౫౬½

2 రామో మాయావినం హత్వా రాక్షసం కామరూపిణం.
ప్రతస్థే స్వాశ్రమం గంతుం తతో దూరా ద్దదర్శ తం
ఆయాంతం లక్ష్మణం దీనం ముఖేన పరిశుష్యతా. ౫౭

రాఘవ శ్చింతయామాస స్వాత్మన్యేవ మహామతిః. ౫౭½

---

యత్తు పాద్మే - ‘దశమాసా త్పరం సీతే! యది మాం నభజిష్యసి, తదా హన్మి’ ఇత్యుక్తం తత్తు పున స్సీతాస విధగమనకాలికం వచ ఇతి నవిరోధః. ‘యద్వా దశచ మాసాచ తేషాం సమాహారః ద్వాదశ’ ఇతి కేచిత్.

* అతఏవ స్కాందే ఉమాసంహితాయాం నవమాధ్యాయే శివః— శ్లో॥ అశోకవనికామధ్యే పూజితా జనకాత్మజా, ఆస్తే మఘవతా దత్తపాయసాన్నేన జీవితా ఇతి.

---

1. ఆనంద రా. సారకాండే ౭ స. 2. అధ్యాత్మ ౭ సర్గ.



౫౪-౫౪½ ఇట్లు కఠినముగాఁ బలికి రావణుఁ డింటికిఁ బోయెను. అప్పు డింద్రుఁడు బ్రహ్మదేవునిమాట ననుసరించి, సంవత్సరమువరకు నన్నపానములు లేకపోయిన నున్నంత తృప్తి నిచ్చు * పాయసము రహస్యమున సీతకు సమర్పించెను. దాన నామెయు మిగుల సంతసించెను.

౫౫-౫౬½ పదునాఱుగురు రక్కసులు, రావణాసురునితో నాలోచించి రాముని జంపుకొఱకుఁ బంపఁబడినవా రట కేగి కబంధునిచేఁ గబళింపఁబడిరి. అందుచే రామునివార్తఁ దెల్పుట కొక్కఁడును రాకుండెను. పిమ్మట మఱికొందరి చారుల నటకుఁ బంపి రావణుఁ డూరకుండెను.

౫౬-౫౭ ఇట శ్రీరామచంద్రమూర్తి మాయావియుఁ, గామరూపియు నగు రక్కసుని జంపి తనయాశ్రమమునకు బయలుదేరెను. అంతలో దూరమున వసివాడిన మేనుతో దీనుఁడై వచ్చుచున్న లక్ష్మణునిం జూచెను.

౫౭½ మహాబుద్ధిసంపన్నుఁ డగు శ్రీరామచంద్రుఁడు తనలో నిట్లని చింతించెను.

---

రావణుఁడు మరొకమాఱు (రెండుమాసములమీఁదట) సీతదగ్గరకు జూచుటకుఁ బోయినప్పటి దని యెఱుంగునది. అటుగాక ‘దశమాసాచ’ దశ = పదిమాసములు ; మాసౌ = రెండుమాసములు కాఁగా పండ్రెండుమాసములు అని సమాహారముచే సరిపడు నని యొకరు.

* కనుకనే స్కాందపురాణమున సుమాసంహితయందుఁ దొమ్మిదవ యధ్యాయమున శివుఁడు—
“ఇంద్రుఁ డిచ్చిన పాయసాన్నముచే జీవించుచు జానకి అశోకవనమధ్యమునఁ బూజితురాలై యుండెను” అని కలదు.

లక్ష్మణ స్తన్న జానాతి మాయాసీతాం మయాకృతాం. ౫౯
జ్ఞాత్వా ప్యేనం వంచయిత్వా శోచామి ప్రాకృతో యథా. ౫౯౪

1 శాపక్షయం భవే ద్దేవమానిభ్యాం సంభవం మమ. ౬౦
* శ్రీమతీహరణా త్పూర్వ మంబరీషస్య సన్నిధౌ. ౬౦౪

2 యద్యహం విరతో భూత్వా తూష్ణీం స్థాస్యామి మందిరే.
తదా రాక్షసకోటీనాం వధోపాయః కథం భవేత్. ౬౧౪

* శ్రీమతీమితి—అంబరీషపుత్రీహరణా న్నారదపర్వతౌ శ్రీమహావిష్ణుమశపతామ్. శాపప్రదానవివరణ మత్ర ప్రకాశ్యతే. తథాహి, అద్భుతరామాయణే ఉత్తరకాండే శ్రీమహావిష్ణుం ప్రతి నారదపర్వతౌ—శ్లో॥ శ్రీమతీహరణం విష్ణో! యత్కృతం ఛద్మనా త్వయా, మాయామూర్త్యా తథైవ త్వం జాయేథా మధుసూదన! అంబరీష స్యాన్వవాయే రాజ్ఞో దశరథస్యహి, పుత్ర స్త్వం భవితా పుత్రీ శ్రీమతీ ధరణీ ప్రజా. భవిష్యతి విదేహాశ్చ ప్రాప్యతాం పాలయిష్యతి, రాక్షసాపశదః కశ్చి త్త్వాం తే భార్యాం హరిష్యతి. యత్తో రాక్షసధర్మేణ హృతాచ శ్రీమతీ శుభా, అత స్తే రక్షసా భార్యా హర్తవ్యా ఛద్మ నాచ్యుత! యథా ప్రాప్తం మహద్దుఃఖ మావాభ్యాం శ్రీమతీకృతే, హాహేతి రుదతా లభ్యం తథా దుఃఖంచ తత్కృతే. గోవాలావానరా ఏవ దుఃఖా త్త్వాం మోచయంతిహి ఇత్యాది.

1. శివ రామాయణం. 2. అధ్యాత్మరా. ౭.సర్గ.



౫౯-౫౯౪ లక్ష్మణుఁ డట్లు నాచేఁ గల్పింపఁబడిన మాయాసీత నెఱుంగఁడు. నే నెఱింగియు నీతని మోసగించి సామాన్యమనుజునట్లు విచారించెదను.

౬౦-౬౦౪ * దీనిచే నాకుఁ దొల్లి యంబరీషునిసన్నిధిని శ్రీమతి యను కాంతను హరించుటవలన దేవమానులవల్లఁ గలిగిన శాపము నశించును.

౬౧-౬౧౪ అదియుంగాక, నే నిపుడు విరమించి నాయాశ్రమమున నూరక కూర్చొని యుంటినా, అపుడీకోట్లకొలఁది రాక్షసులు చచ్చుట కుపాయ మెట్లు సంభవించును?

* అంబరీషునికుమార్తెను హరించుటవలనఁ దొల్లి పర్వతనారదులు శ్రీమహావిష్ణునకు శాపమిచ్చిన యంశ మిట వివరముగాఁ బ్రకటింపఁబడుచున్నది. అట్లే అద్భుతరామాయణోత్తరకాండమున విష్ణుం గూర్చి నారదపర్వతులు 'విష్ణూ! మాయచే నీచే నెట్లు శ్రీమతీహరణము చేయఁబడెనో అట్లే నీవు మాయాస్వరూపమును ధరించి అంబరీషవంశమున దశరథునికుమారుఁడవై పుట్టుము. నీ వాతనికి మగబిడ్డ వౌదువు. శ్రీమతి పుడమికిఁ గూఁతు రగును. జనకుఁ డీమెఁ బెంచును. ఒక రాక్షసాధముఁడు నీభార్యను హరించును. ఏకారణమున రాక్షసధర్మమున మాయచేసి శ్రీమతిని నీవు హరించితివో ఆకారణమున నీభార్య రక్కసునిచే మాయగా హరింపఁబడుఁగాక! శ్రీమతికొఱకు మే మేల దరిలేనిదుఃఖము నందితిమో అందువలన నీవును హాహాకారములు చేయుచు దుఃఖముఁ బొందెదవుగాక! గోవుతోకలవంటి తోకలుగల వానరులే ని న్నీదుఃఖమునుండి దాటించెదరు' అని.

యది శోచామి తాం దుఃఖసంతప్తః కాముకో యథా. ౬౨
తదాక్రమే ణానుచిన్వ న్సీతాం యాస్యే ఽ సురాలయం. ౬౨½

రావణం సకులం హత్వా సీతా మగ్నౌ స్థితాం పునః. ౬౩
మయైవ స్థాపితాం నీత్వా యాతా యోధ్యా మతంద్రితః. ౬౩½

అహం మనుష్యభావేన జాతో ఽస్మి బ్రహ్మణా ఽర్థితః. ౬౪
మనుష్యభావ మాపన్నః కంచిత్కాలం వసామి కౌ. ౬౪½
తతో మాయామనుష్యస్య చరితం మే ఽనుశృణ్వతాం.
ముక్తి స్స్యా దప్రియాసేన భక్తిమార్గానువర్తినాం. ౬౫½

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
త్రయోదశ స్సర్గః.

---

## చతుర్దశ స్సర్గః.

నిశ్చిత్యైవం తదా దృష్ట్వా లక్ష్మణం వాక్య మబ్రవీత్
కిమర్థ మాగతో ఽసి త్వం సీతాం త్యక్త్వా మమ ప్రియాం. ౧
* సీతా వా భక్షితా వా ఽపి రాక్షసై ర్జనకాత్మజా. ౧½

* సీతేతి-తత్ర శృంగారో ద్వివిధః, సంభోగో విప్రలంభ శ్చేతి. ఏవ మియతా ప్రబంధేన శ్రీసీతారామయో స్సంభోగ శృంగారో వర్ణితః. అథ విప్రలంభశృంగారం వర్ణయితు మారభతే సీతే త్యారభ్య సువేలారోహణావధిపర్యం



౬౨-౬౨½ ఆసీతంగూర్చి సామాన్యకాముకునియట్లు తపించుచు దుఃఖించి తినేని యప్పుడు క్రమముగా నామెను వెదకుచు రావణాసురుని నివాసస్థానమునకుఁ బోఁగలను.

౬౩-౬౩½ రావణుని గులముతోఁగూడ నశింపఁజేసి, యగ్నియందు నాచేతనే తొల్లి యుంచఁబడిన సీతను దోడ్కొని యయోధ్యానగరమునకుఁ దొందర లేక పోఁగలను.

౬౪-౬౪½ తొల్లి నేను బ్రహ్మచేఁ బ్రార్థింపఁబడి మనుష్యభావమును బొంది జనించితిని. పుడమియం దిట్లే కొంతకాలము వసించెదను.

౬౫-౬౫½ అందుచే మాయామనుష్యాకారుఁడ నగు నాచరిత్రమును విను భక్తిమార్గగాములగువారికి మోక్ష మెట్టి శ్రమము లేకుండ కల్గును.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమునఁ
బదుమూఁడవ సర్గము.

---

## పదునాలుగవ సర్గము.

౧-౧½ శ్రీరామచంద్రుఁ డిట్లు నిశ్చయించి, లక్ష్మణుం గని యిట్లనియె. లక్ష్మణా! నాప్రియురాలిని సీతను విడిచి నీ వెందుల కిట వచ్చితివి? రాక్షసు లెవ్వరిచేతనో జనకసుత యెటకో ♦ కొంపోఁబడినదో, భక్షింపఁబడినదో యగును.

♦ శృంగారము సంభోగ మని, విప్రలంభ మని రెండువిధములైనది. ఇంతవఱకుఁ గావ్యమున సీతారాముల సంభోగశృంగారము వర్ణింపఁబడినది. 'సీతా' అనునది మొదలు సువేలాపర్వత మెక్కువఱకు విప్రలంభశృంగారము వర్ణింపఁబడుచున్నది. కామశాస్త్రమున

1 ఏకాకినీ ముటజసీమ్ని విహాయ సీతాం కిం వత్స! మత్సవిధ మాకుల మాగతో௨సి? లక్ష్మణః— అత్రాగతే చిర యతి త్వయి వీర! దేవ్యా నైవ స్థితః కటుదురుక్తికదర్థితో௨హం. ౨-౨½

2 హాలక్ష్మణేతి వచనం రాక్షసోక్తం శ్రుతం తయా. 3
త్వద్వాక్యసదృశం శ్రుత్వా మాం గచ్ఛేతి త్వ రాబ్రవీత్. 3½

నేదం రామస్య వచనం స్వస్థా భవ శుచిస్మితే! ౪
ఇత్యేవం సాంత్విత్వా సాధ్వీ మయా ప్రోవాచ మాం పునః. ౪½

యదుక్తం దుర్వచో రామ! న వాచ్యం పురత స్తవ. ౫

రామస్తు లక్ష్మణం ప్రాహ తథా ௨ప్యనుచితం కృతం
త్వయా స్త్రీభాషితం సత్యంకృత్వా త్యక్త్వా శుభాననాం. ౬

3 గృహీత్వాచ కరం సవ్యం లక్ష్మణం రఘునందనః
ఉవాచ మధురోదర్క మిదం పరుష మార్తిమత్. ౭

---

తం. తదుక్తం కామశాస్త్రే—సంయుక్తయోస్తు సంభోగో విప్రలంభో వియుక్తయో రితి. తద్రసాని క్రమేణ దర్శితాని యథా ఏకాకినీ మిత్యాదినా.

---

1. బోధాయనరా. 2. అధ్యాత్మరా. ౭ సర్గ. 3. వాల్మీకి రా. ౫౯ సర్గ.



౨-౨½ వత్సా! లక్ష్మణా! పర్ణశాలయందొంటికత్తెను సీతను విడిచి నాసమీపమునకుఁ గంగారుపడి యేల వచ్చితివి?— నా విని లక్ష్మణుఁ డిట్లనియె:—ఓ వీరుఁడా! నీ విటకు వచ్చి చాలసేపిటనే యుండఁగా సీతాదేవిచే శ్రవణకఠోరము లగుమాటల దెబ్బపడి నే నట నిలువలేకపోయితిని.

3-3½ "హా! లక్ష్మణా!" యని రాక్షసుఁడు పల్కినమాట నామె వినెను. నీమాటతో సమాన మగు మాటగా నామె విని తొందరపడి నన్ను పొమ్మనెను.

౪-౪½ దేవీ! ఇది రామునిమాట గాదు. శుచియైన చిఱునవ్వుగలదానా! అలజడి పొందకుము- అని యీరీతిగా నేను బ్రతిమాలుకొన్నను, ఆసాధ్వి నన్నుఁగూర్చి యింకను పలికెను.

౫ ఆమెపల్కిన చెడుగుమాటలు, శ్రీరామచంద్రా! నీముందుఁ బలుకఁ దగినవి కావు.

౬ నా విని రాముఁడు లక్ష్మణునితో నిట్లనియె.- లక్ష్మణా! ఎట్లైన నీ వాడుదానిమాటను నిజ మని తలఁచి యాసుందరాస్యను వీడి చాల యనుచిత మగు పని నొనరించితివి.

౭ కుడిచేయి పట్టుకొని లక్ష్మణునిం గని శ్రీరామచంద్రుఁడు తొలుత పరుషముగను, దర్వాత మధురముగను దుఃఖముకలయ ట్లిట్లు మాట్లాడెను.

---

కలిసియున్నపుడు సంభోగశృంగారమును, వియోగము నందినపుడు విప్రలంభశృంగారము అని కలదు. అది యిందుఁ గ్రమమునఁ బ్రదర్శింపఁబడియె.

ఇదంహి రక్షో మృగసన్నికాశం ప్రలోభ్య మాం దూర
మనుప్రయాంతం, హతం కథంచి న్మహతా శ్రమేణ స
రాక్షసో ఽభూ న్మ్రియమాణఏవ. ౮

మనశ్చ మే దీన మిహాప్రహృష్టం చక్షుశ్చ సవ్యం కురు
తే వికారం, అసంశయం లక్ష్మణ! నాస్తి సీతా హృతా
మృతావా పథి వర్తతే వా. ౯

1 యాంవినా నోత్సహే వీర! ముహూర్త మపి జీవితుం
క్వ సా ప్రాణసహాయా మే సీతా సురసుతోపమా. ౧౦

యది మా మాశ్రమగతం వై దేహీ నాభిభాషతే
పునః ప్రహసితా సీతా వినశిష్యామి లక్ష్మణ! ౧౧

ఇతి సీతాం వరారోహాం చింతయన్నేవ రాఘవః
ఆజగామ జనస్థానం త్వరయా సహ లక్ష్మణః. ౧౨

2 శూన్య మావసథం దృష్ట్వా బభూ వోద్విగ్నమానసః
ఉద్భ్రమన్నివ వేగేన విక్షిప న్రఘునందనః. ౧౩

తత్ర తత్రోటజస్థాన మభివీక్ష్య సమంతతః
దదర్శ పర్ణశాలాంచ రహితాం సీతయా తదా. ౧౪
శ్రియా విరహితాం ధ్వస్తాం హేమంతే పద్మినీమివ ౧౫

రుదంతమివ వృక్షైశ్చ మ్లానపుష్పమృగద్విజం. ౧౬
విప్రకీర్ణాజినకుశం విప్రవిద్ధబృసీకటం.
దృష్ట్వా శూన్యం జనస్థానం విలలాప పునఃపునః. ౧౭

1. వాల్మీకి రా. ౫౮ స. 2. వాల్మీకి రా. ౬౦ స.



౮ తొలుత మృగరూపమున భాసించిన యారక్షస్సు నన్ను లోభ
పెట్టి చాలదూర మనుసరింపఁబడి, యెట్లో (కష్టసాధ్యముగా) మిగుల
శ్రమపైనం జంపఁబడెను. వాఁడు చనిపోయి తుదకు రాక్షసుఁడే
యయ్యెను.

౯ నామనసిట దీనమై యించుకయు హర్షమొంద కున్నది. ఎడమక
న్నదరుచున్నది. లక్ష్మణా! సంశయము లేదు. సీత లేదు. ఎవరి
చేతనో హరింపఁబడియో, చనిపోయియో, నడిదారిలోనో యుం
డును.

౧౦ ఓవీరుఁడా! ఏసీతను విడిచి ముహూర్తమాత్రమైన జీవింపనోల్లనో
అట్టి నాప్రాణములకుఁ దోడైన దేవకాంత యెక్కడ నున్నది?

౧౧ ఆశ్రమమున కరిగిన నన్ను (గని) విదేహరాజకుమారిక సీత చిఱునవ్వు
లొలుకు నెమ్మోముతో నాతోఁ బలుకకున్న ప్రాణములఁ బాసెదను.

౧౨ ఇట్లాసుందరాంగిఁ దలఁచుకొనుచునే రాఘవుఁడు వేవేగ లక్ష్మణు
నితోడ జనస్థానమున కరుదెంచెను.

౧౩ శ్రీరామచంద్రుఁడు గృహమును శూన్యముగాఁ గని డెందమున
మిక్కిలికొందల మందెను. మఱియు వేగముగా నులికిపడుచు-

౧౪-౧౫ చేతులు మొదలగు నవయవముల నిట్టటు విసరుచు, నందందుఁ బర్ణ
శాలచుట్టుపట్లప్రదేశముల నంతట వెదకి చూచుచు నయ్యెడ సీతలేని
పర్ణశాలను, హేమంతఋతువున మంచుచేఁ గప్పువడి శోభాహీనమై
విడిపోయిన తామరతీగె యట్లుండఁ గాంచెను.

౧౬-౧౭ వృక్షములుఁగూడ యేడ్చుచున్నవో యన్నట్లు వాడిపోయిన పువ్వు
లతో, మృగములతో, పక్షులతోఁ గూడి, చెల్లాచెదరైన చర్మ
ములు, దర్భలుగలిగి, తలక్రిందైన యాస్తరణములఁగూడి బిక్కు-
బిక్కు మనుచు శూన్యమై యున్న జనస్థానముఁ జూచి శ్రీరామ
చంద్రుఁడు వేమారు దుఃఖించెను.

1 రామం తథావిధం దృష్ట్వా లక్ష్మణ శ్శుభలక్షణః
భూయో దుఃఖసమావిష్టో దుఃఖితం రామ మబ్రవీత్. ౧౭

న స్వయం కామకారేణ తాం త్యక్త్వా ఽహ మిహాఽగతః.
ప్రచోదిత స్తయై వోగ్రై స్త్వత్సకాశ మిహాఽగతః. ౧౮

క్రోధస్య వశ మాపన్నో విస్మృతం తవ శాసనం
నిధాన మహ మేవాస్యా వియోగే రామ! రాఘవ! ౧౯
శాధి మాం పాపినం క్రూరం త్వచ్ఛాసనపరాఙ్ముఖం. ౧౯½

త ముబా చాఽథ రామస్తు మృగయాణో వనే ప్రియాం.
౨౦

హృతా మృతా వా నష్టా వా భక్షితా వా భవిష్యతి
2 నిలీనా ప్యథవా భీరు రథవా వన మాశ్రితా. ౨౧
గతా విచేతుం పుష్పాణి ఫలాన్యపిచ వా పునః
అథవా పద్మినీం యాతా జలార్థం వా నదీం గతా. ౨౨
యత్నా న్మృగయమాణస్తు నాఽఽససాద వనే ప్రియాం
* శోకరక్తేక్షణ శ్శోకా దున్మత్త ఇవ లక్ష్యతే. ౨౩

* శోకేతి - శోకరక్తేక్షణ శ్శోకా దున్మత్త ఇవ లక్ష్యతే- ఉన్మత్త ఇవే త్యత్ర ఇవ శబ్దో ఽస్మిన్ శ్లోకే సర్వత్ర సంబంధనీయః. శోకరక్తేక్షణ ఇవ, శోకాదున్మత్తఇవ, శోకాత్ప్రధావన్నివ, విలపన్నివ, శోకపంకార్ణవప్లుతఇవ

1. వాల్మీకిరా. అరణ్యకాం. ౫౯ స. 2. వాల్మీకిరా. అరణ్యకాం. ౬౦ స.



౧౭ అట్లున్న శ్రీరాముం జూచి, శుభలక్షణసంపన్నుఁ డగు లక్ష్మణుఁడు మిగుల దుఃఖములో మునిఁగినవాఁడై రాముని గని యిట్లు పలికెను.

౧౮ నాయిచ్ఛవచ్చినట్లు నే నామెను విడిచి యిటకు రాలేదు. భయంకరము లగు మాటలచే నామెయే ప్రేరేపింపఁగా నిచటికి వచ్చిన వాఁడను.

౧౯-౧౯½ క్రోధవశుఁడనై నీయాజ్ఞ మఱచితిని. రఘువంశజా! రామచంద్రా! ఈసీతావియోగమునకు నేనే మొదటికారణము; పాపాత్ముఁడను; క్రూరుఁడను; నీయాజ్ఞ నుల్లంఘించినవాఁడ నగు నన్ను శిక్షింపుము.

౨౦-౨౩ ఇట్లనుచున్న లక్ష్మణునితో నంత శ్రీరామచంద్రమూర్తి యిట్లనియె.- లక్ష్మణా! యీవనమున నాప్రియురాలిని వెదకుదమా! ఎవరిచేనైన హరింపఁబడినదో? చనిపోయినదో? కనఁబడక పోయినదో? తినివేయఁబడినదో? లేక వినోదముకొఱకై యెచటనైనఁ దాగుకొనెనా? లేక భయస్వభావురాలు గనుక నడవిలోనికే వచ్చెనా? పూవులుగాని ఫలములుగాని కోయఁబోయెనా? లేక తామరకొలని కఱిగెనా? నీటికొఱకు నది కఱిగినదా? అని యిట్లు శ్రీరామచంద్రుఁడు ప్రయత్నపూర్వకంబుగ వెదకుచు ప్రియురాలి నాయడవిం గనుగొనలేకపోయెను. (అయ్యెడ) * శోకముచే నెఱ్ఱఁబడిన నేత్రములు గలవాఁడై, శోకముచేఁ బిచ్చియెత్తినవానివలెఁ గన్పట్టుచుండెను.

* "ఉన్మత్త ఇవ=పిచ్చిపట్టినవానివలె" అనుదానిలో నున్న "ఇవ=వలె" అను శబ్దము నంతటఁ గూర్చుకొనవచ్చును. "శోకముచే నెఱ్ఱఁబడిన నేత్రములు కలవానివలె, శోకముచేఁ బిచ్చిపట్టినవానివలె, శోకముచేఁ బరువులు వెట్టువానివలె, విలపించువానివలె, శోక మను బురదసముద్రమున మునిఁగినవానివలెఁ గన్పట్టుచుండెను"

వృక్షా ద్వృక్షం ప్రధావ న్స గిరే శ్చాద్రిం నదా న్నదీం
బభూవ విలప న్రామ శ్శోకపంకార్ణవాప్లుతః. ౨౮

---

లక్ష్యత ఇతి సంబంధః. వస్తుతస్తు న తాదృశ శ్శ్రీరామ ఇత్యర్థః. అతఏవ సీతాం ప్రతి విలాపాదికం సీతాన్వేషణసమయే సీతా ముద్దిశ్య వృక్షమృగాదీ న్ప్రతి ప్రశ్నాదికం సర్వం శ్రీరామేణ లోకశిక్షార్థం నటనం కృత మితి ప్రదర్శయితు మేవ సర్వజ్ఞేన భగవతా శ్రీవాల్మీకినా ఉద్భ్రమన్నివ, ఉన్మత్త ఇవే త్యాదా తత్ర తత్ర ఇవ శబ్దః ప్రయుక్తమ్. ఏతదేవ ద్రఢయన్నాహ ఆగ్నేయపురాణే ౨౨ అధ్యాయే శ్లో॥ స్త్రైణే ఽజితేంద్రియో లోకే ప్రాప్తి స్యా దతిదుఃఖితః, ఇతి ప్రదర్శయ న్రామః ప్రాలప త్ప్రాకృతో యథేతి. అతఏవ శ్రీశుకో ప్యాహ శ్రీమద్భాగవతే నవమస్కంధే శ్లో॥ రక్షోఽధమేన వృకవ ద్విపినే సమక్షం వైదేహరాజదుహితర్యపయాతితాయాం, భ్రాత్రా వనే కృపణవ త్ప్రియయా వియుక్తః స్త్రీసంగినా మితి ప్రథయం శ్చచార. మర్త్యావతార స్త్విహ మర్త్యశిక్షణం రక్షోవధాయైవ న కేవలం విభోః, కుతో ఽన్యథా స్యా ద్రమతస్స్వ ఆత్మన సీతాకృతాని వ్యసనా నీశ్వరస్య. నవై స ఆత్మాత్మవతా మధీశ్వర స్సక్త స్త్రిలోక్యాం భగవాన్ వాసుదేవః, నస్త్రీకృతం కశ్మల మశ్నువీత న లక్ష్మణం చాపి విహాతు మిచ్ఛతీతి. తథాచ స్కాందే ఉమాసంహితాయాం దేవా న్ప్రతి విష్ణువచనం — అహం దాశరథి



౨౮ శ్రీరామచంద్రుఁ డొక చెట్టునుండి మఱియొక చెట్టుకడకును, ఒక పర్వతమునుండి మఱొక పర్వతమునకును, ఒకనదమునుండి మఱొక నదమునకును బరువులిడుచు, విలపించుచు శోక మనెడు బురదసముద్రములో మునిఁగిపోయెను.

---

అని సంబంధము. నిజమునకు శ్రీరాముఁ డట్టివాఁడు కాఁ డని యర్థము. ఇందుచేతనే సీతఁగూర్చి విలపించుట, సీతను వెదకుసమయమున నామె నుద్దేశించి వృక్షములను జంతువులను బ్రశ్నించుట మొదలగున దంతయు లోకశిక్షణముకొఱకే శ్రీరామునిచే జరుపఁబడిన దని చూపుటకే సర్వజ్ఞుఁ డగు శ్రీవాల్మీకి భగవానులచే "ఉద్భ్రమన్నివ = ఉలికిపడువానివలె, ఉన్మత్త ఇవ = పిచ్చివానివలె" అను నిట్టివానియందు "ఇవ" శబ్దము (వలె యను నర్థము గలది) ప్రయోగింపఁబడెను. ఇందువలననే శ్రీశుకులుగూడ శ్రీమద్భాగవతమున దశమస్కంధమున "అడవియందు విదేహరాజకుమారిక, తోడేలువంటి రాక్షసాధముఁ డగు రావణాసురునిచే హరింపఁబడగాఁ బ్రియవియోగ మందుచుండిన శ్రీరామచంద్రుఁడు స్త్రీసంగము గలవారిగతి యిట్టి దని చాటుచు, నయ్యడవిలోఁ దమ్మునితోఁ గలిసి తిరుగాడెను. మనుజుల శిక్షించుటకును, రక్కసులఁ బరిమార్చుటకే కేవల మా ప్రభునకు మనుష్యావతారము. అంతియేకాని యాత్మయందు రమించు నీశ్వరునకు సీతావియోగాదివ్యసనము లెక్కడివి? ఆత్మవేత్తల కాత్మరూపుఁడై సర్వేశ్వరుఁడైన భగవానుఁడు మూఁడు లోకములందును సక్తుఁడు గాఁడు. స్త్రీవియోగదుఃఖముచేఁ గల్గు చింత లతనికి లేవు. లక్ష్మణునైనఁ బోనాడుట కిచ్ఛగింపఁడు కూడను" అని సెలవిచ్చియున్నారు.

అట్లే స్కాందపురాణమందు నుమాసంహితయందు దేవతలనుగూర్చి శ్రీమహావిష్ణువు పల్కినమాట "నేను దశరథకుమారుఁడనై రావణుని యుద్ధమునఁ జంపుదును. ఈ శ్రీమద్రామావతారమున నేను సర్వజ్ఞుఁడనయ్యును, మాయచే నేమియు నెఱుఁగనివానివలెఁ జేయుదును (అనఁగా నేమియు నెఱుఁగనివానివలె వర్తింతు ననుట). నా మాయచే మోహితుఁడై రక్కసుఁడు రావణుఁడు నన్ను మనుష్య

చూతనీపమహాసాలాన్ పనసాన్ కురవాన్ ధవాన్
దాడిమా నసనాన్ గత్వా దృష్ట్వా రామో మహాయశాః ౨౫

ర్జ్ఞాత్వా హన్మి రావణ మాహవే, శ్రీమద్రామావతారే ఽస్మి న్నజ్ఞవ త్క్రియతే మయా, తత్ర శంకా నకర్తవ్యా సర్వజ్ఞేనాఽపి మాయయా. మ న్మాయయామోహితో రక్షో మనుష్యం మా మవేక్ష్యతి, అన్యథా తస్య సా నూనం న భవే ద్యత్ర కుత్రచిత్. ఇత్యేవం దార్ష్టాంతికసంప్రతిపత్త్యర్థం బహుదృష్టాంతాని. కించ బహువిధ దుఃఖప్రలాపస్య దేహాదా వాత్మబుద్ధిపూర్వకత్వా త్తద్బుద్ధే రజ్ఞానమూలకత్వాత్. స్వకృతలీలాశ్రవణద్వారా సర్వలోకానాం ముక్తిప్రదానాయ — నృపరూపే ణావతీర్ణస్య సచ్చిదానందఘనవిగ్రహస్య పరమాత్మన శ్శ్రీరామస్య-మాయాధిష్ఠాతుః పరమేశ్వరస్య భృగుశాపాదినాప్యజ్ఞానగంధోఽ ప్యస్తీతి వక్తు మశక్యత్వా దేతద్విధవిలాపాదికం సర్వం శ్రీరామేణ రావణప్రేషితచారాణాం మోహనార్థం లోకశిక్షార్థమేవ కృత మితి వేదితవ్యం. అన్యత్రాప్యేతాదృశస్థలే ష్వేవ మేవార్థో ఽనుసంధేయః. అథాన్యచ్చ. శ్రీవాల్మీకిరామాయణస్య కావ్యత్వేన వ్యవహారదర్శనాత్ - కావ్యోపయుక్తశృంగార రసనిరూపణం శ్రీరామలీలాప్రదర్శనే వర్ణ్యతే. తత్ర శృంగారో ద్వివిధః సంభోగోవిప్రలంభ శ్చేతి. శ్లో॥ సంయుక్తయోస్తు సంభోగో



౨౫-౨౬ మామిళ్లను, నీపములను (నీపము = కడిమి, మంకెన, నల్లయిరుగుఁడు), పెద్దమద్దులను, పనసలను, ఎఱ్ఱగోరంటలను (ఎఱ్ఱచేమంతుల ననియుఁ జెప్పవచ్చును), ఉమ్మెత్తలను, దానిమ్మలను, వేఁగిసలను జేరి చూచి శ్రీరామచంద్రుఁడు మరియు మల్లెలను,

మాత్రినిగాఁ జూడఁగలఁడు. ఆమాయ వాని కొక్కొకప్పుడు నిజముగా లేకపోవచ్చును" అని యీవిధముగా దార్ష్టాంతికసమర్థనమున కనేకదృష్టాంతములు కలవు. మఱియు—బహువిధము లగు దుఃఖప్రలాపము దేహాదులే యాత్మ యను బుద్ధి కలిఁగినప్పుడు కలుగునది యగుటవలనను, ఆబుద్ధి యజ్ఞానమూలక మగుటవలనను, తా నొనర్చిన విలాసములమూలమున సమస్తలోకములకు ముక్తి నిచ్చుటకు రాజరూపమున నవతరించిన, సచ్చిదానందఘనమూర్తి యగు పరమాత్మయే యైన శ్రీరామునకు మాయాధిష్ఠాత యగు పరమేశ్వరునకు భృగువుశాపము మొదలగువానిచేఁ గూడ నజ్ఞానగంధము గూడ కల దని చెప్పుట శక్యముగాని దగుటవలనను, యీవిధి విలాసములన్నియు, రావణుఁ డంపిన గూఢచారులను మోసగించుటకు, లోకములను శిక్షించుటకు మాత్రమే శ్రీరామునిచేఁ జూపఁబడె నని యెఱుంగునది. ఇతరము లగు నిట్టితావులయందును నిట్టియర్థమునే కూర్చుకొనునది.

మఱొక్కవిశేషము — శ్రీవాల్మీకిరామాయణమునకుఁ గావ్యమను వ్యవహారము గన్పట్టుటవలన గావ్యమునం దుపయోగింపఁబడు శృంగారాదిరసముల నిరూపణము శ్రీరామలీలాప్రదర్శనమున వర్ణింపఁబడుచున్నది. అందు శృంగారము రెండువిధము లైనది "సంభోగము, విప్రలంభము" అని. నాయికానాయకులు కలిసియున్నపుడు సంభోగము, వియోగముఁ బొందినపుడు విప్రలంభము అని తొలుతనే తెలుపఁబడెను. పిమ్మట నిట విప్రలంభశృంగారమునఁ జేరిన మన్మథావస్థలు పండ్రెండు గలవు. ఆద్వాదశావస్థలనే శ్రీరామచంద్రభగవానులు సీతను వెదకుటలోఁ జూపెను. కామశాస్త్రమునఁ జక్షుఃప్రీతి, మనస్సంగము, సంకల్పము, ప్రలాప

మల్లికా మాధవీ శ్చైవ చంపకాన్ కేతకీ స్తథా
పృచ్ఛన్ రామో వనే భ్రాంత ఉన్మత్త ఇవ లక్ష్యతే. ౨౯

విప్రలంభో వియుక్తయో రితి పూర్వమేవ ప్రతిపాదితం. అథాఽత్ర విప్రలంభశృంగారాంతర్గత మన్మథావస్థా ద్వాదశ. తానేవ ప్రదర్శయతి సీతాన్వేషణే భగవాన్ రామచంద్రః. యథా కామశాస్త్రే శ్లో॥ చక్షుఃప్రీతిః మనస్సంగ స్సంకల్పో ఽథ ప్రలాపితా, జాగరః కార్శ్య మరతి ర్లజ్జాత్యాగో ఽథ సంజ్వరః, ఉన్మాదో మూర్ఛనంచైవ మరణం చరమం విదుః. అవస్థా ద్వాదశ మతాః కామశాస్త్రానుసారత ఇతి. తద్వివరణం శ్లో॥ ఆదరా ద్దర్శనం చక్షుఃప్రీతి రి త్యభిధీయతే, మనస్సంగః ప్రియతమే నిత్యం చిత్తస్య విభ్రమః. సంకల్పో నాథవిషయే మనోరథ ఉదాహృతం, ప్రలాపః ప్రియసంశ్లిష్టగుణాలాప ఉదాహృతః. జాగరస్తు వినిద్రత్వం కార్శ్య మంగస్యతానవం, అన్యత్రా ఽప్రీతి రరతి ర్వ్రీడాత్యాగ స్త్వలజ్జతా. తాపాధిక్యం జ్వరః ప్రోక్తః ప్రతిక్రియవివర్జితః, ఉన్మాద స్తుల్యవర్తిత్వం చేతనాచేతనేష్వపి. మూర్ఛా త్వాభ్యంతరీ వృత్తి ర్బాహ్యేంద్రియనిమీలనాత్, మరణం మరణార్థస్తు ప్రయత్నః పరికీర్తితః.

అథ రసవిశేషనిరూపణం యథా - శ్లో॥ శృంగారహాస్యకరుణరౌద్రవీరభయానకాః, భీభత్సాద్భుతశాంతాశ్చ రసాః పూర్వై రుదాహృతాః. ఇత్యుక్తనవరసాస్తు శ్రీరామా



మాధవీలతలను (పువ్వుల గురివెందల ననుట), సంపెఁగలను, మొగలులను జేరి యడుగుచు నడవియందుఁ బిచ్చియెత్తినవాని వడువునఁ గన్పట్టుచుండెను.

నము, జాగరము, కార్శ్యము, అరతి, లజ్జాత్యాగము, సంజ్వరము, ఉన్మాదము, మూర్ఛ, మరణము అను నవస్థలు పండ్రెండు అని గలదు. వానివివరణ మెట్లన, నాయికానాయకు లన్యోన్యము తమిమీరఁ జూచుకొనుట చక్షుఃప్రీతి. ప్రియతమునియందు నిత్యము మనసుయొక్క తడబాటు మనస్సంగము. భర్తృవిషయమైన మనోరథము సంకల్పము. ప్రియునియందుఁగల గుణములనే పలుకుట ప్రలాపము. నిద్రపట్టకపోవుట జాగరము. శరీరము చిక్కుట కార్శ్యము. ఏవస్తువునందుఁగాని ప్రీతిలేకపోవుట అరతి. సిగ్గు విడుచుట లజ్జాత్యాగము. ప్రతిక్రియలేని యధిక మగు తాపము జ్వరము. చేతనాచేతనములయందు సమానముగాఁ జరించుట ఉన్మాదము. బాహ్యము లగు నింద్రియములు మూఁతపడుటవలనఁ గలుగు నాంతరంగికవ్యాపారము మూర్ఛ. చావుకొఱకుఁ జేయు ప్రయత్నము మరణము.

ఇఁక రసవిశేషము నిరూపింపఁబడుచున్నది. శృంగారము, హాస్యము, కరుణము, రౌద్రము, వీరము, భయానకము, భీభత్సము, అద్భుతము, శాంతము అని రసములు తొమ్మిది యని పూర్వు లుదాహరించిరి. ఈనవరసములును శ్రీరామాయణమున నెచ్చట నున్నవి యనుచో సమాధానము చెప్పఁబడుచున్నది. శ్రీరామచంద్రునకు జరిగిన సీతావివాహాదికమున శృంగారము. మంథర, శూర్పణఖ మొదలగు వారిచర్యలయందు హాస్యము. ఇష్టమును వీడుట, యనిష్టమును బొందుట యను స్వరూపముగాఁ గల రాజ్యభ్రష్టత, దండకారణ్యముల కేగుటలయందుఁ గరుణము. రావణాదులయందు రౌద్రము. లక్ష్మణాదులయందు వీరము. కుంభకర్ణుఁడు, అతికాయుఁడు మొదలగువారియందు భయానకము. కబంధుఁడు, విరాధుఁడు మొదలగు వారిపట్ల భీభత్సము. రావణేంద్రజిత్తులయుద్ధమున, ఖరాదిరాక్షసుల నాశనము చేయుటయందు నద్భుతము. శబరి, విభీషణుఁడు మొద

కిం ధావసి ప్రియే! దూరం దృష్టా ఽసి కమలేక్షణే!
వృక్షై రాచ్ఛాద్య చాత్మానం కిం మాం న ప్రతిభాషసే ౨౬
తిష్ఠ తిష్ఠ వరారోహే! న తే ఽస్తి కరుణా మయి
నాత్యర్థం హాస్యలీలాసి కి మర్థం మా ముపేక్షసే.
పీతకౌశేయకే నాసి సూచితా వరవర్ణిని! ౨౭

హాలక్ష్మణ! మహాబాహో! పశ్యసి త్వం ప్రియాం క్వచిత్. ౨౭½

హాప్రియే! క్వ గతా భద్రే! హాసీతేతి పునః పునః ౨౯
ఇత్యేవం విలపన్ రామః పరిధావ న్వనా ద్వనం. 30

---

యణే కుత్రే త్యుక్తే త త్సమాధీయతే. 1. శ్రీరామస్య యావ త్సీతాసాహచర్యం తావ చ్ఛృంగారో రసః, 2. మంధరాశూర్పణఖాదిషు హాస్యరసః, 3. ఇష్టవియోగానిష్టసంసంభవరూపయో రాజ్యభ్రంశ దండకారణ్యగమనరూపయోః కరుణారసః, 4. రావణాదిషు రౌద్రరసః, 5. లక్ష్మణాదిషు వీరరసః, 6. కుంభకర్ణాతికాయాదిషు భయానకరసః, 7. కబంధవిరాధాదిషు భీభత్సరసః, 8. రావణేంద్రజిదాదియుద్ధే ఖరాదినాశనే మూలబలచ్ఛేదనే చాద్భుతరసః, 9. శబరీవిభీషణాదిభక్తేషు శాంతరసః సమ్యక్ప్రతిపాదితః. ఏతావతా మహాకావ్యలక్షణాని సర్వాణి రామేణ ప్రదర్శితా నీతి సమ్య జ్నిరూపితాని



౨౬-౨౭½ ఓప్రియురాలా! ఏల దూరముగా పరిగెడెదవు? ఓతామర రేకులవంటి కన్నులుగలదానా! నాకుఁగనఁబడినావు లెమ్ము. చెట్లలో డాగికొని యేల నాతో మాటలాడ కున్నావు? ఆగుమాగుము! నాయందు నీకుఁ గరుణ లేదు. నీవు మితిమీరిన పరిహాసలీలలు కలదానవు కావు; ఇక్లేల న న్నుపేక్షించుచున్నావు? పచ్చనిపట్టుచీరను బట్టి నీవు సూచింపఁ బడుచున్నావు.

౨౯-30 హాలక్ష్మణా! మహాబాహు! నాప్రియురాలి నెందైన నీవు చూచితివా? హా! ప్రియురాలా! ఎట కేగితివి? హాకళ్యాణీ! హాసీతా! అని మాటిమాటి కిట్లు విలపించుచు, శ్రీరామచంద్రుఁడొకవనమునుండి మఱియొకవనమునకుఁ బరుగులిడుచు నొక్కొట (అనఁగాఁ బోలిక యేదియు దొరకనప్పుడు) శోకవేగమువలన సీత కనఁబడినట్లు భ్రమించుచుండెను. మఱొక్కట (అనఁగా నామె శరీరాదులకుఁ బోలిక లగు లతలు మొదలగునవి కనఁబడినప్రుడు) సాదృశ్యబలమువలన సీత కనఁబడె నని భ్రమించుచుండెను.

---

లగు భక్తులయందు శాంతరసము బాగుగాఁ దెల్పఁబడినవి. ఇంతవరకుఁ గల మహాకావ్యలక్షణములన్నియు శ్రీరామచంద్రునిచేఁ జూపఁబడినవియు, శ్రీరామాయణగ్రంథమున బాగుగా వర్ణింపఁబడినవియు. అందుచే నిదియే యాదికావ్యము. కవులందరికి ముఖ్యమైన యాధారము; శ్రీరామచంద్రుఁడే సర్వోత్తమనాయకుఁడు; అని సిద్ధించినది.

క్వచి దుద్భ్రమతే వేగా త్క్వచి ద్విభ్రమతే బలాత్
క్వచి న్మత్త ఇ వాభాతి కాంతాన్వేషణతత్పరః. ౩౧
1 ఉవాచ రామః ప్రాక్రుశ్య ప్రగృహ్య రుచిరా భుజా
కే నాహృతావా సౌమిత్రే! భక్షితా కేన వా ప్రియా.
సీతయా రహితో ఽహం వై నహి జీవామి లక్ష్మణ!
మృతం శోకేన మహతా సీతాహరణజేన మాం. ౩౩
పరలోకే మహారాజో నూనం ద్రక్ష్యతి మే పితా. ౩౩½

కథం ప్రతిజ్ఞాం సంశ్రుత్య మయా త్వ మభియోజితః. ౩౪
అపూరయిత్వా తం కాలం మత్సకాశ మిహాగతః
ధిక్త్వా మితి పరే లోకే వ్యక్తం వక్ష్యతి మే పితా. ౩౫
2స్వర్గోఽపి సీతయా హీన శ్శూన్య ఏవ మతో మమ. ౩౫½
యా మిహోత్సృజ్య హి వనే గచ్ఛాయోధ్యాంపురీం శుభాం.
న త్వహం తాం వినా సీతాం జీవేయం హి కథంచన. ౩౬½
గాఢ మాశ్లిష్య భరతో వాచ్యో మద్వచనా త్త్వయా. ౩౭
అనుజ్ఞాతో ఽసి రామేణ పాలయేతి వసుంధరాం. ౩౭½

అంబాచ మమ కైకేయీ సుమిత్రాచ త్వయా విభో. ౩౮
కౌసల్యాచ యథాన్యాయ మభివాద్యా మమాజ్ఞయా
రక్షణీయా ప్రయత్నేన భవతా సోక్తకారిణా. ౩౯

---

రామాయణగ్రంథే తస్మాదిద మేవాదికావ్యమ్ పరం కవీనా మాధారం శ్రీరామ ఏవ సర్వోత్తమనాయక ఇతి సిద్ధ్యతి.

---

1. వాల్మీకి రా. ౬౧. 2. వాల్మీకి రా. ౬౨ స.



కొండొకచో నేమియుఁ గోపక మత్తెక్కినవానివలె భార్యను వెదకుటయందే దగుల్కొని తత్తరపాటు చెందుచుండెను.

౩౨-౩౩½ మఱియు శ్రీరామచంద్రుఁడు, సీతా! యని గట్టిగా గొంతెత్తి సుందరములైన తనబాహువులు చాచి, పిలుచుచు నిట్లనియె. లక్ష్మణా! ఎవనిచేనైన నాప్రియురా లగు సీత హరింపఁబడెనా? లేక యెవ్వనిచేనైన భక్షింపఁబడెనా? సీతగాన లేనిచో నేను బ్రతుకఁజాలనుగాదె? సీతావియోగశోకము పెల్లునఁ బ్రాణములు వాసిన నన్నుఁ, బరలోకమున నాతండ్రి దశరథమహారాజు తప్పక చూడఁగలఁడు.

౩౪-౩౫ నాచే నియోగింపఁబడి, పదునాల్గేం డ్లరణ్యవాసము చేయుదునని ప్రతినపట్టి యాసమయము పూర్తిచేయకయే నాకడ కిట్లేల వచ్చితి వని పరలోకమున నున్న నాతండ్రి స్పష్టముగా నిందింపఁగలఁడు.

౩౫½ సీతలేనిచో నాకు స్వర్గలోకమైనను శూన్యమైనదిగా నే తోఁచును.

౩౬-౩౬½ లక్ష్మణా! న న్నియడవిం బోవిడిచి, నీవు శుభమైన యయోధ్యానగరమున కరుగుము. నే నాసీత లేనియెడ నెట్లును జీవింపను.

౩౭-౩౭½ బిగికౌఁగిలిం జేర్చుకొని భరతుని నామాటగా నిట్లనుము "భరతా! ఈభూమిని నీవే పాలింపుము! శ్రీరామచంద్రునిచే న ట్లనుజ్ఞాతుఁ డ వైతివి" అని.

౩౮-౩౯ నాతల్లి కైకేయియు, సుమిత్రయుఁ, గౌసల్యయు యథాన్యాయముగా నీచే నమస్కరింపఁబడి నాయానతిచొప్పున నే నెట్లన్న నట్లు చేయు నీచేఁ బ్రయత్నపూర్వకముగాఁ గాపాడఁ దగుదురు.

1 పూర్వం మయా నూన మభీప్సితాని పాపాని కర్మాణ్యసకృత్కృతాని, తత్రాఽయ మద్యాఽపతితో విపాకో దుఃఖేన దుఃఖం య దహం విశామి. ౮౦

రాజ్యప్రణాశ స్స్వజనై ర్వియోగః పితు ర్వినాశో జననీ వియోగః, సర్వాణి మే లక్ష్మణ! శోకవేగ మాపూరయంతి ప్రవిచింతితాని. ౮౧

అస్మి న్మయా సార్థ ముదారశీలా శిలాతలే పూర్వ ముపోపవిష్టా, కాంతా స్మితా లక్ష్మణ! జాతహాసా త్వా మాహ సీతా బహువాక్యజాతం. ౮౨

* ఇతీవ తం శోకవిధేయదేహం రామం విసంజ్ఞం విలపంత మేవం, ఉవాచ సౌమిత్రి రదీనసత్త్వో న్యాయే స్థితో కాలహితంచ వాక్యం. ౮౩

* ఇతీతి-విసంజ్ఞ మివ విలపంత మిత్యర్థః. ఏవం శోకకరణం చారద్వారా శ్రవణేన రావణస్య మనుష్యత్వబుద్ధిదార్ఢ్య పూర్వకం స్వవధ్యత్వ సంపాదనాయేతి బోధ్యం. తదుక్తం బ్రహ్మండపురాణే శ్లో॥ స్త్రీపుంమలానుషంగాత్మా దేహో నాస్య విజాయతే, కింతు నిర్దోషచైతన్యం సుఖనిత్యాం స్వకాం తనుం. ప్రకాశయతి సైవేయం జని ర్విష్ణోర్న చాపరా, తథా ప్యసురమోహార్థం పరేషాంచ క్వచి త్క్వ

1. వాల్మీకి రా. ౬౩ స.



౮౦ నిజముగా నేను బూర్వజన్మమున నెన్నో పాపకర్మములను గోరి చేసియున్నవాఁడను. అందుచే నేఁటి కాపాపకర్మములకుఁ బరిపాకదశ సంప్రాప్తమైనది (ఆకర్మ రాజ్యభ్రంశారణ్యావాస సీతావియోగాది రూపములుగా కార్యోన్ముఖము లయ్యెననుట). ఇట్లొక దుఃఖము వెంట మరియొకదుఃఖమున నేను మునుఁగుట కదియే కారణము.

౮౧ (ఆదుఃఖము లెవ్వియన) తొలుత రాజ్యభ్రష్టత, ఆప్తజనుల యెడ బాటు, తండ్రి చనిపోవుట, తల్లి దూరమగుట లక్ష్మణా! ఇట్లు తలఁపునఁ బడినకొలఁది సర్వమును శోకవేగమును నిండించుచున్నవి (శోకరాశిని బాగుగాఁ బెంచుచున్న వనియుఁ జెప్పనగును).

౮౨ లక్ష్మణా! చూడుము. ఈకనఁబడు ఱాతిపై ము న్నాయుదార స్వభావము కల సీత నాతోఁగలిసి కూర్చుని సహజముగా మనోహర మగు చిఱునగవు గల జానకి నవ్వుచు నెన్నో పలుకులు నీతో ముచ్చటించెను.

౮౩ ఇట్లు శోకపరవశమైన దేహముకలిగి *చేష్టలు దక్కి విలపించు శ్రీ రామచంద్రునిం గని దీనముగాని ధైర్యముకల లక్ష్మణుఁ డప్పటి కాలమునకుఁ దగినమాట నిట్లు పలికెను.

* చేష్టలుదక్కి విలపించువాఁడు అనఁగాఁ జేష్టలు దక్కినవానివలె విలపించువాఁ డని యర్థము. ఇట్లు శోకించుట, చారునిమూలమున విను రావణునకు రాముఁడు మనుష్యుఁ డను బుద్ధి దృఢమై తా నాతనిచేఁ జచ్చువాఁడుగా నగుట కని గ్రహించునది ఆవిషయమే బ్రహ్మండ పురాణమున శుద్ధసద్గుణుం డగు పరమాత్మకు, స్త్రీపురుషరూపమైన మలినరూప మగు దేహము లేదు. ఇఁక నేమన, ఏదోషములు లేని చైతన్యము నిత్యసుఖరూపమగు తన చిదాకారశరీరమును బ్రకాశింపఁజేయును. అదియే యీతనికిఁ బుట్టుక యగు నంతియే కాని వేరు జన్మము లేదు. అయినను అసురుల, మఱి యితరుల నప్పుడప్పుడును మోహింపఁజేయుటకై దుఃఖమును, అజ్ఞానమును, శ్రమను, యీ మొదలగువానిని శుద్ధసద్గుణుఁ డగు బరమాత్మ చూపుచుండును.

శోకం విముంచార్య! ధృతిం భజస్వ సోత్సాహతా
చాస్తు విమార్గణే ఽస్యాః, ఉత్సాహవన్తో హి నరా న
లోకే సీదంతి కర్మ స్వతిదుష్కరేషు. ౪౪

---

చిత్. దుఃఖాజ్ఞానశ్రమాదీంశ్చ దర్శయే చ్ఛుద్ధసద్గుణః, క్వ వ్రణాది క్వ చాజ్ఞానం స్వతంత్రాచింత్య సద్గుణే. మోక్షాభావాయ తేషాంతు దర్శయత్తా సజో హరిరితి. తథాహి యః కశ్చి ద్బ్రహ్మణో మ్లేచ్ఛవేషధారీ స్యాత్తర్హి బ్రాహ్మణ్యం తం యథా న త్యజ్యత్తే తద్వ చ్ఛ్రీరామః మానుషవేషధారణం కృత్వా శోకమోహాదీ న్ రావణాదీనాం ప్రదర్శయితేవ పరిదృశ్యమానోఽపి సాక్షా త్పరమాత్మభావం న త్యక్ష్య తేతి భావః. ఏతేన రావణ స్యేశ్వరత్వబుద్ధి ప్రతిబంధేన మోక్షాభావోఽపి శోకఫల మిత్యుక్తం. ఏవం రావణద్వారా సీతాహరణ మపి తత్పుణ్యాతిశయనాశేన వధ్యతాసంపాదనాయ తథాచ కేదారఖండే - ఉక్తాఖ్యాయికా—మహతా తపసా లబ్ధబలో రావణ స్తదధికతపోబలం వినా జేతు మశక్తా దేవాశ్చ స్వయం తదధికం తపః కర్తు మక్షమా. అత



౪౪ ఆర్యా! శ్రీరామచంద్రా! శోకము విడువుము. ధైర్యముం బొందుము. సీతను వెదకుటలో నుత్సాహవంతుఁడ వగుము. లోకమున నుత్సాహవంతు లగు మానవు లెట్టి దుష్కరకార్యములయందైనను దుఃఖము పొందరు.

---

ఎక్కడిదుఃఖములు, ఎక్కడియజ్ఞానము? స్వతంత్రుఁడును, నూహింప శక్యముగాని సద్గుణములు కలవాఁడు నగు పరమాత్మయం దవేవియు లేవు. అజుఁడు, హరి యారక్కసులకు మోక్షము కలుగకుండుటకు దుఃఖాదులను వారికిఁ జూపెను.

ఎట్లుగా, నొకానొక బ్రాహ్మణుఁడు మ్లేచ్ఛునివేషము వేసికొన్నను నయ్యెడ నాతనిని బ్రాహ్మణధర్మ మెట్లు విడువదో, అట్లే శ్రీరామచంద్రుఁడు మనుష్యవేషమును ధరించి, శోక మోహాదిగుణములను, రావణాది రాక్షసులకుఁ జూపినట్లు కనఁబడినను, సాక్షాత్పరమాత్మభావమును విడువ లేదని భావము. దీనిచే రావణునకు రాముఁడు భగవంతుఁ డనుబుద్ధి కద్దు తగులునదై, వానికి మోక్షము లేకుండఁ జేయుటయే రాముని శోకనటనమునకు ఫలిత మని చెప్పఁబడెను. ఇట్లే రావణునిమూలముగా సీతను హరింపఁజేయుటయు, వానిపుణ్యము నశింపఁజేసి, చావు చేకూర్చుటకొఱకే. అట్లే కేదారఖండమున నొక ఆఖ్యాయిక కలదు "గొప్పతపస్సుచే బలమొందిన రావణుఁడు అంతకు మీరిన బలములేనిదే జయింప శక్యముగాఁడు; దేవతలైనఁ దమంత నంతకు మీరిన తపస్సుచేయుటకు సమర్థులు కారు; అందుచే వారికిఁ జేయఁదగ్గకార్యము-'మిక్కిలి యనుచితమైన సీతను హరించు పనిని జేకూర్చి రావణుని తపస్సును, వీర్యమును నాశనము చేయుటయే' యని శ్రీమహాలక్ష్మితోఁగూడ విచారణసేసి, యందులకే శ్రీమహావిష్ణువు బ్రహ్మవిద్యాస్వరూపిణి యగు సీతతోఁగూడ యవతరించెను" అని.

ఈవిషయమే స్కాందపురాణమున మహేశ్వర ఖండమున శ్రీమహావిష్ణువు దేవతలతో "నేను మనుష్యుఁడనై యజ్ఞానముచే నావరింపఁబడి, యయోధ్యానగరమున దశరథుని యింటఁ బుట్టెదను. రావణుఁ

ఇతీవ సౌమిత్రి ముదగ్రపౌరుషం బ్రువంత మార్తో రఘు
వంశవర్ధనః, నచింతయామాస! ధృతిం విముక్తవా న్పునశ్చ
దుఃఖం మహ దభ్యుపాగమత్. ౪౫

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
చతుర్దశ స్సర్గః.



పదునేనవసర్గము.

[1] ఉవాచ లక్ష్మణో జ్యేష్ఠం ధీమాన్ భ్రాతర మార్తవత్. ½

క్వ సీతేతి త్వయా పృష్టా యథే మే సహసోత్థితాః. ౧

దర్శయంతి క్షితించైవ దక్షిణాంచ దిశం మృగాః
సాధు గచ్ఛావహై దేవ! దిశ మేతాంహి నైరృతిం. ౨

యది స్యా దాగమః కశ్చి దార్యావా సాఽథ లక్ష్యతే
బాఢ మిత్యేవ కాకుత్స్థః ప్రస్థితో దక్షిణాం దిశం. ౩

లక్ష్మణానుగత శ్శ్రీమా న్వీక్ష్యమాణో వసుంధరాం
తాం పుష్పవృష్టిం పతితాం దృష్ట్వా రామో మహీతలే. ౪

స్తేషాం కార్య మత్యంతానుచితసీతాహరణవృత్తిసంపాద
నేన రావణస్య తపోవీర్యభ్రంశం సంపాద్య కర్తవ్యం.

1. వాల్మీకి రా. ౬౪ స.



౪౫ ఇట్లు పలికెడు నఖండపౌరుషశాలి యగు లక్ష్మణునిసరకుసేయక (గణింపక) దుఃఖార్తుఁడై రఘువంశవర్ధనుఁ డగు శ్రీరామచంద్రుఁడు ధైర్యము వాసెను. మరియు నెడ తెగని దుఃఖమును బొందెను.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమునఁ
బదునాల్గవ సర్గము.



పదునేనవసర్గము.

½ లక్ష్మణుఁడు బుద్ధిమంతుఁడు; పెద్దన్న యగు శ్రీరామచంద్రునితో దుఃఖకర మగు నీమాట పల్కెను.

౧-3 శ్రీరామచంద్రా! సీత యెక్కడ నున్నది? అని నీ వడుగఁగా నీమృగములు లేచి (పరుగిడి) భూమిని, దక్షిణఁపుదెసను సూచించు చున్నవి. మంచిదే! మన మీనైఋతిదిశగాఁ (దక్షిణపశ్చిమదిశల నడుమగా ననుట) బోవుదము. సీత కనఁబడు నుపాయము లభింప వచ్చును. మఱి యామెయే కనఁబడవచ్చును. నావిని శ్రీరామ చంద్రుఁడు దక్షిణఁపుదెసగా బయలుదేరెను.

౪-౪½ (సీతను బొందు నుపాయముం గనుటచే) శోభాన్వితుఁ డగు శ్రీరామచంద్రుఁడు లక్ష్మణుఁడు వెంటరాఁగాఁ బుడమిని జూచుచు, మున్ను ధరణీతలమునఁ బడిన యాపుష్పవర్షమును (అనఁగా రావణుఁడు గొంపోవునపుడు సీతకొప్పునుండి జారిన పూవుల ననుట)

డు భక్తుఁడు. సాక్షాదీశ్వరధ్యానతత్పరుఁడు. ఆపురుషుఁడు మహాతపస్సంపన్నుఁడై యెప్పుడు బ్రహ్మవిద్యను బొందఁగోరునో; అప్పుడు వాఁడు ధర్మబలముచే గెలువఁబడి సులభముగా లొంగి పోవును.

ఉవాచ లక్ష్మణం వీరో దుఃఖితో దుఃఖితం వచః. ౪½

అభిజానామి పుష్పాణి తానీమానీహ లక్ష్మణ! ౫
పినద్ధానీహ వైదేహ్యా మయా దత్తాని కాననే. ౫½

1 తతో గవ్యూతిమాత్రేణ గత్వా రామ స్సలక్ష్మణః. ౬
సీతోత్తరీయం పతితం దృష్ట్వా లక్ష్మణ మబ్రవీత్. ౬½

ద్యూతే పణం ప్రణయకేళిషు కంఠపాశః క్రీడాపరిశ్రమ
హారం వ్యజనం రతాంతే, శయ్యానిశీథకలహే హరిణేక్ష
ణాయాః ప్రాప్తం మయా విధివశా దిద ముత్తరీయం. ౭-౭½

హారో నారోపితః కంఠే మయా విచ్ఛేద భీరుణా. ౮
ఇదానీ మావయో ర్మధ్యే సరిత్సాగరభూధరాః. ౮½

2 ఏవ ముక్త్వా మహాబాహుం లక్ష్మణం పురుషర్షభః. ౯
ఉవాచ రామో ధర్మాత్మా గిరిం ప్రస్రవణాకులం. ౯½

* కచ్చిత్క్షితిభృతాం నాథ! దృష్టా సర్వాంగసుందరీ. ౧౦
రామా రమ్యవనోద్దేశే మయా విరహితా త్వయా. ౧౦½

*కచ్చి దితి-క్షితిభృతాం నాథ! పర్వతశ్రేష్ఠ! సర్వాంగసుందరీ

1. హనుమద్రామాయణం. 2. వాల్మీకి రా. ౬౪ స.



జూచి, వీరుఁ డగు నతఁడు దుఃఖితుఁడై దుఃఖకరమైన యీ మాటను లక్ష్మణునితో ననెను.

౫-౫½ లక్ష్మణా! మున్నరణ్యమున నే నివ్వఁగా సీత తనకొప్పులో ముడిచికొన్న యాపువ్వులే యిటనున్న యీపువ్వు లని తెలిసికొనుచున్నాను.

౬-౬½ అని పిమ్మట శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునితోఁగూడ రెండు క్రోసులదూర మేగి క్రిందపడి యున్న సీతాదేవి పైవలువం గాంచి లక్ష్మణుం గని యిట్లనియె.

౭-౭½ లక్ష్మణా! ఇది సీతయొక్క యుత్తరీయము; నేనును, సీతయుఁ గలిసి యాడుకొను జూదమున నొడ్డెడు పందె మిదియే. ప్రణయ కోపమునఁ గంఠమునకుఁ బెట్టుకొను పాశము. రతాంతమున శ్రమ వాయుటకు నాకు వేయఁబడు విసనకఱ్ఱ. రాత్రివేళఁ దటస్థించు పొలయలుకను శయ్య. ఆహరిణేక్షణ యుత్తరీయము దైవవశమున నిట లభించెను.

౮-౮½ మాయిరువురకు నడుమ నామాత్రఁపు నెడబాటైనఁ గలుగుట కోర్వలేనికతమున, ముత్యాలహారమైన నామె మెడలో వేయఁబోను. అట్టిచో మా కిరువురకునడుమ నిప్పుడు నదులు, సముద్రములు, పర్వతములుకూడ నున్నవి. అనఁగా దేశాంతరసంచారమూలమున నెనలేని దుర్దశ పట్టె నని యర్థము.

౯-౯½ ఇట్లు పురుషశ్రేష్ఠుండగు శ్రీరామచంద్రుఁడు మహాబాహుం డగు లక్ష్మణునితోఁ బలికి, ధర్మాత్ముం డగు నతఁడు సెలయూటలచే నాకులమైన యొకపర్వతముం గని యిట్లనియె.

౧౦-౧౦½ * క్షితిభృదగ్రణీ! సర్వావయవసుందరి యగు కాంత నన్నెడఁ బాసినదై యీపై యడవియం దెందేని కన్పట్టెనా?

* క్షితిభృతాం నాథ! ఓ పర్వతరాజమా! సర్వాంగసుందరీ = ప్రత్యవయవమునందు శోభ గలది. మయావిరహితా = నాతో వియోగము

క్రుద్ధో ఽబ్రవీద్గిరిం తత్ర సింహః క్షుద్రమృగం యథా. ౧౧

తాం హేమవర్ణాం హేమాభాం సీతాం దర్శయ పర్వత!
యావత్సానూని సర్వాణి న తే విధ్వంసయా మ్యహం. ౧౨

ఏవ ముక్తస్తు రామేణ పర్వతో మైథిలీం ప్రతి
శంసన్నివ తత స్సీతాం నాదర్శయత రాఘవే. ౧౩

1 తతో వృక్షా న్పర్వతస్థా నువాచ రఘునందనః. ౧౩½

భో వృక్షాః! పర్వతస్థా బహుకుసుమయుతా వాయునా ఘూర్ణమానా, రామో ఽహం వ్యాకులాత్మా దశరథతనయః పృచ్ఛతే శోకదగ్ధః, బింబోష్ఠీ చారునేత్రా గజపతిగమనా దీర్ఘకేశీ సుమధ్యా, హా సీతా కేన నీతా మమ హృదయగతా కేన వా కుత్ర దృష్టా. ౧౪-౧౪½

ప్రత్యవయవశోభాయుక్తా మయా విరహితా రామా రమ్యవనోద్దేశే త్వయా దృష్టా కచ్చిత్? అస్యైవ ప్రశ్నస్యావృత్త్యా యోజనే ఇద మేవోత్తరం. క్షితిభృతాం నాథ! క్షత్రియశ్రేష్ఠ! త్వయా విరహితా సర్వాంగసుందరీ రామా రమ్యవనోద్దేశే మయా దృష్టా కచ్చిత్. కచ్చి త్కామప్రవేదనే. మయా దృష్టేదమేవ మమాత్యంతాభిమత మిత్యర్థః. అత్ర ఏకస్యైవ వాక్యస్య ప్రశ్నోత్తరరూపత్వా చ్చిత్రాలంకారధ్వనిః- 'కృతప్రశ్నోత్తరా భిన్న ముత్తరం చిత్ర ముచ్యతే' ఇతి లక్షణాత్.

1. హనుమద్రామాయణం.



౧౧ ఇట్లు కుపితుఁ డగు శ్రీరామచంద్రుఁడు సింహము నీచమృగము తోవలె నాపర్వతమునుగూర్చి పలికెను.

౧౨ ఓ పర్వతమా! నీచరియల నేను నాశనము చేయకుండునంతలో బంగరుమేనిచాయగల యాసీతను జూపుము.

౧౩ అని యిట్లు సీతాదేవింగూర్చి రామునిచే బ్రశ్నింపఁబడి పర్వతుఁడు-

౧౩½ అటుపై రాఘవుఁడు చెట్లను బర్వతములను గూర్చి యిట్లు పలికెను.

౧౪-౧౪½ వివిధకుసుమములతో నిండి, వాయువుచేఁ గదలింపఁబడుచుఁ పర్వతములం దున్న ఓవృక్షములారా! దశరథకుమారుఁడ, రాముఁడ నేను శోకమున దగులువడి, కలవలపాటు నొంది యడుగుచున్నాను. దొండపండువంటి యధరమును, జక్కనికన్నులు, గజరాజువంటినడకయు, నిడుదలైనకురులును, సన్నినడుమును గల సీత నాహృదయమం దుండిన దెవ్వనిచేతనో గొంపోఁబడెను. ఆమె నెవఁడైన, నెక్కడైనఁ జూచెనా?

నందినది. రామా = స్త్రీ. రమ్య మగు నీయడవి పైప్రదేశమునఁ గన్పట్టెనా? అను నీప్రశ్ననే త్రిప్పికూర్చిన నిదియే సమాధానమగును క్షితిభృతాం నాథ! = భూభర్తలకు నాయకుఁడా! అనఁగా నృపశ్రేష్ఠా! నీతో వియోగము పొందిన సర్వాంగసుందరియగు కాంత రమ్య మగు నీయడవిప్రదేశమున నాకుఁ గనఁబడియే యుండెను. ఇట నొకేవాక్యము ప్రశ్నోత్తరరూపమున నుండుటచే నిది చిత్రాలంకారధ్వని. అడిగిన ప్రశ్నమును దానికి సరిపడు జవాబును యొకేవాక్యమున నున్నచో నది చిత్రాలంకారము. అడుగఁబడిన ప్రశ్నమునకు భేదింపని జవాబు నిచ్చుట చిత్రము అని లక్షణము.

హేగోదావరి! రమ్యవారిసుభగే! దృష్టా త్వయా జానకీ
సా హర్తుం కమలాని కిం గతవతీ యాతా వినోదాయవా
ఇత్యేవం.—ప్రతిపాదపం ప్రతిపథం ప్రత్యాపగం ప్రత్య
గం, ప్రత్యేణం ప్రతిబర్హిణాం తత ఇత స్తాం యాచతే
మైథిలీం. ౧౫-౧౫౪

మధ్యం కేసరిభి స్స్మితం చ కుసుమై ర్నేత్రే కురంగీగణైః
కాంతి శ్చంపకకుట్మలైః కలరుతం హాహారుతం కోకిలైః
వల్లీభి ర్లలితం గతిః కరివరై రిత్థం విభజ్యాంజసా
కాంతారై స్సకలై ర్విలాసపటుభి ర్నీతా౽సి కిం మైథిలి! ౧౬-౧౬౪

[1] దుఃఖితం రాఘవం దృష్ట్వాశ్రమాచ్చారా స్తతో గతాః. ౧౭

ఏతస్మి న్నంతరే తత్ర శివో దాక్షాయణీయుతః
లోకానాం పాలనార్థాయ పర్యట న్వ్యాంబరే స్థితః. ౧౮

తతో దృష్ట్వా రఘుశ్రేష్ఠం గా ర్యువాచ మహేశ్వరం
కో౽సౌ మదనసంకాశః కి మర్థం దుఃఖ మీదృశం. ౧౯

తా మాహ శంకరో దేవి! రామ స్సాక్షా త్పరాత్పరః
పునః ప్రోవాచ దేవేశం శంకరం సా౽పి సంశయాత్. ౨౦

1. ఆనందాది రామాయణంసారం.



౧౫-౧౫ ఓగోదావరీ! నీటిచే సుందరమైనదానా! నీకు జానకిఁ గనఁ
బడెనా? ఆమె తామరపూలఁ దెచ్చుటకని వచ్చెనా? లేక విలాస
ముగానే వచ్చెనా? అని యీరీతిగ నన్ని చెట్లను, అన్ని బాటలను,
అన్ని నదులను, అన్ని పర్వతములను, అన్ని లేళ్లను, నెమళ్లను అందం
దామిథిలాధిపుకూఁతురుం గూర్చిన జాడఁ దెలుపుఁ డని యాచిం
చెను.

౧౬-౧౬౪ సింగములచే నడుము, పూవులచే చిఱునగవు, లేళ్లకదుపులచేఁ
గన్నవ, సంపెంగమొగ్గలచేఁ దనుకాంతియుఁ, గోకిలలచే నవ్యక్తధ్వని
కల హాహాకారము, లతలచే సుకుమారత్వముచేఁ గలుగు నంగవిన్యాస
రూప మగు శృంగారచేష్టలు, గజశ్రేష్ఠములచే నడకయు; ఈవిధ
ముగా సొగసంతయు నాయావానియందు విభజించి చక్కని విలాస
ముల జూపుటయందు సమర్థము లగు నీ వన్యములచేఁ గొంపోఁ
బడిన దానవా! జానకీ!

౧౭ ఇట్లు వాపోవు రామునిం గాంచి రావణునిగూఢచారు లటనుండి
వెళ్ళిపోయిరి.

౧౮ ఇంతలో నటకు శివుఁడు పార్వతీసహితుఁడై లోకములను బాలిం
చుటకై యందందు సంచారముచేయుచు వచ్చి యాకసమున నుండెను.

౧౯ అయ్యెడ శ్రీరామచంద్రుని గాంచి పార్వతి పరమేశ్వరునితో
నెవ్వఁ డీతఁడు మన్మథున ట్లున్నవాఁడ? ఇతని కిట్లీ దుఃఖ మేల
కల్గెను? అనెను.

౨౦ ఆమెతో శ్రీశంకరులు, దేవీ! ఇతఁడు సాక్షాత్పరాత్పరుఁ డగు
శ్రీరామచంద్రుఁ డని పల్కెను. ఆమెయు మరల సందియ మంది
దేవేశుం డగు శంకరుం గని యిట్లనియె.

శంభో! రోదనకృ ద్ధరిః పరతరో రామః కథం స్యా ద్వద

శివః—

త్వం దేవి! ప్రకృతౌ స్థితం రఘువరం శీఘ్రం పరీక్ష్యాఽఽవ్రజ,

కుశీలవౌ—

సీతారూప మవాప్య సా రఘువరస్యాభ్యాశగాత్తాం తదా
జ్ఞాత్వా లక్ష్మణ మిత్యువాచ భగవా న్రామో హరి శ్చి
న్మయః. ౨౧

ఆవాం చైకప్రదేశే తాం సీతాం మృగయత స్త్వలం
ప్రత్యేకం గిరి మావృత్య సీతాం మృగయ లక్ష్మణ! ౨౨
తథేతి స గత; స్తత్ర గౌరీం దృష్ట్వా ఽహ రాఘవః
దాక్షాయణి! పరే! సాధ్వి! కి మిదం రూప మీదృశం. ౨౩
శివే నోక్తం మృషా న త్వం సంశయం త్యజ మాం భజ
తచ్ఛ్రుత్వోవాచ సా గౌరీ మాయామానుషవిగ్రహం. ౨౪
రామ, రామ! మహాబాహో! మాం క్షమస్వ దయానిధే!
జ్ఞాతం త త్త్వ మిదానీం తే దర్శనా చ్ఛినభావితం. ౨౫

తతో రామో నిజం రూపం సర్వదేవాత్మకం స్వకం
భవాన్యై దర్శయామాస సాపి నత్వా యయౌ పతిం. ౨౬
పునశ్చ శంకితా శ్చారా స్సర్వే రామం సమాశ్రితాః
లక్ష్మణో ఽపి సమాయాతో గిరి మావృత్య తత్ర వై. ౨౭

రామే విరహతాపేన స్మృతివిభ్రమగే తదా
రామలక్ష్మణసంవాద ఏవ మాసీ న్మహాద్భుతం. ౨౮



శ్రీరామజయమ్.





శ్రీరామవిశ్వరూపసందర్శనము

శ్లో॥ తతో రామశరీరే సా గౌ ర్యపశ్య చ్చరాచరం
ఆదిత్యా న్వసూన్ రుద్రాన్ సాధ్యాంశ్చ సమరుద్గణాన్
పితౄన్ హుతాశనాం శ్చైవ నక్షత్రాణి గ్రహాం స్తదా
విద్యుతో మేఘబృందాని దృష్ట్వా నత్వా యయౌ పతిమ్.

౨౧ పార్వతి :—'శంభూ ! పరాత్పరుండును హరియు నగు రాముం డేడ్చువాం డెట్లగును ? తెల్పుము'—అన
శివుండు :—దేవీ ! పార్వతీ ! ప్రకృతియం దున్న రఘురాముని నీవు వేగమ పరీక్షించి మఱల రమ్మ! అనెను.
అంత నాపార్వతీదేవి సీతారూపమును బొంది శ్రీరామచంద్రుని సామీప్యమున కరిగెను.
ఆమె నప్పుడు చిన్మయరూపుండును హరియు నగు శ్రీరామచంద్ర భగవాను లెక్కింగి లక్ష్మణునితో నిట్లనిరి.

౨౨ లక్ష్మణా ! మన మిద్దర మొకేచోటున వెదకుట యింకం జాలును. నీవు ప్రత్యేక మొకపర్వతము నాక్రమించి యామెను వెదకుము.

౨౩-౨౪ అంత సరియే యని లక్ష్మణుం డేగెను. రాఘవుం డాసీతా రూపిణి యగు గౌరిం గని, పరాశక్తీ ! దాక్షాయణీ ! సాధ్వీ ! ఇట్టి యీరూప మేమి ? శివుం డిపుడు పల్కినమాట సత్యము. నీవు సంశయము విడువుము. నన్ను సేవింపుము. నా విని యాగౌరి మాయామానుషాకారుం డగు రామునితో ని ట్లనియె.

౨౫ శ్రీరామచంద్రా ! రఘురామా ! మహాబాహూ ! దయానిధీ ! నన్ను క్షమింపుము. శివునిచే భావింపంబడిన తత్త్వము నీ దర్శనముచే నిప్పుడు నాకుం దెలిసినది.
౨౬ పిమ్మట శ్రీరాముండు సర్వదేవతాస్వరూపమైన తన నిజస్వరూపమును నా భవానికిం జూపెను. ఆమెయు నమస్కరించి భర్తయగు నీశ్వరునికడ కరిగెను.
౨౭ మఱల మున్నుం బోయిన రావణుని గూఢచారు లందరును రాము నింగూర్చి శంకితులై వచ్చి రాము నాశ్రయించి యుండిరి. లక్ష్మణుండును బర్వతమెల్లం జుట్టుముట్టి తిరిగివచ్చెను.
౨౮ అప్పుడు శ్రీరాముండు (సీతా)విరహతాపముచే, జ్ఞప్తిచెడి కళవలపాటు నొందంగా, నద్భుతముగా రామలక్ష్మణుల కిట్లు సంవాదము జరిగెను—

1 కే యూయం—

రఘునాథనాథ! కి మిదం భృత్యోఽస్మి తే లక్ష్మణః—

కోఽహం వత్స! వ దా—

ర్య ఏవ హి భవా—

నార్యస్స కో—

రాఘవః,

కిం కుర్మో విజనే వనే—

తత ఇతో దేవీ సమన్విష్యతే,—

కా దేవీ—

జనకాధిరాజతనయా—

హాజానకి! క్వా ఽసి మే. ౨౯

చంద్రార్ధశేఖరశరాసన మద్రిసారం మీనధ్వజస్య మయి

చాపవికర్షణంచ, శౌర్యస్మయం భృగుపతేశ్చ స

మాపయంతీ లబ్ధాచ సుందరి! మయాఽలఘు నోద్యమేన. ౩౦

2 ఇత్యేవం విలపన్నేవ రామ స్సీతాం న కుత్రచిత్

సర్వజ్ఞ స్సర్వథా క్వాఽపి నాపశ్య ద్రఘునందనః. ౩౧

ఆనందో ఽప్యన్వశోచ త్తా మచలో ఽప్యనుధావతి

నిర్మమో నిరహంకారో ప్యఖండానందరూపవాన్. ౩౨

మమ జాయేతి సీతేతి విలలాప సుదుఃఖితః. ౩౨½

1. హనుమద్రామాయణం. 2. అధ్యాత్మరా. ౮ సర్గ.



౨౯ రా—మీ రెవ్వరు?

ల—రఘువంశకులసార్వభౌమా! ఏమి? నేను నీకు దాసుఁడను, లక్ష్మణుఁడను.

రా—వత్సా! నే నెవ్వఁడను జెప్పుము?

ల—నీ వార్యుఁడవే! (పూజ్యుఁడ వగు నాయన్న వే యనుట)

రా—ఆ యార్యుఁ డెవ్వడు?

ల—రాఘవుఁడు.

రా—విజన మగు నీయడవి నేమి చేయుచున్నాము?

ల—ఇచ్చ టచ్చట దేవి వెదుకఁబడుచున్నది.

రా—దేవి యెవరు?

ల—జనక రాజకుమారిక.

రా—హా! నాజానకీ! ఎచట నున్నావు?

౩౦ చంద్రశేఖరుని పర్వతముతో సమాన మగు బలముగల ధనస్సును, నా యెడ మదనుఁడు ధనువు నెక్కిడుటను, పరశురాముని శౌర్య గర్వ మును నను వీనిని వారింపఁజేయఁగలదై ఆసుందరి జానకి అత్యధిక మగు ప్రయత్నముచే నాకు లభ్యమైనది.

౩౧ అని యిట్లు విలపించుచునే, సర్వజ్ఞుఁడయ్యు, రఘువర్ధనుఁ డగు శ్రీరామచంద్రుఁడు సీత నెందును గనుఁగొనలేకపోయెను.

౩౨-౩౨½ ఆనందస్వరూపుఁ డయ్యు నా మెంగూర్చి శోకించెను. చలనము లేనివాఁడయ్యు నామెం గూర్చి పరువులు వెట్టెను. అహంకార మమకారములు లేని యంఖడానందస్వరూపుఁ డయ్యు నాకు భార్య సీత యని మిగుల దుఃఖాక్రాంతుఁడై యేడ్చెను.

* ఏవం మాయా మనుచర న్నసక్తో ఽపి రఘూత్తమః. 33
ఆసక్త ఇవ మూఢానాం భాతి తత్త్వవిదాం నహి. 33½

తతో విచిన్వ న్సకలం వనం రామ స్సలక్ష్మణః. 34
భగ్నం రథం ఛత్రచాపం కూబరం పతితం భువి.
దృష్ట్వా లక్ష్మణ మాహేదం పశ్య లక్ష్మణ! కేనచిత్. 35
నీయమానాం జనకజాం తం జిత్వాఽన్యో జహార తాం. 35½

* ఏవమితి-అస్మిన్నర్థే యోగవాసిష్ఠరామాయణే ప్రథమ సర్గే శ్రీవాల్మీక్యరిష్టనేమిసంవాదో ద్రష్టవ్యః. తథాహి అరిష్టనేమిః-శ్లో॥ కో రామః కీదృశః కస్య బద్ధో వా ముక్త ఏవవా, చిదానందస్వరూపేఽపి రామే చైతన్యవిగ్రహే. శాపస్య కారణం బ్రూహి క శ్శప్తా చేతి మే వద, వాల్మీకి రువాచ-సనత్కుమారో నిష్కామ అవస ద్బ్రహ్మసద్మని, వైకుంఠా దాగతో విష్ణు స్త్రైలోక్యాధిపతిః ప్రభుః. బ్రహ్మణా పూజిత స్తత్ర సత్యలోకనివాసిభిః, వినా కుమారం తద్దృష్ట్వా హ్యువాచ ప్రభురీశ్వరః. సనత్కుమార స్తబ్ధోఽసి నిష్కామో గర్వచేష్టయా, అత స్త్వం భవ కామార్తః దేవశర్మేతి నామతః. తేనాపి శాపితో విష్ణు స్సర్వజ్ఞత్వం తవాస్తి యత్, కించిత్కాలంహి త త్త్యక్త్వా త్వ మజ్ఞనీవ తిష్ఠసి. భృగు ర్భార్యాం హతాం దృష్ట్వా హ్యువాచ క్రోధమూర్ఛితః, విష్ణో! తవాపి భార్యాయా వియోగోఽహ భవిష్యతి. బృందయా శపితో విష్ణు శ్ఛలనం య త్త్వయా కృతం, అత స్త్వం స్త్రీవియోగంతు వచనా న్మమ యాస్య



33-33½ * రఘువరుఁ డిట్లు మాయ ననుసరించి చరించుచు విషయములం దంటనివాఁడయ్యు మూఢులదృష్టిలో నంటనివానివలెఁ గన్పట్టుట లేదు.

34-35½ పిమ్మట శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునితో నరణ్యమునంతయుం గాలించి, యొండెడఁ బుడమిపైఁ బడియున్న విఱిఁగినరథము, గొడుగు, ధనుస్సు, నొగలు చూచి లక్ష్మణునితో నిట్లనియె- లక్ష్మణా! చూడుము. ఎవ్వఁడో సీతను గొనిపోవుచుండఁగా, మఱొక్కఁడు వాని నోడించి ఆమెను ముచ్చిలెను.

* ఈవిషయమున శ్రీయోగవాసిష్ఠరామాయణమున మొదటి సర్గమునఁ గల శ్రీవాల్మీకిమహర్షికిని అరిష్టనేమికిని జరిగిన సంవాదము చూడ నగును. అరిష్టనేమి— 'రాముఁ డన నెవరు? ఎట్టివాఁడు? ఎవనివాఁడు? విషయబద్ధుఁడా? విముక్తుఁడా? చిదానందరూపుఁడును జైతన్యమూర్తి యగు శ్రీరామునియందు శాపము గల్గుటకుఁ గారణము తెల్పుము. ఆ శపించినవాఁ డెవఁడు? నాకుఁ దెల్పుము. అన వాల్మీకి యనియె. - బ్రహ్మలోకమున నేకోరికలు లేక బ్రహ్మచేఁ బూజితుం డగుచు సనత్కుమారుఁ డుండెను. ముల్లోకముల కధిపతి యగు ప్రభుండు విష్ణువు వైకుంఠమునుండి యటకు వచ్చెను. సనత్కుమారుఁడు దప్ప మిగిలిన సత్యలోకమున నున్నవా రందరితోఁ గూడిన బ్రహ్మచే నాతఁడు పూజింపఁబడెను. సనత్కుమారుఁడు పూజింపకపోవుటఁ గని, ప్రభువు నీశ్వరుఁడు నగు విష్ణువు సనత్కుమారా! నిష్కాముఁడ నని గర్వించి, స్తబ్ధుఁడవై యున్నావు. కాన నీ వీగర్వచేష్టచేఁ గామార్తుఁడవు గమ్ము! అంత నాతఁడును విష్ణువును, నీ కున్న సర్వజ్ఞత్వ మేది కలదో అది కొంతకాలము విడిచి యజ్ఞానియ ట్లుందువుగాక! మఱియు నతఁడు విష్ణువుచే భృగుభార్య

[1] సధర్మ స్త్రాయతే సీతాం హ్రియమాణాం మహావనే. ౩౬
కేహి లోకే ఽప్రియం కర్తుం శక్తా స్సౌమ్య! మమేశ్వరాః. ౩౬½
కర్తార మపి లోకానాం శూరం కరుణవేదినం. ౩౭
అజ్ఞానా దవమన్యేర౯ సర్వభూతాని లక్ష్మణ!
మృదుం లోకహితే యుక్తం దాంతం కరుణవేదినం. ౩౮
నిర్వీర్య ఇతి మన్యంతే నూనం మాం త్రిదశేశ్వరాః. ౩౮½
నైవ యక్షా న గంధర్వా న పిశాచా న రాక్షసాః. ౩౯
కిన్నరా వా మనుష్యావా సుఖం ప్రాప్స్యంతి లక్ష్మణ! ౩౯½

---

సి. భార్యాహి దేవదత్తస్య పయోష్ణీ తీరసంస్థితా, నృసింహావేషధృ గ్విష్ణుం దృష్ట్వా పంచత్వ మాగతా. తేన శప్తోహి నృహరి ర్దుఃఖార్తా స్త్రీవియోగతః, తవాపి భార్యయా సార్థం వియోగో ఽపి భవిష్యతి. భృగు ణేవం కుమారేణ శాపితో దేవశర్మణా, బృందయా శాపితో విష్ణు స్తేన మానుష్యతాం గత ఇతి. అతఏవ భార్యావియోగే హ్యజ్ఞానీవ చిదానందస్వరూపో ఽపి శ్రీరామః కించిద్జ్ఞ ఇవ దుఃఖం ప్రదర్శితవా౯. తత్త్వతో నే త్యర్థః. అతఏవహి శ్రీరామస్య భార్యాదుఃఖం పునః పున స్సంప్రాప్త మితి-విరాధేన, రావణేన, మిథ్యాపవాదేన, భూతలప్రవేశే నేతి జ్ఞేయం.

---

1. వాల్మీకిరా. ౬౮ సర్గ.



౩౬-౩౬½ లక్ష్మణా! ఈకాఅడవిని హరింపఁబడెడు సీత, ఆమె ధర్మము గాపాడలేదు. సౌమ్యా! లోకమున నాకుఁ బ్రియముం గూర్పఁగల సమర్థు లగువా రెవ్వరు?

౩౭-౩౮½ లోకములను బుట్టించిన మహాశూరునైనను కరుణాళుని, సర్వభూతము లజ్ఞానముచే ననుమానించును. కరుణాళుఁడనై లోకక్షేమమునే కోరి మృదుస్వభావుఁడనై యున్నవాని, బాహ్యేంద్రియనిగ్రహము నన్ను నిర్వీర్యుఁ డని (బలము పెంపరినవానినిగా) దేవతా నాయకులు తప్పకఁ దలపోయుదురు.

౩౯-౩౯½ లక్ష్మణా! యక్షులుగాని, గంధర్వులుగాని, పిశాచులుగాని, రాక్షసులుగాని యిప్పుడు సుఖముం గాంచలేరు.

---

హరింపఁబడఁగాఁ గని, క్రోధపరవశుఁడై విష్ణూ! నీవును భార్యావియోగము పొందుదువుగాక! బృందయెడ నెందువలన మాయఁ జేసితివో, అందువలనను నామాటపై నీవు స్త్రీవియోగమును బొందెదవు.

మఱియు, దేవదత్తునిభార్య పయోష్ణి యనునామె, నృసింహావేషధారియైన విష్ణునిం గాంచి భయముచేఁ బ్రాణములను విడిచెను. అప్పుడు దేవదత్తునిచే నృసింహుఁడు "నీభార్యతోడ నీకు వియోగము కలుగుఁగాత" యని శపింపఁబడెను. ఇట్లు భృగువుచే, సనత్కుమారునిచే, దేవదత్తునిచే, బృందచే శపింపఁబడి విష్ణువు మనుష్యుఁ డయ్యెను. అందుచేతనే శ్రీరాముఁడు భార్యావియోగముచే నజ్ఞానివలె చిదానందస్వరూపుఁడయ్యు, నల్పజ్ఞుఁ డట్లు దుఃఖమును జూపెను.

46

మ మాస్త్రబాణసంపూర్ణ మాకాశం పశ్య లక్ష్మణ! ౪౦
నిస్సంపాతం కరిష్యామి హ్యద్య త్రైలోక్యచారిణాం. ౪౦½

ఆకర్ణపూర్ణై రిషుభి ర్జీవలోకదురావరైః. ౪౧
కరిష్యే మైథిలీహేతో రపిశాచ మరాక్షసం.
నైవ దేవా న దైతేయా న పిశాచా న రాక్షసాః. ౪౨
భవిష్యంతి మమ క్రోధా త్త్రైలోక్యే విప్రణాశితే. ౪౨½
ఇత్యుక్త్వా రోషతామ్రాక్షో రామో నిష్పీడ్య కార్ముకం.
శర మాదాయ సందీప్తం ఘోర మాశీవిషోపమం ౪౩½
1 త్రిపురం జఘ్నుషః పూర్వం రుద్రస్యేవ స్థితో హరిః. ౪౪

సంధాయ ధనుషి క్షిప్రం శ్రీమాన్ పరపురంజయః
2 వీక్షమాణం ధను స్సజ్యం నిశ్వసంతం పునః పునః. ౪౫
దగ్ధకామం జగత్సర్వం యుగాంతే తు యథా హరం
అదృష్టపూర్వం సంక్రుద్ధం దృష్ట్వా రామంతు లక్ష్మణః. ౪౬
అబ్రవీ త్ప్రాంజలి ర్వాక్యం ముఖేన పరిశుష్యతా. ౪౬½
పురా భూత్వా మృదు ర్దాంత స్సర్వలోకహితే రతః.
న క్రోధవశ మాపన్నః ప్రకృతిం హాతు మర్హసి. ౪౭½
చంద్రే లక్ష్మీః ప్రభా సూర్యే గతి ర్వాయౌ భువి క్షమా.
ఏతచ్చ నియతం సర్వం త్వయి చానుత్తమం యశః. ౪౮½

1. శివరామా. 2. వాల్మీకి రా. ౬౪ స.



౧౫]

౪౦-౪౦½ లక్ష్మణా! నాయస్త్రములచేతను, బాణములచేతను నాకాశము నిండిపోవును. జూడుము, ఇప్పుడు మూఁడులోకములందలి వారిని గదలకుండఁ జేసెదను.

౪౧-౪౨½ జానకీకారణమున నాకర్ణాంతములాఁగి విడువఁబడినవి యగు బాణములచే బ్రహ్మాండమున బిశాచులు, రక్కసులు ననువారు లేకుండఁ జేసెదను. నాచే మూఁడులోకములు నశింపజేయఁబడు నేని దేవతలు గాని పిశాచులుగాని, రాక్షసులుగాని బ్రతికియుండరు.

౪౩½-౪౪ అని, పలికి రోసమున నెఱ్ఱనారిన నేత్రములుకలవాఁడై శ్రీరాముఁడు ధనువు గుప్పిట గట్టిగాఁ బట్టుకొని, మున్ను త్రిపురముల నాశనము చేయు నిందురునివలె నున్న, విషసర్పముతోఁ దుల్యమైన ప్రజ్వలించు ఘోరమైన బాణమును జేత నందికొని శ్రీరాముఁడు నిలువఁబడెను.

౪౫-౪౬½ ఎక్కుపెట్టిన ధనువును గనుచు, మాటిమాటికి నిట్టూర్పులు పుచ్చుచుఁ, బ్రళయకాలమున నున్న యీశ్వరునివలె సమస్తజగత్తులను దగుల్చఁ బెట్టుట కిచ్ఛగించుచు, నిదివర కెన్నఁడు చూడని మహాక్రోధమున నున్న రాముని గని లక్ష్మణుఁడు దోసిలొగ్గి చిన్నవోయిన మొగమున నిట్లు లనియె.

౪౭½ రామా! మున్ను మృదుస్వభావము, బాహ్యేంద్రియనిగ్రహమును గలవాఁడవై సర్వలోకముల సేమము గోరిన నీవు కోపమునకు లొంగిపోయి, సహజసిద్ధమగు మృదుత్వాదిస్వభావమును విడువఁదగదు.

౪౮-౪౮½ చంద్రునియందు శోభయు, సూర్యునియందుఁ గాంతియు, వాయువునందుఁ జులుకుగల నడకయు, భూమియందు నోర్పును బ్రత్యేకముగా నొక్కొక్కరియందుఁ బ్రతినియతములై యున్నవి. నీయందన్ననో, యివన్నియు నుండుటయేగాక మీఁదుమిక్కిలి మితిమీఱిన కీర్తియుఁ గలదు.

ఏకస్య నాపరాధేన లోకాన్ హంతుం త్వ మర్హసి. ౪౯
1 య ద్యరాక్షస మిత్యేకం శరం జగతి ముంచసి
స్త్రీబాలవృద్ధాన్ సాధూంశ్చ హన్యా దేష నిశాచరాన్.

2 నతు జానామి క స్యాయం భగ్న స్సాంగ్రామికో రథః ౫౦
కేన వా కస్యవా హేతో స్సాయుధ స్సపరిచ్ఛదః. ౫౧
ఏకస్యతు విమర్దో ఽయం నద్వయో ర్వదతాం వర! ౫౧½

యుక్తదండాహి మృదవః ప్రశాంతా వసుధాధిపాః.
సదా త్వం సర్వభూతానాం శరణ్యః పరమా గతిః. ౫౨½

యేన రాజన్! హృతా సీతా త మన్వేషితు మర్హసి.
మద్ద్వితీయో ధనుష్పాణి స్సహాయైః పరమర్షిభిః. ౫౩½
సముద్రంచ విచేష్యామః పర్వతాంశ్చ వనానిచ.
దేవగంధర్వలోకాంశ్చ విచేష్యామ స్సమాహితాః. ౫౪½
3 మహతా తపసా రామ! మహతాచాపి కర్మణా.
రాజాదశరథేనా ఽసి లబ్ధో ఽమృత మి వామరైః. ౫౫½
కిం తే సర్వవినాశేన కృతేన పురుషర్షభ!
త మేవ త్వం రిపుం పాపం విజ్ఞా యోద్ధర్తు మర్హసి. ౫౬½

1. దూర్వాస రా. 2. వాల్మీకిరా. ౬౫ స. 3. వాల్మీకిరా. ౬౬ స.



౪౯-౫౦ ఒక్కని నేరమునకై లోకముల నన్నిటిని నాశనము చేయఁదగదు. లోక మరాక్షస మగుఁగాక (రక్కసు లన్న పురుగు లేకుండు గాక) యని జగముపై నొక్క బాణమును వదలుదువేని యా బాణము రాక్షస స్త్రీలను, బాలురను, వృద్ధులను గూడ నాశనముచేయును.

౫౧-౫౧½ (ఒక్కని నేరమే యిది యని యెట్లు గ్రహించితి వనుటకు సమాధానముగా లక్ష్మణుఁ డిట్లు పలికెను) ఇదుగో యుద్ధరథము, యుద్ధపరికరములతోఁగూడ నెందులకో యెవనివలననో విరిగిపడి యున్నది. ఇది యెవనిదో తెలియుట లేదు. మాటకారు లందరిలో మిన్న వగు నోరామచంద్రా! (నీకు వేఱే నేను చెప్పవలసిన విశేషము లేదని వినయసూచనముకొఱ కీ విశేషణము) ఇది యొక్కనితోడి యుద్ధముగాని, యిద్దరితోడిది గాదు.

౫౨½ భూమిపతులు మృదుస్వభావులు, మిగుల శాంతులు, నేరమునకుఁ దగినశిక్షణము నమలుపఱచువారు (అందును విశేష మేమనగా) నీవు సమస్తభూతములకు దిక్కైనవాఁడవు. వారి కన్నిటికంటెఁ బ్రధానమైనగతియే నీవు.

౫౩½ ఎవ్వఁడు నీసీతను హరించెనో వానిని, ధనువును చేఁబూని నాతోఁ గూడి, పరమర్షులసాహాయ్యమున వెదుకఁ దగుదువు.

౫౪½ సముద్రమును వెదకుదము. పర్వతముల నరణ్యములను గాలింతము. శ్రద్ధతో దేవగంధర్వలోకములను గూడ యన్వేషింతము.

౫౫½ ఎంతో తపస్సు చేసి, యెంతో సుకర్మ మాచరించి దేవత లమృతమును బొందినట్లు దశరథరాజు నిన్నుం గనెను.

౫౬½ సర్వనాశనము జేయుటవలన నీ కేమి ప్రయోజనము? కనుక నీభార్యను హరించిన పాపాత్ముఁ డగు నాశత్రు వెవ్వఁడో వానినే తెలిసికొని నాశనము చేయఁదగుదువు.

1 పూర్వజో ఽప్యుక్తమాత్రస్తు లక్ష్మణేన సుభాషితం.
సారగ్రాహీ మహాసారం ప్రతిజగ్రాహ రాఘవః. ౫౭½

సన్నిగృహ్యా మహాబాహుః ప్రవృత్తం కోప మాత్మనః.
అవష్టభ్య ధను శ్చిత్రం రామో లక్ష్మణ మబ్రవీత్. ౫౮½

కిం కరిష్యావహే వత్స! క్వవా గచ్ఛావ లక్ష్మణ!
కే నోపాయేన పశ్యే ఽయం సీతా మితి విచింతయ. ౫౯½

తం తథా పరితాపార్తం రామో లక్ష్మణ మబ్రవీత్. ౬౦
ఇదమేవ జనస్థానం త్వ మన్వేషితు మర్హసి
త్వద్విధా బుద్ధిసంపన్నా మహాత్మానో నరర్షభ! ౬౧
ఆపత్సు న ప్రకంపంతే వాయువేగై రి వాచలాః
ఇత్యుక్త స్తద్వనం సర్వం విచచార సలక్ష్మణః. ౬౨
తతః పర్వతకూటాభం మహాభాగం ద్విజోత్తమం
దదర్శ పతితం భూమౌ క్షతజార్ద్రం జటాయుషం. ౬౩

తం దృష్ట్వా గిరిశృంగాభం రామో లక్ష్మణ మబ్రవీత్. ౬౩½

అనేన సీతా వైదేహీ భక్షితా నాత్ర సంశయః. ౬౪
గృధ్రరూప మిదం రక్షో వ్యక్తం భవతి కాననే
ఏనం వధిష్యే దీప్తాస్యై ర్ఘోరై ర్బాణై రజిహ్మగైః. ౬౫
ఇత్యుక్త్వా ఽభ్యపత ద్గృధ్రం సంధాయ ధనుషి క్షురం. ౬౫½

1. వాల్మీకి రా.౬౭ స.



౫౭½ తాను పెద్దయ్యును లక్ష్మణుఁ డట్లు మంచిమాటను జెప్పినంతనే, సారము గ్రహించుస్వభావము గల రాముఁడు, సారవంతమైన యీమాటను గ్రహించెను.

౫౮½ మహాబాహుం డగు శ్రీరాముఁడు తనకు సంభవించిన కోపము నాఁచికొని, ధనువును జిత్రముగా నానుకొని, లక్ష్మణుఁ గని యిట్లనియె.

౫౯½ వత్సా! లక్ష్మణా! మన మేమి చేయుదము? ఎక్కడికి పోవుదము? ఏయుపాయమున సీతను గనుఁగొందుము? ఈవిషయ మాలోచింపుము!

౬౦-౬౨ అట్లు పరితాపపడుచు నార్తిఁజెందిన శ్రీరాముం గని లక్ష్మణుఁ డనియె. శ్రీరామచంద్రా! ఇదిగో జలస్థానము, దీనిని వెదుకఁ దగును. ఓనరాగ్రణీ! నీవంటిబుద్ధిశాలురు మహాత్ము లగువా రాపదల వితాఁకుపడరు. అని లక్ష్మణుఁడు పలుకఁగా శ్రీరామచంద్రుఁ డాతనితోఁగూడ నాయడవినంతను గ్రుమ్మరెను.

౬౩ అటుపిమ్మట పర్వతశిఖరమువలె నున్నవాఁడును, చాలయదృష్టవంతుఁడును పక్షిశ్రేష్ఠము నగు జటాయువును- రక్తముచేఁ దడిసి పుడమిపై గూలియున్నవానిని జూచెను.

౬౩½ పర్వతశిఖరమ ట్లున్న యాజటాయువుం గాంచి శ్రీరాముఁడు లక్ష్మణునితో ని ట్లనియె.

౬౪½-౬౫ లక్ష్మణా! ఈపక్షియే విదేహరాజుకుమారిక యగు సీతను దినివేసి యుండును. ఇందు సందియము లేదు. ఈయడవిలోనిది గ్రద్దయట్లున్న ను నిది నిజముగా రక్కసుఁడు కానోపును. ప్రజ్వలించుకొనలుగల ఘోరము లగు సూటిగానుండు బాణములచే దీనిం జంపెదను.

౬౫½ ఇట్లు పలికి చుఱకత్తివంటి పదునైన బాణమును విల్లునఁ దొడిగి, యాగృధ్రము నెదుర్కొనెను.

తం దీనం దీనయా వాచా సఫేనం రుధిరం వమన్
అభ్యభాషత పక్షీతు రామం దశరథాత్మజం. ౬౬½

రక్షసా నిహతం పూర్వం న మాం హంతుం త్వ మర్హసి.
పరిశ్రాంతస్య మే పక్షౌ ఛిత్త్వా ఖడ్గేన రావణః ౬౭½
సీతా మాదాయ వై దేహీ ముత్పపాత విహాయసం. ౬౮

అయ మస్య రథో రామ! భగ్న స్సాంగ్రామికో మయా. ౬౮½

1 దేవీ మా మాహ రాజేంద్ర! యావత్సంభాషణం మమ
భవత స్తావ దాస న్మే ప్రాణా విత్యాహ జానకీ. ౬౯½

ఇతి శ్రీరామాయణసారోద్ధారే ఆరణ్యకాండే
పంచదశ స్సర్గః.



## షోడశ స్సర్గః.

2 రామ స్తస్యతు విజ్ఞాయ బాష్పపూర్ణముఖ స్తదా
నిపపా తావశో భూమౌ రురోద సహలక్ష్మణః. ౧

సమీక్ష్య దుఃఖితతరో రామ స్సౌమిత్రి మబ్రవీత్. ౧½

అయం పితృవయస్యో మే గృధ్రరాజో జరాన్వితః.
శేతే వినిహతో భూమౌ మమ భాగ్యవిపర్యయాత్. ౨½

1. స్కాందపురాణం. 2. వాల్మీకి రా. ౬౭ స.



౬౬½ నురుఁగులఁ గూడిన రక్తముఁ గ్రక్కుచు నప్పక్షి జటాయువు దీనుఁడైన యాదశరథకుమారుఁ డగు రామచంద్రునితో దీన మగు వాక్కుతో నిట్లు మాట్లాడెను.

౬౭-౬౮ ఇదివరకే రాక్షసునిచేఁ జచ్చినవాని నన్నుఁ జంపఁదగదు యుద్ధము చేసి చేసి యలసిపోయిన నారెండు ఱెక్కలను గత్తిచే నఱికి రావణుఁడు విదేహరాజపుత్రికను సీతం గొని యాకసమున కెగిరి పోయెను.

౬౮½ రామచంద్రా! ఇదే వానియుద్ధరథము నాచే విరువఁబడి పడి యున్నది.

౬౯½ రాజేంద్రా! దేవిజానకియు, నీతోఁ గలిసి మాటలాడునంత వఱకు నాప్రాణములు నిలచు నని పలికెను.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమునఁ
బదునేనవ సర్గము.



## పదునారవ సర్గము.

౧ శ్రీరామచంద్రుఁ డాజటాయువు స్వరూప మెఱింగి, కన్నీళ్లతో నిండిన మోముగలవాఁడై, యొడ లెరుఁగక పుడమిం బడి లక్ష్మణునితోఁ గూడ యేడ్చెను.

౧½ ఇట్లా గృధ్రరాజుం జూచి మిగుల దుఃఖితుఁడై రాముఁడు లక్ష్మణునితోఁ ని ట్లనియె.

౨½ లక్ష్మణా! నాదురదృష్టమున మనతండ్రి దశరథునకు నెచ్చెలియైన యీగృధ్రరాజు కొట్టఁబడి పుడమిం బండుకొని యున్నవాఁడు.

ఇత్యేవ ముక్త్వా బహుశో రాఘవ స్సహ లక్ష్మణః. ౩
జటాయుషంచ పస్పర్శ పితృస్నేహం విదర్శయన్. ౩½

జటాయో! యది శక్నోషి వాక్యం వ్యాహరితుం పునః. ౪
సీతా మాఖ్యాహి భద్రం తే వధ మాఖ్యాహి చాత్మనః. ౪½

కి న్నిమిత్తో ఉహర త్సీతాం రావణ స్తస్య కిం మయా. ౫
అపరాధంతు యం దృష్ట్వా రావణేన హృతా ప్రియా. ౫½

కథం వీర్యః కథం రూపః కిం కర్మా స చ రాక్షసః. ౬
క్వ చాస్య భవనం తాత! బ్రూహి మే పరిపృచ్ఛతః. ౬½

త ముద్వీక్ష్యా ఉథ దీనాత్మా విలపంత మనంతతః. ౭
వాచా ఉతిసన్నయా రామం జటాయు రిద మబ్రవీత్. ౭½

మాయా మాస్థాయ విపులాం వాతదుర్దినసంకులాం. ౮
సీతా మాదాయ వై దేహీం ప్రయాతో దక్షిణాం దిశం. ౮½

యేన యాతో ముహూర్తేన సీతా మాదాయ రావణః. ౯
విప్రణష్టం ధనం క్షిప్రం తత్స్వామీ ప్రతిపద్యతే. ౯½

1. వాల్మీకి రా. ౬౮ స.



౩-౩½ శ్రీరామచంద్రుఁ డిట్లు పరిపరివిధముల లక్ష్మణునితో నని, తండ్రి యెడల నున్న ప్రేమను జూపుచు జేతితోఁ దాఁకెను.

౪-౪½ జటాయూ! మాటాడుటకు శక్తిగలవాఁడ వగుదువేని మఱొక్క మాఱు సీతావృత్తాంతము జెప్పుము. నీకు క్షేమ మగుగాక! నీకథా వృత్తాంతమునుగూడఁ బల్కుము.

౫-౫½ రావణుఁ డెందునిమిత్తము సీతను హరించెను? వానికి నాతోడ నేమి పని? ఏమి యపరాధముం జూచి రావణుఁడు నాప్రియురాలిని ముచ్చిలించెను.

౬-౬½ తండ్రీ! జటాయూ! ఆరక్కసుఁడు రావణుఁ డెట్టిబలము కలవాఁడు? ఎట్టిరూపము కలవాఁడు? ఎట్టివ్యాపారము కలిగియుండును? వాని యి ల్లెక్కడ? అడుగుచుంటినిగాన నాకుఁ దెల్పుము.

౭-౭½ అటుపిమ్మట దీనాత్ముఁడైన జటాయువు, యెడతెగకుండ విలపించుచున్న యారాఘవుం జూచి, మిగుల సన్నగిలిన వాక్కుతో ని ట్లనియె.

౮-౮½ "(రావణుఁడు) పెద్దగాలిచేతను, మబ్బుచేతను సంకులమైన గొప్ప మాయను బొంది విదేహరాజపుత్రిక యగు సీతను గొని దక్షిణఁపు దెసఁగాఁ బోయెను.

౯-౯½ ఏముహూర్తమున రావణుఁడు సీతను గొని పోయెనో, ఆముహూర్త బలముచేతనే స్వామి యచిరకాలముననే పోయిన ధనము (సీత)ను తిరిగి పొందఁగలఁడు.

* విందోనామ ముహూర్తోయం సచ కాకుత్స్థ! నాబుధత్ ౧౦
నచ త్వయా వ్యథా కార్యా జనకస్య సుతాంప్రతి. ౧౦½
అసంమూఢస్య గృధ్రస్య రామం ప్రత్యనుభాషతః ౧౧
ఆస్యాత్సుస్రావ రుధిరం మ్రియమాణస్య సామిషం. ౧౧½
పుత్రో విశ్రవస స్సాక్షా ద్భ్రాతా వై శ్రవణస్యచ. ౧౨
ఇత్యుక్త్వా ♦దుర్లభాన్ప్రాణాన్ ముమోచపతగేశ్వరః. ౧౨½

---

* విందః—ఇతి విందతే అనేన నష్టం ధన మితి విందః. యద్వా నష్టం ధనం విందతి లభతే తస్మి న్నితి విందః. విద్లృ లాభ ఇతి ధాతుః. సచ ఏకాదశో ముహూర్తః. ముహూర్తలక్షణం తూక్తం పురాణే. శ్లో. రౌద్ర శ్శ్వేత శ్చ మైత్రశ్చ తథా సారభట స్మృతః, సావిత్రో వైశ్వదేవ శ్చ గాంధర్వకుతప స్తథా, రౌహిణ స్తిలకశ్చైవ విజయో నైఋతి స్తథా. శంబరో వారుణశ్చైవ భగః పంచదశ స్మృత ఇత్యేతే ఆహ్నికముహూర్తాః. అత్ర విజయస్యైవ నామాన్తరం వింద ఇతి జ్ఞేయమ్. తదేత త్సరావణో నాబుధత్ నాబుధ్యత మోహితత్వాత్.

♦ దుర్లభాన్ బ్రూహి బ్రూహీతి పృచ్ఛతే రామాయ సాకల్యేన విజ్ఞాపనపర్యంతం ప్రాణా నస్థితా హంతేతి ఋషి శ్శోచతి.



౧౦-౧౦½ *ఇది 'విందము' అను పేరుగల ముహూర్తము. రాజా! ఆరావణుఁడిది యెఱుంగఁడు. జనకకుమారికం గూర్చి శ్రీరామచంద్రా! నీవు దుఃఖింపకుము.

౧౧-౧౧½ ఇంతవరకు స్పృహదప్పక మాట్లాడుచు నిఁకఁ బ్రాణముల వాయుచున్న యాగృధ్రము మోమునుండి మాంసముతోఁ గూడ రక్తము స్రవించెను.

౧౨-౧౨½ సాక్షాత్తువిశ్రవసునికుమారుఁడు, కుబేరునితమ్ముఁడు, (రావణుఁడు' అని యింతదనుక చెప్పి, యంతలోనే యాపక్షిరాజు, జటాయువు ♦ దుర్లభములైన ప్రాణములను విడిచెను.

---

* విందము :— పోయినధనమును దీనిచే విందతే తిరిగి పొందును కనుక యీముహూర్తము విందము అటుగాక విద్ అనుధాతువు లాభార్థకము. అదిపదునొకండవముహూర్తము. ఆముహూర్తలక్షణము; రౌద్రము, శ్వేతము, మైత్రము, సారభటము, సావిత్రము, వైశ్వదేవము, గాంధర్వము, కుతపము, రౌహిణము, తిలకము, విజయము, నైరృతము, శంబరము, వారుణము, భగము అను నీపదునైదు ఆహ్నికముహూర్తములు (అనఁగాఁ బ్రతిదినము పదునైదుభాగములు చేయఁగాఁ గ్రమముగానేర్పడును). ఇందు బదునొకండవ దగు విజయమునకే విందము అని మాఱుపేరు. మోహితుఁ డగుటవలన యీముహూర్తమును రావణుఁ డెఱుఁగలేదు.

♦ "దుర్లభములు" చెప్పుము చెప్పు మని యడుగుచున్న రామునికిఁ బూర్తిగ సీతావృత్తాన్తాదికము విన్నవించుకొనుటకైన ప్రాణములున్నవి కాదు కదా! అక్కటా! అయమూల్యము లగు ప్రాణములు మరల రమ్మన్న వచ్చునవి కావు అని వాల్మీకిమహర్షికి మనసునం దోఁచిన దిగులీవిశేషముచే సూచింపఁబడుచున్నది.

బ్రూహి బ్రూహీతి రామస్య బ్రువాణస్య కృతాంజలేః. ౧౩
త్యక్త్వా శరీరం గృధ్రస్య జగ్ముః ప్రాణా విహాయసమ్. ౧౩½
తం గృధ్రం ప్రేక్ష్య తామ్రాక్షం గతాసు మచలోపమం
రామ స్తు బహుభి ర్దుఃఖై ర్దీన స్సౌమిత్రి మబ్రవీత్. ౧౪½

పశ్య లక్ష్మణ! గృధ్రోఽయ ముపకారీ హతశ్చ మే. ౧౫
సౌమిత్రే! హర కాష్ఠాని నిర్మథిష్యామి పావకం
నాథం పతగలోకస్య చితా మారోప్య రాఘవ! ౧౬
ఇమం ధక్ష్యామి సౌమిత్రే! హతం రౌద్రేణ రక్షసా. ౧౬½
* యా గతి ర్యజ్ఞశీలానా మాహితాగ్నేశ్చ యా గతిః. ౧౭
అపరావర్తినాం యా చ యా చ భూమిప్రదాయినాం. ౧౭½
మయా త్వం స మనుజ్ఞాతో గచ్ఛ లోకా ననుత్తమాన్
గృధ్రరాజ! మహాసత్త్వ! సంస్కృతశ్చ మయా వ్రజ. ౧౮½

---

*యా గతి రితి:—గమ్యత ఇతి గతిః లోక ఇత్యర్థః. యజ్ఞశీలానాం లోకమార్గేణ అపరావర్తినాం పునరావృత్తిరహితానాం ముక్తానాం లోకాన్ పూజాయాం బహువచనం. లోకం పరమపదం (వైకుంఠాఖ్యం) వ్రజ ప్రాప్నుహీత్యర్థః. యద్వా - యజ్ఞశీలానాం యజ్ఞాశ్శీలం సద్వృత్తం యేషాం తే తథా సదా యజ్ఞానుష్ఠానపరాణాం గృహస్థానా మిత్యర్థః. ఆహితాః పరితస్థాపితాః అగ్నయః పంచాగ్నయో యస్య స తథా సదా తపశ్శీలస్య వానప్రస్థ



౧౩-౧౩½ చెప్పుము చెప్పు మని శ్రీరామచంద్రుఁడు పలుకుచుండఁగనే దోసిలొగ్గి పలుకుచున్న యాజటాయువు శరీరమును వీడి ప్రాణము లాకసమునకుఁ బోయెను.

౧౪-౧౪½ గ్రుడ్లెఱ్ఱఁబడి, క్రిందపడి ప్రాణముల వాసి పర్వతమట్లు పడియున్న యాజటాయువును గాంచి శ్రీరామచంద్రుఁడు పరిపరి రీతుల దుఃఖంబుల నొంది దీనుఁడై లక్ష్మణుఁ గని యి ట్లనియె.

౧౫-౧౬½ లక్ష్మణా! చూడుము. నా కుపకారము చేసిన యీ జటాయువుకూడ చనిపోయెను. కట్టెలఁ దెమ్ము; అగ్నిని మథింతును. పక్షిలోకమునకు రాజై రక్కసునిచేఁ జంపఁబడినవాఁ డగు నీజటాయువు నీచితిపై నెక్కించి దహనము గావింతును.

౧౭-౧౮½ యజ్ఞము చేయువారి * కేగతికలదో, నిత్యాగ్నిహోత్రి కేగతి కలదో, యరణ్యమున నుండి తపముచేయుచు వెనుదిరుగని సన్న్యాసుల కే గతికలదో, భూదానములు చేసినవారి కేగతి కలదో ఓ గృధ్రరాజమా! అఖండబలపరాక్రమసంపన్నా! నీ వట్టి సాటిలేని యుత్తమలోకములకు నాచే ననుమతింపఁబడి, నాచే దహనాది సంస్కారము లాచరింపఁబడినవాఁడవై చనుము.

---

* 'గమ్యతే' పొందఁబడునది కనుక 'గతి' లోక మని యర్థము యజ్ఞము లాచరించువా రేగులోకము దానినుండి, పునరావృత్తిలేని అనఁగా ముక్తులైనవారియొక్క లోకములను (లోక మొక్కటే యైనను పూజ్యభావముచే బహువచనము ప్రయోగింపఁబడెను.) అనఁగాఁ బరమపదమును (వైకుంఠ మను పేరుగలదానిని) బొందుము. లేక; యజ్ఞశీలురు అనఁగా, యజ్ఞం = యజ్ఞములు; శీలమ్ = మంచి నడవడి కలవారికి అనఁగా, సదా యజ్ఞానుష్ఠానపరు లగు గృహస్థుల కని యర్థము.
ఆహితాగ్నుల కనఁగా, ఆహితాః = అంతట నుంచఁబడిన, అగ్నయః = పంచాగ్నులు, కలవారు అనఁగా నెల్లప్పుడు తపస్సుచేసికొను వానప్రస్థాశ్రమస్థుల కని యర్థము.

ఏవ ముక్త్వా చితాం దీప్తా మారోప్య పతగేశ్వరం. ౩౫
దదాహ రామో ధర్మాత్మా స్వబంధు మివ దుఃఖితః. ౩౫½

స్యేత్యర్థః. అపరావర్తినాం "అరణ్య మియాత్తతో నపునరేయా' దిత్యుక్తానాం సన్న్యాసినా మిత్యర్థః తా గతీః ప్రాజాపత్యం గృహస్థానాం బ్రాహ్మం సన్న్యాసినాం స్మృత మిత్యా ద్యుక్తస్థానాని ; యజ్ఞదాన తపస్సన్న్యాసినా మిత్యర్థః - తేషాం యా గతిః శాస్త్ర విహితా తాం మయా సంస్కృతో వ్రజ ప్రాప్ను హీ త్యర్థః. తిరశ్చాం కర్మానధికారాత్ ఉత్తమలోకాభావేపి మయా త్వం సమనుజ్ఞాత స్సన్ముక్తిం ప్రాప్నుహీత్యర్థః. ఏవంచ యజ్ఞశీలాదీనాం లోకాన్ క్రమేణ ప్రాప్య తతో బ్రహ్మణో లోకాన్ క్రమముక్తిదాన్ గచ్ఛేత్యర్థః. నను మనుష్యభావం ప్రకటయత శ్శ్రీరామస్య కథం ముక్తి ప్రదానం ? 'తస్య పరత్వాసాధారణచిహ్నత్వా దితి చేత్ సత్యేన లోకాన్ జయతీ త్యుక్తరీత్యా స్వార్జితధర్మవిశేషేణ స్వాధీనసర్వలోకత్త్వావిరోధాత్; నచ నిర్హేతుకముక్తిదానే ఽతిప్రసంగః. స్వకార్య ముద్దిశ్య ప్రాణత్యాగస్యైవ హేతుత్త్వాత్. తదేవ నృసింహపురాణే జటాయు ముద్దిశ్య శ్రీరామ ఏవం వక్ష్యతి. శ్లో. మత్కృతే నిధనం యస్మాత్త్వయా ప్రాప్తం ద్విజోత్తమ! తస్మాన్మమ ప్రసా



౩౫-౩౫½ ఇట్లు పలికి యప్పక్షిరాజును ధర్మాత్ముఁడగు శ్రీరామచంద్రుఁడు దుఃఖితుఁడై ఆత్మబంధువునట్లు, ప్రజ్వలించు చితి నెక్కించి దహనము గావించెను.

"అపరావర్తినాం" 'అనఁగా అరణ్యమునకుఁ బోవలెను. అటనుండి మఱలి రాఁగూడదు" అని చెప్పఁబడిన సన్న్యాసుల కని యర్థము.
ఆగతులు— 'గృహస్థులకుఁ బ్రాజాపత్యము, బ్రాహ్మము సన్న్యాసులకు' అనువానిచేఁ జెప్పఁబడిన వనియుఁ జెప్ప నగు లేక; యజ్ఞము, దానము, తపము గలవారికిని, సన్న్యాసులకు నేగతి కలదో వారిగతు లనియు నర్థము.
శాస్త్ర విహితమైన యీ గతులను నాచే సంస్కారమునొంది పొందుము అని యర్థము.
పక్షులకుఁ గర్మలు చేయు నధికారము లేకపోవుటచేత నుత్తమ లోకము లేకపోయినను, నీవు (జటాయువు) మట్టుకు నాచే (శ్రీ రామునిచే) ననుశింపఁబడినవాఁడవై ముక్తినందుము అని యర్థము.
దీన మరియు, యజ్ఞశీలురు మొదలగువారి లోకములఁ గ్రమముగాఁ బొంది, పిమ్మటఁ గ్రమముక్తి నిచ్చు బ్రహ్మలోకములను బొందుమని యర్థము.
అట్లయిన శ్రీరాముఁడు మనుష్యభావముఁ బ్రకటించువాఁడుకదా! యాతఁడు జటాయువునకు ముక్తి నెట్లిచ్చెను? అతనియం దా పరాత్పరత్వము సామాన్యలక్షణము కాదుకదా! అన్న; సత్యముచే లోకముల నన్నిటిని జయించు నన్నరీతిగాఁ దా నార్జించిన ధర్మ విశేషముచేతనే సర్వలోకములను స్వాధీనముచేసికొన్నవాఁ డగుటచే నేవిరోధము లేదు.
మఱియు, జటాయువున కేహేతువు లేకుండఁగనే ముక్తి నిచ్చుటయు నతిప్రసంగము కాదా? యన్న కాదు; తనపనికై ప్రాణముల నైన వదలుటయే యిందులకుఁ గారణ మగుటవలన.
ఆవిషయమే నృసింహపురాణమున - జటాయువుంగూర్చి శ్రీరాముఁడే పలుకును - ఓపక్షి శ్రేష్ఠమా! నాకొఱకై నీకుఁ జా వెందువలన

యత్ర త్వేతస్య మర్త్యస్య కథయంతి ద్విజాతయః. ౨౦
తత్స్వర్గగమనం తస్య పిత్ర్యం రామో జజాపహ. ౨౦౪

దేన విష్ణులోక మవాప్స్యసీతి. ఏవం జటాయుషం ప్రతి మయా సంస్కృతః తస్మాద్వైకుంఠం వ్రజేతి శ్రీరామోక్త్యా పరమాత్మత్వం స్పష్టతయా ప్రతీయత ఏవ. దుఃఖశోకాదికంతు నటన మిత్యుక్తమే వాసకృత్. త్వం గతిః పరమా దేవేత్యాదినా బాలకాండే, సహి దేవైరుదీర్ణస్యే త్యాదినా అయోధ్యాకాండే, సీతా లక్ష్మీః భవాన్విష్ణు రిత్యాదినా యుద్ధకాండే, తదితరసర్వరామాయణేషు శ్రీరామస్వరూపప్రకటనేనచ- పూర్వోక్తం దృఢం భవతి. అత ఏవ మహాభారతే అశ్వమేధపర్వణి భగవద్వాక్యం. శ్లో. ప్రాణాం స్త్యజతి యో మర్త్యో మాం ప్రపన్నోపి మత్కృతే, బాలసూర్యప్రకాశేన వ్రజే ద్యానేన మద్గృహమితి. ఆగ్నేయపురాణే ఽపి శ్లో. విష్ణోః కార్యం సముద్దిశ్య దేహత్యాగో యతః కృతః, తత్రో వైకుంఠ మాసాద్య ముక్తో భవతి మానవ ఇతి. పాద్మేపి - జటాయుసంస్కార వివరణే శ్లో. సంస్కార మకరోత్తస్య రామో బ్రహ్మ విధానతః, స్వపదంచ దదౌ తస్మై సో ఽపి రామప్రసాదతః, హరే స్సామాన్యరూపేణ ప్రయయౌ పరమం పదమితి. అనేన సంకల్పమాత్రాత్కర్మా నధికృతతిరశ్చ స్సాధనహీన స్యాపి తల్లోకదానేన భగవాన్ శ్రీరామః



౨౦-౨౦౪ ద్విజాలు చనిపోయిన మనుష్యునకు స్వర్గలోకమును బొందించు పితృదేవతాదికము లగు నేయేమంత్రములను (యామ్యసూక్తాదికము) జపింతురో, వాని నెల్ల శ్రీరామచంద్రుఁడాజటాయువకు జపించెను.

కలిగెనో, యందువలననే నాయనుగ్రహముచే విష్ణులోకముం బొందుము.

లేక - ఇట్లు జటాయువును గూర్చి - నాచే సంస్కరింపఁ బడితివి. అందువలన వైకుంఠమున కేగుము - అని శ్రీరాముని మాటచేతనే యాతఁడు పరమాత్మ యని స్పష్టముగాఁ దోఁచుచునే యున్నది, దుఃఖశోకాదికము కేవలము నటనమే యని. తొలుతఁ బలుమార్లు నీవు ముఖ్యమైన గతివి. అని మొదలుగ బాలకాండమున, అతఁడు దేవతాంశలతో నవతరించిన వాఁడు అని అయోధ్యాకాండమున, సీత లక్ష్మి, నీవు విష్ణువవు అనునదాదిగా యుద్ధకాండమున, యింకను యితరరామాయణములం గల శ్రీరామచంద్రస్వరూపప్రకటనమునందును దొలుతఁ జెప్పినది దృఢపఱచుచున్నది.

ఇందువల్లనే మహాభారతమున, యశ్వమేధపర్వమున శ్రీకృష్ణభగవానులవాక్యము "ఏమనుజుఁడు నన్నే నమ్మి, నాకొఱకే ప్రాణములను విడుచునో, బాలసూర్యునివంటి విమానము నెక్కి నాలోకమును బొందును" అని ఆగ్నేయపురాణమునను విష్ణుకార్యము నుద్దేశించి దేహ మెందువల్ల విడువఁబడునో అందుచే నామానవుఁడు వైకుంఠమును బొంది ముక్తుఁ డగును - అని పాద్మమునను జటాయువు యొక్క సంస్కారము వివరించుపట్ల శ్రీరామచంద్రుఁడాజటాయువునకు బ్రహ్మవిధానమున (వేదోక్తవిధానమున) సంస్కారము నొనరించెను. తనలోకమునుగూడ యొసంగెను. ఆజటాయువును రాము ననుగ్రహమున శ్రీహరిరూపముతోఁ బరమపదము నందెను.

దీనిచే, సంకల్పమాత్రముచేఁ గర్మలయం దెట్టి యధికారము లేకనే సాధనలేని పక్షికిఁగూడ యాయుత్తమలోకము లిచ్చుటచే శ్రీరామ

తతో గోదావరీం గత్వా నదీం నరవరాత్మజౌ. ౨౧
ఉదకం చక్రతు స్తస్మై గృధ్రరాజాయ తౌ శుభౌ. ౨౧½
1 తతో౽నంతర మేవాసౌ దివ్యరూపధర శ్శుభః. ౨౨
విమానవర మారుహ్య భాస్వరం భానుసన్నిభః
శంఖచక్రగదాపద్మకిరీటవరభూషణైః. ౨౩
ద్యోతయన్ స్వప్రకాశేన పీతాంబరధరో౽మలః
కృతాంజలిపుటో భూత్వా తుష్టావ రఘునందనం. ౨౪

జటాయు రువాచ—

అగణితగుణ మప్రమేయ మాద్యం సకలజగత్స్థితిసంయమాదిహేతుం, ఉపరమపరమం పరాత్మభూతం సతత మహం ప్రణతో౽స్మి రామచంద్రం. ౨౫

హరికమలజశంభురూపభేదా త్త్వ మిహ విభాసి గుణత్రయానువృత్తః, రవి రివ జలపూరితోదపాత్రే ష్వమరపతి స్తుతిపాత్ర మీశ మీడే. ౨౬

స్వస్వరూపాంశే మాయయా నృతజ్ఞాన ఇతి ప్రలపతాం ముఖం ధ్వస్తం భవతి. అపిచ వక్ష్యమాణపరమేశ్వరవరం స్మృత్వా శ్రీరామః తస్మై మోక్షం దత్తవా నితి జ్ఞాతవ్యం. తథాహి స్కాందే ఉమాసంహితాయాం నవమాధ్యాయే శ్లో॥ కంకాచలే సమారాధ్య శంకరం లబ్ధవా న్వరం, తస్మాత్స్వరూపం గతవాన్ రఘునాథస్య పక్షిరాట్ ఇతి.

1. అధ్యాత్మ రా. ౮ సర్గ.



౨౧-౨౧½ పిమ్మట నారాజకుమారులిర్వురును గోదావరినదికిఁబోయి యాగృధ్రపతి కుదకక్రియ నాచరించిరి.

౨౨-౨౪ అంత నాజటాయువు దివ్యమంగళరూపమును దాల్చి చక్కఁగాఁ బ్రకాశించు సూర్యునితో సమాన మగు విమానము నధిష్ఠించి శంఖము, చక్రము, గద, పద్మము, కిరీటము, శ్రేష్ఠము లగు నలంకారములును దాల్చి, తనకాంతిచే నెల్ల దెసలఁ బ్రకాశింపఁజేయుచు, పచ్చనిపట్టువస్త్రముఁ దాల్చి శుచియై, దోసి లొగ్గికొని శ్రీరామచంద్రు నిట్లని స్తుతియించెను.

జటాయు వి ట్లనియె—

౨౫ లెక్కింప నలవికాని గుణములు కలవాఁడును, అప్రమేయుఁడును, మొదటివాఁడును, సకలజగత్తుల సృష్టిస్థితిలయములకుఁ గారణమైనవాఁడును, ఆత్మయం దుపరమించువాఁడును బరమాత్మయు నగు శ్రీరామచంద్రునకు నమస్కరించుచున్నాను.

౨౬ సత్వాదిగుణత్రయము ననువర్తించుచు, విష్ణువు, బ్రహ్మ, శివుఁడును రూపభేదములచే వివిధము లగు జలపాత్రములయందు సూర్యుఁడు వివిధరూపముల భాసించునట్లు భాసించుచున్నావు. ఇంద్రాదులచే స్తుతింపఁబడినట్టి నీశ్వరుని స్తుతించుచున్నాను.

చంద్రభగవానులు స్వస్వరూపముయొక్క యంశయందు, మాటుచేఁ గప్పపడి యుండె నని పలుకువారికి ముఖపిధాన మగును.
మఱియుఁ జెప్పఁబోవు పరమేశ్వరవరమును జ్ఞప్తికిఁ దెచ్చుకొని శ్రీరాముఁ డాజటాయువునకు మోక్షము నిచ్చె నని యెఱుంగ నగును. స్కాందపురాణమున నుమాసంహితయందుఁ దొమ్మిదవ యధ్యాయమున "పక్షిరాజు (జటాయువు) కంకాచలమున శంకరు నారాధించిన వరము పొందెను. అందువలన శ్రీరామునితో సారూప్యము నందెను" అని కలదు.

౩౯-౩౯½ ఆనర శ్రేష్ఠు లాగుహ నట్లు పొంది, దాని కించుక దూరములో భయంకరరూపమున వికృత మగు ముఖమును, వ్రేలాడుచున్న పెద్ద బానకడుపును, బదునైనకోరలును, మొద్దువారిన చర్మమును గలిగిన యొకరక్కసిని జూచిరి.

౪౦-౪౦½ ఆరక్కసి యావీరులను జేరి యన్నకు ముందుఁ జనుచున్న లక్ష్మణుని రా! మనమిద్దరము క్రీడింతము అని పలుకుచుఁ బట్టుకొనెను.

---

(Nizam) అని వ్యవహరింపఁబడు రాజధానియందు 'అహమదాబాదు' (Ahamedabad) ప్రాంతమునుండి శ్రీకృష్ణవేణీతీరమున సీతను వెదకుచు, బర్ణశాలకు రెండువందలయేబదిమైళ్లవరకుఁ బ్రయాణము చేసి 'కర్నూలు' (Kurnool) మండలమునఁ, గృష్ణవేణీ తుంగభద్రాసంగమమునఁ గృష్ణానదినిగూడ దాఁటి పిమ్మట డెబ్బది మైళ్ళదూరమున నున్న 'ఆదోని' (Adoni) కి దగ్గరగా నున్న క్రౌంచారణ్యమున నయోముఖిని విరూపం గావించి, దానికి యిరువదిమైళ్ళదూరమున నిప్పుడు 'హోలాలగండి' (Holalagandi) యను పేర వ్యవహరింపఁబడు కబంధవనమును జేరి, ఆకబంధుని జంపి, యటకు నలువదిమైళ్ళదూరమున నున్న 'హంపీసాగరము' (Hampi Sagaram) అని ప్రఖ్యాతి కెక్కిన పంపాతీరమున కేగి రని తెలియుచున్నది.

సుభీమం తన్మహారణ్యం వ్యతీయాతౌ మహాబలౌ
తతఃపరం జనస్థానా త్త్రిక్రోశం గమ్య రాఘవౌ. ౩౬
క్రౌంచారణ్యం వివిశతు ర్గహనం తౌ మహౌజసౌ
తతః పూర్వేణ తౌ గత్వా త్రిక్రోశం భ్రాతరౌ తదా. ౩౭
* క్రౌంచారణ్య మతిక్రమ్య మతంగాశ్రమ మంతరే
దదృశా తే తు తౌ తత్ర దరీం దశరథాత్మజౌ. ౩౮

* క్రౌంచారణ్య మితి—ఏతావతా చైత్రబహుళాష్టమ్యాం మధ్యాహ్న విందాఖ్య ముహూర్తే రావణ స్సీతా మపహృతవా నితి ద్యోత్యతే. అనంతరం శ్రీరామలక్ష్మణౌ సీతాన్వేషణార్థం గోదావరీపూర్వతట మనుసృత్య ప్రకృతే రాజమహేంద్రపురమార్గాత్ శ్రీభద్రాద్రిక్షేత్రప్రదేశ మతిక్రమ్య రామగిరీతి ప్రసిద్ధపర్వతసమీపే జటాయుషం సంస్కృత్య రుద్రంకోట ఇతి వ్యవహ్రియమాణ ప్రదేశా ద్గోదావరీ ముత్తీర్య సీతాన్వేషణం కృత్వా తస్మా న్నైరృతిభాగే విద్యమానం కృష్ణవేణీ ముత్తీర్య క్రౌంచారణ్య మతిక్రమ్య ఇదానీం నైజాం రాష్ట్రస్య నైరృతిదిశి సీతాన్వేషణం కృత్వా ప్రకృత (Cuddapah) కడప మండల మతిక్రమ్య కంబంధవనప్రాంతే అయోముఖీం విరూపయిత్వా కబంధవనం జగ్మతుః.

ఏతావతా శ్రీభద్రాద్రి త్యధునా ప్రసిద్ధప్రదేశే పర్వతోపరి శ్రీరామలింగప్రతిష్ఠాం కృత్వా శివాజ్ఞయా తత్ప్రదేశ మతిక్రమ్య (Rudram kota) రుద్రంకోట



౩౭-౩౮ మిగుల భయముం గూర్చునా కారడవిం దాటి మహాబలులును తేజోవంతులు నగు వారు పిమ్మట జనస్థానమునకుం బైన మూఁడు క్రోసులు పోయి చొరరాని క్రౌంచారణ్యమునం బ్రవేశించిరి. ఆయన్నదమ్ములు పిమ్మట మతంగాశ్రమమునకుం దూర్పుగా మూఁడుక్రోసులదూరము పోయి * క్రౌంచారణ్యమును దాటి యొక పర్వతగుహను జూచిరి.

* క్రౌంచారణ్యము అని—ఇంతకుం జైత్రబహుళాష్టమినాఁడు మధ్యాహ్నము వింద మను ముహూర్తమున రావణుఁడు సీతను హరించె నని తెలియుచున్నది. పిమ్మట శ్రీరామలక్ష్మణులు సీతను వెదకుటకు గోదావరినదికిఁ దూర్పుటొడ్డు ననుసరించి ప్రకృతమున రాజమహేంద్రపురము దారిన శ్రీభద్రాద్రిక్షేత్రప్రవేశమును దాఁటి శ్రీరామగిరి యను ప్రసిద్ధ మగు పర్వతము దాఁపున జటాయువునకుఁ బ్రేతసంస్కారమాచరించి "రుద్రం కోట" అని వ్యవహరింపఁబడుచోటినుండి గోదావరీనదిని దాఁటి సీతను వెదకి దానికి నైఋతిదిశ నున్న కృష్ణవేణీనదిని దాఁటి క్రౌంచారణ్యమును గడచి నేటి నైజాము రాష్ట్రపు నైరుతిదిక్కున సీతను వెదకి నేటికడపమండలము నతిక్రమించి, కబంధవనసమీపమున అయోముఖి యను రక్కసిని విరూపం గావించి కబంధవనమునకు వెళ్ళిరి.

క్రౌంచారణ్యము అనుచో, 'శ్రీభద్రాద్రి' అని నేఁడు ప్రసిద్ధికెక్కిన తావున పర్వతముపై శ్రీరామలింగప్రతిష్ఠను శివునియానతిచే నొనరించి, యాతావు దాఁటి, 'రుద్రంకోట' (Rudram Kota) అని వ్యవహరింపఁబడుచోటునఁ బర్ణశాలకు ముప్పదిమైళ్లు దూరమున శబరీగోదావరులసంగమ ప్రదేశమున, గోదావరీనదిని దాఁటి సీతాన్వేషణము క్రమముగాఁ గావించి, యిప్పుడు 'నైజాము'

ఆసాద్య తౌ నరవ్యాఘ్రౌ దర్యా స్తస్యా విదూరతః
దదృశాతే మహారూపాం రాక్షసీం వికృతాననాం. ౩౯
లంబోదరీం తీక్ష్ణదంష్ట్రాం కరాళాం పరుషత్వచాం. ౩౯½
సా సమాసాద్య తౌ వీరౌ వ్రజంతం భ్రాతు రగ్రతః. ౪౦
ఏహి రంస్యావహే త్యుక్త్వా సమాలంబత లక్ష్మణం. ౪౦½

ఇతి వ్యవహ్రియమాణప్రదేశే పర్ణశాలా త్రింశార్ధక్రోశదూరే శబరీగోదావరీసంగమప్రదేశే గోదావరీ ముత్తీర్య సీతాన్వేషణం క్రమేణ కృత్వా ఇదానీం (Nizam) నైజా మితి వ్యవహ్రియమాణరాజధాన్యాం (Ahmeda-bad) అహమదాబాద్ ప్రాంతాత్ శ్రీకృష్ణవేణీతటే సీతాం విచిన్వన్ పర్ణశాలా త్పంచాశదుత్తరద్విశతార్ధక్రోశపర్యంతం ప్రయాణం కృత్వా (Kurnool) కర్నూలు) మండలే కృష్ణవేణీతుంగభద్రాసంగమే కృష్ణానదీ ముత్తీర్య తత స్సప్తత్యర్ధ క్రోశదూరస్థ ఆదోని(Adoni) సమీపస్థ క్రౌంచారణ్యే అయోముఖీం విరూప్య-తతః వింశత్యర్ధదూరే ఇదానీం (Holalagandi) హోలాలగండి నామ్నా వ్యవహ్రియమాణకబంధవనం ప్రాప్య కబంధం హత్వా తతః షష్ట్యర్ధ క్రోశదూరస్థ (Hampi Sagaram) హంపీసాగర మితి ప్రఖ్యాత పంపాతీరం జగ్మతు రితి జ్ఞాయతే.



౩౯-౩౯½ ఆనరశ్రేష్ఠు లాగుహ నట్లు పొంది, దాని కించుక దూరములో భయంకరరూపమున వికృత మగు ముఖమును, వ్రేలాడుచున్న పెద్ద బానకడుపును, బదునైనకోరలును, మొద్దువారిన చర్మమును గలిగిన యొకరక్కసిని జూచిరి.

౪౦-౪౦½ ఆరక్కసి యావీరులను జేరి యన్నకు ముందుఁ జనుచున్న లక్ష్మణుని రా! మనమిద్దరము క్రీడింతము అని పలుకుచుఁ బట్టుకొనెను.

(Nizam) అని వ్యవహరింపఁబడు రాజధానియందు 'అహమదాబాదు' (Ahamedabad) ప్రాంతమునుండి శ్రీకృష్ణవేణీతీరమున సీతను వెదకుచు, బర్ణశాలకు రెండువందలయేబది మైళ్లవరకుఁ బ్రయాణము చేసి 'కర్నూలు' (Kurnool) మండలమునఁ, గృష్ణవేణీ తుంగభద్రాసంగమమునఁ గృష్ణానదినిగూడ దాఁటి పిమ్మట డెబ్బది మైళ్ళదూరమున నున్న 'ఆదోని' (Adoni) కి దగ్గరగా నున్న క్రౌంచారణ్యమున నయోముఖిని విరూపం గావించి, దానికి యిరువది మైళ్ళదూరమున నిప్పుడు 'హోలాలగండి' (Holalagandi) యను పేర వ్యవహరింపఁబడు కబంధవనమును జేరి, ఆకబంధుని జంపి, యటకు నలువది మైళ్ళదూరమున నున్న 'హంపీసాగరము' (Hampi Sagaram) అని ప్రఖ్యాతి కెక్కిన పంపాతీరమున కేగి రని తెలియుచున్నది.

ఉవాచ చైనం వచనం సౌమిత్రి ముపగుహ్య సా. ౪౧
అహం త్వయోముఖీనామ లాభ స్తే త్వ మసి ప్రియః
ఆయు శ్శేష మిమం వీర! త్వం మయా సహ రంస్యసే. ౪౨

ఏవ ముక్తస్తు కుపితం ఖడ్గ ముద్ధృత్య లక్ష్మణః
కర్ణనాసా స్తనౌ చాస్యానిచ కర్తారిసూదనః. ౪౩
1 యథాగతం ప్రదుద్రావ రాక్షసీ భీమదర్శనా. ౪౩½

తతో రామో లక్ష్మణేన జగామ విపినాంతరం. ౪౪
పున ర్దుఃఖం సమాశ్రిత్య సీతాన్వేషణ తత్పరః. ౪౪½

తతాద్భుత సమాకారో రాక్షసః ప్రత్యదృశ్యత. ౪౫

ఆసీదతుః తత స్తత్ర తా వుభే ప్రముఖే స్థితమ్
2 అగ్నిజ్వాలానికాశేన లలాటస్థేన దీప్యతా. ౪౬
ఏకే నోరసి ఘోరేణ నయనే నాశు దర్శినా
మహాదంష్ట్రోపపన్నం తం లేలిహానం మహాముఖం. ౪౭
3 బాహూ యోజనమాత్రేణ వ్యాపృతౌ తస్య రక్షసః
కబంధోనామ దైత్యేంద్ర స్సర్వసత్వవిహింసకః. ౪౮
తద్బాహ్వో ర్మధ్యదేశేతు చరంతౌ రామలక్ష్మణౌ
4 తథా తౌ సమభిక్రమ్య క్రోశమాత్రే దదర్శతుః. ౪౯
స మహాబాహు రత్యర్థం ప్రసార్య విపులౌ భుజౌ
జగ్రాహ సహితా వేవ రాఘవౌ పీడయన్ బలాత్. ౫౦

1. అధ్యాత్మ రా. ౯ స. 2. వాల్మీకి రా. ౬౯ స.
3. అధ్యాత్మ ౯ స. 4. వాల్మీకి రా. ౬౯.



౪౧-౪౨ మఱియు నది లక్ష్మణుని గౌఁగిలించుకొని, నే నయోముఖి యనుదానను. నీకుఁ దొరికితిని. నీవు నాకుఁ బ్రియుఁడవైతివి. మిగిలి యున్న యాయువున వీరుఁడా! నీవు నాతోఁ గ్రీడింపుము.

౪౩-౪౩½ ఇట్లని పలుకఁగా కుపితుఁడై శత్రుసంహారకుం డగు లక్ష్మణుఁడు కత్తిఁదీసి దాని చెవులు ముక్కు స్తనములు గత్తిరించెను. భయంకర ముగాఁ గన్పట్టు నారక్కసి వచ్చినదారినే పారిపోయెను.

౪౪-౪౪½ పిమ్మట శ్రీరామచంద్రుఁడు లక్ష్మణునితో మరల దుఃఖమును బొందుచు సీతను వెదకుటయందు శ్రద్ధగలవాఁడై మఱొక్కయడవి కేగెను.

౪౫ అట వింత గొలుపునాకారముఁగల యొక్కరక్కసుఁడు చూపట్టెను.

౪౬-౪౭ అగ్నిజ్వాలవలె వెలుఁగెడునదియుఁ జులుకుగాఁ జూచునదియు నగు నొక్కఘోర మగు కన్ను కలిగి, పెద్దకోఱలతోఁ గూడి మాటిమాటికి నాలుక నల్లార్చుచున్న పెద్దముఖము గలిగియున్న యెదుటఁ జూపట్టెడు రక్కసుని రామలక్ష్మణులు సమీపించిరి.

౪౮-౪౯ ఆరక్కసుని బాహువు లొక్కొక్క యోజనము పొడవు కలిగి యున్నవి. అన్ని జంతువులహింసించువాఁడు దైత్యపతి యగు కబంధుఁ డనువాఁడు వాని బాహువులమధ్యభాగమున నారామలక్ష్మణులు సంచరించుచు, నంతంతటఁ బోయి యొకక్రోసు దూరమున వానిని జూచిరి.

౫౦-౫౧ దీర్ఘబాహువులు కల యాకబంధుఁడు భుజములఁ జాచి యా రామలక్ష్మణుల నిద్దరిని కలిపి బలాత్కారమున నలిపి పట్టుకొనెను. అయ్యెడ శూరుఁ డగు శ్రీరామచంద్రుఁ డించుకయు బాధ నొంద

తతో ధైర్యేణ శూరస్తు రాఘవో నైవ వివ్యథే
బాల్యా దనాశ్రియత్వా చ్చ లక్ష్మణ స్త్వతివివ్యథే. ౫౧
ఉవాచ చ విషణ్ణ స్సన్ రాఘవం రాఘ వానుజః. ౫౧½

పశ్య మాం వీర! వివశం రాక్షసస్య వశం గతం. ౫౨
మాం హి భూతబలింకృత్వా పలాయస్వ యథా సుఖం
అధిగంతాసి వైదేహీ మచిరేణేతి మే మతిః. ౫౩

ఉవాచ లక్ష్మణం రామో ముఖేన పరిశుష్యతా. ౫౩½

కృచ్ఛ్రా త్కృచ్ఛ్రతరం ప్రాప్య దారుణం సత్యవిక్రమ! ౫౪
వ్యసనంజీవితాంతాయప్రాప్తమప్రాప్యతాం ప్రియాం. ౫౪½

[1] కబంధా ద్గ్రహణం జ్ఞాత్వా రామంచ సహ లక్ష్మణం. ౫౫
లంకాం ప్రాసంతో జగ్ము స్తే రాక్షసా రామశాత్రవాః. ౫౫½

తదాది వాలిసంహారపర్యంతం నావిద త్కథాం. ౫౬
రావణో బుద్ధిమోహేన స్వతపః క్షయహేతునా. ౫౬½

[2] రామః ప్రోవాచ విహసన్ పశ్య లక్ష్మణ! రాక్షసం. ౫౭
కిం కర్తవ్య మితో ఽస్మాభి రిదానీం భక్షయే త్స నా. ౫౭½

1. శివరామాయణం. 2. అధ్యాత్మ రా. ౯ స.



లేదు. చిన్నతన మగుటచేతను ధైర్యములేని కతమునను లక్ష్మణుఁడు మిగుల ఖిన్నుఁ డయ్యెను.

౫౧½ విషాదముం బొంది లక్ష్మణుఁడు రామచంద్రునిం గని యిట్లు పలికెను. నూడ;

౫౨-౫౩ ఓవీరుఁడా! శ్రీరామచంద్రా! రక్కసునకు లొంగిపోయి, వివశుఁడనై యున్న నన్నుం జూడుము. న న్నీ భూతమునకు బలి యిచ్చి సుఖముగా నీవు పరువెత్తుము. త్వరలోనే జానకిని బొందఁగలవు. ఇది నానిశ్చయము.

౫౩½ శ్రీరామచంద్రుఁ డంత వాడువారిన ముఖముతో లక్ష్మణునితో ని ట్లనియె.

౫౪-౫౪½ సత్యపరాక్రమముగల లక్ష్మణా! బాధలన్నిటికంటె మిపులబాధయైన దానిని ( రాజ్యభ్రంశ వనవాస సీతాహరణాదికము ) పొంది యున్న మనకు, నాప్రియురాలు దొరకలేదు సరిగదా! యింతట మనప్రాణాంతముకొఱకై మఱల మన కీదారుణమైన దుఃఖము సంప్రాప్తమైనది.

౫౫-౫౫½ కబంధునిచేఁ బట్టువడిన రామలక్ష్మణుల నెఱింగి, నవ్వుకొనుచు రామశాత్రవు లగు నారావణునిగూఢచారులైన రాక్షసులు లంకకుఁ బోయిరి.

౫౬-౫౬½ అందుచే నది మొదలు వాలివధ యగువరకుఁ గల కథను, తాఁ జేసిన తపస్సు క్షయమై పోవుటవలనఁ దటస్థించిన బుద్ధిమోహముచే రావణుఁ డెఱుంగఁడు.

౫౭-౫౭½ (ఇట) శ్రీరామచంద్రుఁడు నవ్వుచు, లక్ష్మణా! రాక్షసునిఁజూడుము. ఈపై మన మేమి చేయఁదగును? ఇప్పుడు వాఁడు మనలఁ దినివేయును.

లక్ష్మణ స్త్వమువా చేదం కిం విచారేణ రాఘవ! ౫౮
ఆవా మేకై క మవ్యగ్రౌ ఛిన్ద్వాం రక్షో భుజౌ ధ్రువం. ౫౮½

తథేతి రామః ఖడ్గేన భుజం దక్షిణ మచ్ఛినత్. ౫౯
తథైవ లక్ష్మణో వామం చిచ్ఛేద భుజ మంజసా. ౫౯½

1 స పపాత మహాబాహు శ్ఛిన్నబాహు ర్మహాస్వనః. ౬౦
ఖంచ గాంచ దిశశ్చైవ నాదయన్ జలదో యథా
దీనః పప్రచ్ఛతౌ వీరౌ కౌ యువా మితి దానవః. ౬౧

ఇతి తస్య బ్రువాణస్య లక్ష్మణ శ్శుభలక్షణః.
శశంస రాఘవం తస్య కబంధస్య మహాత్మనః. ౬౨

కబంధ ఉవాచ—
ధన్యో ఽహం యది రామ స్త్వ మాగతో ఽసి మమాంతికం. ౬౨½

పురా గంధర్వరాజో ఽహం రూపయౌవనదర్పితః. ౬౩
తపసా బ్రహ్మణో లబ్ధ మవధ్యత్వం రఘూత్తమ!
విచరన్ లోక మఖిలం వరనారీమనోహరః. ౬౪
* అష్టావక్రమునిం దృష్ట్వా కదాచి దహసం పురా
క్రుద్ధో ఽసా వాహ దుష్టత్వం రాక్షసో భవ దుర్మతే! ౬౫

* అష్టావక్రః—తస్య స్థూలశిర ఇతి నామాంతరం.

1. వాల్మీకి రా. ౭౦ స.



౫౮-౫౮½ అంత లక్ష్మణుఁ డిట్లనియె- రామచంద్రా! విచార మేలని? మన మిర్వురము తొందరపాటులేక, యారక్కసుని యొక్కొక్కబాహువును దప్పక తెగఁగొట్టుదము.

౫౯-౫౯½ సరియే యని శ్రీరామచంద్రుఁడు వానికుడిబాహువును గత్తిచే నఱికెను. అట్లే లక్ష్మణుఁడును వేవేగ వాని యెడమభుజమును ఖండించెను.

౬౦-౬౧ దీర్ఘబాహువులు గల యారక్కసుఁడు, పెద్దపెట్టున నార్చుచు, భూమిని ఆకసము దిక్కులనుగూడ మేఘ మట్లు ప్రతిధ్వనింపఁ జేయుచుఁ బడిపోయెను. మఱియు నాదానవుఁడు, దీనుఁడై "మీరి ద్దరు నెవ్వరు?" అని యడిగెను.

౬౨ ఇట్లు వాఁ డడుగఁగా శుభలక్షణములు గల లక్ష్మణుఁడు మహాత్ముఁ డగు కబంధునకు శ్రీరామచంద్రు నెఱింగించెను.

కబంధుఁ డి ట్లనియె-

౬౨½ శ్రీరామచంద్రుఁడ వగు నీవే నాసమీపమున కరుదెంచితివేని నేను ధన్యుఁడను.

౬౩-౬౫ మున్ను నేను అందము, యౌవనము మొదలగువానిచే మదించి యున్న యొక గంధర్వప్రభుఁడను. శ్రీరామచంద్రా! తపసుచేసి బ్రహ్మవలనఁ జావులేకుండువరమును బొందితిని. అందకత్తె లగు స్త్రీలమనస్సులను హరించువాఁడనై, సమస్తలోకములందును దిరుగుచు, మున్నొకప్పు *డష్టావక్రుఁ డను మునింగాంచి పరిహాసముచేసితిని; అంత నాముని కోపించి "ఓదుర్మతీ! రాక్షసుఁడవు క" మ్మని శాపం బిచ్చెను.

* అష్టావక్రునకు స్థూలశిరస్కుం డనియుఁ బేరు గలదు.

అష్టావక్రః పునః ప్రాహ వందితో మే దయాపరః
త్రేతాయుగే దాశరథిర్భూత్వా నారాయణ స్స్వయం. ౬౬
ఆగమిష్యతి తే బాహూ ఛిద్యేతే యోజనాయతే
తేన శాపా ద్వినిర్ముక్తో భవిష్యసి యథా పురా. ౬౭

కదాచి ద్దేవరాజాన మభ్యద్రవ మహం రుషా
సోఽపి వజ్రేణ మాం రామ! శిరోదేశేఽభ్యతాడయత్. ౬౮
తదా శిరోగతం కుక్షిం పాదా చ రఘునందన!
తతో మాం ప్రాహ మఘవా జఠరే తే ముఖం భవేత్. ౬౯
బాహూ తే యోజనాయామౌ భవిష్యత ఇతి ప్రభుః. ౬౯½

ఇతఃపరం మాం శ్వభ్రస్యే నిక్షిపాగ్నీంధనావృతే. ౭౦
అగ్నినా దహ్యమానోఽహం త్వయా రఘుకులోత్తమ!
పూర్వరూప మనుప్రాప్య భార్యామార్గం వదామి తే. ౭౧

[1] విజ్ఞానంహి మమ భ్రష్టం శాపదోషేణ రాఘవ!
వక్ష్యామి త మహం వీరం య స్తం జ్ఞాస్యసి రాక్షసం. ౭౨

ఇతి శ్రీరామాయణసారోద్ధారే అరణ్యకాండే
షోడశస్సర్గః.



1. వాల్మీకి రా. ౭౧ స.



౬౬-౬౭ అమ్మునివరుని మఱల నాచే మ్రొక్కఁబడి, దయాళుఁడై త్రేతాయుగమున శ్రీమన్నారాయణుఁడు దశరథకుమారుఁడై నీకడకు రాఁగలఁడు. యోజనముపొడవైన నీబాహువులు నరకును. అందుచే నీవు శాపమునుండి విడివడి ముందటి యట్లగుదువు అనియె.

౬౮-౬౯½ శ్రీరామచంద్రా! పిమ్మట నే నింద్రునిపైకిఁ బోయి యెదుర్కొంటిని. అతఁడును నాతలపైన వజ్రాయుధముతోఁ గొట్టెను. అప్పుడీశిరస్సును, పాదములును గడుపులోఁ దూరెను. అటుపై ప్రభుఁడగు నింద్రుఁడు న న్గని నీకడుపుననే ముఖ ముండును. నీబాహువులు యోజనముపాటిపొడవుగలిగిన వగు ననెను.

౭౦-౭౧ శ్రీరామచంద్రా! ఇటుపై నన్ను, అగ్నిరాల్చి కట్టెలు వైచి మంటఁబెట్టిన గోతిలోఁ బారవేయుము. రఘుకులోత్తమా! నీచే నే నగ్నిచేఁ దగులువడి వెనుకటి రాక్షసరూపమును వదలి నీభార్య జాడ నీకుఁ దెలుపుదును.

౭౨ శ్రీరామచంద్రా! నాకుఁ గల విజ్ఞానమంతయు నీశాపదోషముచే నశించెను. (ఇపుడు శాపముపోవుటచే) నీభార్యను హరించిన వీరుఁడగు నారక్కసుఁ దెల్పెదను, తెలిసికొనుము.

ఇది శ్రీరామాయణసారోద్ధారమున నరణ్యకాండమున
పదునాఱవసర్గము.



# సప్తదశస్సర్గః.

1 ఏవ ముక్తౌతు తౌ వీరౌ కబంధేన నరేశ్వరౌ
గిరిప్రదర మాసాద్య పావకం విససర్జతుః. ౧

తచ్ఛరీరం కబంధస్య ఘృతపిండోపమం మహత్
మేదసా పచ్యమానస్య మందం దహతి పావకః. ౨

స విధూయ చితా మాశు విధూమో௨గ్ని రివోత్థితః
అరజే వాససీ బిభ్ర న్మాలాం దివ్యాం మహాబలః. ౩
విమానే భాస్వరే తిష్ఠ న్హంసయుక్తే యశస్కరే
2 కందర్పసదృశాకార స్సర్వాభరణభూషితః. ౪
రామం ప్రదక్షిణం కృత్వా సాష్టాంగం ప్రణిపత్యచ
కృతాంజలి రువా చేదం భక్తిగద్గదయా గిరా. ౫

త్వమేవ సర్వకైవల్యం లోకా స్తే௨వయవాః స్మృతాః
య దస్మి న్స్థూలరూపే తే మన స్సంధార్య తే నరైః. ౬
అనాయాసేన ముక్తి స్స్యా దతో௨న్య న్నహికించన
అతో௨హం రామ! రూపం తే స్థూల మేవానుభావయే. ౭
యస్మి న్ధ్యాతే ప్రేమరస స్సరోమపులకో భవేత్. ౮

1. వాల్మీకి రా. ౭౨ స. 2. అధ్యాత్మ ౯ స.



# పదునేడవ సర్గము.

౧ ఇట్లు కబంధుఁడు పలుకఁగా వీరులును నరనాయకులు నగు రామలక్ష్మణులు వాని నొక గోతిలోనికి దొర్లించి చిచ్చువెట్టిరి.

౨ మాంసముచే బాగుగఁ బరిపుష్టిఁ బొంది నేతిముద్దయట్లున్న వానిశరీరము నగ్ని మెల్లమెల్లన దహించెను.

౩-౫ మహాబలుఁడగు నాకబంధుఁ డాచితియందుండి పొగలేని యగ్నివలెఁ బైకెగసి శుభ్రములైన బట్టలు కట్టుకొని దివ్యమైనమాలను దాల్చి ప్రకాశించునదియు, * హంసలఁ బూన్చిన కీర్తికరమగు విమానము నెక్కి మన్మథునితో సమానమగు నాకారము కలవాఁడై సర్వవిధములగు నాభరణములం దాల్చి, శ్రీరామచంద్రునకుఁ బ్రదక్షిణ మాచరించి సాష్టాంగనమస్కార మొనరించి దోసిలొగ్గి భక్తిచే గద్గదిక గదురు వాక్కున నిట్లనియె.

౬-౮ శ్రీరామచంద్రా! నీవే సర్వమోక్షస్వరూపుఁడవు. ఈలోకము లన్నియు నీ కవయవము లని చెప్పఁబడునవి. ఈస్థూలమైన నీరూపమున మానవుల మనస్సు విడువక నిల్పఁబడునేని, యనాయాసముగానే వారికి ముక్తి లభించును. ఇంతకుమీరి సాధనములేదు. ఇందుచే, యేరూపమును దలఁచినంతనే ప్రేమరసమున మేను బులకించునో అట్టి నీస్థూలరూపము నేనే నామనసున ననుసంధానము చేసెదను.

* హంసలఁబూన్చిన దనుటచే నీకబంధునికి 'బ్రహ్మలోకప్రాప్తి' సూచింపఁబడుచున్నది.

ధనుర్బాణధరం శ్యామం జటావల్కలభూషితం.
అపీచ్యవయసం సీతాం విచిన్వంతం స లక్ష్మణం. ౮
ఇద మేవ సదా మే స్యా న్మానసే రఘునందన! ౯

సర్వజ్ఞ శ్శంకర స్సాక్షా త్పార్వత్యా సహిత స్సదా
త్వద్రూపమేవ సతతం ధ్యాయ న్నాస్తే రఘూత్తమ! ౧౦
అత స్త్వం జానకీనాథ! పరమాత్మా న సంశయః
త్రాహి త్రాహి జగన్నాథ! మాం మాయానావృణోతు తే.
1 సో ఽంతరిక్షగతో రామం కబంధో వాక్య మబ్రవీత్
శృణు రాఘవ! తత్త్వేన యథా సీతా మవాప్స్యసి. ౧౨
రామ! *షడ్యుక్తయో లోకే యాభి స్సర్వం విమృశ్యతే
పరిమృష్టో దశాంతేన దశా భాగేన సేవ్యతే. ౧౩

* రామఇతి.— యుక్తయః ఉపాయాః తేచ సంధివిగ్రహయానాసనద్వైధీభావసమాశ్రయా ఇతి షట్. అన్యే షడ్యుక్తయః. ప్రత్యక్షానుమానోపమానశబ్దార్థాపత్త్యభావాది షట్ప్రమాణా నీతి వ్యాచఖ్యుః. అత్ర సర్వప్రమాణైః క్షీణః పురుషః క్షీణేన పురుషేణ సేవ్యత ఇతి ఫలితార్థః. తత్రాన్వయవ్యతిరేకమూలం ప్రత్యక్షం దర్శయతి. యత్కృతే వ్యసన మితి త్వయా దారప్రధర్షణ మితి చానుమానం దర్శయతి. అకృత్వా నహీ త్యర్థాపత్తిం దర్శయతి. వయస్యంత మితి శబ్దప్రమాణం దర్శయతి.

1. వాల్మీకి రా. ౭౨ స.



౮-౯ రఘునందనా! శ్రీరామా! ధనువును బాణములను దాల్చి, మేఘమువలె శ్యామవర్ణముగల్గి, జడలు, నారచీరలు ధరించి, సీతను వెదకుచు, లక్ష్మణునితోఁ గలిసి చరించు నీ యీరూపమే యెల్లప్పుడు నామనసున నిల్చుగాక!

౧౦-౧౧ రఘూత్తమా! సాక్షాచ్ఛ్రీశంకరు లెల్లప్పుడు పార్వతితోఁ గూడ నీరూపమునే ధ్యానించు చుందురు. అందువలన నోజానకీప్రాణనాయకా! శ్రీరామచంద్రా! నీవు పరమాత్మవే! సంశయము లేదు. జగత్పతీ! నన్ను రక్షింపుము, రక్షింపుము. నీమాయ నన్నావరింపకుండుగాత!

౧౨-౧౩ ఆకబంధుఁ డాకసమున నిల్చి రామునితో నీమాట పల్కెను— శ్రీరామా! పరమార్థముగా సీత నెట్లు పొందెదవో వినుము. లోకమున సర్వమును విమర్శించి తెలిసికొనుట *కా ఉపాయములు కలవు. దుర్దశాపరిపాకమున సంస్పృష్టుం డగువాఁడు, దుర్దశాపరిపాకముయొక్క భాగము ననుభవించువానిచే సేవింపఁబడును (వానికిని,

* యుక్తయః = ఉపాయములు. అవి సంధి, విగ్రహము, యానము, ద్వైధీభావము, సమాశ్రయము నని యాఱు. మఱి యాఱువిధములగు యుక్తు లున్నవి. అవి ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, శబ్దము, అర్థాపత్త్యము, భావము యనునవి. ఇట నన్ని ప్రమాణములచేతను చెడియున్న పురుషుఁడు, చెడియున్న పురుషునిచే సేవింపఁబడు నని ఫలితార్థము. 'నీ విప్రుడు దుర్దశాపరిపాకాంశము ననుభవించుచున్నావు' అనుడానిచేఁ బ్రత్యక్షప్రమాణమును, 'ఎందువలన నీకు భార్య హరింపఁబడుటచే నేదైన్యము సంప్రాప్తమైనదో' యనుదానిచే ననుమానప్రమాణమును, 'అట్లు చెలిమిచేయనిదే నీకుఁ గార్యసిద్ధి యాలోచించినంత నాకుఁ బొడఁగట్టుట లేదు' అనుటచే నర్థాపత్తి ప్రమాణమును (గలుఁగఁబోవు ప్రయోజనమును బట్టి యూహింపఁబడినది యర్థాపత్తి), 'ఇటనుండి యిప్పుడే వేగ పోయి యతని స్నేహితునిగాఁ జేసికొను' మనుటచే శబ్దప్రమాణమును వ్యక్తములు.

దశాభాగగతో హీన స్త్వం హి రామ స్సలక్ష్మణః
యత్కృతే వ్యసనం ప్రాప్తం త్వయా దారప్రధర్షణమ్. ౧౪

త దవశ్యం త్వయా కార్య స్స సుహృ త్సుహృదాంవర!
అకృత్వాహి న తే సిద్ధి మహం పశ్యామి చింతయ౯. ౧౫

శ్రూయతాం రామ! వక్ష్యామి సుగ్రీవో నామ వానరః
భ్రాత్రా నిర స్తః క్రుద్ధేన వాలినా శక్రసూనునా. ౧౬
ఋశ్యమూకే గిరివరే పంపాపర్యంతశోభితే
* నివస త్యాత్మవా న్వీర శ్చతుర్భిస్సహ వానరైః. ౧౭

---

* అథ శ్రీరామ రావణ వానరాణాం
యథార్థస్వరూప విచారః.

అస్మి న్విషయే ప్రకృతే నవీనకల్పితకథాగ్రంథి విచ్ఛేదనపూర్వకం శ్రీరామాయణే ప్రతిపాదిత శ్రీరామరావణ వానరాః కే ఇతి తత్వతో నిరూపణం క్రియతే.

పూర్వపక్షిణాం నవీనసిద్ధాంతస్య కతిపయై ర్విరచితాః కేంబ్రిడ్జి-హిందూమహాయుగాది గ్రంథా ఏ వాధారః. ప్రధానమల్లనిబర్హణన్యాయేన తేషాం ప్రధానా న్నిరసితుం ప్రకృత మనుసరామః. తేషాం మతే హైందవానాం మధ్యే ఆర్యానామకశాఖీయా ఏతే, ఇరాన్ ఇత్యాదినా లోకే వ్యవహ్రియమాణదేశా దేత ద్దక్షిణదేశ మాప



వానికిని కలయిక చేకూరు నన్నమాట). ఎందుచే నీకు భార్య హరింపఁబడుట రూపమైన దుఃఖము సంప్రాప్త మగుటఁ గలిగెనో యాకారణముచే నిప్పుడు నీవు లక్ష్మణునితోఁగూడ దుర్దశాపరిపాకాంశము ననుభవించు హీనుఁడవై తగ్గియున్నావు.

౧౫ మిత్రులందరికి శ్రేష్ఠుఁ డగు మిత్రుఁడా! అందువలన నీవు తప్పక యట్టిస్నేహితుఁడు (అనఁగా దశాంతగతుఁడైనట్టివాఁడు), సంపాదింపఁదగినవాఁడు. అట్లు చెలిమిచేయనిదే నీకుఁ గార్యసిద్ధి యాలోచింపఁగా నాకుఁ బొడసూపుట లేదు.

౧౬-౧౭ (అందులకు) శ్రీరామచంద్రా! వినుము చెప్పుచున్నాను. వీరుఁడు,
* నాత్మగౌరవవంతుఁడు నగు సుగ్రీవుఁ డను వానరుఁడు కుపితుఁడైన యన్నయు, దేవేంద్రునికుమారుఁడు నగు వాలిచేఁ దిరస్కరింపఁబడి ఋష్యమూక మను నొకపర్వతశ్రేష్ఠముపై నల్గురు వానరులతోఁ గూడ నివసించుచున్నాఁడు.

---

* శ్రీరాముఁడు - రావణుఁడు - వానరులు,
వీరల నిజస్వరూపములను గూర్చిన విచారము.

ఈవిషయమున నేఁడు నవీనులచేఁ గల్పింపఁబడు గాథలలోఁ గల ముడులను (అనఁగాఁ గ్లిష్టములై దుర్బోధములుగా నున్న యసందర్భములను) ఖండించి శ్రీరామాయణమునఁ బ్రతిపాదింపఁబడిన శ్రీరామ రావణ వానరు లెవ్వరు? అని యథార్థముగా నిరూపణము గావింపఁ బడుచున్నది.

పూర్వపక్షులు గావించు క్రొత్త సిద్ధాంతమునకుఁ గొంతమందిచే వ్రాయఁబడిన కేంబ్రిడ్జి, హిందూమహాయుగము మొదలగు గ్రంథములే యాధారము. ప్రధానమల్లనిబర్హణ న్యాయముగా (ముఖ్యుఁడగు మల్లుని జయించిన సామాన్య మల్లురనెల్లరఁ జయించినట్లే యనునట్లు) నవీనులలోఁ బ్రధానులగువారిని ద్రోసిపుచ్చుటకుఁ బ్రకృతము ననుసరించుచున్నారము. - వారి మతములో 'శ్రీరామాదులు' హైందవుల నడుమ ఆర్యు లను పేరుగల శాఖకుఁ జెందినవారు.

వానరేన్ద్రో మహావీర్య స్తేజోవా నమితప్రభః
సత్యసంధో వినీతశ్చ ధృతిమా న్మతిమా న్మహాన్. ౧౮

---

ద్వైపమ్యేణ చతుస్సహస్రవత్సరేభ్యః పూర్వ మాగతా ఇతి. ఆర్యానామ ఆరా ద్దూరా ద్యాంతీ త్యార్యా ఇతి వ్యుత్పత్త్యా దూరదేశా దాగతా ఇతి. తద్దృష్టాంతత్వేన ఋగ్వేదే ౧౦-౧౭-౮మంత్రే 'హేపూషన్! అస్మత్ప్రయాణపూర్తిం కురు. సర్వసంకటా న్నివారయ. అపమార్గం మానయ. అస్మాకం ద్రోహకారిణః మార్గా దపవారయేతి. అపి చైత జ్జాతీయమంత్రా స్తత్ర బహవ స్సంతి. యజుర్వేదే—'సహవై దేవానాం' ఇత్యాది మంత్రాస్తు త్రివిష్టప మిదానీం హిందూదేశా త్సార్ధక్రోశపరిమితోన్నతిమంతం (Tibet) టిబెట్టు ప్రదేశ మారోఢు మసమర్థాః కృతప్రయత్నా బభూవు రితి బోధయంతి.

అథ ద్రావిడానామవేదమంత్రా ద్యభిజ్ఞా ఇతి. ఆర్యాగమనా త్పూర్వమే వా త్రాగత్య వింధ్యాద్రిదక్షిణదేశే నివసతః కిరాతాదీ న్బహి ర్నిర్గమయ్య తద్దేశ మాక్రాంతా ఇతి - ఇత శ్చతుస్సహస్రవత్సరేభ్యః పూర్వ మార్యద్రావిడసంగ్రామః ప్రవృత్తేతి- సఏవ రామరావణయుద్ధమితి- రామాదయ ఏ వార్యా ఇతి- రావణాదిరాక్షసా ఏవ ద్రావిడా ఇతి- కిరాతా ద్యాటవికా ఏవ వానరా ఇతి- అతఏవ కపిశబ్దవాచ్యా ఏవ 'కాపు' ఇతి లోకే వ్యవహ్రియ



౧౭-౧౮ అతఁడు వానరులకు రాజు. మహాబలసంపన్నుఁడు. అఖండప్రతాపశాలి. అంతులేని బుద్ధివిశేషముకలవాఁడు. సత్యవ్రతుఁడు. వినయవంతుఁడు. ధైర్యవంతుఁడు. మతిమంతుఁడు. గొప్పవాఁడు.

---

'ఇరాన్' అను టాదిగ లోకమున వ్యవహరింపఁబడు దేశమునుండి యీ దక్షిణ దేశమునకు ఇంచు మించుగా నాల్గువేల సంవత్సరములకుఁ బూర్వము వచ్చిరి అని. ఆర్యు లనఁగా 'ఆరాత్ = దూరమునుండి, యాంతీ = వెళ్లినవారు' అను వ్యుత్పత్తిచే దూరదేశమునుండి వచ్చినవారు అని యర్థము. దానికి దృష్టనుగా ఋగ్వేదమున ౧౦- ౧౭- ౮ మంత్రమున 'ఓ పూషుఁడా! మాప్రయాణపూర్తిని జేయుము. అన్ని యిడుములను వారింపుము. పెడదారిఁ బట్టింపకుము. మాకు ద్రోహము సేయువారిని మాత్రోవనుండి తొలఁగింపుము' అని కలదు. ఇంక నీజాతికిఁ జేరిన మంత్రము లచ్చటఁ జాల కలవు. యజుర్వేదమున 'సహవై దేవానామ్' అని మొదలుగాఁగల మంత్రములు 'త్రివిష్టపమును' అనఁగా నేఁడు హిందూదేశమునుండి మూఁడుమైళ్లపరిమితిగల యెత్తుననున్న (Tibet) టిబెట్టు అను ప్రదేశము నెక్కుటకుఁ బ్రయత్నించి యసమర్థులైరి అని బోధించుచున్నవి.

పిమ్మట ద్రావిడు లన వేదమంత్రముల నెఱింగిన వారు, ఆర్యుల రాకకు ముందే యిటకు వచ్చి వింధ్యపర్వతమునకు దక్షిణపు ప్రదేశమున నివసించు కిరాతులు మొదలగు వారిని వెడలఁగొట్టి, యాదేశము నాక్రమించిరనియు, ఇప్పటికి నాల్గువేల సంవత్సరములకుఁ బూర్వమున నార్యులకును, ద్రావిడులకును యుద్ధము జరిగెననియు, అదే రామరావణులయుద్ధమనియు, రాముదులే యార్యులనియు, రావణాదిరాక్షసులే ద్రావిడులనియుఁ, గిరాతులు మొదలగు నడవిజాతులవారే వానరులనియుఁ, గనుకనే 'కపి' అనుపదముచేఁ జెప్పఁబడినవారే కాపులు అని లోకమున వ్యవహరింపఁ బడువారనియు వారిచే ధరింపఁబడు వ్రేలాడు గోచీలే 'తోకలు' అని వర్ణింపఁ బడెననియు నిట్లిదెల్ల గంధర్వనగరమువంటి (ఆకాశ

వయస్యం తం కురు క్షిప్రమితో గత్వాఽద్య రాఘవ!
అద్రోహాయ సమాగమ్య దీప్యమానే విభావసౌ. ౧౯

---

మాణా ఇతి—తద్ధార్యమాణలంబకౌపీనాన్యేవ వాలానీతి వర్ణితానీ త్యేత త్సర్వం గంధర్వనగరప్రాయకల్పనం పరిదృశ్యతే. త దసత్.

ఏతత్కల్పనాయాః శ్రీరామాయణస్య తద్గ్రంథస్థశ్రీరామ రావణ వానరాణాంచ తద్గ్రంథకర్తు ర్భగవత శ్శ్రీవాల్మీకే రాశయస్యచ నకో ఽపి సంబంధః. కుత ఇతి చేత్. తేషాం మతే కిరాతభూతవానరా న్బహి ర్నిస్సార్య ద్రావిడభూత రాక్షసై రేతద్దేశ స్స్వాయత్తీకరణీయః ఖలు. తద్విరుద్ధ తయా రామాయణస్యోత్తరకాండే 'శ్లో॥ దారాః పుత్రాః పురం రాష్ట్రం భోగాచ్ఛాదనభాజనం, సర్వ మే వావిభక్తం నౌ భవిష్యతి న సంశయః' ఇతి వానరరాక్షసరాజయో ర్వాలిరావణయో రగ్నిసాక్షికమిత్రతా సోదరత్వసిద్ధి శ్చాస్తీతి ద్యోతనా త్పూర్వోక్తకల్పనా కథం సంగచ్ఛతే? అపి చైతద్ధార్యమాణలంబకౌపీనాన్యేవ వాలానీతిచేత్తాదృశై ర్వాలైః పర్వతాద్యుద్ధరణం కథం శక్యేత? ఆధునికవానరా న్దృష్ట్వా వానరవాలానాం వస్తుహరణశక్తి రస్తివా? కవినా తథా వర్ణిత ఇతి ప్రశ్నః కేషాంచిత్. తత్తుచ్ఛం. కాళీ (కలకత్తా) పత్తనాదిషు జంతుశాలాసు పరిదృశ్యమానై ర్వానరవాలై ర్యాదృశీ కార్యసరణీ క్రియత ఇత్యవిచార్యైవం సంభాషణ మయుక్తం. అపిచ



రాఘవా! ఇటనుండి యిప్పుడే వేగమే పోయి, యగ్నిహోత్రుఁడు ప్రజ్వలించుచుండ (అగ్నిసాక్షిగా ననుట) నాసుగ్రీవుని స్నేహితునిగాఁ జేసికొనుము.

---

హార్మ్యమువంటిదనుట—అనఁగా బూటకము అని యర్థము) కల్పనము కనఁబట్టుచున్నది. అది సరికాదు.

ఈకల్పనలో— శ్రీరామాయణమునకును, నాగ్రంథమునఁనున్న శ్రీరామ - రావణ - వానరులకును, ఆగ్రంథమును వ్రాసిన శ్రీవాల్మీకి భగవానుల యభిప్రాయమునకును నెట్టిసంబంధము కానరాదు. ఎందుచేనన—వారిమతములో కిరాతు లగు వానరులను వెడలఁగొట్టి ద్రావిడులగు రాక్షసులచే నీదేశము స్వాధీనము చేసికొనఁబడవలెను గదా! దానికి విరుద్ధముగా, రామాయణోత్తర కాండమున 'భార్యలు, పుత్రులు, పురము, రాజధాని, భోగములు, వస్త్రములు, పాత్రలు మొదలగునవెల్ల విభాగింపఁబడకయే మనకుండుగాక! సంశయములేదు' అని వానరరాజగు వాలికిని, రాక్షసరాజగు రావణునకును అగ్నిసాక్షిగా మిత్రత్వము, సోదరత్వము సిద్ధమగుచున్నది' అని తోఁపింపఁబడుటవలన నింతకుమున్నుఁ జెప్పఁబడిన కల్పన యెట్లు సందర్భపడును ?

మఱియు, వీరిచే ధరింపఁబడిన వ్రేలాడు గోచులే తోక లగుచో నిట్టి తోకలచేఁ బర్వతాదులను పెల్లగించు టెట్లు శక్యమగును? ఇప్పటి కోతులనుజూచి; వానరులతోకలకు వస్తువులను మోయు శక్తికలదా? కవిచే నట్లు వర్ణింపబడెను—అని కొందరిప్రశ్న. అది తుచ్ఛమైనది. 'కలకత్తా' మొదలగు నగరములయందు జంతు ప్రదర్శన శాలలయందుఁ గన్పట్టు వానరములతోకలచే నెట్టి కార్యరీతి చేయఁబడుచున్నదో విమర్శింపక యిట్లు మాట్లాడుట తగదు.

మఱియు— వానరులే కిరాతులగుచో; ద్రావిడుల కనర్హములగు వేదమంత్రములును, వ్యాకరణాది శాస్త్రములును వానరులచే

సచ తే నావమంతవ్య స్సుగ్రీవో వానరాధిపః
కృతజ్ఞః కామరూపీచ సహాయార్థీచ వీర్యవాన్. ౨౦

---

వానరా ఏవ కిరాతా శ్చ ద్రావిడానర్హాణి వేదమంత్రాణి వ్యాకరణాదిశాస్త్రాణిచ వానరై రభ్యస్తానీతి వాలి సుగ్రీవ హనుమదాదిభి స్సత్కర్మానుష్ఠానం కృతమి త్యేతత్ కథం సంగచ్ఛతే? పునశ్చ ప్రతిప క్ష్యుదాహృతరీత్యా కిరాతాః (వానరాః) వింధ్యాద్రిదక్షిణదేశ ఏవ స్థాతవ్యాః. రామాయణోక్తవానరాస్తు వింధ్యాద్రే ర్దక్షిణదేశఏవ స్థితా ఇతి కుత్రాస్తి? క్షీరాబ్ధిమేరూదయకైలాసాదిప్రదేశేషు వనాంతరేషు ద్వీపాంతరేషు వానరా స్థితా ఇతి శ్రీమద్రామాయణే వర్తతే. తస్మా దేతే వానరా న కిరాతా ఇతి స్పష్టం.

అథ రావణాదిరాక్షసా ఏవ ద్రావిడా ఇత్యుక్తిశ్చ నసంగచ్ఛతే. తథాహి పూర్వోక్తరీత్యా వేదమంత్రానభిజ్ఞాః ఖలు ద్రావిడాః రామాయణోక్తరాక్షసానాం మధ్యే నకేపి మంత్రానభిజ్ఞాః ప్రత్యుత విశేషత స్తే షడంగవేదవిద శ్శివభక్తా మంత్రవద్ధోతార శ్చేతి రామాయణ మేవ కథయతి. అత స్త త్తుచ్ఛం. ప్రతిద్వంద్విరీత్యా ద్రావిడై రపి వింధ్యా ద్దక్షిణభాగఏవ వస్తవ్యం. తద్విరుద్ధతయా రావణాదయో లంకాయాం స్థితాః. వింధ్యాద్రే రుత్తర



౨౦ కృతజ్ఞుఁడు (చేసినమేలు మఱువనివాఁడు), కామరూపియు (ఇచ్చవచ్చిన రూపమును దాల్పఁగలవాఁడు), సహాయమును గోరువాఁడు, తేజోవంతుఁడు (బలవంతుఁడు); అట్టివానరులకు రాజగు సుగ్రీవు నెన్నఁడు నవమానపఱుపకుము (నీచే నెన్నఁ డవమాన పరుపఁదగినవాఁడు కాఁడు).

---

నభ్యసింపఁ బడినవనియు, వాలి, సుగ్రీవుఁడు, హనుమంతుఁడు మొదలగు వారిచే సత్కర్మానుష్ఠానము చేయఁబడెననియు నిదంతయు నెట్లు సందర్భపడును? మఱియుఁ బ్రతిపక్షులన్నరీతిగాఁ గిరాతులు (వానరులు) వింధ్యాద్రికి దక్షిణదేశమందే యుండవలసినవారు. రామాయణమందుఁ జెప్పఁబడినవానరులో వింధ్యాద్రికి దక్షిణదేశమందే యుండిరని యెచ్చట నున్నది? 'క్షీగసముద్రము, మేరువు, ఉదయ పర్వతము, కైలాసము మొదలగు ప్రదేశములయందు, వనాంతరములందు, ద్వీపములయందు వానరు లున్నారు' అని శ్రీమద్రామాయణమునఁ గలదు. అందువలన వీరు వానరులు గాని, కిరాతులు గారు అని స్పష్టము.

ఇఁక 'రావణాది రాక్షసులే ద్రావిడులు' అన్న మాటయు సందర్భపడదు. ఏమా! ఇంతకు మున్ను చెప్పఁబడిన రీతిచే, వేదమంత్రముల నెఱుంగని వారు కదా ద్రావిడులు. రామాయణమందుఁ జెప్పఁబడిన రాక్షసుల మధ్య నెవ్వరును మంత్రము నెఱుంగని వారు లేరు. కాక పైగా "వారు సాంగవేదాధ్యయన సంపన్నులు, శివభక్తులు, మంత్రవత్తుగా హోమమును జేయువారును" అని రామాయణమే చెప్పుచున్నది. కనుక నది తప్పు. ప్రతిపక్షులరీతిచే ద్రావిడులు వింధ్యకు దక్షిణభాగమందే నివసింప వలసియున్నది. అందులకు విరుద్ధముగా రావణాదులు లంకయం దుండిరి. వింధ్యాద్రి కుత్తర భాగమునఁ దాటక శ్రీరామునిచేఁ జంపఁబడినది. పడమటిదెస చక్రవంత మను

స ఋక్షరజసః పుత్రః పంపా మటతి శంకితః
భాస్కరస్యౌరసః పుత్రో వాలినా కృతకిల్బిషః. ౨౧

భాగే తాటకా శ్రీరామేణ హతా. పశ్చిమదిశి చక్రవత్పర్వతే సింధుసాగరసంగా త్పరం పంచజనహయగ్రీవాదయ స్సంతి. సువర్ణశృంగపర్వతే ప్రాగ్జ్యోతిషపట్టణే నరకాసురోఽస్తి. ఉత్తరభాగే క్రౌంచా త్పరం మైనాకపర్వతే మయోఽస్తి. శ్రీరామాయణోక్తదిశా సర్వదిగంతవ్యాప్తా రాక్షసా స్సంతీతి ద్యోత్యతే. రాక్షసాఏవ ద్రావిడా ఇతి, కిరాతభూతవానరా న్నిస్సార్య వింధ్యా ద్దక్షిణదేశే స్థితాఇతి చ కేవలసాహసమే వానుసృత్య కథనా త్కిమసత్య మస్తి.

తథైవ శ్రీరామాదయో ప్యయోధ్యాయాం జనిత్వా తత్రైవ స్థితత్వా త్ప్రతిపక్షుక్తార్యా నేతి సిద్ధాంతః. శ్లో॥ ఉత్తరం య స్సముద్రస్య హిమవద్దక్షిణంచ యత్, వర్షం తద్భారతం నామ యత్రేమా భారతీ ప్రజాః. భరణాచ్చ ప్రజానాం వైమను ర్భరత ఉచ్యతే, నిరుక్తవచనా చ్చైవ వర్షం త ద్భారతం స్మృతమిత్యేవం జాతీయకబహుస్మృ త్యనుగ్రహాత్. 'య దిదం భారతం వర్షం యస్మి న్స్వాయంభువాదయః; చతుర్ద శైతే మనవః ప్రజా స్తత్ర సస్పృంజిరే' ఇతి సర్వతః పరిదృశ్యమానత్వాచ్చ.



౨౧ అతఁడు ఋక్షరజ స్సను నామె కుమారుఁడు. భాస్కరుని కౌరసకుమారుఁడు. వాలిచే విరోధింపఁబడి వానివలని భీతిచే సంశయించుచు బంపాసరోవరప్రాంతములఁ దిరుగాఁడుచుండును.

పర్వతమున, సముద్రసంగమస్థానమునకుఁ దరువాత, పంచజన హయగ్రీవాదు లున్నారు. సువర్ణ శృంగ పర్వతమున ప్రాగ్జ్యోతిష పట్టణమున నరకాసురుఁ డున్నాఁడు. ఉత్తరభాగమునఁ గ్రౌంచమునకుఁ బైన మైనాక పర్వతమున మయుఁడున్నవాఁడు. శ్రీరామాయణమునఁ జెప్పఁబడిన రీతిచే సమస్తదిగంతములయందు వ్యాపించి రాక్షసు లున్నారని తోఁచుచున్నది. రాక్షసులే ద్రావిడులు అని చెప్పినారు. కిరాతులైన వానరులఁ దఱిమి వింధ్యకు దక్షిణ దేశమున నుండిరనియుఁ గేవలము సాహసమునే యనుసరించి చెప్పు దానికంటె నసత్య మే మున్నది?

అట్లే శ్రీరామాదు లయోధ్యయందుఁ బుట్టి, యచటనే యుండినవారగుటచేఁ బ్రతిపక్షులన్నట్లు వా రార్యులు గా రని సిద్ధాంతము. "సముద్రమున కుత్తరమునను, హిమవత్పర్వతమునకు దక్షిణమున నేదేశము గలదో, అది భారతము. అచట 'భారతీయులు' అను ప్రజ లున్నారు. ప్రజలను భరించుటచే మనువు భరతుఁ డని చెప్పఁ బడును. నిరుక్తమునందుఁ గల వచనమువలనను, (అతఁ డేలినది) 'భారతము' అని చెప్పఁబడినది" అను నీవిధము లగు ననేక స్మృతులయనుగ్రహమునను, "ఎందుచే నిది భారతవర్షమో, దేనియందు స్వాయంభువాదులు పదునల్గురుమనువులు ప్రజలను బాలించిరో" అని యీవిధముగ నంతటఁ గన్పట్టుటవలనను (ఇది భారతవర్షము - ఇందుఁ బుట్టినవారు భారతీయులే కాని యార్యులు కారనుట).

అథ ప్రతిపక్ష్యుదాహృతవేదమంత్రేషు 'హే పూషన్! అస్మత్ప్రయాణపూర్తిం కురు' ఇత్యాద్యర్థకమంత్రాః సర్వే స్వప్రయాణసందర్భేషు ఆధ్వనికమంత్రాః ప్రసుగ్మంతేతి శాకునాదిమంత్రవదుచ్చారణీయాః. వివాహాదిషు, యజ్ఞాదిషు చైతాదృశమంత్రాః కతినామ నసంతి? సాంప్రదాయేఽపి విశ్వామిత్రయాగరక్షణార్థం రామలక్ష్మణౌ నిర్దిశ్య శ్లోక ఏష ఉక్తః. తథాహి 'అగ్రతః పృష్ఠతశ్చైవ పార్శ్వతశ్చ మహాబలౌ, ఆకర్ణపూర్ణధన్వానౌ రక్షేతాం రామలక్ష్మణౌ' ఇతి శిష్టాస్సర్వేఽపి స్వస్వప్రయాణకాలే పఠన్నితి ప్రథా దృశ్యతే. తథైవ సహ వై దేవానామిత్యాదిమంత్రాణి (Tibet) టిబెట్ ప్రదేశమారోఢుమసమర్థై రార్యజాతీయై ర్నపఠితాని. తాని సంధ్యావందనే గాయత్రీమంత్రపూర్వక మర్ఘ్యప్రదానవిధే స్తుతిపరాణి.

ప్రతిపక్ష్యేవం ప్రష్టవ్యః. హిందూదేశస్య( Tibet )టిబెట్ నామకం సార్ధక్రోశౌన్నత్యమదపి తస్మాదుత్తరత ఆగచ్ఛతామార్యాణాం తదధఏవ స్థితత్వాత్కిమర్థమేతాదృగసత్యకల్పనమితి. సాంప్రతం హుయేన్స్యాంగ్ నామకః కశ్చన యూరోపీయః (Tibet) టిబెట్ ప్రదేశాదాగతో గత ఇతి నవీనాః కంఠోక్తతయా ప్రతిపాదితవంతః. సతు కీదృశమంత్రజపేన హిందూదేశావతరణం కృతవాన్. పునస్తద్దేశంగతవానితి సిద్ధాంతః క్రియతే ప్రతిపక్షిభిః. తస్మాదేత న్మృషావాదప్రలాపాన్దూరీకురుత జనాః!



పిమ్మటఁ బ్రతిపక్షు లుదాహరించిన వేదమంత్రముల యందు 'ఓపూషుఁడా! మా ప్రయాణమును గొనసాగింపుము' అను నర్థము కల మంత్రములన్నియుఁ దమప్రయాణసందర్భములఁ బాటసారు లుపయోగింపవలసిన ప్రయాణమంత్రసులు. 'ప్రసుగ్మంతా' అను శాకునాదిమంత్రములవలె నుచ్చరింపఁదగినవి. వివాహాదులయందు, యజ్ఞాదులయందు నిట్టిమంత్రము లెన్ని లేవు? సాంప్రదాయమునఁగూడ- విశ్వామిత్రయాగరక్షణమునకై రామలక్ష్మణుల నిర్దేశించి యీశ్లోకము చెప్పఁబడినది. "ముందును, వెనుకను, యిరుప్రక్కలను దోడై, ఆకర్ణముగ లాగి యెక్కిడిన ధనస్సుగల్గి, మహాబాణధరులై యున్న రామలక్ష్మణులు రక్షింతురుగాక" అని శిష్టులెల్లరు తమతమప్రయాణసమయమునఁ బఠింతురన్న ప్రసిద్ధి గన్పట్టుచున్నది. అట్లే 'సహవై దేవానామ్' అనుటాదిగఁ గల మంత్రములు (Tibet) 'టిబెట్' ప్రదేశము నెక్కుటకసమర్థు లగు నార్యజాతివారిచేఁ బఠింపఁబడినవి కావు. అవి సంధ్యావందనమున గాయత్రీమంత్రపూర్వకముగా, నర్ఘ్యప్రదానవిధియందు స్తుతిపరములైనవి.

ప్రతివాది నిట్లు ప్రశ్నింపవలసియున్నది - హిందూదేశమునకు 'టిబెట్' (Tibet) అను ప్రదేశము మూఁడుమైళ్లయెత్తున నున్నను, దానికంటె నుత్తరమునుండి వచ్చిన యార్యులు దానిక్రిందనే యుండుటచే నిట్టి యసత్యకల్పనములను చేయు టెందులకు?

ఇపుడు 'హుయేన్ శాంగ్' అను పేరుగల యొక (చీనావాఁడు) యూరోపీయుఁడు (Tibet) టిబెట్టునుండి వచ్చి వెళ్లినాఁడు అని నవీనులు కంఠోక్తిగా ననుచున్నారలు. అతఁ డెట్టి మంత్రోపాసనముచే హిందూదేశమునకు దిగి, తిరిగి తనదేశమునకుఁ బోయెనని ప్రతిపక్షులీసిద్ధాంతమును గావించిరి? కనుక జనులారా! ఈయసత్యవాదములను దూరముగాఁ బెట్టుఁడు.

యథార్థరీత్యా ఆంధ్రద్రావిడార్యాదిశబ్దేషు విచారితేషు ఆంధ్రదేశస్థా ఆంధ్రాః తథైవార్యానామపూజ్యాః. ద్రావిడానామద్రావిడదేశస్థా ఏవ. ఏవమేవ సర్వత్రాపి నియమః. తన్నిదర్శనతయా తామసమన్వంతరే గజేంద్రత్వేనావతీర్ణేంద్రద్యుమ్నోనామ రాజా ద్రావిడ ఏవ తస్య ద్రావిడదేశాధిపతిత్వాత్. ఏతత్కథా భాగవతీయా.

విదేశీయా ఏవైతద్దేశ మాగతా ఇతి నేదం సమీచీనం. అస్మద్గ్రంథప్రామాణ్యేనైత త్కర్మదేశీయా ఏవ తత్తత్కార్య ముద్దిశ్య ద్వీపాంతరా ణ్యపి గతవంత ఇతి జ్ఞాయమానత్వాత్. తథైవ పారశీకా స్స్వాహార ముద్దిశ్య పశూ న్మారయిత్వా అగ్నిషోమ్యాది యజ్ఞీయా న్కాం శ్చైన సంస్కారా నమంత్రకం కుర్వంతి, త దిద మమంత్ర గమకం.

(Egypt) ఈజిప్టుదేశే సప్తసహస్రవత్సరేభ్యః ప్రాఙ్మృతానాం రాజ్ఞా మస్థిపంజరాణి, కతిపయవత్సరేభ్యః ప్రాగుపలబ్ధాని, తే తా న్యార్యసంతతీయా నీతి స్వచరిత్రముఖేన ఖ్యాపయంతి. నవీనాః కేచన షట్సహస్రవత్సరేభ్యః ప్రాక్సృష్టిరేవ నాస్తీతి సిద్ధాంతయంతి. తేషాం ప్రమాణాని తు (Geology జ్యాయాలజీ) జీవశాస్త్రం, (Biology బైయాలజీ) జంతుశాస్త్రం, (History హిస్టరి) దేశచరిత్రప్రభృతీని పురుషబుద్ధికల్పితశాస్త్రాణి. తే ష్వస్మదధ్యయనపరంపరాగతో వేదాదిః (North Pole నార్త్



నిజముగా ఆంధ్ర ద్రావిడ ఆర్యాది శబ్దములను విమర్శింపఁగా నాంధ్రదేశమున నున్న వా రాంధ్రులు. అట్లే యార్యు లనఁగాఁ బూజ్యులు. ద్రావిడు లనఁగా ద్రవిడదేశమున నున్నవారు. ఇదే యంతటను నియమము. ఆనిదర్శనముగాఁ దామసమన్వంతరమున గజేంద్రుఁడుగా నవతరించిన ఇంద్రద్యుమ్నుఁ డను రాజు ద్రావిడుఁడే. అతఁడు ద్రవిడదేశాధిపతి యగుటవలననే ద్రావిడుఁ డని చెప్పఁబడె ననుట ఈకథ భాగవతములోనిది.

విదేశీయులే యీ దేశమునకు వచ్చి రను నిది తగినది కాదు - మనగ్రంథముల ప్రమాణముచేతనే యాకర్మదేశమునఁ బుట్టినవారే యాయా కార్యములకొఱకు ద్వీపాంతరములకుఁగూడ వెళ్లి రని తెలియవచ్చుటవలన. అట్లే పారశీకులు తమయాహారములకొఱకు పశువులఁ జంపి అగ్నిషోమ్యము మొదలగు యజ్ఞములకు సంబంధించు కొన్నిసంస్కారములను మంత్రములు లేకుండ చేయుచున్నారు. అదెల్ల నమంత్రకముగాఁ జేయఁబడునది.

(Egypt) ఈజిప్టు దేశమున నేడువేల సంవత్సరములకు మున్ను చనిపోయిన రాజుల యస్థిపంజరములు కొన్నియేండ్లమున్ను లభించినవి. ఆయీజిప్టుదేశీయు లవి యార్యసంతతివారి వని తమచరిత్రముఖమునఁ జెప్పుచున్నారు. నవీనులు కొందరాఱువేలసంవత్సరములకు ముందు సృష్టియే లే దని సిద్ధాంతముచేయుచున్నారు. వానికిఁ బ్రమాణము లన్ననో (Geology) జ్యాయాలజీ ( జీవశాస్త్రము ), (Biology) బైయాలజీ( జంతుశాస్త్రము ), (History) దేశచరిత్ర మొదలగు పురుషబుద్ధిచే గల్పితము లగు శాస్త్రములు. వానియందు మనకుఁ బరంపరగా నధ్యయనమువలన నేటికి నిలిచియున్న వేదాదికము, (నార్తుపోల్ North pole) ఉత్తరధ్రు

పోల్) ఉత్తరధ్రువకే వా, (Central Asia సెంట్రల్ ఏసియా) మధ్యాసియా ఖండే వా, (Central Europe సెంట్రల్ యూరప్) మధ్యయూరప్ ఖండేవా ఉత్పన్న ఇ త్యనిర్ణీతతయా ప్రతిపాద్యతే. కేచన పాశ్చాత్యపండితా భూసారం పరీక్ష్యైవ మభిప్రయంతి- ఆదౌ వింశతిసహస్రపదపర్యంతం (Sylurian) సిలూరియన్నామక యుగ మితి, తతో ఽష్టాదశసహస్రపదపర్యంతం (Kumbrian) కంబ్రియన్నామకద్వితీయయుగమితి, తత్సమనంతరం త్రింశత్సహస్రపదపర్యంతం (Lambrasian) లామ్రేషియన్నామకతృతీయ యుగ మితి- ప్రతియుగం వింశత్కోటివత్సరపర్యంతం అవస్థాన మి త్యాహత్య షష్ఠికోట్యబ్దపరిమితో సృష్టి మారబ్ధ కాల ఇతిచ తేషా మయ మాశయః పురేయం భూమిః కేవల మగ్నిగోళాత్మనా స్థితేతి-క్రమేణ పూర్వోక్తరీత్యా పరిణామస్య షష్ఠికోట్యబ్దవ్యవధాన మపేక్షితమితిచ-వింధ్యాద్రే రుపలబ్ధాః కేచన ధాతవోఽపి పూర్వకల్పీయా ఏవేతి (Oldham) ఓల్డుహామ్‌నామకస్య పాశ్చాత్యవిదుషో ఽభిప్రాయో జ్ఞాయతే. అస్మచ్ఛాస్త్రరీత్యా హూ. శ. 1934 ఏతత్కాలిక భావనామసంవత్సరం యావత్ గతాబ్దాః కో 195,58,85,035 ఇతి సుస్పష్ట మవగమ్యతే. అద్యతనేపి గ్రహగతిమాన మనుసృత్య సర్వేషాం గ్రహాణాం మేషరాశౌ ప్రథమభాగే ప్రథమాంశే ప్రథమకలాయాం ప్రథమవికలాయాం సమానావస్థితిపర్యంతగణనరీత్యా యది ధీమద్భిః పర్యాలోచ్యతే తదా



వమునకో, (సెంట్రల్ ఏషియా Central Asia) మధ్యాసియా ఖండమునకో, సెంట్రల్ యూరప్ (Central Europe) మధ్యయూరప్ ఖండమునకో పుట్టెనని యొకదారి తెన్నులేకుండఁ జెప్పుచున్నారు. కొందఱు పాశ్చాత్యపండితులు భూసారమును బరీక్షించియే యిట్లభిప్రాయపడిరి- మొదటనిరువది వేలపదములవరకు సిలూరియన్ (Sylurian) అను పేరుగల యుగమనియుఁ, బిమ్మటఁ బదునెన్మిది వేలపదములవరకు కంబ్రియన్ (Kumbrian) అను పేరుగల రెండవయుగమనియు, దానికి సరిగాఁ బిమ్మట ముప్పది వేలపదములవరకు లామ్రేషియన్ (Lambreasian) అను పేరుగల మూఁడవయుగ మనియుఁ, బ్రతియుగమును నిరువదికోట్ల సంవత్సరములవరకు నుండుననియు, నివన్నియుఁ గలుపఁగా నఱువదికోట్లసంవత్సరములు పరిమాణము గల కాలము సృష్టి మొదటినుండి జరిగెననియు వారు చెప్పుదురు. వారియభిప్రాయ మిది.-పూర్వ మీభూమి కేవలము నగ్నిగోళముగా నుండెననియుఁ గ్రమముగాఁ బూర్వోక్తరీతిచేఁ (నేటి కున్న తీరుగా) బరిణామమునకు నఱువదికోట్లసంవత్సరముల వ్యవధానము కావలసివచ్చెననియు, వింధ్యపర్వతమునుండి దొరకినకొన్ని ధాతువులు పూర్వకల్పమునకుఁ జెందినవే యనియు (oldham) ఓల్డుహామ్ అను పేరుగల పాశ్చాత్యపండితుని యభిప్రాయము తెలియుచున్నది. మనశాస్త్రరీతిచే హూ. శ. 1934 వ సంవత్సరము నాటి భావనామసంవత్సరమువఱకు గతించిన వత్సరములు కో 195,58,85,035 అని చక్కఁగాఁ దెలియుచున్నది. ఇప్పుడుకూడ గ్రహగతులను బట్టి, లెక్క ననుసరించి, అన్నిగ్రహములును, మేషరాశియందుఁ బ్రథమభాగమునఁ, బ్రథమాంశమునఁ, బ్రథమకళయందుఁ, బ్రథమవికళయందు సమానముగా నున్నంతవఱకు లెక్కించురీతిచే బుద్ధిమంతులు పర్యాలో

పూర్వోక్తసృష్టికాల స్సంవదేత్యైవ. ఏవం ప్రళయకాలేపి గ్రహాణా మేకస్థానావస్థానం భవేదేవ. తథైవ వేదాంతశాస్త్రేపి సత్త్వాదిగుణత్రయాణాం సామ్యావస్థానం ప్రళయః. కించిదివ వైషమ్యే సృష్టి రితి ప్రతిపాద్యతే. తథైవ సగ్రహా స్సర్వే మేషరాశిప్రవేశే కతి ప్రథమనవాంశే ద్వాపరం, ద్వాదశాంశే త్రేతా, త్రింశాంశే కృతమితి. ఏవం సకలసిద్ధాంతపర్యాలోచనయా సృష్టే రతీవ ప్రాచీనత్వే సిద్ధే కతిపయవత్సరేభ్యః ప్రాక్ స్థూలదృష్ట్యా స్వబుద్ధిబలేన జగత్సృష్టికాల మవిదధతాం కేషాంచి త్పాశ్చాత్యపండితానాం తదనుయాయినాంచ వచన మవిచారమూలక మాగ్రహమూలకం వేత్యేవ నిర్ణీయతే.

ఆంగ్లభాషాపి గాఢం విచార్యమాణా సంస్కృతభాషాత ఉత్పన్నేతి జ్ఞాయతే. తద్యథా- ఆంగ్లస్య మాతృభూతా (Latin) లాటిన్ నామికా, తస్యాశ్చ మాతా (Greek) గ్రీక్, తస్యాశ్చ మాతా పారశీకమాతృభూతా (Jand) జాండునామికాభాషా, జాండునామికాయామాతృభూతా ప్రాకృతా, ప్రాకృతస్య మాతా గీర్వాణీ, అస్యాశ్చ మూలభూతా కాపి నోపలభ్యతే.

పాశ్చాత్యపండితేష్వపి కేచ నాస్మత్సిద్ధాంతమే వానురుంధంతి. కేచిదేవ స్వదేశాభిమానావిష్టాః క్రీ. పూ. 8 శతాబ్దాః పూర్వం ఈజిప్టుదేశీయాః ఆర్యావర్త మాగత్య అత్రస్థేభ్యః స్వవిజ్ఞాన ముపదిదిశు రితి లిఖంతి. తదసత్.



చించినచో నప్పుడు మున్ను చెప్పిన సృష్టికాలము తప్పక సంవదించును. ఇట్లు ప్రళయకాలమందును గ్రహము లొక్కస్థానమున నుండుటయు జరుగనే జరుగును. అట్లే వేదాంతశాస్త్రమునను సత్త్వాదిగుణత్రయములును సమానముగా నుండుటయే ప్రళయము. ఇంచుకంత తేడావలన 'సృష్టి' యనియుఁ బ్రతిపాదింపఁబడెను. అట్లే యేడుగ్రహములును మేషరాశియందుఁ బ్రవేశింపఁగాఁ గృతి ప్రథమనవాంశమున ద్వాపరము. ద్వాదశాంశమునఁ ద్రేతాయుగము. త్రింశాంశమునఁ గృతయుగము. ఇట్లు సర్వసిద్ధాంతములను బర్యాలోచించుటచే సృష్టి మిక్కిలి ప్రాచీన మని సిద్ధించుచుండఁగాఁ గొన్ని సంవత్సరములకు ముందు స్థూలదృష్టిచేఁ దమబుద్ధిబలముచే జగత్సృష్టికాలము నిర్ణయింపలేని కొందఱి పాశ్చాత్యపండితులయు, వారి యనుసారులయొక్కయు వచనములు విమర్శనాశూన్యములే యని నిర్ణయింపఁబడుచున్నది.

ఆంగ్లభాషయు బాగుగా విచారించిన సంస్కృతభాషనుండి పుట్టినదే యని తెలియును. అదెట్లన ఆంగ్లమునకు మాతృభాష (Latin) లాటిన్ అనునది. దానికి మాతృభాష (Greek) గ్రీకు. దానికిఁ దల్లిభాష పారశీకభాషకుఁ దల్లి (Jand) 'జాండు' అను పేరుగల భాష. 'జాండు' అను పేరుగల దానికి మాతృభూతయగు భాష ప్రాకృతము. ప్రాకృతమునకుఁ దల్లి గీర్వాణము. దీనికి మూలభూతయగు భాష యొక్కటియు దొరుకదు.

పాశ్చాత్యపండితులందుఁ గొందఱు మనసిద్ధాంతమును గాదనుచున్నారు. కొందరు స్వదేశాభిమానావేశులు క్రీ.పూ. 8 వ శతాబ్దమునకు ముందటి 'ఈజిప్టుదేశీయులు' ఆర్యావర్తమునకు వచ్చి, యిటనున్నవారికిఁ దమ విజ్ఞానము నుపదేశించి రని వ్రాయుచున్నారు. అది సరికాదు.

తతోఽపి ౧౯౫ కోట్యబ్దకాలాత్పూర్వమేవ అస్మదీయభారతీయభారతభూమికా విజ్ఞానపూర్ణైవేతి ప్రమాణసహస్రప్రసిద్ధత్వా ద్బహోః కాలా దసకృదభ్యాససంప్రదాయే నాద్యావధి అనుస్యూతతయా పరంపరాగతాని వేదశాస్త్రపురాణేతిహాసాదీని విలసంతి. అస్మదీయలిఖితగ్రంథాస్తు బహవోఽస్మద్దౌర్భాగ్యవశాత్ కతిపయశతాబ్దేభ్యః ప్రాక్ దగ్ధప్రాయా ఇతి వక్ష్యమాణప్రమాణైర్జ్ఞాయతే. వేగిదేశస్య దగ్ధరాష్ట్ర మిత్యర్థ స్సార్వజనీనః. తదితరప్రాంతేషుచ బుద్ధగయాయాం నవభౌమభూమికా ప్రాసాదే మహాగండోలాగ్రంథాలయః, ధర్మగంజీనామ్ని నగరే విరాజమాననవభూమికాప్రాసాదస్థనలానందకలాశాలాగ్రంథాలయః అసంఖ్యాకగ్రంథపరిపూర్ణః, 'ఓదంతిపురీగ్రంథాలయశ్చ' భక్త్యార్, ఖిల్జీ నామకరాజసేనాన్యా 'మహమ్మద్ బెం ప్రామ్‌సాహెబ్' నామ్నా మతకలహకాలే నిశ్శేషతయా దగ్ధా ఇతి కోహనాయాం విరాజితపూర్వం 'సంస్కృతభాండాగారం' 'ఫిరోజియాటోగ్లక్ 'నామకేన దగ్ధమితిచ మహమ్మదీయగ్రంథాంతర్భూతే 'తారీఖ్ ఫిరోజిషాహీ' నామకగ్రంథే లిఖితం ప్రకాశతే. అపిచ 'సయ్యద్ గులామ్‌హుస్సేన్ నామకేన తురుష్కచరిత్రకారేణ స్వకీయే 'సైరల్‌ముతా



ఆ 195 కోట్ల సంవత్సరములకుముందే మనభారతీయుల భారతభూమి విజ్ఞానపూర్ణమైనదే యని వేలకొలఁదిప్రమాణములు ప్రసిద్ధములగుటచేఁ జాలకాలమునుండి మిక్కిలిగా నభ్యాససాంప్రదాయముచే నిప్పటివరకు ననుస్యూతముగాఁ, బరంపరగా వచ్చిన వేదశాస్త్రపురాణేతిహాసములు విలసించుచున్నవి. మనవారిచే వ్రాయఁబడిన గ్రంథములు చాల మనదౌర్భాగ్యవశమునఁ గొన్నిశతాబ్దములకు మున్ను దగ్ధప్రాయము లయ్యె నని చెప్పఁబోవుప్రమాణములచేఁ దెలియుచున్నది. - వేగిదేశమునకు దగ్ధరాష్ట్ర మని సార్వజనీన మగు ప్రసిద్ధి. అంతకు నితరప్రాంతములయందు, బుద్ధగయయందు, నవభౌమభూమికయందలి మేడయందు మహాగండోలాగ్రంథాలయమును-ధర్మగంజీ యను నగరమున విరాజిలు నవభూమికాప్రాసాదమున నలానందకలాశాలయందలి గ్రంథాలయమును లెక్కలేనన్నిగ్రంథములచే నిండినవి, 'ఓదంతపురి' యందలి గ్రంథాలయము భక్త్యార్, ఖిల్జీ అను సేనానులును, 'మహమ్మద్ బెం ప్రామ్ సాహెబ్' అనువానిచే మతకలహకాలమున నిశ్శేషముగా దగ్ధము లయ్యె ననియుఁ' గోహన యనునగరమునందుఁ బూర్వమున్న 'సంస్కృతభాండాగారము, 'ఫిరోజియాతుగ్లక్' అనువానిచేఁ దగులఁబెట్టఁబడె నని మహమ్మదీయులగ్రంథములయం దొక్కటైన "తారీఖ్ ఫిరోజిషాహి" అనుపేరు గల గ్రంథమున వ్రాఁతయున్నది. మరియు 'సయ్యద్ గులామ్ హుస్సేను' అనుపేరుగల తురుష్క చరిత్రకారునిచేఁ దన 'సైరల్ ముతాక్రీనా' అనుపేరుగల గ్రంథమున హిందూగ్రంథాలయము

క్రీనా' ఖ్యే గ్రంథే హిందూగ్రంథాలయా స్సర్వేఽపి ఔరంగ
జీబ్ ప్రశాసనకాలే తేన దగ్ధా ఇతి ప్రతిపాదిత మస్తి.

ఏవం పరిశీల్యమానే అస్మత్పూర్వచరిత్రపరిజ్ఞానే పురాణే
తిహాసాదికం వినా నకించిత్సాధన మితి దృఢం జ్ఞాయతే.
తేష్వ ప్యభూతార్థప్రతిపాదకాః కాశ్చన గాథా నసంతీతి
న. తాసామపి స్వార్థే ప్రామాణ్యరాహిత్యేఽపి ప్రకృత
తద్ధర్మోపయుక్తతయా సాఫల్య మస్త్యేవ, తావ. న్మాత్రేణ
భారతీయపూర్వచరిత్రపర్యాలోచనే పురాణాని స్వకపోల
కల్పిత నానాగాథాభి స్సంకలితా నీతి నిర్లజ్జం ఉద్ఘోష
యంతః కేవలావేశపరాః స్వబుద్ధ్యైకప్రమాణాః (Cam-
bridge) కేంబ్రిడ్జి హిందూదేశాదిచరిత్రకారాః నానుసర
ణీయాః. అతః పాశ్చాత్యవిద్యావ్యామోహభంజకాని
స్వాత్మీయవిజ్ఞానవైభవోపేతాని పురాణేతిహాసాదీ న్యేవ
అస్మాభి స్సాదరం శరణీకర్తవ్యా నీతి చతురశ్రం.



లన్నియు 'ఔరంగజీబ్' రాజ్యపాలనకాలమున వానిచేఁ దగులఁ
బెట్టఁబడె నని నిరూపింపఁబడియున్నది.

ఇట్లు పరిశీలింపఁగా మన పూర్వచరిత్రము నెఱుంగు విషయమున
పురాణేతిహాసములు మొదలగువానికంటె వేరుగ నించుకయు సాధ
నము లే దని దృఢముగాఁ దెలియుచున్నది. వానియందైనను నపూర్వ
విషయప్రతిపాదకము లగు గాథలు లేకపోలేదు. అవియుఁ దమం
తట నిర్ధరించుటకుఁ బ్రమాణము లేకున్నను, నేఁడు వానిధర్మము
లుపయుక్తములుగా నున్న సగుటచే వానికి సాఫల్యము తప్పక
యున్నది. అంతమాత్రమున, భారతీయపూర్వచరిత్రలను బర్యాలో
చించుటయందుఁ బురాణములు స్వకపోలకల్పితము లగు వివిధగాథ
లచేఁ గూడినవని నిర్లజ్జగా నుద్ఘోషించుట కేవల మావేశపరులగువారు,
తమబుద్ధిమాత్రమే ప్రమాణముగాఁ గల (Cambridge) కేంబ్రిడ్జి
హిందూదేశాదిచరిత్రకారు లనుసరణ యోగ్యులు కారు.

కనుక పాశ్చాత్యవిద్యావ్యామోహమును నాశనముచేయు నట్టియు,
దమవారివిజ్ఞానవైభవములతోఁ గూడినట్టియు బురాణేతిహాసాదులే
మనచే నాదరముతో శరణ్యములుగాఁ చేయఁబడవలె ననువిషయము
న్యాయ్యమైనది.

* న తస్యా విదితం లోకే కించి దస్తి హి రాఘవ!
యావ త్సూర్యః ప్రతపతి సహస్రాంశు రరిందమ! ౨౨
సనదీ న్విపులా౯ శైలా న్గిరి దుర్గాణి కందరా౯
అన్వీక్ష్య వానరై స్సార్ధం పత్నీం తే ఽధిగమిష్యతి. ౨౩

అ వ తా రి కా.

* న తస్యేత్యాది శ్లోకద్వయార్థ విచారణయా 'నహి తస్యా స్త్వవిజ్ఞాతం త్రిషు లోకేషు రాఘవ!' ఇత్యేత త్పూర్వ ప్రతిపాదిత వచనార్థాచ్చ, వక్ష్యమాణ కిష్కింధాకాండే, సుగ్రీవేణ చతు ర్దిక్షు వానరప్రేషణసందర్భే, సూర్యప్రకాశవత్సు తత్తత్ప్రదేశేషు విద్యమాన విశేషప్రతిపాదక ఘట్టసువిమర్శనేన చాద్యతన విజ్ఞానే నావగతాః, సూర్యప్రకాశవంతః పంచఖండా స్తత్కాలప వావగతా ఇతిద్యోత్యతే. కించ అధునాతనశాస్త్రే ష్వగోచరా వివిధదేశా స్తత్ర ప్రతిపాదితా స్సన్తీ త్యేకత్ర భూగోళం తత్పరిమాణం తత్ర విద్యమానానాం వర్ష, కులపర్వత, నద, నదీ, ద్వీప, రాజ్యాంగ దేశాదీనాం స్థితిశ్చ వైదికవిజ్ఞానావిరోధేన ప్రకృత విజ్ఞాన విషయత్వేనచ యథాశాస్త్రం యథామతి శ్రీరామచంద్ర ప్రేరణయా విలిఖ్యతే.

తత్ భవంతః విమర్శకధురీణాః భూగోళశాస్త్రనిష్ణాతార స్తత్ర యత్కించి దసంపూర్ణత్వేన నిరూపితవిషయజాతస్య సమగ్రతాసంపాదనేన భారతీయార్షవిజ్ఞానస్య సాఫల్యతా మాపాదయంత స్స్వావగతవిశేషాన్ స్పష్టం నిరూపయం త్వి త్యభ్యర్థయే.



౨౨ * శ్రీరామచంద్రా! శత్రుసంహరణా! వేయికిరణములు కల్గి సూర్యుం డెంతదనుక వెలుగుచున్నాడో - అంతదనుకం గల లోకమున నా సుగ్రీవునకుం దెలియని యంశ మించుకయు లేదు.
౨౩ అతండు వానరులతోం గూడ నదులను విశాలములగు పర్వతములను, పర్వతదుర్గములను, గుహలను వెదకి నీభార్యను గనుంగొనం గలండు.

అ వ తా రి క.

* న తస్యా ఽవిదితం—అని మొదలుగ నున్న రెండు శ్లోకముల విచారణచేతను "నహి తస్యా స్త్వవిజ్ఞాతం త్రిషు లోకేషు రాఘవ!" అని మున్ను ప్రతిపాదింపంబడిన వాక్యార్థమువలనను జెప్పంబోవు కిష్కింధాకాండమున సుగ్రీవుండు నాల్గుదిశలకు వానరులం బంపుసందర్భమున సూర్యప్రకాశము గల యాయాప్రదేశములందుం గల విశేషములను జెప్పెడి ఘట్టములను బాగుగా విమర్శించుటచేతను నిప్పటి విజ్ఞానముచే ననగతము లగు సూర్యప్రకాశము గల పంచ ఖండములు నాకాలముననే తెలియవచ్చిన వని తోంచుచున్నది.

అంతియేకాక యిప్పటి శాస్త్రముల కగోచరము లగు పెక్కుదేశములు నందుం బేర్కొనంబడినవి కలవు. కనుక యొకచో భూగోళమును, దానిపరిమాణమును నచ్చట నున్న వర్షకులపర్వతనదనదీద్వీప రాజ్యాంగదేశముల పరిస్థితులను వైదికవిజ్ఞానావిరోధముగను, ప్రకృతవిజ్ఞానమునకు గోచర మగునట్లును శాస్త్రసమ్మతముగ బుద్ధికొలంది శ్రీరామచంద్రప్రేరణముచే వ్రాయుచున్నాను.

విమర్శకధురీణులును భూగోళశాస్త్ర పరిజ్ఞాతలును నగు పెద్దలిందు నేదైన నించుక యసంపూర్ణముగ దెలుపంబడినవిషయ మున్న దానికిం బరిపూర్ణత్వమును సంపాదించుటచే భారతీయుల ఆర్షవిజ్ఞానమునకు సఫలత్వమును జేకూర్చువారై తమ కెఱుగవచ్చినవిశేషములను స్పష్టముగా నిరూపింతురుగాత యని కోరుచున్నాను.

శుభమస్తు.

శ్రీరామ శ్శరణం మమ.

# భూగోళవిన్యాసః.



భోభో మహాశయాః! నిజశేముషీవిశేషావభాసితవిద్యావిశేషా అశేషా స్సహృదయాః!

విదితమేవైత త్తత్రభవతాం భవతాం. యత్ఖలు భూగోళాఖ్యం శాస్త్రం లోకే ప్రసిద్ధతర మస్తీతి. అస్మిన్విషయే విదేశీయా అ ప్యేతత్ క్షణపర్యంతం హైందవజ్ఞానాధారేణైవ వర్తంతే. భూగోళఖగోళశాస్త్రే ద్వే అపి కేవలగణిత మాధారీకృత్య దృశ్యాదృశ్యపరిస్థితిం ప్రాప్య వర్తేతే. ఏవ మపి గణితం దృశ్యాద ప్యధికతరం విశ్వాస మస్మాకం జనయతి. శాస్త్రమేత త్ప్రాచీనై స్సర్వలోకగామిభి స్సర్వశాస్త్రపారీణై శ్చాస్మచ్ఛ్రేయోభిలాషిభి ర్మహర్షిభి ర్వైదికవిజ్ఞానాధారేణ అస్మద్బోధనరీత్యా అనుగృహీతమ్. తదేత చ్ఛాస్త్రం కాలానుగుణ్యేన బౌద్ధమహమ్మదీయప్రభావకాలానలే ష్వస్మద్దురదృష్టవశా దాహుత మభూత్. తథాపి ముఖ్యసిద్ధాంతస్య నకాపి విచ్ఛిత్తిః. తస్యచ నిదానం శాస్త్రాదీనాం కంఠతః పఠనాచార ఏవ మహర్షీణాం.

ఇదానీంతనా స్సర్వే ప్యస్మద్దేశీయాః బాల్యాత్ప్రభృతి విదేశీయవిద్యావ్యాసంగమగ్నా భవంతి. కిం చాస్మిన్కాలే



శుభమస్తు.

శ్రీరామ శ్శరణం మమ.

# భూగోళవిన్యాసము.



ప్రజ్ఞావిశేషముచే సర్వవిద్యలను బ్రకాశింపఁ జేసికొన్న సహృదయు లగు నోమహాశయులారా!

లోకమున భూగోళ మను మిక్కిలిప్రసిద్ధి కెక్కినశాస్త్ర మొకటి కల దని తమకుం దెలిసినయంశమే కదా! ఈవిషయములో విదేశీయులుకూడ యీక్షణమువరకు హిందూశాస్త్రజ్ఞానముయొక్క యాధారముననే ప్రవర్తించుచున్నారు. భూగోళము, ఖగోళము నను రెండుశాస్త్రములును గేవలము గణితమునే యాధారముగాఁ గొని దృశ్యాదృశ్యస్థితిని బొంది వర్తించుచున్నవి. అట్లైనను గణితము దృశ్యముకంటె మిగుల నధికమై మనకు విశ్వాసమును బుట్టించుచున్నది. ఈశాస్త్రము సర్వలోకసంచారసమర్థులును, సర్వశాస్త్రపారంగతులును, మనశ్రేయమును గోరువారు నగు మహర్షులచే వేదములవలన గలిగిన విజ్ఞానము సాధారముగాఁ గొని, మనకు బోధనామూలకముగ ననుగ్రహింపఁబడినది. ఈశాస్త్రము, కాలక్రమమున బౌద్ధులయు, మహమ్మదీయులయు ప్రభావ మను కాలాగ్నియందు మనదురదృష్టవశమున నాహుతి యయ్యెను. అయినను, ప్రధానసిద్ధాంతమున కించుకయు భంగము కలుగలేదు. అందులకు మూలకారణము, మహర్షులు శాస్త్రాదులనెల్ల కంఠోపాఠముగాఁ జదువుచుండు నాచారమే.

ఆధునికులెల్లరు మనదేశీయులు బాల్యమునుండియు, విదేశీయ విద్యావ్యాసంగమున మునిఁగియున్నారు. మఱియు నిక్కాలమున, రాజా

రాజాదరణ, విద్యావిచక్షణ పండితప్రోత్సాహ సాహాయ్య సహితా విదేశీయాః బహూన్ గ్రంథా నలిఖన్. తేచ గ్రంథా అమృదులపత్రేషు సువర్ణాక్షరై ర్దూరదూరం ముద్రితాః రమ్యతరై శ్చిత్రవిచిత్రై రాచ్ఛాదనపత్రై శ్చ సమన్వితా దృశ్యంతే. కించ అతివిశాలపత్రేషు వివిధ చిత్రైః (మ్యాప్) పటాన్వితై ర్నయనసుందరం నిర్మితాని. తాదృశగ్రంథా నభూతపూర్వాన్, తానిచ (మ్యాప్ పటాని దృష్ట్వా మంజులత్వేన మోహితా స్స్వదేశీయా అస్మన్మహర్షిప్రణీతశాస్త్రమర్యాద ముత్సృజంతి. నచ కేవల ముత్సృజంతి, కింతు ఖగోళభూగోళశాస్త్రాభిజ్ఞాః అన్యశాస్త్రాభ్యాసేన కాంచి త్ప్రతిష్ఠాం సంపాద్య వర్తమానాః కాంశ్చి త్పండితప్రకాండా న్ప్రాప్య, యత్కిమపి తా న్పృచ్ఛంతః తదుక్తసమాధాన స్యాతృప్తిజనకత్వాత్ అస్మద్దేశే స్వాతంత్ర్యేణ బోధకశాస్త్రాణి, తాదృశవిద్యాః, తాదృశవిమర్శగ్రంథావా నసంతీతి వదంతి. కంఠోక్త్యా అస్యచ యాథార్థ్యం లోకస్య బోధితు ముద్యతా అపి కేచిన్మహాత్మానో రాజాదరణ, ధనసాహాయ్య, పండిత ప్రోత్సాహశూన్యా అనాథా ఇవ యత్నా ద్విరమంతి.

యో దేశ స్సర్వశాస్త్రాణాం మూలభూతం, యస్మి న్దేశే ఏతాదృశా న్యమూల్యాని విదేశీయ విజ్ఞాన హేతుభూతాని శాస్త్రా ణ్యానాదిత ఉత్పన్నాని, తస్య దేశస్య యాదృశీ గతి రుత్పన్నేతి పశ్యత! అస్మచ్ఛాస్త్రాధారేణ కృతానాం



దరణము, విద్యావిమర్శనము, పండిత ప్రోత్సాహము, సహాయమును గల విదేశీయులు చాలగ్రంథముల లిఖించిరి. అవియు గట్టికాగితములపై సువర్ణాక్షరములచే దూరదూరముగాఁ జక్కఁగా ముద్రింపఁబడినవై, రమ్యతరములును జిత్రవిచిత్రములు నగు నట్టలచేఁ గూడికొన్నవై చూపట్టుచున్నవి. మఱియు, మిగులవిశాలము లగు కాకితములపై వివిధము లగు చిత్రములచే (మ్యాప్) పటములు, కనువిందుగా నిర్మింపఁబడియున్నవి. అట్టి యపూర్వము లగు గ్రంథములను, ఆ (మ్యాప్) పటములను జూచి, యందచందములకు మోసపోయిన స్వదేశీయులు మనమహర్షులు వ్రాసిన శాస్త్రముల మర్యాదల నుల్లంఘించుచున్నారు. కేవల ముల్లంఘించుటమాత్రమే కాదు. మఱియు, ఖగోళభూగోళశాస్త్రజ్ఞు లనఁబడు కొందరు, శాస్త్రాంతరాభ్యాసముచే నేదోయొక ప్రతిష్ఠను సంపాదించుకొని వర్తించువారిని గొందరిపండితశ్రేష్ఠులను జేరి, యేదో యొకవిషయమును వారి నడిగి, వారు దెల్పినసమాధానము తృప్తికరము కానిదగుటవలన, మనదేశమున, స్వతంత్రముగా నేవిషయమునుగాని బోధించు శాస్త్రములు, అట్టివిద్యలు, అట్టివిమర్శగ్రంథములు లే వని పలుకుచున్నారు. కంఠోక్తిగా నిందలి యథార్థభావమును లోకమునకు బోధింపయత్నించినవారయ్యు కొందరు మహాత్ములు రాజాదరణము, ధనసహాయ్యము, పండితప్రోత్సాహము లేనివారై, యనాథలట్లు యత్నమునుండి విరమించు చున్నారు

ఏదేశము సర్వశాస్త్రములకు మూలమైనదో, యేదేశమున నన్యదేశీయులశాస్త్రవిజ్ఞానమునకు హేతుభూతము లగు నమూల్యము లగు నిట్టి శాస్త్రములు మొదటినుండియు జనించినవో; అట్టి మనదేశమున కెట్టిగతి పట్టినదో చూడుఁడు! మనశాస్త్రములయాధారముచేఁ జేయఁబడిన విదేశీయులగ్రంథముల కెట్టిగౌరవపాత్రత లభించెనో

విదేశీయగ్రంథానాం యాదృశగౌరవపాత్రతేతిచ పశ్యత! ఉచితం చైత ల్లోకేహి వృక్షప్రకాండం శాఖాప్రసూన ఫలాదీనాం నిధానభూతం దృష్ట్వా యే కేచిదపి మానవా నహి తుష్యంతి. కింతు తస్య శాఖాః, పత్రాణి ప్రసూనాని ఫలాని చ దృష్ట్వా అమందానంద ముదవహంతి. తడను భోక్తా నైత ద్దృష్ట్వా తుష్యతి. సర్వస్యాప్యస్య అస్మద్దేశదారిద్ర్య మేవ ప్రధానం కారణ మితి నిర్విశంకం వదామః.

అస్మచ్ఛాస్త్రాణి ఐక్యముఖ్యేన సర్వాంశబోధకాని. నైవం విదేశీయశాస్త్రాణి. కింతు- ఏకైక మంశ మేకైకం శాస్త్రం బోధయతి. తస్య చోదాహరణమస్మ త్తర్కశాస్త్రే విదేశీయప్రత్యేకశాస్త్రాణ్యధోలిఖితాని దృశ్యంతే-1.(Logic) లాజిక్, 2. (Physics) ఫిజిక్స్, 3. (Psychology) సైకాలజీ, 4. (Metaphysics) మెటఫిజిక్స్, 5. కించిత్ (Geology) జియాలజీ - ఏతత్ప్రభృతీని విదేశీయప్రత్యేకశాస్త్రాణి అస్మ త్తర్కశాస్త్రే దృష్టాని. ఏవమే వాస్మదీయేషు వైద్యశాస్త్ర త్వేన ప్రసిద్ధేషు సుశ్రుత, చరకాది గ్రంథేషు అధోలిఖితాని విదేశీయప్రత్యేకశాస్త్రాణి సంకలితాని దృశ్యంతే_1. (Botany బోటనీ) వృక్షవిషయః, 2. (Natural History నాచురల్ హిస్టరీ) జంతువిషయః, 3. (Anatomy-Physiology ఎనాటమీ-ఫిజియా



కూడ గమనింపుఁడు. ఇది న్యాయమే కెండు. లోకమున వృక్షము మొదలు, కొమ్మలు, పువ్వులు, ఫలములు మొదలగువానికిఁ బ్రధానమయినను, దానిం జూచి యేమనుజులుకాని సంతోషింపరు. చెట్టు కొమ్మలు, ఆకులు, పువ్వులు, పండ్లు వీనిం జూచియే యపరిమితానందము నొందెదరు. ఈయనుభవము కలయాతఁ డిది చూచి హర్షింపఁడు. దీని కంతకును గారణము మనదేశదారిద్ర్యమే యని నిస్సంశయముగాఁ జెప్పుచున్నాము.

మనశాస్త్రము లోకప్రధానవిషయము ననుసరించి, యన్నియంశముల బోధించునవి. విదేశీయులశాస్త్రము లట్టివి కావు. అందొక్కొక్కయంశము నొక్కొక్కశాస్త్రము బోధించును. అందుల కుదాహరణము:—మనతర్కశాస్త్రమునం దొకదానియందు విదేశీయులు ప్రత్యేకముగా విభజించికొన్న శాస్త్రము లెన్నికలవో యాక్రింద వ్రాయఁబడియున్నవి.

1. Logic—లాజిక్.
2. Physics — ఫిజిక్స్.
3. Psychology — సైకాలజీ.
4. Meta-physics — మెటఫిజిక్స్.
5. ఇంచుక Geology — జియాలజీ.

ఇవి మొదలు కొని కొన్ని ప్రత్యేకశాస్త్రములు మనతర్కములో నున్నవి. ఇట్లే, మనవైద్యశాస్త్రమున ప్రసిద్ధికెక్కిన సుశ్రుతము, చరకము మొదలగు గ్రంథములయం దీక్రింద వ్రాయఁబడిన విదేశీయుల ప్రత్యేకశాస్త్రములు కూడి కనఁబడుచున్నవి.

1. బోటనీ / వృక్షశాస్త్రము } Botany.

లజీ) శరీరవిషయః, 4. (Surgery సర్జరీ) శస్త్రచికిత్సా, 5. (It's treatments ట్రీట్‌మెంట్స్) తచ్చికిత్సా, 6. (Practice ప్రాక్టీస్) కృత్యేఽనుభవః, 7 (Diagnosis డయాగ్నసిస్) రోగనిదానం, ఏవ మేతాని విదేశీయప్రత్యేకశాస్త్రాణి అస్మచ్ఛాస్త్రేషు సంకీర్ణత్వేనస్థితాని, దర్శయంతిచ పూర్వోక్తం విషయమ్.

కించాస్మత్పురాణాన్యేవ ఆంగ్లభాషాయాం (History) హిస్టరి, (Geography) జాగ్రఫీత్యాది నామ్నా ప్రసిద్ధాన్యనంతశాస్త్రజాలాని. ఏతేషు (Geography) జాగ్రఫ్యాఖ్యమే వాస్మచ్చర్చావిషయభూతం భూగోళవిన్యాసాఖ్యం శాస్త్రం. అస్య జాగ్రఫీతి నామధేయం కథ మితిచే దుచ్యతే. గ్రీక్ భాషాయాం (Geo)'జ్యా'నామ భూమిః, (Graphy) "గ్రఫీ"నామ లిఖామీతి చార్థః. తథాచ భూగోళ మితి. భోః అస్మద్భూగోళశాస్త్రం జ్ఞాతు మస్మాకం కీదృశీదశా ప్రాప్తేతి పశ్యత! అంతతోఽస్మద్విద్యార్థినాం (Addition) అడిషన్, (Subtraction) సబ్‌ట్రాక్షన్ ప్రభృతిపదానాం సమానా న్యాంధ్రాది స్వదేశ భాషా పదాని నజ్ఞాయంతే. అపి చేదానీం చింతామణి గణిత లీలా



2. నేచురల్ హిస్టరీ
   జంతుశాస్త్రము. } Natural History.
3. ఎనాటమీ ఫిజియాలజీ
   శరీరశాస్త్రము. } Anatomy Physiology.
4. సర్జరీ
   చికిత్సా శస్త్రచికిత్స } Surgery.
5. తత్ప్రయోగవిధులు—It's treatments.
6. కృత్యే ఽనుభవః— Practice.
7. డయాగ్నిసిస్
   రోగనిదానం. } Diagnosis.

ఇట్లే విదేశీయుల ప్రత్యేకశాస్త్రములు మనశాస్త్రములం దుండి, తొలుత నన్న విషయమును దృఢపరచుచున్నవి.

మరియు మనపురాణములే, ఆంగ్లభాషయందు హిస్టరీ (History) జాగ్రఫీ (Geography) అనునట్టి పేరులఁ బ్రసిద్ధములైన యంతులేని శాస్త్రములుకలవు. ఇందు "జాగ్రఫీ" అను పేరే మనకుఁ జర్చావిషయమైన 'భూగోళవిన్యాస'మనుశాస్త్రము. దీనికి 'జాగ్రఫీ' అను పే రెట్లుగలిగెనో? అనుచోఁ జెప్పఁబడుచున్నది. గ్రీకుభాషయందు (Geo) 'జ్యా' — అనఁగా భూమి. 'Graphy' యనఁగా వ్రాయుచున్నానని యర్థము. అదే 'భూగోళ' మని యయినది. మనము వ్రాసికొన్న భూగోళమును మన మెఱుఁగుట కెట్టి దశ సంప్రాప్త మయ్యెనో చూడుఁడు! తుదకు మన విద్యార్థులకు సంకలనము (కూడిక) (Addition), వ్యవకలనము (Subtraction) (తీసివేఁత) మొదలగుపదములకుసమానమగు తెలుఁగు మొదలగు స్వభాషలపదములేని తెలియుట లేదు. మఱియు నిప్పుడు చింతామణి గణితము లీలావతి పావులూరి గణితము మొదలగు గ్రం

వతీ పావులూరిగణితాది గ్రంథస్థిత పత్రాణి న కిమర్థ మ ప్యుపయుజ్యంతే ఇతి నిందంతి ఖలు స్వదేశీయాః.

ఇతఃపరం లేఖ్య ద్వీప, ఉపద్వీప, వర్ష, ఖండ, కులపర్వత, నద, నద్యాదీనాం జ్ఞానార్థ మేకాం వార్తా మాలిఖ్య ప్రకృత మనుసరామః. ఆంగ్లేయ (geography) జాగ్రఫీ గ్రంథేషు భూభాగాః (Continents) కాంటినెంట్సు, (Countries) కంట్రీస్, (Provinces) ప్రోవిన్సెస్, (Districts) డిస్ట్రిక్ట్సు, (Rivers) రివర్సు సదృశా ఇతి జ్ఞానే నాలం.

కులపర్వతవిషయః ఆంగ్లేయశాస్త్రేషు న సమ్యగ్దృశ్యతే. తథాపి త మాంగ్లభాషాయాం (Systems of Mountains) "సిస్టమ్సు ఆఫ్ మౌంటెన్సు" ఇతి వదంతి. అన్యచ్చ అస్మద్భూగోళశాస్త్రే షూదధిప్రవిష్టాఖ్యాః కేచిత్పర్వతా స్సర్వ సముద్రేషు వర్తమానా ఉల్లిఖితాః.

యద్య ప్యేతద్విషయో జాగ్రఫీగ్రంథేషు నదృశ్యతే. తథాపి (Physiography) ఫిజియాగ్రఫీ గ్రంథేషు ముఖ్యత్వే నోల్లిఖితః. తేచ పర్వతాః (Ocean heights) ఓషన్ హైట్సు ఇతిప్రఖ్యాతాః. కించ విదేశీయై శ్శాస్త్రా త్ప్రత్యక్షతశ్చ యావా న్ప్రదేశో విజ్ఞాత స్ససర్వో ఽప్యస్మ త్ప్రాచీనై రస్మ చ్ఛాస్త్రేషు మానేనస హోల్లిఖితః. నహి స ఏవ లిఖితః. కింతు విదేశీయదృఙ్మనఃపథాతీత సప్తమహాద్వీపాః తదుప ద్వీప, నద, నదీ, పర్వత, పట్టణ, ధాతువిశేష స్సర్వో ఽప్యస్మ చ్ఛాస్త్రే ఽస్మత్ప్రాచీనై స్సమ్య గ్నిరూపితః. సర్వో



థములం దున్న పత్రము లెందుకు నుపయోగింపవు' అని స్వదేశీయులు నిందించుచున్నవారు.

ఇఁక జెప్పఁబోవు ద్వీప, ఉపద్వీప, వర్ష, ఖండ, కులపర్వత, నద, నదులు తెలియుట కొఱకు సంగతి వ్రాసి, ప్రకృతము ననుసరింతుము. ఆంగ్లుల (Geography) భూగోళ గ్రంథములయందు భూభాగములు (Continents కాంటినెంట్సు), దేశములు (Countries కంట్రీస్), రాష్ట్రములు (Provinces), జిల్లాలు (Districts), నదులు (Rivers) మనగ్రంథములలోనివానికి సరియగున వని తెలిసినఁ జాలును.

కులపర్వతవిషయము ఆంగ్లేయ శాస్త్రములయందు బాగుగాఁ గన్పట్టను. అయినను దీని నాభాషలోఁ (Systems of Mountains) బర్వతముల స్థితిగతులు అని చెప్పుచున్నారు. మఱొకటి; మన భూగోళశాస్త్రలయందు 'ఉదధి ప్రవిష్టములు' (సముద్రములోఁ మునిఁగియున్నవి) అను పేరుతోఁ గొన్ని పర్వతములు సముద్రము లన్నిఁటిలో నున్న వని వ్రాయఁబడినవి.

ఈయంశము భూగోళ శాస్త్ర గ్రంథములయందుఁ గనఁబడ కున్నను (Physiography) 'ఫిజియాగ్రఫీ' గ్రంథములయందు ముఖ్యముగా వ్రాయఁబడినది. ఆపర్వతములును (Ocean heights) 'ఓషన్ హైట్సు' అని ప్రసిద్ధి కెక్కినవి. మఱియు, విదేశీయులు శాస్త్ర ప్రమాణముచేతను, ప్రత్యక్ష ప్రమాణముచేతను, నెంత ప్రదేశము నెఱిఁగిరో, యదంతయు మన ప్రాచీనులచే, మన శాస్త్రములయందు లెక్కతోఁ (మానముతో) గూడ వ్రాయఁబడి యున్నది. అదొక్కటే వ్రాయఁబడలేదు. ఇఁక విదేశీయుల దృష్టి యొక్కయు, మనస్సు యొక్కయు మార్గము దాఁటిపోయిన సప్త మహాద్వీపములు, వాని యుపద్వీపములు, నదులు, పర్వతములు, పట్టణములు, ధాతు విశేషములు మొదలగు సర్వమును మన శాస్త్రమున మన ప్రాచీనులచే

ప్యాంగ్లహిస్టరీగ్రంథేషు న లిఖితః, అతో న వయం విశ్వసిమ ఇతిచేత్తన్మౌఢ్యం. కుత ఇతిచేత్? ఇదానీ మవజ్ఞాతః అమెరికాఖ్యదేశః దక్షిణోత్తర కురుభూమి సంజ్ఞయా శ్రీమహాభారతే భీష్మపర్వణి ౭ అధ్యాయే అనాది సిద్ధతయా ప్రసిద్ధై శ్శాస్త్రై రుదితః. స్థితే తస్మిన్నన్యదపి కథం నస్థేయాత్, సర్వథా స్థాస్యత్యేవ. తాదృశ పుణ్యస్థల దర్శనాశక్తతా కేవల మస్మదభాగ్యమేవేతి విశ్వాసవతాం నృణాం సర్వమపి విశదం భవతి.

భూగోళశాస్త్ర మిదం సమ్యగాలోచ్య మహర్షిభిః ప్రాచీనై ర్లోకా యానుగృహీతః. తథా ప్యస్మదీయైః ప్రథమతోఽపి వేదాంతశాస్త్ర ఏవ బుద్ధిః ప్రసారితా. అంతతః 'బ్రహ్మ సత్యం, జగన్మిథ్యే'తి చ స్ఫుటీకృతం తైః. అన్యథా కాకస్య కతిదంతాసీతి రీతిః మమతాచ న నిర్గమే దితి. తయైవ బుద్ధ్యా ప్రాచీనై ర్వేదాంతగ్రంథా బహవో విలిఖితాః. భూగోళవిషయ స్సర్వో ప్యధఃకృతః. తస్మా ద్వ్యాపారిషు ప్రభుషు సిద్ధాంతిషు చైతచ్ఛాస్త్ర మల్పభాగై ర్విద్యతే. అన్య త్రాస్య న విశేషవ్యాప్తిః.

తస్యచ సాదృశతయా నీలకంఠీయ వైరాగ్యశతకే

శ్లో॥ వంగాః కథ మంగాః కథ మి త్యనుయుంక్తే వృథా దేశాన్
కీదృ క్కృతాంతపుర మితి కోఽపి న జజ్ఞాసతే లోకే.

ఇతి శ్లోక ఉక్తః.



లెస్సగా నిరూపింపఁబడెను. అదంతయుఁగూడ ఆంగ్ల చరిత్రగ్రంథముల వ్రాయఁబడలేదు. ఇందువలన 'నీ విషయములు మేము నమ్మము' అనుచో నది మూఢత్వ మగును. ఏమన్న; ఇప్పుడు తెలియవచ్చిన 'అమెరికా' అను ప్రదేశము, 'దక్షిణోత్తర కురుభూమి' యను పేరుతో శ్రీ మహాభారతమున భీష్మపర్వమున నేడవ యధ్యాయమున, ననాది సిద్ధముగాఁ బ్రసిద్ధము లగు శాస్త్రములచే వాకొనఁబడినది. అ దట్లుండ మఱొక్కటి మాత్ర మెట్లుండదు? అన్నివిధముల మన గ్రంథముల నుండియే తీరును. అట్టి పుణ్యస్థలముల దర్శింపఁ జాలకపోవుట కేవలము మన దురదృష్టమే యని నమ్ము మనుజులకు సర్వము విశదము కాఁగలదు.

ఈభూగోళశాస్త్రము బాగుగా నాలోచించి ప్రాచీను లగు మహర్షులచే లోకముల కనుగ్రహింపఁబడినది. అయినను మనవారిచే మొదట వేదాంతశాస్త్రమందే బుద్ధి ప్రసరింపఁబడినది. తుదకు 'బ్రహ్మ సత్యము-జగత్తసత్యము' అని వారిచే స్పష్టము చేయఁబడినది. "కాకికి దంతము లెన్ని? అన్నరీతిగా వృథావిమర్శనము చేయుటవలన మమకారము పోదు." అన్న యాబుద్ధిచేతనే ప్రాచీనులచే వేదాంత గ్రంథములు లెక్కకుమీఱినవి వ్రాయఁబడినవి. భూగోళ విషయమంతయుఁ గ్రిందుపరుపఁబడెను. అందుచే వ్యాపారము చేయు వారియందుఁ, బ్రభువులయందు, సిద్ధాంతులయందు నీశాస్త్రము కొద్ది భాగములచే మిగిలి చూపట్టుచున్నవి. మఱొక్కచో దీనికి విశేష వ్యాప్తి లేదు.

అందు కుదాహరణముగా నీలకంఠుని వైరాగ్యశతకమున 'వంగదేశము లెట్లున్నవి? అంగదేశము లెట్లున్నవి? అని వ్యర్థముగా దేశములను సమన్వయించునుగాని లోకమున యమపుర మెట్టిది? అని యొకఁడును విమర్శింపఁడు" అను శ్లోకము చెప్పఁబడెను.

శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యై రపి

శ్లో॥ కిం జ్యోతి స్తవ? భానుమా నహని మే రాత్రౌ ప్రదీపాదికం;
స్యా దేవం రవి దీప దర్శనవిధౌ కిం జ్యోతి రాఖ్యాహి మే?
చక్షు; స్తస్య నిమీలనాదిసమయే కిం? ధీ; ర్ధియో దర్శనే
కిం?తత్రాహ; మతో భవాన్పరమకం జ్యోతి స్తదస్మిన్ప్రభో!

ఇత్యేత త్ప్రకారేణ బహిర్ముఖం మానస మాంతరంగికత్వేన కృతమ్. అత ఏ వేతరదేశసంచార పరిత్యాగ తత్ప్రదేశవిషయక విచారత్యాగశ్చ కృతః. అంతత స్తా దృశేతరదేశసంచారాదికం దోషత్వేనా ఽపి పరిగణితం. తథా ప్యస్మ దదృష్టవశా చ్ఛాస్త్రాణి వినాశ మలభమానాని సంతి; తథైవ స్థితాని. తస్మా త్తదాధారేణ భూగోళ శాస్త్రం యథాశక్తి విచారయామ ఇతి శమ్.

అథ భూపరిమితిః

నను మహీయం పంచాశత్కోటివిస్తారేతి శతకోటి విశాలేతిచ పురాణే షూక్తం. సూర్యసిద్ధాంతాదిషు 'భూకర్ణో షోడశశత' మిత్యూచుః. ఏతద్విరోధపరిహారః కథమభూ, ద్వస్తుతో భూపరిమితిః కియ దితి వ్యవస్థా ఇష్యత ఇతిచేత్_శ్లో॥ పంచాశత్కోటివిస్తారా సేయ ముర్వీ మహామునే! సహైవాండకటాహేన సద్వీపాబ్ధిమహీధరేతి



శ్రీమచ్ఛంకర భగవత్పాదాచార్యులచేతను

'ప్రశ్నము—నీకుఁ గాంతి నిచ్చున దేది?
జవాబు—పగలు సూర్యుఁడు, రాత్రి దీపము మొదలగునవి.
ప్ర—సూర్యుని, దీపమును జూచుటయం దే ప్రకాశము తోడుపడుచున్నది? చెప్పుము.
జ—కన్ను.
ప్ర—అది మూసికొన్నప్పుడు?
జ—బుద్ధి.
ప్ర—ఆబుద్ధి నెఱుంగుటలో?
జ—నేనే.
గురువు—అట్లయిన నీవే పరమజ్యోతివి.
శిష్యుడు—అవును. నే నట్లే యైతిని,

అని యీరీతిగా బహిర్ముఖమైన యీ మనస్సు ఆంతరంగికముగా నొనర్పఁబడినది. అందుచేతనే యితర దేశసంచారమును విడచుటయు, నాచోటును గూర్చి విమర్శనమును విడచుటయుఁ గూడ చేయఁబడినది. చివర కట్టితర దేశసంచారముచేయుట మొదలగునది దోషముగాఁగూడ లెక్కింపఁబడినది. అయినను మనయదృష్ట వశమున శాస్త్రము లింకను కొన్ని నశింపని వట్లే యున్నవి. అందుచే వాని నాధారముగాఁ గొని భూగోళశాస్త్రమును యథాశక్తిగా విమర్శించెదము. ఇది శుభము.

భూ ప రి మి తి .

ఈభూమి యేబదికోట్లు (యోజనములు) విస్తారముకలదనియు, నూరుకోట్లు (యోజనములు) విశాలమైనదియు నని పురాణములఁ జెప్పబఁడెను. సూర్యసిద్ధాంతము మొదలగువానియందు భూకర్ణము (వ్యాసము—Diameter) యొక్క పరిమాణము పదునాఱువందల యోజనము లని చెప్పిరి. ఈ రెండుమాటలకు విరోధ మెట్లు పోవును? నిజమునకు భూపరిమితి యెంత నిర్ణయము కావలెను; అనుచో, 'ఓమునీశ్వరా! ఈభూమి యేబదికోట్లయోజనములు

శ్రీవిష్ణుపురాణే; 'సూర్యాండగోళయో ర్మధ్యే కోట్యస్స్యుః పంచవింశతి' రితి శ్రీమద్భాగవతే శ్రీశుకోక్తిః. భూమండలంతు శతకోటివిస్తారం సాండకటాహ మితి వారాహే క్వచిత్క్వచిత్పురాణేషు విరోధోఽపి దృశ్యతే. తత్ర కల్ప భేదాదిభిః న్యూనాధికభేదోక్తి రితి శ్రీధరాచార్యాదికృత విష్ణుచిత్తీయాది టీకాకారాదిభి రుక్తం. తథాహి. శ్లో॥ క్వచిత్క్వచిత్పురాణేషు విరోధో యది లక్ష్యతే, కల్పభేదాదిభి స్తత్ర వ్యవస్థా సద్భి రిష్యత ఇతి. అథ సూర్య సిద్ధాంతేతు- 'యోజనానాం శతా న్యష్టౌ భూకర్ణో ద్విగుణానితు, తద్వ ద్గతో దశగుణా త్పరం భూపరిధి ర్భవే' దితి ప్రతిపాదితః. భూకర్ణో భూమధ్యసూత్రం, పరిధి ర్వలయాకారరేఖా.

ప్రసంగవశా దస్మచ్ఛాస్త్రీయ యోజన, క్రోశ, హస్త, వితస్తి, సంఖ్యా నిర్ణయం పాశ్చాత్య (Mile) మైలుపరిమాణంచ బ్రూమః తథాహి.-'తిర్య గ్యవోదరా ణ్యష్టౌ వూర్ధ్వావా వ్రీహయ స్త్రయః, ప్రమాణ మంగుళ స్యోక్తం వితస్తి ర్ద్వాదశాంగుళా. హస్తో వితస్తిద్వితయం దండో హస్తచతుష్టయం, తత్సహస్రద్వయం (౨౦౦౦) క్రోశో. యోజనం తచ్చతుష్టయ, మితి తథా



వైశాల్యము గలది. అది అండకటాహముతోడను, ద్వీపములతోడను, మహాసముద్రములతోడను, బర్వతములతోడను గూడినది,' అని శ్రీవిష్ణుపురాణమునను, 'సూర్యునకును నండగోళమునకును మధ్య నిరువదియైదుకోట్లయోజనముల దూర మున్నది' అని శ్రీమద్భాగవతమున శ్రీశుకులవారివచనమును గలదు. 'భూమండలము నూరుకోట్ల యోజనములు విస్తారము కలదై అండకటాహముతోఁ గూడియున్నది' అని వరాహసంహితయందు నచ్చటచ్చటఁ బురాణములయందును విరోధము గన్పట్టుచున్నది. ఆవిషయమునఁ గల్పభేదము ననుసరించి తక్కువ యెక్కువల భేదము కలుగు నని శ్రీధరాచార్యులు మొదలగువారు వ్రాసిన విష్ణుచిత్తీయము మొదలగు గ్రంథముల టీకలయందుఁ దెలుపఁబడెను. అందుల కనుగుణముగాఁ 'బురాణములయం దక్కడక్కడ భేదము గన్పట్టునేని కల్పభేదమునుబట్టి విజ్ఞు లయ్యెడఁ జేసిన నిర్ణయ మంగీకరింపఁబడును' అని సిద్ధాంతము చేయఁబడెను. ఇక సూర్యసిద్ధాంతమం దన్ననో, "భూకర్ణము (వ్యాసము) పదునాఱువందలయోజనములు; దానికిఁ బదిరెట్లు భూమిపరిధి (భూమధ్యరేఖ = Equator) యొక్క ప్రమాణము" అని తెల్పఁబడినది. భూకర్ణ మనఁగా భూమధ్యసూత్రము (Diameter) పరిధి యనఁగా వలయాకారరేఖ అనఁగా వృత్తముయొక్క చుట్టుకొలతరేఖ యనుట; (Circomfrence) భూమియొక్క యావృత్తరేఖనే భూమధ్యరేఖ (Equator) అందురు

ప్రసంగవశమున మనశాస్త్రములం గల యోజనము, క్రోసు, హస్తము, వితస్తి వీనిపరిమాణములనిర్ణయమును, పాశ్చాత్యుల మైలు (Mile) పరిమాణనిర్ణయమును దెల్పెదము. అదెట్లన; 'యవలు' అను ధాన్యవిశేషములు కలవు. వాని నెన్మిదింటిని వరుసగా నుంచి నపుడు వానిమధ్యభాగ మెంత పరిమాణము వచ్చునో అది 'అంగుళము' లేక 'వ్రీహి' ధాన్యము మూఁడు గింజ లొకదాని మీఁద నొకటి పెట్టిన నెంతవఱ కుండునో యది యొక యంగుళము, అట్టి యంగుళములు పండ్రెండు గలసి యొక వితస్తి యగును. అట్టివిత

హ్యాంగ్లేయ (Mile) మైలుత్రితయ షష్ట్యుత్తరపాశ్చాత్య వితస్తయో (మై 3 అ 60) హైందవక్రోశో భవతి. అశీత్యుత్తరద్విశతాధికపంచసహస్రవితస్త(పాద)యో (5,280) మైలు రితి హూణాః.

అథ భూకర్ణ (Diameter = డయామీటర్) పరిమాణ ముచ్యతే. పాశ్చాత్యమానేన భూకర్ణో ద్వాదశోత్తరనవశతాధికసప్తసహస్ర(7,912) మైలవః. సూర్యసిద్ధాంతోక్త్యా ద్విసప్తత్యుత్తరచతుశ్శతాధికైకాదశసహస్ర మైలవశ్చ చత్వారింశదుత్తరద్విశతాధికదశసహస్రవితస్తయశ్చేతి (మై 11,472 - అ 10,240) సిద్ధ్యతి. తస్మి న్ప్రాగ్యోక్తహూణనిర్ణీతమైలవో హరశ్చేత్ (మై 11,472 అ 10,240 మై 7,912 = మై 3,560 అ 10,240) శిష్టం షష్ట్యుత్తరపంచశతాధిక త్రిసహస్రమైలవశ్చ చత్వారింశదుత్తరద్విశతాధికదశసహస్రవితస్తయశ్చ (మై 3,560- అ 10,240) అస్మజ్జ్యోతిశ్శాస్త్రీయభూకర్ణపరిమాణం పాశ్చాత్యమానా దధిక మితి ప్రతిభాతి. తత్ర కథం వా సిద్ధాంత ఇతి చేత్, అస్మదీయజ్యోతిశ్శాస్త్రే న కేవలభూభాగ మాత్రం భూమి రితి నిర్ణయః. కింతు పృథివ్యా ఉపరి యావత్పర్యంతం హంసాదయః పార్థివవికారా ఉత్పతంతి తావత్పర్యంతం భూమి రిత్యేవ పరిగణితః. అతఏవ శ్రీశుకో ప్యాహ శ్రీమద్భాగవతే పంచమస్కంధే భూభాగా



స్తులు రెండుగలసి యొకహస్తము. నాల్గుహస్తము లొకదండము. రెండువేలదండము లొకక్రోశము (కోసు). అట్టి నాల్గుక్రోశములు గలసి యొకయోజన మగును. అట్లగుసేని యాంగ్లేయులమూఁడు మైళ్లయరువదియడుగులు (3 మై 60 అడుగులు) ఒకహైందవక్రోశము (నాల్గువేలదండములు) అగును. అయిదువేలరెండువందలయెనుబది (౫,౨౮౦) యడుగు లొక మైలు (Mile) అని హూణులు.

ఇఁక భూకర్ణపరిమాణము (Diameter) చెప్పఁబడును. పాశ్చాత్యులలెక్కప్రకారము వ్యాసము యేడువేలతొమ్మిదివందలపండ్రెండు (౭,౯౧౨) మైళ్లు. సూర్యసిద్ధాంతవచనముచేఁ బదకొండువేలనాల్గువందలడెబ్బదిరెండు మైళ్లు - పదివేలరెండునందల నలుబది అడుగులు (మై ౧౧,౪౭౨ - అ౧౦,౨౪౦) యని తేలుచున్నది. అందు వెనుకఁ దెల్పిన హూణుల నిర్ణయమునఁ దేలిన మైళ్లి నిందుఁ దీసివేసినచో (౧౧,౪౭౨-౧౦,౨౪౦-౭,౯౧౨=౩,౫౬౦ మై-౧౦,౨౪౦ అడుగులు) మూఁడువేల యైదువందల యరువది మైళ్లు, పదివేలరెండువందలనలుబది యడుగులు మిగులును. దీనింబట్టి మనశాస్త్రములంబట్టి యేర్పడిన వ్యాసముయొక్క ప్రమాణము పాశ్చాత్యులలెక్కకంటె నెక్కువ యని తేలినది. అయ్యెడ సిద్ధాంత మేవిధముగాఁ జేయవలసినది ? అనుచో - మనజ్యోతిశాస్త్రమునఁ బైకిఁ గనఁబడు భూభాగమే భూమి యని నిర్ణయము కాదు ఇఁక నేమన; భూమిపైభాగమున నెంతదనుక హంసాదిపక్షులు పృథివీభూతవికారము లెగురునో యంతదనుక భూమి కలదనియే లెక్కింపఁబడినది. కనుకనే శ్రీశుకులును భాగవతమున నైదవస్కందమున భూభాగములయవధిని బ్రసంగించుసందర్భమున నిట్లనిరి.— "దానికిఁ గ్రిందుగాఁ (ఊర్ధ్వలోకమున కనుట) నూరుయోజనములక్రింద నీభూమి కలదు. ఎంతదనుక

వధిప్రసంగే-'చూ॥ తతో౽ధస్తాచ్ఛతయోజనాంతరేణేయం పృథివీ యావద్ధంస భాస శ్యేనసుపర్ణాదయః పతత్రిప్రవరా ఉత్పతంతి తావ ద్భూలోకావధి' రితి స్పష్టతయాభిహితత్వా త్తథా పరిగణనే నైత ద్భేదో దృశ్యతే.

అతః హిందూసిద్ధాంతశాస్త్రస్య పాశ్చాత్యనిర్ణయస్య చ సమన్వయం భవతి. భూపరిధివిషయే తావత్ 24,857 మైలవ ఇతి తే నిశ్చితాః. తత్రాప్యస్మచ్ఛాస్త్రం సమన్వయం భవతి. అన్యచ్చాస్మచ్ఛాస్త్రే వికల్పత్వేన పాద్మే స్వర్గఖండే 'శ్లో॥ పాదగమ్యం హి యత్కించి ద్వస్త్వస్తి ధరణీతలాత్। తద్భూలోక ఇతి ఖ్యాత' ఇత్యాదివచన పర్యాలోచనయా కేవలభూభాగమాత్ర ఏవ భూకర్ణ మితి కృత్వా పాశ్చాత్యగణిత మపి ప్రమాణత్వేన స్వీకర్తవ్య మితి ప్రతిభాతి.

కథం పంచాశత్కోటియోజనవిస్తారేయం మహీత్యుక్త వచనానాం గతికల్పన మితిచేత్ ఏవం ప్రతిభాతి. లోకాలోకాద్రిం మేరుమభితస్స్థితా కర్మలోకాఖ్యా భూశ్చ తమోగర్తాశ్చ తామసభూతావాసభూతాః. గర్తతమసః పరస్తాత్ పరితః ప్రతిదిశ మండకటాహా దర్వాక్ మహాపురుషనివాసభూతో శ్రీవైకుంఠలోకః. తతః కటాహ ఇతి జ్ఞేయం. శ్రీభాగవతే, హరివంశేచ బ్రాహ్మణపుత్రానయనప్రస్తావే భగవత్స్థానస్య తత్త్వతో వర్ణితత్వాత్. ఏవ మూర్ధ్వాధఃకటాహావధిం చాండోచ్ఛ్రాయావధిం చా



హంసలు, భాసములు, డేగలు, గరుడములు మొదలగు పక్షిరాజము లెగురునో నంతవరకు భూలోకమున కవధి గలదు' అని స్పష్టముగాఁ దెల్పఁబడుటవలన, నా లెక్కనుబట్టి యీ భేదము కన్పట్టుచున్నది.

ఇందువలనఁ బాశ్చాత్యులశాస్త్రమునకును హిందూశాస్త్రసిద్ధాంతమునకును సమన్వయము కలుగును. భూమధ్యరేఖవిషయములో నిరువదినాల్గువేల యెనిమిదివందల యేబదియేడు (మై ౨౪,౮౫౭) మైళ్ళని వారు నిశ్చయించిరి. ఆవిషయములోను మనశాస్త్రము సమన్వయించును. మఱియు మనశాస్త్రమున వికల్పముగాఁ బాద్మమున స్వర్గఖండమున "పాదముచే నడచి వెళ్ళఁదగిన దెంతమేర గలదో; అది భూలోక మని చెప్పఁబడినది" అను నిట్టివచనముల పర్యాలోచనచేఁ గేవలభూభాగముమాత్రమే భూకర్ణము అని యెంచి, పాశ్చాత్యశాస్త్రగణితము ప్రమాణముగా నంగీకరింపవచ్చు నని తోఁచెడిని.

"ఏబదికోట్లయోజనములు విస్తారము కలది భూమి" యనుమాటలకు దారి యెట్లు కల్పింపనగును? అన్నచో నిట్లు తోఁచుచున్నది. లోకాలోకపర్వతమును, మేరువునంటియున్న కర్మలోక మను పేరుగల భూమియుఁ, దమోగర్తములును, దామసభూతములకు నివాసస్థానము లయి యున్నవి. తమోగర్తముల వెలుపల నెల్లదిశలందును, నండకటాహమునకు వెలుపల మహాపురుషునకు నివాసభూతమగు శ్రీవైకుంఠలోకము కలదు. అటుపై కటాహము కల దని యెఱుంగునది. శ్రీమహాభాగవతమునను, హరివంశమందును బ్రాహ్మణునికొడుకులను గొనివచ్చు ప్రస్తావనయందు భగవత్స్థాన మగు వైకుంఠము యథారూపముగ నిట్లే వర్ణింపఁబడియున్నది. ఇట్లే ఊర్ధ్వాధఃకటాహములయొక్క యవధియు నండముయొక్క యెత్తుయొక్క యవధియు గలిపి భూమి యేబదికోట్ల యోజనములు

సంహృత్య పంచాశత్కోటివిస్తారా భూ రిత్యవగంతవ్యం. అతః 'పంచాశత్కోటివిస్తారా సేయ ముర్వీ'తి నిఖిలపురాణేతిహాసస్మృత్యాదివ్యాసై ర్వ్యాసై ర్యదుక్తం తన్మహాభూరాదికం సంహృత్యేతి బోధ్యం. ఉత పురాణకారస్య వైరాగ్యోత్పాదనభగవన్మాహాత్మ్యజ్ఞాపనేచ తాత్పర్యా న్నలోకసంఖ్యా గణిత త్వాదర ఇతి జ్ఞేయం. తథాచ సూర్యసిద్ధాంతే 'శ్లో॥ పంచాశత్కోటివిస్తీర్ణం కేవలం కల్పితేత్తే మహీ, అల్పరాజ్యమదాంధానాం విషాదాయ విరక్తయే'తి.

వక్ష్యమాణభూగోళస్తు సమూహగ్రంథవచన పర్యాలోచనయే ఽయం మహాభూమి రితి, భూగోళ మితిచ ద్విధా వర్తతేతి. తత్ర మహాభూమిః పరిదృశ్యమానభూగోళస్యాధోభాగే ఈషద్దైర్ఘ్యమేవ పంచకోటియోజనదూరా త్ప్రకాశ తేతి. అథై తద్భూగోళమేవ 'జంబు ప్లక్ష కుశ క్రౌంచ శాకశాల్మలిపుష్కరాణీ'తి నామభి ర్వర్తమానై ర్ద్వీపై ర్లవణేక్షుసురాసర్పిర్దధిక్షీరశుద్ధోదకవద్భి స్సప్తసముద్రైశ్చావృతం సద స్తీతి గమ్యతే. ఏవమేవ సర్వపురాణేతిహాససిద్ధాంతగ్రంథాదయః కథయంతి.

జంబూద్వీప స్త్వేత త్సప్తద్వీపానాం మధ్యే ఆస్తే. స ఇదానీం [Asia] ఆసియా ఇతి కథ్యతే. జంబూద్వీపమధ్యే ఛత్రాకారేణ భాసన్ సర్వలోకాధారో దేవతానా మాల



వైశాల్యముగలది యని తెలియఁదగును. కనుక 'ఈభూమి యేబది కోట్లయోజనములు వైశాల్యము కలది" యని సమస్తపురాణములను, ఇతిహాసములను, స్మృతులు మొదలగువానిని బ్రపంచించి వ్రాసిన వ్యాసమునీంద్రులచే నేది పలుకఁబడెనో, యాపరిమాణము, ఆమహాభూమి మొదలగువాని పరిమాణములోఁ గలిపి (తెలుపఁబడెను) అని యెఱుంగనగును. అదిగాక పురాణకారుఁ డగు వ్యాసునికిఁ గేవలము వైరాగ్యము కలిగించు భగవన్మహిమానిరూపణమునందే ప్రధానతాత్పర్య ముండుటవలన, లోకపరిమాణసంఖ్య యెంతయో కొలిచినట్లు లెక్కించుటయం దాదరము లేదనియు నెఱుంగవలెను. సూర్యసిద్ధాంతమునఁగూడ నట్లే "భూమి యేబదికోట్లయోజనములు విశాలమైన దని కేవలము కల్పితముగా, స్వల్పరాజ్యముచేతనే మదమెక్కి కండ్లుగప్పువడినవారికి విషాదముగలుగుటకును, క్రమముగా విరాగ ముదయించుటకును జెప్పఁబడినది" అని.

(ఇఁక నేను) దెలుపఁబోయెడు భూగోళము అనేకగ్రంథములఁ బర్యాలోచించుటచే "నిది 'మహాభూమి'యనియు, 'భూగోళము' అనియు రెండువిధములుగ నున్నదనియు, అందు 'మహాభూమి' యనునది పైనఁ గనఁబడుచున్న యీభూగోళమున కడుగున నించుమించుగా నైదుకోట్లయోజనములదూరమునఁ బ్రకాశించుచున్నది" అని. ఇఁక నీభూగోళముమాత్రమే జంబు, ప్లక్ష, కుశ, క్రౌంచ, శాక, శాల్మలి, పుష్కరము లనునామములచే నొప్పు ద్వీపములచేతను, లవణ, ఇక్షు, సుర, సర్పి, దధి, క్షీర, శుద్ధోదకములుకల యేడు సముద్రములచేత నావరింపఁబడియున్న దని తెలియుచున్నది. సర్వపురాణేతిహాససిద్ధాంతగ్రంథములు నిట్లే చెప్పుచున్నవి.

జంబూద్వీపము యీ యేడుద్వీపముల నడుమ నున్నది. అది యిపుడు ఆసియా (Asia) అని చెప్పఁబడుచున్నది. జంబూద్వీపము నడుమ గొడుగుయొక్క యాకారముగాఁ బ్రకాశించుచు సర్వలోకములకు నాధారమై దేవతలకు నివాసమై మేరు వను పేరుగల నొక

యో మేరునామకః కశ్చిత్పర్వతరాజో విరాజతే. పరితస్తం 1 హరి, 2 కింపురుష, 3 భారత, 4 రమ్యక, 5 హిరణ్మయ, 6 కురు, 7 ఇలావృత, 8 భద్రాశ్వ, 9 కేతుమాలాఖ్యాని నవవర్షాణి సంతి. వర్షం నామ 'వృష్యతే సిచ్యతే మేఘైః' రితి వ్యుత్పత్త్యా మేఘై స్సిచ్యమానః ప్రదేశ ఇత్యుచ్యతే.

అపిచ మేరోః పూర్వతో మాల్యవత్పర్వతః, దక్షిణతో మందరః, పశ్చిమతో గంధమాదనః, ఉత్తరత స్సుపార్శ్వనామక పర్వతశ్చ మేరో ర్మూలాధారభూతా స్సంతి. తత్ర ప్రాచ్యో మాల్యవత్పర్వతః, పాశ్చాత్యః గంధమాదనశ్చ ఉదీచ్యే నీలపర్వతపర్యంతం, దక్షిణదిక్స్థితనిషధపర్యంతం చ తిర్యగ్బహుదూరం వ్యాప్య స్థితౌ. కించ, మేరుపర్వతోత్పన్నాశ్చ సప్తనద్యః. తత్ర సీతానామ్నీ పూర్వసముద్రే. చక్షుర్నదీ పశ్చిమసముద్రే, అలకనందా దక్షిణసముద్రే, భద్రానదీ చోత్తరసముద్రే ప్రవిశంతి.

మేరుపర్వతనిర్ణయే కేచి దేవం వదంతి. మేరుర్నామ ధ్రువనక్షత్రా దధఃప్రదేశః. సచ చతురశీతిసహస్రయోజనౌన్నత్యాఽధస్తా చ్ఛోడశయోజనాయామేన, మూర్ధ్ని ద్వాత్రింశద్యోజనవైశాల్యేనచ, పద్మకర్ణికాకారేణ భాసన్ దేవతానాం స్థానభూతో విరాజతే ఇతి. అపిచ సిద్ధాంతశిరోమణౌ భూగోళాధ్యాయే శ్లో॥ సద్రత్నకాంచ



పర్వతశ్రేష్ఠ మొప్పుచున్నది. దానిచుట్టును 1 హరి, 2 కింపురుష, 3 భారత, 4 రమ్యక, 5 హిరణ్మయ, 6 కురు, 7 ఇలావృత, 8 భద్రాశ్వ, 9 కేతుమాల అను తొమ్మిదివర్షములు (ఖండములు) గలవు. వర్షము (అనఁగా) 'వృష్యతే - సిచ్యతే = తడపఁబడును, మేఘైః = మేఘములచేత' అను వ్యుత్పత్తిచే మేఘములచేఁ దడుపఁబడు ప్రదేశ మని చెప్పఁబడుచున్నది.

మరియు మేరువునకుఁ దూర్పుదిశను మాల్యవంత మను పర్వతము, దక్షిణముగా మందరము, పడమటిదెస గంధమాదనము, ఉత్తరమున సుపార్శ్వ మను పర్వతమును మేరువునకు మూలాధారములై యున్నవి. అందుఁ దూర్పు దగు మాల్యవత్పర్వతమును, బడమటి దగు గంధమాదనమును, నుత్తరదిశ నున్న నీలపర్వతపర్యంతమును, దక్షిణదిక్కున నున్న నిషధపర్యంతమును నడ్డముగాఁ జాలదూరము వ్యాపించి యున్నది. మరియు మేరుపర్వతమందుఁ బుట్టినవి ఏడునదులు గలవు. అందు "సీత" యనునది తూర్పుసముద్రమునందును, "చక్షుగ్గతి" అనునది పశ్చిమసముద్రమునందును, "అలకనంద" యనునది దక్షిణసముద్రమునందును, "భద్రానది" యుత్తరసముద్రమునందును బ్రవేశించుచున్నవి.

మేరుపర్వతనిర్ణయవిషయములోఁ గొంద రిట్లందురు:— మేరు వనఁగా ధ్రువనక్షత్రముక్రింది ప్రదేశము. అదియు నెనుబదినాల్గువేల యోజనము లెత్తును, బదునాఱుయోజనములు వైశాల్యము గల అడుగుభాగమును ముప్పదిరెండుయోజనములు వైశాల్యముగల పై భాగమును గలిగి తామరపూవుబొగడవలెఁ బ్రకాశించుచు, దేవతలకావాసమై యలరారుచున్నది. వెండియు సిద్ధాంతశిరోమణి (యను) గ్రంథమున భూగోళాధ్యాయమున "మంచిరత్నములు, సువర్ణము వీనితోఁగూడిన మూఁడుశిఖరములు మేరుపర్వతమునఁ గలవు. వాని

నమయం శిఖరత్రియంచ మేరౌ మురారికపురారిపురాణి తేషు, తేషా మథ శ్శతమఖజ్వలనాంతకానాం రక్షోఽంబుపానిలధనేశపురాణి చాష్టౌ" ఇతి. ఇత్యాదివచనపర్యాలోచనయా త్రిష్వపి మేరుశిఖరేషు వైకుంఠ, కైలాస, సత్యలోకాః, తేషా మథోభాగే ఇంద్రాద్యష్టదిక్పాలకలోకాశ్చ సంతీతి, మే ర్వగ్రాధారేణ తైలయంత్రస్థబలీవర్దస్కంధదారువ ద్భాస్కరోఽపి మేరుం ప్రతిదినం ప్రదక్షిణంకుర్వన్నాస్తే. ఇత్యపి మేరువిషయకద్వివిధసిద్ధాంత స్సర్వగ్రంథేషు పరిదృశ్యతే.

తత్ర నవీనాః [North pole నార్తుపోల్] ఉత్తరధృవకమేవ మేరు రితి కథయంతి. తత్ర పర్వతాదికం నదృశ్యతే. కేవలసముద్రజలమేవ విద్యతే. పూర్వోక్తరీత్యా మేరుం పరితః పర్వతనదీనదాదికం, పరిపాలనార్హభూప్రదేశాదికమపి స్థాతవ్యం. అత్ర కేచన మేరునామక పర్వత ఏవ నాస్తీతి వదంతి. అపరేతు మేరుర్నామ [North pole నార్తుపోల్] ఉత్తరధృవక మేవ. అద్యాత్ర పర్వతాదికం సముద్రే నిమగ్న మితి వదంతి. సర్వమప్యేత దసత్. మధ్యే పరివర్తిత స్థలజలనిర్ణయే బహవో గ్రంథా స్సంతి. తేషు తథా న పరిదృశ్యతే. యత్తు మేరుపర్వత ఏవ నాస్తీ త్యుక్తం త త్తుచ్ఛం. సర్వపురాణేతిహాసాదిషు ప్రసిద్ధతయా శ్రూయమాణత్వాత్. తర్హి తత్ర కథం వా సిద్ధాంత ఇతి చే దుచ్యతే — తత్ర పౌరా



యందు విష్ణువు, బ్రహ్మ, మహేశ్వరుడు వీరిపురములు గలవు. వానికిఁ గ్రిందుగా నింద్రుఁడు, అగ్ని, యముఁడు, నిర్‌ఋతి, వరుణుఁడు, వాయువు, కుబేరుఁడు, ఈశానుఁడు వీరలపురము లెనిమిది కలవు" అను నిట్టివచనములపర్యాలోచనచే మూఁడుపర్వతశిఖరములందును వైకుంఠకైలాససత్యలోకములును, వానిక్రిందు భాగమున నింద్రాద్యష్టదిక్పాలురలోకములును గలవనియు, మేరుపర్వతాగ్రముయొక్క ఆధారముచే నూనెగానుగయందు ఎద్దుమూపుపై నిలిపిన కాడియట్లు సూర్యుఁడు మేరుపర్వతమును దినదినముఁ బ్రదక్షిణముఁ జేయుచుండును అనియు మేరువును గూర్చి రెండువిధము లగు సిద్ధాంతము లన్నిగ్రంథములలోను గన్పట్టుచున్నవి.

అందు నవీనులు నార్తుపోల్ (North pole) ఉత్తర ధృవమును మేరుపర్వత మని చెప్పుచున్నారు. అచటఁ బర్వతాదిక మేమియుఁ గన్పడదు. కేవలము సముద్రోదకమే కలదు. తొలుతఁ జెప్పినటుల మేరువుచుట్టును బర్వతములు నదులు నదములు పరిపాలించుట కర్హమైన భూప్రదేశము నుండవలయును. కొందరు మేరువను పర్వతమే లే దని చెప్పుదురు. మఱికొందరు 'మేరు వనఁగా నార్తుపోల్ (North pole) ఉత్తరధృవమే; ఇప్పుడు యిటనుండవలసిన పర్వతములు మొదలైనవి సముద్రములో మునిఁగిపోయిన' వని చెప్పుదురు ఇదంతయు నసంగతము. మేరుపర్వతమధ్యయందున్న స్థలజలనిర్ణయముఁగూర్చి చాలగ్రంథము లున్నవి. వానియం దట్లు గన్పింపదు. మేరుపర్వతమే లే దనుమాట తుచ్ఛము—సమస్త పురాణేతిహాసములందును బ్రసిద్ధముగా నది గన్పడుటవలన. అట్లైన సిద్ధాంత మెట్లు చేయఁదగు నన్నచోఁ జెప్పబడుచున్నది. అట పౌరాణికముగా భూలోకమేరు వనియు సిద్ధాంతఖగోళమునుబట్టి మహామేరు వనియు రెండు మేరుపర్వతములఁ గల్పించుకొనవలయును. అందు సిద్ధాంతమునందుఁ గల మేరులక్షణములన్నియు, నార్తుపోల్ (North pole)

ణికభూలోకమేరు రితి, సిద్ధాంతఖగోళమహామేరు రితిచ మేరుద్వయం కల్పనీయం. తత్ర సిద్ధాంతసర్వలక్షణాని (North pole) నార్తుపోల్ ఉత్తరధ్రువకే సమ్యక్పరిదృశ్యంతే. అన్యచ్చ పురాణస్థ భూగోళమధ్యమేరుపర్వతవిచారణే (Asia) ఆసియా ఇతి ప్రఖ్యాతప్రదేశ ఏవ జంబూద్వీప ఇతి నిర్వివాదాంశఏవ. తస్య దక్షిణసీమా కన్యాకుమార్యగ్రమిత్యతో౽పి న విరోధలేశః. దక్షిణసీమా హిందూమహాసముద్రఏవ. ఉత్తరసీమాతు (Arctic ocean) 'ఆర్కిటిక్ ఓషన్'నామక ఉత్తరసముద్రఏవ. తత్ర చంద్రమండలాకారేణ చంద్రద్వీప మితి, జంబూద్వీపస్యోపద్వీపో౽స్తీతి పురాణేషు ప్రసిద్ధతయా శ్రూయతే. తదిదానీం (Nova Zembla) 'నోవా జెంబ్లా' ద్వీప ఇతి ప్రసిద్ధ్యావరీవర్తతే. ఏతన్మధ్యే మేరునామక దేవపర్వతః స్థాతవ్యః. అత్ర వక్తవ్యాంశ ఏకో౽స్తి. క ఇతి చేత్ (Asia) ఆసియాజంబూద్వీపే (India—ఇండియా) భరతఖండం వినా ఇతరదేశీయవివరణప్రకాశక (Geography జాగ్రఫీ) భూగోళవివరగ్రంథా ఇదానీం నైవ విద్యంతే. అతః క్లిష్టమార్గేణ తత్ప్రదేశాః కేవలశాస్త్రదృష్ట్యా నిర్ణేతవ్యా భవంతి.

జంబూద్వీపమధ్యే పూర్వోక్తదేవతాత్మక మేరుపర్వత ఇదానీం నామాంతరేణ ప్రకాశతే సఏవ (Pamir) పామీర్‌ప్రదేశస్య ప్రాగ్భాగే (Thienshan) థియన్



ఉత్తరధ్రువమునందు బాగుగా గోచరించుచున్నవి. ఇఁకఁ బురాణములందు భూగోళముమధ్య నున్న మేరుపర్వతమును విచారింపఁగా ఆసియా (Asia) అను ప్రఖ్యాత మగు ప్రదేశమే జంబూద్వీపము అనుట నిర్వివాదాంశమే. దానికి దక్షిణపుహద్దు 'కన్యాకుమారియగ్రము' యను నీవిషయమునను నేమాత్రము విరోధము లేదు. దక్షిణ సరిహద్దు అనఁగా హిందూసముద్రమే. ఉత్తరపుహద్దు 'ఆర్కిటిక్ ఓషన్' (Arctic Ocean) అను పేరుగల ఉత్తరసముద్రమే. అందు చంద్రమండలాకారమునఁ జంద్రద్వీప మనునది జంబూద్వీపమునకుపద్వీప మొండుఁ గల దని పురాణములందుఁ బ్రసిద్ధముగా వినఁబడుచున్నది. అది యిప్పుడు నోవాజంబ్లాద్వీపము (Nova zembla) అని ప్రసిద్ధి కెక్కి యొప్పారుచున్నది. దీనినడుమ మేరు వను పేరుగల దేవపర్వత ముండవలెను. ఇచటఁ జెప్పవలసినయంశ మొండు గలదు. అ దేమనినచో ఆసియా (Asia) అనఁగా జంబూద్వీపమందు ఇండియా (India) అనఁగా భరతఖండమును గూర్చి తప్ప నితర దేశములవివరమును దెలియఁబరచు జాగ్రఫీ (Geography) భూగోళవివరగ్రంథము లిప్పుడు లేవు. కనుక క్లిష్టమార్గమున కేవలశాస్త్రదృష్టిచే నాప్రదేశములు నిర్ణయింపవలసిన వగుచున్నవి.

జంబూద్వీపమునడుమ మున్నుఁ జెప్పిన దేవతాస్వరూపమైన మేరుపర్వత మిపుడు నామాంతరముచే నొప్పుచున్నది. అదియే 'పామీర్' (Pamir) పీఠభూమికిఁ దూర్పుభాగమున థియన్‌షన్ (Thienshan) అను పేరనున్న మేరు వని నిశ్చయము. అది జంబూద్వీ

షన్ ఇతి నామ్నా మేరు రితి నిశ్చయః. సో ఽయం జంబూద్వీపమధ్యే విరాజతే. తన్నామనిర్వచనే ఽపి దేవపర్వత ఇత్యవగమ్యతే. కథ మితిచేత్ - ధియన్‌షన్ ఇత్యన్యదేశీయసమస్తపదం. ధియన్+షన్ ఇతి పదద్వయసంయోగేన నిష్పన్న మిదం 'ధియన్‌షన్' ఇతి రూపం. చీనాదేశభాషాయాం 'ధియన్' నామ దేవతానా మితి సంబధార్థేషష్ఠీ. 'షన్' నామ పర్వతః. తథాచ 'ధియన్‌షన్' నామదేవపర్వత ఇతి సిధ్యతి తత్రత్యదేశస్య చీనాదేశసంబంధవత్త్వాత్. అస్యాపి మేరో శ్చతుర్దిక్షు పర్వతా శ్చత్వార స్సంతి. తత్ర దక్షిణపర్వతా ఇదానీం (Bolar range) బోలార్ రేంజి, (Asfer range) అస్ఫర్ రేంజి ఇతి వ్యవహ్రియంతే.

అథాత్ర జంబూద్వీపస్థ భారతాది నవవర్షవిశేష వివరణమ్ కథ్యతే. యథా వాయుపురాణే శ్లో॥ నవవర్షం ప్రవక్ష్యామి జంబూద్వీపంయథా తథా, ఉత్తరం య స్సముద్రస్య హిమవద్దక్షిణంచ యత్. వర్షం తద్భారతంనామ యత్రేమా భారతీప్రజాః, పూర్వే కిరా తాహ్యస్యాంతే పశ్చిమే యవనా స్స్మృతాః. బ్రాహ్మణా క్షత్రియా వైశ్యా మధ్యే శూద్రాశ్చ భాగశః, య దిదం భారతం వర్షం యస్మిన్ స్వాయంభువాదయః. చతుర్దశైతే మనవః ప్రజా సర్గే భవంత్యుత, ఇహ స్వర్గాపవర్గార్థం ప్రవృత్తి ర్యేషు మానుషే. కృత్స్నంచ యది యో హ్యేనం సనమ్రా



పము మధ్య నున్నది. థియన్‌షన్ (Thienshan) అను పదము వ్యుత్పత్తిని బట్టియు దేవపర్వత మని తెలియుచున్నది. ఎట్లనిన థియన్‌షన్(Thienshan) అనునది యితర దేశీయులసమాసపదము. థియన్ + షన్ అను రెండుపదములసంయోగముచే 'థియన్‌షన్' అని రూపమేర్పడినది. చీనాదేశభాషయందు థియన్ (Thien) అనఁగా దేవతలయొక్క అని సంబంధార్థమున షష్ఠీవిభక్తి. షన్ (Shan) అనఁగాఁ బర్వతము అందుచే థియన్‌షన్ (Thienshan) అనఁగా దేవతలయొక్క పర్వతము అనిన దేవతలపర్వతము అని సిద్ధించుచున్నది. ఆప్రదేశము చీనాదేశమునకు సంబంధించిన దగుటవలన నాభాషలో నీపేరేర్పడినవి.

ఈ మేరువునకు నాల్గుదిశలను నాల్గుపర్వతము లున్నవి. అందు దక్షిణపర్వతము లిప్పుడు బోలార్ రేంజి (Bolar range), అస్ఫర్ రేంజి (Asfer range) అని వ్యవహరింపఁబడుచున్నవి.

ఇటుపై నిందు జంబూద్వీపమునఁ గల భారతాదినవవర్షముల విశేషము వివరింపఁబడుచున్నది. వాయుపురాణమునందుఁ దొమ్మిదివర్షములు గల జంబూద్వీప మెటు లున్నదో చెప్పుచున్నాను. 'సముద్రమున కుత్తరముగను, హిమవత్పర్వతమునకు దక్షిణముగను భారతవర్షము కలదు. ఇచట నున్న ప్రజలు భారతులు. ఇందుఁ దూర్పునఁ గిరాతులు, పడమట యవనులు, మధ్య బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులుఁ గలరు. ఇందు స్వాయంభువాదిమనువులు పదునల్గురు ప్రజలను సృజించుటకుఁ గల్గిరి. ఇచట స్వర్గమోక్షములకుఁ బరిపూర్ణమగు మనుష్యప్రయత్నముఁ జేయువాఁడు సమ్రాట్టుగాఁ బ్రవర్తించును. ఈలోకము సమ్రాట్టనియు, అంతరిక్షము విరాట్టనియుఁ జెప్పంబడినవి. స్వరాట్టను మరియొకలోకముఁ గలదు. దానివిస్త

డిహ వర్తతే, అయం లోకస్తు వై సమ్రాడంతరిక్షే విరాట్ స్మృతః. స్వరాడన్యస్స్మృతో లోకః పునర్వక్ష్యామి విస్తరం, చత్వారి భారతే వర్షే యుగాని కవయో విదుః. కృతం త్రేతం ద్వాపరంచ కలిశ్చేతి చతుష్టయం -ఇత్యాదినా భారతవర్షవిశేషా న్యుక్త్వా ఏతద్వర్షీయా నుపద్వీపా న ప్యుక్త్వా తతః అంగద్వీప యమద్వీప మలయద్వీప శంఖద్వీప కుముదవారాహాది ద్వీపా న్సవిస్తార మవోచత్. అపిచ భారతమేవ వర్షం కర్మక్షేత్రమితి అత్రైవ చాతుర్వర్ణ్యవిభాగో యుగాదివిభాగశ్చ నేతరత్రేతి ప్రతిపాద్య, అస్మి న్భారతవర్షేఽపి ప్రాగ్భాగస్థ (Burma, Rangoon) బర్మా,రంగూన్ ప్రభృతిదేశానాం కిరాతాక్రాంతత్వాత్ పశ్చిమే (Arabia and Africa) అరేబియా ఆఫ్రికా ప్రభృతి దేశానాం మ్లేచ్ఛాక్రాంతత్వాచ్చ తేషామపి పూర్వోక్తవర్ణాశ్రమ ధర్మకర్మసంబంధో నైవేతి ద్యోత్యతే- అన్యా న్యష్టవర్షాణి కింపురుషాదీని స్వర్గిణాం పుణ్యవిశేషోపభోగస్థానాని భౌమస్వర్గపదవ్యపదేశస్థానా నీతి జ్ఞేయం.

అథ కింపురుషాదివర్షా నుద్దిశ్య ప్రపంచితం వాయుపురాణే ౪౬ అధ్యాయే "శ్లో॥ ప్లక్షషండః కింపురుషే సుమహాన్నందనోపమః, జాయంతే మానవా స్తత్ర నిష్టప్తకనకప్రభాః" ఇత్యుక్తత్వా త్తద్వర్ష మిదానీం హిమాలయాదుత్తరతః (China) చీనా, (Tibet) టిబెట్టు, (Afghan



రముఁగూర్చి ముందుఁ జెప్పఁగలను. భారతవర్షమున, కృతము, త్రేతము, ద్వాపరము, కలి యని నాలుగుయుగములు కలవని తద్జ్ఞులెఱుఁగుదురు' అని ఈరీతిగా భారతవర్షమునఁ గల విశేషములఁ జెప్పి యీవర్షమునఁ గల యుపద్వీపముల వాకొని, అంగద్వీప- యమద్వీప- మలయద్వీప- శంఖద్వీప- కుముదద్వీప- వారాహాదిద్వీపములను సవిస్తరముగాఁ జెప్పెను. మఱియు భారతమే కర్మక్షేత్రమని, యిచటనే చాతుర్వర్ణ్యవిభాగమును యుగవిభాగముకలదనియుఁ గొండొకచో లే దనియుఁ జెప్పబడినది. ఈభారతవర్షమునఁ దూర్పుభాగమున నున్న బర్మా (Burmah), రంగూన్ (Rangoon) మొదలగు దేశములు కిరాతులచే నిండిన వగుటవలన - పడమటిదెస అరేబియా (Arabia), ఆఫ్రికా (Africa) మొదలగు దేశములు మ్లేచ్ఛులచే నాక్రమింపఁబడినవగుటవలన-వానికి తొలుతఁ జెప్పిన వర్ణాశ్రమ ధర్మ కర్మ సంబంధము లేనే లే దని తెలియుచున్నది. తక్కిన ఎనిమిదివర్షములు కింపురుషాదికములు స్వర్గస్థు లగువారికి పుణ్యవిశేషము ననుభవించుట కుచితము లగు భౌమస్వర్గపదములచే నిర్దేశింపఁదగినస్థానము లని యెఱుఁగునది.

అటుపైఁ గింపురుషాదివర్షములఁగూర్చి వాయుపురాణమున నూటనలుబదియాఱవయధ్యాయమున విస్తరింపఁబడినవి. 'కింపురుషమున నందనోద్యానముతో సమానమైనప్లక్షములను చెట్లగుబురులతోఁగూడి యున్నది. అచటఁ బుటము బెట్టిన బంగారువన్నెగల మానవులు పుట్టుదురు, అనుటవలన నావర్ష మిప్పుడు హిమాలయపర్వతమున కుత్తర

stan) ఆఫ్ఘన్ స్థానం, (Persia)పరిషియా, (Arabia) అరేబియా, (Africa) ఆఫ్రికా ప్రభృతిప్రదేశే ష్వవాంతరభాగ మితి జ్ఞాతుం శక్యతే.

అథ హారివర్షః- శ్లో॥ తతః,పరం కింపురుషా ద్ధరివర్షః ప్రవక్ష్యతే, మహారజతసంకాశా జ్జాయంతే తత్ర మానవాః. ఇత్యాదివచనపర్యాలోచనయా తద్వర్ష మిదానీం కింపురుషవర్షా దుత్తరతః (China) చీనా, (China Turkistan) చీనాటర్కిస్థానం, (Russia Turkistan) రష్యా టర్కిస్థానం, (Persia) పరిషియా, ( Arabia అరేబియా, (Africa) ఆఫ్రికా ప్రభృతి ప్రదేశే ష్వవాంతరభాగ మితి గమ్యతే.

అథ ఇలావృతవర్షం శ్లో॥ మధ్యమం య న్మయా ప్రోక్తం నామ్నా వర్ష మిలావృతం, న తత్ర సూర్య స్తపతి నచ జీర్యంతి మానవాః. చంద్రసూర్యౌ సనక్షత్రౌ నప్రకాశ విలావృతే, పద్మవర్ణాః పద్మనిభాః నిరోగా శ్చిరజీవినః. పద్మపత్రసుగంధాశ్చ జాయంతే తత్ర మానవాః. ఇతి– పునశ్చ శ్రీమద్రామయణేఽపి కిష్కింధాకాండే ౪౩ సర్గే సుగ్రీవేణ వానరా న్ప్రత్యుత్తరదిశం ప్రతి కథనసమయే శ్లో॥ తత్పర స్సమతిక్రమ్య నష్టచంద్రదివాకరం, అనక్షత్రగణం వ్యోమ నిష్పయోద మనాదితం. గభస్తిభి రివార్క స్య నతు దేశః ప్రకాశ్యతే. ఇత్యుక్తత్వా త్తద్వర్షా దుత్తరతః మేరోః (Thienshan Pamir Plateau)



మున చీనా (China), టిబెట్ (Tibet), ఆఫ్గన్ స్థానము (Afghan-stan), పరిష్యా (Parsia), అరేబియా (Arabia), ఆఫ్రికా (Africa) మొదలగు ప్రదేశములయం దవాంతరభాగము లని తెలియుటకు శక్యమగుచున్నది.

ఇఁక హరివర్షము "కింపురుషమునకుఁ దర్వాత హరివర్షము చెప్పఁబడుచున్నది. అచట మంచివెండివన్నెగల మనుజులు పుట్టుదురు" అను నిట్టివచనములఁ బర్యాలోచించుటచే నావర్ష మిప్పుడు కింపురుషవర్షమున కుత్తరముగాఁ జీనాటర్కిస్థానము.(China Turkistan), రష్యాటర్కిస్థానము (Russia Turkistan), పరిషియా (Persia), అరేబియా (Arabia), ఆఫ్రికా (Africa) మొదలగు ప్రదేశములలో నవాంతరభాగ మని తెలియుచున్నవి.

పిమ్మట 'ఇలావృత' మను వర్షము మధ్యమవర్ష మను నొండు నాచేఁ జెప్పఁబడినది. అచట సూర్యుఁడు ప్రకాశింపఁడు. మానవులు జరావశులు గారు. చంద్రుఁడు సూర్యుఁడు నక్షత్రములు ప్రకాశింపవు. అచటివారు పద్మము వంటివర్ణము గలవారు. పద్మములవలె మృదువైనవారు. రోగములేనివారు. చిరాయుష్మంతులు. తామరరేకులవంటి పరిమళము గలవారు నయి యుందురు. మఱి శ్రీమద్రామాయణమునఁ గిష్కింధాకాండమున నలుబదిమూఁడవసర్గమున సుగ్రీవుఁడు వానరులఁగూర్చి యుత్తరదిక్కునకుఁ బంపుసమయమున "చంద్రుఁడు సూర్యుఁడు నక్షత్రములు లేనట్టియు, మేఘములు లేక నిర్మలమైనట్టియు నాకసముగలదియు సూర్యకిరణములచేఁ బ్రకాశించునదివలె నున్నట్టియు" అని యీరీతిగాఁ జెప్పఁబడుటవలన నావర్ష మిప్పుడు హరివర్షమున కుత్తరముగా మేరువునకు (అనఁగా) 'థియన్ షన్'

పరితః వలయాకృత్య స్థిత (China) చీనారాజ్య, (Russia) రష్యారాజ్యభాగప్రదేశే ఇతి (Siberia) సైబేరియాంతర్గతైకప్రదేశ మపి వ్యాప్య స్థిత ఇతి వ్యజ్యతే.

అథ రమణకవర్షం శ్లో॥ దక్షిణేనతు శ్వేతస్య నీలస్యైవోత్తరేణతు, వర్షం రమణకంనామ జాయంతే యత్ర మానవాః, శుక్లాభిజనసంపన్నా సర్వేచ ప్రియవాదినః- ఇత్యుక్తత్వాత్తద్వర్షం మిదానీం ఇలావృత స్యోత్తరతః క్రమేణ (Manchuria) మంచూరియా, (Siberia) సైబేరియా, (Russia) రష్యా, (Astria Hungary) ఆస్ట్రియా-హంగ్రీ, (France) ఫ్రాన్సు ఇతి వ్యవహ్రియమాణప్రదేశా ఇతి విజ్ఞాయతే.

అథ హిరణ్యకవర్షం శ్లో॥ ఉత్తరేణతు శ్వేతస్య శృంగాఖ్యస్యాపి దక్షిణే, వర్షం హిరణ్యకం నామ యత్ర హైరణ్యకీ నదీ, మహాబలా స్సుతేజస్కా- జాయంతే తత్ర మానవాః, సర్వేతు కామదా స్సత్వా ధనినః ప్రియదర్శనాః. ఇత్యాద్యుక్తరీత్యా తద్వర్షం మిదానీం రమణకవర్షాదుత్తరతః ప్రాగారభ్య (Kamachatka) కామచ్ఛాత్కా-, (Siberia) సైబేరియా, (Russia) రష్యా, (Germany) జర్మనీ, (Belgium) బెల్జియం ఇతి వ్యవహ్రియమాణప్రదేశే ష్వవాంతరభాగ ఇతి సిధ్యతే.

అథ కురువర్షం 'శ్లో॥ ఉత్తరం య స్సముద్రస్య సముద్రాంతేచ దక్షిణే, కురవ స్తత్ర తద్వర్షం పుణ్యం సిద్ధనిషేవితం.



పామిర్ పీఠభూమికి (Pamir plateau) సమీపప్రదేశమును జుట్టుకొనియున్న చీనారాజ్యమును, రష్యా (Russia) రాజ్యభాగప్రదేశమునున్న సైబేరియాలోఁ (Siberia) కొంతభాగమును నాక్రమించియున్న దని తెలియుచున్నది.

ఇఁక రమణకవర్షము శ్వేతమునకు దక్షిణమునను నీలమున కుత్తరమునను రమణక మను వర్షము గలదు. అచట మనుష్యులు తెల్లనిదీవుల వసించువారును, అందరును బ్రియము మాట్లాడువారును అనుటవలన ఆవర్ష మిపు డిలావృతమున కుత్తరముగాఁ గ్రమముగా మంచూరియా (Manchuria), సైబేరియా (Siberia), రష్యా (Russia), ఆస్ట్రియాహంగ్రీ (Astria Hungary), ఫ్రాన్స్ (France) అని వ్యవహరింపఁబడు ప్రదేశ మని తెలియుచున్నది.

పిమ్మట హిరణ్యకవర్షము "శ్వేతపర్వతమున కుత్తరముగను, శృంగపర్వతమునకు దక్షిణముగను హిరణ్యక మను వర్షము గలదు. అచట "హైరణ్యకి" యను నది కలదు. అచటి జనులు మిగులబలవంతులు, మంచితేజస్సుగలవారు నై పుట్టుదురు. అందరును కామదులు. సత్వము గలవారు. ధనవంతులు. సుందరులు" అన్నరీతిచే ఆవర్ష మిప్పుడు రమణకవర్షమున కుత్తరముగాఁదూర్పు మొదలుకొని 'కామచ్ఛాత్కా' (Kamchatka), సైబేరియా, రష్యా, జర్మనీ (Germany), బెల్జియం (Belgium) అని నేఁడు వ్యవహరింపఁబడు ప్రదేశములలో నవాంతరభాగ మని తేలుచున్నది.

కురువర్షము "సముద్రమున కుత్తరముగను సముద్రము తుదిభాగమునకు దక్షిణముగను సిద్ధసేవితమును, పవిత్రము నగు కురువర్షముఁ

శుక్లాభిజనసంపన్నా స్సర్వే చ స్థిరయౌవనాః—ఇత్యాదివచన పర్యాలోచనయా హిరణ్యకవర్షా దుత్తరతః ఉత్తరసముద్రస్య దక్షిణతః స్థిత దక్షిణకురుభూ రితి ప్రఖ్యాతప్రదేశ ముద్దిశ్యోక్త మితి జ్ఞేయం. ప్రదేశాంతరే శ్లో॥ ఉత్తరాణాం కురూణాం త్వితి వక్ష్యమాణత్వాత్ తద్వర్ష మిదానీం ప్రాగారభ్య (Siberia) సైబేరియా, (Russia) రష్యా, (Scandinavia) స్కాండినేవియా ఇతి వ్యవహ్రియమాణప్రదేశాంతర్భాగ మితి బోధ్యతే.

తతః కురువర్షా దుత్తరతః ఉత్తరసముద్రే (North Pole) 'నార్తుపోల్' ఉత్తరధృవక మితి వ్యవహ్రియమాణప్రదేశానంతరం ఉత్తరకురుభూమయ ఇదానీంతనకాలే దక్షిణోత్తరా అమెరికేతి (South and North America) వ్యవహ్రియమాణప్రదేశే ద్వే ఉద్దిశ్య ఏకద్వీపత్వే విశేషేణోక్తః. తస్య దక్షిణతః సముద్రే చంద్రద్వీప మస్తీత్యుక్తేః స్పష్టతయా పూర్వోక్తం దృఢం భవతి. తద్యథా వాయుపురాణే శ్లో॥ కురూణా మపి చైతేషాం శృణుధ్వం విస్తరేణతు, జారుధే శైలరాజ స్యాప్యుత్తరే ణోత్తరస్య హి. అనేకకందరదరీ గుహానిర్ఝరమండితౌ, ద్వావ ప్యేతౌ సువిదితౌ వుచ్ఛ్రితౌ కులపర్వతౌ. తాభ్యాం కూటశతైర్నైకై స్తద్వీప ముపశోభితం, యయో ర్మధ్యే న సా యాతా భద్రసోమా మహానదీ. పర్యప్తోదాః కురూణాంహి స్నానపానావగాహనైః, తత్ర స్వర్గపరిభ్రష్టా జాయంతే



గలదు. అచట తెల్లదీవుల వసించువారును, అందరును స్థిర మగు యౌవనము గలవారును" అను వచనములపర్యాలోచనచే హిరణ్యకవర్షమున కుత్తరముగ ఉత్తరసముద్రమునకు దక్షిణముగ నున్న "దక్షిణకురుభూమి" యను ప్రసిద్ధ మగు ప్రదేశము నుద్దేశించి తెలుపఁబడిన దని యెఱుంగునది. వేరొకచో "ఉత్తరకురుదేశములు" అని చెప్పఁబోవుటవలన ఆవర్ష మిపుడు తూర్పు మొదలు సైబేరియా, రష్యా, స్కాండినేవియా (Scandinavia) అని వ్యవహరింపఁబడు ప్రదేశములయంతర్భాగ మని తెలియఁబడుచున్నది.

ఆకురువర్షమున కుత్తరముగా నుత్తరసముద్రమున 'నార్తుపోల్' ఉత్తరధృవ మని వ్యవహరింపఁబడు ప్రదేశముల తరువాత నుత్తరకురుభూములు కలవు. అవి యీకాలమున దక్షిణఅమెరికా, ఉత్తరఅమెరికా (South and north America) అని వ్యవహరింపఁబడు రెండుప్రదేశముల నుద్దేశించి యొకేద్వీపముగాఁ జెప్పఁబడినది. దానికి దక్షిణముగా సముద్రమునందుఁ 'చంద్రద్వీపము' కలదు. అనుటవలన స్పష్టముగా మున్నన్నమాట దృఢమగుచున్నది. అది ఎట్లన:—వాయుపురాణమునందుఁ "కురుదేశములయొక్క విషయమును వినుఁడు. జారుధ మను పర్వతరాజమున కుత్తరముగా వివిధ గుహలతోఁ, గొండవాగులతో, సానువులతోఁగూడి గొప్ప యెత్తయిన కులపర్వతములు రెండు గలవు. అనేకములగు శిఖరములతోఁ గూడిన యాపర్వతములచే నాద్వీపము ప్రకాశించును. దానినడుమ "భద్రసోమ" యనునది కురుదేశీయులస్నానపానముల కుపకారకమై పరిపూర్ణజలము కలదై ప్రవహించుచుండును. అచట స్వర్గభ్రష్టులగు పుణ్యాత్ములు జనింతురు. వారెల్లరు నొండొరులకుఁ దీసిపోనివై

హి నరా స్సదా. సామాన్యవిభవా స్సర్వే మమత్వపరివర్జితాః, పూర్ణకాలే వినశ్యంతి జలబుద్బుదవచ్చ తే ఇతి తత స్సదక్షిణే చంద్రద్వీప ముద్దిశ్యోచ్యతే. తత్రైవ వాయుపురాణే “శ్లో॥ ఉత్తరాణాం కురూణాం తు పార్శ్వే జ్ఞేయం తు దక్షిణే, సముద్రే తూర్మిమాలాఢ్యే నానాస్వనవిభూషితః. చంద్రద్వీప మితి ఖ్యాతం చంద్రమండలవత్ స్థిత” మితి ప్రతిపాదనా త్త చ్చంద్రద్వీప మిదానీం యూరల్ పర్వతాగ్రభాగస్థ (Nova Zamblia) నోవయా - జంబ్లియా ద్వీప ఇ త్యూహ్యతే.

తదనంతరం తత్ప్రదేశా త్పశ్చిమస్థితం కంచిద్ద్వీప ముద్దిశ్యైవ ముదాహృతః. తత్రైవ ‘శ్లో॥ పశ్చిమేనతు ద్వీపస్య పశ్చిమస్య ప్రకీర్తితం, ద్వీపం భద్రాకరం నామ నానా పుష్పోపశోభితం ప్రభూతధనధాన్యాఢ్య మనేకనృపపాలితం’ ఇత్యా ద్యుక్త్యా తద్ద్వీప మిదానీం పశ్చిమసముద్రే విరాజమాన (British Isles) ‘బ్రిటిష్ ద్వీపా’ ఇతి స్పష్టం భవతి.

తదనంతరం మేరుం పరితఃస్థితేలావృతస్య పశ్చిమప్రాగ్భాగస్థిత కేతుమాలభద్రాశ్వవర్షే ఉద్దిశ్యైవ మభాణి వాయుపురాణే ౪౩ అధ్యాయే శ్లో॥ గంధమాదనపార్శ్వేతు స్పీతా చోపరి గండికా, తత్ర తే ఽశుభకర్మాణః కేతుమాలా ప్రకీర్తితాః. తత్ర కాలా నరా స్సర్వే మహాసత్వా మహాబలాః. తత్రైవ ౪౨ అధ్యాయే శ్లో॥ కేతుమా



వము కలవారును, ఇది నాది యను మమకారములేనివారును ఆయువు పూర్తియైనతరువాత రోగాదిపీడితులుగాక నీటిబుడగవలె అనాయాసమరణ మొందువారును” అని వర్ణింపఁబడెను. పిమ్మట దానికి దక్షిణభాగమునఁ గల చంద్రద్వీపమునుగూర్చియు నచటనే వాయుపురాణమున “ఉత్తరకురుదేశములకు దక్షిణపువైపున ఉత్తుంగతరంగశోభిత మగు సముద్రమునడుమ వివిధధ్వనిభూషితమును జంద్రమండలమువలె నున్నదియు నగు “చంద్రద్వీప” మను ప్రసిద్ధమైన ప్రదేశము గలదు” అని తెల్పుటవలనఁ జంద్రద్వీప మిప్పుడు యూరల్ (Ural) పర్వతాగ్రమున నున్న ‘నోవయాజంబ్లియా’ (Nova zemblia) ద్వీప మని యూహింపఁ బడుచున్నది.

దానితరువాత నాప్రదేశమునకుఁ బడమరగా నున్న యొకానొక ద్వీపము నుద్దేశించి యీరీతిగా నచ్చటనే యుదాహరింపఁబడినది — “పశ్చిమద్వీపమునకుఁ (జంబ్లియాద్వీపమున కని యర్థము) పశ్చిమముగా భద్రాకర మను ద్వీపము నాని పుష్పశోభితమును, అత్యధికధనధాన్యసంపదలు గలదియు, ననేకమంది రాజులచేఁ బాలింపఁబడినదియుఁ గలదు” అని యిట్లుచెప్పిన మాటనుబట్టి యాద్వీప మిప్పుడు పశ్చిమసముద్రమునడుమ నున్న బ్రిటిష్‌ద్వీపములు (British Isles) అని స్పష్ట మగుచున్నది.

దానితరువాత మేరువును జుట్టియున్న ఇలావృతమునకుఁ బడమటిదెస నున్న కేతుమాలభద్రాశ్వవర్షముల నుద్దేశించి వాయుపురాణమున నిట్లు పలుకఁబడెను. నలుబదిమూఁడవయధ్యాయమున “గంధమాదన పర్వతముప్రక్క నచట అశుభకర్మములు గల కేతుమాలములను దేశములు గలవు. అచటిమనుజులందరు నల్లగా నుందురు. మంచి సత్వము, బలము గలవారు. ఆపురాణమందే నలుబదిరెండవయధ్యా

లం మహావర్షం నానామ్లేచ్ఛగణై ర్యుతం, ఇత్యుక్త్వా త్తద్వర్ష మిదానీం ఇలావృతవర్షా త్పశ్చిమతః (Russia Turkistan) రష్యన్ టర్కిస్థాన్, (Kergia Steppes) కిర్గియాస్టెప్పీస్, (Cacacian Russia) కేకషియన్ రష్యా, (Asia Minor) 'అసియామైనర్' ఇత్యాదినా వ్యవహ్రియమాణప్రదేశా ఇతి దృఢం భవతి.

అథ భద్రాశ్వవర్షం వాయుపురాణే శ్లో॥ పార్శ్వే మాల్యవతశ్చాపి పూర్వే పూర్వేతు గండికా, ఆయామాస్తే ఽథ విస్తారా ద్వ్యథైవాపరగండికా. భద్రాశ్వ స్తత్ర విజ్ఞేయా నిత్యం ముదితమానసాః, తత్ర తే పురుషా శ్శ్వేతా మహాసత్త్వా మహాబలాః. ఇత్యుక్త్వా త్తద్వర్ష మిదానీ మిలావృతస్య ప్రాగ్భాగస్థ (Japan) జపాన్, (Korea) కొరియా, (Mangolia) మంగోలియా ఇతి వ్యవహ్రియమాణప్రదేశ ఇతి విజ్ఞాయతే.

అత్రేద మవధేయం- అస్మిన్ జంబూద్వీపే నవవర్షా ణ్యష్టభి ర్మర్యాదాగిరిభి స్సువిభక్తాని భవంతి. ఇలావృతం మేర్వాధారేణ స్థిత మితి జ్ఞేయం. శ్లో॥ ప్రాగాయతా స్సుపర్వాణ ష్షడిమే వర్షపర్వతాః, అవగాఢా ఉభయత స్సముద్రౌ పూర్వపశ్చిమౌ. హిమప్రాయశ్చ హిమవాన్ హేమకూటశ్చ హేమవాన్ తరుణాదిత్యవర్ణాభో హైరణ్యో నిషధ స్స్మృతః. చాతుర్వర్ణ్యస్తు సౌవర్ణో మేరు శ్శోచ్ఛ్రితమ



యమున "వివిధమ్లేచ్ఛులగుంపులతో నిండిన కేతుమూల మను మహావర్షము కలదు" అని చెప్పఁబడుటవలన నావర్ష మిపుడు ఇలావృతవర్షమునకుఁ బడమరగా 'రష్యన్, టర్కిస్థాన్ (Rusion Turkistan), కిర్గియాస్టెప్పీస్ (Kergia Steppes), కేకషియన్ రష్యా (Cacacian Russia), ఆసియామైనరు (Asia Minor) అను పేర్ల వ్యవహరింపఁబడుప్రదేశ మని దృఢమగుచున్నది.

ఇఁక భద్రాశ్వవర్షము—వాయుపురాణమున "మాల్యవంత మను పర్వతముప్రక్క ముందుముందు గండికలు, తరువాత గండికవలె పొడవు వైశాల్యము కలవి, ఆతరువాతగండికయే భద్రాశ్వము. అచటి పురుషులు సంతోషమనస్కులు, తెల్లనివారు, మహాసత్త్వులు, మహాబలులు" అని యట్లు చెప్పఁబడుటవలన నావర్ష మిపు డిలావృతమునకుఁ దూర్పున నున్న జపాన్ (Japan), కొరియా (Korea), మంగోలియా (Mongolia) అని వ్యవహరింపఁబడు ప్రదేశ మని తెలియుచున్నది.

ఇచట నీయంశము కూడ కూర్చుకొనఁదగినది. ఈజంబూద్వీపమునఁ దొమ్మిదివర్షములు నెనిమిదిసరిహద్దుపర్వతములచే బాగుగా విభజింపఁబడినవి. ఇలావృతము మేరుపర్వతాధారమున నున్న దని తెలియవలెను. "ఈవర్షపర్వతము లారును పూర్వపశ్చిమసముద్రములు రెండిటిని జొరి దీర్ఘములై, మంచిపర్వములు (మధ్యమధ్యనున్న చరియలు) కలవై యున్నవి. మంచు దట్టముగాఁ గలది హిమవంతము. సువర్ణశిఖరములు గలది హేమవంతము. ఉదయసూర్యునివంటివర్ణము గలది, బంగారమయము నైనది నిషధము. నాల్గువర్ణములు గలిగి, స్వర్ణమయమైనదియు, నన్నిఁటికంటె నెత్తైనదియు, మిగుల

స్సశ్రుతః, ప్లతాగ్రృతిపరిమాణశ్చ చతురశ్రి స్సముచ్ఛ్రితః. నీలశ్చ వైడూర్యమయ శ్శ్వేతశ్శృంగో హిరణ్మయః, మయూరబర్హివర్ణస్తు శాతకౌంభస్తు శృంగవాన్. జంబూద్వీపస్య విస్తారా త్తేషా మాయామ ఉచ్యతే, నీలశ్చ నిషధశ్చైవ తాభ్యాం హీనాస్తు యే పరే. శ్వేతశ్చ హేమకూటశ్చ హిమవాన్ శృంగవాంశ్చ యః, తేషాం మధ్యే జనపదా స్తాని వర్షాణి సప్తవై. ధనుర్వ త్సంస్థితే జ్ఞేయే ద్వే వర్షే దక్షిణోత్తరే, దీర్ఘాణి తత్ర చత్వారి చతురశ్ర మిళా మితి వాయుపురాణోక్త్యా త త్తత్పర్వత వర్షవిశేషా ణ్యవగంతవ్యం. తదేవోక్తం భాగవతే—మర్యాదాగిరయః ప్రాగాయతాః, ఉభయతః క్షారో దావధయః, ఉత్తరోత్తరే ణేలావృతం నీలశ్శ్వేతశ్శృంగవా నితి ప్రసిద్ధా న్మర్యాదాగిరీ ననుసృత్య త్రయో రమ్యకహిరణ్మయదక్షిణకుర్వాఖ్యా వర్షా విద్యంతే. ఏవం దక్షిణే నేలావృతం నిషధహేమకూటహిమాలయా ఇతి ప్రసిద్ధా న్మర్యాదాగిరీ ననుసృత్య హరివర్ష కింపురుషవర్ష భారత వర్షా యథాసంఖ్యం ప్రకాశంతే. తథైవేలావృత మపరేణ పూర్వేణచ. మాల్యవ ద్గంధమాధనా వానీలనిషధాయతౌ కేతుమాలభద్రాశ్వయో స్సీమానం విదధా తే పూర్వాపరవర్షయో రాసముద్రం దైర్ఘ్యేణ ద్రష్టవ్యా నీతి.



నెక్కు వగు నాకారము, పరిమాణము గలది, నాల్గంచులు గలిగి నది మేరువు. నీలపర్వతము వైడూర్యమణులతో నిండినది. శ్వేత శృంగము స్వర్ణమయమైనది. నెమలిపురిరంగుగలది, పదునాఱువన్నె బంగారముకలది శృంగవంతము. జంబూద్వీపముయొక్క వైశాల్యమును బట్టి వాని పొడవు దెల్పెదను.-నీలము నిషధము నను వానికంటెఁ దక్కునవి శ్వేతము, హేమకూటము, హిమవంతము, శృంగవంతము ఈపర్వతముల మధ్య జనపదములు గలవు. (మేరువుతోఁ గలిసి) ఇవి యేడుపర్వతములు. అందు రెండుపర్వతములు దక్షిణోత్తరములుగా వ్యాపించి ధనురాకారమున నున్న వని తెలియు నది. నాల్గు పొడవుగా నున్నవి. చతురముగా నొక్కటి యున్నది" అను వాయుపురాణవచనముంబట్టి, ఆయాపర్వతవిశేషముల గ్రహింపఁదగును. అదే భాగవతమున నిట్లు చెప్పఁబడినది.-తూర్పునుండి దీర్ఘములై వ్యాపించిన సరిహద్దుపర్వతములు కలవు. రెండుప్రక్కల లవణసముద్రము హద్దుగాఁ గలిగియున్నవి. ఉత్తరముగా ఇలావృతము, నీలము, శ్వేతము, శృంగవంతము అను ప్రసిద్ధము లగు సరిహద్దుపర్వతముల ననుసరించి రమ్యక- హిరణ్మయ- దక్షిణకురు నామకము లగు మూఁడువర్షము లున్నవి. కాఁగా దక్షిణమున నిలావృతము, నిషధ, హేమకూటము, హిమవంతము అను ప్రసిద్ధ (సరిహద్దు) మర్యాదాపర్వతముల ననుసరించి హరివర్షము, కింపురుషవర్షము, భారతవర్షము లెక్కననుసరించి యున్నవి. అట్లే ఇలావృతము పశ్చిమముగాను, దూర్పుగా మాల్యవంతము, గంధమాదనము, నీలము, నిషధవలె పొడవైనవి కేతుమాల, భద్రాశ్వము లను దేశములకు సరిహద్దును గూర్చుచున్నవి. పూర్వపశ్చిమవర్షములు సముద్రమువఱకుఁ గల పొడవు కల వని యెఱుంగునది.

అథ మేరో శ్చత్వారో పాదా స్సంతి. ప్రాగారభ్య పర్వతాః మందరో మేరుమందరం సుపార్శ్వః కుముద ఇతి. తేషు చతుర్ష్వపి చూతజంబూకదంబన్యగ్రోధా శ్చత్వారః పాదపప్రవరా రాజంతే.

ఏవం జంబూఫలానా మత్యుచ్చనిపాతవిశీర్ణానాం రసేన జంబూనదీమేరుమందరశిఖరా దవనీతలే నిపతంతీ, దక్షిణేనాత్మానం యావ దిలావృత ముపస్యందయతి తావదుభయో రపి రోధసో ర్మృత్తికా తద్రసే నానువిధ్యమానాచ వాయ్వర్క-సంయోగవిపాకేన 'జాంబూనద' నామక సువర్ణం భవతి. అస్మి న్విషయే సందిహానైః (Through Siberia) త్రూ సైబేరియా ఇతి వక్ష్యమాణగ్రంథే క్రీ. 880 వర్షే కశ్చన ఐరోపీయః (Henry Lanceolet) హెన్రీలాన్సలెట్ నామకానుభవవాక్య మపి ప్రత్యక్షీక్రియతాం.

అథ పూర్వోక్తమర్యాదాకులపర్వతేషు రాక్షసాద్యై స్సంచార్యమాణాః ప్రదేశా వాయుపురాణే ఇత్థం విశదీకృతాః. శ్లో॥ రక్షః పిశాచా యక్షాశ్చ సర్వే హైమవతా స్స్మృతాః, హైమకూటేతు గంధర్వా విజ్ఞేయా స్సాప్సరోగణాః. సర్వే నాగాస్తు నిషధే శేషవాసుకితక్షకాః, మహామేరౌ త్రియ స్త్రింశ ద్భ్రమంతే యాజ్ఞికా స్సురాః. నీలేతు వైడూర్యమయే సిద్ధబ్రహ్మర్షయో మతాః, దైత్యానాం దానవానాంచ శ్వేతపర్వత ఉచ్యతే. శృంగవా న్పర్వత



ఇంక మేరువునకుఁ దూర్పు దిక్కు మొదలుగఁ బర్వతములు నాల్గు పాదములుగా నున్నవి-౧ మందరము ౨ మేరుమందరము, 3 సుపార్శ్వము ౪ కుముదము లని. ఆనాల్గింటియందును మామిడి (చూతము), నేరేడు (జంబుకము), కడిమి (కదంబము), మఱ్ఱి (న్యగ్రోధము) అను వృక్షరాజములు కలవు.

కాఁగా జంబూఫలములు (నేరేడుపండ్లు) ఎత్తునుండిపడి విడిపోయినంత వానిరసముచే నేర్పడిన జంబూనది మేరుమందరశిఖరమునుండి భూతలమునఁ బడినదై దక్షిణపువైపునుండి ప్రవహించుచు నెంతదనుక యిలావృతమును దడుపునో, అంతవరకు నిరువంకల నున్న యొడ్డులందలి మన్ను, ఆరసముచే నాని, వాయువు, సూర్యుఁడు (సూర్యతేజ స్సనుట) వీని సమ్మేళనముచేఁ బాకము నొంది 'జాంబూనదము' అను పేరుగల సువర్ణ మగుచున్నది. ఈయంశమున సందేహించువారు 'త్రూసైబేరియా' (Through Siberia) అని ముందుఁ జేర్కొనఁబోవు గ్రంథమునందు క్రీ: శ 880 సంవత్సరమున నొకయైరోపీయుఁడు హెన్రీలాన్సలెట్ (Henry Lanceolet) అను ననుభవజ్ఞుఁడు దెల్పినమాటను జూడుఁడు.

ఇంకఁ బూర్వోక్తములగు సరిహద్దుల నున్న కులపర్వతములయందు రాక్షసాదులు సంచరించు ప్రదేశములు వాయుపురాణమునం దీక్రింది విధమున విశదీకరింపఁబడి యున్నవి. "రక్కసులు, పిశాచులు, యక్షులు, హైమవతులు అనఁగా హిమవత్పర్వతము వీరికి సంచారస్థానము. హైమకూటమున గంధర్వులు, అప్సరోగణములు గలరు. నిషధమున సర్వనాగములు, శేషుఁడు, వాసుకి, తక్షకుఁడు నను వారు గలరు. మహామేరువునందు ముప్పదిముగ్గురు యజ్ఞసంబంధులగు దేవతలు గలరు. వైడూర్యమయ మగు నీలమున సిద్ధులు, బ్రహ్మ

శ్రేష్ఠః పితౄణాం ప్రీతి సంచరః, నవ స్వేతేషు వర్షేషు యథాభాగస్థితేషు వై. భూతా న్యుపనివిష్టాని గతిమంతి తథైవచ. ఇత్యుక్త్వా దేతే న హి దేవతానాం సదా నివాసభూతాః పర్వతాః, కింతు దేవై స్సంచార్యమాణాః ప్రదేశా ఇతి భావః.

దివ్యభౌమ బైల భేదా త్రివిధ స్స్వర్గః. తత్రైతే భౌమ స్వర్గస్య స్థానా నీతి జ్ఞేయం. తదుక్తం విష్ణుపురాణే. శ్లో॥ భౌమా హ్యేతే స్మృతా స్స్వర్గా ధర్మిణా మాలయా మునే ఇతి.

అథ దివిస్థితా స్స్వర్గా దివ్యా ఇతి స్పష్టతయా అవగమా ద్బైలస్వర్గపదస్థానాని బ్రూమః. కే తే ఇత్యాకాఙ్క్షాయా ముచ్యతే తలశబ్దమకుఃటే రథకారే విరాజమాన సప్తపాతాళా ఇతి—తదుక్తం శ్రీభాగవతే తథా హ్యుపవర్ణితం 'భూమే ర్యథా సన్నివేశావస్థానం, అవనే ర ప్యథస్తా త్సప్తభూవివరాః, అతలం వితలం సుతలం తలాతలం మహాతలం రసాతలం పాతాళ' మితి.

ఏతేషు బిలస్వర్గేషు స్వర్గా దప్యధికకామభోగైశ్వర్యానంద భూతివిభూతిసహితాని మయేన మాయావినా నిర్మితాని పురోద్యానాని సంతి. అహోరాత్రాదిభి ర్భయం త న్నోపలక్ష్యతే సూర్యా ద్యభావాత్ (తత్ర) ప్రకాశార్థం వాయుప్రసరణార్థం చాన్యాని సాధనాంతరాణి సంతీతి



ర్షులు గలరు. దైత్యులు, దానవులు శ్వేతపర్వతమున నున్నారు. శృంగవంత మను బర్వతము పితృదేవతలు సంచరించునది. భాగముల నున్న యీ త్రొమ్మిదివర్షములయందును గతులు గల భూతము లున్నవి." ఇట్లనుటవలన నీపర్వతము లన్నియు నెల్లప్పుడు దేవతలు నివసించునవి కావు. అప్పు డప్పుడు వారు విహారార్థముగా సంచరించునవిమాత్రమే యనుట.

దివ్యము, భౌమము, బైలము అని స్వర్గము మూఁడువిధములు. అందుఁ బూర్వోక్తము లగు స్థానములు 'భౌమము' అను స్వర్గమునకు సంబంధించినవి. విష్ణుపురాణమునఁగూడ "మునీ! ఇవి 'భౌమస్వర్గములు' ధర్మాత్ములు నివసించుస్థానములు " అని.

ఇఁక దివమున నున్న స్వర్గములు 'దివ్యములు' అని స్పష్టముగాఁ దెలియుటవలన (నాయంశము వివరింపక) బైలస్వర్గమునఁ గల స్థానములం జెప్పుచున్నాము. అవి యేవి యన్నచోఁజెప్పఁబడుచున్నది—"తలము అను దానిచివర నంధకారమున నున్నవి సప్తపాతాళములు" అని. అదే శ్రీభాగవతమునఁ దెలుపఁబడెను. "అట్లు వర్ణింపఁబడిన భూమియొక్క సన్నివేశ మెట్లుగలదో, ఆభూమికిఁ గ్రిందుగా నేడుభూవివరములు గలవు. అతలము, వితలము, సుతలము, తలాతలము, మహాతలము, రసాతలము, పాతాళము " అని.

ఈబైలస్వర్గములయందు స్వర్గముకంటె నధికము లగు కామభోగైశ్వర్యానంద సంపదలు, అణిమాదివిభూతులు గలిగి, మాయావి యగు మయునిచే నిర్మింపఁబడిన పురోద్యానములు గలవు. సూర్యచంద్రాదు లిచ్చట లేనికతమున నహోరాత్రములచే భయము కనఁబడదు. అచట వెలుతురు, గాలి ప్రసరించుటకు వేఱుసాధనములు గల వని యెఱుంగ నగును. మఱియు నిట నీరు లేకుండు టెట్లు? యనుచో

జ్ఞేయం). అపి నాత్ర జలాభావత్వం కథ మితి చే దుచ్యతే వాయుపురాణే ౫౦ సర్గే శ్లో॥ జననీ సర్వభూతానాం సర్వభూతధరా ధరా, ఆపః పృథివ్యా ముదకే పృథివీ చోపరిస్థితా ఆకాశం చాపర మథః పున ర్భూమిః పునర్జలం, భూమి ర్జల మథాకాశ మితి జ్ఞేయా పరంపరా ఇతి.

1 అ థాతలే మయపుత్రో బలో నామాసురో నివసతి.

2 తతో ఽధస్తా ద్వితలే హరో భగవాౕ హాటకేశ్వరః. (తన్మార్గరోధనార్థ మేవ భూవివరే శ్రీశైలస్థాపన మితి స్కాందే నాగరఖండే శ్రీశైలమాహాత్మ్యే సుస్పష్టం ఏవమే వేతరమార్గాణీతి జ్ఞేయం).

3 తతో ఽధస్తా త్సుతలే పుణ్యశ్లోకో విరోచనాత్మజో బలిః.

4 తతో ఽధస్తా త్తలాతలే త్రిపురాధిపో మయో నామ దానవేంద్రః.

5 తతో ఽధస్తా న్మహాతలే కాద్రవేయాణాం కుహక తక్షక కాళీయాది నైకశిరసాం గణః.

6 తతో ఽధస్తా ద్రసాతలే దైతేయా దానవాః ఫణయో నామ నివాతకవచాః కాలకేయా నివసంతి.

7 తతో ఽధస్తాత్పాతాళే నాగలోకపతయో వాసుకిశంఖ కుళిక మహాశంఖ శ్వేత ధనంజయ ధృతరాష్ట్రప్రముఖాః



వాయుపురాణమున నేబదియవసర్గమున "సమస్తభూతములను ధరించుచు, సర్వభూతములకుఁ దల్లివంటిదైన భూమి యున్నది. భూమియం దుదక మున్నది. ఉదకమునందుఁ బైన భూమియు నున్నది. ఆకాశము దానిక్రింద నున్నది. మఱల భూమి యున్నది. మఱల నీ రున్నది. భూమి, జలము, అటుపై ఆకాశము ఇట్లు వరుస యున్నది."

అటుపై- ౧ అతలమున మయునికుమారుఁ డగు బలుఁ డను నసురుఁడు నివసించుచున్నాఁడు.

౨ దానికిఁ గ్రింద వితలమున భగవానుఁ డగు హాటకేశ్వరుఁడు వేంచేసి యున్నాఁడు. ఆవితలమునకుఁ బోవుదారి నరికట్టుటకే భూవివరమున శ్రీశైలపర్వతము స్థాపింపఁబడెను—అని స్కాందపురాణమున నాగరఖండమున శ్రీశైలమాహాత్మ్యమున లెస్సగాఁ దెలుపఁబడెను. ఇట్లే యితరమార్గముల నెఱుంగునది.

౩ దానికిఁ గ్రింద సుతలమునఁ బుణ్యయశస్వి యగు విరోచనుని పుత్రుఁడు బలి యున్నవాఁడు.

౪ దానికిఁ గ్రింద తలాతలమునఁ ద్రిపురాధిపుఁ డగు మయుఁ డున్నవాఁడు.

౫ దానికిఁ గ్రింద మహాతలమున (కద్రువసంతాన మగు) కాద్రవేయులలో కుహకుఁడు తక్షకుఁడు కాళీయుఁడు మొదలగు బహుశిరస్కులగు సర్పరాజులగణము.

౬ దానికిఁగ్రింద రసాతలమున దితిసంతాన మగు దానవులు, ఫణు లను పేరు గల నివాతకవచులు, కాలకేయులు నివసించుచున్నారు.

౭ దానికిఁ గ్రిందుగఁ బాతాళమున నాగలోకాధిపతు లగు వాసుకి, శంఖుఁడు, కుళికుఁడు, మహాశంఖుఁడు, ధనంజయుఁడు, ధృతరా

పంచష ట్సప్త దశ శత సహస్ర శీర్షాణాం తేషాం ఫణాసు విరచితా మహామణయో రోచిష్ణవః పాతాళవివరే తిమిర నికరం స్వతేజసా విధమంతి. పాతాళాంతే శేషాఖ్యో విష్ణువాహి రతితను ర్మర్యాదాయాం వ్యవస్థితః! తత్రో ఽధస్తా త్తమసి రౌరవా ద్యపుణ్యనరకాః. అతః పర మనాలోక్య మగమ్యం సిద్ధసాధుభిః దేవానా మ ప్యవిదితం వ్యవహార వివర్జిత మితి.

ఇదానీంతనకాలే పూర్వోక్తలక్షణాని సర్వాణ్యపి (Asia) ఆసి యేతి ప్రఖ్యాతజంబూద్వీపే స్పష్టం ద్రష్టుం శక్తాని - కథాపి కదాచిత్ సగరాత్మజై రశ్వా ఽన్వేషణాయ జంబూద్వీప మిదం తదనుమానస్థలేషు పరిత స్తదిష్టానుసారేణ నిఖాతత్వా త్తేషాం నవవర్షాణాం యోజనపరిమాణంతు గణితుం నశక్యతే. తావన్మాత్ర మేవ లోపః. శిష్టం సర్వమపి స్పష్టం.

ఉత అల్పరాజ్యమదాంధానాం విషాదాయ విరక్తయే మాహాత్మ్యఖ్యాపనార్థం వర్షాణాం ప్రత్యేకనవసహస్ర యోజనవిస్తృతా నీతి- లక్షయోజనవిస్తీర్ణ మేతజ్జంబూద్వీప మిత్యాది కల్పన మితి వా జ్ఞేయం. జంబూద్వీప ఖననా దన్యే కేచిద్వీపా స్సహస్రశో వ్యక్తాః. తేషు ప్రధానా న్భాగవత మేవం వ్యనక్తి. స్వర్ణప్రస్థ శ్చంద్రశుక్ల ఆవర్తనో రమణకో మందేహారుణః పాంచజన్య స్సింహళో లంకేతి జంబూద్వీపస్య రాజ న్నుపద్వీపా నష్టా ఇహైక ఉపదిశంతి.



ష్టుండు మొద లగు సర్పాధిపతులు గలరు. వారియొక్క ఐదు, ఆఱు, ఏడు, పది, నూరు, వేయి పడగలయందున్న యనర్ఘము లగు రత్నములు తేజరిల్లుచు, పాతాళవివరమునఁ గల చీఁకటిని దమ తేజముచేఁ బోఁగొట్టును. పాతాళముచివర 'శేషుఁ' డను విష్ణుశయన మగు సర్పము పెద్దశరీరము గలది యీలోకములకు సరిహద్దుగ నున్నది. దానికిఁ గ్రిందఁ జీఁకటిలో రౌరవాది పాపనరకము లున్నవి. అటుపైఁ సిద్ధులు, సాధువులుగూడఁ జూచుటకుగానిఁ, వెళ్లుటకుఁగాని వీలులేని ప్రదేశము గలదు. దేవతలుగూడ దాని నెఱుంగరు. అది వ్యవహారశూన్య మయినది.

ఈకాలమునఁ దొలుతఁ జెప్పఁబడిన లక్షణము లన్నియు 'ఆసియా' (Asia) యను ప్రసిద్ధ మగు జంబూద్వీపమున స్పష్టముగాఁ జూచుటకు శక్యము లయి యున్నవి. అయిన నొకప్పుడు సగరకుమారులు అశ్వమేధహయమును వెదకుటకు జంబూద్వీపమును, వారి కనుమానము గలిగినచోటులం దచ్చటచ్చట వారియిష్టానుసారముగఁ ద్రవ్వియుండుటవలన వారికిఁ దొమ్మిదివర్షములయు యోజనములపరిమాణము లెక్కింప శక్యముగాకపోయెను. అదే లోపము. మిగిలిన దెల్ల స్పష్టమే.

కాక స్వల్పరాజ్యమదముచేఁ గండ్లు గప్పువడినవారికి విరక్తి గల్గుటకును భగవన్మాహాత్మ్యమును దెలుపుటకును వర్షములు ప్రత్యేకముగఁ దొమ్మిదివేలయోజనములు వైశాల్యము గలవనియు లక్షయోజనముల విస్తీర్ణమైనది యీజంబూద్వీప మనియు నిట్టి గల్పనములు జరిగె నని యెఱుంగ నగును. జంబూద్వీపమును ద్రవ్వుటవలన మఱి పెక్కుద్వీపములు గన్పట్టినవి. అందు ముఖ్యము లగువానిని భాగవత మిట్లు స్పష్టము చేయుచున్నది—స్వర్ణప్రస్థము, చంద్రశుక్లము, ఆవర్తనము, రమణకము, మందేహారుణము, పాంచజన్యము, సింహళము, లంక అని. జంబూద్వీపముయొక్క యుపద్వీపములు నశించిన వని కొందరనుచున్నారు. సగరకుమారులు యజ్ఞహయమును వెదకునపుడు

సగరాత్మజై రశ్వాన్వేషణే ఇమాం మహీం పరితో ఖనద్భి రుపకల్పితా నీతి. ఏతే పురాణాంతరేషు ఇంద్రద్వీప కశేరు తామ్రపర్ణి గభస్తిమ న్నాగద్వీప సౌమ్య గాంధర్వ వారుణాఖ్య పర్యాయపదైః కథ్యంతే.

ఇదానీంతన కాలే ఽపి ఆసియా (Asia) సమంతతః క్రమేణ ప్రాచ్యాం (Japan) జపాన్ ద్వీపాః; ఆగ్నేయ్యాం (Philippine) ఫిలిప్పైన్ ద్వీపాః, (Bor-nia) బోర్నియా, (Neuguinea) న్యూగిని, (Nelibez) నెలిబిజ్,(Australia) ఆస్ట్రేలియా ప్రభృతయః; దక్షిణతః (Sumatra) సుమిత్రా, (Java) జావా (Ceylone) సింహళ, (Lanka) లంకా, శాస్కరీప్రభృతయః; నైఋత్యాం సింధుసంగమే (Cutch) కచ్ ద్వీపః; పశ్చిమే (British Isles) బ్రిటిష్ ప్రభృతయః; వాయవ్యే (Greenland) గ్రీన్లండ్, వెస్లండ్; ఉత్తరే (Novaya Zembela) నోవయా జెమ్లియా ప్రభృతయః; ఇమేచ జంబూద్వీప స్యోపద్వీపా ఇతి జ్ఞాయతే.

ఇతఃపరం పూర్వోక్తభూగోళపరిపాలకానా మాద్యస్వాయంభువవంశీయానాం నామాని కథ్యంతే తథాహి- బ్రహ్మమానసపుత్రః, స్వాయంభువః చతుర్దశమనూనాం ప్రథమః, తజ్జ్యేష్ఠపుత్ర స్యోత్తానపాదస్య విశ్వకర్మపుత్ర్యాం బర్హిష్మత్యాం 1 ఆగ్నీధ్రః, 2 ఇధ్మజిహ్వః, 3 యజ్ఞబాహుః, 4 మహావీరః, 5 హిరణ్యరేతాః, 6 ఘృతపృ



భూమి నెల్లను త్రవ్వినపుడు మఱలఁ గల్పింపఁబడినవి. అని. ఇవే పురాణాంతరములయందు ఇంద్రద్వీపము, కశేరువు, తామ్రపర్ణి, గభస్తిమంతము, నాగద్వీపము, సౌమ్యము, గాంధర్వము, వారుణము అను పర్యాయపదములచేఁ బిలువఁబడుచున్నవి.

ఈకాలమునఁగూడ ఆసియా (Asia) ఖండమునకుఁ జుట్టును గ్రమముగాఁ దూర్పుదిశను జపాన్ (Japan) ద్వీపములు; ఆగ్నేయదిశను ఫిలిప్పైన్ ద్వీపములు (Philippine), బోర్నియో (Bornia) న్యూజినియా (Neuginea), నెలిబజ్ (Nelibeze), ఆస్ట్రేలియా (Australia) మొదలగునవి; దక్షిణమున సుమిత్రా (Sumatra), జావా (Java), సింహళము (Ceylone), లంక (Lanka), శాస్కరి మొదలగునవి; నైఋతిదిశను సాగరసంగమమున 'కచ్' ద్వీపము (Cautch); పడమట బ్రిటిష్ దీవులు (British Isles); వాయవ్యమున గ్రీన్ లేండు (Green land), వెస్లండ్; ఉత్తరమున నోవయా జమ్లియా (Navaya Zembela) మొదలగునవి. ఇవే జంబూద్వీపమున కుపద్వీపము లని తెలియుచున్నది.

ఇఁకఁ దొలుతఁ జెప్పిన యీ భూగోళమును బరిపాలించిన ఆది స్వాయంభువవంశీయుల పేర్లు చెప్పఁబడుచున్నవి. బ్రహ్మమనస్సువలనఁ బుట్టినవాఁడు స్వాయంభువుఁడు ఆతఁడు. పదునలుగురు మనువులకును మొదటివాఁడు. వాని జ్యేష్ఠకుమారుఁ డగు ఉత్తానపాదునకు విశ్వకర్మకుమార్తె యగు బర్హిష్మతియందు ౧ ఆగ్నీధ్రుఁడు, ౨ ఇధ్మజిహ్వుఁడు, 3 యజ్ఞబాహుఁడు, ౪ మహావీరుఁడు, ౫ హిరణ్యరేతసుఁడు, ౬ ఘృతపృష్ఠుఁడు, ౭ వసనుఁడు, ౮ వీతిహోత్రుఁడు,

షః, 7 వసనః, 8 మేధాతిథిః, 9 వీతిహోత్రః, 10 కలి
శ్చేతి దశపుత్రాః, ఊర్జస్వతీనామికా కన్యా చైకా జజ్ఞిరే
(ఇయమేవ శుక్రాచార్యస్య పత్నీ), ఉత్తానపాదపుత్రా
ణాం దశానాం మధ్యే 1 మహావీరః, 2 సవనః 3 కలి
శ్చేతి త్రయ ఊర్ధ్వరేతస్కాః పరమహంసాశ్చ బభూవుః.
శిష్టా స్సప్తచ పూర్వోక్త జంబ్వాదిసప్తమహాద్వీపానా
మధిపతయో ఽభవన్. తద్యథా 1 జంబూద్వీప స్యాగ్నీ
ధ్రః, 2 ప్లక్షద్వీప స్యేధ్మజిహ్వః, 3 శాల్మలీద్వీపస్య యజ్ఞ
బాహుః, 4 కుశద్వీపస్య హిరణ్యరేతాః, 5 క్రౌంచద్వీ
పస్య ఘృతపృష్ఠః, 6 శాకద్వీపస్య మేధాతిథిః, 7 పుష్క
రద్వీపస్య వీతిహోత్రశ్చేతి. తేషు జ్యేష్ఠ స్యాగ్నీధ్రస్య
జంబూద్వీపాధిపస్య పూర్వచిత్తినామ్న్య మప్సరఃకాన్తా
యాం 1 నాభిః (భారతః), 2 కింపురుషః, 3 హరివర్షః,
4 ఇలావృతవర్షః, 5 రమ్యకః, 6 హిరణ్మయః, 7 కురుః,
8 భద్రాశ్వః, 9 కేతుమాలః ఇతి నవపుత్రాః ప్రసూ
తాః పితృపాల్యమానజంబూద్వీపసంబంధినవవర్షా ణ్యపా
లయన్. తేషాం జ్యేష్ఠస్య నాభి నామకస్య మేరుదేవ్యాం
భగవదవతారత్వేన ఋషభో ఽజాయత. త స్యేంద్రదత్తా
యాం జయంత్యాం పుత్రశత మజాయత. తత్ర ప్రథమ
దశకే జ్యేష్ఠో భరతో మహాయోగీ కర్మనిష్ఠో బభూవ.
తన్నామ్నైవ తత్పరిపాలితదేశస్య భరతఖండ మితి ప్రసిద్ధిః.





౧౦ కలి యను పదిమందికుమారులును ఊర్జస్వతి యను నొకకన్య
యును జనించిరి (ఈమెయే శుక్రాచార్యుల భార్య) ఉత్తానపాద
కుమారులు పదిమందిలో 1 మహావీరుఁడు, 2 సవనుఁడు, 3 కలి
యీముగ్గురును ఊర్ధ్వరేతస్కు లగు పరమహంసలైరి. మిగిలిన
యేడుగురు కుమారులును జంబూద్వీపము మొద లగు సప్తద్వీపము
లకుఁ బ్రభువు లైరి. అదెట్లనిన- 1 జంబూద్వీపమున కాగ్నీధ్రుఁడు,
2 ప్లక్షద్వీపమున కిధ్మజిహ్వుఁడు, 3 శాల్మలీద్వీపమునకు యజ్ఞ
బాహువు, 4 కుశద్వీపమునకు హిరణ్యరేతసుఁడు, 5 క్రౌంచద్వీప
మునకు మేధాతిథి, 7 పుష్కరద్వీపమునకు వీతిహోత్రుఁడును
బరిపాలకులైరి. వారిలోఁ పెద్దవాఁడును జంబూద్వీపమున
కధిపతి యగు నాగ్నీధ్రునకుఁ 'పూర్వచిత్తి' యను నప్సరః
కాంతయందు 1 నాభి (భారతుఁడు), 2 కింపురుషుఁడు, 3 హరి
వర్షుఁడు, 4 ఇలావృతవర్షుఁడు, 5 రమ్యకుఁడు, 6 హిరణ్మయుఁడు,
7 కురువు, 8 భద్రాశ్వుఁడు, 9 కేతుమాలుఁడు ఇట్లు తొమ్మిది
మంది పుత్రులు జనించిరి. వీరు తండ్రిచేఁ పాలింపబడుచున్న
జంబూద్వీపసంబంధములగు లగు తొమ్మిదివర్షములను పాలించిరి.
వీరిలో పెద్దవాఁ డగు నాభి యను వానికి భార్య యగు మేరుదేవి
యందు భగవంతుఁడే ఋషభుఁ డను పేర నవతరించెను. వాని
కింద్రునిచే నీయఁబడిన 'జయంతి' యను భార్యయందు నూర్గురు
పుత్రులు పుట్టిరి. వీరలందఱకు మొదటివాఁ డగు భరతుఁడు మహా
యోగియై కర్మనిష్టగలవాఁ డయ్యెను. వానిచేఁ బరిపాలింపఁబడిన
దేశమునకు వాని పేరుతో 'భరతఖండ' మని ప్రసిద్ధి కల్గెను.

తతో ద్వితీయాదిదశకేషు ప్రధానభూతాః 1 కుశావర్త, 2 ఇలావర్త, 3 బ్రహ్మావర్త, 4 ఆర్యావర్త, 5 మలయకేతు, 6 భద్రసేన, 7 ఇంద్రస్పృక్, 8 విదర్భ, 9 కీకట నామాన స్తత్తత్ప్రధానదేశాధిపతయో బభూవుః శేషా గృహస్థా అంగవంగాదిరాజమాత్రా అసన్. ఏవం స్వాయంభువమనువంశీయా ఏతద్భూగోళం పరిత ఆమన్వంతరాంత మపాలయ న్నితి స్ఫుట మవగమ్యతే. విష్ణుపురాణే- 'ఉత్తరం య త్సముద్రస్య హిమాద్రేశ్చైవ దక్షిణం, వర్షం తద్భారతం నామ భారతీ యత్ర సంతతిః. కర్మభూమి రియం స్వర్గ మపవర్గంచ గచ్ఛతాం, నఖ ల్వన్యత్ర మర్త్యానాం కర్మభూమి ర్విధీయతే' ఇతి. అనయోక్త్యా యది కర్మాచరితు మిచ్ఛా దేవతానాం తర్హి తాభి రప్యత్రాగంతవ్యం అస్యాఏవ కర్మభూమిత్వాత్. స్వర్గాదిషు కర్మకరణ స్యానధికారాత్ ఇతి స్పష్టం. కిము తాన్యవర్షస్థానా మితి.

అథాంగాది ఛప్పన్న (౫౬) దేశవిశేషవివరణ మత్ర క్రియతే మత్స్యవాయ్వాదిపురాణ నదనదీపర్వతప్రాంతస్థ దేశవిశేషవివరణసాహ్యేన.

తత్రాదౌ నదీవిశేషవివరణం. శ్లో॥ పీయంతే యై రిమా నద్యో గంగాసింధుసరస్వతీ, శతద్రు శ్చంద్రభాగాచ యమునాసరయూ స్తథా. శరావతీ వితస్తాచ విపాశా దేవికా కుహూః, గోమతీ ధూతపాపాచ బాహుదాచ దృష



అటుపైఁ బదిమంది కొక పెద్దవాఁడై యున్నవారు - 1 కుశావర్త, 2 ఇలావర్త, 3 బ్రహ్మావర్త, 4 ఆర్యావర్త, 5 మలయకేతు, 6 భద్రసేన, 7 ఇంద్రస్పృక్, 8 విదర్భ, 9 కీకట అను పేర్లుగల వారా యా పేర్లఁ బ్రసిద్ధదేశములకుఁ బ్రభువు లయిరి. అనూర్ధ్వులో మిగిలినవారు గృహస్థులై అంగవంగాదిదేశములకు రాజమాత్రులుగా నుండిరి. ఈతీరున స్వాయంభువమనువంశస్థులు యీ భూగోళము నంతటను మన్వంతరమువఱకుఁ బాలించి రని స్పష్టముగాఁ దెలియుచున్నది. విష్ణుపురాణమందు "సముద్రమున కుత్తరముగా హిమత్పర్వతమునకు దక్షిణముగా నున్నవర్షమునకు 'భారత' మని పేరు. ఇచట భరతుని సంతతియే యుండును. స్వర్గమోక్షములు పొందఁగోరువారి కియ్యదియే కర్మభూమి. ఇంకొకచోట మర్త్యులు పుణ్యకర్మ నార్జించుటకుఁ దావు లేదు." ఈ చెప్పుటచే నిదియే కర్మభూమి యగుటవలన దేవతలుగూడ పుణ్యకర్మ చేయఁదలంచినచో నిటకే రావలయును. స్వర్గాదులందుఁగూడ కర్మ చేయుట కధికారము లేదు. అందుచే మిగతవర్షములయం దున్నవారిమాట వేఱుగాఁ జెప్పవలసిన యవసరము లేదు.

ఇఁక వంగము మొదలగు ఛప్పన్న (౫౬) దేశముల వివరణము చేయఁబడుచున్నది. మాత్స్యవాయ్వాదిపురాణములందుఁ జెప్పఁబడినరీతిగా నదములు, నదులు, పర్వతప్రాంతములు వానిదగ్గర నున్న దేశ విశేషములయువివరణసహాయమున నిది జరుగును.

మొదట నదీవిశేషములను వివరించుచున్నాము. "గంగ, సింధువు, సరస్వతి, శతద్రువు, చంద్రభాగ, యమున, సరయువు, శరావతి, వితస్థ, విపాశ, దేవిక, కుహూనది, గోమతి, పాపములను బోగొట్టు

ద్వతీ. కౌశికీచ తృతీయాతు నిశ్చిరా గండకీ తథా, ఇక్షు లోహిత ఇత్యేతా హిమవత్పాదనిస్సృతాః.

పర్ణాసా నర్మదాచైవ కావేరీ మహతీ తథా, ధారా చన్ద్రవతీ యూపా విదుషా వేణుజీవికా. పరా చర్మణ్వతీచైవ విదిశా వేత్రవత్యపి, శిప్రా హ్యవంతీచ తథా పారియాత్రాశ్రియా స్స్మృతాః.

శోణా మహానదీ చైవ నందినీ సుమహద్ద్రుమా, మందాకినీ దశార్ణాచ చిత్రకూటాత్తథైవచ.

తమసా పిప్పలా శ్రోణీ కరతోయా పిశాచికా, నీలోత్పలా విపాశాచ జంబులా వాలువాహినీ. సితేరజా శుక్తిమతీ మకుణా త్రిదివా క్రమాత్, ఋక్షపాదాత్ప్రసూతా స్తా నద్యో మణినిభోదకాః.

తాపీ పయోష్ణీ నిర్వింధ్యా మందాకిచ నిషధా నదీ, వేన్వా వైతరణీచైవ శితిబాహుః కుముద్వతీ. తోయా చైవ మహాగౌరీ దుర్గా చాంతశిలా తథా, వింధ్యపాదాత్ప్రసూతాశ్చ నద్యః పుణ్యజలా శ్శుభాః.

గోదావరీ భీమరథీ కృష్ణవేణ్యథ వంజులా, తుంగభద్రా సుప్రయోగా కావేరీచ తథాపగా. దక్షిణాపథనద్యస్తు సహ్యపాదా ద్వినిస్సృతాః.

కృతమాలా తామ్రపర్ణీ పుష్పజా త్యుత్పలావతీ, మలయా దుదతా నద్య స్సర్వా శ్శీతజలా శ్శుభాః.



బాహుద, దృషద్వతి, కౌశికి, నిశ్చిర, గండకి, ఇక్షులోహిత” అను నీ నదులు హిమవత్పర్వతపాదమునుండి ప్రవహించునవి.

పర్ణాస, నర్మద, కావేరి, ధార, చంద్రవతి, యూపవిదుష, వేణుజీవిక, చర్మణ్వతి, విదిశ, వేత్రవతి, శిప్ర, అవంతి యను నీనదులు పారియాత్ర మను పర్వతము నాశ్రయించినవి.

శోణామహానది, గొప్ప వృక్షములతోఁ గూడిన ‘ నందిని ’, మందాకిని, దశార్ణ అను నివి చిత్రకూటమునుండి ప్రవహించును.

తమసానది, పిప్పల, శ్రోణి, కరతోయ, పిశాచిక, నీలోత్పల, విపాశ, జంబుల, వాలువాహిని, సితేరజ, శుక్తిమతి, మకుణ, త్రిదివ యీనదులన్నియు మణికాంతులవలె స్వచ్ఛమగు ప్రకాశము గలవై ఋక్షపర్వతమునుండి ప్రవహించునవి.

తాపి, పయోష్ణి, నిర్వింధ్య, మందా, నిషధ, వేన్వ, వైతరణి, శితిబాహువు, కుముద్వతి, తోయ, మహాగౌరి, దుర్గ, అంతశిల అను నివి పవిత్రజలములు గలవై శుభవంతములై వింధ్యపర్వతపాదము నుండి ప్రవహించునవి.

గోదావరి, భీమరథి, కృష్ణవేణి, వంజుల, తుంగభద్ర, సుప్రయోగ, కావేరి అను నీనదులు దక్షిణాపథమం దున్నవై సహ్యపర్వతము నుండి ప్రవహించునవి.

కృతమాల, తామ్రపర్ణి, పుష్పజాతి, ఉత్పలావతి ఇవన్నియుఁ జల్లనినీరుగలవై మలయపర్వతమునుండి బయలుదేరినవి.

త్రిసామా ఋతుకుల్యాచ ఇక్షులా త్రిదివాచ యా, లాంగు లినీ వంశధరా మహేంద్రతనయా స్స్మృతాః.

ఋషికా సుకుమారీచ మందగా మందవాహినీ, కృపలా పాశినీచైవ శుక్తిమత్ప్రభవా స్మృతాః.

సర్వాః పుణ్యా స్సరస్వత్య స్సర్వా గంగా సముద్రగాః.

అథ దేశవిశేషాః- శ్లో॥ తా స్విమే కురుపాంచాలా సాళ్వా శ్చైవ సజాంగలాః, శూరసేనా భద్రకారా భోజా శత పథేశ్వరైః. మత్స్యాః కిరాతా కుల్యాశ్చ కుంచిలాః కాశి కోసలాః, అనంతా శ్చానులింగాశ్చ మాగధాశ్చ వృకై స్సహ. మధ్యదేశా జనపదాః ప్రాయశో ఽమీ ప్రకీర్తి తాః, సహ్యస్య చోత్తరా జ్ఞేయా యత్ర సా యమునా నదీ. యత్ర గోవర్ధనోనామ నగరీచ వినిర్మితా, రామ ప్రియార్థం సుగ్రీవ! ఋక్షై ర్దివ్యా స్తదోషధీః. భారద్వా జేన మునినా య త్ప్రియార్థే ఽవతారితాః, తస్మా త్సప్ర వరో దేశో తేన జజ్ఞే మనోరమః.

బాహ్లీకా రాజధాన్యశ్చ ఆభీరాః కాలతోయకాః, పరాం ధ్రాశ్చైవ శూద్రాశ్చ పప్లవా శ్చావఖండికాః. గాంధారా యవనాశ్చైవ సింధుసౌవీరభద్రకాః, శకా హూణా కులిందాశ్చ పరీతా హారపూరికాః. రామఠారాద్ధకట కాః కేకయా దశనాసికాః (క్షత్రియోపనివేశాశ్చ).



త్రిసామ, ఋతుకుల్య, త్రిదివ, లాంగులిని, వంశధర అను నీనదులు మహేంద్రపర్వతమునఁ బుట్టినవి.

ఋషిక, సుకుమారి, మందగ, మందవాహిని, కృపల, పాశిని అనునివి శుక్తిమత్పర్వతమునుండి బయల్వెడలినవి.

ఈ (సరస్వతులు) నదులన్నియుఁ బవిత్రములైనవి. అన్నియు (గంగలు) సముద్రమును బొందునవి (ఇట సరస్వతి - గంగ అను పదములు నదీ సామాన్యవాచకములు).

ఇఁక దేశవిశేషములఁ జెప్పుచున్నాము:- కురుపాంచాలములు-సాళ్వ ములు, జాంగలములు, శూరసేనములు, భద్రకారములు, భోజదేశ ములు, శతపథేశ్వరములు, మత్స్యదేశములు, కిరాతములు, కుల్య దేశములు, కుంతలములు, కాశికోసలములు, అవంతములు, అనులింగ ములు, మాగధములు, వృకములు అను నీదేశములు మధ్యదేశము లని పిలువఁబడినవి. ఇవన్నియు సహ్యపర్వతమున కుత్తరముగా నున్నవి. అచట యమునానది ప్రవహించుచున్నది. అచట గోవర్ధన మను పట్టణము కలదు. సుగ్రీవుని చేతను, ఋక్షముల చేతను శ్రీరాముని ప్రీతికొఱ కాపట్టణము నిర్మింపఁబడెను. రామప్రీతికొఱకే భారద్వా జమహర్షి యాపర్వతమున నోషధుల నవతరింపఁజేసెను. అందుచే నాప్రదేశము మనోహరమై యొప్పుచున్నది.

బాహ్లీక దేశములు - రాజధానులు, ఆభీరములు, కాలతోయకములు, పరాంధ్రములు, శూద్రములు, పప్లవములు, అవఖండికములు, గాంధా రములు, యవనములు, సింధుసౌవీరభద్రకములు, శకములు, హూణ ములు, కులిందములు, పరీతములు, హారపూరికములు, రామఠములు, రాద్ధములు, కేకయములు, దశనాసికములు యివన్నియు క్షత్రియులు నివసించునవి.

కాంభోజా దరదాశ్చైవ బర్బరాః ప్రియకాకికాః, పీనాశ్చైవ తుషారాశ్చ పల్లవా బాహ్యతోదరాః, ఆపగాశ్చవిమద్రాశ్చ కిరాతానాంచ భూమయః.

తోమరా హంసమార్గాశ్చ పూర్ణదర్వా స్తథైవచ. ఏతే దేశా హ్యుదీచ్యాశ్చ ప్రాచ్యాం దేశా న్నిబోధత—

అంగవంగా మాండువకా అంతర్గిరబహిర్గిరాః, తథా ప్లవంగ వంగేయా మాలదా మలవర్తినః. బ్రహ్మోత్తరా ప్రవిజయా భార్గవా గేయమాళవాః, ప్రాగ్జ్యోతిషాశ్చ పుండ్రాశ్చ విదేహా తామ్రలిప్తకాః. సాల్వా మగధ గోనర్ష్టా ప్రాచ్యాం జనపదా స్మృతాః.

అథాపరే జనపదా దక్షిణాపథ వాసినః. ధన్య స్సదేశో మంతవ్యో యత్ర గోదావరీ నదీ, పృథివ్యా మిహ కృత్స్నాయాం స ప్రదేశో మనోరమః. మహారాష్ట్ర మాహిషకా కలింగాశ్చైవ సర్వశః, ఆభీరా స్సహ చేషీకా అటవ్యాశ్చ వరాశ్చ యే, పులిందా వింధ్యమూలీకా మూషికా దండకై స్సహ, పౌనికా మానికాశ్చైవ అస్మాకా భోజవర్ధనాః. నైర్ణికా కుంతలా ఆంధ్ర ఉద్ధవానలకాలికాః, పాండ్యాశ్చ కేరళాశ్చైవ చోళాః కుల్యా స్తథైవచ. సేతుకా భూమికాశ్చైవ కుమనావనవాసికాః, కావేర్యాశ్చ మహాశ్రీకాః చేరాఖ్యా స్సృవరా స్తథా, దాక్షిణాత్యాశ్చ వై దేశా అపరాంతా న్నిబోధత, శూర్పాకారాః కోలవనా దుర్గా కాలితకై స్సహ. ములేయాశ్చ సురాలాశ్చ



కాంభోజదేశములు దరదములు, బర్బరములు, ప్రియకములు, కికములు, పీనములు, తుషారములు, పల్లవములు, బాహ్యతోదరములు, ఆపగములు, అవిమద్రిదేశములు (కిరాతభూములు).

తోమగములు, హంసమార్గములు, పూర్ణదర్వములు, యీదేశములన్నియు నుత్తరదిశయం దున్నవి. ఇఁక తూర్పుదేశములను దెలిసికొనుఁడు:—అంగములు, వంగములు, మాండువకములు, అంతర్గిరములు, బహిర్గిరములు, ప్లవంగములు, వంగేయములు, మాలదములు, మలవర్తులు, బ్రహ్మోత్తరములు, ప్రవిజయములు, భార్గవములు, గేయములు, మాళవములు, ప్రాగ్జ్యోతిషములు, పుండ్రములు, విదేహములు తామ్రములు, లిప్తకములు, సాల్వములు, మగధములు, గోనర్ష్టములు, యివి తూర్పుదేశములు, నెఱుంగునది.

ఇటుపై దక్షిణాపథమున (దక్కన్) గల జనపదములు. గోదావరినది ప్రవహించుచున్న యాదేశము మంచిది, ధన్యమైనది గా నెన్నఁదగినది ఈపుడమియం దన్నిఁటికంటె నాదేశమే మనోహరమైనది. మహారాష్ట్రములు, మాహిషికములు, కళింగములు, ఆభీరములు ఇషీకములు, శ్రేష్ఠము లగు అటవ్యములు, పుళిందములు, వింధ్యపర్వతమూలమునఁ గల దేశములు, మూషికములు, దండకములు, పౌనికములు, మానికములు, భోజవర్ధనములు, నైర్ణికములు, కుంతలములు, ఆంధ్రములు, ఉద్ధవములు, నలకాలికములు, పాండ్యములు, కేరళములు, చోళములు, కుల్యములు, సేతుకములు, భూమికములు, కుమనములు, వనవాసికములు, మహాశోభావంతము లగు కావేరీతీరభూములు, చేరములు, సృవరములు ఇవిదక్షిణాత్యదేశములు; మరియుఁ గొన్నికలవు. శూర్పాకారములు, కోలవనములు, దుర్గములు, కాలిత

రూపసా స్తాపసై స్సహ, తథా సురసితా శ్చైవ సర్వే చైవాపరా క్షరాః. నాసిక్యాద్యాశ్చ యే చాన్యే యే చైవాంతరనర్మదాః, భానుకచ్ఛా స్సమూహేయా స్సహసా శాశ్వతై రపి. కచ్ఛీయాశ్చ సురాష్ట్రాశ్చ ఆనర్తా శ్చార్బుదై స్సహ, ఇత్యేతే సంపరీతాశ్చ శృణుధ్వం వింధ్యవాసినః. మలదాశ్చ కరూశాశ్చ మేఖలా శ్చోత్కలై స్సహ, అనూపా స్తుండికేరాశ్చ వీతిహోత్రా హ్యవంతయః. ఏతే జనపదా స్సర్వే వింధ్యపృష్ఠనివాసినః. "అతో దేశా న్ప్రవక్ష్యామి పర్వతాశ్రియణశ్చ యే" ఇత్యాదినా పురాణేతిహాసాదిషు- తత్తచ్ఛైలాశ్రితాః నదీనదతీరస్థాః ప్రత్యేక దేశవిశేషాః విస్తరే ణాభిహితాః! గ్రంథవిస్తరభయా న్న తాని సర్వాణి ప్రమాణాని లిఖితాని.

ఏవంచ జంబూద్వీపస్థభారత వర్షీయా నేవ ఛప్పన్న దేశవిశేషా ణీతి సమ్య క్ప్రతిపాదితం భవతి అత స్తానితాని దేశవిశేషాణి ఇదానీంతనకాలే కానికాని నామాంతరేణ వ్యవహృతా నీతి జ్ఞాతుం సమ్య గ్దేశపర్యటనం కృత్వా భారతాది మహాగ్రంథ విమర్శన ప్రసంగవశేన ప్రతిపాదిత మహాశయానా మభిప్రాయాని స్వీకృత్య విదేశీయై స్సిద్ధాంతీకృతాభిప్రాయా ణ్యపి మేళయిత్వా యథామతి యథా సావకాశం ఏవం నిర్ణీతాసి తథాహి—



కము, మురేయములు, సురాలములు, రూపసములు, తాపసములు, సురసితములు, అపరాక్షగములు, నాసిక మొదలగునవి నర్మదాతీర భూములు. భానుకచ్ఛములు, సమూహేయములు, సహసములు, శాశ్వతములు, కచ్ఛీయములు, సురాష్ట్రములు, ఆనర్తములు, అర్బుదములు యివన్నియు దక్షిణాత్య దేశములే. వింధ్యపర్వతప్రాంతము లగు దక్షిణాత్య దేశములను వినుఁడు. మలదములు, కరూశములు, మేఖలములు, ఉత్కలములు, అనూపములు, తుండికేరములు, వీతిహోత్రములు, అవంతులు ఈజనపదము లన్నియు వింధ్యపర్వతము వెనుక నున్నవి. "వింధ్యపర్వతము మీఁద నున్న దేశములఁ గూడ తెల్పెదను" ఇది మొదలగు పురాణేతిహాసములయందు, ఆయాపర్వతములందును నదీనదముల తీరములయందును గల యాయాప్రత్యేక దేశవిశేషములను విస్తరించి చెప్పియున్నారు. గ్రంథవిస్తరభీతివలన నాప్రమాణములన్నియు నిట వ్రాయఁబడ లేదు.

ఇట్లు జంబూద్వీపమున నున్న భారతవర్షంబునఁ గల దేశములే ఛప్పన్న దేశవిశేషము లను పేర లెస్సగాఁ బ్రతిపాదింపఁబడెను. కనుక నాయాదేశవిశేషము లీకాలమున నేయేమారు పేరులచే వ్యవహరింపఁబడుచున్నవో యెఱుంగుటకు బాగుగా దేశాటనము నొనర్చి, భారతాది మహాగ్రంథముల విమర్శించుతఱిఁ బ్రతిపాదింపఁబడిన మహాశయుల యభిప్రాయములను గొని, విదేశీయులచే సిద్ధాంతీకరింపఁబడిన యభిప్రాయములనుగూడ జోడించి, బుద్ధికందినంతవఱకు, అవకాశము గలంతఁదనుక నిట్లు నిర్ణయింపఁబడినవి:—

1. అంగః—అంగరాజేన నిర్మితస్సన్ గంగాసరయ్వోర్మధ్యే విద్యమానో దేశః. స ఇదానీం (Bhagalpur) భాగల్పూర్ ఇతి పశ్చిమబంగళాదేశ ఇతిచ కథ్యతే. అత్రైవ పూర్వం కర్ణసువర్ణాఖ్య పట్టణ మాసీత్. తద్దేశే అంగరాజధానీ చంపాపురీ. తదా రాజా రోమపాదః.

2. వంగాః—(Estern Bengal)పూర్వబంగాళ మితీదానీం కథ్యంతే.

3. కళింగాః— (Orissa) ఒరిస్సాఖ్య ప్రదేశస్థ వైతరిణీ నద్యా దక్షిణప్రదేశః (Northern Circars) ఉత్తరసర్కారితి వ్యవహ్రియమాణ ప్రదేశశ్చ.

4. కాశ్మీరాః— (Kashmir) కాశ్మీర్ ఇతి నామ్నా భరత ఖండ శిరోభాగే అస్తి.

5. కాంభోజాః-నిషధపర్వతస్యదక్షిణతో విద్యమానా దేశాః. త ఇదానీం (Afghanistan) ఆఫ్ఘన్‌స్థానా నీతి ఘుష్యంతే.

6. సౌవీరాః— సింధుసురాష్ట్రయో ర్మధ్య దేశాః (Rajputana) రాజపుత్రస్థానాంతర్గతాః.

7. సౌరాష్ట్రాః— (Gujarat) గుజరాత్ (Kathiawar) కథియవా రిత్యాఖ్యాతాః.



1 అంగము. అంగరాజు నిర్మించినది. గంగాసరయూనదులమధ్య నున్న దేశము. అది యిప్పుడు 'భాగల్పూర్' (Bhagalpur) అని పశ్చిమబంగాళాదేశము అనియుఁ జెప్పఁబడుచున్నది. ఇచటనే మున్ను కర్ణసువర్ణము అను పట్టణముండెను. ఆదేశమునందు అంగరాజధాని యగు 'చంపాపురి' యుండెను. దానికి రాజు రోమపాదుఁడు.

2 వంగములు. (Eastern Bengal) పూర్వబంగాళము అని నేఁడు పిలువఁబడుచున్నది.

3 కళింగములు. (Orissa)'ఒరిస్సా' యనుప్రదేశమున నున్న వైతరిణీనదికి దక్షిణపువైపున నున్నప్రదేశము, ఉత్తరసర్కారులు (Northeren circars) అని వ్యవహరింపఁబడు ప్రదేశమును.

4 కాశ్మీరములు. (Kashmir) 'కాశ్మీర్' అనుపేరుతో భరతఖండము నుత్తరమున శిరోభాగమున నున్నది.

5 కాంభోజములు. నిషధపర్వతమునకు దక్షిణముగ నున్న దేశములు. అవి నేఁడు ఆఫ్ఘన్‌స్థానములు (Afghanistan) అని ఘోషింపఁబడుచున్నవి.

6 సౌవీరము. సింధురాష్ట్రముల మధ్యప్రదేశములు (Rajaputana) రాజపుత్రస్థానములోఁ జేరినవి.

7 సౌరాష్ట్రములు. (Gujarat) కథియవార్ (Kathiawar) అని చెప్పఁబడునవి.

8. మహారాష్ట్రాః— (Maratta) మరాటా బొంబాయి రాజధానీ.

9. మాగధాః— 'గయమాగధాః కీకటాస్స్మృతా' ఇత్యమరకోశవచన పర్యాలోచనయా ఇమేఏవ కీకటదేశాః. ఏషాం పాలీగ్రంథకారాః 'రాజగుహా' ఇతి నామ వదంతి. పర్వతదుర్గస్థత్వా ద్గిరివ్రజ ఇతి (Giribajja) గిరిబజ్జనామాంతరం. పురాతన శిల్పా శ్చాత్ర శిలాభి త్తిషు ప్రకాశంతే. ప్రకృతే (Bihar) బీహార్ ఇతి వ్యవహ్రియంతే. తేషాం పశ్చిమసీమా శోణనదీ. (Rajagiri) రాజగిరి ర్ముఖ్య పట్టణ మస్య.

10. మాళవాః—అనుపదేశస్య వాయవ్యే సన్తి. పూర్వ మే తేషాం ధారానగర మితి నామధేయం. భోజరాజేన ధారానగర మిదం కదాచి త్పరిపాలితం. శాస్త్రే ష్వూజ్జయినీ అవంతీ త్యుచ్యతే. ప్రకృతే త్వయం దేశో 'మాల్వా' ఇతి వ్యవహ్రియతే.

11. నేపాళాః—(Nepal) నేపాల్ హిమవత్పర్వతే ప్రసిద్ధం.

12. కేరళాః— మళయాళాంతర్గత తిరువాన్కూర్ ప్రదేశః (Travancore).

13. చోళాః— పాండ్యదేశస్యోత్తరతః ప్రాక్సముద్రతీర మాసాద్య స్థితాః దేశాః; తద్రాజధానీ కాంచీపట్టణమ్.



8 మహారాష్ట్రములు. (Maharatta) బొంబాయి రాజధాని.

9 మాగధములు. "గయమాగదములు, కీకటములు అని చెప్పఁబడినవి" అనియమరకోశమునంగలవచనమును బర్యాలోచించుటచే నివి 'కీకటదేశములు'. వీనికి పాళీభాషలో గ్రంథములు వ్రాసినవారు 'రాజగుహ' యను పేరు చెప్పుచున్నారు. పర్వతదుర్గములలో నుండుటచే గిరివ్రజములు (Giri Bajja) యని నామాంతరమునుగలదు. పురాతనశిల్పములు పెక్కు లిచట రాతిగోడలలోఁ బ్రకాశించుచున్నవి. ఈనాఁడీదేశములు 'బీహార్' (Bihar) అని వ్యవహరింపఁబడుచున్నవి. వానికిఁ బడమటిసరిహద్దు శోణానది. దీనికి (Raja giri) ముఖ్యపట్టణము.

10 మాళవములు. అనూపప్రదేశమునకు వాయవ్యమూలగా నున్నవి. మున్ను వీనికి ధారానగరము అను పేరుగలదు. ఈ ధారానగర మొకప్పుడు భోజునిచేఁ బరిపాలింపఁబడెను. శాస్త్రములయందు "ఉజ్జయిని, అవంతి" అని చెప్పఁబడుచున్నది ప్రకృతమున నీ ప్రదేశము 'మాల్వా' (Malva) అని వ్యవహరింపఁబడుచున్నది.

11 నేపాళము. (Nepal) ఇది హిమవత్పర్వతమునఁ బ్రసిద్ధమయి యున్నది.

12 కేరళములు. మలయాళములో నవాంతరమగు తిరువాన్కూర్ ప్రదేశము (Travancore).

13 చోళములు. పాండ్యదేశమున కుత్తరమునఁ దూర్పుసముద్రతీరము నంటియున్న దేశములు. అట రాజధాని కాంచీనగరము.

14. పాంచాలాః— ఉత్తరపాంచాలః దక్షిణపాంచాల ఇతి ద్వివిధాః. ప్రథమస్య రాజధానీ అహిఛత్రం (Ram-Nagar) రామనగర్. ద్వితీయస్య రాజధానీ కాంపిల్యమ్ (Kabul ) కాబూల్.

15. గౌడాః— సరయ్వా ఉత్తరతీరే విద్యమానా దేశాః.

16. మళయాళాః— (Malabar) మలబార్ కనడామండల మిత్యాదికేరళైకదేశః. కేరళమళయాళే స్త్రీపురుషమళయాళే ఇతి జ్ఞేయం.

17. సింహళాః— (Ceylon) సిలోన్ ద్వీపః భారతవర్షస్య దక్షిణతో విద్యమానా దేశాః.

18. ద్రవిడాః— భారతవర్షస్య దక్షిణే కన్యాకుమార్యగ్రే విద్యమానా దేశాః ద్రావిడదేశ ఇత్యపి వ్యవహారః.

19. కర్ణాటాః— (Mysore) చెన్న రాజధాన్యాం మైసూర్ ప్రదేశః (South and North Kanarece) దక్షిణోత్తర కన్నడమండలే. అపిచ (Bombay Presidency) బొంబాయిరాజధాన్యాం (Belgaum) బెల్గాం, (Dhar-war) దార్వార్ మండలేచ.

20. లాటాః— మల్లదేశః (Multan) ముల్టాన్ మండల ప్రదేశః.

21. కర్ణాటాః— కటకం (Cuttak) కటాక్.



14 పాంచాలములు. ఉత్తరపాంచాలములు దక్షిణపాంచాలములు నని రెండువిధములు. మొదటిదానికి రాజధాని (Ramnagar), రెండవదానికి రాజధాని కాంపిల్యము (Kabul).

15 గౌడములు సరయూనది కుత్తరతీరమున నున్న దేశములు.

16 మళయాళములు. (Malbar) మలబారు-కనడా మండలము మొదలగునవి. కేరళములోఁ గొంతభాగము, కేరళమళయాళములు వరుసగా ఆడమళయాళము మొగమళయాళము నని యెఱుంగునది.

17 సింహళములు. (Ceylon) సిలోన్ ద్వీపము భారతవర్షమునకు దక్షిణముగా నున్న దేశము.

18 ద్రవిడములు. భారతవర్షమునకు దక్షిణమున కన్యాకుమార్యగ్రమునఁ గల దేశములు. ద్రావిడదేశమనియు వ్యవహారము.

19 కర్ణాటములు. (Mysore) చెన్న రాజదానియందలి మైసూర్ ప్రదేశము దక్షిణోత్తర కనడామండలములును (South and North Kanarece), మఱియు బొంబాయిరాజధానియు(Bombay Presidency) యందు బెల్గాం (Belgam), ధర్వార్ (Dharwar) మండలములును.

20 లాటములు. మల్లదేశము (Multan) మూల్టాను మండల ప్రదేశము.

21 కర్ణాటములు. కటకము (Cuttuck) కటాక్.

22. మర్వాటాః— మార్వార్ (Marwar) మార్వాన్.

23. పానాటాః— పాకనా డితి వ్యవహ్రియమాణా దేశాః.

24. నాటాః— మధ్యదేశాః (Central Provinces)

25. పాండ్యాః— దక్షిణ (Madura) మధురా తిరునల్వేల్ మండలే.

26. పులిందాః— (Bundel Khand) బండెల్ ఖండ్ (Sagaryam) సాగర్ యంమండలయోః పశ్చిమే యమునాతీరస్థ దేశవిశేషాః.

27. ఆంధ్రాః— కృష్ణాగోదావరీమధ్యే విద్యమానా దేశాః. ఏషాం సింధుయుగ్మాంతర మితి షట్సహస్రిజగ తీతి నామాంతరే. సింధు రితి సాధారణనదీవిశేషపరం. షట్సహస్రిగ్రామస్థితానేవ ఆంధ్రభాషాయాం (ఆరువేలనాటివారు) ఇతి వదంతి. (Warrangal) ఒరంగల్ ప్రాంతస్థ త్రిలింగాయనసమీపస్థా ఏవ ఆంధ్రభాషాయాం (తెలగాణ్యులు) ఇతి ప్రసిద్ధాః. షట్సహస్రిగ్రామాధికారిణఏవ ఆంధ్రభాషాయాం (ఆరువేలనియోగులు) ఇతి ప్రసిద్ధాః. అతఏవ గోదావరీప్రాంతే (వెలనాటినియోగులు) ఇతి వ్యవహారం త్వాంధ్రభాషాయాం.

28. హూణాః—(Afghanistan) ఆఫగనిస్థానస్య ఉత్తరే (White Huns) 'వైట్ హూన్స్' ఇతి వ్యవహ్రియమాణ (Europe) యూరప్ దేశః.



22 మర్వాటములు. మర్వార్ (Marwar) మార్వాక్.

23 పానాటములు. పాకనా డని వ్యవహరింపఁబడు దేశములు.

24 నాటములు. మధ్యదేశములు (Central Provinces)

25 పాండ్యములు. దక్షిణ మధుర (Madura) తిరునల్వేల్ మండలములు.

26 పులిందములు. (Bundel Khand) 'సాగర్యమ్' (Sagaryam) మండలములకుఁ బడమర యమునాతీరమున నున్న దేశవిశేషములు.

27. ఆంధ్రములు. కృష్ణా గోదావరీనదుల మధ్యనున్న దేశములు. వీనికి 'సింధుయుగ్మాంతరము' 'షట్సహస్రిజగతి' అను నామాంతరములు గలవు. 'సింధువు' అనుపదము నదీసామాన్యవాచకము. షట్సహస్రిగ్రామములవారినే తెలుఁగుభాషలో 'ఆఱువేలనాటివారు' అని చెప్పుదురు. ఒరంగల్ (Warrangel) ప్రాంతముననున్న త్రిలింగాయన సమీపముననున్నవారే ఆంధ్రమున తెలగాణ్యులు అని ప్రసిద్ధికెక్కిరి. షట్సహస్రిగ్రామాధికారులే తెలుఁగుభాషలో ఆరువేలనియోగు లని ప్రసిద్ధికెక్కినవారు. కనుకనే గోదావరీతీరప్రదేశముల వెలనాటినియోగులు అని తెలుఁగుల వ్యవహరింతురు.

28 హూణములు. (Afghanistan) ఆఫ్ఘన్‌స్థానమున కుత్తరమున 'వైట్ హూన్స్' (White Huns) అని వ్యవహరింపఁబడు యూరప్‌ప్రదేశము (Europe).

29. దశార్ణవాః— దక్షిణకోసలేషు విద్యమానా దేశాః (Chetergar) ఛటెర్గార్ మండలాంతర్గతాః.

30. భోజాః-విదర్భబీరార్ దేశస్యపార్శ్వే విద్యమానా దేశాః

31. కుక్కురవాః } దక్షిణోత్తరమరుదేశాః.
32. కురవః

33. గాంధారాః—సింధునద్యాః పశ్చిమతో విద్యమానా దేశాః (Khandahar) కాండహార్ మండలం.

34. విదర్భ— (Birar) బీరార్.

35. విదేహాః— (North Birar) ఉత్తరబీహార్, (Durbhanga) దర్భంగా, (Tiruhol) తిరుహోల్ మండలే. ఏతద్రాజధానీ మిథిలా. సేదానీం 'సరిసబ్' నగరం.

36. బాహ్లీకాః— విపాశాశతద్రోర్మధ్యదేశే కేకయదేశస్య పూర్వభాగే విద్యమానా దేశాః. వసుదేవపత్నీ రోహిణీ జనకస్థానం.

37. బర్బరాః— (Burma) బర్మా బ్రహ్మదేశస్థైకదేశః.

38. కేకయాః— (Sulaiman mountains) సులేమాన్ పర్వతోత్తరశాఖా వలయితా దేశవిశేషాః. యద్వా (Herat Afghanistan) హీరట్ ఆఫ్ఘన్ స్థానాంతరం.



29 దశార్ణవములు. దక్షిణకోసలములనున్న దేశములు (Chetargar) చెటర్గార్ మండలములోని దేశములు.

30 భోజములు. 'విదర్భ బీరార్' దేశములకుఁ బ్రక్కనున్న దేశములు.

31 కుక్కురవములు. } దక్షిణోత్తర మరుభూములు (ఎడారులు)
32 కురవములు

33 గాంధారములు. సింధునదికిఁ బడమరగా నున్న దేశములు ఖాండ్ హార్ (Khandhar) మండలము.

34 విదర్భ. బీరార్ (Birar)

35 విదేహములు (North Birar) ఉత్తరబీహార్, దర్భాంగ (Durbhanga), తిరుహోల్ (Tiruhol) మండలములు. వీనికి రాజధాని మిథిల. అది యిపుడు సరిసబ్ నగరము

36 బాహ్లీకములు. 'విపాశ' 'శతద్రువు' అను నదులమధ్య దేశమున, కేకయదేశమునకుఁ దూర్పుభాగమున నున్న దేశములు' వసుదేవుని భార్య యగు రోహిణి పుట్టినచోటు.

37 బర్బరములు. (Burma) 'బర్మా' యను ప్రదేశములోఁ గొంతభాగము.

38 కేకయములు. సులేమాన్ (Sulaiman Mountains) పర్వతముల యుత్తరశాఖలచేఁ జుట్టువారుకొనఁబడి యున్న దేశవిశేషములు లేక (Herat) హీరట్, (Afghanstan) అఫ్ఘన్‌స్థానముల మధ్యప్రదేశము.

39. కోసలాః— ఉత్తరకోసలాః దక్షిణకోసలా ఇతి ద్వివిధాః కోసలాః. తత్రాద్యానాం రాజధానీ అయోధ్యా. ద్వితీయానాంతు (Guzerat) గుజరాత్ అంతర్గత కుశస్థలీ. సాచ గంగాయాః దక్షిణతో విద్యతే నాగ్‌పూర్ ప్రదేశాంతరే. అపి చ సరయ్వాశ్చోత్తరే కౌసల్యా పితుర్భానుమతస్య రాజ్యమపి కౌసల ఇతి శ్రూయతే. తస్య గాడదేశ ఇతి శ్రావస్తిముఖ్యపట్టణ మితి చ వ్యవహారః.

40. కుంతలాః— (Madras Presidency) చెన్నరాజధాన్యాం బల్లారిమండలే కురగోడీతి ప్రసిద్ధపట్టణమాత్రమాక్రమ్య పూర్వే స్థితా దేశాః.

41. కిరాతాః— భరతవర్షస్య పూర్వదిగ్భాగే (Burma) బర్మాయాః (Siam) సయాం ఉపరి (Cambodia) కాంబోడియా ప్రభృతయః భరతవర్షస్య పూర్వే కిరాతాః పశ్చిమే మ్లేచ్ఛాః. (Persia) పర్షియా, (Turky) టర్కీ, (Arabia) అరేబియా ప్రభృతయః.

42. శూరసేనాః— (Delhi) ఢిల్లీనామ కేంద్రప్రస్థస్య దక్షిణత ఉత్తరమధురాప్రభృతయః.

43. సేవనాః— (సేకాః) అవంతీపట్టణస్యోత్తరే చర్మణ్వతీ, పాటలావతీ నద్యోర్మధ్యప్రదేశే విద్యమానా దేశాః.



39 కోసలములు. ఉత్తరకోసలములు దక్షిణకోసలములు అని రెండువిధములు. అందు మొదటివానికి రాజధాని అయోధ్య. రెండవవానికి (Gujarat) గుజరాత్ లో నున్న కుశస్థలి. అదియు గంగానదికి దక్షిణమున నాగపూర్ (Nagpur) ప్రదేశమునకుఁ బోవు దారిలో నున్నది. మఱియు సరయూనదికుత్తరమున కౌసల్య తండ్రి యగు భానుమంతుని రాజ్యమగు 'కౌశలము' అనునది యున్నట్లు వినఁబడుచున్నది. దానికి గాడదేశమనియు, శ్రావస్తి ముఖ్యపట్టణ మనియు వ్యవహారము కలదు.

40 కుంతలములు. చెన్నరాజధానియందు (Madras Presidency) బళ్లారిమండలమున 'కురగోడి' యను ప్రసిద్ధపట్టణము నావరించి తూర్పున నున్న ప్రదేశములు.

41 కిరాతములు. భరతవర్షమునకుఁ దూర్పుదిగ్భాగమున బర్మా (Burma), సయాం (Siam), పైన కాంబోడియా (Cambodia) మొదలగు ప్రదేశములు. భరతవర్షమునకుఁ దూర్పుగఁ గిరాతములు, పడమట మ్లేచ్ఛములు, పర్షియా (Persia), టర్కీ (Turky), అరేబియా (Arabia) మొదలగు ప్రదేశములు కలవు.

42 శూరసేనములు. (Delhi) ఢిల్లీయను నింద్రప్రస్థమునకు దక్షిణముగానున్న ఉత్తరమధురాది దేశములు.

43 సేవనములు. (సేకములు) అవంతీపట్టణమున కుత్తరమున 'చర్మణ్వతి, పాటలావతి' అను నదులమధ్యదేశమున నున్న దేశములు.

44. టంకణాః— (Rangoon) పెవాట్ రంగూన్ పత్తనస్యాధోభాగే విద్యమానా దేశాః.

45. కొంకణాః— సహ్యాపర్వత మాశ్రిత్య మహారాష్ట్రమళయాళయోర్మధ్యే విద్యమానా దేశాః.(Near Bombay) బొంబాయి సమీపప్రదేశః.

46. మత్స్యాః— (Jeypore) జయపూర్ప్రాంతే ఆల్వాడుసంస్థాన మభివ్యాప్య స్థితా దేశాః. శూరసేనస్య పశ్చిమే విరాటదేశ ఇతి కథ్యతే.

47. మద్రాః— (Punjab) పంజాబ్ దేశాంతర్గతాః (Ravi) రావీ,(Chinab)చీనాబ్ నద్యోర్మధ్యప్రదేశాః.

48. పార్శ్వాః— పారసీక దేశాః.

49. ఘూర్జరాః— (Gujerat) గుజరాత్ ఇతి ప్రసిద్ధాః.

50. యవనాః— (Turkey) టర్కీప్రభృతయః.

51. జాలంధరాః— త్రిగర్తదేశః (Lahore) లాహోర్ మండలస్థ జాలందర్ ప్రాంతదేశాః. బాహ్లీకదేశస్య నైఋత్యాం విద్యమానవిపాశానదీసమీపస్థా దేశవిశేషాః.

52. సాళ్వాః— (Nagpur) నాగపూర్ ప్రదేశే విద్యమానా దేశాః.



44 టంకణములు. (Rangoon) పెవాట్, రంగూన్ పట్టణములకు క్రిందుగా నున్న దేశములు.

45 కొంకణములు. సహ్యాపర్వతము నానుకొని, మహారాష్ట్ర, మళయాళముల మధ్యనున్న ప్రదేశములు. (Near Bombay) బొంబాయి సమీప ప్రదేశములు.

46 మత్స్యములు. జయపూర్ (Jayapur) ప్రాంతమున ఆల్వాడు సంస్థానము నంతను వ్యాపించియున్న దేశములు. శూరసేనమునకు పడమర విరాటదేశము అని చెప్పఁబడుచున్నది.

47 మద్రములు. పంజాబ్ (Punjab) దేశములలోఁ జేరినవి. రావి (Ravi) చీనాబ్ (Chinab) నదులమధ్యప్రదేశములు.

48 పార్శ్వములు. పారసీక దేశములు.

49 ఘూర్జరములు. గుజరాత్ (Gugarat) అని ప్రసిద్ధములు.

50 యవనములు. టర్కీ (Turky) మొదలగునవి.

51 జాలంధరములు. త్రిగర్తదేశము. లాహోర్ (Lahore) మండలమున నున్న జాలంధర్ ప్రాంతదేశములు. బాహ్లీకదేశమునకు నైరృతిదిశ నున్న విపాశయనునదికి దగ్గరగానున్న దేశవిశేషములు.

52 సాళ్వములు. నాగపూర్ (Nagapur) ప్రదేశమున నున్న దేశములు.

53. చేదయః– చేదిదేశాః (Bundel khand) బండేల్ ఖండ్ మండలస్య దక్షిణే (Bilaspur) బిలాసపూర్ (Jubbalpur) జబ్బలపూర్ ప్రదేశ స్యోత్తరే విద్యమానా దేశాః.

54. సింధుమతయః– సింధుదేశః, సింధునదీ, జీలం నద్యో ర్మధ్యే దేశే విద్యమానా దేశవిశేషాః.

ఇత్థం ఛప్పన్న దేశా ఇతినామకా దేశాః ప్రతిపాదితా ఇతిశం.

అథచ పురాణప్రసిద్ధదేశవిశేషా అన్యేఏవ.

1. ఆర్తకాః– (Gujerat) గుజరాత్ మాళవదేశయో రేకభాగః.

2. ఆరట్టం– (Punjab) పంజాబ్ దేశః.

3. ఉత్కళః– (Orissa) ఒరిస్సాదేశః.

4. జాదుంబరం (Gujerat) గుజరాత్ప్రదేశ స్యోత్తరే (Cutch) కచ్ఛినామ్నా వ్యవహ్రియతే.

5. కచాః– (Gujarat inner) గుజరాదంతర్గతం.

6. కటకం– (Cuttak) ఖట్వా.

7. కరీషకాః– కరూశకాః (Birar) బీరారంతర్గత షలహాబాద్ మండలస్థదేశాః.



53 చేదిదేశములు. బండేల్ ఖండ్ (Bundel Khand) మండలమునకు దక్షిణమున బిలాస్‌పూర్ (Bilaspur), జబ్బల్‌పూర్ (Jabbalpur) ప్రదేశమున కుత్తరమున నున్న దేశములు.

54 సింధుమతులు. సింధుదేశము, సింధునది జీలంనదులయు మధ్యదేశమున నున్న దేశవిశేషములు.

ఇట్లు ఛప్పన్న దేశము లని పేరొందిన దేశములు తెలుపఁబడినవి. ఇది శుభము.

ఇఁకఁ బురాణప్రసిద్ధములగు దేశవిశేషములు వేరుగానే కలవు.

1 ఆర్తకములు. గుజరాత్ (Guzarat) మాళవదేశములలో నొకభాగము.

2 ఆరట్టము. ‘పంజాబ్’ దేశము (Punjab).

3 ఉత్కళము. ‘ఒరిస్సా’ (Orissa).

4 జాదుంబరము. ‘గుజరాత్’ దేశమున కుత్తరముగా ‘కచ్ఛి’ (Cutch) యను పేర వ్యవహరింపఁబడుచున్నది.

5 కచ్ఛములు. ‘గుజరాత్’ లోపలిభాగము (Guzarat inner).

6 కటకము. ఖట్వా (Cuttuck).

7 కరీషకములు (కరూశకములు). ‘బీరార్’ లో నున్న షలహాబాదు జిల్లాలోనున్న దేశములు.

8. కురుజాంగలాః— గంగాయమునయో ర్మధ్యదేశాః.

9. కుశస్థలీ— (Central Province) మధ్యప్రాంతే (Nagpur) నాగపూర్ సమీపే గంగాయా దక్షిణే దక్షిణ కోసలరాజధానీ పట్టణవిశేషః.

10. తామ్రలిప్తకాః. (Hubli) హుబ్లి, (Orissa) ఒరిస్సామధ్యే వర్తంతే.

11. దరదాః— (Kashmir) కాశ్మీరదేశ స్యోత్తరే (Dardhastan) దర్దస్థాన్ దేశాః.

12. నిషధాః—చేదిదేశస్య దక్షిణే నర్మదాయా ఉత్తరే (Narwar) నార్వార్ నళపు రీతి ప్రసిద్ధనగరవిశిష్టాః.

13. మలజాః— (మలదాః) కరూశదేశసమీపస్థా దేశాః. (Shahbad) షహబాద్ మండల పశ్చిమభాగే మలాదా ఇతి నామ్నా వ్యవహ్రియన్తే.

14. మేకలాః— (అమరకటకం) మేకలపర్వత కలపర్వత సమీపస్థా దేశాః, నర్మదానదీజన్మస్థానం తథా హి నర్మదా మేకలకన్యకా ఇతి నామ్నా వ్యవహ్రియతే.

15. వాత్స్యాః— గంగాయమునయో ర్మధ్యే విద్యమానా దేశాః. అన్యద ప్యేతన్నామాంతరం ఇంద్రద్వీపమితి.

16. ఆవర్తనం—(Briton) బ్రిటన్. (England Scotland Ireland) ఇంగ్లండ్, స్కాట్లెండ్, ఐర్లెండ్ ప్రభృ



8 కురుజాంగలములు. గంగాయమునానదుల మధ్యదేశములు.

9 కుశస్థలి. (Central Province) మధ్యప్రాంతమున 'నాగపూర్' దగ్గర గంగకు దక్షిణమున దక్షిణకోసలము లను దేశములకు ముఖ్యపట్టణము.

10 తామ్రలిప్తకములు. హుబ్లి (Hubli) ఒరిస్సా (Orissa) మధ్య నున్నవి.

11 దరదములు. కాశ్మీరను (Kashmir) దేశమున కుత్తరమున దర్దస్థాన్ (Dardrstan) దేశములు.

12 నిషధములు. చేదిదేశమునకు దక్షిణముగ నర్మదానది కుత్తరమున 'నార్వార్' (Narwar) 'నళపురి' యని ప్రసిద్ధికెక్కిన పట్టణముతోఁ గూడిన దేశములు.

13 మలజములు. (మలదములు) కరూశదేశసమీపమున నున్న దేశములు. షహబాద్ (Shahbad) మండలమునకుఁ బడమటి భాగమున మలదములు అనుపేర వ్యవహరింపఁబడుచున్నవి.

14 మేకలములు. (అమరకటకము) మేకల - కల యను పర్వతముల సమీపమున నున్న దేశములు. నర్మదానది పుట్టుచోటు. 'నర్మద మేకలకన్యక' యనుపేర వ్యవహరింపఁబడుచున్నది.

15 వాత్స్యములు. గంగాయమునానదుల నడుమనున్న దేశములు. వీనికి 'ఇంద్రద్వీపము' అనియుఁ బేరుఁ గలదు.

16 ఆవర్తనము. బ్రిటను (Briton). ఇంగ్లండ్ (England), స్కాట్లండ్ (Scotland), ఐర్లండ్ (Ireland) మొదలగునవి.

తయః. తే చ భారతఖండస్య వాయవ్యభాగే ప్రకాశంతే. యూరప్ అంతర్గతా ఇమే.

17. అశ్వక్రాంతం— (Europe) యూరప్ దేశః. ప్రాచ్యాః (Eural mountains) యూరల్ పర్వతాః. దక్షిణతః (Caspian Sea) కాస్పియన్ సముద్రః, (Black Sea) నీలసముద్రః, (Mediteranian Sea) మధ్యధరాసముద్రః. పశ్చిమే (Atlantic ocean) అట్లాంటిక్ మహాసముద్రః. ఉత్తరే (Arctic ocean) ఆర్క్టిక్ మహాసముద్రః. ఏతన్మధ్యస్థద్వీపస్య 'అశ్వక్రాంత' మితి నామధేయం.

18. రోమకః— (Rome) రోమ్. (Italy) ఇటలీదేశస్య ముఖ్యపత్తనవిశేషః.

19. పటచ్చరః— (Italy) ఇటలీ. తస్య ప్రాక్సీమా (Adriatic Sea) ఏడ్రియాటిక్ సముద్రః. దక్షిణపశ్చిమసీమే మధ్యధరాసముద్రః. ఉత్తరసీమా (Austria) ఆస్ట్రియా, (Switzerland, France) స్విట్జర్లాండ్, ఫ్రాన్స్.

20. పశుశీలః— (Portugal) ఫోర్చుగల్. తస్య ప్రాగుత్తరసీమా (Spain) స్పైన్ దేశః. దక్షిణపశ్చిమసీమే (Atlantic Ocean) అట్లాంటిక్ మహాసముద్రః.



అవి భరతఖండమునకు వాయవ్య దిశ నున్నవి. ఇవి 'యూరప్' ఖండములోఁ జేరినవి.

17 అశ్వక్రాంతము. యూరప్ ఖండము (Europe). తూర్పున యూరల్ పర్వతములు (Eural mountains) దక్షిణమున కాస్పియన్ సముద్రము (Caspain Sea), నీలసముద్రము (Black Sea), మధ్యధరాసముద్రము (Mediteranian Sea). పడమట అట్లాంటిక్ మహాసముద్రము(Atlantic Ocean). ఉత్తరమున ఆర్క్టిక్ మహాసముద్రము (Arctic Ocean). వీని నడుమనున్న ద్వీపమునకు 'అశ్వక్రాంతము' అని పేరు.

18 రోమకము (Rome). ఇటలీ (Italy) దేశమునకు ముఖ్య పట్టణము.

19 పటచ్చరము. (Italy). దానికిఁ దూర్పుహద్దు ఏడ్రియాటిక్ సముద్రము (Adriatic Sea). దక్షిణము పడమరనుగల హద్దు మధ్యధరాసముద్రము. ఉత్తరఁపుహద్దు ఆస్ట్రియా (Austria), స్విట్జర్లండ్ (Switzerland), ఫ్రాంస్ (France).

20 పశుశీలము. (పోర్చుగల్ = Portugal). దానికిఁ దూర్పు ఉత్తరము హద్దులు స్పెయిన్ (Spain) దేశము. దక్షిణపశ్చిమఁపు హద్దు అట్లాంటిక్ మహాసముద్రము (Atlantic Ocean).

21. క్రౌంచః—(Germany) జర్మనీదేశః. తస్య ప్రాక్సీమా (Poland) పోలండ్. దక్షిణే (Austria) ఆస్ట్రియా, (Hungary) హంగేరి దేశశ్చ. పశ్చిమే (France) ఫ్రాన్సదేశః. ఉత్తరే (Baltic Sea) బాల్టిక్ ఉత్తర సముద్రశ్చ.

22. సైనికకుక్కుటే— (Holland) హాలెండ్ బెల్జియం. ప్రాచ్యాం దక్షిణేచ (Germany) జర్మనీ. పశ్చిమోత్తరయో రుత్తరమహాసముద్రః.

23. ఆశ్వీయః— ఆస్ట్రియా. తస్య ప్రాచ్యాం (Hungary) హంగేరి. దక్షిణే(Italy)ఇటలీ. పశ్చిమే (Switzerland) స్విట్జర్లాండ్. ఉత్తరే (Germany) జర్మనీ.

24. ప్రిలీయం (France) ఫ్రాన్స. ప్రాక్ జర్మనీ (Germany). దక్షిణే మధ్యధరాసముద్రః. పశ్చిమే కశ్చనభాగః (Spain) స్పైన్, తతః (Atlantic Sea) అట్లాంటిక్ సముద్రః. ఉత్తరే (English channel) ఇంగ్లీసుఛానల్.

25. తామసః.—(Spain) స్పైన్. ప్రాచ్యాం (Mediteranian Sea) మధ్యధరాసముద్రః. దక్షిణే సముద్రః, తతః పర మాఫ్రికా. పశ్చిమే (Portugal) ఫోర్చుగల్. ఉత్తరే (Bay of Biscay) బే అఫ్ బిస్కే సముద్రః.

26. మారకమారటదేశాః. (Norway Sweedon)నార్వే స్వీడన్ప్రాక్సముద్రః, తతః (Finland) ఫిన్లాండ్. దక్షి



21 క్రౌంచము. (Germany) జర్మనీ. దానికిఁ దూర్పుహద్దు
'పోలండ్' (Poland), దక్షిణమున ఆష్ట్రియా (Astria), హంగేరి
(Hungary) దేశములు. పడమట ఫ్రాంస్ (France) దేశము.
ఉత్తరమున బాల్టిక్ సముద్రము (Baltic Sea), ఉత్తర సము
ద్రమును.

22 సైనికకుకుటములు. (రెండు దేశములు) హాలెండ్ (Holland),
బెల్జియమ్ (Belzeeam). తూర్పుదక్షిణములందు జర్మనీ (Ger-
many). పశ్చిమోత్తరదిశల నుత్తరమహాసముద్రము.

23 ఆశ్వీయః. ఆష్ట్రియా (Astria). దానికి తూర్పున హంగేరి
(Hungary). దక్షిణమున (Italy) 'ఇటలీ'. పడమట స్విట్
జర్లండ్ (Switzerland). ఉత్తరమున జర్మనీ (Germany).

24 ప్రిలీయము. ఫ్రాంస్ (France). తూర్పున 'జర్మని'.
దక్షిణమున మధ్యధరా సముద్రము, పశ్చిమమున నొకభాగము
(Spain) స్పెయిన్. పిమ్మట అట్లాంటిక్ మహాసముద్రము. ఉత్తర
మున 'ఇంగ్లీషుఛానల్' (English Channel).

25 తామసము. స్పెయిన్ (Spain) తూర్పున మధ్యధరా
సముద్రము (Mediteranian Sea) దక్షిణమునను సముద్రము
పిమ్మట ఆఫ్రికా. పడమట పోర్చుగల్ (Portugel
ఉత్తరమున 'బే ఆఫ్ బిస్కే' (Bay of Biscay) సముద్రము.

26 మారక, మారట దేశములు. 'నార్వేస్వీడన్ (Norway
Sweedon). తూర్పునసముద్రము. పిమ్మట ఫిన్లాండ్ (Frinland)

ణే (Baltic Sea) బాల్టిక్‌సముద్రః. తతఃపరం (Germany) జర్మనీ. పశ్చిమే ఉత్తరేచ (అట్లాంటిల్) ఆర్కిటిక్ సముద్రౌ.

27. ఆరణ్యకతురుష్కః— (Europe Turkey) యూరోప్ టర్కీ—గ్రీసుదేశ ఇత్యర్థః. ప్రాచ్యాం ఆసియాంతర్గతతుర్కీ (Asian Turkuy) ఆసియామైనర్. దక్షిణే మధ్యధరాసముద్రః. పశ్చిమే (Mediteranian Sea), అడ్రియాటిక్‌సముద్రః ఉత్తరే (Adriatie Sea) బల్గేరియాసర్వ్యదేశౌ (Bulgaria).

28. రథక్రాంతః— (Africa) ఆఫ్రికాఖండః. విష్ణుక్రాంతః ఆఫ్రికోపద్వీపభూత (Medogascar) మెడగాస్కర్ నామ్నా ఆఫ్రికాప్రాగ్భాగే విద్యతే.

29. హైంఖః— సైబేరియా (Siberia) ఆసియాఖండే ప్రాగుత్తరం వ్యాప్య స్థితః.

30. ఋషదేశః— (Easterm Europe) యూరప్‌దేశస్య ప్రాగ్భాగః.

31. శంఖతురుష్కః—(Asiatic Turkey) ఆసియాటిక్ టర్కీ. ఆసియాంతర్గత మిదం. ఉత్తరే నీలసముద్రః. దక్షిణే అరేబియాసముద్రః. ప్రాచ్యాం పారసీకదేశః. పశ్చిమే సముద్రానంతర (Greece) గ్రీసుదేశః.



దక్షిణమున బ్లాటిక్‌సముద్రము (Blotic sea). అటుపై జర్మనీ (Germany). పడమటను, ఉత్తరమునను అట్లాంటిక్ (Atlantic) ఆర్కిటిక్ (Arctic) సముద్రములు.

27 అరణ్యకతురుష్కము. యూరోప్‌టర్కీ (Europe Turkey) గ్రీసుదేశ మని యర్థము. తూర్పున నాసియాఖండమున నున్న టర్కీ (Asia Turkey) ఆసియామైనర్ (Asia Mynor). దక్షిణమున మధ్యధరాసముద్రము (Mediteranian Sea). ఆడ్రియాటిక్‌సముద్రము. ఉత్తరమున బల్గేరియా (Bulgaria), సర్వియ (Surpeia) దేశములు.

28 రథక్రాంతము, ఆఫ్రికా (Africa) ఖండము. విష్ణుక్రాంతము ఆఫ్రికాద్వీపమగు 'మెడగాస్కర్' పేరిట (Medagascar) ఆఫ్రికాకుఁ దూర్పుభాగమున నున్నది.

29. హైంఖము సైబేరియా (Siberia). ఆసియాఖండమున తూర్పు ఉత్తరఁప్రదిశల వ్యాపించియున్నది.

30 ఋషదేశము. (Eastern Europe) యూరప్‌దేశమునకుఁ దూర్పుభాగము.

31 శంఖతురుష్కము. ఆసియాటర్కీ (Asia Turkey). ఆసియాలో నున్నది. ఉత్తరమున నీలసముద్రము (Black Sea). దక్షిణమున (Arabian Sea) అరేబియాసముద్రము. తూర్పున పారశీక దేశము. పడమట సముద్రమునవతల గ్రీసు (Greece) దేశము.

32. చీనామహాచీనౌ—ఆసియాంతర్గతౌ. ఉత్తరే (Siberia) సైబేరియా. దక్షిణే హిమవాన్. ప్రాచ్యాం (Pacific Ocean) పసిఫిక్ సముద్రః, మధ్యాసియాచ, టర్కీస్థానంచ. నైఋత్యాం టిబెట్ ఉత్తర మంగోలియాచ.

33. ఆవర్తనదేశః—ఆసియాంతర్గతః. (Arabia) అరేబియా ఇతి ప్రసిద్ధః. ప్రాచ్యాం (Persian Sea) పర్షియన్ సముద్రాత్పారసీకః. దక్షిణే (Arabian Sea) అరేబియాసముద్రః. పశ్చిమే శోణసముద్రః. ఉత్తరే ఆసియా తుర్కీ. ఏతదంతర్గతమేవ శూద్రియవనాత్మక మక్కా కార్నాకర్ నామ కదీనాచ.

34. పారస్పరః—(Asiatic Persia) ఆసియాంతర్గతపర్షియా. పారసీక ఇత్యర్థః. ప్రాచ్యాం (South of Afghanistan Beluchistan) ఆఫ్ఘన్, బెలూచీస్థానే. దక్షిణే పర్షియన్ గల్ఫ్. పశ్చిమే (Messapotamia) మెసపొటోమియా, ఆసియాటుర్కీచ. ఉత్తరే (Caspian Sea) కాస్పియన్ సముద్రః, టర్కిస్థానం (Mediteranian Sea) మధ్యాసియా.

35 తుఖారమ్—పట్టణవిశేషః. స ఇదానీం మధ్యాసియాంతర్గత బొఖారాపట్టణమ్.



32 చీనా—మహాచీనా. ఆసియాఖండములో నున్నవి. ఉత్తరమున సైబేరియా (Siberia). దక్షిణమున హిమవంతము. తూర్పున (Pacific Ocean) పసిఫిక్ మహాసముద్రము, ఆసియామధ్యఖండము. టర్కీస్థానము. నైరృతియందు టిబెట్, ఉత్తర మంగోలియా దేశములును.

33 ఆవర్తనదేశము. ఆసియాలో నిది. అరేబియా (Arabia) అని ప్రసిద్ధమైనది. తూర్పున పర్షియన్ సముద్రము (Persian Sea), నవతల పారశీకము. దక్షిణమున అరేబియన్ సముద్రము (Arabian Sea). పడమట శోణసముద్రము. ఉత్తరమున ఆసియా టర్కీ (Asia Turkey). దీనిలోనే శూద్రియవనము అని పేరుగల మక్కా కార్నాకర్ కదీనా యనునవి కలవు.

34 పారస్పరము. ఆసియాలో నున్న పర్షియా (Asiatic Persia) పారశీకమని యర్థము. తూర్పున అఫ్ఘన్ స్థానము దక్షిణంపుభాగము (South of Afghanstan) బెలూచిస్థానము (Beluchstan). దక్షిణమున పర్షియన్ గల్ఫ. పడమట మెసపొటోమియా (Mesapotamia), ఆసియా టర్కీయును. ఉత్తరమున కాస్పియన్ సముద్రము (Caspian Sea), టర్కీస్థానమును, మధ్యధరా సముద్రము, మధ్యాసియా.

35 తుఖారము. ఒకానొకపట్టణము. అది యిప్పుడు మధ్యాసియాయం దున్న 'బొఖారా' యనుపట్టణము.

36. పహ్నవం—(Kabul) కాబూలాఖ్య (Afghanistan) ఆఫ్ఘనిస్థానస్య ముఖ్యపత్తనవిశేషః. భరతఖండస్య వాయవ్యభాగే బాభాతి.

37. గాంధారః—(Afghanistan) ఆఫ్ఘనిస్థానాంతర్గత (Khandahar) కంధహార్ ఇతి సాంప్రతం వ్యవహ్రియతే.

38. బ్రహ్మదేశః—(Burma) బర్మాదేశః.

39. ఉపమలకం—(Malaya) మలేరియాద్వీపకల్పః. బర్మాయా దక్షిణతో విద్యతే.

40. సింహళః—భరతఖండస్య దక్షిణతో విద్యమానో ద్వీపవిశేషః.

41. కన్యాకుమారీ—(Cape Comerin) కేప్ కామిరిన్.

42. స్వర్ణభూమిః—(America) అమెరికా, (Famous) ఫేమస్ డిస్కవరీస్ (Famous Discoveries) నామక గ్రంథే స్వర్ణభూమిరితి (Columbus) కోలంబస్ప్రభృతిభి రప్యుపయుక్తః. అస్మిన్ గోమేధికాస్థానభూతా నదీ ప్రవహతి. సా ఇదానీం ఎమెరెల్ సేలివర్ ఇతి కథ్యతే.

43. దక్షిణోత్తరకురవః—(North and South Americas) నార్తు అండ్ సౌత్ అమెరికాదేశాః.



36 పహ్నవము. 'కాబూలు' (Kabul) అను పేరుగలది. ఆఫ్ఘన్‌స్థానమునకు ముఖ్యపట్టణము. భరతఖండమునకు వాయవ్యదిశను బ్రకాశించుచున్నది.

37 గాంధారము. ఆఫ్ఘన్‌స్థానమున నున్న (Afghanstan) కంధహార్ (Khandhar) అని నేడు వ్యవహరింపఁబడుచున్నది.

38 బ్రహ్మదేశము. బర్మాదేశము (Burma).

39 ఉపమలకము. (Malayas) మలేరియా ద్వీపకల్పము. బర్మాకు దక్షిణముగా నున్నది.

40 సింహళము. భరతఖండమునకు దక్షిణముగా నున్న ద్వీపవిశేషము.

41 కన్యాకుమారి. కేప్ కామరిన్ (Cap comerin).

42 స్వర్ణభూమి. అమెరికా (America). ఫేమస్ డిస్కవరీస్ (Famous Discoveries) అను గ్రంథమున స్వర్ణభూమి యను పేరు 'కొలంబస్' (Columbus) మొదలగువారు వాడిరి. ఇందు గోమేధికము లను మణులు జన్మించు నది యొకటి ప్రవహించుచున్నది. అది యిపుడు ఎమరెల్ సేలివర్ అని పిలువఁబడుచున్నది.

43 దక్షిణోత్తరకురుదేశములు. నార్తు అండ్ సౌత్ అమెరికాఖండములు [illegible] and South Americas).

44 తలహాః—(South America) దక్షిణామెరికాంతర్గత బేల్ ఇతి ప్రసిద్ధమహాప్రదేశః.

45. దుర్గః—(Bhutan) బూటాన్. హిమాలయపర్వతేషు బంగళాదేశస్య అస్సామ్‌దేశస్య చోత్తరతః నేపాలదేశస్య ప్రాగ్భాగస్థ స్వతంత్రరాజ్యమ్.

46. పంచనదః— సింధునదీ పంచకప్రదేశః (Punjab) పంజాబ్.

47. దరదః—(Darjeeling) డార్జిలింగ్ పత్తనమ్. ఉత్తర బంగాళాదేశే హిమాలయాంతర్గత (Nepal) నేపాళ్ గూటాన్ రాజ్యయో ర్మధ్యస్థితపట్టణమ్.

48. గుర్నారాటః—(Gujerat) గుజరాత్ భరతఖండస్య ప్రాగ్భాగోఽస్తి

49. కర్ణాటకమ్— మహేంద్రపర్వతపంక్తీనాం సముద్రరేఖాశ్చ మధ్యతో విద్యమానో దేశః.

50. కేకయాః—(Hirat) హీరట్ ఆఫ్ఘనిస్థానాంతర్గత పట్టణమ్.

51. మాహిషికాః—(Mysore) మైసూర్ ప్రదేశః.

52. సింధుసౌవీరదేశాః— (Sind Provinces) సింధుప్రావిన్సెస్. అస్మిన్దేశే సింధుసాగరసంగమో భవతి.

53. మహోదయకన్యాకుబ్జమ్—(Kanuj) కనౌజ్ దేశః.



44 తలహము. (South America) దక్షిణఅమెరికాలో నున్న 'బేల్' అను ప్రసిద్ధ మగు గొప్పప్రదేశము.

45 దుర్గము. భూటాన్ (Bhutan). హిమాలయ పర్వతము లందు బంగాళాదేశమునకు, అస్సామ్ (Assam) దేశమునకు నుత్తరమున - నేపాళదేశమునకుఁ దూర్పున నున్న స్వతంత్రరాజ్యము

46 పంచనదము. సింధునదియొక్క అయిదుశాఖలు కల ప్రదేశము. పంజాబ్ (Punjab).

47 దరదము. డార్జిలింగ్ (Darjeeling) పట్టణము. ఉత్తర బంగాళాదేశమున హిమాలయమున నున్న (Nepal) నేపాల్, (Gutan) గూటాన్ రాజ్యముల నడుమ నున్న పట్టణము.

48 గుర్నారాటము. గుజరాత్ (Guzarat) భరతఖండమునకుఁ దూర్పున నున్నది.

49 కర్ణాటకము. మహేంద్రపర్వతపంక్తులకును, సముద్రతీరమునకు మధ్యనున్న దేశము.

50 కేకయములు. హీరట్ (Hiret). ఆఫ్ఘన్‌స్థానములలో నున్న యొకపట్టణము.

51 మాహిషికములు. మైసూర్ (Mysore) ప్రదేశము.

52 సింధుసౌవీరదేశములు. (Sind Provinces) సింద్ ప్రావిన్సెస్. ఈ దేశమున సింధుసాగర సంగమ మున్నది.

53 మహోదయకన్యాకుబ్జము. కనూజ్ (Kanuj) దేశము.

54. పాటలీపుత్రః—(Patna)పాట్నా దేశః. బీహార్ ప్రదేశో పరిస్థితః బెంగాల్ ప్రదేశే.

55. పుండ్రః—(Midnapur) మిడ్నపూర్ కలకత్తాపుటభేదనస్య పశ్చిమే ప్రాక్ బంగాళాదేశే సముద్రప్రాంతే ఒరిస్సాప్రదేశస్య ప్రాగ్భాగే ఽస్తి.

56. చంపా—(Bhagalpur) భాగల్‌పూర్. గంగాదక్షిణతటే బెంగాళ్ దేశస్థ పట్టణవిశేషః.

57. వత్సదేశః—(Dinazpur) దినజ్‌పూర్. రాజషాహీప్రభృతయః ప్రాగ్బంగాళాదేశే బేహార్ దేశస్యాధోభాగే విద్యతే.

58. వంగగాడ—(Bakerganj) బకర్‌గంజీ ప్రభృతిస్థలవిశేషాః.

59. ప్రాగ్జ్యోతిషః— (Assam). కామరూపం రంగభూమిః రంగూన్.

60. బర్బరాః— (Burbary) బార్బరీ.

61. అసికాప్రాంతం (Masquet) మాస్కెట్ నామకపురం. ఇద మరేబియాదేశస్య పార్శ్వే (Omen) ఓమెన్ ఇత్యాఖ్యస్య దేశస్య ముఖ్యపత్తనం. అస్య ప్రాచ్యాం, దక్షిణే, ఉత్తరేచ సముద్రో విద్యోతతే. పశ్చిమేతు భూమి రాస్తే.

ఏవంచ యావల్లవణసముద్రం తావజ్జంబూద్వీప ఏవేతిశమ్.



54 పాటలీపుత్రము. పాట్నాదేశము (Patnas). బీహార్ ప్రదేశము పై నున్న బెంగాలు రాష్ట్రమున నున్నది.

55 పుండ్రము. మిడ్నపూర్ (Midnapure) కలకత్తానగరమునకుఁ బడమట, తూర్పు బంగాళా దేశమున, సముద్రప్రాంతమున ఒరిస్సా ప్రదేశమునకుఁ దూర్పువైపున నున్నది.

56 చంపా. (Bhagalpur) భాగల్‌పూర్. గంగా దక్షిణతీరమున బెంగాల్ దేశమునఁ గల యొకపట్టణము.

57 వత్సదేశము. దినజ్‌పూర్ (Dinazpur) రాజషాహి మొదలగునవి తూర్పుబంగాళమున బీహార్ దేశమునకుఁ గ్రిందుగా నున్నది.

58 వంగగౌడము. బకర్‌గంజ్ (Bakirgnnj) మొదలగు స్థలవిశేషములు

59 ప్రాగ్జ్యోతిషము. (Assam). కామరూపము రంగభూమి రంగూన్ (Rangoon).

60 బర్బరములు. బార్బరీ (Barbary).

61 అసికాప్రాంతము. 'మాస్కెట్' అనుపురము, (Masquet) ఇది అరేబియా దేశమునకుఁ బ్రక్కనున్న ఓమెన్ (Omen) అను పేరుగల దేశమునకు ముఖ్యపట్టణము. దీనికిఁ దూర్పున, దక్షిణమున, ఉత్తరమున సముద్రమున్నది. పడమట భూమి యున్నది.

ఇట్లు లవణసముద్రము దనుకఁ గల ప్రదేశమంతయు జంబూద్వీపమే. ఇది శుభము.

1 ఏష రామ శివః పంథా యత్రైతే పుష్పితా ద్రుమాః
ఋశ్యమూకశ్చ పంపాయాః పురస్తాత్పుష్పితద్రుమః. ౨౪
ఉదారో బ్రహ్మణాచైవ పూర్వకాలే వినిర్మితః. ౨౪½

శయానః పురుషో రామ! తస్య శైలస్య మూర్ధని. ౨౫
యత్స్వప్నే లభతే విత్తం తత్ప్రబుద్ధో ఽధిగచ్ఛతి. ౨౫½

యస్తు తం విషమాచారః పాపకర్మా ఽధిరోహతి. ౨౬
తత్రైవ ప్రహరం త్యేనం సుప్తమాదాయ రాక్షసాః. ౨౬½
తస్యాం వసతి సుగ్రీవ శ్చతుర్భి స్సహ వానరైః. ౨౭

2 శబర్యాఽఽస్తే పురోభాగే ఆశ్రమే రఘునందన!
భక్త్యా త్వత్పాదకమలే భక్తిమార్గవిశారదా. ౨౮
తాం ప్రయాహి మహాభాగ! సర్వం తే కథయిష్యతి
ఇత్యుక్త్వా ప్రయయౌ సోఽపి విమానే నార్కవర్చసా. ౨౯

3 తౌ కబంధేన తం మార్గం పంపాయా దర్శితం వనే
ప్రతస్థతు ర్దిశం గృహ్య ప్రతీచీం నృవరాత్మజౌ. ౩౦
పంపాయాః పశ్చిమం తీరం రాఘవా వుపతస్థతుః
* అపశ్య త్తాం తత స్తత్ర శబర్యా రమ్య మాశ్రమం. ౩౧

---

* అపశ్య దితి — తత శ్శ్రీరామలక్ష్మణౌ కబంధం హత్వా తేనోపదిష్టమార్గేణ, ఇదానీం బళ్లారిమండలే మతంగా

---

1. వాల్మీకిరా. ౭౩ స. 2. అధ్యాత్మ[illegible] 3. వాల్మీకిరా. ౭౪ స.



౨౪-౨౪½ శ్రీరామచంద్రా! పుష్పించినవృక్షములతోఁగూడ మంగళప్రదమై యొప్పారుదారి యిదే. పూసిన చెట్లతో నున్న యాఋష్యమూకము పంపాసరోవరమునకు ముందుగా నున్నది. అది పూర్వకాలమున బ్రహ్మదేవునిచే నిర్మింపఁబడినది. చాలగొప్పపర్వతము.

౨౫-౨౫½ శ్రీరామా! ఆపర్వతము పైభాగమునఁ బండుకొన్న మనుజుఁడు కలలో నేధనముం గాంచునో, యాధనమును మేల్కాంచి కాంచఁ గలఁడు.

౨౬-౨౬½ ఆచారవిహీనుఁడై యేపాపాత్ముఁ డాపర్వతము నెక్కునో, వాఁడు నిద్రింపఁగా రాక్షసులు వానిఁ గొట్టుదురు.

౨౭ నల్గురువానరులతోఁగూడ నాపర్వతగుహయందు సుగ్రీవుఁడు నివసించుచున్నాఁడు.

౨౮ ఓరఘుకుమారా! ఈముందే యాశ్రమమున నీపాదపద్మములం దతి భక్తి కలిగి, భక్తిమార్గమున మిగుల నారితేరిన శబరి యున్నది.

౨౯ ఓమహాభాగ్యవంతుఁడా! శ్రీరామా! ఆమెదగ్గరకు వెళ్లుము. అంతయు నీ కెఱిఁగింపఁగలదు! అని యిట్లు కబంధుఁడు పలికి, సూర్యకాంతివంటికాంతిగల విమానముపై వెళ్లెను.

౩౦ ఆరాజకుమారులిద్దరు నంతట కబంధునిచే నయ్యడవిం జూపఁబడిన పంపాసరోవరమార్గముం గూర్చి పడమటిదెసగా బయలుదేరిరి.

౩౧ అట్లారఘుకులకుమారు లిద్దరును బంపాసరోవరమునకుఁ బడమటి తీరమును జేరిరి. * అట వారు శబరియొక్క రమ్య మగు నాశ్రమమును జేరిరి.

---

* పిమ్మట శ్రీరామలక్ష్మణులు కబంధునిఁ గూల్చి యాతఁ డెఱిఁగించినమార్గమున నేఁడు 'బళ్ళారి' జిల్లాలో నున్న మతంగాశ్రమము దాఁపున పంపాసరోవరమునొద్దున నున్న 'శబరి' యాశ్రమమునకు

1 శబరీ రామ మాలోక్య లక్ష్మణేన సమన్వితం
ఆయాంత మాదరా ద్భక్త్యా ప్రత్యుత్థా యాచిరేణ సా. ౩౨

2 ప్రత్యుద్గమ్య ప్రణ మ్యాథ నివేశ్య కుశవిష్టరే
పాదప్రక్షాలనం కృత్వా తత్తోయం పాపనాశనం. ౩౩
శిరసా ధార్య పీత్వాచ వన్యైః పుష్పై రథార్చయత్. ౩౩½

ఫలానిచ సుపక్వాని మూలాని మధురాణిచ. ౩౪
స్వయ మాసాద్య మాధుర్యం పరీక్ష్య పరిభక్ష్యచ
పశ్చా న్నివేదయామాస రాఘవాభ్యాం దృఢవ్రతా. ౩౫

3 కృతాతిథ్యం రఘుశ్రేష్ఠ ముపవిష్టం సహానుజం
శబరీ భక్తిసంపన్నా ప్రాంజలి ర్వాక్య మబ్రవీత్. ౩౬

---

శ్రమసమీపే, పంపాసరోవరతీరే విద్యమానం శబర్యా శ్రమ మాగతౌ. పంపానామ తుంగభద్రాతీరస్థసరోవర విశేషః. ఇదానీంతనకాలే హాంపీసాగర మితి వ్యవహ్రియతే. ఇదం ఆనెగొందినామకపట్టణస్య అష్టార్ధక్రోశదూరస్థ ఋష్యమూకపర్వతే జనిత్వా మతంగాశ్రమపర్యంతం ప్రవహిత్వా తుంగభద్రాం మిలతి. ఋష్యమూకమాల్యవత్కిష్కింధాప్రభృతయః ప్రదేశా స్సర్వేఽపి తుంగభద్రానదీతీరపర్వతవిశేషా ఇతి జ్ఞేయం తత శ్శ్రీరామ శ్శబరీం పరిపాల్య పంపాసరోవరమార్గా త్సుగ్రీవాన్వేషణం కృత్వా ప్రస్థిత ఇతి శమ్.

---

1. అధ్యాత్మ రా. ౧౦ స. 2 [illegible] 4. అధ్యాత్మ రా. ౧౦ స.



౩౨ శబరి లక్ష్మణునితోఁ గూడి వచ్చుచున్న శ్రీరామునిం జూచి వేవేగ సాదరముతోడను భక్తితోడను గూడినదై యెదుర్కొనెను.

౩౩-౩౩½ ఎదురేగి, నమస్కరించి, పిమ్మట దర్భాసనముపైఁ గూర్చుండఁజేసి, పాదములు కడిగి, పాపముల నాశనముసేయు నారామపాదతీర్థమును శరీరమునఁ జల్లుకొని, త్రావియు, వన్యము లగు పూవులచేఁ బూజించెను.

౩౪-౩౫ దృఢవ్రతురా లగు శబరి బాగుగా ముగ్గిన మధురములైన పండ్లను దాను దిని రుచిచూచి, పిమ్మట శ్రీరామలక్ష్మణులకు వానిని నివేదించెను.

౩౬ అతిథిసత్కారమైనపిమ్మటఁ దమ్మునితోఁగూడఁ గూర్చుని యున్న శ్రీరామచంద్రునిం గని భక్తిసంపన్నురా లగు శబరి దోసిలొగ్గి యిట్లనియె—

---

వచ్చిరి. 'పంప' యనునది తుంగభద్రానదీతీరమున నున్న యొక సరస్సు. ఈకాలమున 'హంపీసాగర' మని వ్యవహరింపఁబడుచున్నది. ఇది ఆనెగొంది యను పట్టణమున కెనిమిదిమైళ్ళదూరమున నున్న ఋష్యమూకాద్రిపైఁ బుట్టి మతంగాశ్రమమువనుక ప్రవహించి' తుంగభద్రానదిలోఁ గలియుచున్నది. ఋశ్యమూకము, మాల్యవంతము, కిష్కింధ మొదలగు ప్రదేశములన్నియుఁ దుంగభద్రానదీతీరమున నున్న పర్వతము లని యెఱుంగనగును. పిమ్మట శ్రీరాముఁడు శబరిని రక్షించి పంపాసరోవరమార్గమున సుగ్రీవుని వెదకుటకై బయలుదేరెను.

అ త్రాశ్రమే రఘుశ్రేష్ఠ! గురవో మే మహర్షయః
స్థితా శ్శుశ్రూషణం తేషాం కుర్వతీ సముపస్థితా. ౩౭
చిత్రకూటం త్వయి ప్రాప్తే గతా స్తే బ్రహ్మణః పదం
గమిష్యంతో ఽబ్రువ న్మాం త్వం వసాత్రైవ సమాహితా. ౩౮

రామో దాశరథి ర్జాతః పరమాత్మా సనాతనః
ఆగమిష్యతి చైకాగ్రధ్యాననిష్ఠా స్థిరా భవ. ౩౯
దృష్ట్వైవ రాఘవం దగ్ధ్వా దేహంయాస్యసి తత్పదం. ౩౯½

తథై వాకరవం రామ! త్వద్ధ్యానైకపరాయణా. ౪౦
ప్రతీక్ష్యాగమనం తే ఽద్య సఫలం గురుభాషితం. ౪౦½

యోషిన్మూఢా ప్రమేయాత్మన్! హీనజాతికులోద్భవా ౪౧
స్తోతుం నజానే దేవేశ! కిం కరోమి ప్రసీద మే. ౪౧½

తవ దాసస్య దాసానాం శతసంఖ్యోత్తరస్య వా. ౪౨
దాసీత్వే నాధికారో ఽస్తి కుత స్సాక్షా త్తవైవ హి. ౪౨½

శ్రీరామ ఉవాచ—

పుంస్త్వే స్త్రీత్వే విశేషోవా జాతినామాశ్రమాదయః. ౪౩
నకారణం మద్భజనే భక్తిరేవ హి కారణం. ౪౩½

తస్మా ద్భామిని! సంక్షేపా ద్వక్ష్యేఽహం భక్తిసాధనమ్. ౪౪



౩౭ రఘువరా! ఈయాశ్రమమున నాగురువు లగు మహర్షు లుండెడివారు. వారికి శుశ్రూషచేయుచు నిం దుండుదానను.

౩౮-౩౯½ నీవు చిత్రకూటమునకు వచ్చునంతట, వారు బ్రహ్మపదమును బొందిరి. అట్లు వెళ్ళువారై నన్నుఁగూర్చి యిట్లు పలికిరి.- శబరీ! నీ విటనే శ్రద్ధకలిగి వర్తింపుము. సనాతుఁ డగు పరమాత్మ దశరథకుమారుఁడై జనించి యిటకు రాఁగలఁడు. నీ వేకాగ్రధ్యాననిష్ఠయందుఁ జలింపక నిలువుము. రామునిదర్శనము సేసి, పిమ్మట నీ దేహమును దహింపఁజేసికొని శ్రీరామసాయుజ్యము నందెదవు.

౪౦-౪౦½ శ్రీరామా! నిన్నే ధ్యానించుటయందు శ్రద్ధకలిగి నీరాక కెదురు చూచుచు వారు సెలవిచ్చిన ట్లొనరించితిని. ఇప్పుడు. నాగురువుల వాక్యము సఫలమైనది.

౪౧-౪౧½ అప్రమేయాత్మా! ఆడుదానను, మూఢురాలను, నీచజాతియందు హీనకుటుంబమునందుఁ బుట్టినదానను. దేవాదిదేవా! నిన్ను స్తుతించు టెఱుఁగను. ఏమి చేయుదును? నాయెడల ననుగ్రహ ముంచుము.

౪౨-౪౨½ నీకు దాసుఁడైనవానికిఁ గ్రమముగా దాసులైన నూఱుగురుతఱు వాతివారికి దాసి నగుటకు నా కధికార మున్నదికాని, సాక్షాత్తు నీకే దాసినౌట కధికార మెక్కడిది?

అంత శ్రీరామచంద్రుఁ డి ట్లనియె.—

౪౩-౪౩½ శబరీ! స్త్రీపురుషభేదమందుఁ గల విశేషముగాని, బ్రాహ్మణాదిజాతి, పేరు, బ్రహ్మచర్యాద్యాశ్రమములు, నన్ను భజించుటయందుఁ గారణములు గావు. భక్తియే ముఖ్యకారణము.

౪౪ ఓ భామినీ! నేను గ్లుప్తముగా భక్తికల్గుటకు సాధనమును జెప్పుచున్నాను.

సతాం సంగతి రేవాత్ర సాధనం ప్రథమం స్మృతం
ద్వితీయం మత్కథాలాప స్తృతీయం మద్గుణేరణం. ౪౫

ప్రథమం సాధనం యస్య భవే త్తస్య క్రమేణతు
భవే త్సర్వం తతో భక్తి ర్ముక్తి రేవ సునిశ్చితమ్. ౪౬

ఇతో మద్దర్శనా న్ముక్తి స్తవ స్యా న్నాత్ర సంశయః. ౪౬½
యది జానాసి మే బ్రూహి సీతా కమలలోచనా. ౪౭
కుత్రాస్తే కేనవా నీతా ప్రియా మే ప్రియదర్శనా. ౪౭½

శబ ర్యువాచ—

దేవ! జానాసి సర్వజ్ఞ! సర్వం త్వం విశ్వభావన! ౪౮
తథాపి పృచ్ఛసే య న్మాం లోకా ననుసృతః ప్రభో!
తతో ఒహ మభిదాస్యామి సీతా యత్రాధునా స్థితా. ౪౯

ఇత స్సమీపే రామా స్తే పంపానామ సరోవరః
ఋశ్యమూకగిరి ర్నామ తత్సమీపే మహానగః. ౫౦

చతుర్భి ర్మంత్రిభి సార్ధం సుగ్రీవో వానరాధిపః
భీతభీత స్సదా తత్ర తిష్ఠ త్యతులవిక్రమః. ౫౧

వాలిన శ్చ భయా ద్భ్రాతు స్తదగమ్య మృషే ర్భయాత్
వాలిన స్తత్ర గచ్ఛ త్వం తేన సఖ్యం కురు ప్రభో! ౫౨
సుగ్రీవేణ స సర్వం తే కార్యం సంపాదయిష్యతి
అహ మగ్నిం ప్రవేక్ష్యామి తవా[illegible] రఘునందన! ౫౩



౪౫ సుజనులతోడి చెలిమియే యిందు మొదటిసాధన మని చెప్పఁబడి నది. రెండవది నాకథలను వినుట. మూఁడవది నాయనంతకల్యాణ గుణములను బలుకుట.

౪౬ ఇందు మొదటిసాధన మెవ్వనికిఁ బట్టువడునో, క్రమముగా వాని కంతయు లభించును. అందుచే భక్తి కల్గును. అటుపై ముక్తి తప్పదు.

౪౬½ ఈ నాదర్శనమువలన నీకు ముక్తి కలుగును. సందియము లేదు.

౪౭-౪౭½ నీ వెఱుంగుదువేని తామరరేకులవంటి కండ్లు కలదియుఁ, బ్రియ ముం గూర్చు చక్కఁదనము గలదియు నగు నాప్రియురాలు సీత యెట నున్నది? ఎవనిచేఁ గొంపోఁబడినది? నాకుఁ దెల్పుము.

నా విని శబరి యి ట్లనియె.—

౪౮-౪౯ దేవా! సర్వము నెఱుంగువాఁడవు! విశ్వస్వరూపుఁడవు. సర్వము నీవే యెఱుంగుదువు. ప్రభూ! అయినను, లోకధర్మము ననుసరించి న న్నడుగుచుంటివి. కావున సీత యిపు డెచ్చట నున్నదో చెప్పు చున్నాను.

౫౦ శ్రీరామచంద్రా! ఇటకు సమీపముననే 'పంప' యను పేరుగల సరోవర మొక టున్నది. దానికి దాఁపున 'ఋశ్యమూకగిరి' యను పేర పెద్దపర్వత మున్నది.

౫౧-౫౪ నల్గురుమంత్రులతోఁగూడి వానరలకు రా జగు సుగ్రీవుఁ డను పమానపరాక్రమవంతుఁడయ్యు, యన్న యగు వాలివలని భయ ముచే జడియుచు ఋష్యమూకాద్రిపై నున్నవాఁడు. ఆపర్వతము ఋషివలనిభయమువలన వాలికిఁ జొరరా కున్నది. ప్రభూ! నీ వచటి కేగి సుగ్రీవునితోఁ జెలిమి సేయుము. అతఁడు నీకార్య మెల్ల సమ కూర్పఁగలఁడు. నేను నీముందే, రఘుకుమారా! రామా! అగ్ని లోఁ బ్రవేశింతు[illegible]ంద్రా! శ్రీరామభగవానుఁడా! ఎంత

ముహూర్తం తిష్ఠ రాజేంద్ర! యావ ద్దగ్ధ్వా కళేబరం
యాస్యామి భగవన్! రామ! తవ విష్ణోః పరంపదం. ౫౪
* ఇతి రామం సమామంత్ర్య ప్రవివేశ హుతాశనం. ౫౪౫

క్షణా న్నిర్ధూయ సకల మవిద్యాకృతబంధనం. ౫౫
రామప్రసాదా చ్ఛబరీ మోక్షం ప్రాప సుదుర్లభం. ౫౫౫

భక్తి ర్ముక్తివిధాయినీ భగవత శ్శ్రీరామచంద్రస్య హే
లోకాః!, కామదుఘాంఘ్రిపద్మయుగళం సేవధ్వ మత్యుత్సు
కాః. నానాజ్ఞానవిశేషమంత్రవితతిం త్యక్త్వా సుదూరే
భృశం, రామం శ్యామతనుం స్మరారిహృదయే భాంతం
భజధ్వం బుధాః! ౫౬-౫౬౫

1 దివంతు తస్యాం యాతాయాం శబర్యాం స్వేన తేజసా. ౫౭
సచింతయిత్వా ధర్మాత్మా ప్రభావం తం మహాత్మనాం
హితకారిణ మేవాగ్రే లక్ష్మణం రాఘవో ఽబ్రవీత్. ౫౮

ప్రణష్ట మశుభం త త్త్కల్యాణం సముపస్థితం
హృదయేహి నరవ్యాఘ్ర! శుభ మావిర్భవిష్యతి. ౫౯

* ఇతీతి-'శ్లో॥ వృద్ధ శ్శౌచక్రియాలుప్తః ప్రత్యాఖ్యాతభిష
క్క్రియః, ఆత్మానం ఘాతయే ద్యస్తు భృగ్వగ్న్యనశనాదిభి'
రితి వచనా చ్ఛరభంగవ చ్ఛబర్యా అ ప్యగ్నిప్రవేశః
సమంజస ఇత్యేవేతి ద్యోత్యతే.

1. వాల్మీకి రా. ౭౫ స.



నేపటి కీ శరీరమును దగ్ధముచేసి విష్ణుఁడ వగు నీపరమపదమును
బొందెదనో యంతకు నొక్కముహూర్తకాల మాగుము.

౫౪౫ * ఇట్లు శ్రీరామునిదగ్గర సెలవుఁ బుచ్చుకొని యగ్నిలోఁ బ్రవే
శించెను.

౫౫-౫౫౫ ఒక్కక్షణములో నవిద్యవలన నేర్పడిన జన్మబంధమును
ద్రెంచుకొని, రాము ననుగ్రహమున శబరి యెంతో దుర్లభమైన
మోక్షముఁ బొందెను.

౫౬-౫౬౫ ఓలోకులారా! భక్తి ముక్తి నిచ్చును. కోరిక లెల్లఁ దీర్చెడు
భగవంతుఁ డగు శ్రీరామచంద్రుని చరణసరోజయుగమును భక్తి
మీఱ సేవింపుఁడు. పండితులారా! నానావిధజ్ఞానవిశేషములు గల
యితరదేవతామంత్రజాలముల నెల్ల దూరముగ విడిచి యీశ్వరుని
హృదయమున మిగులఁ బ్రకాశించు మేఘశ్యాముని శ్రీరాముని
సేవింపుఁడు.

౫౭-౫౮ శబరి యిట్లు తన తేజముచే స్వర్గమున కేఁగఁగా ధర్మాత్ముఁ డగు
శ్రీరామచంద్రుఁడు మహాత్ములప్రభావమునుగూర్చి యాలోచించి
హితవును గోరు లక్ష్మణునితో ని ట్లనియె.

౫౯ లక్ష్మణా! ఆయశుభము వాసెను. ఆయీమంగళములు చేకూరెను.
ఓనరశ్రేష్ఠా! హృదయమున శుభము తోఁచుచున్నదినుమీ!

* 'వృద్ధుఁడైనవాఁడు శౌచక్రియాశూన్యుఁడై, వైద్యసహాయముం బొం
దక అగ్ని, ఉపవాసము మొదలగువానిచే ప్రాణములను వీడు
వాఁడుగా నుండవలెను.' అను మాటచే శరభంగునివలె శబరియు
నగ్నిప్రవేశముఁ గావించు టుచితమే యని తోఁచుచున్నది.

తదాగచ్ఛ! గమిష్యావః పంపాం తాం ప్రియదర్శనాం
ఋశ్యమూకో గిరి ర్యత్ర నాతిదూరే ప్రకాశతే. ౯౦
యస్మి న్వసతి ధర్మాత్మా సుగ్రీవోఽంశుమత స్సుతః. ౯౦౪

తతో మహద్వర్త్మ సుదూరసంక్రమః క్రమేణ గత్వా
ప్రతికూలధన్వనం, దదర్శ పంపాం శుభదర్శకాననా మనేక
నానావిధపక్షిజాలకాం. ౯౧-౯౧౪

ధ్యానమ్ :— జటిలం చీరవసనం దండకారణ్యవాసినం,
మునివేషధరం ధ్యాయే దారణ్యే కాండ ఉత్తమే.

గద్య.

ఇతి శ్రీసీతారామచంద్ర కృపాకటాక్ష వీక్షాసమాసాదితవిద్యా
న్వితేన కాశ్యపసగోత్రసంభూతేన ములుకుట్ల వంశాంబుధి
నిశాకరేణ బ్రహ్మశ్రీ లక్ష్మణావధానిలక్ష్మ్యాంబాగర్భ
శుక్తిముక్తాఫలస్య శ్రీశంకరనారాయణావధానినః
వేంకటసుబ్బమాంబాయాశ్చ ద్వితీయసూనునా
'పౌరాణికవిశారద రామాయణసుధాసాగర
అభినవవాల్మీకి విమర్శకాగ్రేసర' రిత్యాది
బిరుదాంకితేన పండిత నరసింహావధాని
శర్మణా సంకలితే చతుర్వింశత్యార్ష
రామాయణసారభూతే
శ్రీరామాయణసారోద్ధారే
అరణ్యకాండే సప్తదశస్సర్గ స్సమాప్తః.
సర్వం సమాప్తమ్.



౯౦-౯౦౪ అందువలన రమ్ము! ధర్మాత్ముఁ డగు సూర్యకుమారుఁడు, సుగ్రీవుఁడు వసించుచున్న ఋశ్యమూకాద్రి యెద్దానికి మిగులసమీపమునఁ బ్రకాశించుచున్నదో, ఆచక్కఁగాఁ గనుపట్టు పంపాసరోవరమునకుఁ బోవుదము.

౯౧-౯౧౪ అటుపిమ్మట చాలదూరము ప్రయాణముచేసిన శ్రీరామచంద్రుఁడు బాటసారులకు సౌకర్యముఁ గూర్పఁజాలని నిర్జనప్రదేశముగల కబంధవనమున నెంతో దారిం గ్రమముగా నడచి మంగళస్వరూపమునను న్నదియుఁ, బలువిధము లగు పక్షులసమూహములతోఁ గూడిన దియు నగు పంపాసరోవరముం గాంచెను

ధ్యానము:—జడలఁ దాల్చి, నారచీరలు ధరించి, దండకారణ్యమున నివసించు మునివేషధరుం డగు శ్రీరామచంద్రు నుత్తమ మగు నరణ్యకాండమున ధ్యానింపవలెను.

గద్య.

ఇది శ్రీసీతారామచంద్ర కృపాకటాక్షవీక్షణముచే సంపాదింపఁబడిన విద్యలు
గలవాఁడును గాశ్యపసగోత్రయుత మగు ములుకుట్ల వంశ మనెడి సము
ద్రమునకుఁ జంద్రుఁడును బ్రహ్మశ్రీ లక్ష్మణావధానికిని లక్ష్మ్యంబ
కును బుత్రుఁ డగు శ్రీశంకరనారాయణావధానికిని వేంకటసుబ్బ
మాంబకును ద్వితీయపుత్రుఁ డగువాఁడును 'పౌరాణికవిశా
రద, రామాయణసుధాసాగర, అభినవవాల్మీకి, విమర్శకా
గ్రేసర' మొదలగు బిరుదములచే నొప్పువాఁడును నగు
పండిత నరసింహావధానిశర్మచే సమకూర్పఁబడిన
చతుర్వింశత్యార్ష రామాయణసారమైన
శ్రీరామాయణసారోద్ధారమున
అరణ్యకాండమునఁ బదునేడవ సర్గము.
సర్వము సమాప్తము.

## ఫలశ్రుతి.

స్కాందే బ్రహ్మాండేచ—

యో విరాధవధం నిత్యం శృణోతి శ్రావయేత వా
తస్య పాపాని సర్వాణి వినష్టాని నసంశయః. ౧
శరభంగాశ్రమప్రాప్తపురుహూతసమాగమం
దర్శనం శరభంగస్య రఘునాథస్య పూజనమ్. ౨
శృణ్వంతో మరుతాం లోకం ప్రాప్నువంతి నసంశయః. ౨½

'అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణాం'. ౩
ఇత్యాదిశ్రవణాన్మర్త్యో రామాత్కాంక్షితమాప్నుయాత్. ౩½

కర్ణనాసాపహారంతు శృణ్వతాం పఠతామపి. ౪
నజాతు మానభంగ స్స్యా ద్రఘునాథప్రసాదతః. ౪½

శ్రుత్వా శ్రీరామవిజయం పాపబంధా త్ప్రముచ్యతే. ౫
తథైవ శృంఖలాబంధా దృణబంధా ద్విముచ్యతే. ౫½

శ్రుత్వా పుష్పవతీ నారీ తనయం వంశవర్ధనం. ౬
లభతే రాఘవేంద్రస్య ప్రసాదా త్కీర్తివర్ధనం. ౬½

'భరత స్యార్యపుత్ర' స్యేత్యత్రత్య నవమాక్షరం. ౭
భక్త్యాశ్రుత్వాతుగాయత్ర్యాఃపరాంసిద్ధిమవాప్నుయాత్ ౭½
మారీచోక్తి ముపశ్రుత్య గురుమా న్భవతి క్షితౌ. ౮.
'యదంతరే' త్యాదివాక్యశ్రవణా దఘనాశనమ్. ౮½

## ఫలశ్రుతి.

౧ ఎవ్వఁడు విరాధునివధవృత్తాంతము వినునో లేక వినిపించునో వానిపాపములన్నియు నశించును; సంశయము లేదు

౨-౨½ శరభంగాశ్రమమున కరుదెంచిన యగ్నిహోత్రునితోడ శ్రీరామచంద్రులు కలిసికొనుట, శరభంగమునిని దర్శించుట, ఆముని రఘునాథుం బూజించుటను వినువారు మరుల్లోకమును బొందుదురు; సందియము లేదు.

౩-౩½ 'సీతా! నేను ప్రాణములనైన విడుతును. లక్ష్మణునితోడ నిన్నైన విడుతును' అనునది మొదలుగ విన్నవారికి శ్రీరామచంద్రునివలనఁ గోరికలన్నియు నీడేరును.

౪-౪½ శూర్పణఖముక్కుఁజెవులును గోయు కథను విన్నవారికిఁ, జదువువారికి శ్రీరామునిప్రసాదమువలన నెన్నఁడును గౌరవభంగము రాదు.

౫-౫½ శ్రీరామచంద్రుని విజయవార్తను విని పాపబంధమునుండియు, సంకెలలనుండియు, ఋణబంధమునుండియు విడివడును.

౬-౬½ శ్రీరామచంద్రునియనుగ్రహమువలన నీకథను విని రజస్వలయైన కాంత వంశవర్ధనుఁడును, గీర్తిని వృద్ధిచేయువాఁడు నగు కుమారునిఁ గనును.

౭-౭½ 'భరత స్యార్యపుత్రస్య' అనుదానిలో గాయత్రియొక్క తొమ్మిదవయక్షరమును భక్తితో విని గొప్ప కార్యసిద్ధిని బొందును.

౮-౮½ మారీచునిమాటలు విని భూమిపై సద్గురువును బొందును. 'యదంతరే' యనునదాదిగ విన్నయెడల పాపములు నశించును.

సీతారావణసంవాదం యే శృణ్వంతి నరోత్తమాః. ౯
న తేషాం పాపరాశిభ్యః పీడా లోకే భవిష్యతి. ౯½

శ్రుత్వా ఖగేశ్వరస్యాపి రక్షసా మీశ్వరస్యచ. ౧౦
ఆయోధన మృణా న్ముక్తో భృత్యస్వామికృతాద్భవేత్. ౧౦½

సీతాహరణ మారభ్య లంకాయాం స్థాపనావధి. ౧౧
శ్రవణా చ్ఛాస్త్రవిధినా జ్యేష్ఠాదేవీ విముంచతి. ౧౧½
సీతాపరుక్తికథనం లక్ష్మణస్య ముఖా చ్ఛ్రుతం. ౧౨
శ్రుత్వా నజాతు పీడాస్యా దభిశాపకృతే మహత్. ౧౨½
సీతాన్వేషణ మాకర్ణ్య నైవ లక్ష్మీ ర్వియుజ్యతే. ౧౩

జటాయోస్సంస్కృతింశ్రుత్వాస్వర్లోకంయాతిమానవః. ౧౩½

శబర్యా స్సద్గతిం శ్రుత్వా సాధ్వీనాం లోకగో భవేత్. ౧౪

'గచ్ఛ శీఘ్ర మితో రామే' త్యత్రిత్యం దశమాక్షరం
నిశమ్య దేవ్యా మనుజ స్సూర్యలోక మవాప్నుయాత్. ౧౫
కబంధరామసంవాదం యే శృణ్వంతి సదాదరాత్
విప్రావమానజనిత స్తాపః క్షిప్రం వినశ్యతి. ౧౬

ఆరణ్యకాండ మఖిలం యే శృణ్వంతి మహీతలే
శ్రీరాఘవప్రసాదేన విష్ణులోకం వ్రజంతి తే. ౧౭



౯-౯½ సీతకు రావణునకు జరిగినసంవాదము నేమానవోత్తములు విందురో వారికి పాపరాసులవలని బాధ లోకమునం గలుగదు.

౧౦-౧౦½ జటాయువునకును, రావణాసురునకును జరిగిన యుద్ధమును విని నౌకరు రాజు మొదలగువారినడుమగలఋణబంధమునుండి విముక్తుఁడగును.

౧౧-౧౧½ సీతాహరణము మొదలు లంకయం దామెను నిల్పుటవఱకుఁ గల కథను, శాస్త్రోక్తముగా వినుటవలన పెద్దమ్మ వదలిపోవును.

౧౨-౧౨½ లక్ష్మణునిచే విన్న సీత చెడ్డమాటలు వినుచో శాపములచేఁ గలుగు బాధ కలుగదు.

౧౩ సీతను (రామలక్ష్మణులు) వెదకినవృత్తాంతము వినుటచే, లక్ష్మి యెప్పుడును విడువక యుండును.

౧౩½ జటాయువుయొక్క సంస్కారమును విని మనుజుఁడు స్వర్లోకమున కేఁగును.

౧౪ శబరియొక్క సద్గతిని విని పతివ్రత లేగు లోకమును బొందును.

౧౫ "గచ్ఛ శీఘ్ర మితో రామ!" అనుదానిలో నున్న గాయత్రి పదియవయక్షరమును విన్న మనుజుఁడు సూర్యలోకమున కేగును.

౧౬ ఎవరుకబంధునకును శ్రీరామునకును జరిగినసంవాదము నాదరముగ విందురో, వారికిఁ గలిగిన బ్రాహ్మణుల నవమానపరచుటవలనితాపము వేగమే నశించును.

౧౭ అరణ్యకాండమంతయు పుడమిపై నెవ్వరు విందురో శ్రీరామ ప్రసాదమున వారు విష్ణులోకమున కేగెదరు.

కాండం తృతీయం శృణ్వన్ యః ప్రోక్తేన నియమేనతు
సో ఽగ్నిసాయుజ్య మాప్నోతి పఠనాదపి శాస్త్రతః. ౧౮

యదక్షరపదభ్రష్టం మాత్రాహీనంతు యద్భవేత్
తత్సర్వం క్షమ్యతాం దేవ! రామచంద్ర! నమో ఽస్తుతే. ౧౯

—•—

## —• మంగళశ్లోకాః •—

శ్రీరామచంద్ర శ్శ్రితపారిజాతస్సమస్తకల్యాణగుణాభిరామః
సీతాముఖాంభోరుహచంచరీకోనిరంతరంమంగళమాతనోతు
౧

హత్వా విరాధం బలినం మునీనాం భావితాత్మనాం
దత్తాభయాయ రామాయ పద్మాక్షాయాస్తు మంగళం. ౨

చతుర్దశసహస్రాణి రక్షసాం క్రూరకర్మణాం
ఖరదూషణముఖ్యానాం హారిణే చాస్తు మంగళం. ౩

సీతాదర్శనసక్తాయ గృధ్రమోక్షప్రదాయినే
కబంధహారిణే తస్మై రాఘవాయాస్తు మంగళం. ౪

మతంగాశ్రమవాసాయ శబరీసేవితాయ చ
పంపాదర్శనతోషాయ భవ్యరూపాయ మంగళం. ౫



౧౮ ఈమూఁడవకాండము నెవ్వఁడు శాస్త్రోక్త మగు విధిచే వినునో, శాస్త్రప్రకారము పఠించునో యాతఁ డగ్నిసాయుజ్యమును బొందును.

౧౯ ఇందు నక్షరములు, పదములు, మాత్రలును లోపించు నేని శ్రీరామచంద్రా! అవెల్ల క్షమింపుము. నీకు నమస్కారము.

—•—

## —• మంగళశ్లోకములు •—

౧ ఆశ్రయించినవారికిఁ బారిజాతవృక్షమువంటివాఁడును, సమస్తకల్యాణగుణములచే బ్రకాశించువాఁడును, సీతాదేవిముఖకమలమునఁ దుమ్మెదయైనవాఁడును నగు శ్రీరామచంద్రుఁడు మంగళము నిచ్చుఁగాక!

౨ బలుఁడగు విరాధునిజంపి యాత్మజ్ఞాననిష్ఠాగరిష్ఠులగు మునులకు నభయ మొసంగిన పద్మాక్షుఁ డగు శ్రీరామునకు మంగళము.

౩ ఖరదూషణాదులను, ఘోరవ్యాపారు లగు రాక్షసులఁ బదునాల్గువేలమందిని నాశనము సేసిన శ్రీరామచంద్రునకు మంగళము.

౪ సీతను జూడఁగోరెడునట్టియు, జటాయువునకు మోక్ష మొసఁగినట్టియుఁ, గబంధునిసంహరించినట్టియు వాశ్రీరాఘువునకు మంగళము.

౫ మతంగాశ్రమమున నివసించినట్టియు, శబరిచే సేవింపఁబడినట్టియు, పంపాసరోవరమును దర్శించి యానందపడునట్టియుఁ, బవిత్రస్వరూపుఁ డగు శ్రీరామచంద్రునకు మంగళము.

ఉపనయతు మంగళం న స్సకలజగన్మంగళాలయ శ్శ్రీమా
దినకరకిరణనిబోధితనవనళినదళేక్షణో రామః. ౬

నారసింహేన గ్రథితా రామపాదసమర్పితా
శ్రీరామాయణసారస్య ఉద్ధారారణ్యకం కథా.

ఏత త్సర్వం సాంగసపరివారచిన్మయ
శ్రీరామచంద్రదేవతార్పణ మస్తు.

మంగళం మహత్.





౬ సకలజగత్కల్యాణముల కాకరుఁడై, శ్రీమంతుఁడై, సూర్యకిరణములచే వికసింపఁజేయఁబడిన క్రొత్త తామరపూరేకులవంటి నేత్రములు కల శ్రీరామచంద్రుఁడు మనకు మంగళములఁ జేకూర్చుఁగాత!

ఇది నారసింహునిచేఁ గూర్పఁబడినదియు, రామపాదముల సమర్పింపఁబడినదియు నగు శ్రీ రామాయణసారోద్ధారమున నరణ్యకాండకథ.

ఇదంతయుఁ సాంగసపరివార చిన్మయుఁ డగు శ్రీరామచంద్ర దేవునకు సమర్పితమగు గాత!

మంగళము.



# శ్రీరామాయణసారోద్ధారమునందు అరణ్యకాండయందలి

# తప్పొప్పుల పట్టిక.

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 9 | వైవిక | నైదుక |
| 8 | 11 | బ్రిహ్మణం | బ్రిహ్మణం |
| 9 | 6 | సముద్రిడు | సముద్రిండవగు |
| 10 | 5 | రధం | రథం |
| 11 | 4 | గోవులువయస్సు | గోవులుపయస్సు |
| 15 | 2 | ఇద్దరుగలసి | ఇద్దరుఁగలసి |
| 21 | 6 | సారోద్ధార | సారోద్ధార |
| 23 | 21 | పితాిజను | పితాిజ్ఞను |
| 26 | 21 | త్యాత్ | త్వాత్ |
| 27 | 7 | శ్లేషాపారిసాది | శ్లేషానుపారిసాది |
| 28 | 19 | పతిపరస్పర్యాత్ | పరస్పర్యాత్ |
| 34 | 12 | తుఁబురు | తుంబురు |
| | 14 | యధా | యదా |
| 36 | 7 | ర్యాతభయే | ర్వీతభయా |
| 43 | 8 | నేపనియెద | నేఁజనియెద |
| 44 | 6 | యత్కించ | యత్కించి |
| | 20 | అధ | అథ |
| 50 | 12 | తదా | తదా |
| 53 | 20 | సుఖించు | దుఃఖింపు |
| 63 | 18 | చేపెను | జేసెను |
| 83 | 21 | దూర్పనొడ్డు | దూర్పటొడ్డు |
| 87 | 13 | పికాపిక | వికావిక |
| | 20 | దులనుభుజించి | దులను శ్రీరాముడు భుజించి |
| 92 | 21 | శీరామ | [illegible] |



| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 93 | 10 | కా - మ | = తు = కా - మా |
| | 21 | యర్థము | యంపర్థము |
| 98 | 11 | పాదితం | పాదితాః |
| 100 | 6 | దశన్ | దర్శ |
| 101 | 10 | 'అందుచే' మొదలు 'సిద్ధాంతము' అనువరకున్న దానికి బదులు 'ఈరీతిగనే పూర్వము ఉపక్రమణము జేయబడియుండుటవలన' అని చదువునది. | |
| 102 | 8 | స్త్వమె | స్త్వమే |
| 105 | 14 | స్వాతిక | సాత్విక |
| | 18 | కొఁఅకు వేరై | కొఁఅకు మనము వేరై |
| 112 | 7 | బోధ్య | బాధ్య |
| 139 | 11 | నందనంబ | చందనంబ |
| | 17 | చందుఁడు | చంద్రుఁడు |
| 122 | 15 | నైనాయక | వినాయక |
| 123 | 16 | వైనాయక | వినాయక |
| 124 | 9 | ప్రినిర్ణయా | ప్రిదేశనిర్ణయా |
| 125 | 9 | పోట | పోవుట |
| 134 | 1 | కృత్వాభి | కృతాభి |
| 138 | 16 | పంక్తిచివర గల మనోజ్ఞాంశ యను పంక్తి 142 పేజీలో 12వ పంక్తికి పైన చదువవలయును. | |
| 154 | 3 | త్వయా వేత్ | త్వయాభవేత్ |
| | 15 | వృతూ | మృతూ |
| 155 | 16 | న్యాయముచే | న్యాయమునువీడి |
| 166 | 5 | పదేశం | ప్రిదేశం |
| 181 | 8 | ముందే తెగి | ముందేరక్తము గ్రిక్కుచు తెగి |
| | 9 | బాటురక్తము గ్రిక్కుచు | బాటుచచ్చి |
| 183 | 19 | మూడుబొంగులును | త్రివేణువును |
| 209 | 12 | మత్స్యావ | కూర్మావ |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 214 | 7 | విష్ణుచక | విష్ణుచక్రి |
| 229 నుంచి 239 వరకు గల ౯ అను అధ్యాయసంఖ్యను ౧౦ గా చదువవలెను | | | |
| 225 | 21 | వెంటనను | వెంటనిను |
| 232 | 16 | రాజ్యస్వార్థం | రాజ్యస్యార్థం |
| 240 | 6 | హ్యతఏవ | అతఏవ |
| 242 | 11 | మితి | మితీ |
| 270 | 3 | తథాహ | తథాహి |
| | 15 | వర్షాగత | వర్షాస్తతో |
| 271 | 20 | ములుభూమి | ములఉండిభూమిం బ్రవేశించి భూమి |
| 273 | 17 | సీతమనుష్య | సీత సాధారణమనుష్య |
| 293 | 16 | కోతిచే | కోతులచే |
| 322 | 7 | శ్రీమతీమితీ | శ్రీమతీతి |
| 335 | 2 | పెద్దమద్దుల | పెద్దఏపెల |
| 346 | కర్తవ్యం = కర్తవ్య మితి లక్ష్మ్యాసహ విచార్య తదర్థం శ్రీవిష్ణుస్సీతయా బ్రహ్మవిద్యయా సహ శ్రీరామరూపే ణావతీర్ణ ఇతి. ఏత దేవోక్తం స్కాందే మాహేశ్వరఖండే దేవా ప్రతి శ్రీమహావిష్ణునా. శ్లో॥ అహం హి మానుషో భూత్వా హ్యజ్ఞానేన సమావృతః, సంభవిష్యా మ్యయోధ్యాయాం గృహే దశరథస్య చ. భక్తోహి రావణ స్సాక్షా చ్ఛి వధ్యానపరాయణః, తపసా మహతా యుక్తో బ్రహ్మవిద్యాం యదేచ్ఛతి. తదా సుసాధ్యో భవతి పురుషో ధర్మనిర్జిత ఇతి. | | |
| 351 | 5 | పర్వతుడు - పర్వతుఁడు ప్రతిధ్వనిరూపమున శ్రీరాముని ననాదరముజేయువానివలె పలికెను. | |
| | 6 | చెట్లను బర్వతములను | బర్వతమందున్న చెట్లను |
| 353 | 14 | గాంచిరావణుని | గాంచిప్రేమచేరావణుని |
| 356 | 13 | శౌస్య | శౌర్యస్మ |
| | 14 | లబ్ధాచ | లబ్ధాసి |



| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 357 | 15 | గలదై ఆసుందరి | గలదానవై ఓసుందరి |
| | 16 | మైతిని | మైనది |
| 361 | 21 | జూపెను - జూపెను. ఇట్లు ౧ విరాధునిచే, ౨ రావణునిచే, 3 మిథ్యాపవాదముచే, ౪ భూతలప్రవేశముచే నాల్గుపర్యాయములు శ్రీరామునకు సీతావియోగము సంభవించె నని తెలియవలెను | |
| 362 | 12 | దగ్ధకామం | దగ్ధకామం |
| 367 | 11 | జలస్థానము | జనస్థానము |
| 372 | 13 | నైఋతి | నైరృతి |
| 379 | 10 | బలుమార్లునీవు | బలుమార్లుచెప్పబడినదినీవు |
| 403 | 10 | నెఱిగిన | నెఱుంగని |
| 408 | 7 | ణోక్తదిశాస్సర్వ | ణోక్తరీత్యాసర్వ |
| 414 | 18 | వత్సరంయావత్ | వత్సరంస్పృష్ట్యాదియావత్ |
| 415 | 16 | ననియు | ననిమరియు |
| | 19 | వఱకుగతించిన | వఱకుస్పృష్ట్యాదిగతించిన |
| 416 | 19 | వానురుంధంతి | వానుసరంతి |
| 417 | 21 | గాదనుచున్నారు | నిజమనుచున్నారు |
| 418 | 13 | సేనాన్యౌ | సేనాన్యా |
| 419 | 14 | సేనానులును | సేనానియగు |
| 421 | 5 | నపూర్వవిషయ | నపూర్వార్థవాదవిషయ |
| 426 | 12 | మానాః | మానాన్ |
| 449 | 20 | మేరుపర్వతమధ్యయందున్న | ఇటీచలపరివర్తితములైన |
| 450 | 16 | అసియాజంబూద్వీపే | ఆసియాఖ్యజంబూద్వీపే |
| 453 | 6 | విదస్తి | విభక్తి |
| 463 | 15 | నానిపుష్ప | నానాపుష్ప |
| | 17 | బడినది | బడునది |
| 466 | 9 | మిళామితి | మిళావృతమితి |
| 467 | 5 | దెల్పెదను | చెప్పబడినది |

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 402 | 14 | ద్యభిజ్ఞాః | ద్యనభిజ్ఞానః |
| | 9 | దక్షిణోత్తరములుగవ్యాపించిధను | దక్షిణోత్తరపర్వతము ల హిమవంత, శృంగవంతములు ధన |
| 469 | 8 | నైపునుండి | నైపునకు |
| | 14 | ముందు చేర్కొనబోవు | లోకులచేఁజెప్పబడు |
| 471 | 14 | దానిచివర | శబ్దముచివరగలిగి |
| | 17 | క్రిందుగా | మధ్యయందు |
| 475 | 5 | విష్ణుశయన | విష్ణునియంశ |
| | 15 | వారికే | పూర్వము చెప్పబడిన |
| | 26 | నశించిన వని | యొనిమిది యని |
| 477 | 1 | మజిల | ఇట్లు |
| 480 | 16 | పంక్తిలో (54) | (56) |
| 481 | 17 | పంక్తిలో (54) | (56) |
| 489 | 2 | అపరాక్షరములు | అపరాంతములు |
| | 5 | ఇవన్నియుదాక్షిణాత్యములే | ఇవన్నియును |
| | 6 | అగుదాక్షిణాత్య దేశములను | అగుదేశములను |
| | 8 | పర్వతముల వెనుక | పర్వతమూలమున |
| 494 | 20 | కర్ణాటాః | ఖర్వాటాః |
| 495 | 20 | కర్ణాటములు | ఖర్వాటములు |
| 504 | 8 | అన్యేవేవ | అన్యే ద్వే మేళిత వ్యైతథాహి |
| 505 | 8 | పంక్తితరువాత 55 - 56 దేశములుగ పురాణప్రసిద్ధ దేశములని చెప్పబడువాటిలోనివి రెండు చేర్చుకొనవలయును. | |
| 508 | 9 | ద్వీపస్య | ప్రదేశస్య |
| 509 | 8 | ద్వీపమునకు | ప్రదేశమునకు |
| | 12 | (Italy) దానికి | (Italy) ఇటలీ దానికి |
| 515 | 11 | కదీనా | మదీనా |

శ్రీరామశ్శరణం మమ

వాల్మీక్యాది 23 ఆర్షరామాయణముల సారము ఏకత్ర సంగ్రథనము గావింపబడి దేశ దేశాంతరములందు పండిత పామర పాఠకుల నందిన—

# శ్రీ రామాయణ సారోద్ధారము

అను సంపూర్ణ రామాయణము షట్కాండములును 8 సంపుటములుగ విభజింపబడినది. ఇందు కేవల సంస్కృతము సంపుటం ౧ కి రూ 1_12_0; ఆంధ్ర తాత్పర్య సహితం ౧ కి రు 3_8_0.

షరా: ఇందు బాల యుద్ధకాండములు రెండేసి సంపుటములుగను మిగతా అయోధ్య, ఆరణ్య, కిష్కింధ సుందర కాండములు ప్రత్యేక సంపుటములుగను విభజింపబడినవి. విడిగా ఏ భాగమైనను రూ 3_8_0 కే కావలసినవారికివ్వబడును. మొత్తం రు 28_0_0 లు.

| | | |
|---|---|---|
| ఇక అరణ్యకాండయందలి భూగోళవిన్యాసము ప్రత్యేక గ్రంథము ఆంధ్రతాత్పర్య సహితము | ,, | 0-8-0 |
| కిష్కింధా కాండయందలి వాలివధ సంశయ నివారణ ఘట్టము; ప్రత్యేక గ్రంథము- ఆంధ్రతాత్పర్య సహితము | ,, | 0-4-0 |
| కిష్కింధా కాండానుబంధమగు శ్రీరామోత్సవ కల్పలతా ప్రథమగుచ్ఛము- (దీనిలో శ్రీరామోత్సవ విధులన్నియునుగలవు) | ,, | 1-0-0 |

| | | | |
|---|---|---|---|
| సుందర-యుద్ధకాండముల యనుబంధమగు "వేదరామాయణము" (దీనియందు వేదమంత్రములలోని శ్రీ రామాయణ కథ యంతయు భాష్యముతో సహా గలదు) కేవల సంస్కృతము | | | 0-12-0 |
| డిటో ఆంధ్ర తాత్పర్య సహితము | ... ... | ,, | 1- 8-0 |
| శ్రీ భగవద్గీతా సార సంగ్రహము | ... ... | ,, | 0- 2-0 |
| శ్రీఆంజనేయ స్తోత్రం కదంబము | ... ... | ,, | 0- 1-0 |
| శ్రీరామచంద్ర జన్మాద్యుత్సవవిధిః | ... ... | ,, | 0- 4-0 |
| శ్రీరామచంద్రస్య జననకాల నిర్ణయః | ... | ,, | 0- 4-0 |
| శ్రీరామచంద్రస్య బాల్యయాత్రా వివరమ్ | ... | ,, | 0- 1-0 |
| శ్రీరామస్తోత్ర మణిమాలా, ఆద్యమణిత్రయం | ... | ,, | 0- 2-0 |
| శ్రీనామ రామాయణము | (భజనకుపకరించును) | ,, | 0- 1-0 |
| శ్రీరామచంద్రుని ప్రబోధ ప్రభాతసేవలు | డిటో | ,, | 0- 6-0 |
| శ్రీరామచంద్రుని ఏకాంతసేవా ప్రకరణము | డిటో | ,, | 0- 4-0 |
| ♦ శ్రీరామచంద్రుని వసంతాద్యుత్సవ సేవలు | డిటో | ,, | 0- 4-0 |
| ♦ అమ్మవారి శుక్రవారపు సేవ, నిత్యసేవలు | డిటో | ,, | 0- 6-0 |

♦ ఈ గుర్తు ఉంచిన పుస్తకములు అచ్చులోనున్నవి

ఈ పుస్తకములు వలయువారు ఈ క్రింది చిరునామాలలో దేనికైనను వ్రాసి వీ. పి. ద్వారా తెప్పించుకొనవచ్చును. పోస్టు ఖర్చులు కొనువారే భరింపవలయును.

ములుకుట్లగోపాలకృష్ణశాస్త్రులుగారు, చీరాల, గుంటూరుజిల్లా.

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు 292 ఎస్ప్లనేడ్, మదరాసు. వీరిబ్రాంచీలు:—విశాఖపట్నం, తెనాలి, ఏలూరు రాజమండ్రి, నెల్లూరు మొదలగు చోట్లు—

వేంకట్రామ్ అండుకో-ఏలూరు-వీరి బ్రాంచీలు:—
బెజవాడ, తెనాలి, రాజమండ్రి, పాలకొల్లు, మద్రాసు.

ములుకుట్ల నరసింహావధానులుగారు
చిత్రకూటాశ్రమం—కృష్ణలంక, విజయవాడ (2)